# నా చరిత్ర

(డాక్టర్ ఉ. వే. స్వామినాథ
అయ్యరుగారి స్వీయచరిత్ర)

అనువాదము :
ఎన్. సి. వి. నరసింహాచార్య



సాహిత్య అకాడెమీ
న్యూఢిల్లీ

NA CHARITRA (Autobiography of Dr. U. V. Swaminatha Iyer) Abridged by K. V. Jagannathan. Translated into Telugu from Tamil by N. C. V. Narasimhacharya. Sahitya Akademi, 1965 Price Rs. 7.


ప్రథమముద్రణ : 1965

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

వేంకట్రామ & కంపెనీ

విజయవాడ

*Also available at :*
SAHITYA AKADEMI,
Rabindra Bhavan, New Delhi—1,
38/B, Mount Road, Madràs—6.

ముద్రణ :

ఆంధ్ర ప్రింటర్స్ లి.,

విజయవాడ.

వెల : రూ. 7.

# అధ్యాయ సూచి

# ము న్న డి

కడచిన నూరేండ్లలో తమిళభాష మిక్కుటముగ అభివృద్ధి పొందుటకు ఇరువురు పండితశ్రేష్ఠులే కారణమని చెప్పవచ్చును. ఒకరు వైదుష్యము విమర్శన పటిమయు ప్రచురణనైపుణియు ఆర్జవమును నిండారినవారు. మఱియొకరు కవిత్వ శక్తియు, దేశభక్తియు నూతనచైతన్యమును పొంగులువారినవారు. మహామహోపాధ్యాయ దాక్షిణాత్యకళానిధి డాక్టర్ ఉ. వే. స్వామినాథ అయ్యరుగారే మొదటివారు. కవిరాజులు సుబ్రహ్మణ్యభారతియారే మఱియొకరు.

డాక్టరు స్వామినాథ అయ్యరుగారు కడచిన శతాబ్దముననే తమిళభాషాసేవ చేయదొడగిరి. పెద్దకాలమునుండి అడుగునబడియున్న తమిళగ్రంథముల నుద్ధరించి మెరుగువెట్టి తులకింపజేసి తమిళలోకము చూచి నేర్చి ఆనందించునట్లు చేసిరి. భారతియారన్ననో కొంగ్రొత్త సృష్టిలో ఎనలేని క్రొత్త వెలుగును ఉద్రేకపు పొంగులును చూపిరి.

అయ్యరుగారు పలువురు కవులకు క్రమ్మర ప్రాణములు పోసినారు. ఇందుల కయియే జన్మమెత్తినవారికివలె వీరి జీవిత మమరినది. సంగీతవిద్వాంసుల కులములో పుట్టినను వీరు సంగీతమును సరకుసేయక తమిళముతల్లికయియే ఏర్పడిన అసాధారణభక్తులై విలసిల్లిరి. చిన్ననాటనే తమిళపు ఆకటిని పెంచి పిదప తగిన తమిళోపాధ్యాయుల దరిజేరి తమిళపుటామెతలు కడుపార గుడిచి మహాసుధీమణు లయిరి. అంతలో నిలిచియున్నచో నేడు తమిళమునాడునాడెల్ల చేయు పొగడిక గన వలనుపడియుండెడిదికాదు. కుంభకోణముకాలేజిలో తమిళోపాధ్యాయులుగ ప్రవేశించిన పిదప సేలము రామస్వామి మొదలియారుగారి ప్రేరణతో వీరు ప్రాచీన[illegible] ప్రబంధముల ప్రచురించు క్రొత్త పుంత త్రొక్కిరి. ఆ పుంతలో చొరబడుటకై వీరికి మునుపు జీవించియుండిన విబుధులకు సదవకాశము లుండియు వీరికే యా

శ్రేయస్సు దక్కెను. దానికి తగిన చేవగల గొప్ప బుద్ధిసూక్ష్మతయు, క్షమయు, ఆర్జవమును వీరియెడ నుండినవి.

చిన్ననాట నేర్చిన చదువు, మహావిద్వాంసులు మీనాక్షిసుందరంపిళ్ళెగారి సన్నిధానమున ముంగియెత్తుకొనిన తమిళవిజ్ఞానమును కాలుద్రొక్కి నిలుచుకొనుట కుపయోగపడినవే కాని వీరు చొచ్చిన క్రొత్త పుంతలో సాక్షాత్తుగ సహాయకారులు కాలేకపోయినవి.

వీరు మొట్టమొదట విమర్శింపజొచ్చినది 'జీవకచింతామణి'. అది జైన సమయ గ్రంథము. అయ్యరుగారు శైవసాంగత్యము, శైవుల ఆదరువు, శైవవాఙ్మయ పరిచితియు అపారముగ గలవారు. కావున వీరికి జీవకచింతామణి క్రొత్తగ మెట్ట వలసిన పొలము. అయినను వా రందు జొచ్చి, తేటబడ తెలిసికొని తక్కినవారికిని తేటతెల్లము చేయుటకు ఈ గ్రంథము ప్రసాదించిరి. 'అటుపిమ్మట వీరు మెయికొనిన పరిశోధనలు ఒకే పొలమునకు చేరిన వని నుడువుటకు వీలుకాదు. రెండవ గ్రంథముగ వీరు స్వీకరించినది 'పత్తుప్పాట్టు'. అది అర్వాచీనసంఘగ్రంథము. సంఘగ్రంథము లను గురించి కొన్ని కథలు-గాథలు మాత్రమే తమిళవిద్వాంసులు అలవాటుగ చెప్పుకొనుచుండు కాల మది. 'ఎట్టుత్తొగై' స్వరూపముగాని 'పత్తుప్పాట్టు' స్వరూపము గాని ఎవ్వరికిని తెలియని రోజు లవి. అందుచేత పత్తుప్పాట్టుపరిశోధన ఒక సరిక్రొత్త ప్రపంచమై యమరినది. అటుతరువాత 'మణిమేఖల' రూపు దాల్చినది. అది బౌద్ధ సమయసంబద్ధమైన గ్రంథము. తమిళదేశమున జైనులు కొందరైన నున్నారు. బౌద్ధులు హిందూదేశమున మచ్చుకే యు లేరు. తమిళమున బౌద్ధమతమునకు చెందిన పేరులే వింతగ తోచినవి. పుస్తకము దొరకియు అర్థముగాని స్థితియందే మొదట కొంతకాలము ఈ మహావిద్వాంసు లుండిరి. కాని ఎడతెగని పరిశ్రమచేతను, బుద్ధి సూక్ష్మతచేతను వీరు దాని నవగతము చేసికొనిరి. ఇతరులకును తెలియజేసిరి.

ఒక పర్యాయము మన నాయకులు రాజాజీగారు ఈ పండితోత్తముల భాషా సేవను గురించి వ్రాయునపుడు "వ్యాసమహర్షి వేదములకు ఒక రూపు కలిగించి నట్లు ఈ తమిళవిద్వాంసులును తమిళభాషకు రూపకల్పన చేసిరి" అనియు, తరువాత నొకసారి "తేనెటీగలతో పోటీలుపడి జయించిన సతతపరిశ్రమి" అనియు నుడివి యున్నారు. కేవలము బుద్ధిసూక్ష్మత యున్ననే చాలదు; ఎంత పరిశ్రమ యున్నను

చాలదు. రెండును ఒక్కెడ చేరియున్ననే గొప్పగొప్ప పనులు సాధింపవలను పడును—అను సత్యమును ఈ సుధీమణిజీవితము చక్కగ బోధించును.



అయ్యరుగారి జీవితకాలమును మూడు స్థూలభాగములుగ వేరుపరుపవచ్చును. మొదటి భాగము వీరి బాల్యము. ఈ పరువమున వీరిలోనుండిన తమిళప్రేమ పెరుగుచుండినది. వీరి తండ్రిగారే వీరికి ప్రథమాచార్యు లయిరి. దత్తాత్రేయులు కలిసికొనిన మానవులను కాంచిన వస్తువులను గురువులుగ చేసికొని ఉపదేశములు వడసిరి—అని భాగవతము చెప్పుచున్నది. ఈ పెద్దలు మహావిద్వాంసులగు మీనాక్షిసుందరం పిళ్లెగారి యొద్ద ప్రవేశించుటకు మునుపు పలువురను తమకు తమిళాచార్యులుగ ఆశ్రయించిరి. కొన్ని యేండ్లు ఒకరియెడ విద్యాభ్యాసము చేసిరి. కొన్ని నెలలు కొందరియెడ విద్య కరచిరి. కొన్ని దినములు పలువురియెడ చదువు నేర్చిరి. 'తిరువరంగత్తందాది' యందలి ఒక పద్యమునకు ఒకే దినమున ఒక పండితునియొద్ద అర్థము విని ఫలితము సాధించిన ఘట్టమును గలదు. కాని యీ కొలదికొలది చిరుతిండ్లు వీరి ద్రావిడభాషా బుభుక్షను తీర్పగల తాహతుగలవి కావు. తమిళ మెచ్చట? తమిళాచార్యు లెవ్వరు? అని వెదకి వెదకి వేసారినట్టి జీవితముగ ఈ దశను పేర్కొనవచ్చును.

అటుతరువాతనే అయ్యరుగారు ఆకాలపు కంబకవి అని పేరు మోసిన పిళ్ళెగారియెడ శిష్యులుగ చేరిరి. లభించినపుడు అన్నము పిడికెడు పిడికెడుగ భుజించి అలసి అల్రాకలిగొన్నవానికి పొట్ట ప్రిదులునట్లుగ విందు లభ్యమైనట్లు తమిళ భాషాసుధాపారణ వారి కబ్బినది. కవులును మహావిద్వాంసులును అయిన పిళ్ళెగారు వీరికి చిన్నచిన్న గ్రంథము లారంభించి పెద్దపెద్ది గ్రంథము లన్నింటిని పాఠము చెప్పిరి. ద్రావిడభాషోద్యానవనమందలి పెంపు సొంపు లన్నింటిని ఉద్ధరించి చూపిరి. అయ్యరుగారి మనసు వానిని పొందుటకు తృప్తిలేక యుండినది. ఈ విశ్వశ్వార్య-భూముల యందు చేరిన వదపడియే పరిపూర్ణత ఏర్పడినది.



అయ్యరుగారు 19—2—1855 నాడు తమిళలోకము నోచిన నోముల పంటగా అవతరించిరి. 1871 సం. మార్చినెలవరకు పలువురియెడ పాఠములు వినుచు అలయుచుండిన జీవితమై యుండెను. తమ పదునారవయేట వీరు పిళ్ళెగారి పజ్జ చేరిరి. అది

మొదలు వీరి జీవితములో రెండవ ఘట్ట మారంభమగును. 1876 వ సంవత్సరము జనవరినెల 31 వ తేదినాడు వారి తమిళోపాధ్యాయులు భగవంతుని చరణారవిందముల దరి చేరిరి. ఈ యైదు సంవత్సరముల కాలములో ఈ నిత్యవిద్యార్థియు, వీరి యుపాధ్యాయులును ఒండొరులపై ప్రేమగొని మసలుకొనిన వారి ప్రవర్తన వంటిది మరెచ్చటను చూడలేరు. మహాకవులగు పిళ్ళెగారి అనితరసాధారణమైదుష్యము, అంతకంటె గొప్పదగు కవిత్వశక్తియు, దానికంటె ప్రశస్తమగు సంస్కృతియు అరయ అరయ వెరగుపాటొదవజేయుచున్నవి. ఈ దేశమందు గురుశిష్యుల పరంపరయందు జ్ఞానము, విద్యయు పెంపొందుచుండిన యా యందము ఈ యైదేండ్ల కాలమున చక్కగా చూడవచ్చును; ఇక ఇట్టి చుట్టరికము తీరుతియ్యములును వచ్చునా యని దిగులు పడవలసిన వడువున అమరియున్నది. పిళ్ళెగారు గతించిన వెనుక అయ్యరుగారు 'తిరువావడుదుఱై' మఠాధిపతులయెడ పాఠము వినిరి. పలువురికి పాఠము చెప్పిరి. ఒక్కడనే శిష్యులుగను ఉపాధ్యాయులుగను అడరారు గొప్పదనము వీరి యందప్పుడు మూర్తీభవించి యుండెను. అట్టి ఈసామర్థ్యము వీరియెడ తుది గడియలవరకును రానురాను పెరుగుచునే వచ్చెను. వీరు కుంభకోణముకళాశాలలో తమిళోపాధ్యాయులుగ 1880 వ సంవత్సరము ఫిబ్రవరి నెల చేరిరి. అప్పుడును వీరు కళాశాలలో ఉపాధ్యాయులై యుండిరే గాని ఇంట నిత్యవిద్యార్థియే.



అయ్యరుగారి జీవితమందలి మూడవ భాగము కుంభకోణమునకు మునసబుగ వచ్చిన సేలం రామస్వామి మొదలియారుగారి కలయికతో ఆరంభమగును. వీరికి చింతామణి పాఠము చెప్పుట కియ్యకొని తామే మొట్టమొదట విద్యార్థులై యుండి అది చదువదొడగిరి. ఈ చర్యయే అయ్యరుగారు ప్రపంచమంతయు అచ్చెరువొందునంతటి అర్హత గల సంపాదకీయోత్తము లగుటకు విత్తాయెను. "వారియెడకు నా పూర్వపుణ్యమే నన్ను కొనిపోయి చేర్చినది. వారి స్నేహాఫలముగ జీవితమందు ఒక క్రొత్త పుంత కానబడెను. తమిళకావ్యవిస్తృతి తెలియనాయెను. అంతాది, కలంబకము, పిళ్ళైత్తమిళ్, ఉలా, కోవై మొదలగు ప్రబంధములందును, పురాణములందును తమిళపు తియ్యందనము చవి చూచి యానందించి అంతటితో నిలువక పురాతనమును మహార్ఘమును అగు చల్లని ద్రావిడభాషయందు ఇమిడియుండెడు తీయని ద్రావిడ భాషానైసర్గికమాధుర్యమును నేనుమాత్రము అనుభవించి యానందించుటయ కాక

పెరవారలను అరసి యానందించునట్లు' చేయు భాగ్యము నా కబ్బినది" అని వారి తోడి కలయికను గూర్చి ఈ మహామహులు వ్రాయుచున్నారు.

జీవకచింతామణిపరిశోధన మొదలుకొనియే అయ్యరుగారు ఎందుల కవ తరించిరో ఆ మహాకార్య మారంభమాయెను. ప్రాచీనకావ్యములగు సంఘగ్రంథము లను, వేరగు ప్రాచీనప్రబంధములను ఒకదాని వెనుక ఒకటిగ వీరు ప్రచురింప దొడగిరి. చీకటిలో నిలిచి వెలుగువైపు దృష్టి సారించి పోయినట్లును, దట్టమగు అడ విలో తెన్ను గానక తికమకపడి పిదప తెరువు గని యేర్పరచిన చందముగను, నేలలో లోతుగ పాతుకొని మన్నుతో మన్నుగ మరుగుపడియుండిన పసిడి త్రవ్వి యెత్తి పులు గడిగి కొమరారు తొడవుల నమర్చి తమిళముతల్లికి కైవారము చేసిన వడువు నను వీరి భాషాయోషాసేవ చెన్ను మీరెను. వీ రవతరించిన అక్కాలమున సంఘకాల గ్రంథములు ఇవ్వి యని తెలియువారు లేరైరి. విద్యాసాగరులై వెలుగొందిన వీరి యొజ్జలకే వానినిగూర్చిన సంగతులు స్పష్టముగ తెలియవు. అట్టుండిన తమిళలోక మందు రెండువేల యేండ్లకు మునుపటి తమిళుల సాంఘికజీవనమును, ప్రజ్ఞాప్రాభవ మును, కవితారసమును, ఎల్లరు అరయులాగున నొనర్చిరి. వీరు ఇహలోకము వీడి చనునపుడు తమ పరిశ్రమఫలితముగ తమిళప్రపంచము కావ్యసంపత్సమృద్ధి నొందియుండుట గని మిగుల సంతసించిరి. పురాతనపు తమిళదేశమునందు నెలకొని యుండిన వీరగాథల ప్రేమగాథల ప్రబంధములు కోకొల్లలై యుంట కాంచిరి. పాఠశాలలయందు క్రింది తరగతులలో విద్యకరచు చిన్న కుఱ్ఱలు సైతము 'పారి'ని గూర్చియు, 'అధికమాను' ను గూర్చియు చదివి తెలియుట విని యానందించిరి. పండితుల విమర్శనగ్రంథములును, వేదికలపై వా రొనర్చు సవిమర్శోపన్యాసము లును తమ తమిళభాషాకైంకర్యప్రభావమున పెంపొందియుండుట తెలిసికొనిరి. రాజకీయజీవనమునను సంఘజీవనమునను ప్రాత తమిళకావ్యవిజ్ఞానము చొచ్చు కొని సత్ఫల మొదవజేయుట అరసి సంతసమందిరి.

వీరు 1880 వ సంవత్సరమున ఆరంభించిన కావ్యపరిశోధనకైంకర్యము 1942వ సంవత్సరము ఏప్రిలు నెలలో వీరి కట్టకడపటి శ్వాస యాడుచున్నంతవరకును అనుస్యూతముగ సాగుచునే యుండెను. కుంబకోణము కాలేజినుండి 1903 వ యేట చెన్నపట్టణపు సర్కారుకళాశాలకు ఏతెంచిరి. 1919వ సంవత్సరము ఆరంభమున కళా శాలోపాధ్యాయపదవినుండి విశ్రాంతి గైకొనిరి. అయినను తమిళకావ్యపరిశోధన

నుండియు, తమ్మాశ్రయించిన విద్యార్థులకు పాఠములు బోధించుటనుండియు వీరు విరామము పొందనేలేదు. అవి తద్దయు పెరుగుటకే సదవకాశము లభించెను.

ఈ మహామహోపాధ్యాయులు కేవలము గ్రంథసంపాదకులుగమాత్రమే ఉండలేదు. పలు పొత్తములకు వ్యాఖ్య వ్రాసిరి. ముదిరి పరిపక్వమైన ప్రాయమున (1937) "కుఱుందొగై" అను సంఘకాలపు గ్రంథమునకు విపులమైన టీక యొండు వ్రాసి ప్రచురించియున్నారు. అంతియగాక వచనరూపమున ఎన్నేని పొత్తములు రచించిరి. 1885 వ యేట 'తిరువిడైమరుదూరు' స్థలచరిత్రమును సంగ్రహించి మధ్యార్జున మాహాత్మ్యము అనుపేర ప్రకటించినపుడే వీరి గ్రంథరచనోద్యోగము ఆరంభమైనది. కాని యిది యితరసేవలవలె విస్తృతి నందలేదు. తమ సంపాదకత్వమున వెలువడిన ప్రచురణలకు వీరు రచించిన ఉపోద్ఘాతములు, గ్రంథకర్తల చరిత్రలు మున్నగువాని యందు వీరి వచనరచనాచాతురి గోచరించును. కాని రచనలోని యందము వీరి ముదిమియందే చక్కగ వెలువడెను. వయసుమీరినవారికి 'ఆ రోజులలో' అని తొడగి తమ యనుభవములు అభివర్ణించెడు స్వభావము ప్రపంచమందంతటను కలదు. కాని వారి పలుకుల నాలకించువారే అరుదు. దగ్గరిన పట్టి పీడింతురేమో అని పిన్నలును పెరవారును జంకి పడకుదురు. ఈ వృద్ధులో తమ అనుభవములు రసము లొలుక రచియింప దొరకొనగ తమిళదేశమందున్న పిన్నలు పెద్దలు, మగవారు మగువలు, పండితులు పామరులును మిక్కుటమగు మక్కువతో చదివి ఇంకను మరేమి చెప్ప నున్నారో అని ఉత్కంఠతో నుండిరి.

తమిళదేశపు పత్రికలు పండి పరిపక్వమైన ఈ ఫలమునుండి అనుభవామృతమును ప్రార్థించి పొంది తమిళలోకమునకు పంచిపెట్టినవి. తాము కన్నవియు, విన్నవియు మిగుల చవులూర వీరు వ్రాకుచ్చిరి. తమకు పరిచితులైన పెద్దలను గురించి వ్రాసిరి. తాము పడిన పాట్లు వర్ణించిరి. తమ పరిశోధనలలో కానవచ్చిన సూక్ష్మభావములు వెలువరచిరి. తమ ఆచార్యుల చరిత్ర విపులముగ వ్రాసిరి. కడపట ఆత్మకథను "నా చరిత్ర" (ఎన్ చరిత్తిరమ్) అను పేరిడి ప్రతివారము వ్రాయ దొడగిరి. 122 అధ్యాయములవరకు అది వెలువడినది. 1899 వ సంవత్సరము వరకును జరిగిన సంఘటనలు వ్రాసిరి. 87 ఏండ్ల విజ్ఞానమునందును, అనుభవమునందును పండువారిన వీరి జీవితము 1942 వ సంవత్సరము ఏప్రిల్ మాసమున తుదముట్టెను. వీరు వ్రాసిన జీవితచరిత్రయో వీరి 44 వ ఏటితో నిలిచిపోయినది. అంతకుపై 43 ఏండ్ల సంఘటనలు వీరి ముఖముననే వినునట్టి భాగ్యము కోల్పడిపోయితిమి.

# 2

'నా చరిత్ర' 'ఆనందవికటన్' వారపత్రికలో 1940 వ సంవత్సరము జనవరి నెల మొదలుకొని 1942 వ సంవత్సరము మే నెలవరకు వెలువడెను. స్వీయచరిత్ర తమిళమునకు క్రొత్త. ఆ క్రొత్త పుంతలో అడుగిడి మిగుల విపులముగ వీరు రచించిరి. వీరి చరిత్ర అందు సంపూర్ణముగ లభింపకున్నను లభించినంతవట్టు ఇది మేలైన లక్ష్యగ్రంథము. కేవలము వర్ణనాత్మకముగనో, సంఘటనాసూచికలు మాత్రముగనో ఉండక తమ హృదయమున పాదుకొనియున్న భావావేశములను, తీయని తలపులను ఛాయాచిత్రమువలె చూపించు కౌశలము ఈ 'చరిత్రనాయకులకు' ఉన్నది. తమ పూర్వపురుషులను ఉద్దేశించి వీరు చెప్పెడు ఉదంతములలో తమిళ దేశపు జీవనవిధానమందలి యొక భాగమును తేటతెల్లముగ తెలిసికొనుచున్నాము. చరిత్రలో ఎడనెడ మనుష్యుల 'రీతి-రివాజు'లను సూక్ష్మదృష్టితో పరిశీలించి తెలియ బరచుటయు, ఆకాలపు నడవడికల తీరులు నొడువుటయు, సంఘటనలతో కూడి యున్న సమాచారములు చెప్పి బోధించుటయు—అగు ఇట్టి పద్ధతుల మూలమున ఈ చరిత్ర ఒక్కరి ప్రాతిస్వికచరిత్రగ తోపదు. ఇందు కొందరు పండితులను సుస్పష్ట రూపమున కాంతుము. పలువురు సత్పురుషులను చూతుము. మతాధిపతులను వీక్షింతుము. జమీందారులును, సంపన్నగృహస్థులును, భక్తులును వత్తురు. కొందరు అల్పులును కఠినాత్ములును తలయెత్తుదురు.

పల్లెల సొంపు పెంపు, దేవాలయముల నిర్మాణనై పుణ్యము,' మతములందలి సంఘటనలు—వీనిని అయ్యరుగారు కన్నులకు కట్టినట్లు చూపింతురు. నానారీతుల సంప్రదాయములు తెలిసికొనుచున్నాము. కోపమువలన కలిగెడు చిరుతకయ్యములును, అసూయచే ఏర్పడు స్పర్ధలును, అహంకారముచేనగు కీడులును ఈ చరిత్రమునకు చవులు పుట్టించుచున్నవి. కృతజ్ఞత పొంగెడు సంఘటనలును, ఔదార్యము చూపించు సంభవములును, ప్రేముడిచేవ తెలిపెడు ఎడములును, హృదయము కరగించు దృశ్యములును ఈ మహామహుని చరిత్రమందు నెలవుకొనియున్నవి.

తమకు సాయపడినవారినిగూర్చి పలుకునపుడెల్ల వీరి యక్షరములతో కృతజ్ఞత శ్రుతి కలుపుచున్నది. తమ గురువుగారినిగూర్చి వర్ణించునపుడెల్ల వారియెడ వీరి

కుండిన అసమానదృఢభక్తి విశదమగును. తరచుగ గ్రంథ మెల్లెడల వీరి నిస్సమా-భ్యధికతమిళభాషాభిమానమును, భగవద్భక్తియు కూడిమాడి తిరుగాడుచుండును.

వీరి చిన్ననాటి గురువులు శఠకోపయ్యంగారువారి చిత్రణ యొక ప్రత్యేక పద్ధతి. పిళ్లెగారి చిత్రము సంపూర్ణస్వరూపముతో మనఃఫలకమున ప్రతిఫలించును. ఉదాత్తతకును పరిశుద్ధతకును కాణాచియగు సుబ్రహ్మణ్యదేశికులనుమాత్రము మనము మరవగలమా? తన కలిమిచే దృఢుడై ఒక చిన్న సర్వాధికారియై వెలిగిన పట్టీశ్వరము అరుముగత్తా పిళ్లెను గురించి అయ్యరుగారు చెప్పియుండరేని ఈ చరిత్ర ఇంత రసతుందిలమై యుండదు అని తోచును. తాటాకుల నెమకునపుడు వీరుపడిన యిడుమల నిందు చదువునపుడు ఒక అసాధారణమగు రసానుభూతి వానియందు పొడ కట్టును.

ఏది వినినను, కనినను, దానినిగూర్చి బాగుగ మనన చేయగను తెల్లముగ తెలియగను నేర్చినవారు అయ్యరుగారు. గ్రంథముల నేర్చుటయేగాక లోకమునుగూడ చక్క-నెరిగినవారు వీరు. పరిచితులగు వ్యక్తులను, కాంచిన దృశ్యములను తెల్లముగ ఉల్లమందు చిత్రించికొని యనుభవించు నేర్పు వారి కుండెను. అందుననే ఇంత నయముగ మనకు ఆ విషయములను ఎత్తి చూపగలిగిరి.

అయ్యరుగారి భాషాశైలి ప్రసన్నమైనది. అలతియలతి వాక్యములతో నైనది: అనుభూతభావములకు రూపిచ్చి చూపింపగల్గెడు శక్తిగలయవి. ఈ శైలిలో సౌశ-బ్దయము సంస్కారమును విసాళించుచున్నవి. జ్ఞానము తేటదనము ఐక్యమొంది యున్నవి. విస్తృతియు సరసతయు కలసి మెలసి యున్నవి.

## 3

అయ్యరుగారి జీవితమందలి వెనుకటి భాగమగు 43 సంవత్సరముల చరిత్ర మనకు లభింపకపోయెనే అను బెంగ దీనిని చదివినవారికి కలుగును. మణిమేఖల అచ్చొత్తించి సమాప్తి నొందించినంతవరకు ఈ చరిత్ర చెప్పుచున్నది దానికి పైబడి మిగుల శ్లాఘ్యమగు 'పెరుంకదై' (బృహత్కథ) అను మహాకావ్యమును పరిశోధించి ప్రకాశ మొనర్చిరి. 'ఐఙ్గుఱు నూఱు' 'పదిట్రుప్పత్తు' 'పరిపాడల్' అను

సంపుటగ్రంథములు ప్రచురించియున్నారు. 'కుఱుందొగై' అను గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసి ముద్రింపించినారు. పెక్కు పురాణములను, ప్రబంధములను అచ్చొత్తించిరి. అనుభవములు వ్రాసి కుప్పలు తిప్పలుగ పోసియున్నారు. వానితో సంబంధించియున్న సంఘటనలు వీరి ముఖముననే వినుటకు వీలుపడలేదు. అయినను వీరు పుస్తకములకు వ్రాసిన పీఠికలవలనను, ఇతరవ్యాసముల మూలముసను తరువాతి కాలపు సంభవములు పెక్కింటిని తెలిసికొనవచ్చును.

1906 వ సంవత్సరము సర్కారువారు వీరికి 'మహామహోపాధ్యాయ' పట్టము నిచ్చిరి. 1932వ సంవత్సరమున చెన్నపట్టణము విశ్వవిద్యాలయమున 'డాక్టర్' అను పట్ట మబ్బెను. 1935 వ సంవత్సరమున వీరి శతాభిషేకము (75 సంవత్సరములకుపైన 100 సంవత్సరముల వయస్సు లోపల చేయుదురు) తమిళము వాడుకలో ఉన్న చోటులందెల్ల అతిశ్లాఘ్యముగ కొండాడబడెను.

కుంభకోణమునందును, చెన్నపట్టణమునందును సర్కారువారి కళాశాలలో తమిళోపాధ్యాయులుగ నుండిన వీరు 1924 వ సంవత్సరము మొదలు మూడేండ్లు చిదంబరము మీనాక్షి తమిళకళాశాలలో అధ్యక్షులు (Principal) గ ఉండిరి. వీరు పాల్గొన్న పండితపరిషత్తులును ప్రసంగించిన సభలును పెక్కు. చెన్నపట్టణమున 1937 వ సంవత్సరము మార్చినెలలో భారతీయసాహిత్యపరిషత్తు నడచెను. లోకమెల్ల వేనోళ్ళ కొనియాడు ఉత్తముడు మహాత్మాగాంధి అధ్యక్షత వహించిరి. అప్పుడు స్వాగతకర్తలకు అధినేతయైయుండి అయ్యరుగారు కడురమణీయమగు ఒక యుపన్యాస మిచ్చిరి.

ద్వితీయప్రపంచమహాసంగ్రామము జరిగినప్పుడు జనులు చెన్నపట్టణము విడిచి సురక్షితప్రదేశముల వెదకికొనుచు పోవలసిన యవస్థ పట్టెను. అప్పుడు అయ్యరుగారు "తిరుక్కళుక్కున్రమ్" (పక్షితీర్థము)పోయి యుండిరి. అచ్చట 1942 వ సంవత్సరము ఏప్రిల్ నెల 28 వ తేది భగవంతుని శ్రీపాదముల సన్నిధి జేరిరి.

## 4

అయ్యరుగారు పలుతీరుల సంస్కారములు నిండారినవారు. వీరి నేర్పు బహుముఖముల వెలువడినది. వీ రొక పెద్ద నిత్యవిద్యార్థి. ఎవ్వరు సమరులగు విద్యా

ర్థులుగ నుండగలారో వారే గొప్ప విమర్శకులుగ వెలుగొందగలరు. ఈ పెద్దలు తమ బాల్యమున పలువురు గురువుల డాసి వారివారికి తెలిసినంతవరకు నేర్చిరి. కొలదిమాత్రమే జ్ఞానము లభించినను అడకువతోడ నడచుకొని ప్రాప్తించినదానిని మదింపుతోడ స్వీకరించి పొంది కాపాడుకొను స్వభావము వీరి కుండెను.

వీరి గురుభక్తికి ఈడు లేదు. తమ యాచార్యులగు మీనాక్షిసుందరంపిళ్ళె గారి పేరుగూడ ఉచ్చరింపక 'పిళ్ళెగారు' అని మాత్రమే పేర్కొనుట వీరి కలవాటు. మీనాక్షిసుందర మను పేరుగలవా రెవ్వరేని వచ్చినచో వారియెడ ప్రత్యేకాభిమానము చూపింతురు. ఐదేండ్లే వెంటనుండి అలవడి పాఠములు విన్న వీరు వారిని గూర్చి 800 పుటలలో వారి జీవిత చరిత్ర వ్రాసియున్నారు. అది వీరి గురుభక్తికి మేలైన గురుతు. తమ ప్రచురణలచేత తమిళప్రపంచమున ఒక క్రొత్తయుగమునే సృష్టించిన ఈ మహామహులు గొప్ప తమిళపండితులుగను, మహామహోపాధ్యాయులుగను పేరెన్నికగను కాలమందును తమ గురువులయెడ వారికున్న భక్తి ఇసుమంతేని తరుగ లేదు, పయింబయి పెరుగుచు రాజొచ్చెను. అతిపురాతనసంఘకావ్యముల ప్రచురణయందును సంవాదిభాగములందు ఇతరప్రాచీన విద్వద్వతంసుల పద్యభాగముల నుద్ధరించి చూపినట్లే పందొమ్మిదవశతాబ్దపు విద్వాంసులును తమ గురువుగారును అగు పిళ్ళెగారి పల్కులను గూడ ఉద్ధరించి చూపియున్నారు.

కడపటి కాలమువరకును క్రొత్త పొత్తముల చదువుటయందును, క్రొత్త సంగతుల నెరయుట యందును వీరి కుండిన ఉత్సాహము కొలదులు మీరినవి. సంస్కృతము, ఆంగ్లము మున్నగు ఇతరభాషలయందలి గ్రంథముల విషయములు తెలిసికొనుటకును, ఇతరవృత్తాంతములు అరసికొనుటకును ఆ యా మార్గములందు సమర్థులగువారియెడకు పోవుదురు. విద్యార్థివలెనే వినయముతోడ ప్రవర్తించి వారు నుడివెడువాని నాలకింతురు. ఎందులకును కొరగాని పలువిషయములు వారు చెప్పుచున్నను ఓరిమితో విని, వానిలో తమకు వలసినది అతిస్వల్పమే అయినను, దానిని తమ మనసులో నింపుకొందురు. 'కలము ఉముక తినినచో ఒక అటుకు దొరకకుండునా?'— అని అడుగడుగున నుడువుచుండుట వీరి యలవాటు. "అమరణాంతమును ఒక్కడు చదువడేని అ తీరెట్టిది?" అను తిరువళ్లువరు వచనమునకు లక్ష్యమై వీరు నెగడిరి.



అయ్యరుగారు సర్కారువారినుండి 'మహామహోపాధ్యాయ' బిరుదము పొందిన వారు. ఛాత్రులకు పాఠము గరపుటయందు వీరి కబ్బిన నేర్పు కొందరికే యబ్బును. 'తిరువావడుదుఱై' మఠమునందు చదువుకొను విద్యార్థులకును, తంబిరానులకును (దేవాలయములందలి మఠపు అధికారప్రతినిధులు) పాఠములు చెప్పిరి. కళాశాలలందును ఆచార్యులై పాఠములు బోధించిరి. మీనాక్షికళాశాలలో 'విద్వాన్' పరీక్షలకు చదివెడు విద్యార్థులకును బోధ సలిపిరి. తమ తోడనే మెలగుచు సాయమొనర్చుచుండు పలువురు విద్యార్థులకు తమ యింట పాఠములు బోధించి తమిళ విజ్ఞానమును ప్రసాదించిరి. పలు తరగతుల విద్యార్థులు వారియొద్ద నేర్చిరి. వారి వారి స్థితికి, యోగ్యతకును తగు చందమున బోధించెడు నేర్పు వీరికుండెను. వీరియొద్ద విద్య నేర్చిన విద్యార్థులలో జమీందారు లున్నారు; మఠాధిపతు లున్నారు; తమిళోపాధ్యాయు లున్నారు; విమర్శకులు, గ్రంథసంపాదకులు, కవులు, రాజకీయవాదులు అగు నిట్టి పెక్కుభంగులవా రున్నారు.

తమ అగాధవైదుష్యముచేత విద్యార్థుల హృదయమందు మిక్కిలి యుచ్చస్థానము వీరు గడించుకొనిరి. చవులూర తేటతెల్లముగ పాఠములు బోధించు జాణతనముచేత ఎల్లవారు మక్కువపడి ఆలించునట్లుగ జేసిరి. కళాశాలలందు సంస్కృతపుతరగతులం దుండువారు సైతము వీరి పాఠములు వినుచుండుట అభ్యాసమట: వాత్సల్యముతోడను, మధురవచనములతోడను విద్యార్థులు "వీరు మనకు మిక్కిలి ఆప్తబంధువులు" అని యనుకొనునట్లు ఒనర్చిరి. నడవడిక, రూపు, ఉదాత్తత మున్నగు గుణములచేత అక్కాలమందే ఆంగ్లోపాధ్యాయుల కంటె కొంచమేని తగ్గని మిక్కుటంపు మతింపు సంపాదించిరి. వీరి తరగతిలో వీరి కంఠస్వరము తప్ప వేరేదియు వినరాదు.

"తమిళపు కక్ష్య సాధారణముగ ఇంగ్లీషుతరగతులవలె సందడిలేక పాఠమునందు గమనముతోడనే ఉండును. సంస్కృతముఅయ్యవారు ఉత్సాహముగ పాఠములు చెప్పునపుడు కళాశాలయందంతటను వినిపించును. తమిళపాఠమో తరగతి నిండియుండునేకాని వెలుపలకు రాదు. మా అయ్యవారు శ్లోకము చదువుచో ఏవో 'తద్దినమంత్రములు' చదివినట్లే ఉండును. తమిళోపాధ్యాయులు పద్యములు చదువునప్పుడు వెలుపల నిలువబడి వినెడివారికి ఆనందముగ నుండును. పొడిగించి పాడకున్నను మోహన, కాంభోజి అని తెలియునట్లు శ్రావ్యముగ రాగచ్ఛాయ

చూపింతురు"— అని మహాఘనులు శ్రీనివాసశాస్త్రిగారు ఒక్కెడ అయ్యరుగారిని సంస్కృతప్రధానోపాధ్యాయులతో పోల్చి వ్రాసియుండుట ఇచ్చోట తెలియదగినది.

వీరియెడ ఉత్త చదువు మాత్రమేగాక క్రమశిక్షణయు ఛాత్రులు నేర్చుకొనిరి. ఒక్కొక్క విద్యార్థినిగూర్చియు, వారి ఊరు, బందుగులు మున్నగు వివరములు విచారించి తెలిసికొని వారిని ఉత్సాహపరచుటయందు వీరు చతురులు. తమ యింట వెంటనుండి పరిశోధనకార్యమునందు సాయపడుచు పాఠములను చదువువారికి ప్రత్యేకముగ బోధ సలుపుటతో నిలువక పరిశోధనవిధానములుగూడ నేర్చిరి. వీరితో మెలగియు, వీరియెడ పాఠములు వినియు కొందరు ఉత్కృష్టగ్రంథసంపాదకులుగ వెలుగొందిరి.



అయ్యరుగారి గ్రంథప్రచురణను గూర్చి చెప్పదొరకొనినచో ఎంతయైనను చెప్పుకొనుచునే పోవచ్చును. పండిన పాండిత్యము, సత్యమరయుట యందలి ఉత్సాహము, ఎడతెగని పరిశ్రమ, దేనిని వారు పరిశోధింతురో దానియందు తన్మయులై తమ్ముఁ తాము మరచి యైక్యమందు స్వభావము, తమకు చక్కగ తెల్లమగువరకు తనివిచెందక పయిపయి ప్రయత్నించు పట్టుదల, ఆర్జవము — ఇన్నియు ఒక్కెడ చేరియుండుటచేత వీరు మిగుల ఉత్తములగు గ్రంథసంపాదకులుగ అలరారిరి. అతిప్రాచీనమై విస్తృతమగు ఒక్క ఖండమునకును విస్తరించి రాగల మఱియొక ఖండమునకును సంయోజకసేతువును నిర్మించు పనిలో వీరు సిద్ధహస్తులు. తాళపత్రగ్రంథములు మరుగుపడి అచ్చుపుస్తకములు 'అమలు'లో నున్న కాల మిది. తాళపత్రములు పరిశోధించి పుస్తకరూపమున ఇవ్వవలసి యుండెను. సంఘగ్రంథములు మరుగుపడి అర్వాచీనగ్రంథములే వాడుకలో నుండిన కాలము. అన్నియు వచనరూపముననే వ్రాయవలె నని నొక్కి చెప్పెడు రోజు లివి. ఈ కాలమున చదివిచదువుటకు వీలగునట్లు పరిశుద్ధమును స్పష్టమును అయిన ప్రచురణలు వీరు ప్రసాదించిరి. తాళపత్రములం దున్నది ఉన్నట్లే మార్చి అచ్చొత్తించునట్టి సులభమగు పని కాదు ఇది. ఎన్నియో యేండ్లుగ తాళపత్రములు వ్రాయువారు చేసిన తప్పు లన్నియు తాటాకులలో నెక్కియుండును. పద్యము రూపు నెడి యుండును. మధ్యకాలమున వాడుకలో లేకుండుటచేత పెక్కుభాగములకు అర్థమే

తెలియదు. ఆ కారడవిలో చొచ్చి నిజము తెలియవలెను. దానికి సహాయసాధనములు లేవు. ఇటీవలి గ్రంథములు చదివిన ఎరుకను గొని సంఘకాలపద్యములకు భావము తెలిసికొన వీలుకాదు. అదియొక వేరు ప్రపంచము. అట్లుండియు పరిశోధక సుధీమణులగు వీరి చురుకైన బుద్ధి ఆ లోకమున చొచ్చి త్రోవ గాంచెను: ఇతరులకును తెరువు చూపెను.

అయ్యరుగారికి తమిళముతప్ప ఇతరభాష కొంచెమేని తెలియదు. అయినను వీరి ప్రచురణలు ఆ కాలమందే ఆంగ్లేయులును కొనియాడెడు విధమున అమరియుండినవి. వీరు ప్రకాశపరచిన గ్రంథము తెరవగనే మొదట పీఠిక ఉండును. ఆ గ్రంథవృత్తాంతములును, గ్రంథకర్తృవృత్తాంతములును, తాళపత్రాన్వేషణ చరిత్రయు ఆ పీఠికలో కానసగును. తమకు సాయపడిన మిత్రులకు కృతజ్ఞత తెలుపుకొను భాగము చివర నుండును. పీఠికకు తరువాత గ్రంథకర్తృచరిత్ర మొదలగునవి ఉండును. గ్రంథమూలమును నిర్దుష్టముగ ముద్రింపించి క్రింద టిప్పణియు, సంవాదిభాగములును, ఉదాహరింపబడినవానివిగూర్చి సూచనలును, పాఠభేదములును అమర్చియుంతురు. గ్రంథముతుదను విశిష్టపదములు మున్నగువాని అకారాద్యనుక్రమణిక యుండును. అయ్యరుగారి ప్రకాశములందు గల పీఠికలు చదివినమే యెట్టిదైనను పండితుడు కావచ్చునని పలువురు పలుకుట కలదు. అట్లే అయ్యరుగారు రచించిన క్రింది టిప్పణులను, విశిష్టపదముల అకారాద్యనుక్రమణికను కొనిమే పరిశోధించి గొప్ప విమర్శకులును కావచ్చును.

తమకు తెలియని అంశములను 'ఇది తెల్లము కాలేదు' అని చెప్పుటయందును ప్రతులలో నున్నవాని నట్లే చూపించుటయందును వీరి యార్జవము స్పష్టపడును. గ్రంథసంపాదకుడు ఆర్జవము వీడి తప్పుదారి పట్టినచో వాని ప్రచురణను ఆధారముగ గొని చేయు పరిశోధనయంతయు వమ్మయిపోవును. విపులవ్యాఖ్య వ్రాసి ప్రచురించిన గ్రంథములు కొన్నియే అయినను, తక్కుంగల గ్రంథముల కన్నిటికిని వీరు టిప్పణి వ్రాసియేయున్నారు. జిజ్ఞాసువుల కెయ్యెడ సందియ ముదయించునో అచ్చోట స్పష్టమైన టిప్పణి ఉండును.



అయ్యరుగారు రచియించిన వచనగ్రంథములలో అనుభవమును అభివర్ణించునవి పెక్కు. పరిశోధనసామర్థ్యము చూపున వెన్నో : అన్నిటియందు ఎద్దియైనను కొత్త

వచ్చినట్లు చెప్పక వినయముగ విన్నవింతురు. వ్రాతతీరులో స్పష్టతయు నిర్దుష్ట తయు సంస్కారసౌరభమును ఉండును. వీరి ఉపోద్ఘాతములు విమర్శనదార్ఢ్యమును చూపునట్టివి.

ఈ విబుధశేఖరులు ఒక కవి అని పలువురకు తెలియదు. బాల్యమందే పద్యము లల్ల నేర్చినవారు వీరు. ఒక కవిశ్రేష్ఠులయొద్ద పాఠములు నేర్చినవారు. పలువురు కవులతో కలసిమెలసి యుండినవారు. అట్లగుటచేత వీరును కవులై యుంట అబ్బురము కాదు. ఇతరుల కవితలకు ప్రాణము పోసి, అలంకరించి తమిళలోకము నకు ఇడిన ఈ యుదారులు తమ సొత్తగు అడకువతో తమ కవితలను ప్రసిద్ధికి తేలేదు. భక్తిరసము చిప్పిలునట్లు నూర్లకొలది పద్యములు వీరు రచించియున్నారు. వానిలో 'దండపాణివృత్తము అను చిన్న కబ్బము మాత్రమే అచ్చయి యున్నది

వీరు పరిశోధించియు వ్రాసియు ప్రకాశ మొనర్చిన గ్రంథముల సంఖ్య చూచిననే మనకు భ్రమ కలిగెడు. సంఘకాలపు కావ్యమగు 'పత్తుప్పాట్టు'ను వీరే తమిళలోకమునకు పరిచిత మొనర్చిరి. 'ఎట్టుత్తొగై' గ్రంథమందలి అయిదు కావ్యములు వీరి హస్తసంస్పర్శవలననే వెలుగొందినవి. పంచమహాకావ్యములందు ఇప్పుడు వాడుకలో నున్న మూడిటిని వీరే ఉజ్జీవింప జేసిరి. వీరి పరిశ్రమఫలిత ముగ వెలుగు చూచిన ఇతరకావ్యములు 2, పురాణములు 13, చిరుత ప్రబంధ ములు 42, లక్షణగ్రంథములు 4, వచనగ్రంథములు 19.

కంబరామాయణమును తేవారమును చక్కని తీరున ముద్రింపవలె నను ఉత్కంఠ వీరికుండెను. ఈ రెండును నెరవేరియున్నచో వీరి యభిలాష ఒక్క విధ ముగ పూర్ణతనొందియుండెడిది. కాని భగవంతుని దివ్యచిత్తము మరొకతీరున ఉండెను.

అయ్యరుగారి వేదికపై ప్రసంగమును, ఇంటి సల్లాపమును ఇంచు మించు ఒకే తీరున ఉండును రెంటియందును హాస్యరసము కొల్లలై యుండును. ఎంతటి సూక్ష్మభావమైనను కడు సులభముగ తెల్లము చేయుదురు. మాట్లాడునపుడు గ్రామ్యపదములను వీలయినంతవరకు తగ్గించియే భాషింతురు.

వారితో సల్లాపము సలుపుచుండుచో ప్రొద్దుపోవుటే తెలియరాదు. ఎవ్వరెవ్వ రికి ఎది యెట్టి ఇష్టమో ఆ యా మార్గమున రసనిర్భరములగు భావము లెత్తి అభి వర్ణింతురు. వంటవానితో సంభాషించునెడ పలు తెరగుల తినుబండారములగూర్చి

ప్రస్తావింతురు. నడుమ కావ్యములందు వచ్చు ఆహారములను గూర్చియు చెప్పు దురు. శిల్పితో మాట్లాడునపుడు శిల్పమునుగూర్చియే భాషించి, తమ సంభాషణలో రసము లూరింతురు. తమ ప్రాత యనుభవములు వీ రుగ్గడించునపుడు ఆలకించువారికి ఆ కాలమందే అచ్చోటనే తాముకూడ ఉన్న చొప్పున ఒక వింత అనుభవ మేర్పడును.

వేదికపైనుండి అలవోకగా పెద్దకాల ముపన్యసింపగలరు. ఊర్లను గూర్చియు, నామౌచిత్యములగురించియు చమత్కారముగ మాటలాడి ఆలకించు వారి గమనమును ఆకట్టుకొందురు. ఈ కాలపువారు అనుకొనెడి 'ఉపన్యాసకళ' చొప్పున ఏర్పడిన ఉపన్యాసముగ అది యుండదు. అయినను వీరు ప్రసంగించు నపుడు శ్రోతలు మిగుల ఆసక్తులై యాకర్ణింతురు. ఉపన్యాసము వినిన తర్వాత "ఎన్నో క్రొత్త సంగతులు తెలిసికొంటిమి"– అను మనస్తృప్తి వినినవారి కేర్పడును



సంస్కారపూర్ణులగు సత్పురుషుల కోవలో అయ్యరుగారిని లెక్కించునపుడు, అది వ్రాతలో నెట్లు తేర్చి చెప్పుటయో అనునెడ మైకము క్రమ్మును. వీరి అడకువ నుగ్గడించుటయా? ఇంగితజ్ఞానము నిండిన సల్లాపము ప్రశంసించుటయా? జాతి మత భేదము లేక, చిన్నలు పెద్దలు అను వేరుబాటు లేక ఎల్లవారియెడను మక్కువ చూపి మెలగెడు ఉదాత్తగుణమును అగ్గించుటయా? పేదసాదులయెడ వానికున్న కనికర మును కొనియాడుటయా!

"గొప్పతన మెప్పటికిని అణగి మణగి యుండు" అనుటకు వీరు తార్కాణ. వీరి యొడలియందు కృతజ్ఞతయే రక్తమై ప్రసరించును. భగవద్భక్తిలో పుట్టి, అందు ననే పెరిగి అందే కరగిపోయినవారు వీరు. శివభక్తి చెలువము నిండినవారు. ఏ యూరికి చనినను, అట నున్న దేవాలయమున కేగి దర్శనము చేసికొనక యుండరు. ఏనాడై నను తేవారము పారాయణము చేయక ఏ పనియు ఆరంభింపరు. రేయైనను, పవలై నను, పవ్వళించియున్నను, నడచుచున్నను, పనిలేని వేళల శివనామజపము చేయు చునే యుందురు. వీరి గ్రంథపీఠికల ఆరంభమున ఏదేని ఒక తేవారముపాటయో తిరువాచకము పాటయో లేక యుండదు. జైనసమయగ్రంథమగు జీవకచింతా మణియైనను సరి, బౌద్ధమతగ్రంథమగు మణిమేఖలయైనను కానిండు; పీఠికకు తలపై ఇట్టి పాట చూడవచ్చును. పుస్తకము మొదటి పుటపై విఘ్నేశ్వరుగుడియు, '౨'- ఇట్టి సాంకేతికాక్షరము) 'శివమయమ్' అను పదమును ఉండియేతీరును.

విబూది చెలువమరు నెన్నుదురును ఒడలును, రుద్రాక్షమాలిక ధరించిన వక్షమును, వయసు పండిన ఆ రూపును, నిడుపైన ఆ యొడలును గలట్టి వీరిని కాంచినచో వీరును అరువదిమూవురు నాయన్మారుల (శివభక్తుల)లో ఒక్కరొక్కో !" అని తోచును. తేవారమును తాము చదువునపుడును పెరవారు చదువగ ఆలకించునపుడును మనసు కరగి, కన్నుల నీరు నిండి తొణికిసలాడ నిలువబడియుండు ఆ దృశ్యము చూచినట్టివారలు వీరి శివభక్తిప్రవణత అరసికొనియుందురు.

# 5

ఇట్టి మహానుభావుల అడుగుదమ్ముల చాయను వసించి తమిళ మభ్యసించు భాగ్యము నాకు అబ్బినది. పదియునైదు వత్సరములు ఈ తమిళభాషామహాసాగరము చెంత నుండెడు పుణ్యము పొందితిని. ఈ సద్గుణశిఖరియౌన్నత్యము ఒకకొంత తెలిసికొనెడు సదవకాశము నాకు కలిగెను.

'ఆనందవికటను'లో వెలువడిన 'నా చరిత్ర' 122 అధ్యాయములతోడ నిలిచిపోయెనని మున్ను సూచించినాడను. దానిని పుస్తకరూపమున అయ్యరుగారి కుమారులు శ్రీ కల్యాణసుందరయ్యరుగారు 1950 సంవత్సరము ఏప్రెలులో ప్రకటించిరి. ఆటుపై జరిగిన జీవితచరిత్ర వ్రాసి నెరవేర్పవలె నను ఉత్కంఠ వారి కుండెను. అది కొనసాగలేదు.

మంచి పుస్తకముల సంగ్రహములను ప్రకటింపవలె నను ఆశయము గల 'సాహిత్యఅకాడమీ' వారు 'నా చరిత్ర'ను సంగ్రహింపదలచినప్పుడు ఆ భారము నాపై మోపిరి. ఇతరభాషలయందును దీనిని 'తర్జుమా' చేయించి ప్రచురింపవలె నని 'అకాడమీ'వారి యభిలాష. వారి యాదేశానుసారముగ ఈ సంగ్రహమును ఇప్పుడు చక్కజేసితిని.

మూలగ్రంథమునందుగల పెక్కు వర్ణనాంశములను, పద్యములను వివరణలను తగ్గించియున్నాను ఎడనెడ వచ్చెడు పలువురి చరిత్రలు ఎత్తివేసినాను. 122 అధ్యాయములను సంగ్రహించి 58 అధ్యాయములుగ కుదించితిని. అధ్యాయముల శీర్షికలు పెక్కు నేను క్రొత్తగ అమర్చినవి.

ఇట్టి 'సేవ'ను నా కొసగిన 'సాహిత్యఅకాడమీ'వారికి నా కృతజ్ఞత నివేదించుకొందును.

ఈ పుస్తకముకూడ 'త్యాగరాజవిలాస' ప్రకాశముగనే వెలువడుచున్నది. అయ్యరుగారి యింటికి 'త్యాగరాజవిలాస' మని పేరు. అయ్యరుగారి మనుమలగు శ్రీ క. సుబ్రహ్మణ్యన్ బి.ఏ. గారు ఈ సంగ్రహమును తమ బాధ్యతపై ప్రకటింప ఇయ్యకొనిరి. వారికిని నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను

కాంతమలై'
కల్యాణనగర్
చెన్నపట్టణము—28

కి. వా. జగన్నాథన్,
21-1-'58.

# 1. వహా యమారు

దాదాపు రెండువందల యేండ్లకు మునుపు తంజావూరు సంస్థానమును ఒక రాజుగారు యేలుచుండిరి. వా రొక పర్యాయము తమ దేశము నాలుగు చెరగుల కలయ దిరిగి చూచిరా దలచి సపరివారముగ తంజావూరునుండి బయలువెడలిరి. అట నట నున్న ప్రకృతిసౌందర్యము తిలకించుచు, ముదమందుచు ఆయాయి స్థలముల దర్శనము చేసికొనుచు పోవుచుండిరి. మార్గమధ్యమందు తంజావూరుకు తూర్పుగ పదునైదు మైళ్లదూరమున ఉన్న 'పాపనాశము' నకు సమీపమున నొకచో వారు విడిసిరి. అలవాటుచొప్పున అట భోజనముచేసి తాంబూలము వేసికొని భుక్తాయా-సము తీర్చుకొనుచుండిరి. అనుయాత్రికులతో గోష్ఠీరసము ననుభవించుచు కాలము పుచ్చుచుండిరి. మాటల మధ్యన నా డేకాదశి యని తెలియవచ్చెను. ఆ ప్రభువులు ఏకాదశినాడు ఒంటిపూటమాత్రమే భుజించువారు. అది వారి వ్రతము. ఆ దినమున తాంబూలము వేసికొను నలవాటు లేదు. అట్లుండ ఏకాదశినాడు తెలియక వారు తాంబూలము వేసికొనిరి. అనుకొనని విధమున వ్రతభంగ మాయెను. దాన నా ప్రభువులు మిగుల వగచి యద్దానికి ప్రాయశ్చిత్త మెద్దియని పెద్దల గొందర నడిగిరి. "ఒక యగ్రహారమును ప్రతిష్ఠించి, అం దిండ్లు గట్టించి వేదవిదులగు విప్రులకు ఆ యిండ్లతోడ భూమియు దానముచేసినచో నీ దోషము తొలగును" అని యా పెద్దలు సెప్పిరి.

"ఇది యెంతపని! అట్లే చేయుదము; ఇచ్చోటనే అగ్రహారము ప్రతిష్ఠింతము" అని యా దొరగారు ముదమున బలికిరి. వెంటనే అట నొక అగ్రహారము నిర్మింప నేర్పాట్లు కావించిరి. అందు నలువదియెనిమిది యిండ్లు గట్టించిరి. వేదాధ్యయన మొనర్చిన నలుబది యెనమండుగురు బ్రాహ్మణులను దాపులనుండియు దవ్వులనుండియు రావించి ఆ యిండ్లను, పొలమును ధారాదత్తముచేసిరి. అ ట్లాయూరు ఉత్తమమానవస్తు

వుగ నొసగుడుటచేత 'ఉత్తమదానపురము' * అనుపేర బరగెను. ఆ కుటుంబముల వా రెల్లరును ఉత్తమదానపురమున వైదికాచారములు మారుపడకుండ జీవయాత్ర సాగించుచుండిరి. ఈ యుత్తమదానపురము నేటికిని ఆపేరు సెడక, తంజావూరు జిల్లాలో పాపనాశము తాలూకాలో ఒక గ్రామముగ నిలచియున్నది.

ఇది మాయూరు. ఇప్పు డున్న ఉత్తమదానపురమునకును 'మాయూరు' అన్న పేరిమెతో నే జూచు ఉత్తమదానపురమునకును ఎంతయో వాసి. నా చిన్ననాటి మా యూరే నాచిత్తమున హత్తుకొనియున్నది. ఇప్పటి సౌకర్యము లప్పుడు లేవు. రోడ్లు లేవు. అంగళ్లు లేవు. ఉద్యోగస్థులు లేరు. రైలు అన్నమాటయే లేదు. అయినను అంద ముండినది. ఒద్దిక యుండినది. ప్రశాంతి యుండినది. ప్రజలలో తృప్తి యుండినది. భక్తి యుండినది. వారి మోముల నానందము తొణికిసలాడుచుండెను. ఇండ్లు సిరి సంపదలతో తులతూగుచుండినవి.

ఆ యుత్తమదానపురమున 'అణ్ణాజోస్యర్' అను ఒక బ్రాహ్మణు లుండిరి. వారు తమ జ్యోతిషవిజ్ఞానమువలనను, వైదికవృత్తిమూలమునను కావలసిన వన్నియు సమకూర్చుకొనుచు, చింతయు చీకును లేక జీవిక గడపుకొనుచుండిరి. దిట్టమైన 'మేనికట్టు' గల భాగ్యశాలి వారు. ఆ జోస్యులొక నా డేదో యొక యూర నారగించి, రొమ్మునిండ నలందిన గంధము, నోటినిండ నిడిన వీడెము, కురులనడుమ తురిమిన విరులును ముప్పిరిగొని గుబాళింప మిగుల నుత్సాహముతో తమ యూరు జేర వచ్చుచుండిరి. మార్గమందు పాపనాశమున తంజావూరు కలెక్టరు 'మకాము' చేసి యుండిరి. వీరు ఆ దారివెంబడి వచ్చుచుండగ కలెక్టరు, శిరస్తాదారును బయట నిలుచు కొని యుండిరి. కలెక్టరు తెల్లదొర. శిరస్తాదారు హిందువు.

కలెక్టరుదొరచూపు అణ్ణాజోస్యుల మీద పడినది. వారి దేహసౌష్ఠవమును, గంభీరమగు కోడెనడకయు, మోమున తులకించు వెలుగును పరికింప కలెక్టరుకు మిక్కుటపు టబ్బుర మొదవెను. వెంటనే వారిని పిలిపించి శిరస్తాదారునోట కొన్ని సంగతు లడిగించిరి.

కలెక్టరు : మీరు చదువగలరా?

జోస్యులు : చదవగలను.

---

* ఈ యూరు పాపనాశము రైల్వేస్టేషనుకు తూర్పుగా ముక్కాలు మైలు దూరమున నున్నది

# 2. మా పూర్వపురుషులు

"పదువేవురు బాపలకు అన్నదానము చేయ సంకల్పించి యున్నాడను. అందు లకు మహారాజుగారు సహాయ మొనర్పవలెను" అని యొకరు ఒక ప్రభువులను వేడు కొనిరట. ఆ రాజుగారు దానికై మిక్కుటముగ ద్రవ్యసహాయము చేసిరి. ఆ మొత్త మును దీసికొనిన వారు తమ యింట ఇద్దరే బాపల బిలిచి, వారికి తృప్తి కలుగునట్లు భోజన మిడి గొప్పగ దక్షిణయు నిచ్చి పంపివేసిరి.

పొరుగింటివా రొకరు వీరి సంగతులను చక్కగ నెరిగియుండుటచేత వీరి నుద్దేశించి "ఏమండీ, పదువేవురు బాపలకు అన్నమిడెద నని బొంకి రాజుగారిని మోస గించి అంత ద్రవ్య మడిగి పుచ్చుకొంటిరే, ఇద్దరికే గదా మీ రన్నమిడినది?" అని యడిగిరి. అంతట వీరు "నేను పది వేలకుపైగ ఒక్కవేయి చేర్చి పదునొకండు వేల బ్రాహ్మణులకు సంతర్పణ చేసితినే" అని చమత్కరించిరి.

"పచ్చి మోసము! ఇద్దరికి బెట్టి పదునొకండువేలమందికి బెట్టినట్లు మాటాడు చున్నారేమి?" అని పృచ్ఛకులు మగుడ నడిగిరి.

"నేను విందుపెట్టినవారిలో నొకరు ఎనిమిదివేలవారు, మరియొకరు మూడు వేలవారు. ఉభయులును కలసి పదునొకండువేలవారు కాలేదా?" అని యా చతురులు చమత్కారముగ సమాధాన మిచ్చినారు. నేరము మోపినవారికి అసలుసంగతి అవగత మాయెను.

అష్టసహస్రబ్రాహ్మణు లొకరును, చిదంబరదీక్షితు లొకరును వారి యింట విందు గుడిచిరి. ఎనిమిదివేలవారును, చిదంబరపు మూడువేలవారును చేరి భుజించుటచే వీరు చాతుర్యముతోడ పదునొకండువేలవా రని నుడివినారని వారు తెలిసికొనిరి.

పై బెరొక్కన్న గాథ సత్యమో, అసత్యమో? ఏది ఎట్లున్నను ఇట్టి తంత్రమును నేనును వినోదార్థము ప్రయోగించుచుందును. 'నే నొంటరివాడనయ్యు ఎనిమిదివేలు' అని శ్లేషోక్తిగ కొన్ని యెడల నుడివియున్నాడను. దీనిని విన్నవా రొక్కరొక్కరును తమ తమకు తోచిన రీతిని అర్థము చేసికొనుచుండిరి. "బ్రాహ్మణులలో అష్టసహస్ర మను

నది ఒక తెగ. 'ఎనిమిదివేలు' అని దాని యర్థము. ఆ తెగకు చెందినవాడను నేను" అని నేను చెప్పిన వెనుకనే నా శ్లేషలోని భావమును వారు గ్రహించుచుండిరి.

మా ముత్తాతగారిపేరు వేంకటనారాయణయ్యరు; వారు ఐక్కవలుచని యొడలు గలవారు. అందుచే 'శోనన్' అను బిరుదు వారి కబ్బెను. 'శోనన్' అనియు 'శోని' అనియు ఐక్కవలుచని వారిని పిలుచుట ఆ దేశపు అలవాటని పెక్కురకు తెలిసినదే గదా? వారు కాపురమున్న యింటిని 'శోనన్ అగమ్' (శోనయ్య యిల్లు) అని తర్వాతివారు పేర్కొనుటయు అలవాటైనది. ఆ యిల్లే మా యిల్లు.

వీరపురుషులు గతించిన వెనుక వారి పేరట నొక శిల నాటి ఆరాధించుట ప్రాత సంప్రదాయము. ఆ రాతిని 'వీరశిల' యందురు. ఈ విధముననే, పతివ్రతలు చనిపోయిన తర్వాత వారి స్మృతిని నిలుపుటకో, లేక వారు మృతిచెందిన స్థలమును సూచించుటకో నాటిన యొకరాతిని 'మహాసతీశిల' అని చెప్పుదురు. ఈ శిల లన్నియు అట్టివారి స్మృతిని మనకు కలిగించుచున్నవి. మా ముత్తాతగారు సజీవులై యుండగనే వారి స్మృతిచిహ్నముగ ఒక శిల వెలసినది

మా యూరి మెట్లుగట్టిన కొలని రేవున 'శోనయ్యతాతబండ' అని యొక శిల యున్నది. కోనేట స్నాన మాచరించి నునుపుదేలిన యీ బండపై వేంకటనారాయణయ్యరుగారు తమ బట్టల నుదుకుకొనెడివారు. అందుచే ఆ రాతి కా పేరు నెల కొనినది. ఎందరెందరో ఎన్నెన్నియో బండలపై తమ వలువల నుదికికొనియుందురు. కాని యన్ని రాలకును ఆ పెరిమె యేర్పడునా? నేటికిని ఆ పరస్తీర్ణప్రస్తర మును పరికించునపుడు "శాసనము చెక్కని ఈ శూన్యశిల మన ముత్తాతగారి పేరును స్మృతిపథమునకు దెచ్చుచున్నది. దానికి వారి హస్తసంస్పర్శభాగ్యము అబ్బినది" అను తలపు కలిగినదే తడవుగ నా చేతులు రెండును తమంత తామే దండజేరి జోత లిడును.

మా తాతగారి జ్ఞాపకము నాకు బాగుగా నున్నది. 'వేంకటాచలయ్యరు' అని వారి పేరు. నాకు బాలశిక్ష గరపినవారు వారే. స్తోత్రపాఠముల నెన్నిటినో కంఠ ముగ నేర్పి 'కంఠతః' పెట్టించినారు. నేను వాని నన్నిటిని మరచితిని; కాని వారు కొట్టిన గట్టి దెబ్బలుమాత్రము మరపునకు రాకున్నవి.

వా రుపాధ్యాయులుగ నుండిరి. అట్టి దశ నాకు జ్ఞాపకములేదు. వారిని తాత గారుగ ముదిమిలో జూచిన జ్ఞాపకమే నా కున్నది. వారు జీవించి యుండగనే మా

యవ్వగారు కాలగతికి వశమైనారు. అటుపై మా తాతగారికి కావలసిన యుపచార ములు మా యమ్మగారు చేయుచు వచ్చిరి. ముదిప్రాయమున పెండ్లామును కోల్పో యిన దుఃఖము చేతను, సారె సారెకు సంఘటిల్లు కుమారు నెడబాటుచేతనగు దిగులు చేతను వారికి మన స్తిమితమే లేకుండెను. తమ్ము పల్కరించి పరామరిక చేయువా రెవ్వరును లే రను తలపును ఉండినది. వారికి ఇవి యివి కావలయు నని మా తల్లి గారికి తెలియజేయు దూతగా నే నుంటిని. మా తాతగారికై దూత్యము నెరపు నుద్యోగ ముచే నాకు బాల్యమందే, 'వంకాయపచ్చడి' అను దొడ్డ బిరు దొక్కటి యబ్బినది.

తాతగారు ప్రొద్దుట మా యెదురింటి యరుగుపై కూర్చొని ఎండలో చలి గాచు కొనుచు నుందురు. నాయనగా రూర లేని కాల మది. మా యమ్మగారు "నేడు వంట మేమి చేయు మందురో తాతగారి నడిగి రమ్మ" అని నన్ను పంపుచుందురు. ఆ రోజులలో నే నారేండ్లప్రాయమువాడనై యుందును.

నేను వారియొద్ద కరిగి "నే దేమి వండవలెను?" అని యడుగుచుండెడువాడను.

"వంటయా ?......" అని వారు దీర్ఘము తీయుదురు. వారికి అన్నిటిమీదను విరక్తియే. "వంటేగదా? మట్టిబెడ్డా, బజారుదుమ్మా, బూడిదకుడుములూ...అందురు. ఈ ప్రపంచముపై వారికి గల విరక్తికి ఈ మాటలు సూచకము లని నా కప్పుడు తెలియలేదు.

గునగున పరుగు లిడుచు పోయి తల్లిగారియొద్ద తాతగా రన్నదంతయు నట్లే యొప్పగింతును. "పోరా వెర్రివాడ! ఏమి వండ మందురో తెలిసికొని రా" అని మరల మా యమ్మగారు పంపెడివారు.

నేను క్రమ్మర తాతగారియొద్దకు చని వారి నడిగెదను.

వారు ఆచి, తూచి, ఆలోచించి "వంకాయ లున్నవా?" అని యడుగుచుండు వారు. అందుకై యొక తడవ పరుగిడి తల్లిగారిని డాసి, అడిగి, తెలిసి మరలి వచ్చి సమాధాన మిత్తును.

"లేత పిందెలుగా ఉన్నవా?" అని వారి రెండవ ప్రశ్న. అందులకై మరల నొకమారు పరుగున పోయి వత్తును.

"ఆ వంకాయలు కుమ్ములో పెట్టి......."కొంచెము సేపు ఊరకుందురు.

"తెలుస్తోందా! వాట్ని బాగా కుమ్ములో పెట్టి, తాలింపు పెట్టి......"

వారనెడు ఒక్కొక్క మాటకును ఊఁకొట్టుచునే యుండిదును. అటుల గానిచో వారికి పైపై మాటల ధోరణి సాగదు.

"తిరుగబోత పెట్టేప్పుడు మినప్పప్పు వేసేస్తారు దాన్ని వెయ్యొద్దను. నూనె హెచ్చుగా వేయనీకు".

అప్పుడుబికివచ్చెడు కోపమున కొంచెము సేపు మౌనముద్ర వహింతురు. మరల మొదలిడుదురు.

"దాన్ని సన్నికల్లుమీద దెట్టి బాగా పాత్రం దొర్లించి మెదిపీ మెదిపీ నూఁరవలె."

ఆ 'మెఁదిపి' అను పదమును వారు పలుమారు పలుకుదురు. అటుల నుడువునపుడు వారు చేతులు త్రిప్పి త్రిప్పి యభినయించుట జూడ నిజముగ వంకాయ పచ్చడి నూరెడువారు గూడ అంతటి శ్రద్ధ వహింప రని తోచును.

తాతమాటలు విని కొంత ద వ్వేగుదును. అంతలో మరల "ఒరేయ్, ఇలా రారా" అని పిలిచెదరు. "నే చెప్పేది తెలుస్తోందా! బాగా మెదిపి మెదిపి నూరమన్నా. మినప్పప్పు అప్పు డందులో వెయ్యకూడదు." అని మగుడ హెచ్చరింతురు. అది విని మా యమ్మగారియెదుట నప్లే యొప్పగింతును.

ఈ విధముగ మా తాతగారి కిష్టమైన వంకాయపచ్చడిపాకమును తదితరవిషయములనుగురించి వారు చెప్పెడి సంగతులను మా యమ్మగారియొద్ద నొప్పగించెడి పని నాకు మాటిమాటికిని తగులుచుండెను. ఈ సంభాషణ వినుచున్న ఇతరులు నా కొ పేరు (వంకాయపచ్చడి) పెట్టిరి.

మా తాతగారు మరణశయ్యమీద ఉన్నప్పుడు ఇంటిలో నున్న వారిని ఒక్కరొక్కరిని పిలిచి వారివారికి తగిన విధమున సుద్దులు సెప్పుచుండిరి. మా యమ్మగారిని బిలిచి "నా కెన్నియో తెరగుల పరిచర్యలు చేసియున్నావు. ఎన్నో సారులు నిన్ను కసరుచు మాటాడియున్నాను. వగవకు. నీవు మంచి అమ్మాయివి" అని చెప్పుచు తమ తలకడ నున్న ఒక చిన్న మూట ఈవలికి తీసినారు. అందులో నొక ముడి మెల్లగా విప్పినారు. "వీనిని నేను చిరకాలమునుండియు దాచిపెట్టియున్నాను. నా కివి మిక్కిలి యుపయోగకరములు. ఇదో, నా స్మృతిచిహ్నముగ వీనిని నీయొద్ద నుంచుకొనుము. వే రేది నీ కొసగగలను? నీకు శుభల మగుగాక!" అనుచు రెండు ప్రాత

సూదులుతీసి యిచ్చినారు. మా తల్లిగారు వానిని భక్తితో స్వీకరించిరి. మా తాతగారప్పుడప్పుడు తమ బట్టల కా సూదులతో కుట్టుకొనుచుండువారు. తరువాత పెక్కేండ్ల వరకును మా తల్లిగా రా సూదుల కాపాడుకొనుచు వచ్చిరి.

మా బంధుగులలో తమిళపండితులును కొందరు గలరు. పై పేర్కొన్న తాతగారి మామగారగు 'ఓదవనేశ్వరయ్యర్' అనువారు తమిళభాషలోని కావ్యములను, వ్యాకరణాదిశాస్త్రములను చదివి నేర్చి లక్ష్యలక్షణజ్ఞానముల గడిదేరినవారు. సంగీతమందును వారికి మంచి పరిచితి యుండినది. తరచుగా 'పుదుచ్చేరి' మున్నగు పరదేశముల కరిగి 'తిరువిళైయాడల్', 'కంబరామాయణము', భారతము మున్నగు గ్రంథములమీద ననుస్యూతముగ కొన్నాళ్లుపన్యసించి ఆయాయి యూరివారలు నేయు సన్మానము లంది వచ్చుచుండెడివారు.

# 3. ఘనం కృష్ణయ్యరు

కడచిన శతాబ్దమున తమిళదేశమం దుండి పొగడిక గన్న సంగీతవిద్వాంసులలో ఘనం కృష్ణయ్య రొకరు. మాయన్నగారికి వీరు మేనమామ. వీరి అసలు పేరు కృష్ణయ్యరు. ఘనము, నయము, దేశికము అను సంగీతసరణులు మూడింటిలో నొకటగు ఘనమార్గమును చేపట్టి సడలని పట్టుదలతో నభ్యసించి యందు మిక్కుటమగు దిట్టతనమును గడించిరి.

వీరు 'ఉడైయార్ పాళయమ్' తాలూకాలోని 'తిరుక్కున్నమ్' అను ఊరిలో బుట్టినవారు. చిన్ననాట వీరు తమ తండ్రిగారగు రామస్వామి అయ్యరుగారియొద్దను ఆ వెనుక తంజావూరాస్థానసంగీతవిద్వాంసులగు పచ్చైమిరియన్ ఆదిసుబ్బయ్యరుగారియొద్దను సంగీతశిక్షణ పడసిరి. పిదప కొలదికాలము తంజావూరాస్థానసంగీతవిద్వాంసులలో నొకరై యుండిరి.

ఆ రోజులలో బొబ్బిలిసంస్థానమునకు చెందిన 'కేశవయ్య' అను నొక ప్రసిద్ధసంగీతవిద్వాంసులు తంజావూరునకు వచ్చిరి. వారు ఘనమార్గమున మంచి సాధన గలవారు. తంజావూరు రాజాస్థానమున వారు పాడిరి. ఆ రాజుగారును, తదితరులును ఘనమార్గస్వరూపమును తెలిసి మిగుల కొనియాడిరి. ఆ రోజులలో

తమిళదేశమున ఈ ఘనమార్గమునకు ప్రచారమే లేదు. అందుచేత "ఈ విద్వాంసుల సహాయమున ఎవ్వరేని ఈ ఘనమార్గము నభ్యసించినచో ఎంత బాగు ! మన సంస్థాన మునకును ఎంతయో గౌరవము !" అని యా రాజుగారు తలపోసిరి. సంస్థాన విద్వాంసులు గుమిగూడియున్న ఆ నిండు సభలో రాజుగారు తమ యాశయమును అట్లుగ్గడించినపుడు ఒక్కరైనను అట్లు చేయుటకు ముందడు గిడలేదు. ఘనమార్గ సంగీతమునకు మంచి దేహదార్ఢ్యము, ఎడతెగని యభ్యాసపాటవమును కావలయును. కావుననే విద్వాంసులు దానిని క్రొత్తగ నభ్యసింప ముందడుగు వేయలేరైరి.

అప్పుడు చిన్నవారుగనున్న కృష్ణయ్యరు తా మభ్యసింప సంసిద్ధులై యున్నట్లు ధీరముగ పలికినారు. బొబ్బిలి కేశవయ్యగారియొద్ద ఆ ఘనమార్గసంప్రదాయమును, దానికి సంబంధించిన చక్రతానము పాడెడు పద్ధతియు తెలిసికొనిరి. 'కపిస్థలము' అను ఊరికి పోయి 'రామభద్రమూప్పనార్" అను నొక సంపన్నుల యాదరువున అభ్యసింప దొడగిరి.

దానుదాను ఆ యభ్యాసము ముదురజొచ్చినది. కడపట తంజాపురప్రభువు ప్రోల బొబ్బిలి కేశవయ్యకూడ ఆశ్చర్యచకితులై కొనియాడునట్లు పాడి చూపిరి అది మొదలు వీరు 'ఘనం కృష్ణయ్య' రనియే వ్యవహరింపబడుచుండిరి.

వీరు కొంతకాలము 'తిరువిడైమరుదూరు'లో మహారాష్ట్రవంశమునకు చేరిన 'అమరసింహు'ల ఆస్థానవిద్వాంసులై యుండిరి. నందనారుచరిత్రకీర్తనల రచయితలగు 'శ్రీ గోపాలకృష్ణ భారతియారు' అటకు వచ్చి, రాజాస్థానవిద్వాంసులగు 'రామదాసు' అను నొక మహానుభావులయొద్ద నుండి సంగీత మభ్యసించుచుండిరి. అప్పుడప్పుడు ఘనం కృష్ణయ్యరుగారితోడను పరిచయము సంపాదించి వారియొద్దను కొన్ని కీర్తనలు నేర్చుకొనిరి. అటు పిమ్మట కృష్ణయ్యరు అప్పటి ఉడైయార్ పాళయము సంస్థానాధిపతియగు కచ్చి రంగప్ప ఉడైయారుచే నాహూతులై తమ జీవిత కాల మంతయు ఆ సంస్థానవిద్వాంసులుగనే వెలుగొందుచుండిరి.

వీరి కేర్పడిన గౌరవప్రపత్తులు చూచిన కొందరి యెడదల అసూయానలము కుమిలి కుమిలి ప్రజ్వరిల్లదొడగినది. ఎవరో కొందరు జమీందారులొద్ద వీరిపై చాడీలు చెప్పి వారి మనస్సు కొంచెము చలించునట్లు చేసిరి. కచ్చి రంగప్పగారి కుమారుడగు కచ్చి కళ్యాణరంగ ఉడైయా రనువారే ఆ జమీందారు.

అలవాటుచొప్పున ఒకనాడు ఘనం కృష్ణయ్యరు జమీందారుల చూడబోయి నపుడు వారు మొగ మిచ్చి ముచ్చటింపలేదు. ఏదో కార్యావసరమున నున్న ట్లుండిరి. ఇంగితజ్ఞులగు ఈ సంగీతవిద్వాంసులకు "ఇది యెవ్వరో చేసిన కుత్రుఫలితము" అని తెలిసిపోయెను. వీరి మనస్సు మిగుల బాధపడినది. అయినను దానిని తా మరసి నట్లు వారికి తెలియజేయవలె నని యనుకొనిరి.

తమ మనఃక్లేశమును బట్టబయలుగ తెలియజేయుట ఉచితముకా దని తలచిరి. వ్యంగ్యముగ తెలియజేయవలె నని యుద్దేశించిరి. సంగీతసాహిత్యములు రెండును ఎల్లవేళల ఊడిగము చేయ వీరియెదుట చేతులు కట్టుకొని యుండెడివి.

ఒక నాయిక పాడినట్లు ఒక క్రొత్తపాట పాడ నారంభించిరి :

"పది ముత్తెపు మూటలు, వజ్రాలపతకమును, సంచులుకొలదిగ రొక్కమును ఇచ్చినవారివలె పాడిన పాటకును, ఆడిన ఆటకును నన్ను ప్రలోభపెట్టి మోసగిం చుటయే చాలు. ఫలిత మరయుదును లెమ్ము" అను భావముగల పల్లవి యొక్కటి సురటిరాగమందు పాడ దొడగిరి.

జమీందారు స్తబ్ధు లాయెను. ఈ సురటిరాగము వారి మనస్సును చుట్టి పట్టు కొన్నది. తలచుకొన్నచో ఘనం కృష్ణయ్యరుగారు గొప్ప గొప్ప సంస్థానములం దుండి రాజభోగరాజోపచారములతో తమ జీవనము సాగింపగల రని వా రెరుగుదురు. తాము చేయు సమ్మానము నెదురు చూడక, తమ ప్రేమను మాత్రమే కోరి వారు ఉదైయార్‌పాళెమునందు వసించియుంటయు జమీందారు చక్కగ నెరుగుదురు. ఇట్టి వివేకోదయముచే అసూయావిష్టుల దుర్బోధలు మరుగున పడిపోయెను. కృష్ణ య్యరుగారి పల్లవి జమీందారుల చెవి సోకెనో లేదో వెనువెంటనే వారి పూర్వపు నైజము తలయెత్తి నిలిచినది. "అరరే! ఎంత వెర్రితనము చూపితిమి? మేము వీరికి ముత్యాల మూటలా యిచ్చినారము? వజ్రాల పతకమా యిచ్చియుంటిమి? వీరివలన మన కెంతటి ప్రతిష్ఠ! అడవినట్టనడుమ నున్న ఈ యూరికి వేర్వేరు సంస్థానముల నుండి విద్వాంసు లెల్లరు రాకపోకలు సాగించుట యెవ్వరివలన? వీరివలన కాదా? దీనిని మరచితిమే" అని మది తలపోసి దుఃఖించిరి.

"స్వామీ, మన్నింపుడు. నే నెరుగక పెడమొగముతో నుంటిని" అని జమీం దారు వారిని వేడుకొనిరి.

తలచిన పని సాధించుకొనిన కృష్ణయ్యరు ప్రాత పల్లవిని జమీందారుగారిని పొగడెడు వడువున మార్చి పాడ దొడగిరి :

'పది ముత్తెపు మూటలు, వజ్రాల పతకమును, సంచులకొలదిగ రొక్కమును ఆసగొని యిచ్చి మిగుల సుఖముల నొడగూర్చి పదపడి తూలికాతల్పమందు కొసరి కొసరి క్రీడించి రాసిక్యము చక్కగ నెరపిన మహారాజా ! అని వీరు దానిని మార్చి పాడగనే జమీందారుల మోము విప్పారినది.

"సంగీతసాహిత్యములు రెండును మీ యధికారమునకు లోగి వశంవద ములై మీ యిచ్చచొప్పున పరిచరణము చేయుచున్నయని" అని వా రనిరి.

"నే నేమి జమీందారుడనా ? సేవ చేయ నాకు వే రెవ్వారు గలరు? నా యధి కారమునకు ఎవ్వరు తల యొగ్గెదరు?" అని నవ్వుచునే కృష్ణయ్యరు నుడివిరి.

''ఇదిగో, నే నున్నాను. మీ సంగీతాధికారమునకు తల వంచ వేవు రున్నారు." అని జమీందారు చెప్పునపుడు వారిరువురి కూరిమియెడందలు రెండు నొక్కటై కలసిపోయినవి.

వీరి యొద్దనే మా నాయనగారు సంగీతాభ్యాస మొనర్చిరి.

# 4. మా నాయనగారు

"ఎల్లవేళల శివభక్తి కలిగి మెలగుచుండుము" అనునదే మా తండ్రిగారు నా కిడిన చరమోపదేశము. ఆ యుపదేశమును విడువక కడపటివరకు చేపట్టి యుండుటవలన ఇంతవట్టయినను తమిళభాషాసేవ యొనర్చుటకును, సహృదయుల యాదరము పొందుటకును వలనుపడిన దని దృఢముగ విశ్వసించుచున్నాను. వారికి నా విషయమున మనసుననే దాగియుండిన విచారము నేను మొదట తెలిసికొనలేక పోయితిని. కాని కాలక్రమమున నెరిగి కరగిపోయితిని. వారియెడ నా కుండిన భయ భక్తులు రాను రాను పెరుగజొచ్చినవే కాని తరుగలేదు.

చిన్ననాట నాకు తగిన ఒక గురువరుల వెదకి తెచ్చి యిచ్చుట, పిదప తాళపత్రగ్రంథములే గతి యని యున్న నాకు లోకవ్యవహారపు జంజాటము ఇసుమంతేని లేకుండజేసి కాపాడుట, శివభక్తిమహిమను తమ నడవడికతోడనే చాటి చెప్పుట మున్నగు అరుదైన వారి చెయిదముల నే మరవలేను. వారి యాచారశీలత, శివభక్తి తత్పరత, పరిశుద్ధత, సంగీతకుశలతయు వారిని దైవభావముతో చూచున ట్లొనర్చినవి. వారికి నాయెడ గల వాత్సల్యము పైకి తోపదు. వారి హృదయగుహాంతరమున అది పసిడివలె గుప్తమై యుండినది. దాని వెలుగును కొన్ని ముఖ్యసందర్భము లందు మాత్రము నేను కనుగొనియున్నాను.

మా తండ్రిగారి అసలుపేరు 'వేంకటసుబ్రహ్మణ్య అయ్యరు'. వెంకటసుబ్బయ్యరనియే అది మార్పు చెందినది. వారిపేరు ముందుతరమువారి పే రగుట ఇంట నుండువారు ఆ పేరు చెప్పరు. అందుచే 'సామి' అనియే వారిని పిలుచుచు వచ్చిరి. మా తండ్రిగారికి తమ్ము లొక రుండిరి. శ్రీనివాసయ్యరు అనునది వారి మొదటి పేరు. మా నాయనగారిని 'సామి' అని పిలువదొడంగుటచేత వీరిని 'చిన్నసామి' అని యెల్లరు పిలువజొచ్చిరి. వారి కా పేరే స్థిరముగ నిలిచినది.

మా తండ్రిగారికిని పినతండ్రిగారికిని పిన్న వయసున మా తాతగారే సంస్కృత ద్రావిడములు నేర్పిరి. మా యవ్వగారు సంగీతాభ్యాసము కలవా రగుట వారి యంశము మా తండ్రిగారియెడ నుండినది. వారికి బాల్యమునందే సంగీతమం దభిలాష పుట్టి వయసుతోబాటు పెరుగుచు వచ్చినది.

వారికి ఉపనయన మైపది. అవ్వగారికి వారిని సంగీతమార్గమున దింపవలయు నని యుత్కంఠ యుండెను. తమ మేనమామగారగు ఘనం కృష్ణయ్యరు ఉడయార్పాళెము సంస్థానమున సంగీతవిద్వాంసులుగ నుండి పేరు ప్రఖ్యాతులు వడసియుండుట చేత వారి యొద్దనే తమ పెద్ద కుమారులను ఒప్పగించి గురుకులవాసము చేయింపవలె నని తలంచిరి మా తాతగారును దీనిని సమ్మతించిరి. మా తండ్రిగారికో సంగీతాభ్యాసమునందు గల యుత్కంఠ చెప్ప తరముగానిది.

ఒక శుభసమయమున మా యవ్వగారు తమ ముద్దుల పట్టిని పిలుచుకొని పోయి ఉడైయార్పాళెము చేరిరి. తమ మేనమామగారియెడ కుమారుల నప్పన చేసి తమ యభిప్రాయమును చెప్పిరి. ఘనం కృష్ణయ్యరు "ఒరే అబ్బాయ్, ఏదైనా పాడరా చూద్దాం" అనిరి. మా యవ్వగారు మా నాయనగారికి ఘనం కృష్ణయ్యరుగారి కీర్త-

నలు కొన్నిటిని నేర్పి యుండిరి. వానిలో నొక్కదానిని మా తండ్రిగారు పాడి వినిచిరి. అది స్వరశుద్ధముగ నుంట కనిన ఘనం కృష్ణయ్యరు "నీ కుమారునకు 'శారీర' మున్నది. నీవును కొలది సంగీతము నేర్పియున్నావు. ముందుకు రాగలడు" అని పలికిరి.

"మామా, వీనిని మీయొద్ద నప్పగించితిని. ఇకమీదట వీనికి ఏ కొదవయు లేదు" అనినారు అవ్వగారు.

"అన్నియు బాగుగనే యున్నవి. కాని వీనికి దేహపుష్టి మాత్రము చాలదు. బాగుగ భుజింపవలెను. ఒడలు వంచి కష్టించి పనిచేయవలెను" అని కృష్ణయ్యరు వాక్రుచ్చిరి.

"మనకు దగ్గరిచుట్ట మగుటచేతనే మన శరీరసౌఖ్యమునుగూర్చి వీ రింతగా చెప్పుచున్నారు" అని మా నాయనగారు తలచుకొనిరి. కాని వాస్తవము వేరు.

ఘనమార్గసంగీతము సాధింప ఎల్లవారికిని వీలు కాదు. ఏనుగుబలము, సింహపు గర్జనధ్వనియు కలవారే దాని నామూలాగ్రము సాధించి కడతేరగలరు. ఘనం కృష్ణయ్యరుకు శరీర శారీర బలములు రెండును మిగుల చాలి యుండినది. కావుననే వా రా మార్గమందు మంచి సాధన పొందిరి. సంగీతవిద్వాంసులు శారీరమును మాత్రమే పరీక్షించి చూతురు. ఘనమార్గసంగీతప్రవీణులను వీరు శరీరమును, శారీరమును ఒక్కెడనే చూచిరి. ఈ రెండు బలములును ఒక్కచో చేరినప్పుడే తమ మార్గము పట్టువడు నని వారు తమ యనుభవమున చూచినవారలు గదా?

"ఇకమీద మట్టిపూత పూసి పుష్టి కలిగింప సాధ్యపడునా? ఉన్న దేహమును మెలకువగ కాపాడుకొనిన చాలును" అని మా యవ్వగారు చెప్పిరి. కొన్ని నాళ్లు అట వసించి, పిదప సెలవు పుచ్చుకొని వా రుత్తమదానపురమునకు పోయి చేరిరి.

మా తండ్రిగారి గురుకులవాస మారంభమైనది. ఘనం కృష్ణయ్యరు మనో ధైర్యము అధికారధోరణియు గలవారు. వారు మా నాయనగారిని మిక్కుటమగు ప్రేమతో కాపాడుచుండిరి. అయినను వారిని చాల పనులందు నియోగించుచుండిరి. ప్రతిదినమును మా నాయనగారు తమ గురువుగారి బట్టల నుదికి పెట్టుదురు. వేడి నీళ్లు కాచి యిత్తురు.

ఆ సంస్థానపు జమీందారగు 'కచ్చి కల్యాణరంగర్' అనువారు కృష్ణయ్యరు గారికి ఒక జమీందారు 'హోదా' నొసగూర్చిరి. వారికి అన్నివిధముల సౌకర్యము లమర్చి యిచ్చిరి. కృష్ణయ్యరు గుర్రపు 'స్వారీ' చేయువారు. జమీందారు వారికి ఒక అందమగు గుర్రము కొని యిచ్చి యుండిరి. పల్లకియు నిచ్చి యుండిరి. "మా మామగారికి రాజభోగములు: వారి మేని యందము, ఉదాత్తమగు చూపు, వారి రాజస స్వభావమును రాజుగా పుట్టవలసిన వీరు పొరపాటున బ్రాహ్మణులుగా పుట్టినా రనిమే తోపజేయును" అని మా తండ్రిగారు వక్కాణించువారు.

తమ గురువుగారు గుర్ర మెక్కి పోవుచుండునపుడు కొన్ని వేళల మా నాయనగారు గుర్రపు 'లగాము'ను పట్టుకొని పోవుచుండుటయు కల దట. చిన్న వయసు బ్రహ్మచారియగు వారు ఇటి పనులందు కృష్ణయ్యరు తమ్ము నియోగించుట గూర్చి కొన్ని సమయములందు మనసున వెతనొందుచుండిరి. "రక్తసంబంధము గల చుట్టములు మర్యాదగా చూతురు" అని తాము తలచినదానికి విరుద్ధముగ నుండుట తలచుకొని యేవగించుకొందురు. కాని ఆ దుఃఖము, కోపమును ఉత్తరక్షణము ననే మరుగుపడిపోవును. ఆహారవిషయమునను తక్కుంగల సౌకర్యముల విషయ మునను మా నాయనగారికి ఏవిధమగు కొదవయు లేదు. తమ శిష్యుల దేహము పుష్టి నొందుటకుగాను కృష్ణయ్యరు ఇట్టి పనులను పెట్టి రని నా కిప్పుడు తోచు చున్నది.

సరియగు క్రమమున మా తండ్రిగారు తమ గురువులయొద్ద సంగీతవిద్య యభ్యసించుచుండిరి. పంద్రెండేడుల కాలము ఈ గురుకులవాసము సాగినది.

ఘనం కృష్ణయ్యరుగారికి రానురాను మా తండ్రిగారియెడ ప్రేమ యధిక మాయెను. వారు తా మేగు నెడములకెల్లను తమ శిష్యులను పిలుచుకొని పోవుచుండిరి. జమీందారులయొద్దకును మాటిమాటికి పిలుచుకొనిపోయి పరిచయము చేయించుచు వచ్చిరి.

జమీందారుకును మా నాయనగారియెడల ప్రీతి యుత్పన్న మాయెను. 'వెంకటసుబ్బు' అని ప్రేమ మీర పిలిచి మాటాడి సంతసించుచుండువారు. పిమ్మట 'మాసిక వేతనము' గూడ వారి కేర్పరచిరి.

ఘనం కృష్ణయ్యరు విద్వాంసులు గుమిగూడి యుండిన సభలో పాడెడు వేళల మా నాయనగారిని తమతోడ పాడుమని యాజ్ఞాపింతురు. కొన్ని సందర్భముల వారిని

ప్రత్యేకముగనే పాడించి విని తనియుదురు. ఇట్టి ప్రియహితచర్యలవలన మా తండ్రిగారికి ఉత్సాహము, గాంధర్వవిద్యాపాటవమును పెరుగుచునే యుండెను.

తటాలున ఘనం కృష్ణయ్యరును పేగులు చుట్టుకొనిపోయెడు ఒక వ్యాధి యావహించినది. ముదిమివలన సాజముగనే వారికి శరీరశైథిల్యముగూడ నేర్పడి యుండినది. ఇట్టి పరిస్థితిలో ఉదయార్కాశమునం దుండుటకంటె తమ సొంత ఊరగు తిరుక్కాట్టమునందే పోయి వసించుట లెస్స యని వారికి తోచినది. జమీందారులొద్ద వీడ్కోలందుకొని తిరుక్కాట్టమునకు జని నివసింప మొదలిడిరి. జమీందారు ఆ దినములలో కావలసిన ధనధాన్యాదుల పంపి సహాయపడుచుండిరి. తగు వారిని పంపి యడుగడుగున వారి కుశలవార్తల నరయుచుండిరి.

కృష్ణయ్యరు తిరుక్కాట్టమునకు వెడలిపోయినప్పుడు వారితో మా నాయనగారును బయలుదేరిరి. వారు వ్యాధిగ్రస్తులై యున్నప్పుడు వారికి వలసిన పరిచర్య లన్నియు మా నాయనగారు చేయుచువచ్చిరి. వారి కార్శ్యమును చూచి మిగుల వగచిరి. తమ్ము కాపాడుచు వచ్చిన వారి ప్రేమాతిశయము తలపునకు వచ్చినప్పుడెల్ల కన్నీరు కార్చిరి. కట్టుదిట్టమై సొంపారు వారి దేహము చిక్కి, శైథిల్య మొంది చెన్ను తరిగి యుంట జూచి దుఃఖ మడపలేక ఎలుగెత్తి యేడ్చిరి.

మా నాయనగారి మనోవేదనను ఘనం కృష్ణయ్యరుగారు తెలిసి "నా జీవిత మింతయే యని తోచుచున్నది. నేను మహారాజభోగము ననుభవించితిని. ఇంకను ఇట్లే యనుభవించుట యసాధ్యము. వారివారి కర్మకొలది వారివారికి ప్రాప్తమగును. అంతకుపై ఏమాత్రమేని లభింపదు" అని చెప్పి కొంచెమునేపు మౌనముగ నుండిరి. పిదప "నాయనా వెంకటసుబ్బా, తాటియాకు తీసికొనుము, ఒక కీర్తన చెప్పెదను; వ్రాసికొనుము" అని నుడివి—

"ఓ మూఢపు మనసా, పూర్వజన్మార్జిత మెంతో అంతే ప్రాప్తమగును.

కాని పేరాసతో మిగుల కొరతపడినచో వచ్చునా ?"

అనెడు భావముగల పల్లవితో మొదలిడు భైరవిరాగమం దమర్చిన కీర్తన యొండు చెప్పదొడగిరి. సర్వవిధముల జవసత్వము లుడిగిన ఆ యవస్థలోను ఆ మహావిద్వాంసునకు భగవద్ధ్యానమే ఉత్తారక మనెడు వివేకము తలసూపినది.

"పడినవాడు వెంబడి వచ్చువా రెవ్వరేని కలరా ?
'వయలూరీశ' స్వామిని నిచ్చలు భక్తిమెయి నారాధింపుమా !"

అను భావముగల అనుపల్లవి పాడిరి. వారి మనసు ఉడయార్పాళెమునందుండు 'వయలూరీశర్' అను శివమూర్తియందే లగ్నమై యుండినది. పై మూడు చరణములనుగూడ పాడి పాట పూర్తి చేసిరి. మా నాయనగా రా కీర్తన వ్రాసిరి. ఆ దశయందును ఆ మహానుభావుని సాహిత్యశక్తి ఎదుట వచ్చి నిలువబడియుండుట చూడ ఆశ్చర్యము, 'ఇట్టి పెద్దల పోగొట్టుకొందుమే' అని తలచినపుడు దుఃఖమును కలిగెను. కన్నులవెంబడి యశ్రువు లురుల ఆ కీర్తన వ్రాసిరి. అటుపిమ్మటకూడ ఘనం కృష్ణయ్యరు తాము చనిపోవుటకు రెండు దినములకు ముందు పంతువరాళి రాగమున చిదంబరము ఆనందనటరాజమూర్తివిషయమున—

"చిదంబరస్వామీ, నీ పంచాక్షరదేహాళియందు చిన్మయుడనై
ప్రత్యహము వచ్చి దర్శనముచేసికొందును"
అను భావముతో నారంభమగు ఒక కీర్తన చెప్పి వ్రాయించిరి.

ఘనం కృష్ణయ్యరు జీవితము ముగిసిపోయినది. అప్పుడు మా తండ్రిగారు విలవిలలాడిరి. తమ ప్రియోపాధ్యాయులయెడ వారి కున్న భక్తి వారి జీవితకాలమంతయు వన్నె చెడకుండినది. వేమారులు "అట్టివారిని వే రెవ్వరిని చూడగలము?" అని చెప్పుచుండెడువారు. అప్పుడు వారి కన్నులు చెమ్మగిల్లును.

పిమ్మట మా జనకులు ఉడయార్పాళెమునకు జని జమీందారుల యాశ్రయమున నుండుచు వచ్చిరి. వారును సంస్థానవిద్వాంసులుగనే కొంతకాలము వసించి యుండిరి.



జీవితకాలమంతయు శివపూజ, జపము, మున్నగు కర్మానుష్ఠానములే చేయుచుండి వేరగు నే ప్రయత్నమునందును తగులము లేక అంతర్బాహ్యశుద్ధుడై యొక్కడు గృహస్థజీవనము గడపుట యికాలమున దుస్సాధ మని తోచును. కాని మా మాతామహులు అటుల నుండిరి. కృష్ణశాస్త్రిగా రని వారి నామధేయము.

వారు కావేరీనదియుత్తరతీరభూమిని 'కంజనూరు' అను స్థలమునకు ఈశాన్యమూలగ ఒకటిన్నర మైలు దూరముననున్న 'సూర్యమూలై' అను ఊరిలో నుండిరి. వారు ఋగ్వేదపారంగతులు, శివభక్తిని మిన్నయైనవారు. ఎల్లవేళల వారి

ముఖమునుండి శివనామము సన్నని, తీయని యెలుగుతో నావిర్భవించి వినవచ్చుచునే యుండును. తుమ్మెదల ఝుంకారమువలె నున్న ఆ శివనామోచ్చారణమున బాల్యమందు నేను పాల్గొంటిని. నాకు తెలియకయే నేనును నా యారవప్రాయమునుండియు శివనామజపము చేయదొడగితిని. నేటికిని నిలిచియు, కూర్చొనియు, పవ్వళించియు ఆ జపమే చేయుచు వచ్చుచున్నాను.

చిన్ననాట కృష్ణశాస్త్రిగారినోటినుండి వెలువడు ఆ శివనామపు తియ్యదనము నా హృదయమున మిగుల దృఢముగ నాటుకొనినది. పిదప సంప్రదాయము చొప్పున పెక్కు మంత్రము లుపదేశమందితిని. అన్నిటికిని పూర్వమే నాకు ప్రథమోపదేశముగ నా హృదయమున తానుగ నెలకొనినది శివనామమే. అద్దాని నెలకొన జేసిన ప్రథమాచార్యులు మా మాతామహులు కృష్ణశాస్త్రిగారే.

వారు తమ పదునాల్గవయేట తమ తండ్రిగారినుండి పార్థివపూజయు, స్పటిక లింగార్చనావిధియు నేర్చి పొందిరి. స్పటికలింగమూర్తికి 'చిదంబరేశులు' అని నామధేయము. వారు ప్రతిదినము ఒక లక్ష శివనామజపము చేయుదురు. అరుణము చెప్పి 124 సూర్యనమస్కారములు చేసి సహస్రనామపారాయణము చేయువారు. సూర్యోదయమునకు నాలుగు గడియల ప్రొద్దుండగ ఆరంభించి రాత్రి పది గడియల ప్రొద్దువరకు వారి కాలమంతయు చాలవరకు ఇట్టి వైదికపద్ధతియందే వెళ్లుచుండును.

'సూర్యమూలై' ఇప్పుడు 'సూర్యమలై' అని వాడుకలో నున్నది. కంజనూరుకు ఈశాన్యమూలలో ఆ యూ రున్నది. ఈశాన్యమూలకు 'సూర్యమూల' అని యొక పేరు. అందుచేతనే ఈ పే రేర్పడినది. దీనిని 'సూర్యకోటి' యని సంస్కృత భాషలో వ్యవహరింతురు. ఈ యూరి శివాలయమం దున్న శివభగవానునకు 'సూర్యకోటీశ్వరు'లని నామధేయము. 'సూర్యమూల' పెద్ద నగరము కాదు. పెద్ద యాత్రా స్థలమును కాదు.

కృష్ణశాస్త్రిగారు ఆ గ్రామమందలి 'పళవాఱు' అనెడి యేటి స్నానమునే గంగాస్నానముకంటె మిన్నయని తలంచిరి.

తమ యింటి వెనుకభాగమునను, పడమటి భాగమునను ఉన్న విశాల ప్రదేశములందు పలుతెరగుల పూల మొక్కలను, తీగెలను, పంచబిల్వములను నాటి పెంచుచుండిరి. వానినుండి యనుదినమును పెల్లుగ పూలను పత్రులను కోసి పూజ

యొనర్చెడివారు. అభిషేకమునకు ఆవుపాలను, అర్చనకు బిల్వమును లేనిదే వారు పూజ చేయరు. అర్చావిధికి అలరు లొదవు పూలచెట్లనుబోలెనే అభిషేకమునకు క్షీరము నిచ్చు ఆవులనుగూడ వారు మిక్కిలి ప్రేమతో పెంచుచునుండిరి. సాయం సమయములందు తామే స్వయముగ కసవు కోసి, మోచికొని వచ్చి పశువులకు మేత పెట్టుదురు. వారికి తలపే యున్నచో తమ పొలములందు పైరులు పెంచుచు కాలము పుచ్చవచ్చును. కాని వారి మనస్సు వానియందు పూర్తిగా గొనలేదు. తమకు పూజ కొదవు పూలిచ్చు పూదోటను పెంచుటయందే వారికి మిక్కిలి యాస యుండెను. 'మహాకైలాసాష్టోత్తరము' ననుసంధించి, యా విరులతో నర్చించుటయే వారి కానందము ప్రసాదించెడిది. వారికి ఐదుగురు కూతుళ్లను, ఒక్క కుమారుడును కలిగిరి.



మా నాయనగారికి పెండ్లి సేయ తగిన వధువును వెదకుచున్న మా తాతగారును అవ్వగారును కృష్ణశాస్త్రిగారి స్వభావమును గుర్తెరిగి వారి మూడవ కొమారితయగు సరస్వతిని తమ కుమారునకు పెండ్లి చేసికొను ఏర్పాటు కావించిరి. వివాహము నిశ్చితమైన దని తెలిసి ఉడయార్పాళెముజమీందారు ఆర్థికసహాయము చేయగ మా నాయనగారి పెండ్లి శుభోదర్కమై నెరవేరినది.

ఒకసారి అరియలూరి జమీందారు ఉడయార్పాళెమునకు వచ్చి యుండిరి. వారు ఉడయార్పాళెముజమీందారునకు జామాత. వారు వచ్చినపుడు వారికిని మా నాయనగారికిని పరిచయ మేర్పడినది. మా నాయనగారి సంగీతజ్ఞానమును వారు తెలిసికొని, తమతోడ వచ్చి, అరియలూరులో నుండు డని వేడుకొనిరి. తమ మామగారగు కచ్చి కల్యాణరంగప్పగారికిని తమ యభిప్రాయము ప్రకటించిరి. వారు దాని కొడబడగనే మా తండ్రిగారు తమ కుటుంబముతోడ అరియలూరుకు జని, ఆ జమీందారుల యాస్థానసంగీతవిద్వాంసులుగ నుండదొడగిరి.

ఆ కాలమున మా నాయనగారు తమ సంగీతకళాప్రావీణ్యముతో నెల్లరను సంతోషింపజేయగల నేర్పు సంపాదించియుండిరి. వారికి పలువురు పెద్దల కీర్తనలు కంఠపాఠముగా నుండినవి.

ఇట్టి ప్రావీణ్యముగలవా రగుటచేతనే జనులకు వారియెడ మిక్కుటమైన మతింపు ఉండినది. ఘనం కృష్ణయ్యరుగారి శిష్యులై యుండుటచేతను గొప్పతన మేర్పడెను.

# 5. నా పుట్టుక

ఉత్తమదానపురమున మా తండ్రిగారికి సీమంతోన్నయనము జరిగినది. పిదప మా మాతామహులు మా యమ్మగారిని తమయూరగు సూర్యమూల్లకు ఒక మంచి రోజు చూచి, పిలుచుకొనిపోయిరి. అచ్చట ఆనందసంవత్సరము 'మాఘ' మాసము 9 వ తేది సోమవారము (19-2-1855) రాత్రి నా జననము.

నేను పుట్టిన వెనుక ఐదునెలలు మా తల్లిగారు సూర్యమూలలో నుండిరి. పిదప మా తాతగారు మా యమ్మగారిని నన్నును అరియలూరుకు పిలుచుకొనివచ్చి వదలి పెట్టి పోయిరి. మాకై క్రొత్తగ కట్టించిన యింటిలో నేను మా యమ్మగారితో ప్రవేశించితిని.

ఒక్కొక తల్లియు తన బిడ్డ యదృష్టశాలి యని తలచి మురియుట నెల్లెడల కాంతుము. తనకు కలిగిన యభ్యుదయము లన్నియు ఆ బిడ్డయదృష్టఫలముగనే లభించిన వని కొండాడుట కలదు. మా జననియు నట్లేచెప్పుచుండెను. నేను పుట్టిన యేట 'మాకు' అని అరియలూరిలో నొక యిల్లు ఏర్పడుట నా యదృష్టఫలితమే యని వారు విశ్వసించిరి. అంత మాత్రమేకాదు. ఇరుగుపొరుగున నున్న ఒక సన్యాసి యాసన్నమరణుడై యున్నపుడు "ఆనందసంవత్సరమున ఇట నొక యద్భుతము సంభవింపనున్నది. కాని దానిని చూడకయే పోవుచున్నాను." అని వ్రాకుచ్చి యసువులు బాసిరి.

ఈ దేశమునకు మొట్టమొదలుగా రైలు, తంతి మార్గముల రాకయే వారు (సన్యాసి) చెప్పిన యద్భుతమని యెల్లరు నొడివిరి. అట్టి యద్భుత మేర్పడిన సంవత్సరమే నేను జన్మించుటయు ఒక విశేష మనియే తలచు మా తల్లిగారి యుల్లమున ఒకతీరగు హర్షాతిరేకమును కలిగించియుండనోపును. కాని దానిని వారు బాహాటముగా చెప్పుటలేదు. "ఈలాగున సన్యాసి యొకరు చెప్పిరి. ఆ సంవత్సరముననే

నీవు పుట్టితివి" అని తర్వాతి కాలమున పలుమారులు వాత్సల్యమూర్తి మా జనని ప్రేమ మీర పలికియున్నారు.

నేను పుట్టినపుడు నాకు 'స్వామినాథన్' అని నామకరణము చేయబడెను. 'స్వామిమలై' అనెడు క్షేత్రమున నున్న సుబ్రహ్మణ్యస్వామికి స్వామినాథు లని నామధేయము. మా యూరివారును, పెరవారును ఆ క్షేత్రమునకు పోయి వచ్చు చుండెడివారు. మా కుటుంబమువారికిని అందులో సంబంధ మధికము. దానినిబట్టియే నాకు ఆ పేరు పెట్టిరి. అందరును నన్ను 'శామా' అనియే పిలుతురు.

మేము అరియలూరిలో నున్న రోజులలో మా పినతండ్రిగారికి వివాహము జరిగినది. 'మాయూరము' నందు 'మహాదానవీథి' లో నుండిన 'శేషయ్యరు' అను వారి కొమార్తెయగు 'లక్ష్మి'ని వారు పెండిలియైరి.

ఆ వివాహమునకు ముందును, వెనుకను మా నాయనగారు కొన్ని మారులు మాయూరము వెళ్లవలసివచ్చెను. ఆ దినములలో అచట గోపాలకృష్ణ భారతి యారు నివసించుచుండిరి. వారితోడి పరిచయము నాయనగారి కేర్పడెను. భారతియారు కొంతకాలము ఘనం కృష్ణయ్యరువద్ద సంగీతశిక్ష వహసినవా రగుటవలన, ఆ విద్వాం సుని శిష్యుడును, చుట్టమును అగు మా తండ్రిగారియెడ వారికి మిక్కుటముగ ప్రీతి జనించెను. మా తండ్రిగారిని వారు చూచినప్పుడెల్ల ఘనం కృష్ణయ్యరుకీర్త నలు పాడించి విని యానందింతురు. ఇరువురును సంగీతసంబద్ధసంభాషణలతో కాలము పుచ్చుచుండువారు. ఇరువురును శివభక్తులే అద్వైతవేదాంతశాస్త్రపరిచితి గలవారే.

ఆకాలమున గోపాలకృష్ణ భారతియారు 'నందనార్'చరిత్రకీర్తనలు రచియించి ప్రఖ్యాతి గడించియుండిరి. పలుచోటుల ఆచరిత్రనుగూర్చి యుపన్య సించుచుండిరి. తమిళదేశమందంతటను నందనారుచరిత్రమునకు ప్రసిద్ధి వచ్చి యుండెను. మాయూరమునకు మా తండ్రిగా రెప్పుడు పోయినను భారతియారును చూడక తిరిగిరారు.

భారతియారుతో పరిచయ మేర్పడిన తరువాత నందుని (నందనార్) చరిత్ర యందలి కీర్తనలలో కొన్నింటిని మా నాయనగారు తమ రామాయణోపన్యాసముల నడుమ పాడి వినిపించుచుండిరి. ఆ కీర్తనల ప్రసన్నశైలియు, అం దమరియున్న భక్తిరసమును విన్నవారి యుల్లముల నిల్పె నాచుకొనుచుండెడివి.

నా చిరుతప్రాయమున నాకుండిన యలవాటొకటి మా యమ్మగారు చెప్పియున్నారు. నేను ప్రొద్దుట లేచునపుడే నాకేదైన తిండి పెట్టవలెను. రొట్టె, బిస్కత్తులవంటి తినుబండారములు ఆరోజులలో లేవు. మాతల్లిగారు ఒక 'గరిటెయప్పము'ను పోసి, చేసి యొక యాకుమడతలో నా పడుకప్రక్కన నుంచి, ఒక పాత్ర బోర్లించి దానిని దాచియుంతురట. నేను లేచినవెంటనే ఆ పాత్రను ఒక తన్ను తన్ని లోపలనున్న 'గరిటెయప్పము'ను ఆరగించెడువాడనట. ప్రొద్దుట ఏ పని చేయ మరచినను నాకై యా గరిటెయప్పమును చేసిపెట్టుటమాత్రము మా యమ్మగారు మరచిపోరట. గరిటెయప్పమును తిన్న కొంచెమునే పయినపిమ్మట చలిది యన్నము తినుటయు గలదు.

మే మరియలూరిలో నుండగా మా తాతగారికిని, అవ్వగారికిని ముదిప్రాయపునొడలి సడలింపు మిక్కిలియాయెను ఏ సమయమున తమకు మరణము సంభవించునో యని మా తాతగారు కలత చెందియుండిరి. తరతరములుగ నుండిన యూరు వదలి వేరొక యూరికి వచ్చియుండుటయందు వారికి తృప్తి కలుగలేదు. గత్యంతరము లేకుండుటచేత అరియలూరికి వచ్చియుండిరి, అయినను వచ్చినయూరిలో నుండుటను వారిచ్చగింపలేదు. "మన యూరిలో మన యింటి బంధుగులు చుట్టుకొని యుండుచోట మృతి నొందవలెను" అనియే వారి యభిలాష. నదీతీరము నానుకొనియున్న యుత్తమదానపురము వీడి 'అడవికొంప'లో అసువులు బాయుట తలపునకు రాగనే వారికి దుఃఖావేశము పొంగి పొరలివచ్చును.

ఒక దినము మా తాతగారు మా నాయనగారియొద్ద తమ యభిప్రాయమును తెలియజేసిరి. కుటుంబభారమున నలిగియున్న వారి మనస్సుకు మిక్కిలి దుఃఖమాయెను. "ఏదో ఒక విధముగ ఇటకు వచ్చి నెలకొని జీవింప నారంభించితిమి. దైవానుగ్రహమున అప్పులపాలు గాక తమ్మునకు వివాహము జరిపించితిమి. ఊరికి పోయినచో మన మెట్లు కాలక్షేపము చేయగలము?" అను విచారములో మునిగిపోయిరి.

మా తాతగారో మరల మరల తమ యభిప్రాయమును నొక్కి నొక్కి చెప్పుచుండిరి. వార్ధకమున వారి కున్న యాసను నెరవేర్పక యుండుటయు పాపమే అను తలపును మా తండ్రిగారి కుండెను. 'ఇరుగడల విప్పంటుకొనిన కొరవిమీది చీమ' వలె దిక్కుతోచక కలతచెందిరి. తమ కన్నవారిని ఉత్తమదానపురమునకు పంపి

వేయుదమా యనియు తలచినారు. అవసానకాలమున కుమారుడు తమ దగ్గర నుండవలె నని కోరియే మా తాతగారు ఉడయార్పాళెమునకును, పిదప అరియలూరు నకును వచ్చియుండిరి. కావున తమ్ము వదలి వా రుండుట అరుదు అని యాలోచించి చూచిన మా నాయనగారు "ఏ విధముగనైనను సరియే, వారి యభిలాష నెరవేర్చుటయే మన విధ్యుక్తధర్మము" అను నిర్ణయమును పూని, అరియలూరు జమీందారులయొద్దను, తక్కిన మిత్రులయొద్దను సెలవు పుచ్చుకొని తమ కుటుంబము తోడ ఉత్తమదానపురమునకు వచ్చిచేరిరి.

అప్పటికి వచ్చిన తరువాతకూడ కొన్ని యేండ్లు మా యవ్వగారును, తాతగారును జీవించియుండిరి. నడుమ నడుమ మా తండ్రిగారు గ్రామాంతరములకు వెడలి రామాయణోపన్యాసము లిచ్చి ధన మార్జించి వచ్చుచుండిరి.

# 6. చిన్ననాటి చదువు

నా కైదవ యేడు జరుగుచుండ అక్షరాభ్యాసము చేయించిరి మా తాతగారు బాలశిక్ష నేర్పిరి. మొదట ఉత్తమదానపురమునందు 'నారాయణయ్యరు' అనువారి యొద్ద కొన్ని నెలలును, పిదప 'స్వామినాథయ్యరు' అనువారియెడ నొక కొన్ని సంవత్సరములును చదివితిని. తమిళమున భిన్నముల లెక్కలను, ధాన్యమానములు మొదలగు వానిని, సంస్కృతమున కొన్ని గ్రంథములను చదివితిని. పాఠశాలల యందు చదువుటతోబాటు ఇంటిలోను మా తాతగారు, మా నాయనగారు, పినతండ్రిగారును నాకు విద్య కరపుచు వచ్చిరి.

నారాయణయ్యరు ఎంచుమించు ముప్పదైదేడుల వయసువారు. మంచి యాకృతి గలవారు. వారిని కాంచినపుడు నాకును తక్కిన బాలురకును భయము పుట్టును. వారు హెచ్చుగ ప్రేపబెత్త ముపయోగింతురు. వారిని తలచుకొనినప్పుడెల్ల వారి బెత్తముదెబ్బలే నా స్మృతికి తగులుచుండును

వారి పాఠశాలలో అగ్రహారపు పిల్లవాండ్రును, కాపువీథిబాలురును చదివిరి. దండించుటలో వా రెవ్వరియెడలను పక్షపాతము చూపరు. పిల్లవాండ్రలో 'పిచ్చు'

అను వాడొక డుండెను. వాని తండ్రి ధనికుడు. కావుననే యతనికి కొలదిపాటి గర్వము, ధైర్యమును ఉండినవి. ఉపాధ్యాయుడు తనను కొట్ట వచ్చినపుడు వా దెదురుదెబ్బ తీయ కడగును. మోటుతనముతోడ ఒడ్డల నదల్చి యదచి యేలుట యరుదని యా యుపాధ్యాయులు తెలిసికొనలేరైరి. వారికి తమ చేతిబెత్తమే 'న్యాయదండము'గ నుండినది. పిల్లవాండ్రెల్లరును తమ దండనకు లోబడి యూడగ, 'పిచ్చు' మాత్రము దాని నెదురించుచో వా రూరక విడుతురా? పైపై మిక్కిలి కఠిన దండనల పాల్పడ జేసిరి. వా దేపాటియు నణగలేదు. పిదప వానిని పాఠశాలనుండియే తొలగించివేసిరి. అతనికి లభించిన విడుదల మనకును లభింపకుండునా యని యాస పడిన విద్యార్థులును గలరు.

పాఠశాలబెడదనుండి తప్పించుకొనిన పిచ్చు అటుపిమ్మట తన చదువును గురించి తలపనే లేదు. తరువాతి రోజులలో చేవ్రాలు చేయుట తప్ప వే రేదేని చదువను వ్రాయను చేతగానివాడుగనే ఉండిపోయెను. అయిన నేమి? పిచ్చుఅయ్యరు కలవారి కొడుకు. అతనికి చదువున్న నేమి? లేకున్న నేమి?

నారాయణయ్యరు బాలశిక్ష, ఎక్కములు మొదలగువానినే నేర్పింతురు. వారియొద్ద నేర్చిన తరువాత నేను స్వామినాథయ్యరుపాఠశాలలో చేరితిని. అప్పటనే తాటాకులమీద వ్రాయుట నేర్చితిని. ఆరోజులలో కాగితము పాఠశాలలవరకు రాలేదు. 'స్లేటు' కూడ లేదు. మొదట పిల్లవాడు ఇసుకపై దిద్ది యలవరచుకొనవలెను. పిదప నతడే గంటముతో తాటియాకులపై వ్రాయ నేర్వవలయును.

స్వామినాథయ్యరు సంగీత సాహిత్యములు నేర్చినవారు. వారు నాకు సంక్షేప రామాయణము, విష్ణుసహస్రనామము, నీతిసారము, అమరము మూడు కాండలును బోధించిరి. అవన్నియు నాకు కంఠపాఠముగా నుండినవి. తమిళము, లెక్కలును నేర్పిరి. వారు నారాయణయ్యరువలె కఠినాత్ములు కారు. అయినను, ఆ కాలపు గ్రామోపాధ్యాయులకు 'చేత బెత్త మాడకయున్న పిల్లవాండ్రు చదువరు' అను అభిప్రాయము పరంపరాప్రాప్తముగ వచ్చుచుండినది. వీరిదికూడ అదే పరిపాటి.

ఆటవిడుపు దినములలో తోడి విద్యార్థులతో ఆడుకొనుట నా కలవాటు. అయినను మా నాయనగారిని కన్మొరగి యాడుకొందును. వారి కంట బడిన దండింతురు అను భయ ముండెడిది. పాఠశాలలో చదువుటయ గాక నే నెల్లప్పుడును ఇంటిలోకూడ చదువుకొనుచునే యుండవలె నని వారి యభిలాష.

నా యారవ యేటనే నాకు సంగీతమం దభిరుచి యబ్బినది. అనువంశికముగ మా సొంత సొత్తగు ఆ కులవిద్యయందు నా కవ్యాజమగు నభిరుచి యుండుట తెలిసి మా పినతండ్రిగారు సరళి - వరుసలు కరపిరి. వారును, మా నాయనగారును పాడుచుండ విని విని యట్లే పాడుటకై పాటుబడుచుంటిని.

చిత్తరువులు వ్రాయుటయందును, అప్రేరితముగనే ప్రయత్నించుచుంటిని. కాగితములను పలువిధముల కత్తిరింపులతో పుష్పరూపముల నేర్పరచు నలవాటు, నేర్పును ఏర్పడెను. పలురకముల మృగములను పక్షులను చిత్రింతును. హంసల వలెను, ఏనుగులవలెను చిత్రములు గీయుదును. కొందరు దేవుళ్ల బొమ్మలను వేయుదును. ఏ గుడి, గోపురము కాంచినను అచట నున్న చిత్రముల శిల్పముల మీదకు నా మన స్సురుకును. ప్రతివిషయమును సావధానముగ పరిశీలింతును.

రాత్రివేళల మా యూరిలో నడచు పురాణప్రవచనము వినుటవలనను, మా పినతండ్రిగారి బోధనలవలనను, నాకు కొన్ని పురాణచరిత్రలు తెలియ నాయెను. ఆ బోధమువలన దేవాలయములం దుండు చిత్రముల కనుగొని యాథార్థ్య మరసి యానందింపగల వివేక మేర్పడినది.

ఒకసారి మా జనకులు నన్నును, మా యమ్మగారిని 'స్వామిమల'కు పిలుచుకొనిపోయిరి. అట గుడికి పోయి స్వామిదర్శనము చేసికొంటిమి. దేవాలయమందు పైకప్పురాలపై పలు చిత్రములు మిగుల సుందరముగ చిత్రింపబడి యుండినవి. నేనును మా నాయనగారును తదితరులును వానిని గమనించుచుంటిమి. ఒక చిత్తరువునందు ఒక పెద్దవారు చేతులు కట్టుకుని నోటిపై చే యిడుకొని వినయ భావముతోడ నిలువబడి యుండిరి. సమీపమందే యొక బుడుతడు ఆసనమున నమరి యుండెను. "ఈ చిత్రము తెల్పెడు భావ మేమి?" అని మా తండ్రిగారు ఆలోచించుచునే తేరి పార జూచిరి. "సుబ్రహ్మణ్యస్వామి పరమశివున కుపదేశించుట యగునేమో" అని నే నంటిని. మా నాయనగారి మోమున ఆనంద ముప్పొంగెను. నన్ను గ్రుచ్చి యెత్తి యక్కున నొత్తికొనిరి. కుమారస్వామి శివ భగవానునకు ఉపదేశము చేసిన అయ్యవసరమే సామిమలకు సంబంధించిన ఐతిహ్యము.

ఎడనెడ మా తల్లిగారు తమ జన్మస్థలమగు సూర్యమూలకు నన్ను తీసికొని పోయి వత్తురు. మా మాతామహుల నిత్యకర్మానుష్ఠానతత్పరత్వము, శివపూజాప్రవణత,

శాంతస్వభావమును గమనించుచు రాగా వారియెడ భక్తి యుప్పతిల్లినది. వా రారాధనము నెరవేర్చి పగలు రెండు గంటలవేళ భుజింతురు. అప్పుడు వారితోబాటు నేనును భుజింతును. అట్లు భుజించువేళ నా కొక విధమగు నానందము కలిగెడును; ఒడలియందు ఒక క్రొత్త వేరుపాటు తోచును. భగవత్ప్రసాదము పుచ్చుకొనుచున్నా మను తలపే దానికి మూలము. వారి యంతర్బాహ్యశుద్ధి నా యుల్లమును ప్రసన్నముగ జేసినది.

వేకువజామున, అపరాహ్ణమున, రాత్రివేళలందును వారు సేయు శివనామాను సంధానము నా చెవుల బడును. అది మెలమెల్ల నా యుల్లమున నెలవుకొనినది. నేనును అందు భాగస్వామినై తీరుబడివేళల శివనామజపము చేయుచునుంటిని.

ఒకనాడు నేను శివనామజపము చేయుచుండగ మా మాతామహులగు కృష్ణశాస్త్రిగారు దాని నాలకించి యబ్బురపడిరి. అప్పుడు వారికి నాయెడ కరుణ యుదయించెను. వెంటనే వారు మృత్యుంజయస్తోత్రశ్లోకములు పదునారింటిని నా కుపదేశించిరి. మార్కండేయుడు ఆ స్తోత్రప్రభావముచే చిరజీవి కాగలిగి రని పురాణగాథను వినిచి "నాయనా, ఈ మంత్రమును ప్రతిదినమునను సూర్యాస్తమయమునకు పిదప ఒక్కొక్క శ్లోకముగ చదివి శివధ్యానము చేసి ప్రణమిల్లుదువేని సుఖియింతువు. ఆయుర్వృద్ధి కలుగును" అని కట్టడ యిడిరి. వారి యాన చొప్పుననే ప్రతిదినము చేయగలిగితిని. కొన్ని యేండ్లక్రితమువరకును నమస్కారము చేయ సాధ్యపడినది. కొంత కాలముగ శ్లోకములుమాత్రము పారాయణ చేయుచున్నాను.

ఆ కాలమున ఇంగ్లీషుచదువు గ్రామములదనుక రాలేదు. పట్టణములందు కొన్ని విద్యాశాలలలో ఇంగ్లీషుబోధ చేయుచుండిరి. ఇంగ్లీషుతెలిసినవారికి ఎల్లలేని గౌరవ ముండినది. అరకొరగ నెరిగినవారికికూడా సులభముగ నేదేని యుద్యోగము దొరకును.

గ్రామ పాఠశాలలందు తమిళసంఖ్యలే వాడుకలో నుండినవి. బాల్యమున వానినే నేను నేర్చితిని.

ఉత్తమదానపురమున మేము నివసించు నపుడు నా కుపాధ్యాయులుగ నుండిన స్వామినాథయ్యరింటికి వారి చుట్ట మొకరు తడవతడవకు వత్తురు. వారికి 'శివ

స్వామి అయ్య'రని పేరు. వారు ఇంగ్లీషునేర్చినవారు. వారు వచ్చినవేళ మా యుపాధ్యాయులు నాకు ఇంగ్లీషుఅక్షరములు నేర్పవలె నని వారిని వేడుకొనిరి. అట్లే వారు నేర్ప నేను వానిని నేర్చుకొంటిని. ఇంగ్లీషుసంఖ్యలు (1, 2 మొదలగువానిని) గూడ వారియొద్దనే యభ్యసించితిని.

ఇంగ్లీషు అక్షరములు తెలిసికొనినపుడు నాలో నుండిన 'ధీమా' ఇంతిం తన రాదు. ఆ యక్షరముల కంతటి ప్రభావ ముండినది. వట్టి యక్షరములు తెలిసికొని నంత మాత్రమున తాము గొప్ప యనుకొనుటయు, ఇంగ్లీషులో సంతకముమాత్రమే చేయ నేర్చి తృప్తిపడుటయు ఆ రోజులలో మిక్కుటముగ కనబడుచుండెను.

నా కారవయేడు సాగుచుండగ మా యవ్వగారు మిగుల ననారోగ్యముపాలైరి. వారు రౌద్రి సంవత్సరము 'వైగాశి'నెల (1860) భౌతికదేహము త్యజించిరి. దానికి సరిగ ఒక సంవత్సరమునకు పిదప - అనగ దుర్మతినామసంవత్సరము వైగాశి నెల (1861) – మా తాతగారును ఇహలోకజీవనము చాలించిరి.

తమ తల్లిదండ్రులు గతించినపిమ్మట "ఇక మనము యథాపూర్వముగ అరియలూరికి పోయి కాలక్షేపము చేసిననే ఒక విధముగ కష్టము తీరును" అను ఉద్దేశము మా నాయనగారికి కలిగెను.

దుర్మతిసంవత్సరము 'ఐప్పశి'నెల (1861) అరియలూరు పోయి చేరితిమి.

# 7. అరియలూరుజీవితము

మా రాక విన్న ప్రాతమిత్రులు మిక్కిలి సంబరపడిరి. పలువు రేతెంచి మా తండ్రిగారిని చూచి ప్రీతితో ముచ్చటలాడి వెడలిపోయిరి. అప్పుడు నాకు ఏడవ యేడు నడచుచుండుటచేత లోకములోని దృశ్యములు, సంభవములును నా లేతయెడదలో నెలకొన్నవి. నే నా దినములలో కాంచిన ప్రదేశములు, చూచిన మనుష్యులు, ఏర్పడిన సంభవములును నాకు క్రొత్త యానందమును, ఉత్సాహమును ఒదవజేసినవి. అరియలూరే నా పాలిటి మహానగరము. ఆ యూరి జమీందారే కథలలో వినిన రాజు.

అరియలూరికి పోయిన పిదప 'కృష్ణవాధ్యార్' అనువారియొద్ద మొదట చదివితిని. వారు వృద్ధులు. వారియొద్ద పలువురు బాలురు చదువుకొనిరి. వారికి తమిళకావ్యములందు పరిచయ ముండెను. 'ఆత్తిచూడి', 'మూదురై', 'మణవాళ నారాయణశతకము' మొదలగు శతకములును, 'రత్నసభాపతిమాలై', 'నాలడి యార్', 'కుఱళ్' మున్నగు వానిని, లెక్కలను వారి యొద్ద నేర్చుకొంటిని. 'నాలడియార్', 'కుఱళ్' అను గ్రంథములు అంత చిన్నవయసున బాగుగ భావ మెరిగి నేర్చుకొనుట అసాధ్యము. అయినను వానిని 'కంఠతః' పెట్టుడని కృష్ణవాధ్యార్ విద్యార్థులను నిర్బంధింతురు. గంటముతో తాటాకులమీద వ్రాసియు, మడ్డి కాగితము లపై 'కాకిపెదురు' పేనాతో వ్రాసియు దిద్ది తీర్చినట్లుగ వ్రాయ నేర్చుకొంటిని. చేతివ్రాత చక్కగా లేనిచో బొటనవ్రేలిమీద ఉపాధ్యాయులు గుండ్రమైన గంటముతో కొట్టుదురు. వారియొద్ద చదివినవా రెల్లరును వ్రాయుటలో మంచి యలవాటు సంపా దించిరి.

వారియొద్ద చదివిన గ్రంథము లన్నియు నాకు ముఖస్థములు. ఇంటిలోను మా నాయనగారు పాఠములను గూర్చి పరామర్శింతురు. దినమునకు ఐదు పద్యములు చొప్పున వల్లెవేసి వారికి అప్పజెప్పవలెను. లేనియెడల వారి శిక్షకు లోబడవలసి వచ్చును.

నా విద్యావ్యాసంగవిషయమున మా నాయనగారికి మనసున దిగు లుండినది. నన్నును సంగీతమార్గమున అలవరచవలె ననియే వారు తలచి యుండిరి. ఆకాలపు సంగీతవిద్వాంసుల కెల్లరకును తెలుగుభాషలో పరిచయ ముండినది. తమిళము, తెనుగు, సంస్కృతము — ఈ మూడు భాషలయందును గల కీర్తనలు వారు పాడు చుండువారు.

సంగీతవ్యాసంగమునకు తెనుగు సహాయకారి అను తలపుచేత మా నాయన గారు కృష్ణవాధ్యార్‌పాఠశాలనుండి తొలగించి, నన్ను వేరొక పాఠశాలలో చేర్పిం చిరి. దాని పెత్తనదారగు 'ముత్తు వేలాయుద పండారం' అను వీరశైవులు తెనుగు కూడ నేర్పుచు వచ్చిరి. వారియొద్ద తెనుగు కొలదిగ నేర్చితిని

సంగీతమందును, తమిళమునందును నా బుద్ధి చొచ్చుకొనిపోయినట్లు తెనుగున చొచ్చుకొనలేదు. నా పరిస్థితి నవగతము చేసికొనిన మా నాయనగారు కొంచెము విచార మొందిరి. "నీవు దేనికిని కొరగాని వాడవు. పాచకవృత్తికి గూడ ఉపయోగపడవు"

అని నన్ను కసరిరి. నాడు వారు ఆడిన మాటలు నా హృదయమును గాయపరచినవి. నే నేమి చేయుదును? నాకు చదువుపై నభిలాష యుండినది. తమిళభాషయు, సంగీతమును నాకు సంతోష మొదగూర్చినవి. తెలుగులో నట్టి యానందమును నేను కనుగొననైతిని. నాకును దానికిని చాల దూర మను భావము ఆరంభమునుండియే ఏర్పడియున్నది. నేను కావలె నని దానిని చీదరించుకొనలేదు.

తెలుగు నేర్చుట వ్యర్థప్రయాస నని గుర్తెరుగుటచే మా నాయనగారు నన్ను పాఠశాలకు పంపక నిలిపివేసిరి. ఇంటిలో తామే శతకములను, తక్కిన గ్రంథములను నేర్పుచు వచ్చిరి. సంగీతమందును సరళి వరుసలు, అలంకారములు మున్నగు వానిని నేర్పిరి. నేను కొలదిపాటిగనైనను అలసుడనై యున్న కఠినముగ శిక్షింతురు. వారు విధించు దండనలతో నేను మిగుల దుఃఖించెడువాడను. నా కష్టములు చూచి మా తల్లిగారును మిగుల వగచెడివారు

మా తండ్రిగారు చెప్పిన చొప్పున 'బడి చదువు' మాని ఇంటియొద్ద చదువుకొనుచుంటిని. తెలుగు, సంస్కృతమును నన్ను వీడి చాల దవ్వేగినవి.

నే నెందుకును పనికిరానివాడను కాకూడ దను విచారముచేత నే నేదేని జీవికకు పనికివచ్చు విద్య నేర్వవలె నని మా నాయనగారు కోరిరి. అరియలూరిలో నుండిన 'తిల్లై గోవిందపిళ్లై' అనువారియొద్ద నన్నప్పగించి గ్రామపు లెక్కలు వ్రాయు పనిని నేర్పు డని వారిని వేడుకొనిరి. నేను వారియొద్ద నుండి వారు చెప్పెడు చొప్పుననే నడచుకొనుచు లెక్కలు నేర్చుకొనుచుంటిని.

ఇట్లుండగ నొక సమయమున 'పెద్ద తిరుక్కున్నము'న మా యత్తకొమారునకు ఉపనయనము జరిగినది. అందుకు మా తల్లిదండ్రులును, నేనును పోయియుంటిమి. చుట్టాలలో పలువురు 'హాజ'రైరి.

ఆ విశేషసమయమున సంగీతవిద్వాంసు లొక్కరు 'పాటకచ్చేరి' చేసిరి. వారు 'గోపాలకృష్ణ భారతియారు' రచించిన కీర్తనలుగూడ పాడిరి. తమిళదేశము నలుగడల వ్యాప్తి చెందియున్న 'నందనారుచరిత్ర'నుండి కొన్ని పాటలు పాడిరి.

కానడారాగమం దున్న,

''అగ్గిలో మున్కలిడినారు 'తిరునాళ్లకు పోవువారు' (నందనారు)

అగ్గిలో మున్కలిడినారు...''

అను భావముగల కీర్తనను మిక్కిలి చక్కగ పాడిరి. వారు పాడిన 'బాణి' నా మనస్సున స్థిరముగ పాదుకొనినది. ఆ కీర్తనయు నాకు కంఠపాఠ మైనది. మా తండ్రిగారు నేర్పకయే కొన్ని పాటల నిట్లు వినియే నేర్చుటయు కలదు. వానిని నేనే పాడుకొనుచుందును. ఇతరు లెవ్వరియొద్దనైనను పాడి వినిపింతును. మా నాయనగారి సమక్షమునమాత్రము పాడుటకు జంకుదును. "చిన్ని కుఱ్ఱడు పాడుచున్నాడు" అని తక్కినవారలు నన్ను కొనియాడి యుత్సాహ మొదవింతురు.

ఒక దినమున ఆ ఉపనయనమునకు వచ్చియుండిన కొందరియెడ నా సంగీత కౌశలమును ప్రదర్శించుచుంటిని. "ఏదీ. 'అగ్గిలో మున్క లిడినారు' అను పాట పాడు" అనినా రొక్కరు. నా కా కీర్తన పాడుట యన నెంతో యుత్సాహము. కావున దానిని చేతనయినంత చక్కగ గానము చేసితిని. దానిని చాటున దాగి యుండియే మా నాయనగారు వినుచుండిరి. నా సంగీతవిద్యాభిలాషయు, నాకు దాని యందుగల ప్రత్యేకాభ్యాసమును వారి కప్పుడే తెలియవచ్చెను. తెలుగుతోబాటు సంగీతముగూడ మరచిపోవుదు నని తలచిరో యేమో నే నెరుగ; నాడు వా రొక క్రొంగ్రొత్త తృప్తి వడసిరి.

తరువాత వా రెదుట పడిరి. నేను సంకోచముతో పాట నిలిపితిని. "భయ పడకు. పాడు. నీకు సంగీతము చక్కగ వచ్చున ట్లున్నదే" అని వారు సెల విచ్చిరి. వారికి కల్గిన తృప్తి యా మాటలందును, విప్పారిన వారి మోమునందును బయట పడినది. నాడే మా తండ్రిగారికి వే రెవ్వరిమూలముననైనను నాకు సంగీతము, తమిళము నేర్పింపవలె నను తలంపు కలిగెను.

మా తండ్రిగారి మిత్రులగు అరియలూరు శఠకోపయ్యంగారు సంగీతమునను, అరవమునను పండితులు. వారు వీణావాదనమునను ప్రవీణులు. కొన్ని వేళల మా తండ్రిగారు పాడుచుండగా వారు వీణ వాయించుటయు గలదు. ఇరువురును సంగీతవిషయమున మనసులు కలిపి మాటాడుకొనుచుండుట యలవాటు.

శఠకోపయ్యంగారే నాకు తగిన గురువు లని మా నాయనగారు నిర్ణయించిరి. అరియలూరికి వచ్చిన వెంటనే ఒక దినము నన్ను వారియొద్దకు పిలుచుకొనిపోయి "వీనికి సంగీతమందును, తమిళమందును ప్రీతి యున్నది. వేరు విషయముల మీదకు వీని మనసు పోదు. నే విన్నాళ్లు నేర్పితిని. ఇకపై నేర్ప వలనుపడలేదు.

మీరు వీనిని మీ ఛాత్రునిగా స్వీకరించి రెండు మార్గములందును పరిశ్రమింప జేయవలెను" అని యడిగికొనిరి. వెంటనే వారు మిక్కుటపు మక్కువతో చేరదీసిరి.

మా నాయనగారు నన్ను శఠకోపయ్యంగారి కప్పగించుటకు ముఖ్యహేతువు నాకు సంగీతమున మంచి యభ్యాసము కలుగవలె ననియు, దానికి సహాయకారిగ తమిళభాషాజ్ఞాన ముపయోగపడవలయు ననియు కోరుటయే. కాని నా విషయమున ఆ పద్ధతి మారిపోయినది. తమిళమున అధికపరిచయమును, దాని కుపయోగపడు చందమున సంగీత ముండవలె ననియు నా యభిలాష. శఠకోపయ్యంగారివద్ద నే నేనాడు శిష్యుడనుగా జేరితినో, ఆనాడే ద్రావిడభాషాజననీకరుణారసపూర మున మునిగి తేలినవాడ నైతిని. నాకు తమిళమున రసాస్వాద మేర్పడునటుల విద్య గరపిన ప్రథమాచార్యులు శఠకోపయ్యంగారే. బొమ్మలను జూపి బుడుతల లేత యెడదల నాకట్టుకొనునట్లు తమిళపు పద్యములలోని నయగారము లెత్తి చూపి నా హృదయమున ఆ లేబ్రాయమున తమిళపు విత్తు విత్తినవారు వారలే.

శఠకోపయ్యంగారు చామనచాయవారు, పొట్టి, కొంచెము స్థూలకాయులు, బల శాలి. వారు మాటాడునపుడు వారి గొంతుక కొంచెము 'బొంగురు'గ నుండును. కాని పాడునపు డది మరగిపోవును. తమిళములోని సారస్య మెరిగి చదివినవారు.

పాఠములు నేర్పుటలో వారి కభిలాష మెండు. వేకువన అయిదు గంటలకే వారు మేల్కాంతురు. నిత్యకర్మానుష్ఠానము విశిష్టముగ నెరవేర్తురు. పిమ్మట పుస్తకములు తీసికొని, తమ యింటి బయటి యరుగుచివర కూర్చొందురు. ఏదేని గ్రంథము చదివి రసాస్వాద మొనర్చుకొనుచునే యుందురు. ఆ దారివెంబడి పోవు-వారు వారికి తలవంచి పోవుచుందురు. కొందరు మరియాదగ వచ్చి తిన్నెపై కూర్చొందురు. వెంటనే వా రేదేని యొక తమిళపద్యము చెప్ప నారంభింతురు. నయముగ భావము వివరింతురు. వచ్చినవారు విని యానందింతురు. వా రుండుచోటు వెదకికొని వచ్చి వారి తీయని తమిళప్రసంగము విని పోవుచుండువారు పలువురు. 'శొప్పైచ్చ్వాడువార్' భాగవతమందును, అద్వైతవేదాంతమునందును వారికి పరిశోధన మెండు. ఆ గ్రంథములోని పద్యములను చెప్పి, గంటలతరబడి అర్థ వివరణము చేయుచుందురు. ఆలకించుచుండువారికి కాలము గడచుటే తెలియదు. ఏదియో ఒక వీనుల విందగు పాటకచ్చేరి వినుచున్నట్లే యుండును.

వారియొద్ద కొందరు క్రమముగ పాఠములు వినుచు వచ్చిరి. ఒక్క దినమైన విడువక తిన్నెపై కూర్చుండి, వచ్చినవారికి పాఠములు చెప్పుటయందు వారికి చల నమే లేదు. "స్తంభము నిడుకొనియైనను పాఠము చెప్పవలెను. వినెడువానిని మాత్రమే యుద్దేశించి చెప్పరాదు. పాఠములు బోధించుటవలన కలిగెడు మొదటి లాభము మనది. పాఠములు చెప్ప జెప్ప మన జ్ఞానము దృఢపడును." అను చుందురు.

ఒకనాడు వారు తమ యింటి యరుగుపై నుపవిష్టులై యెవరికో చాలసేపు పాఠము చెప్పుచుండిరి. అప్పు డెదురింటిలో మేము కాపుర ముంటిమి. అలవాటైన గొంతుకతో వారు పాఠము చెప్పుట లేదు. కొంచెము బిగ్గరగ చెప్పుచుండిరి. మధ్య కొంచెమైనను విరామము లేక వారు చెప్పుకొని పోవుచుండగ మా యింట నున్న నా కొక సందియ ముదయించెను. "వీ రెవ్వరికి పాఠము నేర్పుచున్నారు? వినువారు నడుమ సందేహము లడుగరా?" అని తలపోసి తొంగిచూచితిని. మిక్కిలి యక్కజ పడితిని. 'గోపాలస్వామిఅయ్యంగారు' అనువా రొకరు శఠకోపయ్యంగారుకు ముందు ఆసీనులై యుండిరి. 'ఆసీనులై యున్నా'రని మాత్రము చెప్పవచ్చునే గాని, వినినా రని చెప్ప వీలు కాదు. వారికి 'బ్రహ్మచెవుడు'. శఠకోపయ్యంగారి కా విష యము తెలియును. అప్పుడు "కంబము నెదుట నిడుకొనియైనను చదువు చెప్ప వలెను" అను వారి మాట నాకు స్మృతికి వచ్చినది. స్తంభమైన నేమి? మహాబధిరు లైన నేమి?

'చదువే పరమసుఖము' అనుకొని జీవిక సాగించుచుండిన వారు దారిద్ర్యా - వస్థయందే యుండిరి. అందున వారి మనస్సు చలింప లేదు. అరియలూరు సంస్థా నపు పరిస్థితి రాను రాను క్షీణదశ నొందుచుండుటచేత వారికి దాని ప్రాపు సన్న గిల్ల జొచ్చెను. తమ శిష్యుల సాయమునే యాధారముగ జేసికొని జీవిక గడపు చుండిరి.

సాయంకాలములందు వారు అంగడివీథి మార్గముగ పోవుదురు. నా వస్త్ర మును తీసికొని పైన కప్పుకొని పోవుదురు. అదియే వారి వాహ్యాళియందు ఉత్తరీయ ముగ నుపయోగపడును. వా రట్లు వెడలుచుండునపుడు ఒక్కొక్క యంగడివాడును లేచి వారిపట్ల మర్యాద చూపును. వారిని పిలుచుకొని వచ్చి, పీటపై నుపవిష్టులజేసి కొయ్యతట్టలో నాలు గాకులును, రెండు పోకలును ఇడి యిత్తురు. ఆ ప్రణయోపా

యనమును అయ్యంగారు అట్లే యింటికి తెత్తురు. అన్నిటిని చేర్చి అమ్మి వేరేది యైనను కొనుచుందురు. దాని రాబడి పెద్ద మొత్తము కానేరదు. కాకపోయిన నేమి? 'లవణాయ వా స్యాత్'. ఈ పేదరికమునకును వారి సాహిత్యరసాస్వాదనమహా నందమునకును చాల నెడము. ఆ లోకమే వేరు. అందు వారే సమ్రాట్టు. అచ్చట ఆకలిదప్పులు లేవు, పేదరికము లేదు, అలుపు లేదు. ఆ విలక్షణప్రపంచము నకు నన్నును వారు లాగికొనిరి.

ఏ విషయము చెప్పినను అం దసాధారణమగు నొక స్వారస్య మేర్పడునట్లు చెప్పుట వారి పరిపాటి. ఒక వేళకు రెండు మూడు పద్యములే చెప్పుదురు. అయి నను ఆ పద్యముల యర్థమును తగిన యుదాహరణములతోడను, ఉపాఖ్యానముల తోడను తేటతెల్లముజేసి మనసునకు పట్టున ట్లొనర్తురు. పద్యమునర్థము పోవుదారినే తమ మన స్స్వంతయు పోనిచ్చి, శ్రోతలనుకూడ ఈడ్చుకొని పోవుదురు. ఏడవ యేట కొలది కొలదిగ వా రిడిన ద్రావిడభాషాపీయూషరసాస్వాదము నేటి కింకను నేను మరవలేదు.

మొట్ట మొదట శఠకోపయ్యంగారు తాము రచించిన 'అలందురై' యాళ్వరుని 'పదిక'మును నాకు నేర్పిరి. అరియలూరిలో నున్న శంకరభగవానునివిషయమున నమరిన దది. సంగీతమునను వారు వ్రాసిన కీర్తన నొక్కదానినే మొదట చెప్పిరి.

ఆ కీర్తన సహానారాగమున నమర్చబడినది. వారు మొదట నేర్పిన యా కీర్త నతోబాటు దాని రాగముకూడ నా మనసు నాచికొన్నది. అది మొదలే ఆరాగమునందు అభిలాష నాకు పెరుగుచు రాజొచ్చెను. నేటి కింకను ఆ ప్రీతి యనువర్తించుచునే యున్నది.

నా కేడవయేడు గడచిపోయినది. "వీని కుపనయనము చేయవలెను; దాని కేది మార్గము" అను విచారములో మా నాయనగారు మునిగిపోయిరి. "జేనెడు పైకెగయ మూరెడు దిగజారెడు" జీవికలో వారి హృదయము కళవళపడుచుండినది.

ఆదినములలో మా నాయనగారిని ఆదరించుచుండినవారిలో నొక్కరగు కొత్తవాళల్ కుమరపిళ్లై అనువా రొకపరి మా యింటికి వచ్చియుండిరి. మా నాయనగారి యోగక్షేమములను విచారించిరి. మాటాడునెడ నా వడుగును గూర్చి

వారు చింతాక్రాంతులై యున్నా రని యరసి "దానిని గురించిన చింత మీకు వలదు. ఉపనయనమునకు నాలుగు దినములు ముందుగ మీకు పైకము వచ్చిచేరును" అని వాగ్దానము చేసిరి.

దుందుభినామ సంవత్సరము 'వైగాశి' నెల (1862 జూన్) మా తాతగారి యాబ్దికము వచ్చినది. అందుకై ఉత్తమదానపురము పోవ నేర్పాటై యుండెను. కుమరపిళ్లై 'ఆర్థికసహాయము చేయుదు'నని చెప్పియుండుట నమ్మి ఆబ్దికమైన పిదప 'ఆని' మాసమే నా యుపనయనమును ఉత్తమదానపురమునందు జరిపింప మా నాయనగారు నిశ్చయించిరి.

మే ముత్తమదానపురము చేరితిమి. మా తాతగారి శ్రాద్ధము పూర్తియైనది. తరువాత నా వడుగు చేయుటకు వలయు ప్రయత్నము లారంభమైనవి. మా తండ్రి గారు 'ఫలానా రోజున' ముహూర్తము నిర్ణీతమై యున్నదని తెలుపుచు కొత్తవాశల్ కుమరపిళ్లైకు ఒక కమ్మ వ్రాసి పంపిరి. ఆ యుదారులు ముహూర్తమునకు నాలుగు దినములు ముందుగనే ఇద్దరు 'వేళాళప్పిళ్ల' లను (కర్షకజాతివారు) కావలసిన మొత్తముతో పంపిరి. వారలు వచ్చి ధనమును మా నాయనగారి చేతి కిచ్చిరి. దానిని స్వీకరించునపుడు మా నాయనగారును, పినతండ్రిగారును మనసు కరగి కన్నీరు కార్చిరి.

మా కుటుంబపు టలవాటు ననుసరించి ఉపనయనసమయమందు నాకు 'వేంకటరామశర్మ' అని నామకరణము చేసిరి. ఆ పేరే బాగున్న దని మా తండ్రియు, ఇతరులును తలచిరి. అదిమొదలు నాకు 'వేంకటరామన్' అను పేరే పలువురిచే వాడబడుచు వచ్చెను.

ఉపనయనమైన పిమ్మట మరల మేము అరియలూరికి వచ్చి చేరితిమి. నేను తమిళవిద్యలో సారస్య మెరిగినవాడ నగుట శఠకోపయ్యంగారిని విడువక పట్టు కొంటిని.

ఒక తడవ మా చిన్నతాతగారగు 'అయ్యాక్కుట్టి అయ్యర్' మమ్ము చూచుటకై అరియలూరికి వచ్చిరి. కొందరి వేడుకోలు మన్నించి కొన్నాళ్ళు మే ముండిన యింటిలో హాలాస్యమాహాత్మ్యము చదివి యర్థము చెప్పుచు వచ్చిరి. నేను దాని ననుదిన మాలించుచుంటిని. శ్రీ సోమసుందరస్వామి 'గౌరి' అనెడు

కన్నియపై అనుగ్రహముచూపిన శ్రీలీల (తిరువిళైయాడల్) యొకటి యా మాహాత్మ్యమున నున్నది. తమిళభాషలోని 'తిరువిళైయాడల్ పురాణము'నందు ఆ చరిత్ర యున్న ఆ భాగమునకు 'వృద్ధ కుమార బాల రాన పడలమ్' (వృద్ధుడుగను, కుమారుడుగను, బాలుడుగను అయిన చరిత్రచెప్పెడు పటలము) అని పేరు. అయ్యాకుట్టి అయ్యరు ఆ చరిత్రప్రవచనము సేయునపుడు "గౌరికి ఆపెతండ్రి గౌరీమంత్ర ముపదేశించిరి. ఆ మంత్రము మిక్కిలి శ్రేయస్సు నివ్వగలట్టిది" అని చెప్పి, ఆ మంత్రము స్పష్టముగ నుచ్చరించిరి. వా రుచ్చరించిన మంత్రమును, ఉచ్చరించు విధ మును నే నప్పుడే మనసులో నిలుపుకొంటిని. వారు నాటిరేయి మంత్ర ముచ్చరించుటయే ఉపదేశ మని తలచి నాటిసుత నేనును దానిని జపింప దొడగితిని.

మా నాయనగారు అరియలూరుకు చుట్టుప్రక్కల నున్న ప్రదేశములకు ఆయూరివారి యాహ్వానముపై తేపతేపకు జని తమ గానామృతముచే వారిని తనియ జేసి, అటనట నున్న మిత్రులనుండి ధనసహాయమునుగూడ పొంది వచ్చుచుండువారు. కొన్ని గ్రామములందు లభించిన ధనాదాయమునుండి నా యుపనయనమునకై కుమరపిళ్లైగా రిచ్చిన పైకమును త్రిప్పి యిచ్చి యప్పు తీర్చివేసిరి. 'సంస్థాన విద్వాంసు'డను పేరే గాని జమీందారుగారి యాదరువు రాను రాను సన్నగిల్లినది. జమీందారే యప్పులలో మునిగిరి. ఆస్థానపుసహాయము బొత్తిగ నాగిపోయెను.

ఈ 'బ్రదుకుపోరు'న ఒక దుఃఖము కడచిన వేరొకటి వచ్చుటకై వేచియుంట మా తండ్రిగా రనుభవముఖమున తెలిసికొనిరి. జమీన్‌సంబంధము, ఆదరము విచ్ఛిన్నము కాగ 'ఇకనేమి చేయనగును ?' అను విచార ముదయించెను. కుటుంబ నిర్వహణకు సంబంధించిన చింతకంటె నా చదువుగురించిన విచారమే వారికి హెచ్చినది. అరియలూరిలో చదువుకు వలసిన సహాయ ముండినది. కాని రాబడిలేదు. "ఈ యూరు వీడి వే రెటకు పోవుట ?" అను దిగులు వారి హృదయము నాయాస పెట్ట దొడగినది.

# 8. 'కున్న'మందు క్షౌరము

ఇట్టి యిక్కట్టుల పాల్పడి కలగెడు మా జనకుల హృద్గతభావమును 'చిదంబరం పిళ్లె' యనువా రొక తీరున ఊహించి యరసికొనిరి. అరియలూరికి ఉత్తరమున నున్న 'కున్నమ్' (కున్టమ్) అను గ్రామమునకు వారు కరణము. వారు తమిళజ్ఞానసంపన్నులు. నేను అరవము చదువుచుండు టరసి నాతో ప్రియమార భాషించి, న న్గొనియాడి యుత్సాహ మొదవించెడువారు.

మా తండ్రిగా రొకనాడు చిదంబరంపిళ్లెగారితో మాటాడుచుండిరి. వారి మాటలలో 'మామూలు'గాంభీర్యము కానరాకుండుటచేత చిదంబరంపిళ్లె వారి మనసులోని దుఃఖము, దాని కారణము నూహించి యరసిరి. పిదప మెలమెల్లగ విచారించి జమీందారుప్రాపు లేకుండుట తెలిసి వగచిరి. అప్పు లున్న వని తెలిసికొనిరి. వెంటనే "మీ రికమీదట ఇచ్చోట నుండవలదు. కున్నమునకు వచ్చివేయుడు. అచ్చట నిలుకడగ నుండవచ్చును. మీకు కుటుంబచింత లేకుండునట్లు నేనును, నా మిత్రులును గమనించుకొందుము. మీ కుటుంబము'బాకీ'లను తీర్చుటకును ఏదైన నొక మార్గము చూచెదము" అని చెప్పిరి.

మా ప్రయాణమునకునై యొక బండి యేర్పాటుచేసి కుమరపిళ్లె వచ్చిరి. 'ఖర్చు'లకును ధన మిచ్చి వారు సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి. సూర్యోదయమునకు ఐదు గడియల ప్రొద్దుండగ మా యింటి వాకిట నొకబండి వచ్చి నిలిచినది. మా నాయనగారును, నేనును ఇల్లు వదలి వెలుపలకు వచ్చితిమి. నాయనగారు ఈశ్వర ప్రార్థన చేసికొనుచునే, న న్నెత్తి బండిలో కూర్చుండబెట్టిరి. ఆ సమయమున విష్ణ్వాలయము వైపు 'సన్నాయి' వాద్యపు ధ్వని విననాయెను. నాయనగారు వెనుకకు మరలి చూచిరి. అచట కాళియనర్తనమూర్తిని ద్వారమున విజయముచేయించి కోవెలవాకిట మంగళహారతి యిచ్చిరి. మా నాయనగారు రోమాంచకంచుకితులైరి. "మేలగు శకునము! దైవమును నమ్మి ప్రయాణమున కాయత్తపడుచున్నాము" అని మనసున కరగి వాకృచ్చిరి.

స్వామివారి గుడికి కైంకర్యము నెరవేర్చుటకై చుట్టుప్రక్కలం దున్న గ్రామములకు జని ద్రవ్య మార్జింప నెంచియే దేవాలయాధికారులు శ్రీ కృష్ణస్వామి విగ్రహమును విజయముచేయించి సన్నిధియెదుట నిలిపి నీరాజనము చేయించిరి. ఆ సమయము, మా నాయనగారు నన్ను బండిలో నెక్కించిన సమయము నొక్కటైనది. శ్రీ కృష్ణభగవానుని శ్రీముఖమండలమును వెలుగొందజేసిన యాకప్పురపు వెలుగు "ప్రాత నెలవు వదలి క్రొత్తచోటికి బోవుచుంటిమే" అను విచారముతో నుండిన మా నాయనగారి హృదయమును గూడ వెలుగొందజేసెను. భవిష్యత్తును గురించి యేమియు నెరుగని 'జీవికాప్రవాసము'న ఆ కరుణామయుని దివ్యకృపయే తోడుపడును అను ఊరార్పు వారి యెడదలో కాపురము పెట్టెను.

మా తల్లిగారు బండి యెక్కిరి. తండ్రిగారును బండిలో నాసీనులైరి. కున్నకున కభిముఖమై మా బండి సాగెను.

ప్రొద్దుట ఎనిమిది గడియల సమయమున కున్నమునకుపోయి చేరితిమి. చిదంబరం పిళ్లెయు వారి మిత్రులును మా రాకను వేయికండ్లతో నెదురుచూచుచుండిరి. అక్కడ మాకై యేర్పరచియుంచిన యింటిలో విడిసితిమి.

కున్నమునకు చేరిన దినము మధ్యాహ్నము మీదట తండ్రిగారును, నేనును చిదంబరంపిళ్లె యింటికి నేగితిమి. ఆ యింటి యరుగుమీద పలువురు కూడి యుండిరి. వారి మోములందు చిందులాడు చిరునగవువెన్నెలల వెల్లువలలో ఆప్లావితములై మోడువారిన మా మనసులు సంతసమున చిగుళ్లు తొడుగ నారంభించినవి. చిదంబరంపిళ్లెగారు మా నాయనగారిని తోడ్కొని తమ యింటిలోనికి జని, నడవలో నున్న తమ పొత్తముల 'అలమారు'లను చూపిరి. అందు పలు విధముల పొత్తము లుండినవి. అందుండి ఒక పుస్తకమును మా నాయనగారు వెలికి తీసిరి. అది 'తాయు మానవర్' పాటల పుస్తకము. దానిని విప్పి నా చేత నిచ్చి "వీరికి చదివి చూపింపుము" అని చెప్పిరి. తెరచి యిచ్చిన చోటు 'ఆనందమానపరమ్' అను భాగములోనిది. నేను వాకిటి తిన్నెపై నున్నవారికి, ఆ భాగములోని పాటలలో నొక్క టొక్కటిగా తోడి మున్నగు నొక్కొక్క రాగమందు చదివి వినిచితిని. తాయుమానవర్ ఎల్లవారికి తెల్లమగు పలుకులలో అనుభవావేశమును చక్కగ వెలువరించిన యా పాటల యర్థము, చిరుతప్రాయమునకు సాజమైన దుడుకుతోడ వెలువడు నా కంఠస్వరమును అట సమావిష్టులైనవారికి ఆనందపు పంట పండించెను.

"అరియలూరయ్యరు తమ కుమారునకుగూడ చక్కగ 'తరిఫీదు' నిచ్చినారు. వారి వలె వీరును మంచి దశ యందుకొందురు" అని వారు సంభాషించుకొనిరి. కున్న మందు జొచ్చిన మొదటి రోజే 'ఆనందమానపరము'ను తోడుగ జేసికొని వారి యుల్లములందును మేము చొచ్చుకొంటిమి.

ఆ యూరిలో గ్రామాధికారనిర్వాహకులు పలువు రుండిరి. వారును చిదం బరంపిళ్లైయును చేరి, యోచించి మా నాయనగారిచే రాత్రివేళల 'అరుణాచల' కవి విరచితరామాయణప్రవచనము చేయించి వినవలె నని యభిలషించిరి. ఆ తీరుగనే ప్రవచనము ప్రారంభింపబడెను. అనుదినము రాత్రులందు చిదంబరంపిళ్లైగారి వాకిటి తిన్నెపై అది నడచినది. అప్పుడు ఉత్తమదానపురమునుండి మా పినతండ్రి గారును వచ్చియుండిరి.

రామాయణప్రవచనము చక్కగ నడచినది. ఆ యూరివారి ప్రాపు పెల్లుగ నుండుటచేత మా నాయనగారి కుత్సాహ మతిశయించెను. వారితో చిన్నాయనగారును చేరుకొనిరి. నేనును ఎడనెడ పాడుచుంటిని. నా గాత్ర మభ్యాసముచేత బలపడుచు వచ్చెను. అందుచేత రానురాను రామాయణప్రసంగమున అధికముగ పాడుచుంటిని. నా పాటలు విన్నవారు చిన్న కుర్ర దెట్లు పాడుచున్నాడు!' అని ముక్కుమీద వ్రే లిడుకొనుచుండిరి. అందుచే నాకును ఉత్సాహ మధిక మాయెను.

రెండు నెలలుగ రామాయణప్రసంగము జరుగుచువచ్చినది. యుద్ధకాండము నడచుచుండగా నొకనాడు, హనుమంతుడు సంజీవిపర్వతమును కొని తెచ్చి, బ్రహ్మా స్త్రముచే కట్టువడి పడియుండిన లక్ష్మణాదులను తేర్చిన ఘట్టము వచ్చినది. లక్ష్మణుల వారు బ్రహ్మాస్త్రమునకు కట్టువడి పడియుండుట చూచి శ్రీరామచంద్రులవారు పొందిన కుందు, వా రా దుఃఖావేశముచే మూర్ఛిల్లి పడుటయు వినినవారు కరగిపోయిరి. తమ యనుభవమున నెన్నియో యిడుమల గుడిచి క్షతహృదయులై యుండుటచేత మా నాయనగారు ఆ కరుణరసమును తా మనుభవించి ఇతరుల ననుభవింపజేసిరి. శోక పూర్ణమైన యా సమయమున "హనుమంతులవారు సంజీవిపర్వతమును మోచి తెచ్చి నారు. దాని గాలి సోకినంతమాత్రాన లక్ష్మణులు మున్నగువారు పునరుజ్జీవితులై నిలి చిరి" అను విషయము వచ్చినపుడు శోకసాగరమున మున్కలిడుచున్న జనులెల్ల రును ఒక్కుమ్మడిగ నానందకోలాహలము చేసిరి. వారు రామాయణకథ విను -

చున్నవారివలె తోపలేదు. రణరంగముననే యుండి రామలక్ష్మణుల పాట్లు జూచి వగల బొగిలియు, హనుమంతుల శౌర్యాతిశయము చూచి సంతోషించియు నున్న వారివలె నుండిరి. మా నాయనగారికో, అరియలూరు వదలి యెడబాసినందున కలిగిన చింత బ్రహ్మాస్త్రసదృశముగ తోచెను. కున్నమునందు తా మందిన యాదరము సంజీవికొండ వలె నుండినది. ఇవ్విధమున దుఃఖము, దానిని పోకార్చి నిల్చు సుఖమును అనుభవమున నొక యుద్ధకాండను కల్పించినందున మా నాయనగారు ఆ విశిష్టానుభవమును పురస్కరించుకొని, ఆ ఘట్టమును రసవత్తరముగ ప్రవచించిరి. శోకరస ముండు నెడల తామే శోక మనుభవించియు, సంతోషవార్త వచ్చు చోటుల తామే యానందించియు, వారు చేసిన కథాకాలక్షేపము విననవారి హృదయముల వశపరచుకొనినది.

నాడు కథ ముగిసిన వెంటనే మా నాయనగారిని శ్లాఘించుటకు మితియే లేకుండినది. చిదంబరం పిళ్లె మున్నగువారు "ఈ రామాయణ మింకను కొన్నాళ్లలో పూర్తియైపోవును. దీని నొకసారి విన్నంత మాత్రమున మనకు తనివి తీరదు. పలుమారు వినవలయును." అని తలచిరి. "వీరి నీ యూరిలోనే నిరంతరముగ నివసించునట్లు చేయవలెను" అని తలపోసి దానికై పలయు విధానముల జేయ దొడగిరి. పిదప చిదంబరం పిళ్లె మున్నగువారు పన్నిద్దరు నెల కొక్కరు చొప్పున ఐదేసి రూపాయ లిచ్చునట్లు ఒప్పందము చేసికొని యా సంగతి నొక తాటియాకుపై వ్రాసి యా పన్నిద్దరును సంతకములు చేసిరి. దానిని మా తండ్రిగారి కిచ్చి "మేము చేసిన ఈ యేర్పాటు మీరు సమ్మతింపవలెను" అనిరి. నాయనగా రట్లే యంగీకరించి, కృతజ్ఞతాసూచకమగు కొన్ని మాట లాడి కొనియాడిరి.

అది మొదలు ఒక్కొక్క నెలయు తప్పక వారి సహాయము లభించుచునే యుండెను. ఇతరవిధముల వచ్చు రాబడియు చేరుటచే మా జీవితము సుఖమయముగ సాగుచుండెను.

మా తాతగారి శ్రాద్ధము జరిపింప మమ్ము పిలుచుకొని మా తండ్రిగారు ఉత్తమదానపురమునకు జనిరి. తాము తెచ్చియున్న మొత్తముతో తాము తలచిన విధముననే తమ కుటుంబపు ఋణమునం దొక భాగము తీర్ప ప్రయత్నించు తరి ఆప్తబంధువులు కొందరు అట్లు చేయుట వారించిరి. "ఇప్పు డిపుడే నీ వేదో

యార్జించుకొని వచ్చియున్నావు. నీ భార్య కొక నగయైనను ఇంతదనుక చేయించి పెట్టవైతివి. మొదట ఆమెకు ఏదైన నొక బంగారు సొమ్ము చేయించి పెట్టుము. ఇన్ని దినములుగ నున్న యప్పున కిప్పు డేమి తొందర? ఇకమీద నీవు సంపాదింప బోవుట లేదా? అప్పు తీరక నిలిచిపోవునా? తగిన సమయమున ఆడువారికి సొమ్ములు చేయించి పెట్టుటే గదా యందము! ప్రాయము కైవ్రాలిన పిమ్మట పెట్టి ఫల మేమి? నగ చేయించిపెట్టిన పిదప మిగిలినదానిని ఋణమునకు చెల్లుగ నిమ్ము" అని వారు నొక్కి వక్కాణించిరి.

మా తల్లికి ఆ కాలమున తాళిబొట్టు మాత్రమే బంగారుది. మిగిలిన వన్నియు నిత్తడివి. బంధుగులు చెప్పినది విని యట్లే మా నాయనగారు ఆ మొత్తమును ఖర్చు పెట్టి చెవికి కమ్మలును, పోగులు, 'పంచకలశవాళి' (బుగడలు) అనెడు బంగారు సొమ్ములు చేయించి మా యమ్మగారి నలంకరింప జేసిరి. మా యమ్మగారు వానితో నలంకరించుకొనినపుడు పొందిన మహానంద మింతిం తని వర్ణింప నలవియగునా? అరియలూరు భగవదాలయద్వారమున నిచ్చిన కర్పూరహారతి వారు మరువలేదు. వారి చెవులందలి బంగారు తొడవులును, మోముపై పొంగారు చిరునగవును చెలు వొందగ నిలిచియుండిన యా శోభ నా కన్నులయందు నేడును కాన్పించుచున్నది.



చిదంబరంపిళ్లెగారి నెయ్యము మా కేర్పడినందున మాకు పలు తీరుల లాభములు కలిగినవి. వారు తమిళమున బాగుగ పరిశ్రమించినవారు. కొన్ని ప్రబంధములందును, తిరువిళైయాడల్‌పురాణము మున్నగు గ్రంథములందును మంచి పరిచయము గలిగియుండినవారు. వారి యొద్ద నేను పాఠము విన దొడగితిని.

నా జీవితమందు నా జీవికకు తగిన మార్గములు కొన్ని తెలిసియుండవలె నన్నది మా నాయనగారి యభిప్రాయము. "నాలుగు విద్యలు తెలిసియున్న కాలమునకు తగినట్లు ఏదైన నొకదాని నూతగొని జీవింపవచ్చును.' అనునది వారి యుద్దేశము. సంగీతము, సాహిత్యము గూడ ఒకవేళ నా జీవిక కుపయోగపడనిచో మరి యొక వృత్తి తెలిసియున్న మంచి దని వారు తలచిరి కాబోలు! ఆ దినములలో గ్రామ కరణములకున్న గౌరవము, పలుకుబడియు మిక్కిలి గొప్పవి. కరణమే గ్రామప్రధా.

నాధికారి. వారు చెప్పునదే చట్టము. వారియెడ నపరాధము చేసినవాడు తప్పించుకొన లేడు. కావున ఇంగ్లీషు చదువని నాకు ఒక 'కరణీకము' లభించుచో ఎంత బాగు! మా నాయనగారి మనోభావము లిట్లెల్ల విస్తరింపజొచ్చినవి.

చిదంబరంపిళ్లెగారియొద్ద నేను సహాయకరణముగ ఉద్యోగము వహించితిని. గ్రామపు లెక్కలు 'తరగతులవారీ'గా అమర్ప వేర్వేరుగ ముద్రించిన 'నమూనాలు' వచ్చును. వానియందు చక్కగ 'రూళ్లు' వేయుట మొదలుకొని లెక్క అమర్చుట వరకు అన్ని పనులు నేను చేయుచు నుంటిని.

చిదంబరంపిళ్లె ప్రతిదినమును గ్రామమం దున్న మెట్ట పొలము చిట్టడవులకు పోయి వత్తురు. కరణీకముఉద్యోగము చొప్పున పొలములందు చేయుచున్న సాగుబడి మున్నగువానిని 'అజమాయిషీ' చేయబోవుదురు. ఆ సమయముల నేనును వారితో బోవుచుందును. వా రలవాటుప్రకారము పనులు పర్యవేక్షింతురు. ఆ యడవుల దృశ్యము నా కానంద మొనగూర్చును.

పలు విధములగు పైరులు చేలయందు పండి, కంకులు తొడిగి యుండుటయు మెట్ట పొలములందు ఎడనెడ కంది, అనప పైరు మొదలగునవి పెరుగుచుండుటయు నా కన్నుల నాకర్షించును. ఎవ్వరి సంరక్షణమును అపేక్షింపక తమంత తామే వ్యాపించియుండు మొల్లతీగలును, తులసియు, చక్కగ నేపుగ బెరిగిన బిల్వము, జమ్మి మున్నగు మ్రానులును, పుష్పించియుండు గన్నేరు, తదితరములును ప్రకృతిదేవతసౌందర్యమును ప్రదర్శించుచు ప్రకాశించుచుండెను. సజ్జ పండెడు పొలముల గట్టుల వెంబడి తులసి పెరిగియుండును. ఆ కరణము సజ్జపైరు మాత్రమే చూచి యానందించువారు. అందుమూలమున వచ్చు ఆదాయపు అంచనాలలో వారి మనసు పరుగు లిడుచుండును. వారితో పరిచయ ముండియు అట్టి లెక్కల పైకి నా మనసు పోలేదు. సజ్జకంకులు తలలు వంచి నిలిచియున్న యా శోభ కనులార గాంచితిని. తులసి గుత్తులు గుత్తులుగా పూచి వెన్నులు పొడిచి యుండెను. ఆ శోభను కనులార గాంచితిని. "సజ్జపంటవలన రాబడి యున్నది; తులసివలన నేమి వచ్చును?" అను వాణిజ్యపు బుద్ధి నాకు లేదు. రెండును నా కళ్లకు చల్లని దృశ్యములు ప్రసాదించినవి. బిల్వవృక్షము, జమ్మిచెట్టును గూడ ప్రకృతిమాత సుందరరూపమందలి యొక భాగముగనే తోచినవి. మనుష్యుడు ప్రయత్నపూర్వక

ముగ పెంపక, తామే యుద్భవిల్లినవానియందు ప్రాకృతికసౌందర్య మతిశయించి ప్రకాశించెను.

అచట నచట నీటి పారుదల లున్నవి. వాని గట్లపై వ్యాపించియుండు పచ్చని చెట్ల దృశ్యమునందు నా మనస్సు లగ్నమైపోవును. ప్రతిదినము ప్రొద్దున లేచి, ఆ ప్రదేశముల కరిగి పత్రపుష్పములను కొని తెచ్చి మా తండ్రిగారి యారాధన కర్పింతును.



ఒకనాడు ఒకానొక పండితులును, వారి పరివారమును మహాకోలాహల ముతో కున్నమునకు వచ్చిరి. ఆ యుద్దండపండితులు శిబిక యధిష్ఠించి వచ్చిరి. వారికి చెందిన శిష్యులు, కింకరులును పది పదునేనుగురు గుమిగూడి వారితో నేగు దెంచిరి. ప్రాచీనకాలమున ప్రభువులు పండితులకు పల్లకీలు ప్రసాదించుచుండి రని వినియుంటిని. "ఈ రోజులలో నిట్టి విశిష్టతగన్న వీరు మేటి విద్వాంసులుగనే యుండవలెను. వీరినుండి యెన్నో విషయములు తెలిసికొనవచ్చును" అని లోలోన పొంగితిని.

శిబిక చిదంబరంపిళ్లైగారి యింటి వాకిట వచ్చి నిలిచినది. అందులో నుండిన పండితులు క్రిందకు దిగినారు. ఇంతలో వారి ఛాత్రులు కొందరు తాము తెచ్చిన ఆస్తరణము నొక్కదానిని తిన్నెపయి పరచిరి. ఒకరు తలగడ తెచ్చి చేరగిల బెట్టిరి. ఆ పండితులు గాంభీర్య ముట్టిపడ వచ్చి యరుగుపై ఉపవిష్టులయిరి. తక్కుం గలవారు చేతులు కట్టుకొని నిలువబడిరి. కొందరు తాటాకులు జవురుకొని చేతుల నిడుకొని నిలిచి కొలువు దీరిరి. ఆ గుంపు జూచి యూరివారును గుమిగూడిరి.

చిదంబరంపిళ్లై వచ్చి యా పండితమండనుని తిలకించిరి. "తమ దేయూరు?" అని పరామరిక చేసిరి.

వారు "మేము పుట్టినది త్రిభువనము; ప్రతాపసింహమహారాజులుంగారి యాస్థానవిద్వాంసులము; 'వరకవి' యందురు" అని వాక్రుచ్చిరి. అటు పిమ్మట చిదంబరంపిళ్లైగారిపై తా మల్లిన పద్దెములను వారు వినిచిరి.

వారి యాడంబరము, కంఠధ్వనియు, చుట్టును మూగియున్న పరివారపు 'పటాటోపము'ను వా రొక సంస్థానవిద్వాంసులుగనే యుందు రను తలపు ఎల్లర కును కలిగించెను. కాని వారు చెప్పిన పద్యములు మాత్రము వారి యసలైన శక్తిని బయటపెట్టినవి. చిదంబరంపిళ్లై తమిళభాషామర్మము లెరిగినవారౌట "వీరు వట్టి యాడంబరకవులు" అని తెలిసికొనిరి. వారు చెప్పిన పద్యములలో నొకట నాలుగు చరణములను పొందిక లేక రెండు చరణములు మితి మించిన 'శీర్' (గణ ములు) కలపై యుండినవి. చిదంబరంపిళ్లై యా కవిని జూచి "వీనిలో 'శీర్' (గణములు) హెచ్చుగ నున్నవే?" అని యడిగిరి.

వారు కొంచెమేని జంకక "తమకు 'శీర్' (సంపద) అధికముగ కావలయు ననియే వ్రాసితిని. శీర్ (సంపద) తగ్గింప వచ్చునా?" అని సమాధాన మిచ్చిరి. (ఇట 'శీర్' అను తమిళపదము గణము, సంపద అను రెం డర్థములు గలది. ప్రశ్నిం చినవారు గణములు హెచ్చుగ నున్నవే యని యడుగ "మీకు సంపద హెచ్చుగ నుండవలయు ననియే యట్లు చెప్పితిని" అని ఛలముతో కవిగారు తప్పించుకొనిరి.) అట్లని చుట్టును నిలిచియున్నవారి మోముల సావష్టంభముగ పరికించిరి. చిదంబరం పిళ్లై పై పై ప్రశ్నలు కుప్పించిరి. ఆ విబుధశేఖరుడు సంబంధమే లేని సమాధానము లుచ్చైస్స్వరముతో చెప్పిరి. కొందరికి చిదంబరంపిళ్లైగారి ప్రశ్నలకు పండితు డనా-యాసముగ బదు లిచ్చుచున్నా డనియే తోచెను. చిదంబరంపిళ్లైగారికి ఒకవైపు నవ్వు మరొకవైపు కోపమును కలిగినవి. 'తమిళముపేరు చెప్పుకొనుచు వచ్చియున్నాడు; ఇందరిని కాపాడవలయును' అనియు, 'వారికి ఒకవేళ భోజనమునకైనను సాయపడ వలెను' అనియు నెంచి మూడు రూపాయ లిచ్చిరి.

"నేను బిచ్చమెత్తుకొనగా వచ్చినాడను. మహారాజాస్థానవిద్వత్కవి నగు నా గౌరవము మీ రరసినట్లు లేదే?' అని వారు దడబడలుగ పలికిరి.

ధీరులగు చిదంబరంపిళ్లై మందస్మిత మొనర్చుచునే వారి నేకాంతమునకు పిలుచుకొనిపోయిరి. "న న్నిట్లు బెదిరింపవచ్చు నని తలుపకుడు. మీ విజ్ఞానములోతు పాతు లిం తవి యని నాకు స్పష్టముగ గోచరించినది. ఈ మూడు రూపాయలను కనికరించి యిచ్చునవేకాని మీ వైదుష్యము చూచి కాదు. ఇది వల దని మొండిపట్టు పట్టిన, ఇంతమాత్రమును లేక ఉపవాసముతో వచ్చిన త్రోవ వెదకికొనుచు పోవలసి

వచ్చును. మీ యార్భాటముల జూచి మోహమున పడిపోవుదు ననియు, వట్టి మాటలు విని భయపడుదు ననియు నెన్నవలదు" అని హెచ్చరించిరి. పాప మా పండిత మండనుడు అడగిపోయెను. ఆ మూడు రూపాయలు తీసికొని తన గుంపుతో మరలి వెడలిపోయెను.

# 9. 'కార్క్కాడి'లో...

నేను కున్నమున నున్నపుడు శ్రీవైష్ణవు లొకరి యింట ఒక వివాహము జరిగినది. అందుకై యా యూరికి ఉత్తరమున నున్న 'కార్క్కాడి' అనెడు జన పదమునుండి యా పెండ్లియింటివారికి బంధుగులగు కొందరు అరుగుదెంచిరి. వారిలో 'కస్తూరి అయ్యంగా'రనువా రొకరు. వారు చిదంబరంపిళ్లెకు పరిచితులు. చిదంబరంపిళ్లెగారు కస్తూరిఅయ్యంగారును గూర్చి నాతో "వీరు గొప్ప పండితులు. ఈ వైపుల నింతటి వైదుష్యము గలవారు లేరు. కంబరామాయణమందును తక్కిన పెక్కు గ్రంథములందును వీరికి పరిచితి మిక్కుటము. చక్కగ నుపన్యసింతురు" అని చెప్పిరి. అప్పుడు నాకు వారిని చూడవలయు ననియు, వారినుండి యరుదగు విషయములు తెలిసికొనవలయు ననియు బలీయమగు నుత్కంఠ పుట్టెను.

వివాహమైన మరుసటి దినము ప్రాతఃకాలమున కస్తూరి అయ్యంగారే మే మున్న యింటి 'ఖామందు'లను దర్శింపవచ్చిరి. వా రిరువురు చుట్టాలు. వారు వచ్చినపుడు వారితో నితరులు పలువురు వచ్చియుండిరి. అందరు నొకచో గూడి సంభాషించుకొనుచుండిరి. నేనును ఒక మూల నొదిగియుండి వారి సంభాషణ శ్రద్ధగా నాలకించుచుంటిని. కస్తూరి అయ్యంగారుల సంభాషణ మిక్కిలి రసవంతముగ నుండినది. వా రెడ నెడ తమిళపద్యముల నుదాహరించుచు అర్థము విశద పరచిరి.

అప్పుడు నా మది నొక యాశ పుట్టెను. "వీరు మనల జూచి మాటలాడింపరా? ఏదేని మనల నడుగకుందురా?" అని యెంచితిని. నా యభిప్రాయ మూహించిన యొకరు కస్తూరి అయ్యంగారును చూచి "స్వామీ, ఈ కుఱ్ఱవాడు తమిళభాష నభ్య

సించుచున్నాడు. మిమ్ము 'చూడవలె' 'చూడవలె' నని యువ్విళ్లూరుచు గంతులు వేయుచున్నాడు. ఇప్పుడు మీ మాటలే వినుచున్నాడు" అనిరి.

వారు విని "అలాగా! సంతోషము!" అని చెప్పి నన్ను చూచి "నీ వెవరి యొద్ద చదువుకొనుచున్నావు?" అని యడిగిరి.

"ఈ యూరి కరణముగారియొద్ద చదువుకొనుచున్నాను."

"ఏమి చదువుచున్నావు?"

"తిరువిళైయాడల్ పురాణము."

"ఇంతకు మునుపు వే రెవ్వరియొద్దనైనను చదివియుంటివా?"

"ఔను. చదివితిని. అరియలూరు శఠకోపయ్యంగారువద్దను, మరి కొందరి యొద్దను చదివితిని" అని చెప్పి, నే చదివిన పుస్తకము లివి యివి యని తెలియజేసితిని.

విన్నదే తడవుగ వారు "అలాగా! శఠకోపయ్యంగారు చదువుల మిన్న. వారియొద్ద చదివియున్నా వని విన్న నాకు మిక్కిలి తృప్తియయ్యెడు. ఏదీ, ఒక పద్యము చదువుము; విందము" అని పలికిరి.

జాగు సేయక నేను 'భైరవి' రాగమందు 'తిరువేంగడత్తందాది' నుండి యొక్క పద్యమును చదివితిని. అర్థము చెప్పు మని కోరిరి. నేను సంగ్రహముగ జెప్పితిని. "బాగుగా నున్నది" అని చెప్పి వారు సంతసిల్లిరి. వా రట్లు శ్లాఘించుట నాకు 'కనకాభిషేకము' చేసిన ట్లనిపించినది. అంతటి గొప్ప విద్వాంసులు నన్ను నొక పదార్థముగ జేసి నా పద్యములు విని కొండాడుట యన నే నెన్ని నోములు నోచి యుండవలెనో!

"వే రేదియైనను తెలిసిన చెప్పుము" అని వా రడిగిరి.

నా కుత్సాహము పెరిగిపోయెను. శతకములనుండి కొన్ని పద్యములు చెప్పితిని.

"తిరువేంగడమాలై చదివియున్నావా?" అని వారు ప్రశ్నించిరి.

"లేదు" అంటిని.

"నే నిప్పు డొక పద్యము చెప్పెదను. వ్రాసికొనుము" అనిరి.

"నేడు మనము నక్కమొగము చూచి వచ్చితిమి" అని తలచి నేను మిక్కిలి కుతూహలపడితిని.

ఒక పద్యము మెల్లగ వారు చెప్పుచు నన్ను వ్రాసికొను మనిరి. పిదప దాని యర్థము చెప్పిరి. పిమ్మట "ఏదీ, ఒక పర్యాయము చదివి యర్థము చెప్పుము, చూతము" అని యడిగిరి. "వారి యుల్లమున మనల గురించి మంచి యభిప్రాయము కలుగజేయవలెను" అని నా మన స్సువ్విళ్లూరినది. మిగుల నిదానముగ చదివి భయభక్తులతో నేను విన్న చొప్పుననే యర్థము చెప్పితిని.

కస్తూరి అయ్యంగారుకు నామీద వాత్సల్యము మొలకెత్తెను. "మంచి గ్రహణశక్తి యున్నది. చక్కగ చదువుకొనుచుండుము" అని వా రనినారు.

అచట నున్నవారిలో నొకరు "మీకు ఈ పిల్లవానికి చదువు చెప్ప వీలగునా?" అని ప్రశ్నించిరి. "పాఠములు చెప్ప నా కడ్డేమియు లేదు. కాపుక్కాడికి వచ్చినచో కావలసిన సౌకర్యములు కల్పించి యిచ్చి వీనిని చదివించెదను. కుఱ్ఱడు వృద్ధికి వచ్చు నని తోచెడిని" అని సమాధాన మిచ్చిరి.

ఆ సమూహమం దుండి ఆ వృత్తాంతమంతయు గమనించుచుండిన మా నాయనగారు తాము సెలవిచ్చినట్లే కాపుక్కాడికి వచ్చెదము. వీనికి తాము చదువు చెప్పవలెను. వేరగు నే పనిమీదను వీనికి బుద్ధిపోవుట లేదు." అని చెప్పిరి. వా రిట్లు నుడువునప్పుడు వారి మాటలలో నుత్సాహ ముప్పొంగుచుండెను. కస్తూరి అయ్యంగారు మాటలు వినినపుడు అరుదగు పెన్నిధి కాంచినట్లు తోచెను.

"మంచి రోజు చూచుకొని వచ్చివేయుడు" అని మా నాయనగారియొద్దను, "వత్తువా, రా!" అని నాయెడను చెప్పి కస్తూరి అయ్యంగారు బయలు దేరిరి.

కాపుక్కాడికి పోవుటలో నా కున్న ఆత్రము తెలిసి, మా నాయనగారు ఒక మంచిరోజున నన్నును, మా తల్లిగారిని పిలుచుకొని ఆ యూరు చేరిరి. మేము రాగల మని ముందే కస్తూరి అయ్యంగారువలన తెలిసికొనియున్న ఆ యూరి శ్రీవైష్ణవులు మా కుపచారములు చేసి మా నివాసమునకు కావలసిన యేర్పాట్లు చేసిరి.

మొట్టమొదట కస్తూరి అయ్యంగారువద్ద 'నన్నూల్' పాఠము వినుచు వచ్చితిని. 'విశాఖప్పెరుమాళయ్యరు' రచించిన 'కాండిగై' వ్యాఖ్యానమును ఒకసారి పాఠము చెప్పి, దాని భావార్థము, విశేషార్థము మున్నగువానిని విమర్శగ చెప్పి నాకు

నేర్పిరి. ప్రతిదినము 'నన్నూల్' మొత్తము ఒకసారి చూడకయే చెప్పుచుంటిని. వెన్నెలవెలుగులో వస్తువులు కన్పడుచందమున 'నన్నూలు'లో నున్న లక్షణములు స్పష్టముగ నాకు తోచినవి.

ఆ రోజులలో నన్నూలుకు గొప్ప విలువ యుండినది. సందేహము లేవియు లేక దాని నొకడు నేర్చినచో అవ్వానిని గొప్ప పండితు డని యెల్లరు చెప్పుదురు. సూత్రముల విశేషవ్యాఖ్యానములందున్న అక్షేపసమాధానములు చక్కగ నెరిగి తెలియజెప్పగలవారు కొందరే యుండిరి. పెక్కండ్ర దృష్టి లక్ష్యగ్రంథముల (కావ్యముల) మీదకు బోయినదే గాని లక్షణగ్రంథములపైకి బోలేదు. ఇట్టి పరిస్థితిలో నేను నన్నూల్ సూత్రములను, వ్యాఖ్యానమును మననముచేసి తమిళమున 'లక్షణగ్రంథవిద్వాంసుడను కాగల'నని నన్ను చూచినవారికి తోచునట్లు చేసితిని. ఆ మార్గమం దింకను ఎంతయో తెలిసికొనవలసియున్న దని నేను మరవలేదు.

ఆరు నెలలకు పిదప కస్తూరి అయ్యంగారు మొదలగువారియొద్ద సెలవు పుచ్చుకొని మేము మరల కున్నమునకే వచ్చి చేరితిమి. ధర్మమార్గమునుండి చలింపని ఆ యూరివారు మమ్మాదరించుటయందును, మామీద ప్రేమ చూపుటయందును కొంచెమైనను సడలలేదు.

కున్నమునందు వసించునపుడు దానికి తూర్పుగనున్న 'వెణ్మణి' అను ఊరిలో వసించు సంపన్నులు కొందరు మమ్మచటికి పిలుచుకొనిపోయిరి. వారి కోరిక ననుసరించి యచ్చోట అరుణాచలకవిరామాయణకథాప్రవచనము జరిగినది. అది సమాప్తమైనపుడు మా నాయనగారికి ఇరువది వరహాలు సమ్మానము లభించెను.

# 10. విద్యాభివృద్ధి

'వెణ్మణి'కి 'అమృత కవిరాయర్' అనువా రొక రొకనాడు వచ్చిరి. అప్పుడు వారికి డెబ్బదేడుల ప్రాయ ముండును. పలు గ్రంథములు చదువకపోయినను చదివిన గ్రంథములందు దృఢమైన పరిచయమును తేటతెల్లముగ అర్థము చెప్పగల దిట్టతనమును వారియం దుండినవి.

వారు వెణ్మణియందు గ్రామమునసబుగారి యింట విడిసియుండిరి. అచట కొందరి సమక్షమున కొన్ని పద్యములు చెప్పి యుపన్యాసము చేసిరి. అప్పుడు నడుమ ఉదాహరణముగ 'తిరువరంగత్తందాది'లోని యొక పద్యమును చదివి యర్థము వివరించిరి. "వీ రీ గ్రంథమును సంపూర్ణముగ ఎవ్వరి యొద్దనో పాఠము వినియుండనోపు. మన కొదవ వీరియొద్ద తీర్చుకొనవచ్చును. ఏదేని ద్రవ్యసహాయ మొనర్చియైనను వీరియెడ అర్థము తెలిసికొనవచ్చును" అని యెంచితిని. వెంటనే ఒడ లెరుగని యావేశముతో ఇంటికి పరుగున బోయి 'తిరువరంగత్తందాది' తీసికొని వచ్చితిని. ఒక పద్యము చదివి "యర్థము చెప్పు"డని వేడుకొంటిని. విపులముగ వా రర్థము చెప్పిరి. మిక్కుటమగు శ్రద్ధాసక్తులతో విని యద్దానిని నా మనస్సునందు నెలకొనజేసికొంటిని. పిదప తరువాతి పద్యము చదివితిని. వారు పాఠము చెప్ప సిద్ధపడిరేని ఆ గ్రంథమంతయు ఒకే గ్రుక్కలో చదివి తెలిసికొన ఆయత్తముగ నుంటిని. కాని నా యభిలాష యంత సులభముగ నెరవేరునదిగ లేదు.

"పెక్కు పద్యములకు నే డర్థము తెలిసికొనవచ్చును" అను నుత్కంఠతో ఆ పద్యము చదివి నిలిపి వా రర్థము వివరింతు రని ప్రతీక్షించి వారి ముఖముననే దృష్టి సారించి చూచుచుంటిని.

" తిరువరంగత్తందాది' యమకములతో నిండినది. ఎల్లరకును ఇది సులభముగ తెలియరాదు. మిక్కిలి శ్రమ కోర్చి వినిననే తెలియును. తక్కిన గ్రంథము లందు నూరు పద్యములు వినుటయు ఇందు ఒక్క పద్యము వినుటయు సమానము" అని వా రెందులకో పీఠిక పెట్ట నారంభించిరి.

ఒక గ్రంథమును పాఠము చెప్పునపుడు ఆ గ్రంథ మమరియుండు తీరును గూర్చియు, ఆ గ్రంథకర్త మున్నగువారిని గూర్చియు వివరించుట బోధనాచార్యుల పరిపాటి. ఆ పద్ధతిని వారు చెప్పుదు రని నేను తలచితిని. తిరువరంగత్తందాది సులభముగ అవగాహనచేసికొన వీలుకా దని వా రనినపుడు, దానిని నే ననుభవమూలకముగ నరసియుండుటచేత "వాస్తవమే. కారుక్కుడి స్వామిఅయ్యంగా రనువారే ఇరువదియేడు పద్యములకు మాత్రమే చక్కగ అర్థము తెలియు నని చెప్పినారు" అని నేను నుడివితిని.

"చూచితిరా ! దానినే నేను చెప్పవచ్చుచుంటిని. ఎన్నియో ముక్తకములకు అర్థము చెప్పవచ్చును. నైషధము సంపూర్ణముగ ప్రవచింపవచ్చును. ఈ యంతాది

అ ట్లూహించి యర్థము చెప్ప వలనుపడదు. పట్టుదలతో పాఠము వినియుండవలెను. నే నెంతయో శ్రమపడి నేర్చితిని. ఒక్కొక్క పద్యమును ఒక్కొక్క నిధివంటిది."

"నిధి యనుటలో సందేహము లేదు" అని నేను నా మనస్సునందే చెప్పుకొంటిని.

"ఇంత ప్రయాసపడి నేర్చుకొనినది ఈ యోపికలేని కాలమందు సులభముగ మీకు చెప్పివేయవచ్చునా ? కష్టపడి వెదకి తెచ్చుకొనిన పెన్నిధిని జవిరి వెదజల్లివేయుటకు మనసు వచ్చునా ? మరియు, నాకు గొంతుక నొప్పి పుట్టుచున్నది. నే పోయివత్తును" అని చెప్పి వెంటనే లేచి వెడలిపోయిరి. నేను మిక్కిలి వంచితుడనైతిని. "చేతి కందినది నోటి కందలేదే !"యని వగల బొగిలితిని. "ఆ కవిరాయరు అంతసేపు మాటలాడుటకు బదులు రెండు పద్యములకైనను అర్థము చెప్పియుండ వచ్చునే" అని నే ననుకొంటిని.

మా తోడనుండి మా సంభాషణ వినుచుండినవారు, నా మోము వాడియుండుట చూచి "పాపము ! ఈ కుర్రవాడు ఎంతో వినయముతో గంపె డాశతో వేడుకొనినాడు! ఆ ముదుసలి చెప్ప వీలుకాదని, ఇసుమంతైన జాలిలేక వెడలిపోయినారే ! తిరువరంగ త్తందాది నిధి యని వా రనుట నిజమే, దానిని కాపాడు భూతమువలె గద వా రున్నారు." అని చెప్పి నాపై జాలిగొనిరి.

వెణ్‌మణియందు రామాయణకథాకాలక్షేపము ముగిసిన వెనుక మేము మగుడ కున్నమునకే వచ్చి చేరితిమి. మాకు ముఖ్యమైన తావలముగ ఆ యూ రుండినది. కరణము చిదంబరంపిళ్లెయు, వారి మిత్రులును కున్నమునందు మా కున్న యభిమానమును తమ యాదరముచే దృఢపరచుచు వచ్చిరి.

చిదంబరంపిళ్లె యొద్ద చాల తాళపత్రగ్రంథము లుండినవి. వానిని ప్రత్యేకముగ నొక గదిలో చేర్చి, వారు వానిని శ్రద్ధతో కాపాడుచువచ్చిరి. ఆ తాటాకుపుస్తకములను కొన్నిటిని నేను కొన్ని సమయములందు చదివి చూతును.

'శతకములు', 'మాలలు' మున్నగు గ్రంథములు చదువ జదువ నేర్పడిన యలవాటుచే, వాని నడక ననుసరించి నేను కవిత్వము వ్రాయ దొడగితిని. యతిప్రాస లమర్పవలె నని యలవాటునుబట్టి యొక విధముగ తెలియవచ్చెను. కాని గణములోని భాగములు (అశై), గణములు (శీర్). గణసంయోజనస్థలనియమములు (తళై).

యతిప్రాసాదిసంబద్ధవిధులు (తొ౽డై) మొదలగు విభాగములు గాని, వేరు ఛందో లక్షణములుగాని నాకు తెలియవు. శతకపద్యములవంటి వృత్తములను వ్రాయు చుంటిని. కున్నమం దుండెడు ఆదికుంభేశ్వరులగూర్చియు, మంగళాంబికావిషయ మునను కొన్ని పద్యములు రచించితిని. 'తాయుమానవర్' పాటలు, 'పట్టినత్తుప్పిళ్లై యార్' పాటలు మున్నగువానియందు కనిన భావములను వానియందు ఇమిడ్చితిని. "నేను కాంతలసౌందర్యమందు తగుల్కొని కాలము కడపితిని. వారి వ్యామోహము నందు పడిపోయి జీవితమునే వ్యర్థము చేసితిని" అనియు, "ధనవంతుల కొనియాడి పాడి యలసి దుఃఖించితిని" అనియు నిట్టి భావముల బొదివి కవిత్వ మల్లితిని. ప్రాత పద్యముల నడకను ఒరవడిగ నుంచుకొనినట్లే, వానిభావములను గూడ పొదివి పట్టించుటయు గొప్పమే యని నే నభిప్రాయపడితిని.

ఒకనాడు నేను వ్రాసిన పద్యములను కొన్నిటిని మా నాయనగారికి చదివి విని పించితిని. వారు వానిని విని నన్ను శ్లాఘింతు రని, ఉత్సాహపరతు రనియు నేను తల పోసితిని. వారేమో, "ఒరే వెర్రివాడా, ఇటుల పద్యము లల్లకుము" అనిరి. "వా రంద రును వ్రాసియున్నారే, నేను వ్రాసినందున త ప్పేమి?" అని నే నడిగితిని.

"నీవు చిన్న పిల్లవాడవు. వారు లోకానుభవమున కష్టము లనుభవించినవారు. వారు చెప్పిన వన్నియు నీవును చెప్పుట తగదు. స్త్రీవ్యామోహమున చిక్కుపడి వెతల గూరితి మని వారు చెప్పవచ్చును. నీ వనవచ్చునా?" అని యడిగిరి.

వారు చేసిన యాక్షేప మప్పుడు నాకు చక్కగ బోధపడలేదు. నా కవిత్వమున నా యనుభవముమాత్రమే యుండవలె నని నేను తెలిసికొనలేదు. స్త్రీవ్యామోహ మున చిక్కుకొనుటకు వలసిన వయసే లేని నేను దానియందు చిక్కువడి, అలసి, వైరాగ్య ముదయించినవానివలె వ్రాయుట యవివేక మని చక్కగ నవగతము చేసి కొనలేదు. వారు రచించిరి, నేనును రచించితిని. వారి కవిత్వములను తేప తేపకు చదువుటయు, వాని నడక ననుసరించి నేనును వ్రాయుటయు, వారి పద్యములలోని భావములను కొంచెము మార్చి వ్రాయుటయు— అనెడి యీ ప్రయత్నములేగాని, నా మనస్సున యోచించి కల్పనచేసి యొక భావమును చొన్పింప నేను ప్రయత్నింపనే లేదు. నేను వ్రాసికొనిన కవితలను వేమారులు చదివి చదివి యానందింతును. దానిని దువుచు 'ఇంతటివాడ' నను ఒక విధమగు తృప్తి ననుభవింతును.

రాను రాను నా విజ్ఞాన మభివృద్ధి జెందుచున్న దని మా నాయనగారు గమనించుచుండిరి. నన్నుగురించిన జ్ఞాపకమే వారికి దినదినమును పెచ్చు పెరుగుచుండెను. నా విద్యను గురించి ప్రయత్నములు చేయుచున్న వారికి నా వివాహమును గూర్చిన తలంపుగూడ నుదయించెను. పిల్లవాండ్రకును, ఆడపిల్లలకును లేప్రాయము ననే పెండ్లిసేయు నలవాటు ఆ రోజులలో నధికవ్యాప్తిలో నుండెను. ఒక నియమీతకాలములోపల వివాహము కానిచో పెద్ద తలవం పని భావించుచుండిరి.

నాకు పదుమూడవ యేడు నడచుచుండగనే మా నాయనగారికి నా వివాహమును గూర్చిన విచార మేర్పడెను. ఆ కాలమున వధువులకై వరులను వెదుకుట సాధారణముగ లేదు. వరునకై వధువును వెదకు ప్రయత్నమే యుండినది.

మా నాయనగారు నాకు తగిన అమ్మాయిని వెదుక నారంభించిరి. వివాహమునందు 'మగపెండ్లివారికే' ఖర్చు హెచ్చు. కున్నమందు పొందుచున్న యాదరాభిమానములవలన ఉత్సాహము పొందిన మా తండ్రిగారికి మునుపు కుటుంబపు అప్పులను తీర్చివేయవలయు నను ఉద్దేశమే యుండినది. దినములు కడవగ ఆ యుద్దేశము మారిపోయినది. "భూమి నమ్మియైనను ఋణములు తీర్పవచ్చును. వీని కెట్లైనను పెండ్లి చేసివేయవలెను. ఆర్జించు విత్తమునందు దానికై కొంత దాచిపెట్టవలయును" అను తలపే పాదుకొనినది.

'పెరుంబులియూరు' తాలూకాలో నున్న 'కళత్తూరు'వారగు రామయ్యంగారనువారు కున్నమునకు మాటిమాటికిని వత్తురు. మా తండ్రిగారికిని వారికిని పరిచయ మేర్పడెను; ఇద్దరును మిత్రు లయిరి. ఆ యుదారులు, మా నాయనగారికి నా వివాహమును గూర్చి బెడద యుండిన దని బాగుగ నెరిగి "మీరు కళత్తూరుకు వచ్చుచో వివాహమునకు వలయు ఆనుకూల్యము లొనగూడును. పైకము కావలయునే యని మీరు దిగులుపడవలసిన యవసరమే లేదు" అని పలికి యాహ్వానించిరి.

రామయ్యంగారు తమ నివాసమునకు జని, కొన్నాళ్ల తరువాత మమ్ము పిలుచుకొని పోవుటకై బండి పంపిరి. మేము కళత్తూరు పోయి చేరితిమి.

మమ్ము రావించిన రామయ్యంగారు సంపన్నులు. వారికి ఒక పెద్ద మిద్దెయి ల్లుండినది. అందులో నొకభాగము 'ఖాళీ' చేయించి యిచ్చి యందులో కాపురముండు డని సెలవిచ్చిరి. మే మందు వసించియుంటిమి. అన్ని విధముల సౌకర్యములును మా కట లభించినవి.

మేము కళత్తూరిలో నన్నివిధముల అనుకూల్యములను హొందితిమి. అటకు జేరి కొన్నిదినములైనవెంట రామయ్యంగారు మున్నగువారి కోరిక ననుసరించి ఒక శుభదినమున మా నాయనగారు రామాయణకథాకాలక్షేప మారంభించిరి. ప్రతి దినము రాత్రి యెనిమిది గంటలవేళ ఆరంభమైన ప్రవచనము పదునొకండు గంటల వరకు సాగిపోవుచుండును. పలువురు వచ్చి యుత్సాహముతో విని వెళ్లుచుండిరి.

రామాయణకీర్తనలకు అర్థము చెప్పునపుడు ఉదాహరణరూపమున వేరు కీర్తనలు చెప్పెడివారు. పెక్కు అరవపాటలను, సంస్కృతశ్లోకములను ఉద్ధరించి చూపెదరు. అట్టి సందర్భములందు ఉదాహరణకు చెప్పవలసిన పాటలకు మొదలు వారెత్తి యిత్తురు. నేను వారి సూచన నెరిగి వానిని సంపూర్ణముగ పాడి వినిపింతును. నా శారీరము, నేను పాటలు పాడెడు 'బాణి'యు సభాసదులకు మిక్కిలి తృప్తి నొసంగె నను సంగతి అప్పుడప్పుడు కొన్ని సూచనలతో తెలిసికొందును. నా కప్పు డుప్పతిల్లు నుత్సాహము తరువాతి పాట పాడునప్పుడు తెల్లమగును. ధనరూపమునను, ద్రవ్యరూపమునను పొందెడు లాభముకంటె అభిమానముతో వెలువరచు శ్లాఘయే పెద్దలాభ మని తలచు నైజము మానవు లందరియందును కాననగును. చిన్నతనము నందు ఆ యభిప్రాయము నాయెడ నధికముగ నుండుటలో నాశ్చర్య మేదియు లేదు.

కళత్తూరిలో రామాయణపట్టాభిషేకము మిక్కిలి విశిష్టముగ నడచినది. రామయ్యంగారును, ఇతరులును నూరు వరహాలు (350 రూపాయలు) సేకరించి సమ్మానించిరి. అంతకు మును పెప్పుడును ఇరువది వరహాలు మాత్రమే సమ్మాన ముగ లభించుచువచ్చెను. ఆసారి మా నాయనగారు, మా పినతండ్రిగారు, నేను – ఈ మూవురము కలసి ప్రదర్శించిన సంగీతవైశారద్యమున్నగువాని వలనను, నా వివాహప్రయత్నమూలమునను సమ్మానము మిక్కుటముగ ప్రాప్తించెను. లబ్ధమైన 350 రూప్యములనుండి ఖర్చులకై 150 రూప్యములు పోగ మిగిలిన 200 రూప్యములు "వివాహసమయమున తీసికొందు"నని చెప్పి. రామయ్యంగారువద్దనే దాచియుంచిరి.

రామాయణప్రవచనము పూర్తియైన పిదప పలువురు 'నందనార్ చరిత్ర చెప్పు' డని మా తండ్రిగారి నడిగిరి. ఆ రోజులలో నందనార్ చరిత్ర అరవదేశ మంత టను బహుళప్రచారములో నుండినది. దాని రచయితయగు గోపాలకృష్ణభారతి యారు మా నాయనగారి మిత్రులైయుంట ఆ చరిత్రను మా తండ్రిగారు చక్కగ

చెప్పుదు రని యెల్లరును తెలిసికొనిరి. అం దున్న కీర్తనలను వాని రచయిత యమ ర్చిన స్వరకల్పన చొప్పుననే మా నాయనగారు పాడుదురు.

మిత్రుల కోరిక ననుసరించి నందనార్‌చరిత్ర యారంభింపబడెను. మా నాయనగారు శివభక్తిలో లీనులై యుండుట చేత ఆ చరిత్రయందు నిండి నిబిడమై యున్న భక్తిరసమును చక్కగ వ్యక్తపరచిరి.

అప్పుడు వచ్చి వినినవారిలో నొకడు 'చిదంబర ఉడైయార్'. వా రా యూరికి నుత్తరముగ నున్న 'మణవనత్తమ్' అను నూరిలో నివసించు ధనికులు; శివభక్తి పరిపూర్ణులు. ఎల్లప్పుడు విభూతిరుద్రాక్షలు ధరించియే యుందురు. పేదసాదుల మీద ప్రేమయు, అనుకంపయు గలవారు. పెరవారల దృష్టి నాకర్షించు మంచి దేహచ్ఛాయ గలవారు.

శివభక్తిసంపన్ను లగుటచేత నందనార్‌చరిత్ర యాకర్ణించుటలో మిక్కుటమగు నుత్సుకత వారి కుండినది. ఆ చరిత్ర యారంభించిన దినము మొదలుకొని ప్రతిదినమును విడువక వచ్చి విని పోవుచుండిరి. చరిత్ర జరుగుచుండగ కన్నీరు వెల్లువలు గట్ట, మేన పులకలు వొడమ ఆనందపారవశ్యమున నాలకింతురు. చిదంబర మాహాత్మ్యమును, ఆ దివ్యస్థలమునకు పోవలె నని బెంగగొనియున్న నందనారుభక్తి దార్ఢ్యమును వినగ వినగ వారే నందనారై పోవ దొడగిరి. ఎల్లప్పుడును 'చిదంబరము' 'చిదంబరము' అని యుచ్చరించుచునే యుందురు.

# 11. నా వివాహము

మా నాయనగారు నడుమ నడుమ 'పిల్ల'ను చూచుటకై బంధువు లున్న పొరుగూరులకు వెళ్లి విచారించి వత్తురు. నేనును మా తల్లిగారును కళత్తూరిలో నుంటిమి. నే నలవాటుచొప్పున తమిళగ్రంథముల చదువుకొనుచునే యుంటిని. "మనకు తగిన యాచార్యు లొక్కరైనను దొరకలేదే!' అను తలపు నా కేర్పడి దినములు గడవ గడవ నతిశయిల్లినది.

ఎక్క డెక్కడో వెదకినవెనుక కడపట మా యూరి ప్రక్కనున్న 'మాళా -

పురము'నందు ఒక కన్యను చూచి, జాతకము పొందికగ నుండుట తెలిసి, నిశ్చ యించి మా నాయనగారు మాకు తెలియజేసిరి. 'మాళాపురము'నందు మాకు పరం పరానుగతముగ బంధువులగు 'గణపతి అయ్యరు' అనువారి కొమార్తె 'మధురాం బిక' అను కన్యకను నాకు పెండ్లిచేయ తీర్మానించుకొనిరి.

వివాహపు ఖర్చులకై రెండు వందలరూపాయలును, 'పెండ్లిచీర' చిన్నచీరలు మున్నగువానికై ముప్పదియైదు రూపాయలును ఆభరణములకై నూట యేబదియు, మా నాయనగారు గణపతి అయ్యరువద్ద నిచ్చునట్లు వాగ్దానము చేసిరి. మరియు, గృహప్రవేశము మున్నగువానికిని ఖర్చుకై పైకము కావలసి యుండెను. తమ చేతనున్న ధనమును, చేయవలసి యున్న ఖర్చును లెక్కపెట్టి చూడగ ఇంకను నూటయేబది రూప్యము లున్నచో కష్టము లేకుండు నని మా నాయనగారికి తోచినది. తరువాత 'మణవనత్తము'నకు బోయి, చిదంబర ఉడైయారును గాంచి, ఈ విష యము ప్రస్తావించిరి. నా పెండ్లి నిశ్చయమైన దని తెలిసి సంతసించుటయే గాక "డబ్బునుగురించి మీ రేల దిగులుపడవలయును? శ్రీనటరాజస్వామివారి దివ్య కృపాపాత్రులైన మీ కేది లభింపదు?" అని పలికి నాయనగారిని తమ నిమ్మ తోటకు పిలుచుకొనిపోయిరి. వారు తమ యొడిలో నుంచుకొనిన పోకచెక్కల సంచి వెలికి తీసిరి. అందుండి వందరూపాయ లెత్తి యిచ్చి "దీని నుంచుకొనుడు. ముహూర్తమప్పుడు ఏబది రూపాయ లిత్తును. ఇంకను కావలసియున్నను ఇత్తును" అని చెప్పిరి. దానిని పుచ్చుకొని "పెండ్లికి వచ్చియుండి, విశిష్టత చేకూర్చు" డని వారితో మా నాయనగా రనిరి. "అవశ్యము వత్తును. మా నాయనగారి శ్రాద్ధము వచ్చుచున్నది, అది జరిపించి బయలుదేరి రాగలను. వచ్చునపుడు పైకమును కూడ తెత్తును" అని ఉడయార్ వీడ్కొనిరి.

మా తండ్రిగారు నన్ను, మా తల్లిగారిని కళత్తూరునుండి పిలుచుకొని ఉత్తమ దానపురము వచ్చి చేరిరి.

వివాహమునకు కావలసిన సంవిధానము లన్నియు మాళాపురమునందు సాగి పోవుచుండినవి. బంధుజనులు బహుజనపదములనుండి వచ్చి చేరుచుండిరి. రైలు వేగము, బస్సువేగమును చూచి యెరుగని యా రోజులలో వివాహపు ఏర్పాట్లు త్వరలో కొనసాగవు. మెల మెల్లగనే యగును. పెండ్లికి ఒక నెల ముందునుండియే

చేయవలసిన పను లారంభింతురు. ఒక నెలకు పైబడి కుటుంబమంతయు వివాహ కార్యనిర్వహణమునందు మునిగిపోవును.

నా కప్పుడు పదునాల్గవ యేడు నడచుచుండినది. పెండ్లికూతురువయస్సు ఎనిమి దేండ్లు. పెండ్లికూతును పెండ్లికి ముందు పెండ్లికొడుకు చూచుట యను నల వాటే ఆ కాలమున సాధారణముగ లేదు. పెద్దలే యంతయు చూచి నిర్ణయింతురు. నేను వధువును సాధారణదృష్టితో చూచియుంటినే గాని పరిచయము చేసికొనలేదు; ముచ్చటించియు నుండలేదు. మా యిరువురికిని ఈ వివాహ మొక వినోదప్రదర్శన ముగనే తోచెను. మాకు కలిగిన సంతోషమునకంటె నధికమగు సంతోషము మ మ్మాడించి, వినోదించి, విం దారగించిన యతిథులకే కలిగెను.

విభవ సంవత్సరము 'ఆని'నెల 4 వ తేది (16-6-1868) నా వివాహము జరిగెను. నాటి రాత్రి మఱవనత్తం చిదంబర ఉడయారు గుఱ్ఱ మెక్కి వచ్చి చేరిరి. వారు వివాహమునకు ముందు రోజే వచ్చియుండెడివారు. వారి నాయనగారి శ్రాద్ధము ఆ రోజు వచ్చియుండుట చేత దానిని నెరవేర్చుకొని వివాహమునాడు ప్రొద్దున బయలుదేరి రాత్రి మాళాపురము వచ్చిరి. వచ్చిన వెంటనే మా నాయనగారిని చూచి ముందు తాము వాగ్దాన మొనర్చిన చొప్పున ఏబది రూపాయ లిచ్చిరి. తగిన సమయ మున వారు చేసిన యుపకారమును పొంది మా నాయనగారు మిక్కుటమగు కృత జ్ఞత తెలియజేసిరి.

వారు గుఱ్ఱము స్వారీ చేయుచు వచ్చి దిగినపుడు వారు గొప్ప ధనవంతు లని వివాహమునకు వచ్చియున్నవారు తెలిసికొనిరి. వారు గల్లుగల్లుమను సవ్వడితో రూప్యముల నెత్తి యిచ్చినపుడు అందరు నక్కజపడిరి. మా నాయనగారు పెద్ద పలుకుబడి గలవా రను నభిప్రాయము వారి కప్పు డుదయించెను.

పెండ్లి నాలుగు దినములు గడచినవి. ఐదవ రోజు సాయంకాలమున ఉత్తమ దానపురమున మా యింట గృహప్రవేశము వైభవోపేతముగ నెరవేరినది. గృహ ప్రవేశవైభవము వివాహవైభవమును మించియుండినది. "ఊరు వదలిపోయినందున వీరికి సౌకర్యము లధికమయినవే కాని కొదవ యేమియు లేదు" అను నభిప్రాయము ఊరివారి కేర్పడెను.

నేను గృహస్థుడ నైనందున నాయందు క్రొత్త యభివృద్ధి యేదియు ఏర్పడి నట్లు తెలియలేదు. పెండ్లియందును, ధనాదాయమందును, గ్రామప్రయాణము

లందుసు నాకు లాభ మున్నటుల తోపలేదు. నా కొరకుఁ జే లక్ష్యము. ద్రావిడ భాషయే నా సంపద. అదియే నా విజ్ఞానబుభుక్షకు ఆహారము! ఎంత కెంత నేను దాని ననున్యూతముగ వృద్ధి చేసికొని వత్తునో అంత కంత నా కుత్సాహమును, మంచి పని చేసితి మను తృప్తియు, లాభము పొందితి మను భావమును ఏర్పడినవి. ఆనాటినుండి నేటికిని ఈ స్థితి మారలేదు.

కళత్తూరిలో నుండినపుడు వచ్చిన ధాన్యములందు సజ్జ మొదలగునవి హెచ్చు గను, వడ్లు తక్కువగను ఉండినవి. సజ్జ మొదలగువాని నిచ్చి మారుగ వడ్లు పుచ్చు కొనుట యలవాటు. ఒక్క దినమున మా యమ్మగారు భోజనము చేయునపుడు నేను గమనించితిని. వారి విస్తరిలో నున్న ఆహారము క్రొత్తగ తోచినది. వారు సజ్జ యన్నము భుజించుచుండిరి. వరి యదుద్దై యుండుట నెరిగిన వారు నాకును మా నాయనగారికిని వరియన్నము నిడి, తాముమాత్రము సజ్జయన్నము కొన్నా ళ్లుగ తినుచున్నా రని తెలియవచ్చెను.

"ఏ మమ్మా, ఇట్లొనర్చు చున్నావు?" అని నే నడిగితిని.

"సజ్జ దేహమునకు మంచిదే కదా? దానిని వరికై మార్చు టేల అని తలచి యిట్లు చేయుచున్నాను."

"అట్లైనచో మాకు మాత్రము వరియన్న మేల యిడుచున్నావు?"

మా తల్లిగారికి ప్రత్యుత్తర మీయ త్రోవలేదు. అటుపై నా ప్రార్థన మన్నించి వారును మావలెనే వరియన్నము తిన నారంభించిరి.

'ఐప్పశి' నెల దీపావళి వచ్చినది. నాకు తొలి దీపావళి యగుటచే మా మామ గారి పిలుపుపై నేనును, మాతల్లిదండ్రులును ఉత్తమదానపురమునకు చనినాము. మామాపురమందు దీపావళి పండుగ నడచినది. అంతలో ఆరవనెల దీక్షయు జరిగి నది. దీపావళికై ఏడురూపాయలకు సరిగంచు బట్టయు, ఆరు నెలల దీక్షకై పదు నాలుగు రూపాయలును లభించినవి. అంతకు మునుపు చేతికి వెండి కడియమే తొడిగి కొనియుంటిని, మా తల్లిగారి యిష్టానుసారము ఆ పదునాలుగు రూపాయలకు వెండి గొలుసు చేయించి నాకు తొడిగించిరి. దీపావళియైన పిదప మా నాయనగారికి జ్వరము వచ్చినందున ఆరునెలలకాలము ఉత్తమదానపురమందే ఉండవలసి వచ్చెను.

# 12. ఆశ - నిరాశ

ఒక దినము నేనును మా నాయనగారును ఒక కార్యార్థమై కుంబకోణమునకు పోయియుంటిమి. అచట వకీలగు 'వెంకటరావు' అనువారు మా నాయనగారికి మిత్రులై యుండుటచేత వారి యింటికే పోగితిమి. నన్నుగురించి వారు విచారించిరి. "వీడు అరవము చదువుచున్నాడు. సంగీతమును అభ్యసించుచున్నాడు. ఎవ్వరియొద్దనైనను ఉండి యరవము నేర్చుకొనవలె నని ఆసపడుచున్నాడు. ఇచ్చట నున్న 'త్యాగరాజచెట్టియారు' ఒక పెద్ద విద్వాంసు లని వినియున్నాము. వారియెడ చదువవలె నని వీ డభిలషించుచున్నాడు" అని మా తండ్రిగారు చెప్పి నేను వ్రాసిన కొన్ని పద్యములు చదివి చూపునట్లు చేసిరి.

వానిని వినిన వెంకటరావు "బాగుగనేయున్నవి. అయినను ఈ రోజులలో వీని వలన ప్రయోజన మేమి? ఎందులకై యింత శ్రమపడవలయును? దీనిని వదలి ఇంగ్లీషు చదువు మని చెప్పుడు. నేను సహాయ మొనర్తును. నా మిత్రులనుగూడ సహాయము చేయు డని కోరెదను. ఇంకను కొన్ని యేండ్లకు ఇతడు అభివృద్ధికి వచ్చును" అనిరి.

నాకు వారు నుడివిన మాటలు సంతోషము కలిగింపలేదు. వారు, నాయెడ నున్న ప్రేమచేతనే ఆ విధముగ చెప్పినా రని తలచిచూడ నా మన స్సవకాశ మీయ లేదు. వారియెడ నాకు కోపమే వచ్చినది. "త్యాగరాజచెట్టియారువద్ద చదువుకొనుట కుపాయ మడుగగ వీరు 'ఇంగ్లీషు చదువు' మని యుపదేశించుచున్నారు. నా కింగ్లీషును వలదు; దానివలన లభించు నుద్యోగమును వలదు" అని నేను చింతించితిని.

మా నాయనగారు "ఇంతకు మునుపే వీడు ఇంగ్లీషు చదువ ప్రయత్నించి నాడు. తెలుగుకూడ చదివినాడు. కాని దేనిమీదను వీని బుద్ధి పోలేదు. అరవము చదువుటయందే వీనికి ఆశయు, అభినివేశమును ఉన్నవి. వేరుమార్గమందు వీని బుద్ధిని

మరల్చుట సాధ్యమని తోచుటలేదు." అని చెప్పి సెలవు పుచ్చుకొని నాతోకూడ ఉత్తమదానపురమునకు వచ్చివేసిరి.

కొన్నాళ్లకు తరవాత కున్నమునకు వచ్చి చేరితిమి. మా నాయనగారు యథాపూర్వముగ కాలక్షేపము చేయుచు వచ్చిరి. నాకు మునుపటి యుత్సాహము కొలది కొలదిగ తగ్గుచు వచ్చినది. చదివిన ప్రాత పుస్తకములే మరల మరల చదువు చుంటిని. ఐనను తృప్తి కలుగలేదు. నూతనప్రయత్నమునకు త్రోవ లేదు. ఇట్లుండ నొకనాడు 'పెరుంబులియూరు'కు చెందిన 'అరుంబావూరు'లో నుండిన 'నాట్టారు' అను ఒక పెద్ద ధనికులు అరియలూరుకు పోవు మార్గమున కున్నమందు మా యింట విడిసిరి. వారు శ్రీ మీనాక్షిసుందరంపిళ్లై"గారి మిత్రులు. తమిళ మభ్యసించినవారు.

వారు నాతో మాటాడునపుడు నాకు తమిళముమీద నున్న యాస తెలిసికొనిరి. పిళ్లైగారి గొప్పతనమును వారు పలువిధములుగ వివరించి చెప్పిరి. మానాయనగారి నుద్దేశించి "తమిళమున నింత యభిమానమున్న మీకుమారుని వ్యర్థముగ ఈ కుగ్రామమున ఏల నుంచినారు? పిళ్లైగారియెడకు గొనిపోయి చేర్చినచో వీరు బాగుగ వృద్ధికి వత్తురే! ఇట్లే యున్నచో వీరు దిగులుపడి యెందుకును కొరగానివా రౌదురు. ఇట్లే యుంచుట నాకు తృప్తిగ లేదు" అనిరి.

వారియొద్దకు పిలుచుకొని పోయినచో వారు పాఠములు చెప్పుదురు - అను నమ్మక మెట్లు?" అని నాయనగా రడిగిరి.

"ఏమి యి ట్లడుగుచున్నారు! వారియొద్ద ఎందరో నేర్చుకొనుచున్నారు! ఎందరో పాఠములు విని యుచ్చదశకు వచ్చియున్నారు! పాఠములు చెప్పుటవలె వారి కిష్టమైన పని వే రొండు లేదు. ఇప్పుడు వారు నాగపట్టణమున స్థలపురాణమును వ్రాసి 'పరిషదామోదము' పొందుచున్నారు. నేను పోయి ఒక నెల యుండి వచ్చితిని. వారి యొద్ద నెల్లప్పుడును కొందరు విద్యార్థులు పాఠములు వినుచునే యుందురు.

"అది యంతయు సరియే. అయినను వీని నొంటరిగ పంపుటకు నా మనసు సాహసింపలేకున్నది. ఇంతమాత్రమే కాక, వారియొద్దకు వెళ్లియున్నచో భోజనము మున్నగు సౌకర్యములకు విత్తము కావలయును. ఇటీవలనే వీనికి పెండ్లి

యైనది. దానికై యధికముగ ధనము వ్యయమైనది. ఇట్లుండగ పై పైన ధనము వెచ్చింప నాకు సాధ్యమగునా ?" అనినారు మా నాయనగారు.

"ఏమో, నాకు తోచినది నేను చెప్పితిని. పిళ్లెగారుతప్ప వీరికి తృప్తి కలుగునట్లు పాఠము చెప్పగలవారు వే రెవ్వరును లేరు. యోచించుకొని చేయుడు" అని నుడివి వారు సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి.

ఇట్లే మరి కొందరును పిళ్లెగారి గుణసంపత్తిని, వైదుష్య వైశిష్ట్యమును మాయెడ చెప్పుచుండిరి. అందుచే నాకు ఆ పండితశిఖామణిని గూర్చిన ధ్యానమే పెద్దదైనది. భగవంతుని దివ్యకృప కలసివచ్చునేమో యని యుత్కంఠితుడనై యుంటిని.

ఒక దినము ప్రాతఃకాలమున తిరువిళైయాడల్ పురాణమును చదువుదమని యెత్తికొంటిని. అప్పుడు మిక్కిలి నలిగి యలసియున్న నాయుల్లమున నొక తలపు పొడమెను. "ఈ పుస్తకమందు దారము (గుర్తు) పెట్టి చూతము" అని తలచి యట్లే యొనర్చితి. రామాయణము. తిరువిళైయాడల్ పురాణము మొదలగు గ్రంథములందు వే రొకరిచే దారము (గుర్తు) పెట్టించి తెరచి, ఆ పుటయందు క్రింది భాగమున నున్న పద్యమును చూచి దాని యర్థపు పోబడినిబట్టి. అది మంచి భావము కలదేని తమ యభిలాష నెరవేరు ననియు, అట్లు కాకున్న నెరవేర దనియు నిర్ణయించుట ఒక సంప్రదాయము.

నేను ఒక పిల్లవానిని పిలుచుకొని వచ్చి దారము పెట్టించి పుస్తకము విప్పితిని. "వేదమునకు అర్థము చెప్పిన పటలము" అనునది ఆ విభాగము. కొందరు మునులు వేదార్థము తెలియక వ్యాముగ్ధులై అక్కడ విచ్చేసియుండు దక్షిణామూర్తికి మ్రొక్కులిడి, తపస్సుచేయ ఆ స్వామి విచ్చేసి వేదార్థమును వివరించి యనుగ్రహించి రని యా పటలములోని చరిత్ర. నేను విప్పిచూచిన పుటలో దక్షిణామూర్తి ఒక దివ్యసుందరవిగ్రహముతో విచ్చేయుటను వర్ణించు పద్యము లుండినవి. ఈ పుట యడుగున నున్న పద్యమును నే చూచితిని.

నా మనోరథ మీడేరునో, ఈడేరదో అను భయముతోడ నేను మెలమెల్లగ పుస్తకము విప్పితిని. విప్పునపుడే నా గుండె దడదడ కొట్టుకొనెను."మంచి పద్యము రావలయునే" అను దిగులుతో ఆ పుట చూచితిని.

పద్యమును కాంచితినో, లేదో నా మేను గగుర్పొడిచెను. నా కన్నుల నీరు నిండెను. మిగుల మంచి శకునమైనది. ఒక గురువును వెదకుచుండిన నాకు, దక్షిణామూర్తియే గురుమూర్తియై స్పష్టముగ బోధసేయు పద్యము దొరకగ నా మదిని పొంగిపొరలెడు ఉత్సాహమునకు ఎల్ల యేమున్నది? "భగవంతు డెట్లయినను చేవిడువడు" అను నమ్మకము కల్గెను. "మధురమీనాక్షీ సుందరస్వామి మనల ననుగ్రహించిరి. నాకును ఆ భగవంతుని దివ్యనామముగల తమిళోపాధ్యాయులు లభింతురు" అను దృఢాభిప్రాయ మేర్పడెను. మా నాయనగారి పూజలోనున్న మూర్తియు శ్రీ మీనాక్షీసుందరస్వామియే అను తలపు కలిగి మహానంద మొదవెను. సంతోషమును, నూతనోత్సాహమును పొందితిని. ఈ సంభవమును తండ్రిగారికి నివేదించితిని. వారును మిక్కిలి యానందించిరి.

"వారియొద్దకు ఎట్లు పోయి చేరుట? ఖర్చు కేమి చేయుట? ఒంటరిగ నుండుట సాధ్యమా?" అను ప్రశ్నలు తలనూపి భయపెట్టుచున్నను, తిరువిళైయాడల్ పురాణమందలి పద్యపు దృశ్యము ఆ భయమును తలయెత్తకుండ నణచివైచెను. సూర్యోదయము నెదురుచూచు కోడిపుంజువలె శుభముహూర్తము ప్రతీక్షించుచు కాలము పుచ్చుచుంటిని.

కున్నమునందు మేము వసించియున్న ఇంటి ఖామందులగు రామయ్యంగారు నా పరిస్థితి తెలిసి మిక్కిలి జాలిపడిరి. తరువాత నొకనాడు మా నాయనగారిని చూచి "వీనిని 'శెంగణం చిన్నప్పణ్ణై వృద్ధాచలరెడ్డియారు' వద్దకు గొనిపోయి చేర్చినచో వారు పాఠములు చెప్పుదురే?" అని పలికిరి.

"వృద్ధాచలరెడ్డియా రనువా రెవరు?" అని మా నాయనగా రడిగిరి.

"వారు 'శెంగణము' నందున్న గొప్ప ధనికులు, ఉదారులు, అరవవిద్వాంసులు. లక్ష్య లక్షణ గ్రంథములు బాగుగ పాఠము చెప్పెడు సామర్థ్యముగల భాగ్యవంతులు."

"వారి యొద్దకు పోయియున్నచో భోజనాదివసతు లెట్లు?"

"మీరు కుటుంబముతోడ నరిగి అచ్చట నుండవచ్చును. వారే మీకు వలయు సౌకర్యము లన్నియు సమకూర్తురు. నేను మిమ్ము పిలుచుకొనిపోయి వారియొద్ద చేర్చెదను. వారు నా మిత్రులు" అని రామయ్యంగారు చెప్పిరి. వా రింకను వృద్ధాచల రెడ్డియారుగుణాతిశయములు వర్ణించిరి.

వారు నన్నును మా తండ్రిగారిని పిలుచుకొనిపోయి శెంగణము చేరిరి. మా యమ్మగారు కున్నమం దుండిరి. నన్ను శెంగణంరెడ్డియారువద్ద అప్పగించి నా స్వభావమును గూర్చి యిట్లుచెప్పిరి : "వీ డుత్తమ గ్రంథములు చదువునట్లు చేయ వలెను. వీ డదే లక్ష్యముగ నున్నాడు. వేరు దేనిమీదను వీని బుద్ధి పోలేదు. అంత మాత్రమే గాక చదువుకొనుచుండువరకు ఇతని కుటుంబమును కాపాడవలయును" అని ప్రార్థించిరి. రెడ్డిగా రట్లే చేయ ఒప్పుకొనిరి.

రెడ్డియారు నన్ను చూచి "ఏ యే గ్రంథములు మీరు చదివితిరి?" అని ప్రశ్నించిరి. నేను ఈ యీ గ్రంథములు వీరి వీరి యొద్ద పాఠము వింటిని అని చెప్పి, "నేను ఈ గ్రంథములు చదివియున్నను నాకు నిర్దుష్టమైన జ్ఞాన మేర్పడలేదు. అన్ని లోటుపాట్లను తామే సవరింపవలెను." అని యడిగికొంటిని. వారు చిరునవ్వుతో "అట్లే కానిమ్ము" అనిరి.

అటు పిమ్మట "మీరు నన్నూల్ 'కాండిగై' వ్యాఖ్యానమును చదివియున్నచో అక్షర పద లక్షణములు ఒక విధముగ తెలిసియుండును. ఈ జ్ఞానమే పై గ్రంథములు చదువుటకు చాలును. తరువాత ఛందోలక్షణములు తెలిసికొనుట యావశ్యకము. అందువలన ముందుగ 'యాప్పరుంగలక్కారికై' అను ఛందశ్శాస్త్రగ్రంథమును పాఠము చెప్పుదును. అటుపై సౌకర్యానుసారము చూచుకొనవచ్చును." అని చెప్పి, మా నాయనగారిని చూచి "మీరు కుటుంబముతోడ నిటకే వచ్చివేయుడు" అనిరి. మా నాయనగారికిని, నాకును హర్షాతిరేకమున నుల్లము లుప్పొంగినవి. ఎల్లరము రెడ్డియారువద్ద సెలవు పుచ్చుకొని కున్నమునకు వచ్చితిమి. మా తండ్రిగారు మా యమ్మగారిని నన్నును పిలుచుకొని శెంగణమునకు ఒక మంచిరోజున వచ్చిరి. మధ్యకాలమున నిలిచిపోయిన తమిళము నేర్చుకొను మార్గమున నేను మరల నడుగిడితిని.

మంచివేళ 'కారిక' చదువ నారంభించితిని. ఛందోలక్షణమునుగురించి యేమియు నెరుగని స్థితిలో నుంటిని. దానిని నాకు కరపుట కష్టసాధ్యమైన పనియే. ఐనను రెడ్డియారు సుస్పష్టముగ నాకు కరపిరి. వారి జ్ఞానము, నా యుత్కంఠయు చేరి ఆ నా జ్ఞానమునకు కారణములైనవి.

నేను పాఠములు విన నారంభించినది శుక్ల సంవత్సరము (1869) 'మార్గళి' నెల. వేకువజామున నాలుగు గంటలకే వారు నన్ను లేపుదురు. 'నిఘంటువాచకము'

నందలి 'తిరువెంబావై' చదివింతురు. ముందు రోజున జరిగిన పాఠములు మరల చెప్పి, ప్రశ్నలు వేసి నా మనసున పాదుకొనునట్లు చేయుదురు. ఆ ప్రశ్నలు నాకు మిగుల నుపయోగకారులుగ నుండినవి. పాఠము చదివినవా రెంతదూరము గ్రహించికొనినా రనునది యెరుగకయే అనుస్యూతముగ పాఠము చెప్పుచు పోయినచో ప్రయోజన మేమియు లేదని వా రెరుగుదురు. వినిన పాఠము 'చింతన' చేయించి, అడుగడుగున ప్రశ్న లడుగుటచేత నేర్పిన పాఠము దృఢపడును.

రెడ్డియారు పాఠములు చెప్పెడు కాలమున నడుమ నడుమ తమకు తెలిసిన విద్వాంసులగూర్చియు ప్రస్తావించుచుందురు. కుంబకోణముకాలేజిలో తమిళ పండితులుగ నుండిన త్యాగరాజచెట్టియారును చూచినట్లును, వారు గొప్ప లక్షణ శాస్త్రజ్ఞు లనియు చెప్పిరి. శ్రీ మీనాక్షిసుందరంపిళ్లెగారిని గురించి వా రడుగడుగునను చెప్పుచుందురు. 'తిరుక్కుఱళ్' మున్నగు గ్రంథములందుగల వారి 'శిరప్పుపాయిరమ్' అను ప్రశంసాపద్యములలోని నయగారము లెత్తి చూపి కొనియాడుదురు. "ఆ మహానుభావుల నేను చూడలేదు. కాని వారి గొప్పదనము విని యున్నాను. వారు కావేరీప్రవాహమువలె కవిత్వము చెప్పుదు రట. ఎల్లప్పుడును శిష్యమండలిమధ్యనే విరాజిల్లుచుందు రట. వా రెరుగని తమిళపుస్తకమే లే దట. నాకు కొన్ని గ్రంథములందును, వ్యాఖ్యానములందును సందేహము లున్నవి. వానినన్నింటిని వారియొద్ద తీర్చుకొనుటకై ప్రత్యేకముగ గుర్తించి యుంచితిని. ఎప్పుడు సందర్భపడునో తెలియదు." అని చెప్పి తమ సందేహములు గుర్తించి వ్రాసి యుంచిన తాళపత్రములను నాకు చూపిరి.

ఇట్లు పిళ్లెగారినిగూర్చిన ప్రస్తావము వచ్చు సందర్భముల నే నాశతో విందును. ఇంకను సంగతులు విచారింతును. నేను వారియొద్ద చదువుకొనవలె నని సంకల్పించుకొనుటయు, 'తిరువిళైయాడల్ పురాణము'న నూలు పెట్టించి చూచుటయు చెప్పియుంటిని. ఇద్దరము పిళ్లెగారినిగురించిన ప్రసంగమున పెద్దకాలము పుత్తుము. రెడ్డిగారును "ఔను, వారియొద్దకు పోయిననే మీ రింకను పలు గ్రంథములు చదువుకొనవచ్చును. మీకు తృప్తి కలుగునట్లు పాఠము చెప్పగల పెద్దలు వా రొక్కరే. మే మెల్లరము మెట్టపొలములందు వానచే నీ రూరు బావులము. వారు ఎల్లప్పుడును ఎండిపోక పరువులెత్తు కావేరీప్రవాహమువంటి వారు. వారియెడకు జని చదువుటయే లెస్స" అని చెప్ప నారంభించిరి. పలువురియెడ నిట్టి భావముగల

మాటలే విని విని యుత్సుకుడనైన నాకు రెడ్డిగారి మాటలు ఇంకను దార్ఢ్యము కలిగించినవి.

రెడ్డిగారు నాతో నని యంతటితో నిలువక మా తండ్రిగారియొద్దను ఈ భావము వ్యక్తపరచిరి. "నాకు సాధ్యపడునంతవరకు నేర్పితిని. ఇంకను చదివి ఫలము పొందవలె నన్న పిళ్లెగారియొద్ద వీరిని చేర్పించి చదివించుటయే బాగు. మి మ్మాదరింప నుపాయము లేక ఇట్లు చెప్పుచున్నా నని మీరు కొంచెమేని తలప వలదు. మీ రెన్ని సంవత్సరము లుండినను నాకు కష్టములేదు. భగవంతుడనుగ్రహిం-చినదానితో నాకు సాధ్యమగునంతవరకు ఆదరించుచున్నాను. వీరివలన నాకు శ్రమ కలుగు నని నే నెంతు ననియు తలపబోకుడు. వీరికి పాఠము చెప్పుటయు, వీరితోడ ద్రావిడసాహిత్యగోష్ఠిలో ప్రొద్దు పుచ్చుటయు వాస్తవమున నాకు మితిలేని తృప్తి నిచ్చుచున్నవి. ఎప్పుడు నిట్లే యుండ వచ్చును. కాని. నా కికమీదట జీవితమున కావలసిన దేదియు లేదు. వీ రికమీదటనే ముందుకు వచ్చి ప్రకాశింప వలెను.తగిన చోట నుండి పాఠము విన్నచో వీ రభివృద్ధి పొందుదు రనుటలో అడ్డు లేదు. వీరిని పంపించుటకును నాకు విచారముగనే యున్నది. నా విచారమును మాత్రమే యుద్దేశించి వీరి యభివృద్ధికి అడ్డు తగులుట పాపము కాదా ?" అని పలికి, మరియు పెక్కు పర్యాయములు నొక్కి చెప్పిరి.

మా నాయనగారు వారు చెప్పిన దంతయు విని "ఎక్కడకు పోయినను ఎల్లరు ఈ తీర్మానమునకే వచ్చుచున్నారు. ఈశ్వరాజ్ఞ ఇదియే యని తోచు చున్నది. ఇకమీదట మనము పరాకుగ నుండకూడదు. ఎట్లైనను వీనిని పిళ్లె గారియొద్దకు కొనిపోయి చేర్చుటే యవశ్యకర్తవ్యము" అని నిర్ణయము చేసిరి. రెడ్డిగారియొద్దను తమ నిర్ణయము తెలియబరచి శెంగణము వదలి బయలుదేర సిద్ధమైరి.

# 13. గురూపసదనము

శెంగణమున మేము ప్రమోద (ప్రమోదూత) నామ సంవత్సరము 'పంగుని' మాసము వరకు (1871, మార్చి) ఉంటిమి. మహావిబుధులు మీనాక్షి సుందరం పిళ్లెగారు నాగపట్టణపురాణమునకు 'పరిషదామోదము' జరిపించి, ఆ పని పూర్తి చేసికొని నాగపట్నమునుండి మరల మాయూరమునకే వచ్చినా రని యచ్చట వింటిమి. ఆ పండితశ్రేష్ఠులయొద్ద చదవబోవుచున్నా మను తలంపు నా మనస్సులో నొక క్రొత్త సంచలనము కలిగించెను. వారినిగురించి నేను విని యున్న వార్త లన్నియు ఒక్కుమ్మడిగ నా స్మృతిపథమునకు వచ్చినవి. ఉత్తమ దానపురము పాఠశాలోపాధ్యాయులగు స్వామినాథయ్యరు మొదలుకొని శెంగ ణము పండితులగు రెడ్డిగారివరకును ఈ యెల్లరును అప్పుడప్పుడు చెప్పిన విషయ ములవలన నా హృదయములోపలనే పిళ్లెగారివంటి రూపమును సృష్టించి యుంచుకొంటిని. ఒజ్జల మేలుబంతి, కవుల తలమానికము, గానముల కడలి అని యెల్లవారును వారిని కొనియాడుదురు. వారు నాకు పాఠము చెప్పుచున్న ట్లును, నేను పలు గ్రంథములు వినుచున్నట్లును, వారు నాయెడ ప్రేమ చూపు చున్నట్లును భావించు కొందును; కలలు కాంచుటయు కలదు.

వృద్ధాచల రెడ్డియారు మొదలగువారియొద్ద యనుజ్ఞ వడసి శెంగణము నుండి యరియలూరు వచ్చి చేరితిమి.

నా ప్రథమాచార్యులగు శఠకోపయ్యంగారుతో నాకు లభింపబోవు భాగ్యమును నివేదించి వారి యాశీర్వాదమును పొంద సంకల్పించి, వారి యింటికి వెళ్లితిని. అప్పుడు వా రెచటికో వెళ్లియుండిరి. ఒక చోట ఒక క్రొత్త పుస్తక ముండినది. ఆ యింటిని నా సొంత యింటివలె భావించి యలవడినవాడను గాన ఆ పొత్తము నెత్తికొని చూచితిని. అది పిళ్లెగారు వ్రాసిన 'తిరునాగైక్కా-రోణప్పురాణము'గ నుండినది. నేను పిళ్లెగారి జ్ఞానమునుగురించి వినియున్నను వారు వ్రాసిన గ్రంథ మేదియు చూచియుండలేదు. ఆ సందర్భమున ఆ పురా ణము ప్రాప్తించుట యొక పెద్ద శుభనిమిత్తముగ తలచితిని. అందు ఒక్కొక్క పుటగ త్రోసి చూచితిని. కొన్ని పద్యములు చదివితిని. ఛందోలక్షణము చక్కగ

చదివి పూర్తి చేసిన సమయ మగుటచే ఆ పద్యముల సంధానము, యతి ప్రాస నయగారములను, శబ్దమాధుర్యమును తెలిసి యనుభవించి, యానందించితిని. ఈ గ్రంథమును, ఇట్టి పెక్కు గ్రంథములను రచించిన మహాపురుషునియొద్ద చదువబోవుచున్నాను - అని తలచి తలచి యెంతయు మురిసితిని.

ఆ పుస్తకము నుత్కంఠతో త్రిప్పి, త్రిప్పి చూచుచునే యుండగా "వెంకట రామా, ఎప్పుడు వచ్చినావు?" అని పలుకుచునే శఠకోపయ్యంగారు లోపలకు వచ్చిరి. వారిని చూచిన వెంటనే నమస్కరించితిని. పిదప నేను పిళ్లెగారియొద్ద చదువబోవనున్న సంగతి వారియొద్ద విన్నవించితిని.

"మంచి పని! వారు మహాకవులు; విశిష్టపండితులు; చాల పెద్దలు. వారి యొద్ద పాఠము వినుటకు మిక్కిలి పుణ్యము చేసి యుండవలెను. వారియొద్ద మనసు వక్రమార్గమున పోనీక నడచుకొని తమిళము నేర్చుకొనుము. నీ వెప్పుడు వారియెడకు పోవ నిశ్చయించుకొంటివో, అప్పుడే నీ కష్టము లన్నియు గట్టెక్కిన వని చెప్పుదును. చక్కగ చదివి గొప్ప విద్వాంసుడవుగ పొలుపారవలెను" అని యాశీర్వదించిరి.

"ఇది యంతయు తాము కుడువబెట్టిన ద్రావిడభాషామృతమువలన నేర్పడిన ప్రయోజనమే" అని వినయముతోడ ప్రత్యుత్తర మిచ్చితిని.

కొందరు మిత్రులు కోరిన విధమున మేము పది రోజులు అరియలూరిలో నిలిచి యుంటిమి. పిమ్మట ఉత్తమదానపురము పోయితిమి. ఉత్తమదానపురము నుండి అటుపై 'మాయూరము' పోవలసినదే. ఇట్టి స్థితిలో అంతవరకు నన్ను విడచి యుండని మా తల్లిదండ్రులు నే నొంటరిగ మాయూరమం దుండవలెనే అనుదానినిగూర్చి విచారపడ దొడగిరి.

మన కాలగతి యి ట్లున్నది. బిడ్డను వీడి నే నొంటరిగ నె ట్లుందును? వీనికి కావలసిన ఆహారమును అచట ప్రియమార నెవ్వారు చేసి పెట్టుదురు? వీనికి తన చేతులతో నభ్యంగము చేసికొనుటకూడా తెలియదే" అని మా తల్లిగారు చింతిల్లిరి.

"ఏమి చేయగలవారము? మన కాలవైషమ్య మి ట్లున్నది. ఇంతవరకును వాని చదువే ముఖ్య మని యెంచి, ఎటనెటకు పోయి యున్నచో వాని చదువు,

మన కాలక్షేపమును కొనసాగునో అచ్చు టచ్చటకు పోయి యుంటిమి. ఇప్పు డన్ననో మాయూరమునకు మనమును పోయి వసించుట సాధ్యమా? గ్రామవాసుల వలె నగరవాసులు మనల నాదరింపరే! ఇదియును గాక, అరియలూరుకు చుట్టును నున్నట్టి జనులు నాయం దభిమానముగలవారు. మాయూరమం దట్టివా రెవ్వ రున్నారు? వీనికి భోజనవసతి మున్నగునవి కలుగునా యని సందేహించుచున్నాను. వానికై కావలసిన యేర్పాట్లు చేయింప విత్తము కావలెను. డబ్బు కేమి చేయుదును?" అని తండ్రిగారు మథనపడిరి.

"ఈశ్వరసహాయ మున్న నన్నియు సమకూడును" అను విశ్వాసముకలవారు మా నాయనగారు. శివారాధన, మంత్రజపము మున్నగువానియెడ వారికి కడు నమ్మ కము. నాకు కొన్ని మంత్రములు తగువా రొక్కరిముఖమున ఉపదేశము చేయించిరి.

మాయూరముప్రయాణమునకు కావలసిన యేర్పాట్లన్నియు చేయ మొద లిడిరి. మా నాయనగారిచేత చిల్లిగవ్వయైన లేదు. దీని నెరిగి వారి మిత్రు లొకరు మార్గ వ్యయాదులకై ఇరువది యైదు రూప్యములు ఋణ మిచ్చిరి. ఆ మొత్త మప్పట్టున పెన్నిధిబోలె మిగుల నుపకరించినది. నా చదువుకు మూలాధారమై చెన్నారినది. ఉత్తమదానపురమందును, ఇరుగు పొరుగులను గల బంధువులయొద్ద నేను మాయూర మునకు పోవుచున్నా నని చెప్పి వీడ్కోలందితిని.

మా తల్లిగా రప్పుడు గర్భవతిగా నుండుటచే మా తండ్రిగారు, వారిని నన్నును తోడ్కొని సూర్యమూలకు జనిరి. మా తల్లిగారి నట వదలి, నేనును, మా నాయన గారును మాయూరము వచ్చి చేరితిమి. ఆ యూరిలో మహాదానవీథిలో మా పిన తండ్రిగారి యత్తవారింట విడిసితిమి. అప్పు డటకు మాపినతల్లిగారును వచ్చియుండిరి.

నాకు సంతోషాతిశయమున నిమేషనిమేషమునకును హృదయస్పందన మధిక మగుచుండెను. మా నాయనగారికో, రానురాను విచారసూచనలు ముఖమున గోచ రింప మొదలిడినవి. పెక్కు దినములుగా సంకల్పశతములతో ప్రతీక్షించి కన్నులు కాయలు కాచియున్న నాకు నొక మహాభాగ్యము ప్రాప్తము కానున్నదను తలంపు తల యెత్త నే నన్నిటిని మరచిపోయితిని. ఆ కాలమున గోపాలకృష్ణ భారతియారు మాయూర మున నుండిరి. ఆ వార్త నాకు తెలియును. వేరొక సందర్భమైనచో మాయూరమున నడుగిడినదే తడవుగ వెంటనే వెళ్లి వారి దర్శనము చేసికొని యుందును. మాయూర

మందలి మనోజ్ఞశివాలయమునకు పోయి స్వామిదర్శనము చేసికొని యుందును. ఆ నగరమందును, ఇరుగు పొరుగునను ఉన్న కమనీయదృశ్యములు చూచి యానందించియుందును. ఇప్పుడో నాకన్నులును, నా భావమును మరి వేరొక వస్తువుమీదకు పోలేదు.

తమిళదేశమున ఎనలేక వెలుగొందు నొక తమిళోపాధ్యాయుల శరణుజొచ్చి, ద్రావిడసాహిత్యసుధను తనివితీర గ్రోలి, గర్వించి యుందునుగదా! అను నాలోచనలో మునుపు పడిన పాట్లును, ఇకపై నేమి చేయవలె నను యోచనయు మరగిపోయినవి. ఒక్కొక్క క్షణ మొక్కొక్క యుగముగ గోచరించెను. పిళ్లైగారి సన్నిధి జేరి, వారిని కన్నులార గాంచి, వారి భాషణము విని, వారి శిష్యసముదాయమందు నొక్కడనుగా చేరునట్టి యా సదవకాశము నెదురుచూచుచు నిలిచియుంటిని.

మేము మాయూరమునకు ప్రొద్దున వచ్చి చేరితిమి. వెంటనే మా నాయనగారు స్నానాద్యనుష్ఠానములు చేసికొని భగవదారాధనము చేయ దొడంగిరి. మా తల్లిగారు లేని సమయములందు కావలసిన పనులు నేనే చేయుట యలవాటు. అట్లే ఆ నాడును చేసితిని. ఆనాటి పూజలో నాసుఖమయజీవితమునుగూర్చి వారు దేవుని ప్రార్థించి ద్రవీభూతచేతస్కులై యుందు రని తెలిసినది.

పూజకు పిదప భోజన మొనర్చితిమి. అటుపై నాయనగారు భుక్తాయాసము తీర్చుకొనుచుండిరి. తరువాత మధ్యాహ్నముమీదట మూడు గంటల వేళ నేనును, వారును పిళ్లైగారిని దర్శింప బయలుదేరితిమి. పోవు దారిలో శ్రీ మాయూరనాథుల యాలయ ముండుట చేత లోపల ప్రవేశించి స్వామిసన్నిధిని వందనాదు లాచరించుకొని మేగితిమి.

ఆ కాలమున పిళ్లైగారు మాయూరమునందు 'తిరువావడుదుఱై' అధీనమునకు చెందిన 'కట్టడమఠము' నకు చేరికగ పడమట నున్న యింటిలో నివసించుచుండిరి. మే మా యింటికి పోతిమి. అచ్చట ముం దున్న 'కట్టు'లో ఇద్ద రుండిరి.

"మహావిద్వాంసులు పిళ్లైగా రెచ్చట నున్నారు?" అని మా నాయనగా రొక్కరి నడిగిరి.

"ఈ యింటికి వెనుక నున్న తోటలో పని జరుగుచున్నందున పిళ్లైగారు అది గమనించుచు అచ్చటనే యున్నారు" అని ఆ మహాశయులు బదులు పల్కిరి.

అప్పు డచ్చటికి పిళ్లెగారి పాచకులు ఒకరు వచ్చిరి. వారియొద్ద నాయనగారు, మేము పిళ్లెగారిని దర్శింప వచ్చియున్నా మను వార్తను తెలియజేయు డని ప్రార్థించిరి. వా రట్లే పోయి చెప్పగ పిళ్లెగారే మే మున్న చోటికి వచ్చిరి.

ఆ పండితోత్తము లరుగుదెంచునపుడే వారియాకృతి నా కన్నుల నరికట్టినది. మత్తేభము మెల్లగా కదలి నడచివచ్చు చందమున వారు వచ్చిరి. చక్కగా ఏపుగా నున్న యాకృతియు సన్నని యుదరమును, మోకాళ్లవరకు వ్రేలుచున్న నిడుపైన భుజములును, విశాలఫాలమును, వెనుకవైపు నున్న చిన్న శిఖయు, నడుమునకు చుట్టుకొనిన పరుశుద్ధమైన తెల్లని యుడుపును వారిని తరతరములుగా భాగ్యవంతు లని చాటి చెప్పినవి. కాని వారి మోమున ధనవంతులకుండు 'పొంగు' లేదు. గంభీరమై విశాలమైన సముద్రము అల లడగియున్నట్లు పరమప్రశాంతియే తోచినది. నేత్రము లందు దేనినిగాని చొచ్చి చూచెడు చూపు లేదు, అలక్ష్యమైన చూపును లేదు. తమ యెదుట నున్న వస్తువులను మెలమెల్లగ చల్లగ చూచు చూపే యుండినది.

వారి నడకలో ప్రశాంతియు, జీవితరంగమున గాయపడి సంస్కృతిగన్న శైథిల్యమును ఉండినవి. వారి యాకారమున ఉత్సాహము లేదు, పాలుమాలికయు లేదు, ఆత్రమునులేదు. అలుపును లేదు. వారి వక్షస్థలమున రుద్రాక్షకంఠిక ప్రకాశించుచుండెను.

ఎన్నో నాళ్లగ తపస్సు చేసి దైవసాక్షాత్కారమునకై వేచియున్న ఉపాసకుని వలె నే నుంటిని. వానికి దర్శనమిచ్చు దేవతవలె వా రుండిరి. నా కన్నులు వారిమీదనే వ్రాలినవి. నా హృదయమున ఉత్సాహము పొంగి పొరలి తరగ లెత్తినది. తత్ఫలితముగ ఆనందభాష్పములు దొరలినవి. అట్టి బాష్పబిందువులు ఎడనెడ యా విబుధశేఖరుల యాకృతిని మరుగుపరచినవి. చుట్టు నున్న యన్నిటిని వదలిపెట్టి వారి దివ్య విగ్రహమందే తారాడిన నా కన్నులు వారి మోమునందే సంసక్తము లాయెను.

వారు వచ్చిన వెంటనే నిలువబడియున్న మమ్ము కూర్చొను డని చెప్పిరి. ఆకంఠధ్వనియందును ప్రశాంతియే నాకు గోచరించెను. అన్నియు శాంతిమయముగ నుండినవి. వారును ఉపవిష్టులైరి. మా నాయనగారిని చూచి "మీ రెవ్వరు? వచ్చిన పని యేమి?" అని విచారించిరి. ఆ మాటలు ప్రేమసమ్మిశ్రితములై వెలువడినవి.

"మేము పాపనాశనముప్రక్కనున్న యుత్తమదానపురమునుండి వచ్చు చున్నాము. మిమ్ము చూచుటకే వచ్చితిమి. వీడు నా కుమారుడు, తమిళము నేర్చు

చున్నాడు. కొందరియెడ పాఠములు వినియున్నాడు. సంగీతము నభ్యసించియున్నాడు. తమయెడ పాఠములు వినవలెనని మిక్కిలి యాసగొని యున్నాడు. తమిళము తప్ప మరి దేనియందును వీని బుద్ధి ప్రసరింపలేదు. ఎల్లప్పుడును తమ్మే తలంచుచున్నాడు. కావున తమయెడ శరణుజొచ్చిన వీని నప్పగించి పోవ వచ్చినాడను."

"మీ పేరేమి?"

"నాపేరు వెంకటసుబ్బ డందురు. వీని పేరు వేంకటరాముడు" అని మానాయనగారు చెప్పిరి.

"వెంకటసుబ్బ డనునది మంచిపేరు. వేంకటసుబ్రహ్మణ్యము అనుదాని వికృతి యది. శ్రీవేంకటాచలమందు సుబ్రహ్మణ్యస్వామి వసించియుండిరి అనుటకు ఈ యలవా టొక తార్కాణ."

వారి భాషణమందు ఒక యసాధారణమాధుర్యము నే ననుభవించితిని. "సాధారణముగ మాటాడునపుడే 'అపురూప'మగు విషయము వెలివచ్చుచున్నది గదా!" అని నే నచ్చెరు వొందితిని.

పిదప పిళ్లెగారు నన్ను చూచి "మీ రెవ్వరెవ్వరియొద్ద నేయే గ్రంథములు పాఠము వినియున్నారు?" అని యడిగిరి. నేను మెల్లగ నా చరిత్ర చెప్పితిని. శఠకోప అయ్యంగారువద్ద చదివినది మొదలు శెంగణం వృద్ధాచలరెడ్డియారువద్ద కారిక పాఠము నేర్చుటవరకు వివరించి చెప్పితిని.

"వీరికి గాంధర్వమం దెంతవరకు నభ్యాసము కలదు?" అని మా తండ్రి గారి నుద్దేశించి వా రడిగిరి. సంగీతమును గాంధర్వ మని చెప్పుట నేను గమనించితిని.

స్వయముగ నాకు సంగీతమును సాంప్రదాయికముగ నేర్పించుచు వచ్చిన సంగతిని మా నాయనగారు తెలియజేసిరి. అటుపిమ్మట తాము ఘనం కృష్ణయ్యరు వద్ద గురుకులవాసము చేసి సంగీతశిక్ష వడసినదియు చెప్పిరి.

"ఈ యూరిలో నున్న గోపాలకృష్ణ భారతియారు నెరుగుదురా?" అని పిళ్లెగారు ప్రశ్నించిరి.

"బాగుగా నెరుగుదును. వారును కొంతకాలము ఘనం కృష్ణయ్యరువద్ద సంగీత మభ్యసించిరి."

ఈ విధముగ మా చరిత్ర యడసికొనిన పిదప ఆ కవిశేఖరుడు నన్ను జూచి "నైషధమం దేదైన నొక పద్యము చదువుడు" అనినారు. ఆ మహాసుధీమణి యెదుట అటవీప్రాంతములందు అరకొర తమిళజ్ఞానము సంపాదించుకొనిన నేను ఎంతటి యల్పుడను! నాకు పద్యము చదువ ధైర్యము కలుగలేదు. హృదయము కంపించినది. ఒడలు వడకినది. చెమట పోసినది. నాలుక లోపలి కీడ్చుకొని పోయినది. రెండు మూడు నిమేషముల కాల మిట్లు తడబడితిని. తరువాత నెట్లో నైషధమందలి ప్రార్థనపద్యమును కల్యాణిరాగమందు మెల్లగా చదివితిని.

"ఇంకను ఒకపద్యము చదువుడు"అనినారు వారు. నైషధమందలి 'శిఱప్పు ప్పాయిరమ్' అను ప్రశంసాపద్యమును సావేరిరాగమందు చెప్పితిని. ఆ రెండు పద్యములను మగుడ చెప్పి, యర్థము వివరింప కోరిరి. నేను పద్యముల జెప్పి యర్థము వివరింప దొడగితిని. అప్పుడు నా నాలుక తడబడినది.

"ధైర్యముగ జెప్పుడు" అని య క్కవిచక్రవర్తి యనిరి. నేను రెండు పద్యములకును అర్థము చెప్పి ముగించితిని.

"నిఘంటు పాఠము చేసితిరా?" అని వా రడిగిరి. "పన్నిరండుతొగుది"యు పాఠమైనది" అని చెప్పగనే కొన్ని పద్యములు చెప్పించి, విని, "నిఘంటువు ముఖస్థము చేయించుట మంచిదే. ఈ కాలమందు దానిని కంఠ పాఠము చేయు నలవాటు తప్పిపోయినది. చెప్పినను ఎవ్వరు చెవిలో వేసికొనరు" అనిరి.

అప్పుడు మా నాయనగారు "వీనిని తమ సన్నిధి నప్పగించితిని. ఎప్పు డితడు పాఠము విన రావచ్చును?" అని యడిగిరి.

ఆ చదువరులతలమానికమగు పిళ్లెగారు కొలది కాలము మౌనముద్ర వహించిరి. వారు దేనినో యోచించుచుండి రనుకొంటిని. "ఒక వేళ మనలను స్వీకరింపరేమో!" అనియు భయపడితిని. వారు మెల్లగ మాటాడ నుపక్రమించిరి.

"ఇక్కడ చదువుకొనుటకై యడుగడుగున ఎవ్వరైన వచ్చుచునే యుందురు. వచ్చినప్పుడు వినయముగ నడచుకొందురు. కొంతకాలము చదువుకొనుచును ఉందురు. చదివి మంచి జ్ఞానము కలుగనున్నప్పుడు వెడలిపోవుదురు. కొందరు చెప్పకయే వెడలిపోవుదురు. మరికొందరు "ఊరికి పోయి, కొన్ని దినములలో మరలి వత్తు" మని చెప్పి పోయి మరల రానే రారు. కొంత కాల ముండి

చదువునట్లు నటించి, వదలిపోయి, నాయొద్ద నభ్యసించినట్లు చెప్పుకొనుచు తిరుగు చుందురు. ఇట్లు అరగొరగా చదువుకొనుటవలన వారికి ప్రయోజన మేదియు నేర్పడదు. ఇట్టి వారి స్వభావము చూచి చూచి మనసు కలత చెందినది. పాఠము వినవలె నని ఎవ్వరైనను వచ్చినచో యోచించియే స్వీకరింపవలసినదిగా నున్నది "

వారి మాటలందు ప్రేమయు, మెత్తందనమును నుండినవి. కాని వారి యభిప్రాయ మిద్ది యని తెల్లము కాలేదు. నా యుల్లమున ఆ పలుకులు మిక్కుట మగు సందేహ ముదయింపజేసెను. వారు తమయొద్దకు వచ్చి కొంత కాల ముండి వదలి పోయిన కొందరు విద్యార్థుల చరిత్రయు చెప్పిరి. "ఈ విషయము లన్నియు చెప్పుటలోని యాంతర్య మేమి? మనలను స్వీకరించుట సమ్మతము కా దని వ్యంగ్యముగ తెలియజేయుచున్నారేమో? అట్లైనచో ఇంతగ ప్రియమార సంభాషించియుండరు గదా?" అని నేను భావ మెరుగలేక తికమకపడితిని.

మా నాయనగారు ధైర్యము విడువక "వీడు అట్లెన్నటికిని ఉండబోడు. వీనికి చదువు తప్ప వేరు వ్యాసంగము లేదు. తమ యొద్ద నెంతకాలము వసింప వలసియున్నను ఉండగలడు. తమ ఉత్తరువు లేక వీ డెచ్చటికిని పోడు. దీనిని నేను దృఢముగ చెప్పుదును. ఇంతకు మునుపు వీనికి పాఠముచెప్పినవా రెల్లరును వీనిని తమ సన్నిధానమునకే కొనిపోయి చేర్పవలె నని నొక్కి చెప్పిరి. దీర్ఘకాలముగ యోచించి సమధికోత్కంఠతో తమ్ము శరణు పొందుటకై వీడు వచ్చియున్నాడు. వీని బెంగ చూచి నేను తామసము చేయక ఇటకు పిలుచుకొని వచ్చితిని, తమ యొద్ద అప్పగించివైచితిని. ఇకమీదట వీనివిషయమున నా కెట్టి హక్కును లేదు." అని నుడివిరి. అట్లు చెప్పునపుడు వారి యుద్వేగము పైపై మాట్లాడ నివ్వక గొంతుక క్రమ్మివేసినది. నేనును అప్పు డేదేదో చెప్పితిని. వేడుకొంటిని. నా నోరు తడబడినది. కన్నులు కలగబారినవి. ముఖము వన్నె తరిగినది.

అచట నున్నవారు మా నాయనగారి వేడికోలును, నా వ్యగ్రతను గుర్తెరిగి జాలిపడి "ఈ యబ్బాయి స్థిరముగ నుండి చక్కగ చదువగల డనియే తెలియెడిని. తాము స్వీకరింపవలెను." అని వాక్రుచ్చిరి.

అక్కావిసార్వభౌముని ముఖము వికసించినది. ఒకవిధమగు నిర్ణయము నకు వచ్చి రనియు, ఆ తీర్మానము నా కనుకూలముగనే యుండు ననియు ఆ ముఖోల్లాసమే ప్రకాశింపజేసెను.

"ఈ యూరిలో బందుగు లెవ్వరైన నున్నారా? వీరికి భోజనసదుపాయము లేవైన నమర్చియున్నారా?" అని పిళ్లెగారు ప్రశ్నించిరి.

"ఈ యూరిలో మిత్రులును, బంధువులును ఉన్నను వారు సిరిసంపదలు గలవారు కారు. వారికి శ్రమ యిచ్చుట యుచితముగ నుండదు. తామే ఏదైన నొక వసతి కల్పింపవలెను" అనినారు మా నాయనగారు. పిళ్లెగారు పలువురు విద్యార్థు లను చేరదీసి పోషించి పాఠములు చెప్పుచున్నారు - అను సమాచారమును పలు వురు చెప్పగ వినియుండుటచేత ఈ రీతిగ మా నాయనగారు చెప్పిరి.

'తిరువావడుదురై' యందును, 'పట్టీశ్వర'మందును, నే విడిసియుండు కాలమందు వీరి భోజనవసతివిషయమున ఏ యిబ్బందియు నేర్పడక చూచుకొన వచ్చును. శైవులై యున్నచో ఏ దిగులును ఉండబోదు. మా యింటనే భుజింప వచ్చును. ఈ యూరిలో వీరి యాహారవిషయమున ఏమియు చేయలేని స్థితిలో నున్నాను. దానినిగూర్చి వగచుచున్నాను."

"అట్లయినచో ఈ యూరిలో నుండునంతవరకును వీన్నిభోజనవ్యయమునకై వలయు విత్తమును ఎట్లయినను కష్టపడి పంపింతును.వీనిని తాము స్వీకరింపవలెను."

"సరి. ఒక మంచి రోజు చూచి పాఠమును విన మొదలిడవచ్చును."

నా తపము ఫలించె నని నేను కుతూహలపడితిని. పొద్దు క్రుంకు సమయ మైనందున మేము మరుసటి దినము పొద్దున వచ్చెద మని యనుజ్ఞ వడసి మా యింటికి మరలితిమి.

మేము పోవునప్పుడు మా మనస్సును క్రుంగదీయుచున్న ఒక పెద్ద భారము తొలగిపోయిన ట్లుండెను. మా నాయనగారు సారెసారెకు "జాగ్రత్తగ నుందువా? ఆరోగ్యమును గమనించుకొనుచుందువా? జాబు వ్రాయుచుందువా? బెంగపెట్టుకొనక యుందువా?" అను పెక్కు ప్రశ్న లడుగుచునే వచ్చిరి. నన్నొంటరిగ వీడిపోవుటకు వారి పితృహృదయ మెంతగ పరితపించినదో యని ఆ ప్రశ్నలు విశదపరచినవి.

# 14. అధ్యయనసమారంభము

పిళ్లైగారి శిష్యుల సమూహమున మనముకూడ చేరితి మను తలంపు నా కొక తీరైన గర్వమును కలిగించెను. నాటి రాత్రి నేనును, మా నాయన గారును దేవాయతనమునకు జని శ్రీమాయూరనాథులను. అభయాంబికను సేవించి వచ్చితిమి. ఆ రాత్రి యంతయు నాకు నిదుర పట్టలేదు. నా యుల్లమున పొంగి వచ్చెడు ఆనందోద్వేగమున శాంతి లేక పలువిధములగు దృశ్యములను భావనతో కల్పించి చూచితిని. 'ఇక మన కే లోపమును ఉండదు' అను నమ్మిక నా యంతరంగమునుండి వెలుగుల విసరినది.

మా నాయనగారు నాటి రాత్రి నావలెనే శాంతముగ నిదురింపలేదు. అందులకు కారణము న న్నొంటరిగా విడిచిపుచ్చి పోవలెనే యను విచారమే. అదే జ్ఞాపకముగ వారు పండుకొనియుండిరి.

పడుకమీదనుండి పొద్దున మేల్కాంచిన వెంటనే 'శామా' అని నన్ను పిలిచిరి. "రాత్రి నే నొక కల గంటిని. వృద్ధదంపతులు వచ్చి నాకు విబూది, కుంకుమయు ప్రసాదములుగ అనుగ్రహించి 'నీ కుమారున కిమ్ము. వానివిషయమున విచారము వలదు' అని చెప్పి వెడలిపోయిరి. అది మొదలు నాకు మిక్కిలి ధైర్యము కలిగినది. నీకు క్షేమము కలుగు నవిమే విశ్వసింతును. నీవు దిగులుపడక యుండుము" అని చెప్పిరి. నా కా సమయమున ఏ దిగులును లేదు. ఐనను వారు నా దిగులు పోకార్చువారివలె తమ దిగులుకు ఒక సమాధానము చెప్పికొనిరి.

'భళ్లు' మని తెల్లవారెను. కాలకృత్యముల దీర్చికొని మే మిరువురము పిళ్లైగారియింటికి వెళ్లితిమి. ముందు 'కట్టు'లో శైవసంపన్నులు కొందరితోడ నుపవిష్టులై వారు సంభాషించుచుండిరి. మమ్ము కాంచిన వెంటనే చిరునగవుతో "రండు, కూర్చొనుడు" అని చెప్పిరి. మొదటి రోజు వారి మాటలలో పెరవారి నుపచరించు నటువంటి ధ్వని యుండినది. రెండవ దినముననో వారి నోరు మా నాయనగారిని పిలుచుచుండగనే వారి చూపు నామీదనే పడినది. వారి కంఠస్వరములో ఆసక్తితో కూడిన ప్రేమ ధ్వనించినది. మొదటి రోజు మమ్ము పెరవారుగ నెంచిరి కాబోలు! మరునటి రోజున మమ్ము తమ కాప్తులుగా తలంచిరి కాబోలు !

"రాత్రి భోజనము సౌకర్యముగ నుండినదా? మీరు విడిసి యున్న చోటు వసతిగ నున్నదా?" అని ప్రశ్నించిరి.

"అన్నియు సౌకర్యముగనే యున్నవి. నిన్నటి రేయి కోవెలకు పోయి స్వామిదర్శనము చేసికొంటిమి. వీని క్షేమమునుగూర్చి స్వామిసన్నిధానమున ప్రార్థించుకొంటిని. రాతిరి నిదురలో నొక కల గంటిని." అనినారు మా నాయన గారు. పిళ్లైగారు "ఏమి స్వప్న మది?" అని ప్రశ్నింపగ, దానిని మా నాయన గారు వివరించి చెప్పిరి.

"ఇది మంచి శకునము; శ్రీమాయూరనాథులను, అభయాంబికను వృద్ధ దంపతు లని చెప్పుట యీ స్థలమందు పరిపాటి. మీకు కనుపించినవారు వా రిరువురే. మీ రికమీదట వీరినిగురించి వగవ పనిలేదు. వీరు క్షేమముగా నుందురు." అని యా కలకు భావము విశదీకరించినారు ఆ కవిరాజుగారు.

మా నాయనగారు తమ స్వప్నమందు శ్రీమాయూరనాథులే విచ్చేసి రని విశ్వసించి తృప్తి నొందిరి. నే నన్ననో, పిళ్లైగారు 'మీ రికమీదట వీరినిగురించి వగవ పనిలేదు' అని చెప్పినదానిని తలచి తృప్తి నొందితిని.

పిమ్మట మేము వీడ్కొని పోయి పగటి యాహారము ముగించికొని, మధ్యాహ్నము మీద పిళ్లైగారియొద్దకు వచ్చి చేరితిమి. అప్పుడు వారు తిరునాగైక్కారోణ పురాణమును తెప్పించి, నాయొద్ద నిచ్చి "ఇం దేదేని యొక్క పద్యము తీసికొని చదువుము" అని యాజ్ఞాపించిరి. నే నా పుస్తకము విప్పి 'నాట్టుప్పటలము'నం దున్న ఒక పద్యమును నెమ్మదిగ సంగీతముతోడ జదివితిని.

ముం దొకసారి మనసులో చదివి చూచుకొని పిమ్మటనే నోరు విప్పి చదివితిని. అందుచే నేను తడబాటు లేక చదువ సాధ్యమయ్యెను. పిళ్లైగారు ఆ పద్యము నర్థమును విశదముగ నాకు చెప్పిరి. పదము పదముగ వేరు చేసి అర్థము చెప్పిరి. 'పదస్వారస్య'మును చెప్పి విశదపరచిరి. తరువాతి పద్యమును గూడ నాచే చదివించి యర్థము చెప్పిరి.

పిదప "ఈ రెండు పద్యములకును ఇప్పుడు మీ రర్థము చెప్పుడు" అని యడిగిరి. నేను విన్న చందముననే వివరించితిని. పిమ్మట వ్యాకరణసంబద్ధములైన కొన్ని చిన్న చిన్న ప్రశ్నలు వేసిరి. సమాధాన మిచ్చితిని.

ఆనాడు పిళ్లైగారు 'నా తమిళజ్ఞాన మింతపాటిది' అను విషయమును ఒక తీరున పరీక్షించి తెలిసికొని రనియే తలచితిని. వారి నోటినుండి రెండు పద్యముల కర్థము విని అట్లే చెప్పివేయగలిగితి నను తృప్తియు, నేడే పాఠము విన మొదలిడితిమి అను తలపును నా కుదయించినవి.

"ఏ రోజు శుభదినముగ నున్నదో చూడుడు. త్వరలో పాఠ మారంభింప వచ్చును." అని పిళ్లైగారు నాయనగారితో ననిరి. అప్పుడు వారి మనసునందును నన్నుగూర్చి తృప్తికరమైన తలపు నెలకొన్న దనియే తోచెను.

మా నాయనగారు "రేపు మంచి రోజుగ నున్నది. పాఠ మారంభింప వచ్చును" అనిరి.

"చాల సంతోషము! అట్లే చేయనగును" అని తమ యొడబాటు వారు తెలియజేసిరి.

మరునాడు నేను పాఠము విన నారంభించితిని. మొదట వారు నైషధపాఠ మారంభించిరి. అందు కొన్ని పద్యములు చదివించి వాని యర్థము చెప్పిరి. అచట నున్న విశేషార్థములను తేటపరచుచును, వ్యాకరణవిశేషములను స్పష్టపరచుచును వచ్చిరి. నేను ఆ పుస్తకమును మునుపే పెక్కుసారులు పఠించి యుండియు, వారు చెప్పిన పద్ధతిని పాఠమును వినకుండుటవలన నాకు వారి బోధన అధికానందమును కలిగించినది. వారు పాఠము చెప్పునపుడు నాకు ఏ పదము అర్థము కాదో దానికి మాత్రము అర్థము చెప్పిరి. నా కే విషయము తెలియదో దానిని మాత్రము వ్యాఖ్యానించిరి.

కొన్ని పద్యములైన వెనుక "ఇంకను కొన్ని దినములలో ఈ గ్రంథము ముగియవచ్చును. పిదప వేరొక పొత్తము మొదలిడవచ్చును." అని చెప్పి "నాయనా, శవేరినాదూ!" అని పిలిచినారు. వారి శిష్యులలో నొక్కరు చెచ్చటికి వచ్చిరి.

"రేపు మొదలు వీరికి నైషధము పాఠము చెప్పుచుండుము." అని వారికి ఆనతిచ్చిరి. అట్లే మరుసటిదినము మొదలు నేను ఆ శిష్యులయొద్దనే పాఠము వినుచుంటిని.

'శవేరినాథపిళ్లై' అనునది వారి పేరు. వారు రోమన్ కాథలిక్ క్రైస్తవులు. పిళ్లైగారియొద్ద పాఠములు వినుచుండిరి. వారిని చూచినవా రెవ్వరును క్రైస్తవు లని

చెప్పలేరు. భస్మధారణ చేసియుందురు. పిళ్లైగారియెడ వారి కెల్లలేని భక్తి. ఆచార్యుల కుటుంబకార్యము లన్నిటిని వారే గమనించుచుండిరి. వా రెల్లప్పుడు ఉత్సాహవంతులుగనే ఉందురు. వేడ్కగా మాటాడుదురు. ఎంత దుఃఖముగ నున్నను, కోపముగ నున్నను ఆ స్థితిని తమ మాటలతోడనే మార్చివైతురు. స్నేహము చేయుట కర్హులు. తమిళపద్యముల కర్థమును రసవంతముగ చెప్పుదురు. మాటిమాటికి ఇతరవిషయములనుగూర్చి ముచ్చటింప నుపక్రమింతురు. వారితో చేరియున్న ప్రొద్దు కడచుటే తెలియదు.

నేను వారియొద్ద పాఠము వినినపుడు వారి జ్ఞానము లోతైనది కా దను నభిప్రాయమే నాకు మొదట కలిగినది. అందువలన వారు పాఠము చెప్పునపుడు చమత్కారముగ వారు చెప్పెడు విషయముల ననుభవింప వీలు కాలేదు. మధురముగ ప్రొద్దుపుచ్చుట నే నభిలషింపలేదే! అధికముగ సంగతులు తెలిసికొనుటయే నేను కోరితిని. నైషధము ముందే చదివిన గ్రంథము కదా! దానిని మగుడ వారియెడ వినునపుడు వారు రసవంతముగ చెప్పినను, నే నెరుగని భావమునో వ్యాకరణాద్యంశమునో వారు వ్యాఖ్యానింపకుండుటవలన నాకు సంతోష మేర్పడలేదు. కొన్నియెడల నాకు తెలిసిన విషయములుకూడ వారికి తెలియలేదు.

'ఎంతయో కష్టించి ఇటకు వచ్చి జేరితిమి. ఇటకు వచ్చియు పిళ్లైగారియొద్ద సాక్షాత్తుగ పాఠము విన నోచనైతినే! ఎక్కడకు పోయినను మన దురదృష్టమే మనలను తరుముకొని వచ్చుచున్నదే!' అను చింత నా కేర్పడెను.

'ఈ స్థితి మారవలెను. దీనికేది త్రోవ?' అని యాలోచింపసాగితిని.

మాయూరమునకు పోయిన మూడవదినము 'పాఠములు చదువ నారంభించితిమి' అను సంతోషమున నే మునిగితిని. "శామా, నీవు నేడు నైషధము చదువ నారంభించుటే మంచి నిమిత్తము. కలిబెడద తొలగుటకు నైషధము చదువుదురు. ఇకమీదట మన కష్టములు తీరిన వనియే చెప్పవలెను" అని మా నాయనగా రనిరి. అది నిజ మనియే నేను నమ్మితిని. మానవుడు ప్రయత్నించున దంతయు ఏదైన నొక విశ్వాసముపై ఆధారపడియే గదా?

పాఠము వినిన సంతోషముతోడ నేనును మా నాయనగారును, మా విడిదికి వచ్చి భోజనము చేసితిమి. మా నాయనగా రరుగుపై గూర్చుండి అలపు తీర్చుకొనిరి. నేను దగ్గర కూర్చుండి ఏదో పుస్తకము చదువుచుంటిని.

అప్పుడు ఆవీథివెంబడి ఒక ముదుసలి చేత నొక వేణుఖండము పూని యరుగుచుండిరి. వారిని చూచిన వెంటనే మా నాయనగారు లేచి "భారతియారుగారా?" అని యడుగుచునే తిన్నె దిగిరి. ఆ వయోవృద్ధులు మా తండ్రిగారినిచూచి "ఎవ్వరు? వెంకటసుబ్బయ్యరా? ఏమిటి, ఇంత దూరము?" అని పలుకుచునే మే మున్న తిన్నెమీదకు వచ్చి కూర్చొనిరి. మాతండ్రిగారు ఆ వృద్ధుల నమస్కరింపు మని చెప్పగా నేను వందన మాచరించితిని.

"ఈ కుర్రవా డెవ్వడు?" అని భారతియా రడిగిరి.

"వీడు నా కొడుకు."

"ఏమి చేయుచున్నాడు? సంగీతాభ్యాసము చేయుచున్నాడా?"

"చేయుచున్నాడు. తమిళముకూడ చదువుచున్నాడు. ఇక్కడ మహా విద్వాంసులగు మీనాక్షిసుందరంపిళ్లైగారియొద్ద చదివింత మని వచ్చియున్నాను."

"అటులనా! సంతోషము. మీనాక్షిసుందరంపిళ్లై మంచి విద్వాంసులు. సద్గుణ శాలి, ఉపకర్త, వరకవి. కాని వారు సంగీతవిద్వేషి. సంగీతవిద్వాంసు డన్న వారికి ప్రియము లేదు."

ఈ విషయమును భారతియారు చెప్పినపుడు దానిని నేను నమ్మలేదు. భారతియారువికృతాకారమును జూచి నే నక్కజపడితిని. వారి వక్రదేహము నకును, కీర్తికిని సంబంధమే లేదు- అని ఆదినముననే తెలిసికొంటిని. 'నందనారు చరిత్రను వీరా రచించిరి!' అని కూడ నేను తలచితిని. ఆ చరిత్రయందున్న గౌరవ భావము వారిని చూచినపుడు వారిమీద కలుగలేదు. ఆకర్షణమే లేని వారి యాకృతియు వా రనిన మాటయు నా మనస్సున తృప్తి కలిగింపలేదు. అయినను మా నాయనగారు వారియెడ చూపిన మర్యాద చూచి నేనును వినయముగ నడచుకొంటిని.

"వీనికి సంగీతమున నెంతవరకు అభ్యాసము చేయించినారు? ఘనం కృష్ణయ్యరుకీర్తనలు వచ్చునా?"

"నాకు తెలిసినంతవరకు నేర్పినాను. ఘనంకృష్ణయ్యరుకీర్తనలందు నే నెరిగినవానిలో కొన్నింటిని వీడును పాడగలడు."

వారు వెంటనే నన్నొక కీర్తన పాడు మని చెప్పగ నేను పాడి వినిపించితిని.

"మంచిది. కుఱ్ఱవానికి శారీరము బాగున్నది. దీనిని వ్యర్థము కానివ్వరాదు. పైపైన అభ్యసింపవలెను." అని చెప్పి మరికొన్ని కీర్తనలు పాడు మని యడిగిరి. నేను పాడితిని. మా నాయనగారు కొన్ని కీర్తనలు పాడిరి. మే మిరువురము కలసి కొన్ని పాడితిమి.

"ఇట్టి కీర్తనలు ఇక్కడెవ్వరు పాడుదురు ? ఈ కుఱ్ఱవాడు ఇంత చక్కగ పాడుట వినగ నాకు సంతోషముగ నున్నది."

" ఇది యంతయు మీబోటి పెద్దల యాశీర్వాదఫలమే. వీనిని ఇచ్చటనే వదలి పెట్టి పోవలె నని యెంచి వచ్చియున్నాను. తాము వీనికి సంగీతశిక్ష యివ్వవలెను." అని మా నాయనగారు భారతియారును వేడుకొనిరి.

"దాని కేమి యడ్డము ? నాకును కాలక్షేప మగును." అని వారు సమ్మతించిరి.

"మా నాయనగారును, భారతియారును ప్రాత సమాచారములనుగూర్చి చాల సేపు ముచ్చటలాడుకొనుచుండిరి. పిదప వా రుండు చోటికి వచ్చి చూడనున్నట్లు మా తండ్రిగారు చెప్పగనే భారతియారు వీడ్కొని వెడలిపోయిరి.

మరుసటిదినము వేకువజాముననే నేనును, మా తండ్రిగారును, భారతియారు వసించియుండు చోటికి చనినాము. నాడే నేను భారతియారువద్ద సంగీతాభ్యాసము నుపక్రమించితిని. అదిమొదలు ప్రాయశః ప్రతిదినము వేకువజాముననే వారి యొద్దకు పోవుచుంటిని.

వారితో నలవాటు పడగ పడగ వారు గొప్ప మహానుభావు లను భావము నాకేర్పడెను. వారి గాత్రము 'బొంగురు'వారి యుండినది. అందువలన వారు కొన్ని సంవత్సరములుగ ఫిడేలువాద్యము నభ్యసించి, ఒంటరిగ నుండు కాలములందు అది వాయించుచు కాలము పుచ్చుచుండిరి. వారియొద్ద నేను పెక్కు కీర్తనలు నేర్చుకొంటిని. నందనారుచరిత్ర కీర్తనలకు ఏర్పడిన 'మెట్టు' లను, రాగతాళములను వారు పాడి చూపిరి.

మా నాయనగారు మాయూరమున కొన్నాళ్లుండిరి. మహాదానవీథిలో ఒక యింట నాకు భోజన మిడున ట్లేర్పాటు చేసిరి.

బయలుదేరిపోవు దినము ప్రొద్దుట వారు నాతో పిళ్లెగారియొద్దకు వచ్చిరి.

"నేడు నే నూరికి పోవలె నని యనుకొనుచున్నాను. అనుజ్ఞ కావలెను" అని నాయనగా రర్థించిరి.

"సరియే, పోయిరండు. జ్ఞాపక ముంచుకొనుడు."

"వీనినిగూర్చి ఇకమీదట ఏ విచారమును లే దని స్పష్టముగ తెలిసినను కారణము లేని విచార మొక్కటి మనసులో నేర్పడుచున్నది. నేను వీనిని వదలి యుండనే లేదు. వీని తల్లికి వీని నొక్కనాడు వదలి యుండినను ఓర్వలేని దుఃఖ మేర్పడును. ఇప్పుడు వీనిని బాసి పోలేక నా మన మురియాడుచున్నది. తనకు కావలసిన పనులు పెరవారి సహాయము లేక సాధించుకొనగల యలవాటు వీనికి లేదు. తాము వీనిని జాగ్రత్తగ గమనించుకొనుచుండవలయును. అని వేడుకొనుచున్నాను. మా స్థానమున నుండి వీనిని కాపాడుట తమ కర్తవ్యము."

ఇట్లనుచున్నప్పుడు మా నాయనగారి కన్నులందు నీరు నిండినది. అంత వరకు వా రావిధమున నన్నుగురించి వగచుట నే చూడలేదు. వారి హృదయమున దాగియుండిన వాత్సల్య మంతయు అప్పుడు వెలువడినది. వారి కన్నుల నీరు చూడగ నా మనస్సును కరగినది. కన్నుల నీరు నిండినది. దుఃఖము పైపై పొంగి వచ్చినది.

వారి ప్రీతిని బాగుగ నవగాహన చేసికొనిన మా యాచార్యులు మోమున ఎలనగవు వెల్లివిరియ "మీరు వీరి రక్షణభారమునుగూర్చి కొంచెమేనియు విచార పడవలదు. నేను జాగ్రత్తగ గమనించుకొందును. మీరు ధైర్యముగ ఊరికి పోయిరండు. వీరిని చూడవలె నని ఎప్పు డభిలషింతురో అప్పుడే వీరిని మీయొద్దకు పంపగలను. మీరును మాటి మాటికి ఈ యూరికి వచ్చి చూచి పోవుచుండవలెను" అని చెప్పి సెల వొసంగిరి.

మా నాయనగా రూరికి బయలుదేరిరి. నేను కొంచెము దూరము వెంట జని వీడ్కొలిపి వచ్చితిని. వారు వెడలిపోయినపిమ్మటనే నా కేదియో ఒక క్రొత్త దుఃఖము

వచ్చినట్లు భావ ముత్పన్న మయ్యెను. మను పెరుగని తల్లిదండ్రుల వెడబాసి యుండెడి దుఃఖమును నే నప్పుడే తెలిసికొంటిని.

నేను నాయనగారిని పంపి వచ్చిన వెంటనే పిళ్లెగారు పలు విధములగు ఓదార్పుమాట లాడిరి. నా దుఃఖము మార్చుటకు కావలసిన మాట లెన్నియో పలికిరి.

"కొన్నాళ్లలో 'తిరువావడుదుఱై' పోవలసియుండును. అక్కడ సన్నిధాన శ్రీవారు మిమ్ము జూచి సంతోషింతురు. మీరు సంగీతాభ్యాసము కలవా రని తెలిసిన యెడల మీయం దసాధారణమగు ప్రీతి యుంతురు."అని తిరువావడుదుఱై ఆధీనవిషయములను, వేరగు రసవంతములగు సమాచారములను చెప్పిరి. వారి మాటలు ఒక విధముగ నా దుఃఖమును మరుగుపడజేసినవి.

దినములు సాగుచుండ సాహిత్యానందమువలన ఆ దుఃఖము పూర్తిగ మాసి పోయిన దనియే చెప్పవచ్చును.

# 15. తలిరు తెచ్చిన దయ

శవేరినాథపిళ్లెయొద్ద నైషధము పాఠము వినునప్పుడు నేను ఎడనెడ వారిని ప్రశ్నింతును. దీనిని నా యుపాధ్యాయులు కొన్ని సమయములందు గమనింతురు. నా ప్రశ్నలకు సమాధానము చెప్పలేక వారు ఊరక యుండునపుడు పిళ్లెగారు "ఏమి శవేరినాథా, ఈవిషయము లన్నియు నీవు తెలిసికొనవలదా? వీరు స్వయముగనే చదివి విషయము లరసియున్నారే!" అని చెప్పెడివారు. అప్పుడు నా కొక తీరగు తృప్తి కలుగును. నా స్వరూపము కొనియాడుటచేత నయిన తృప్తి కా దది; నాకు నేర్పగల సామర్థ్యము శవేరినాథపిళ్లెయెడ లేదు — అనునది వారు తెలిసికొన్నారు కదా అను తలపువలననే యుప్పతిల్లిన దది.

పిళ్లెగారు దగ్గరనుండువేళల నే నడుగడుగున ప్రశ్నవర్షము కురిపింతును. ఎట్లయిన పిళ్లెగారే స్వయముగ నాకు పాఠము నేర్పవలె ననునదే నా లక్ష్యము. నే నిట్లు ప్రశ్న లడుగుటవలన శవేరినాథ పిళ్లెకు కొంచెమేనియు

కోపము కలుగలేదు. మరియొకరై యుండిరేని నామీద పిళ్లైగారి కేవగింపు కలుగునట్లు చేసియుందురు. నా ఆశయు, చిన్నతనపు దుడుకుతనమును చేరుకొనినవి. శవేరినాథ పిళ్లైగారి సత్స్వభావము ఒదిగియుండినది. నేను వారిని ప్రశ్నించుట తప్పని వారు తలపనేలేదు. నాయందు ప్రియముగనే నడచుకొందురు. తీయగ ముచ్చటింతురు. పిళ్లైగారి గొప్పతనమును, వారియొద్ద తాము చేరినది మొదలు సంభవించిన నానా వృత్తాంతములు వర్ణించెడువారు.

నైషధము పాఠము జరుగుచునే వచ్చెను. పిళ్లైగారియొద్ద పాఠము వినకుండుట చేత వారిని సాక్షాత్తుగ చూచి మాట్లాడి యలవడుటకు తగిన సమయము ప్రాప్తింప లేదు. వారియొద్దనే పాఠములు చదువవలె నను నభిలాషను తెలియజేయుటకు జంకితిని.

పిళ్లైగారు కాపురమున్నది తాము విలిచికొనిన సొంతయిల్లే. ఆ యింటి వెనుకవైపున విశాలమగు తోటయు, దానివెనుక కోనేరును ఉన్నవి. వారు ప్రకృతిదృశ్యములం దాసక్తి గలవారు. కవులగు వారు పచ్చని పచ్చికబయళ్ల యందును, పూదోటలయందును, చెట్లు దట్టమై యుండు నడవులందును, నదీతీరము లందును, ఇట్టి ఇతరస్థలములందును పోవుట తటస్థించెనేని దృశ్యములను చూచి మోదమంది అట్లే నిలచిపోవువారు. తాము కొన్న క్రొత్త యింటితోటలో ప్రమానులు, చెట్లు చేమలు, తీగలు పెట్టి పెంచుచుండవలె ననునది వారి యాశయము. శివారాధన మందు పెద్ద ప్రొద్దు మునిగియుండునట్టి వారు తమ తోటలో మెండుగ పూల మొక్కలుంచి పెంచవలెనని యాసగొని యుండిరి.

నారదబ్బ, మామిడి మొదలగు ప్రమాకులను వేరుతోబాటు మన్ను చెదరి పోకుండ త్రవ్వి ఎత్తి ఆ మట్టిపై గడ్డివెంటులు చుట్టి తెప్పించి లోతైన గోతులలో నాటించి పెంచుట ఆ వైపులలో నలవాటు. మా యాచార్యులును అట్లే కొన్ని చెట్లను తెప్పించి తోటలో పెట్టించిరి. నేను వారియొద్ద పాఠములు నేర్చుచుండినపుడు ఈ యేర్పాట్లు జరుగుచుండినవి.

ఒక్కొక్క దినమునను ప్రాతస్సాయంకాలముల మా యాచార్యులు తోటకు పోయి చెట్లు పరికించెడువారు. వానిలో నేదియైన ఎండిపోయినదేమో యని చూతురు. ఏ చెట్టయినను చిగిర్చియున్నదా యని మిక్కిలి గమనముగ పరీక్షిం

తురు. ఏదైనను చిగురింపక ఎండి పోయిన దని తెలిసినచో పెన్నిధి గోల్పోయిన కైవడి వగచెదరు. ఎందైనను ఒక్క చిగురు కాంచినచో వా రనుభవించు నానంద మతివేలము. తోటమాలులయొద్ద తేప తేపకు వానిని జాగ్రత్తగ కాపాడు డని చెప్పు దురు. సాయంసమయములందు తమ చేతులార కొన్ని చెట్లకు నీళ్ల పోయుదురు.

వీ రిట్లు ప్రొద్దుట మాపట విడువక చేయుచుండుటను నేను గమనించితిని. వారి కా చెట్లమీదనున్న మమకారమును గుర్తించితిని. 'వీరి ప్రేమ సంపాదింప ఈ చెట్లనే బాసటగ కొందునుగాక!' అని యెంచితిని.

మరుసటిదినము వేకువజామున మేల్కాంటిని. పండ్లుకూడ తోమలేదు. తిన్నగ తోటకు పోయితిని. అటనున్న చెట్లను ఒక్కొక్కటిగ గమనించితిని. కొన్ని చెట్లు క్రొత్తగ చివుళ్ల తొడిగి యుండినవి. వానిని చక్కగ గమనించి యుంచుకొంటిని. కొంచెము సేపటిలో ఉపాధ్యాయు లటకే వచ్చిరి. వా రొక చెట్టు నొద్దకుపోయి మిక్కుటపు మక్కువతో చివురు లెత్తుచున్నవా యని పరిశీలింప నారంభించిరి. నేను మెల్లగ వారి సమీపమున కరిగితిని. ముందే యా చిగుళ్ళను గమనించి యుంచినందున "ఈ కొమ్మలో ఇదిగో, చివు రున్నది" అంటిని.

వారు, నే నచ్చటి కెందులకై వచ్చితి నని యోచింపనులేదు; న న్నడుగను లేదు. "ఎక్కడ!" అని వా రుత్కంఠతో నేను చూపినచోట చూచిరి. అచ్చట చిగు రుండుట చూచి సంతోషము పొందిరి. ఆ ప్రక్క నొక చెట్టు ఎండిపోయిన దని వారు తలచియుండిరి. ఆ చెట్టున ఒకచోట ఒక చిగురు మెల్లగ తన చిన్న తల యెత్తి నిలిచియుండినది. 'దీనిని చూచినయెడల పిళ్లెగారు మిక్కిలి యానందింతురు' అని నే ననుకొంటిని. అందుచే "ఇదుగో, ఈ చెట్టుగూడ చిగిర్చియున్నది" అని నేను చెప్పుటయే తడవు "ఏమి, అదియా! అది పాడైపోయినదని గదా నే నను కొనియుంటిని. చిగురించుచున్నదా? ఏదీ, చూతము గాక" అని యనుచునే త్వరిత ముగ దాని సమీపమునకు వచ్చిరి. వారి చూపునకు ఆ తలిరు తగులలేదు. నేను దానిని చూపితిని. ఆ చెట్టులో చిగిర్చియున్న ఆ ఒక చిన్నారి చివురు వారి మోమున వింత సొరు విరియజేసెను. ఆ వికాసమును చూచి నా యుల్లము పొంగినది. 'మధ ప్రయత్నము ఫలోన్ముఖమగు శుభసమయము త్వరలో వచ్చును' అను విశ్వాసము నా కేర్పడినది. ఆ చివుళ్లను దీవించితిని.

నే నంతటితో విడువలేదు. ఇంకను పరిశోధించి గుర్తించియుంచిన తక్కిన తలిరులుగూడ ఆచార్యులకు చూపించితిని. నేను చూపచూప వారు చూచి చూచి సంతోషించిరి.

అది మొదలు నేను ప్రతిదినమునను ప్రొద్దున నవకిసలయపరీక్ష జరపుచు వచ్చితిని. కొన్ని దినములలో సాయంకాలమందే చూచి గుర్తుంచుకొందును. పిళ్లె గారును వానిని చూచి తృప్తిపడుచునుండిరి.

ఒక రోజు వారన్ని చెట్లను చూచి మరలునప్పుడు నన్నుపలక్షించి "ఈ చెట్లు గమనించుకొనుమని ఎవ్వరైన మీయొద్ద చెప్పిరా ?" అని యడిగిరి.

"ఎవ్వరును చెప్పలేదు. నేనుగనే గమనించుచువచ్చినాను." అని నే నంటిని.

"ఎందులకై యిట్లు గమనించుచున్నారు ?"

"*అయ్యగారు ప్రతిదినమును చెట్లు గమనించుచుండుట తెలిసినది. నేను ముందుగనే పరికించి తెలిసి చెప్పుచున్నచో అయ్యగారికి శ్రమ తగ్గునని తలచి యిట్లు చేయుచు వచ్చుచున్నాను" అని పలికితిని.

సాధారణస్థితిలో నున్నచో ఇంత ధైర్యముగ మాట్లాడియుండను. కాని, కొన్నాళ్లుగ చిగురునెపమున వారితో దగ్గరి యలవడు నవకాశము కలిగియుండుట చేత నట్టి ధైర్యము నా కేర్పడినది. కాలక్రమమున వారి యనుగ్రహమును సంపూర్ణముగ పొందవచ్చునను సాహసమును ఏర్పడెను.

"మంచిదే. ఇట్లే ప్రతిదినము చూచుచు వచ్చిన అనుకూలమే" అని మా గురువుగారు చెప్పిరి. నేనుగా నుపక్రమించిన ప్రయత్నమునకు వారి యనుమతియు లభించిన దన్నచో నా యుత్సాహమునకు కొలబద్ద యుండునా ?

అనుదినమును ప్రొద్దున పిళ్లెగారిని కలిసికొనునపుడు వారితో మాటలాడుట మొదటి లాభము. వారు రాను రాను నాయం దధికాదరము చూపిరి. నా చదువు గురించియు మాట్లాడుట గలదు. "ఇప్పుడు పాఠము జరగుచున్నదా ? ఎంతవరకు

---

*పిళ్లెగారిని 'అయ్యగారు' అనియే వ్యవహరించుట యలవాటు. ఎదుట మాటాడునపుడును అట్లే చెప్పుదుము.

నడచినది ? నిన్న ఎన్ని పద్యములు జరిగినవి ?" అని ప్రశ్నింతురు. నేను సమాధాన మిత్తును.

మా సంభాషణ రానురాను మా యిరువురి మధ్య ప్రేమ పెంపొందించు చుండెను. నే నొక రోజున పిళ్లైగారియొద్దనే పాఠము నేర్వవలె నను దృఢాభిప్రాయ మును మెల్లగ సమక్షమున నివేదించితిని. "నైషధమంతయు వినుట కానిమ్ము. తరువాత నేదేని గ్రంథము చదువ నారంభింపవచ్చును." అని వారు నుడివినపుడే నా మనసులోని పెద్ద వెలితి తీరెను. 'నైషధ మెప్పుడు ముగియునా ?' యని ప్రతీక్షించుచుంటిని. శవేరినాథపిళ్లై కొన్ని పద్యములుమాత్రమే పాఠము చెప్పు చున్నను నేను నిర్బంధించి 'ఇంకను కొన్ని పద్యములు చెప్పు'డని యడుగుదును. ఎటులైనను ఆ గ్రంథమును త్వరగ పూర్తిచేసివేసి, పిళ్లైగారియెడ పాఠము వినవలె ననుటలో నా కంత యాత్ర ముండినది.

కొన్ని దినములలో అది ముగిసిపోయినది. అది ముగిసిన దినముననే నేను పిళ్లైగారి యొద్దకు జని "నైషధపాఠము పూర్తియైనది" అని నుడివితిని.

"సరియే. రే పేదైన ప్రబంధము పాఠముచెప్పెదను." అని వారు సెల విచ్చిరి.

మరునటి దినమున ప్రొద్దున మా గురువుగారు తామే స్వయముగ నన్ను బిలిచి "మీకు 'తిరుక్కుడంద్దైత్తిరిబందాది'ని పాఠము చెప్పవలె నని యనుకొను చున్నాను" అని చెప్పి ఆ గ్రంథము వ్రాసియున్న తాళపత్రముల తెప్పించి యిచ్చిరి. నేను పాఠము విన నారంభించితిని.

'తిరుక్కుడంద్దైత్తిరిబందాది' పిళ్లైగారు వ్రాసినది; కుంబకోణమునందు విజయముచేసియున్న శ్రీ కుంభేశ్వరస్వామివిషయమైనది. 'తిరిబందాది' యగుట వలన కొలది కఠినముగ నుండును.

ఆ గ్రంథమునందు నలువది పద్యములకుపైగ నాడు పాఠము వింటిని. 'తిరిబు యమకఅంతాది' యందు ఒక రోజుకు అయిదారు పద్యములకంటె హెచ్చుగ పాఠము చెప్పెడువారిని అంతవరకు నే చూచి యుండలేదు. పిళ్లైగారు పాఠము చెప్పుటలో విషయములను విపులముగా ఉపమానోపమేయములతోడ

చెప్పుటలేదు. ఎచ్చట విపులీకరింపవలసియుండునో అద్దానిని మాత్రమే వ్యాఖ్యానింతురు. ఆవశ్యకములైన విషయవిశేషములను వ్యాకరణవిశేషములను చెప్పెడివారు. విద్యార్థులకు ఈ యీ విషయములు తెలియవు- అని వా రెటులనో తెలిసికొందురు. నేను చదువుకొనుచువచ్చునపుడు నాకు అర్థము కాని స్థలమును నే నడుగుటకు మునుపే వారు వివరింతురు. నాకు తెలిసిన దానిని వారు విశదీకరింపరు. 'మనకు ఇది తెలియదు' అనునది వీ రెట్లు ఇంత లెక్కగ గుర్తించినారు! అని నే నబ్బురపాటు చెందితిని. తమ జీవితమంతయు విద్యార్థులకు పాఠము చెప్పియే అలవాటు పడిన వారు ఒక్కొక్కరి యెరుకను త్వరలో కొలచి తెలిసి వారి వారికి తగినట్లుగ పాఠములు చెప్పుటలో సాటిలేని మేటియై వన్నె కెక్కిరి.

వీరు పాఠము చెప్పుట ఉపన్యసించుటవలె నుండదు. అరియలూరు శఠకోపయ్యంగారు మొదలగు కొందరు ఒక పద్యమునకు మిగుల విపులముగ నర్థము చెప్పి వినువారి యుల్లములు చల్లబడ జేయుదురు. పిళ్లెగారు పాఠము చెప్పెడు తీరే వేరు. వా రందరును తమయొద్ద పరిమితమగు ఐశ్వర్యమును సంరక్షించుకొనుచునుండు వారివలె నుండిరి. ఎవ్వరికైనను ధన మిచ్చునపుడు ఒక్కొక్క నాణెమును వేర్వేరుగ ఎత్తి, మ్రోగించి చూపి చేత నుంతురు. పిళ్లగారో నిధుల రాసులను జవిరి జవిరి యిచ్చువారివలె నుండిరి. ఇక్కడ వేరు నాణెములు లేవు. అన్నియు బంగారు కాసులే! అవియు రాసులు రాసులుగ వర్షింపవలసినదే. జవురుకొనువారి యదృష్టాను సారముగ లాభము కలుగును. ఎంత కెంత ఆశ యధికముగ నున్నదో అంతకంత హెచ్చుగ జవురుకొని దాచుకొనవచ్చును. కరవు అనునది అచ్చట లేదు.

# 16. తమిళపు విందు

నా కున్న తమిళపు ఆకలి మెండు. తక్కిన చోటులందు నేను చదువుకొని నపుడు వారు నేర్పిన పాఠములు ఆకొన్న యేనుగునకు జొన్నపేలాలు పెట్టిన ట్లుండెను. పిళ్లైగారియొద్దకు వచ్చితిని. ఏమి యద్భుతము! నా కొక గొప్ప విందు-తమిళపు విందు ప్రాప్తమయ్యెను. నా యాకటికి తగిన యాహారము. కొన్ని వేళల దానిని మించికూడ లభించెను. అమృతకవిరాయరువద్ద 'తిరువరంగత్తందాది'యందు ఒక పద్యము వినునంతలో ఎన్నెన్ని పాట్లు పడవలసివచ్చెను! అంతకుపైన చెప్పుటకు మనసురాక పరుగెత్తిపోయిరే! ఆ యనుభవముతోడ ఇక్కడ పొందుచున్న యనుభవమును పోల్చి చూచితిని. "బాపురే! ఎంత వ్యత్యాసము! తెలియకయా అందరును 'పిళ్లైగారియొద్దకు పోయిననే నీ కొరత తీరును' అని వ్రాక్రుచ్చినారు!" అని తలపోసితిని. "ఇక మనకు 'తమిళదుర్భిక్షము' లేదు." అను నిర్ణయమునకు వచ్చితిని.

'తిరుక్కుడందైత్తిరిబందాది'ని రెండే దినములలో పాఠము చదివి పూర్తి చేసితిని. అప్పుడు మా యుపాధ్యాయులు తాళపత్రము లేరి ఒక గ్రంథరూపముగ చేర్చి యిచ్చిరి. ఒక గంటమును ప్రసాదించి ఆ గ్రంథపు ప్రతి వ్రాసికొమ్మని యానతిచ్చిరి. అచ్చు పుస్తకములు అరుదగు నక్కాలమున నే చదివిన పుస్తకములలో చాలవరకు తాటియాకులపై వ్రాసి చదివితిని. ఈ యలవాటువలన తాటాకుపై వేగముగను, స్పష్టముగను వ్రాయు నేర్పు నా కేర్పడెను.

'కుడందైత్తిరిబందాది'ని చదివినపుడు దానిని వ్రాసినవారు పిళ్లైగారే యని తెలిసి, "ఒక గ్రంథము వ్రాసిన యాచార్యులయొద్దనే దానిని పఠించుట ఎంత గొప్ప యదృష్టము!" అని తలచి తలచి యానందించితిని. అట్టి పలు ప్రబంధములను, పురాణములను వారు రచియించియున్నారని శవేరినాథపిళ్లై చెప్ప వినియుంటిని. అందుచేత 'ఇక వీరు వ్రాసిన గ్రంథముల నన్నింటిని వీరి ముఖముననే తెలిసికొనవచ్చును' అను తలపుతో నే నొక యసాధారణహర్షాతిశయమును బొందితిని.

'కుడందై త్తిరిఅందాది' ముగిసిన వెంటనే 'పళమలై త్తిరిఅందాది' యుప క్రమింపబడెను. అది వ్రాసినవారు తుఱైమంగలం శివప్రకాశస్వామివారు.

"శివప్రకాశస్వామివారు కవిశ్రేష్ఠులు; కల్పనాసామర్థ్యము గలవారు. కవితా పార్వభౌము లని వారిని పెద్దలు వచింతురు. 'శోణశైలమాలై'అను ప్రబంధము ఒక రసమయఖండము. ఒక్కొక్క పద్యమునకు ఏదేని యొక యుల్లేఖ ముండును. ఒక సమయమున స్వామివారు 'తిరువణ్ణామలై' గిరి ప్రదక్షిణము చేసినపుడు ఒక తడవ చుట్టి వచ్చులోపల ఆ గ్రంథమందున్న నూరు పద్యములను అల్లి పూర్తి చేసిరట!" అని పిళ్లెగారు చెప్పి పాఠప్రవచనము నారంభించిరి.

ఆ గాథ నా కధికాశ్చర్యము కలిగించెను. పాఠప్రవచనము ముగిసిన వెను వెంట శవేరినాథపిళ్లెతో సంభాషించునపుడు "శివప్రకాశస్వామివారు అలవడిన ప్రదేశములను నేను చూచియున్నాను. ఐనను ఈ సమాచారము నే డయ్యగారు చెప్పగనే వింటిని. నూరు పద్యములను ఒకే సమయమున పాఠము చెప్పెడి వారినే చూడమే; అట్లుండ ఒకే సమయమున అద్భుతకల్పనలతో నూరు పద్యములు రచింపగలిగి రన్న వారు దైవాంశసంభూతు లనుటలో సందేహమే లేదు." అని నే జెప్పితిని.

"ఆశ్చర్యమే. అట్టి యాశ్చర్యము మన మిచ్చోటనే కాననగును. పిళ్లెగారు శివ ప్రకాశులకు తీసిపోవువారు కారు. వంద కాదు, రెండు వందలుకాదు, ఒకే గ్రుక్కలో ఎన్ని వందలైనను రసవంతములగు పద్యములను వీరు చెప్పగలరు. ఇది యంతయు పోను పోను మీకే తెలియును" అనినారు. 'అట్టి సందర్భము రాకుండునా' అని నేను ప్రతీక్షించుచునే యుంటిని.

అంతాదులు పెక్కు అయిన వెనుక 'పిళ్లెత్తమిళ్' వరుస యారంభింప బడెను. నాకు పెద్ద పండుగయే. పాతిక గ్రంథము, పరక గ్రంథము, ఒక పద్యము చొప్పున చదివిన నాకు ప్రబంధములు వరుసగ ఒకదాని వెనుక నొకటిగ అనాయాసముగ లబ్ధమయ్యెను. అలుపు లేక పాఠము వినుచుంటిని. అశ్వధాటిగ నేను పాఠములు చదువుచు వచ్చుట నేనే నమ్మలేకపోతిని. ఇట్లు పాఠములు నేర్వగల కాల మొక్కటి యొనగూడు నని కలలోనైన నేను ప్రతీక్షింపలేదు. వృద్ధాచలరెడ్డి యారు "మే మెల్లరము మిట్టపొలములందలి బావులల దూరు ఊటలము. వారు కావేరీప్రవాహము" అని వచించిన దెంత వాస్తవము! కావేరీప్రవాహమా! గంగా

ప్రవాహ మనియే చెప్పవచ్చును. అది కూడ చాలదు. 'కట్టతెగిన మున్నీటివెల్లవ వంటిది' అని చెప్పినను తగును. ఒక్కొక్క ప్రబంధము విని పూర్తిచేసిన వెంటనే దానిని చింతన చేసి యానందించి యా తృప్తిలో 'ఎట్టి పున్నెము చేసితివో ఓ మనసా!' అని యెంతయు మురియు చుంటిని.

మా యొజ్జలకు పాఠము చెప్పునపుడు పొత్తము చేతబట్టుకొను నలవాటులేదు. ఆ పెద్దలకు అన్ని పద్యములును ముఖస్థము లయియే యుండినవి. కొంచెమైనను అడ్డమాకలు లేక పద్యములు చెప్పుటయు, అర్థము వివరించుటయు, 'పదకృత్యములు' బోధించుటయు—వీనియందే వా రధికకాలము పుచ్చుదురు. 'వారు దీని కయియే యవతరించినవారు' అను తలపు నా కుదయించెను. పాఠములు కరపుట యందు వారికి చలనమే ఏర్పడదు.

వారియొద్ద పాఠము వినునపుడు మేము పొందు ప్రయోజనము పలువిధము లైనది. గ్రంథమున కర్థము చెప్పుటతోడ గ్రంథకర్తృసంబద్ధములగు చరిత్రలు కూడ బోధింతురు. ముక్తకపద్యము లెన్నో చెప్పుదురు. ఇంకను సందర్భమునకు తగిన పెక్కు విషయముల నెడనెడ నుద్ధరించి వచింతురు. అవి యన్నియు మిగుల నుపయుక్తాంశములుగనే యుండును. మేము వినిన పాఠములు చింతనః చేయునప్పుడును వారియందనే యుందుము.

వారు మాతో ప్రియమార మాట్లాడుటయు, మా వసతుల నడుగడుగున పరామర్శించుటయు మా మనస్సుల వశపరచుకొనినవి. ఒక్కొక్క దినమునను నేను భుజించి వచ్చిన వెంటనే "భోజన మైనదా? ఆహారవసతి బాగుగ నుండినదా?" అని విచారింతురు. అభ్యంజనము చేసి కొమ్మని వొక్కి చెప్పుదురు. ఒకరోజు తాము అభ్యంజనము చేసికొనదలచి నూనె తెప్పించిరి. అప్పుడు దగ్గర నున్న నన్ను తిలకించిరి. "మీ మొగము తేటగ లేదే! కన్ను లెఱ్ఱబారి యున్నవి. తలంటిపోసికొనుడు" అని నూనెయు నిప్పించిరి. వెంటనే చని నేను తైలాభ్యంజనము చేసికొని, స్నానమొనర్చి, భుజించి వచ్చితిని. పిళ్లైగా రప్పుడు నన్ను చూచినవెంటనే దగ్గర నున్న వారితోడ "ఇప్పు డె ట్లున్నది వీరి మొగము? తేటగ నున్నదిగదా?" అని అడిగిరి. నా ముఖమం దున్న తేటదనము నాకంటెను వారి కధికమగు సంతోషమును చేకూర్చినది.

నా కేదేని కావలసి యున్న దని తెలిసినచో వెంటనే వారు కొని యిత్తురు. నేను భుజించి వచ్చుటలో నాలస్యమైన "ఇంకను రాలేదే?" అని విచారముతో నుందురు. రాత్రివేళలందు ఆ దిగులు మిక్కుటమగును. వీథి యరుగుపై నుపవిష్టులయిమే నా రాక కెదురుచూచుచుందురు. "ఏమి యింత సేపు! దిగులుగ నుండినది" అని ప్రేమమీర విచారింతురు. ఇట్టి చర్యలవల్ల నేను వారి వాత్సల్య మరసి కరగిపోతిని. అట్టి కూరిమివానలో తడిసి, ద్రావిడామృతమును గ్రోలుచుండుటచేత తలిదండ్రుల యెడబాటుచే కలిగిన దుఃఖము నాకు దీర్ఘకాల ముండలేదు. పిళ్లెగారి నెడబాసి యుండుట తటస్థించెనేని అదియే కష్టముగ నుండు నని తోచెను. గోపాలకృష్ణ భారతియారువద్దకు జని సంగీత మభ్యసించువేళ, ఆహారము స్వీకరించుసమయము తప్ప తక్కిన వేళల ఆ కవిశిరోమణిసన్నిధానముననే వసించుచుంటిని. సమీపముననే పండుకొనుచుంటిని. అట్లు అలవడుటవలన ఒక విశిష్టానందమును నే నొందితిని.

నే నీ విధముగ చదువుకొనుచుండగ ఒక రోజు ఏదో పరామర్శించు సందర్భమున పిళ్లెగారు నన్నుద్దేశించి "మీకు 'వేంకటరామన్'అని యేల పేరు పెట్టినారు?" అని యడిగిరి. నేను "వేంకటాచలపతి ఇలవేల్పు అగుటచే మా కుటుంబమందు అందరికిని ఆ పేరే యుంచుట సంప్రదాయము" అని తెలియజేసితిని. 'వేంకటరామన్' అను పేరు వారి కిష్టపడలేదు అని నాకు లీలగ గోచరించెను.

"మీకు వేరు పే రేదేని యున్నదా?" అని వా రడిగిరి.

"మా యింట నన్ను 'శామా' అని పిలుతురు" అంటిని.

"అట్లు ఒక పే రున్నదా ఏమి?"

"అది పూర్తి పేరు కాదు. 'స్వామినాథన్' అనుదాని నట్లు మార్చి వ్యవహరింతురు."

"అటులనా? 'స్వామినాథన్' అను పేరు ఎంత యందముగ నున్నది! మిమ్ము నేనును ఆ పేరుతోడనే పిలువవలె నని యనుకొనుచున్నాను. మీరును ఇకపై ఆ పేరే చెప్పుకొనుడు." అని వారు సెలవిచ్చిరి.

నే నక్లే చేయుట కియ్యకొంటిని. వేంకటరాముడనుగా నుండిన నేను నాడు మొదలు స్వామినాథుడ నైపోతిని. పిళ్లైగారి యిష్టానుసారము అందరును 'స్వామి నాథన్' అను పేరే వ్యవహరింపదొడగిరి. ప్రేమపూర్ణులగు వారి హృదయమునకు ఆనంద మిచ్చు ఆ పేరే నాకు స్థిరమాయెను.

గోపాలకృష్ణభారతియారువద్ద నేను సంగీత మభ్యసించుచుండుట మా గురువు గారికి మొదట తెలియదు. దానిని నేనును తెలియబరచలేదు. పిళ్లైగారికిని, భారతియారు కును పరిచయ మున్నది. భారతియారు గొప్ప శివభక్తు లను భావముచే వారియెడ గౌరవ ముంచిరి; వారి సంగీతవైదుష్యమునకై కాదు. తమిళభాషాజ్ఞానము చాలినంత మేరకు వారికి లే దను భావమే పిళ్లైగారి కుండినది. భారతియారు వ్రాసిన నందనారు చరిత్రకీర్తనలందు శాస్త్రదోషములు ఉన్న వను కారణమున మా గురువుగా రా చరి త్రను శ్లాఘింపరు. అయినను అందు పండి, నిండి తొణికెసలాడు భక్తిరసము నందు మునిగి తేలి దాని కొక 'ప్రశస్తిపద్యము' వ్రాసి యిచ్చిరి.

అప్పు డప్పుడు ఆ పెద్ద లిరువురును కలసికొనుట కలదు. ఒకసారి అట్లు కలసికొనినప్పుడు పిళ్లైగారు భారతియారుకు సంతోషముగ నుండు నని భావించి "నాయొద్ద ఒక బ్రాహ్మణబాలకులు పాఠము చదువుకొనుచున్నారు. రాగయుక్త ముగ పద్యము చదువుదురు. తా మొకపరి వారు చదువుట విని యాశీర్వదింపవల యును" అనిరి. రాగముతో చదువుట యొక ఘనకార్య మనియు, దానిని వినిన భారతి యారు తృప్తి నొందుదు రనియు వా రభిప్రాయపడిరి.

"ఆ కుర్రవానిని నేను బాగుగ నెరుగుదునే! నా యొద్దకును వచ్చి ప్రొద్దుటి వేళలందు సంగీతశిక్ష పొందుచున్నాడు. మంచి గాత్రము. తమ యొద్ద నతడు విద్యాభ్యాసము చేయుచుండుటయు నాకు తెలియును. సంగీతముతోడ తమిళము చేరినచో మధురముగ నుండును." అని భారతియా రనిరి. వారు చెప్పిన మాటలు 'పిళ్లైగారి యొద్ద వట్టి తమిళము మాత్రమే యుండుట పెద్ద లోటు' అని ధ్వనించున ట్లుండినవి.

పిళ్లైగారు ఆ సంగతి విన్న వెంటనే స్తబ్ధు లయిరి. వెంటనే భారతి యారును వీడ్కొలిపి తిన్నగ తమ యింటికి వచ్చి చేరిరి. ఇంటిలో నొక వైపు మిత్రులతోడ నే నేదియో చదువుకొనుచుంటిని. వారు త్వరగ నా యొద్దకు వచ్చి "మీరు

ముడికొండాన్ భారతియారువద్ద సంగీతాభ్యాస మొనర్చుచున్నారట కదా !" అని యడిగిరి. ఆ ప్రశ్న వన్ను తికమకచేసెను. నేను వారికి తెలుపకయే సంగీతశిక్ష పొందుచుండుట పొరపాటే. పొరపాటని తెలిసినను వెంటనే చెప్పుటకు నే జంకితిని. భారతియారు ఇంతకుమునుపే 'పిళ్లెగారు సంగీతవిద్వేషి' యని చెప్పియుండుటచేతను, నా పరిచయముమేరకు వారికి సంగీతమం దభిరుచి యున్నట్లు తెలియనందువలనను అట్టి జంకు నాకు కలిగెను. 'విలిచినంతవరకు నిడుపాటి గోడ' అను భావముతోడ సంగీతదేవతను చాటుమాటున ఉపాసన చేయుచునుంటిని.

ఇట్టి స్థితిలో నా రహస్యము బయలుపడినపుడు నేను స్తంభింపక యేమి చేయువాడను ? ఏమి సమాధానము చెప్పుదును ? "అలవాటు వదలిపోకుండ నుండుటకై వారి యొద్ద నేర్చుకొనుచుండు మని మా నాయనగారు చెప్పిరి." అని నోరు తడబడుచునే నుడివితిని. శుద్ధతమిళము మాత్రమే ప్రత్యేకించి ఇష్టపడు ఆ చదువులమిన్న "నా కింతవరకు ఆ విషయము తెలియదు. సంగీతమం దధికాభ్యాసము చేయుచుండుచో లక్ష్య లక్షణ గ్రంథములందు తీవ్రముగ బుద్ధి పనిచేయదు" అని హెచ్చరించి తమ పని చూచుకొనబోయిరి.

'వారు చెప్పిన సంగతి యెంతవరకు సత్యము' అని విమర్శింప నేను పూనుకొనలేదు. భారతియారు పిళ్లెగారినిగురించి చెప్పినదిమాత్రము సత్యమే యని తెలిసికొంటిని. 'ఇక మీదట సంగీతమును కట్టిపెట్టవలసినదే' అను నిర్ణయమునకు వచ్చితిని. మరుసటిదినముమొదలు భారతియారువద్ద సంగీతశిక్షకై పోవుట నిల్పివేసితిని.

ఈ సంభవమువలన నా కధికమగు మనోవ్యథ యేర్పడలేదు. సంగీతము మా వంశపరంపరామగతమగు ఆస్తి. అందుకై యధికముగ నాయాసపడవలసిన పని లేదు. తమిళవిద్యమాత్రము అరుదగు పెన్నిధిగ నాకు తోచెను. అందువలన ఏ యితరవస్తువులును గొప్పవిగ తోవవు.

అటుపిమ్మట నేను భారతియారువద్దకు చని "చదువవలసిన పాఠములు మిక్కుటముగ నుండుటవలన ప్రతిదిన మిటకు వచ్చి యభ్యసింప వీలు కా దని తోచెడిని. అవకాశ మున్న వేళల వచ్చి దర్శనము చేసికొనిపోవుచుందును" అని వారి నడిగికొంటిని.

మా గురువులు పాఠము చెప్పుచువచ్చునపుడు అటనట సమరియున్న వ్యాకర ణాదివిశేషముల నెత్తిచెప్పుట పరిపాటి. అరుదగు పదమైనచో ఇతరగ్రంథముల నుండి దానికి ఆధారము చూపింతురు. పద్యములందు యతిప్రాసము లమరియుండు తీరు గమనింపజేసెదరు. మహాకవులగు వారు పద్యము లల్లుట యలవరచుకొను వారికి ఇవి యివి సంకటము లని బాగుగ నెఱుగుదురు. మాకు అట్టియడ్డంకులు తొల గించు నుపాయములు బోధింతురు.

ఒక రోజు సాయంకాలమున వా రనుష్ఠానము పూర్తి చేసికొని వచ్చి యరుగుపై నాసీనులై యుండిరి. నేనును, 'కనకసభైఅయ్యరు' అనువారును. శవేరినాథపిళ్లెయు సమీపమున నిలిచితిమి. అప్పుడు వారు మమ్ముజూచి "మీకు కవిత్వము వ్రాయు నభ్యాస మున్నదా ?" అని యడిగిరి. తక్కిన యిరువురును పిళ్లెగారి యొద్ద పెక్కు దినములుగ పాఠములు చదువుచు నలవాటుపడినవారు. వారు "ఉన్నది" అని చెప్పిరి. నేను 'ఈ మహాకవియెదుట మనకును కవిత్వము వ్రాయుట తెలియు నని చెప్పుట యుక్తము కాదు.' అని మొదట తలచితిని. ఐనను తక్కినవారు తమకు తెలియు నని తెల్పుచుండ నేనుమాత్ర మూరక యుండుటకు నా మన స్సెడ మివ్వలేదు. అందువలన నాకును తెలియు నని చెప్పితిని.

"ఏదైన నొక పద్యపు తుది చరణము చెప్పినచో దాని నాధారముగ చేసికొని తక్కిన చరణములు పూర్తి చేయగలరా ?" అని యాచార్యులు ప్రశ్నించిరి.

"ప్రయత్నించి చూచెదము" అంటిమి.

వెంటనే వారు మా ముగ్గురికిని మూడు 'వెణ్బా' (వృత్తవిశేషము)కు సరిపోవు తుది చరణముల నిచ్చిరి. నాకు "కందా కడంబా గుహా" అను తుది చరణ మిచ్చిరి. నిదానముగ మే మేదో విధముగ 'వెణ్బా' పద్యములను పూర్తిచేసితిమి.

మేము ముగ్గురము ఆ మూడు వెణ్బాలను చదివితిమి. వినిన వారు "నేనును ఒక పద్యమును పూరించితిని" అని చెప్పి.

"స్వగ్రహణీయమగు మందానిలము విహరించెడు మాయూరమహానగరమున వసించెడు స్కందా. కదంబా. (కదంబప్రియా). గుహా. పాడుటకును

చదుటవుకును ఫలమైనట్టి నీయందలి భక్తి యేర్పడునట్లుగ కనికర మేపార కరుణింపుమా !"

అని యా వెణ్బాకూడ పఠించిరి. 'మన కుత్సాహము కలిగించుటకై మనతో కలసి వారును ఒక పద్యము రచించి చెప్పుచున్నారు.' అని నేను తెలిసికొంటిని. తమిళము ఆనంద మిచ్చు ఒక వినోదముగ భావించి జీవించిన ఆ మహానుభావులు మాకును ఆ తమిళవిద్యను ఒక విలాసక్రీడగనే బోధించుచుండిరి. పిల్లవాండ్ర కుత్సాహము కలిగించుటకై తండ్రి వారితో జేరి యాడుకొనుచుండుట లేదా ! అట్లే వారును మాతో కలసి కవిత్వము వ్రాసినారు.

మా ముగ్గురికిని వారు వినిపించిన కవిత్వము వినినంతనే యానందము కలిగెను. నా కొక మెట్టు అధికమగు నానందము కలిగెను. మా యాచార్యులు నా కిచ్చిన సమస్యయే కదా తమ పద్యమునకు కడపటి చరణముగా నుంచుకొనిరి. వారి దయ నా మీద నెట్లు పాదుకొని యున్నదో అది చూపుటలేదా ? అంతమాత్రమే కాదు. ఆ పద్యము ఒక కవి వ్రాసిన పద్యముగ నుండినను అర్థపు పొందికలో నొక విద్యార్థిప్రార్థనవలె గదా యది యున్నది. పాడుటకును, చదువుటకును, భక్తి యేర్పడుటకును ఎల్లరు ఆ దేవదేవుని ప్రార్థింపవలసినవారే. ఐనను మా గురువుగారు అట్టి ప్రార్థనను ఎంతయో కాలమునకు మునుపే యొనర్చి దాని ఫలితము ననుభవించుచున్నారు. కాబట్టి వారి కిప్పు డిట్టి ప్రార్థన చేసికొనవలసిన యవసర మేమియు లేదు. బిడ్డలకై తల్లి తా మందు పుచ్చుకొనునట్లు పాడుటకును, చదువుటకును, భక్తి యేర్పడవలె నని మాయూరనగరమున వెలసియున్న స్కందుని నేను ప్రార్థించుటకు మారు వారే ప్రార్థించిరి. నాకయియే యా పద్యము వ్రాయబడెను.

ఇట్టి భావనలు నాయుల్లమున తోచినవి. నేను సంతసిల్లితిని, మురిసితిని. ద్రవించితిని. అదిమొదలు ఆ పద్యము ననుదినమును అనుసంధింపదొడగితిని. నేను స్వయముగ వ్రాసిన పద్యము జ్ఞప్తిలో లేదు. నాకై మా యాచార్యులు వ్రాసి యిచ్చిన పద్యమే నా యంతరంగమున నెలవుకొనినది.

'ప్రజాపతి' (ప్రజోత్పత్తి) నామసంవత్సరము 'ఆడి' నెల పుట్టినది. నాకు పదునేడవ యేడు నడచినది. మా తల్లిదండ్రులు సూర్యమూలలో నుండిరి. ఆడి నెల

మూడవ తేది సోమవారము (17-7-1871) వాడు భగవత్కృపవలన నా కొక తమ్ముడు పుట్టినాడు. ఈ శుభవార్తను నాకు తెలియజేసి పిలుచుకొని పోవుటకు మా నాయనగారే వచ్చిరి. మా తలిదండ్రులు నన్నెడబాసి వగచుచుంటుట నే నెరుగుదును. ఆ దుఃఖమును ఒక విధముగ పోగొట్టి యోదార్పు కలిగించుటకే భగవంతుడు ఈ బిడుతని ప్రసాదించినాడు అని నేను నమ్మితిని.

మా నాయనగారు పిళ్లెగారియొద్ద ననుమతిపొంది నన్ను పిలుచుకొని బయలుదేరిరి. మాయూరమునుండి సూర్యమూలకు ఇంచుమించు పదిమైళ్ల దూరముంటును. మేము నడచియే పోతిమి.

మేము సూర్యమూలకు పోయి చేరితిమి. ఇంటికి చేరితినో, లేదో తిన్నగ 'అమ్మా!' అని యరచుచునే ప్రసవగృహసమీపమునకు చేరితిని. లోపలనుండి సన్నని యెలుగులో "రా! నాయనా!" అని నా కూరిమితల్లిగారు స్వాగతము పలికిరి.

"నీ తమ్ముని చూచితివా?" అని అచట నున్న మా యవ్వగారు బిడ్డ నెత్తుకొని తెచ్చి చూపిరి. నే నా బిడ్డను చూచి చూచి సంతసిల్లితిని. అప్పుడు మా తల్లిగారు ఆ గదిలో నుండియే నన్ను తదేకదృష్టితో చూచి సంతోషించిరి.

"శామా! ఒడలు చిక్కిపోయి యున్నదే! వేళ కన్నము తినుచున్నావా? తలంటుకొనుచున్నావా?" అని మా యమ్మగారు విచారించిరి.

"నా కేమియు లోటు లేదు. హాయిగ నున్నాను" అని బదులు పల్కితిని.

"ఏమో! దిక్కులేనివానినివలె ఒంటరిగ వదలిపెట్టితిమి. ఆ భగవంతుడే కాపాడవలెను." అని తడబడు గొంతుకతో నా తల్లిగారు పలికినప్పుడు వారి హృదయమందలి దుఃఖము నన్నును తాకినది. నా కన్నులందు దాని చిన్నెలు కనిపించినవి.

పుణ్యాహవాచనము జరిగినది. దానికి పిదపగూడ కొన్నాళ్లచటనే యుంటిని. "బిడ్డ అచట ఒంటరిగ నున్నాడు. తినుటకు కావలసిన దేదైన వాని కిచ్చువారెవ్వరు? ఏమైన తినుబండారములు చేసిపెట్టుడు" అని మా తల్లిగారు చెప్పగ, అట నున్న ఒక్కొక్క రోజునను పలువిధములగు పిండివంటలు ఇంటియందు దున్నవాడు

చేసిపెట్టిరి. నేను భుజించితిని. నాయెడ పిళ్లైగారు చూపిన వాత్సల్యమునుగూర్చి నేను విపులముగ చెప్పితిని. దానిని వినినప్పుడు మా తల్లిగారికిని తదితరులకును ఊరట గల్గెను.

సూర్యమూలనుండి మా తలిదండ్రులు మున్నగువారి యొద్ద సెలవు పుచ్చుకొని నేను మాయూరము వచ్చి చేరితిని. వచ్చినపుడు నేను లేని పది దినములలో ఒక పెద్ద లాభము పోగొట్టుకొంటి నని తెలుసుకొంటిని. నేను ఊరికి పోయి యున్న కాలమున పిళ్లైగారు కొందరికి 'పెరియ పురాణము' నారంభించి పాఠముచెప్పుచుండిరి.

తంజావూరు జిల్లాలోని కొన్ని ముఖ్యమైన దేవస్థానములందు తిరువావడుదుఱయాధీనమునకు ధర్మకర్తృత్వ మున్నది. మాయూరమందు శ్రీ మాయూరనాథుల దేవాలయము శ్రీ అయ్యాఱప్పరు ఆలయమును ఆ యాధీనమునకు లోబడినవి. ఆధీనపు అధ్యక్షులైన పండారసన్నిధుల ప్రతినిధులుగ నుండి, వారి యాజ్ఞానుసారము దేవస్థానములందు విచారణ జరపుచు వచ్చు 'తంబిరాను'లకు (మఠాధిపతుల ప్రతినిధులు) 'కట్టళై త్తంబిరానులు' అనియు, ఆ తంబిరానులు తమ తమ కార్యనిర్వాహకులతో వసించుటకై యేర్పరుపబడిన మందిరములకు "కట్టళైమఠములు" (శాసకమఠములు లేదా కట్టడమఠములు) అనియు పేర్లు వ్యవహారములో నున్నవి. మాయూరమున తిరువావడుదుఱ యాధీనకర్తల (మఠాధిపతుల) ప్రతినిధిగ 'బాల సుబ్రహ్మణ్య తంబిరాను' అనువా రొకరు మాయూరమున దక్షిణవీథిలో నున్న 'కట్టడమఠము'న నుండి దేవాలయకార్యముల చక్కగ గమనించుచుండిరి. వారు తమిళమున పరిశ్రమించినవారు. వా రున్న 'కట్టడమఠము' పిళ్లైగారి యింటికి చేరువగ నుండుటచేత మాటిమాటికి నచటికి వెళ్లి వారితో సల్లాపము చేయుచుండువారు. వారికి పిళ్లైగారియొద్ద పెరియపురాణము పాఠము వినవలె నను కోర్కె యున్నందున అట్లే యారంభించి మొదటినుండి పాఠము వినుచుండిరి. మరికొందరు వృద్ధులును కూడనుండి పాఠములు వినుచుండిరి. శవేరినాథపిళ్లైయు వినుచుండిరి.

నేను సూర్యమూలనుండి వచ్చినపుడు 'ఎఱిపత్త నాయనారు పురాణము'నకు ముందటి పురాణమువరకు జరిగిపోయినది. నేను వచ్చిన దినమున ఆ పురాణ మారంభమైనది. పెరియపురాణమును అంతకు మునుపు నేను చదివి యుండలేదు. 'నాయన్మారు'ల మాహాత్మ్యమును విపులముగా వర్ణించెడు ఆ గ్రంథమును పిళ్లై

గారివంటి శివభ క్తిసంపత్పరిపూర్ణులు చెప్పదొడగినచో సహజముగనే భ క్తిరసము నిండియున్న యా పురాణము మరియు అధికమాధుర్యము కలిగించు ననుటలో సందేహ మేమి ?

నేను ప్రబంధములు వినునంతటి మేరలో నిలిచియుంటిని. కావ్యపాఠములు వినునట్టి దశకు అంతదనుక రాలేదు. అందుచే 'మనకు ఈ పురాణమును పిళ్లెగారు పాఠము చెప్పుదురా ?' అని సందేహించితిని. అదియును గాక, దానిని వినుచున్న వారు తగిన యర్హత గలవారుగను, తమిళ విజ్ఞానమునందును, ప్రాయమందును నా కంటె ముదిరినవారుగను నుండిరి. 'వీరిలో నొకడనై యుండి పాఠము వినుట వీలుపడదు' అను నభిప్రాయమే నా ముందు నిలిచినది.

ఆ దశలో నా ప్రియోపాధ్యాయులు నన్ను పిలిచి "పెరియపురాణమును మీరును వారితోబాటు పాఠము వినవచ్చును." అని యానతిచ్చిరి. అప్పుడు నేను మైమరచితిని. ఆనందసాగరమున నోలలాడితిని. కొంచెము సేపటివరకు ఏమియు నెరుగని మైకములో నుంటిని.

ఒక పెద్ద విందులో బిడ్డలను తొలగింతురా ? వారినిగూడ చేర్చుకొనియేగదా ఎల్లరును విం దారగింతురు. ఆ పెరియపురాణసంతర్పణలో తమిళముబిడ్డనగు నాకును అవకాశ మబ్బెను.

తిరువావడుదుఱ మఠమున 'కార్బారి' (కార్యనిర్వాహకుడు)గ నుండిన 'కణ్ణప్ప త్తంబిరాను' అనువారు ఒకరోజు వచ్చిరి. ఆ రోజు కణ్ణప్పనాయనారు పురాణము' పాఠము నడిచెను. మధ్యాహ్నముపై అరంభించిన యది రాత్రి పంద్రెండు గంటలకు పూ ర్తియైనది. అటుపిమ్మట తంబిరాను, మఠమునందే భుజింపవలె నని మా గురువుగారిని నిర్బంధించి చెప్పిరి. వా రట్లే యంగీకరించి యచట నాహారస్వీకారము చేసిరి. నే నంతలో భోజనము చేయు నింటికిపోయి భోజనముచేసి వచ్చితిని.

ఆహారమైన పిదప మా గురువుగారు తంబిరానువద్ద ననుమతి వడసి, తమ యింటికి నేగిరి. నేను నువారితోడ నరిగితిని. అప్పుడు వారు "మఠమునందు భుజించి నందున నేడు నేయి లభించినది" అనిరి. ఆ మాట నా హృదయమును నొంచెను. వారు కొన్నాళ్లుగ నేయి లేకయే భుజించుచుండిరి. నేయి కొనుటకు వారిచేత

పైకము లేదు. ఇంగిత మెరిగి యెవ్వరేని యుపకారము చేసిననే గాని తాముగ నెవ్వరి యొద్దనైనను 'ఇది కావలెను, అది కావలెను' అని యడిగి పుచ్చుకొను నల వాటు వారికి సాధారణముగ లేదు. ఎడతెగక పాఠములు చెప్పుచుండిన వారు నేయి లేకయే భుజించుట నే నెరిగినవాడ నగుట "నేడు నేయి దొరకినది" అని వా రన్న పుడు వారి హృదయ మెంతయో బాధపడిన దని తెలిసికొంటిని.

దారిద్ర్యబాధాతీవ్రత నాకు క్రొత్త కాదు. అందువలన నేర్పడు దుఃఖము బుద్ధి తెలిసినది మొదలు నే ననుభవపూర్వకముగ తెలిసికొన దొడగితిని. ఐనను పిళ్లైగారియొద్ద దానిని నే నెదురుచూడలేదు. 'పెద్ద కవులు. తగిన ప్రభువులచే చక్కగ నాదరింపబడువారు. తమిళలోకమంతయు కొనియాడు కీర్తి యార్జించిన వారు. ఒక పెద్ద శైవ ఆధీనపు ఆదరువున నుండువారు- ఇట్టి వీరు కొన్నాళ్లు నేయి లేకయే భుజించిరి! ఒకపూట కట్టడమఠమున స్వీకరించిన యాహారము వారి గొంతుకపుంటికి మందైనది- అను విషయములు వారికి సన్నిహితులై పరిచితు లైనవారికి తప్ప నితరులకు తెలియ వీలులేదు. వారును అట్టి దశ బయలుపరచు కొనరు.

ఒకనాటి ప్రొద్దున వారు అభ్యంజనము చేసికొనదలచి, పీటవేసికొని దానిపై నాసీనులైరి. ఒక 'పనిమనిషి' వారికి నూనె అంటుట అలవాటు. అతడు లోపలకు పోయి తవశిపిళ్లైను (పాచకుని) నూనె యడిగెను ; నూనె లేదు.

వా రెట్టి సమయమందైనను పాఠము చెప్పెడు నలవాటు గలవా రగుటచేత నూనె యంటుకొన కూర్చొనియే పాఠము చెప్ప దొడగిరి. నేనును ఇతరులును పుస్తకములతో వారిదండ నుంటిమి. నూనె వచ్చు నని వా రెదురుచూచుచుండియు పాఠము చెప్పెడు జ్ఞాపకమున దానిని మరచిపోయిరి.

నే నది గమనించితిని. నూనె లే దని తెలిసికొంటిని. వెంటనే మెల్లగ ఏదో పనియున్నవానివలె లేచి, వేగముగ కావేరీతీరమున నున్న అంగడియొద్దకు పరుగిడిపోయి, నా యొద్ద నున్న రూపాయితో నూనె కొని తెచ్చి, వచ్చి, వంటవాని యొద్ద నిచ్చి, మరల పాఠము వినుటకు వచ్చి కూర్చుంటిని. కొంచెము సేపైన తరు వాత కాచిన నూనె వచ్చినది. వారు అంటుకొనిరి.

ఇట్లు నడుమ నడుమ నేర్పడు కొన్ని సంభవములవలన వారి పరిస్థితిని తెలిసి కొనినపుడు నా మనసు పుండై పోవును. 'పాండిత్యమును దారిద్ర్యమును పాయని జంటయైయుంట ఈ దేశమునకు ప్రాప్తించిన శాపము కాబోలు!' అని నే నెంచి తిని.

పిళ్లైగారు తరచు సంచారమునందే యుండుటవలన కుటుంబముతోడ నొకే చోట స్థిరముగ నుండ వీలుపడలేదు. వారు తమ భార్యను, కుమారుడగు సుబ్ర హ్మణ్యపిళ్లైను తిరుచినాపల్లిలో తమ యింటనే వసింపజేసిరి. అప్పుడప్పుడు వలసిన వెచ్చములకు విత్తము పంపుచుందురు. మాయూరమం దున్నపుడు వారితోడ ఇద్దరు పాచకులు ఉండిరి. వారికి నెలకు రెండు కలములు (ధాన్యము) జీతము. అది తిరువావడుదుఱమఠము ప్రసాదింపగ పొందుచుండిరి. వారి భోజనము మొద లగు తక్కిన వ్యయములు పిళ్లైగారికి చెందినవే.

# 17. సుబ్రహ్మణ్య దేశికుల సన్నిధానమున....

ఆ కాలమున తిరువావడుదుఱ అధీనమునకు 'కర్తలు'గ (అధిపతులు) వెల సినవారు శ్రీ సుబ్రహ్మణ్య దేశికర్ అనువారు. వారు 'త్రికూట రాచప్పకవి రాయరు' వంశపరంపరయం దవతరించినవారు. వారి తమ్ముడును, తమ శిష్యుడును అగు 'శణ్బగకుట్రాలక్కవిరాయర్' అనువారిమూలమున పిళ్లైగారు 'తిరు కుట్రాలత్తలపురాణము'ను, 'తిరుకుట్రాల యమక అంతాది'యు తెప్పించి తామే చదువ దొడగిరి. యమకఅంతాదికి ఒక విధముగ అర్థనిర్ధారణ చేసికొని మాకును పాఠము చెప్పిరి. 'కుట్రాలత్తలపురాణము'నుగూడ నడుమ నడుమ చదివించి విని యానందించుచుండిరి. ఆ గ్రంథమునడకలోని నయగారమును, శయ్యాలాలిత్య మును, అర్థపుష్టిని మిగుల కొనియాడిరి.

నాకు తిరుకుట్రాల యమక అంతాదిలో కొన్ని పద్యములు పాఠమైనవి. ఆ గ్రంథమును పాఠము చెప్పునపుడు పిళ్లైగారు "దీనిని వ్రాసిన కవిరాయరు మధుర వచనులు. ఇప్పుడు తిరువావడుదుఱయందు విచ్చేసియుండు మహాసన్నిధాన

స్వామివారు ఆ కవిరాయరుపరంపరకు చేరినవా రగుటచేత మంచి తమిళసాహిత్య జ్ఞానము గలవారు. సంస్కృతమందును, సంగీతమందును మిక్కిలి విజ్ఞాన మార్జించినవారు. వారిని మీరును త్వరలోనే దర్శించుట తటస్థించును' అని చెప్పిరి.

ఒకనాడు 'పట్టీశ్వరము'నుండి 'ఆఱుముగత్తాపిళ్లై' అను వేళాళ (కర్షక) కులమునకు చెందిన శైవప్రభువు లొక్కరు వచ్చిరి. వారు పిళ్లైగారిని దేవతగా భావించి యుపచరింతురు. పిళ్లైగారు మాటిమాటికిని పట్టీశ్వరమునకు పోయి కొన్ని దినములు వారి యింట గడపి వచ్చుట యలవాటు.

పిళ్లైగారి పలుకుబడి చక్కగ నెరిగిన ఆఱుముగత్తాపిళ్లై తమ కుటుంబ సంబద్ధములైన కొన్ని సంకటములను ఆ కవిసార్వభౌములమూలమున తొలగించుకొనవచ్చు నని తలచి, వారిని పిలుచుకొనిపోవ వచ్చియున్నారు. మా గురువుగారు ఆఱుముగత్తా పిళ్లైయెడ అధికాభిమానమును చూపుచుండిరి. అందుచేత వారి ప్రార్థనను త్రోసిపుచ్చక పట్టీశ్వరమునకు బయలుదేరిరి.

"తిరువావడుదుఱకు పోయి, స్వామివారియొద్ద ననుజ్ఞ వడసి, అచ్చటనుండి పట్టీశ్వరము పోవచ్చును." అని చెప్పి నన్నును, పాచకులలో నొక్కరగు 'పంచనదం పిళ్లైను' పిలుచుకొని ఆఱుముగత్తా పిళ్లైతో మా గురువుగారు తిరువావడుదుఱకు బయలుదేరిరి. తిరువావడుదుఱ మాయూరమునుండి కొంచె మించుమించు పదిమైళ్ల దూరమున నుండును. ఆఱుముగత్తాపిళ్లై బండి యొకటి రప్పించి యుండిరి. మే మందరము ఆ బండిలో నెక్కి వెడలితిమి, కొంచెము సేపు త్రోవలో నడచి వెళ్లితిమి. ప్రయాణమందు పిళ్లైగారు తిరువావడుదుఱనుగురించిన వివిధ వృత్తాంతములు నాకు తెల్పిరి.

"శ్రీ సన్నిధానముస్వామివారు మిమ్ము చూచి కొన్ని ప్రశ్న లడిగిన నడుగ వచ్చును. కొన్ని పద్యములు చదువు మని యానతీయవచ్చును. మీరు చక్కగ సంగీతముతో పద్యములు చదువుడు. శ్రీవారికి సంగీతమున నభిలాష మెండు. అర్థ మడిగిన జంకక తేటగ చెప్పుడు. శ్రీవారు మీయందు కూరిమి కలవారైన మీ కెన్నియో శ్రేయస్సులు సమకూడును" అని చెప్పిరి.

త్రోవలో నెదురైనవారు పిళ్లైగారిని చూచి మర్యాదగా తొలగి చనిరి. మేము తిరువావడుదుఱపొలిమేర దగ్గరితిమి. అక్కడి కలసికొనినవా రెల్లరును

వారిని చూచిన వెంటనే సుఖవికాసముతోడ స్వాగతము పల్కిరి. సంతోషాధిక్యమున వారిని పరివేష్టించి కుశలవార్త లడిగిరి. మఠమునకు చేరిన 'ఓదువార్' అను ప్రబంధగాయకులు కొందరు పిళ్లెగారి రాకను వెంటనే సుబ్రహ్మణ్యదేశికులకు తెలియబరచిరి. దేశికులు 'వారిని పిలుచుకొని రం'డని యాదేశించిరి.

మేము మఠాలయము చేరితిమి. మఠములోపలివైపున 'ఒడుక్కము'నకు ఉత్తరదిక్కున దక్షిణాభిముఖముగ శ్రీ సుబ్రహ్మణ్యదేశికు లాసీనులై యుండిరి. మఠమునందు పండారస్వాములు నివసించుచోటికి 'ఒడుక్కము' అని పేరు. సుబ్రహ్మణ్యదేశికుల యాకృతిలో నొకవిధమగు వశీకరణశక్తి యుండినది. నే నంతకుమునుపు అట్టి యాకృతి చూడలేదు. సర్వసంగపరిత్యాగులయెడ నున్న పారిశుద్ధ్యము, తాపసవేషమును సుబ్రహ్మణ్య దేశికులయెడ బాగుగ ప్రకాశించినవి. విచారమే యెరుగని యైశ్వర్యవంతుల ముఖములం దుండు తేటదనము వారి మోమున వెలుగొందెను. వారి కావియుడుపులు, రుద్రాక్షమాల, తలపై నిడుకొనిన జపమాలయు వారి శైవశ్రీయలంకారమును ప్రకాశింపజేసినవి.

చెవులయం దలంకరించుకొనిన * 'అఱుకట్టి', 'సుందరవేడము', వ్రేళ్లయం దమర్చుకొన్న యంగుష్ఠము, పవిత్రములును, దేహమందలి వెలుగు, ఆ మేని మేపు-ఇవన్నియు వారు త్యాగులలో రాజులై యుండుటను స్పష్టపరచినవి. వారి యాకారమందు తపఃఫలము, ఐశ్వర్యఫలమును ఒక్కెడనే చెలువారినవి. వారి ముఖవికాసమున, వారి చూపున, వా రమరియున్న స్థితిలో, వారి గంభీరమగు నాకారములో ఒక ప్రశాంతియు, ప్రేక్షకుల నరికట్టు శక్తియు సహజముగనే యమరి యున్నట్టి పెద్దరికము, రసికత్వమును గోచరించినవి.

వారిని పరివేష్టించి పలువు రుపవిష్టులై యుండిరి. అందరి మోములందును జ్ఞానపు వెలుగు వెల్లివిరిసి యుండినది. అందరి ముఖములును సుబ్రహ్మణ్యదేశికుల వైపు ఉన్ముఖముగనే యుండెను. పిళ్లెగారు ప్రవేశించిన వెంటనే దేశికుల కన్నులు

---

* 'అఱుకట్టి' అనునది కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యము లను అంతశ్శత్రువు లారింటిని (కట్టి) అణచినవారు అని తెలియజేయు ఒకయాభరణము. 'సుందరవేడం' (సుందరవేషము) అనునది చెవులందు ధరించు వర్తుల సువర్ణాభరణము. సుందరమూర్తినాయనారులచే ధరింపబడుటవలన దీని కీపేరు కలిగె నందురు. శైవాచార్యులు దీని నలంకరించుకొనుట యాచారము.

గోచరించు చూపే వారికి స్వాగత మిచ్చెను. అట నున్న యెల్లవారును మా గురువు గారిని చూచిరి. వారిలో నొక తీరగు ఆనందోద్వేగము జనించెను.

పిళ్లైగారు దేశికులకు సాష్టాంగప్రణామ మాచరించిరి. వారి శరీరసన్నివేశ మట్లు ప్రణమిల్లుటకు సులభముగ ఒప్పుకొనునది కాదు. శ్రమపడియే ప్రణమిల్ల వలెను. అందుచే వారు నేలపై బడి సాష్టాంగప్రణామ మాచరించిన దృశ్యము నా కాశ్చర్యము ఘటించెను. పండితశిరోమణియగు వారి 'యెరుకయంతస్తు' మిక్కిలి యున్నతమైనది. పెరవారికి వందన మాచరింపని పెద్దరికము కల యట్టివారు అట్లు వినయముతో ప్రణమిల్లినపుడు వారి విధేయతయు. గురుభక్తియు తెలిసికొని మఱియు నబ్బురపడితిని.

నమస్కరించి లేచిన యుపాధ్యాయులు దేశికులనుండి 'తిరునీఱు' (శ్రీభస్మము) పొందుటకు డగ్గరిరి. అప్పుడు నేను వారిని వెన్నంటితిని. దేశికుల ముందు పిళ్లైగారు వినమ్రులైరి. వారు ప్రేమతో పిళ్లైగారి నొసట 'తిరునీఱు' (విబూది) ఇడి "కూర్చొనుడు" అనిరి. సంప్రదాయానుసారము రెండవసారి పిళ్లైగారు నమస్కరింప నుపక్రమించినపుడు "ఒకసారి నమస్కరించినదే చాలు. ఇక ఈ యలవాటు వలదు" అని దేశికులు చెప్పగ వారు మరల నమస్కరింపక చెంగట నొక్కచో నుపవిష్టులైరి. పిదప "మీయెడ చదువుకొనుచున్న స్వామినాథయ్యరా వీరు?" అని దేశికులు నన్ను నిర్దేశించి యడిగిరి. "స్వామీ!" అని పిళ్లైగారు చెప్పగనే దేశికులు నన్నును కూర్చొను మనిరి. పెద్దవారియెడ ఇతరులు 'ఔను' అనునర్థమున 'స్వామి' (తెనుగుదేశమున 'చిత్తము' అనునట్లు) అనుమాట నుపయోగించుట యలవాటు. నేను మా గురువులవెనుక నుంటిని. 'మనలనుగురించి ముందే మన యుపాధ్యాయులు చెప్పియున్నారే! వారును ఞప్తియం దుంచుకొన్నారే!' అని తలచి మది నుప్పొంగితిని.

నేను సుబ్రహ్మణ్యదేశికుల యాకృతియందును. భాషణమందును మునిగి ఆనందమయమైన భావనలో ఐక్యమై యున్నప్పుడు దేశికులు న న్నుద్దేశించి ప్రేమ మీర "ఇటు. ముందుకు రండు" అని పిలిచిరి. నేను జంకుచు కొంచెము ముందుకు జరిగితిని. 'శ్రీవారు మిమ్ము పరీక్షింపనువచ్చును' అని గురువుగారు మాయూరము

నుండి బయలుదేరినపుడు చెప్పినది స్మరణకు వచ్చెను. 'ఉత్తమజ్ఞానులును, ఉదారులును, అన్ని విధముల గొప్ప యర్హతగలవారును అగు సుబ్రహ్మణ్యదేశికులు మనల పరీక్షించిన మనము తగిన సమాధాన మిత్తుము' అను ధైర్య ముండినది; వారి యంతరంగమున మంచి యభిప్రాయ మేర్పడజేయవలె నను ఉత్కంఠయు నుండినది.

కాని, పూర్వ పరిచయము లేనిచోటు, గొప్ప విద్వాంసులు నిండియున్న సభ. మా గురువుగారే భయభక్తులతో నడచుకొను విజ్ఞానపరిపూర్ణులగు పెద్దల సమక్షమున నోరు విప్పుటకే భయముగ నుండినది. ఉత్కంఠయు, భయమును పెనగులాడినవి.

"మీరు చదివిన గ్రంథములనుండి ఏదైన పద్యము చదువుడు" అని దేశికులానతిచ్చిరి.

నేను దాని నెదురుచూచుచుంటిని. "మిక్కిలి కఠినమగు 'యమక అంతాది'ల నుండియు, 'తిరిబు అంతాదుల' నుండియు పద్యములను చెప్పవలెను. అప్పుడే మనము పరిశ్రమించి చదువుచుండుట తెలియనగును" అని ముందే తలచియుంటిని. పిళ్లైగారు రచించిన తిరువావడుదుఱ యమక అంతాదినుండి మొదట నొక పద్యము చెప్పదలచి నోరు విప్పితిని. అట్లు చేయుటకు ముందు మా గురువుగారి ముఖము చూచితిని. వారు చెప్పవలె నని తమ కనుసన్నతోడనే సూచించిరి.

గొంతుక పెగలలేదు. ఒడలు వడకినది. ముచ్చెమటలు పోసెను. ఐనను నేను అలసిపోలేదు. మెల్లగ తిరువావడుదుఱ యమకఅంతాదినుండి ఒక పద్యమును భైరవిరాగమున చదివి నిలిపితిని.

"అర్థము చెప్పగలరా ?" అని దేశికు లడిగిరి.

"చెప్పుదురు." అని మా గురువుగారు ప్రత్యుత్తరించిరి. నేను వారి సూచన గుర్తించితిని.

అర్థము చెప్పుచుండగ నా నాలుక కొలది తడబడెను. "భయపడవలదు. ధైర్యముగ జెప్పుడు" అని పిళ్లైగారు నన్నుత్సాహపరచిరి. నేను కొలది కొలదిగ జంకు విడుచుకొనుచు నాకు స్వభావసిద్ధమగు తీరున చెప్పదొడగితిని. 'తుఱైశై'యంతాదినుండి ఇంకను కొన్ని పద్యములు చెప్పితిని.

"ఇంకను పద్యములు తెలిసినచో చెప్పుడు" అని దేశికు లాజ్ఞాపించిరి.

అప్పుడు నేను మిక్కిలి ధైర్యము పొందితిని. వణకు తొలగినది. పిళ్లెగారు వ్రాసిన 'తిరుత్తిల్లె యమకఅంతాది' నుండి యొక పద్యము చదివినపుడు మునుపటి కంటె తేటగను, చక్కగను చదివితిని. భైరవిరాగపు మార్చునను ఒక విధముగ గోచరింపజేసితిని.

దేశికుల ముఖమున మందహాస మంకురించెను. వారి శిరము కొలదిగ కదలి నా హృదయమున ఆనంద ముద్భవింపజేసెను. ఆ పద్యములకు అర్థము చెప్పితిని. ఇకపైన ఏ పద్యములు చదువుదమా యని యాలోచించునపుడు, 'సుబ్రహ్మణ్య దేశికులు త్రికూట రాచప్ప కవిరాయరుల పరంపరలో నుదయించిన వా'రని మా గురువుగారు తెలిపియుండుట స్ఫురింపగ 'తిరుక్కుట్రాల యమక అంతాది' నుండి యొక పద్యము చదివితిని.

దానిని దేశికులు సావధానముగ వినిరి. వారి పరంపరకు చేరినది కదా యది ? నే నా పద్యపు చరణములు రెండు మూడుసార్లు చదివి ముగించి యర్థమును చెప్పితిని.

"ఇంకను ఈ గ్రంథమునుండి ఏదైన చెప్పు"మని దేశికులు ఆదేశించినపుడు 'నేను ప్రతీక్షించినది ఫలించినది' అను నుత్సాహము నా కేర్పడెను. ఇంకను నాకు తెలిసిన పద్యములు చెప్పితిని.

"ఇది తిరుక్కుట్రాల యమక అంతాది కాదా ? ఈ ప్రాంతముల నెద యల వాటులో లేదే ? వీరి కెట్లు లభించినది ?" అని సుబ్రహ్మణ్యదేశికు లడిగిరి.

పిళ్లెగారు "చాల దినములుగ ఈ గ్రంథమును, తిరుక్కుట్రాలప్పురాణమును చదువవలె నను నాస దానున కుండినది. నేను అంతాదిని మొదట చదివి యర్థనిర్ధారణ చేసికొని వీరికి పాఠము చెప్పితిని. తిరుక్కుట్రాలప్పురాణమునుకూడ చదువుచున్నాను."

"అలాగునా ?" అని చెప్పి మరియు నింకేదైన చెప్పవలె నను సూచనతో దేశికులు నన్ను జూచిరి. నేను ఇంకను కొన్ని పద్యములు చదివితిని. వారి ముఖభావ

మున తృప్తియు. ఆదరమును కనుగొనినందున నేను రాను రాను ధైర్య మొందితి పద్యములు చదివి, వాని యర్థము వివరించుచుంటిని.

"ఇంపుగ పద్యములు చదువుచున్నారు. మంచి శారీర మున్నది. సంగీతజ్ఞాన మును గలదు. అభివృద్ధికి వత్తు రని తోచుచున్నది. తమయొద్ద విద్యార్థిగ నున్నప్పుడు వీరు ఉచ్చదశ యందుకొనుటలో సందేహ మేమి?" అని దేశికు లనిరి.

"శ్రీవారిసన్నిధికి వీరు వచ్చినపుడే వీరి దశ యుచ్చస్థితి నందుకొన్న దని దాసుడు తీర్మానించుకొన్నాడు. శ్రీవారి యుదారచిత్తమున వీరియెడ కరుణ యుప్పతిల్లిన వెనుక వీరికి కొదవ యేమి?" అని పిళ్లెగారు వచించిరి.

దేశికులు పలికిన పలుకులు నా చెవులు నిండార లోన ప్రవేశించి నా చిత్త మందు సంపూర్ణసుఖము కలిగించెను. 'మనము పరీక్షలో నెగ్గితిమి' అను భావము ఈ నిర్వృతి కాధారము.

అటు తరువాత వేరు విషయములను గూర్చి పిళ్లెగారును, అధీనాధ్యక్షులును ముచ్చటించుకొనిరి. పిమ్మట "ఆలస్యమైనది. తాము ఆరాధన నెరవేర్చుకొని 'సభాపతిదర్శనము'నకు రావలెను." అని దేశికులు చెప్పగనే, ఆ విబుధోత్తములు వీడ్కొని లేచి, స్నానార్థమై అక్కడ నున్న దక్షిణపు (కుళప్పురై) సరస్తీర గృహమునకు వచ్చిరి. నేనును వారివెంట నేగితిని. 'సభాపతిపూజ' యనగ మఠమునందు ప్రతిదినము అధీనకర్త లొనర్చు ఆరాధన.

నేను నడచి వెళ్లునపుడు నా కండ్లు నిలుకడగ లేవు. ఇటు నటు నున్న కమనీయదృశ్యములు నా కన్నుల నాకర్షించినవి. పారిశుద్ధ్యము, తాపసవేషము, శివ భక్తిపరిమళము గుబాళించు ఆ సంవిధానములు అన్నియు నచ్చట వెలుగొందినవి. మఠముదక్షిణద్వారమునకు నెదురుగ నొక సుందరసరోవర మున్నది. దాని తీరమున నొక భవనము కలదు. దానినే 'కుళప్పురై' (సరోగృహము) అందురు.

సరోగృహమునకు మేము చేరితిమి. అక్కడ పిళ్లెగారికి వేడినీళ్లు పెట్టి బడియుండెను. వా రచ్చటకు చనునపుడు పెద్ద తంబిరానులును, చిన్న తంబిరాను లును, మఠపు ఉద్యోగస్థులును, ప్రబంధగాయకులును (ఓదువార్) చుట్టు ముట్టి

క్షేమసమాచారము లడిగిరి. పలువురు "ఇకమీదట నిక్కడే కదా నివాసము ?" అని ప్రశ్నించిరి. దానికి సమాధానము వచ్చులోపలనే కొందరు తంబిరానులు "అయ్యగారియొద్ద పాఠము వినవలె నని మే మందరము కాచుకొనియున్నాము. అయ్యగారు ఇచ్చటికి వచ్చివేయుట మా భాగ్యమే !" అని చెప్పుచు మిక్కిలి కుతూహల మందిరి.

తంబిరానుల యాకారము చూచి నేను విస్మితుడ నైతిని. "ఇంతటి నిడుపైన జటలు వీరి కెట్లు వచ్చినవి ?" అని భ్రమసిపోతిని. వారు ధరించిన యుడుపుల యందము జడలమీద వేసికొనిన వస్త్రపు అమర్పును, చెవులనున్న సుందర వేషము, రుద్రాక్షలును, భస్మదిగ్ధమగు నిగనిగని మేని సొంపును కన్నులలో నిముడని కమనీయదృశ్యమై యుండెను. వారు ధరించిన యుడుపులును, శివ చిహ్నములును, సింగారమైన బట్టలును ఆభరణములను మించి యుండినవి.

పిళ్లైగారు స్నానము చేసి పూజకు పోయిరి. సరోగృహమునకు ఉత్తరమున పూజకై యొక చోటున్నది. 'పూజామఠ'మని దానిని చెప్పుదురు. కోనేటి పడమటి వైపునను పూజామఠ మున్నది. అచ్చట పెదతంబిరానులలో కొందరు అత్యధిక నిష్ఠానియమములతో మౌనముగ పూజ యొనర్చుచుండిరి. వారికి సమీపమున పాచకపరిచారకులు తడిబట్టలు కట్టుకొనియే యారాధనకు వలసిన కైంకర్యముల చేసిరి. మల్లె, మొల్ల మున్నగు విరులను, బిల్వము మొదలగు పత్రులను వేర్వేరుగ విభాగించి వెండి తట్టలం దుంచి యిచ్చిరి.

పూజ యొనర్చిన తంబిరానులు బయలుదేరిరి. కొందరు స్నాన మొనర్చి పూజసేయ వచ్చిరి. అచ్చట నిర్మాల్యములు కొలు తగులని యొక తొట్టిలో ప్రోగుగ పోయబడియుండెను.

మా నాయనగారును, తాతగారును శివపూజ సేయుట నే నెరుగుదును. అందుచే శివపూజ యన నా మనస్సున భక్తియు, శాంతభావమును పుట్టును. వారి పూజలో ఇన్ని సాధనములును లేవు; సాధకులును లేరు. ఇచ్చట పూజామఠమం దంతటను పూజ సేయువారే గుంపులే. పూజ కవసరమైన ద్రవ్యములు కొదవలేక యుండినవి. ఈ ప్రదేశమంతయు శివపూజాదృశ్యములచే నిండియుండినది.

నా కన్నులను అవి పోయిన త్రోవవే పోవనిచ్చి. విస్మయ స్తబ్ధుడనై నిలిచి యున్న నా యొద్దకు ఒక్కరు వచ్చిరి. "ఏల ఇచ్చట నిలవబడియే యున్నారు?" అని వారు ప్రశ్నించిరి. "ఈ దృశ్యము లదృష్టపూర్వములై నూత్నములై యున్నవి. వీనిని చూచుచున్నపుడు వేరొకచోటికి పోవుటకు నాకు కాలు కదలుటయే లేదు" అని బదులు పల్కితిని.

"ఇదియేనా యద్భుతము! మీరు తిరువావడుదురకు రానే రాలే దని తెలియు చున్నది. తక్కిన ప్రదేశముల చూచిన ఎంతగ అబ్బురపడెదరో తెలియదు" అని వారు మిక్కిలి సాధారణముగ పలు ప్రదేశముల పేళ్లు ఒకదానిపై ఒకటి చెప్పుకొను చునే పోయిరి. "ఏమిటీ! మనము భూలోకమునే వదలిపెట్టి శివలోకపు ఒక ఖండ మునకు వచ్చి చేరితిమా యని తోచుచున్నదే!" అని తలపింపజేసినవి వా రాడిన మాటలు.

'ఇకపై ఇక్కడనే యుండునట్టి సందర్భమే రానున్నదే? అప్పుడు వారు చెప్పిన యన్ని ప్రదేములను చూడకయా యుండువాడను?' అను సమాధానముతో నేను స్నానము చేయబోయితిని. పిళ్లెగారు స్నానాదులు ముగించుకొని మఠమునకు సభాపతిదర్శనమునకై యరిగిరి.

స్నానమైన వెనుక నేను నా నియమముల నెరవేర్చుకొంటిని. నన్నొక కార్య స్థులు భుజింపవలసిన చోటికి పిలుచుకొనిపోయిరి. బ్రాహ్మణభోజనార్థ మేర్పరుప బడిన దా సత్రము. అది శివాలయమునకు ముందున్న కోనేటి దక్షిణతీరమున నమరి యున్న విశాలభవనము. ఆచోట పలువురు కూడి సంభాషించుకొనుచు ఆనందించు చుండిరి. కొందరు సంస్కృతశ్లోకములు చెప్పి యర్థము వివరించుకొనుచుండిరి. కొందరు కొన్ని కీర్తనలు పాడుచునే యుండిరి. కొందరు అరవముపాటలే చెప్పిరి. వారి చర్యలవలన అందున్నవారిలో గొందరు సంస్కృతపండితు లనియు, కొందరు సంగీతవిద్వాంసు లనియు, కొందరు తమిళపండితు లనియు తెలిసి కొంటిని.

నే నచ్చటికి చేరిన వెంటనే ఒకరు నన్ను బిలిచిరి. "పిళ్లెగారితోడ వచ్చిన వారు గదా మీరు? ప్రొద్దున శ్రీవారియెదుట పద్యములు జెప్పితిరిగదా? మే మెల్ల

రము విని సంతోషించితిమి." అనిరి. సమీపమున నున్న కొందరు జరిగి నాయొద్దకు చ్చిరి. "పాడినపుడు భైరవిరాగము శుద్ధముగ నుండినది. అపస్వరము లేదు. శ్రీవారు దానిని గమనించి సంతసించిరి" అనిరి మరియొకరు. వారు సంగీత ిద్వాంసులై యుందు రని నే నూహించితిని. "మీకు సంగీత మెవ్వరు నేర్పినారు?" అని వే రొకరడిగిరి. "మా నాయనగారు" అని నే జెప్పితిని. "అట్లు చెప్పుడు, కులవిద్య! అందుననే అట్లు విజృంభించినారు!" అని వారు తమ తొడలపై కరచుకొనుచునే చెప్పిరి.

"మీరు పిళ్లెగారియొద్దకు వచ్చి యెంత కాల మైనది?" అని వే రొకరు ప్రశ్నించిరి.

"నాలుగైదు నెలల కాలమే అయినది" అంటిని.

"మీ రదృష్టవంతులు! పిళ్లెగారికి మీయెడ కూర్మిపేర్మి యున్నట్లు తెలి సెడు. దానితోడ శ్రీవారికిని మిమ్ముగూర్చి తృప్తి యేర్పడియున్నది. మీ కికమీదట లోటే లేదు." అనినా రింకొకరు. విద్యాదానమందు ఉత్తమదాత ఆ మహాకవి. అన్న దానమునందును, స్వర్ణదానమునందును మహోదారులు ఈ మహాపురుషులు. ఇరు వురి ప్రేమకును పాత్రమైన మీకు ఇకపయి వేరు భాగ్య మేమి కావలెను" అనిరి మరియు నొక్కరు. ఇట్లు ఒక్కొరొక్కరును మహోత్సాహముతో మాట్లాడ దొడం గిరి. నేను సిగ్గుతో తల వంచియే వినుచుంటిని. విస్తళ్లు వేయగనే కమ్మని విం దార గించి యాకలి తీర్చికొంటిని. పిదప అచట నున్న విద్వాంసులు నన్ను కొన్ని పద్య ములు చదువు మని యడిగిరి. నేను చదివితిని. వారు విని యానందించి యాశీర్వాదము చేసిరి.

# 18. నాకు దక్కిన బహుమానము

అప్పుడు మఠమునుండి యొక్కరు వచ్చి నన్ను మఠమునకు పిలుచుకొని పోయిరి. అక్కడ 'ఒడుక్కము' పైమిద్దెమీద నొకచోట సుబ్రహ్మణ్యదేశికులు విచ్చేసి యుండిరి. వారి సమీపమందే పిళ్లెగారును, తంబిరానులు కొందరును ఆసీనులై యుండిరి. నే నటకు చేరిన వెంటనే సుబ్రహ్మణ్యదేశికులు "భోజనము చేసితిరా?" అని ప్రేమతో బలికి, "కూర్చొనుడు" అనిరి. నేను పిళ్లెగారి వెనుక నుపవిష్టుడ నైతిని.

అప్పు డక్కడ నున్న తంబిరానులు తమ చేతులందు పుస్తకము లుంచుకొని యుండిరి. అది గమనించిన నేను, "పిళ్లెగారు పాఠములు చెప్ప నారంభించిరా యేమి?" అని తలచి, 'నేను ముందే వచ్చి గమనింపనైతినే' అని చింతించితిని.

అచ్చట నున్న తంబిరానులు 'ఎళుత్తిలక్కణమ్' (అక్షరలక్షణము) మొదలగువానిని సుబ్రహ్మణ్యదేశికులయొద్ద పాఠము చదివి పూర్తిచేసినవారు. ఆ గ్రంథముల నడుమ నడుమ నున్న యుదాహృతపద్యములు కొన్నిటి యర్థము తంబిరానులకు తెలియలేదు. దేశికులు పాఠము చెప్పునపుడు అట్టి భాగములు వచ్చినచో "పిళ్లెగారు వచ్చినప్పుడు అడిగి తెలిసికొనవచ్చును, జ్ఞాపక ముంచుకొనుడు." అని పలుకుట యలవాటు. ఆ సమయమున ఆ దేశికుల యాదేశముప్రకారము తంబిరానులు పిళ్లెగారి యొద్ద నట్టి సందేహము లడుగుచుండిరి. పిళ్లెగారు తడబాటు లేక ఒక్కొక ప్రశ్నకును తేటతెల్లమగునట్లు సమాధానము చెప్పుచుండిరి. తంబిరానులు మిక్కిలి యాశతో సందేహము లడిగిరి. పిళ్లెగారు అర్థము విశదీకరించునపుడు తంబిరానులకంటెను సమధికోత్కంఠతో సుబ్రహ్మణ్యదేశికులు సావధానులై వినిరి. కొన్ని సమయముల దేశికులే తంబిరానులకు సందేహములు జ్ఞాపకపరచిరి.

ఆ సంఘటనలను గమనించినప్పుడు నాకు వివిధనూతనవిషయములు తెలియనాయెను. పిళ్లెగారు వివరించి చెప్పెడు సంగతులుమాత్రమే కాదు. అధీన

సంప్రదాయములనుగూడ తెలిసికొంటిని. తంబిరాను లడిగిన సందేహములు సుబ్రహ్మణ్యదేశికులకును తెలియనివే. అయినను జ్ఞానాచార్యులగు వారు సమక్షమున పిళ్లెగారియొద్ద నొక శిష్యునివలె సందేహము లడుగలేదు. తంబిరానులచే నడిగించి తా మరసికొనిరి; వారిని తెలిసికొన జేసిరి. ఆ సందేహములు విశదపరచుకొనవలె నను నుత్కంఠ దేశికులవారికి ప్రబలముగ నుండుటయు నేను తెలిసికొంటిని. అట్లు కానిచో తంబిరానులను పిళ్లెగా రున్న యెడకు పంపి 'సందేహములు తీర్చుకొని రండు' అని చెప్పియుండవచ్చును గదా? పిళ్లెగారు వానిని స్పష్టపరచునపుడు తామే సమక్షమున నుండి వినవలె నని వారి యాస. వారు జ్ఞానాచార్యులుగను, పిళ్లెగారు వారి శిష్యులుగను ఉండి రనుటలో సందియము లేదు. అయినను ఆ సమయమున తమ జ్ఞానాచార్యత్వమును, అధీనసర్వాధిపత్యమును, తక్కంగల యితరవైభవములను మరచి దేశికులు మా గురువుగారు చెప్పుచున్నదంతయు గమనించుచుండిరి. నా డుదయమున మా గురువుగారు దేశికులకు నమస్కరించు విధము తపఃప్రాశస్త్యమును జ్ఞాపకపరచెను. మధ్యాహ్నముపై ఆ పండితచక్రవర్తి దేశికులమ్రోల సందేహములు తీర్చిన దృశ్యము వైదుష్యవైభవమును వేనోళ్ల చాటెను.

తంబిరానులు ఒక్కొక్క సందేహముగ నడుగుచుండిరి. కొన్ని సందేహములు మిక్కిలి చిక్కైనవి. అట్టి భాగములు పిళ్లెగారు ప్రతిపాదించునప్పుడు సుబ్రహ్మణ్యదేశికులు తదేకతానముగా గమనింతురు. వారికి విషయ మవగాహనమైన వెంటనే "బాగున్నది! మిక్కిలి పొందికగా నున్నది" అని శ్లాఘింతురు. వారి యానంద ముచ్చదశకు చేరినపుడు "మంచిదయ్యా!" అను మాట లప్రయత్నముగ నోట వెలువడును.

పిళ్లెగారు కొంచెమేని శ్రమపడక అవలీలగ ఆ చిక్కులు విడదీసికొనుచునే పోవుచుండిరి. వినయమున మెల్లగ విశదపరచుచుండిరి. లవలేశమైనను గర్వపు జాడ వారియెడ గోచరించలేదు.

తంబిరానులు కొన్ని పుస్తకములందున్న సందేహముల నడిగిన పిదప 'దండియలంకారమం'దున్న శంకల ప్రశ్నింప నుపక్రమించిరి. అందు వచ్చు అష్టనాగబంధపద్యమును సర్పములు వ్రాసి అందులో ఆ పద్య మమర్చి చూపు తీరును అడి

గరి. 'అష్టనాగబంధ' మనునది చిత్రకావ్యరచనయం దొక్కటి. ఎనిమిది పాములు పెనవేసికొనినట్లు అమర్చిన చిత్ర మొకదానియందు పద్యము అడగియుండును. పిళ్లైగారు కాగితము, 'పెన్సిలు' తెప్పించి యా బంధము గీయ నారంభించిరి.

వా రారంభించులోపల నే నొక కాగితమునందు ఆ చిత్రము వేసి అందులో ఆ పద్యముల నిమిడ్చి చూపితిని. నే నట్లు సాహసించి చేయుట త ప్పని యిప్పుడు తెలియుచున్నది. అయినను తమ సామర్థ్యమును సమయములందు ప్రదర్శించుకొన వలె నను నాస యుండుట సైజమే కదా? ఆ యాసచే ప్రేరితుడనై నేను 'అష్టనాగ బంధము' నమర్చితిని.

నేను దానిని చిత్రించి ముగించుట చూచిన మా గురువుగారు "చక్కగ నున్నదే! ఇది మీ రెక్కడ నేర్చుకొనినారు?" అని యడిగిరి. "శెంగణం వృద్ధాచల రెడ్డియారువద్ద తెలిసికొంటిని. ఇంకను రథబంధము మొదలగు చిత్రబంధములను గూడ వేయుదును" అనినాను.

నేను వ్రాసిన అష్టనాగబంధమును తంబిరానులు చూచిరి; సుబ్రహ్మణ్య దేశికులును చూచిరి. "వీరు చురుకైనవారు! పలు విషయములు తెలిసికొనియున్నారే!" అని సుబ్రహ్మణ్య దేశికులు సంతోషముతోడ బలికిరి. నన్ను జూచి "పిళ్లైగారి యొద్దనే యుండి చక్కగ చదువుకొనుడు. లేబ్రాయముగ నున్నది. వీరియొద్ద నెంతయో తెలిసికొనవచ్చును. వీ రిటకు వచ్చునపుడు వెంట రండు. మీకు వలసిన సౌకర్యములు లభించును. వివాహము కూడ చేయింతుము." అని చిరునగవుతో పలికిరి. నేను నవ్వితిని.

"ఏల నవ్వుచున్నారు? పెండ్లి యన్న నానందముగనే యుండును" అనిరి.

పిళ్లైగారు అప్పుడు "వీరికి వివాహమైనది" అని వచించిరి.

"అటులనా? అదే నవ్వుచున్నారు. ఐన నేమి? తక్కిన కార్యము లన్నియు జరుగవలదా? సకలవిధముల సౌకర్యములను చేసిపెట్టుదుము" అని దేశికులు చెప్పి "మీకు చదువుటకు వలసిన పుస్తకము లిత్తుము" అనిరి.

"శ్రీవారి కృప యున్నచో నన్నియు లభించును" అని మా యాచార్యులు చెప్పిరి.

దేశికులు వెంటనే లేచి తమ పార్శ్వమున నున్న ఒక 'బీరువా' తెరపించిరి. దానినిండ పుస్తకము లుండినవి. అందుండి పలు పొత్తము లెత్తుకొని వచ్చి, ఒక్కొక్కదానికిని నాలుగేసి ప్రతులు ప్రసాదించిరి. "వీనిలో ఒక్కొక్కటి మీరు తీసికొనుడు. తక్కినవానిని తోడి విద్యార్థుల కిండు" అని చెప్పిరి. నేను కడుంగడు ప్రేమతో ఒక్కొక్క పుస్తకము త్రిప్పి త్రిప్పి చూచితిని. చేతులనిండుగ ధన మిచ్చిననుగూడ నా కంతటి యానంద మేర్పడియుండదు.

"ఈ ప్రబంధము లన్నియు చదువుడు. తరువాత పెద్ద పుస్తకముల నిత్తము" అని సుబ్రహ్మణ్య దేశికులు ప్రేమతో బలికిరి. పిమ్మట, "ఏదీ, తెలిసిన పద్యము లలో నేవైనను కొన్ని రాగముతోడ చదువుడు; విందము" అనిరి. ప్రొద్దున నేను భైరవిరాగమందు పద్యములు చదివితిని. ఇప్పుడు వేర్వేరు రాగములందు కొన్ని పద్యములు చదివితిని. విని యానందించిన దేశికులు మా గురువుగారితో "సంగీతా భ్యాసము కూడ చేసికొనుచుండునట్లు వీరికి చెప్పవలెను" అని వాక్రుచ్చిరి.

అటుపై దేశికులు పిళ్లెగారిని చూచి భాషింప మొదలిడిరి: "నేడు మీరు వచ్చి యుండుటచేత ప్రొద్దుటినుండియు ద్రావిడసాహిత్యసల్లాపమునందే ప్రొద్దు గడచి నది. మాకు మిక్కిలి తృప్తిగా నున్నది. తంబిరానులకును మితిలేని యానందము; వారందరును అనుస్యూతముగ తమిళగ్రంథములు పాఠము వినవలె నని మిక్కిలి యుత్సుకితులై యున్నారు. మరికొందరును విన సిద్ధముగ నున్నారు. ఏదో మాకు తెలిసినది మేము చెప్పుచున్నాము. అదియు నెల్లప్పుడు చేయ సాధ్యపడుట లేదు. ఆధీనకార్యములు గమనించుకొనవలసియున్నది. ప్రభువులును, విద్వాంసు లును అడుగడుగున వచ్చుచుందురు. వారితో సంభాషించి, వలసినవానిని విచారించి, పంపించుటకే ప్రొద్దు సరిపోవుచున్నది. అందుచే వీరి జ్ఞానతృష్ణ తీర్చుటకు మాకు వీలు కాకున్నది. మీ రిచ్చటికే వచ్చియుండి చదువు చెప్ప మొదలిడిన అందరికిని తృప్తిగ నుండును. మీతో సల్లాపమువలన మా కుల్లాస మేర్పడును. ఇదియును గాక, ఇచ్చటకు వచ్చెడువారిలో పలువురు 'పిళ్లెగా రెచ్చట నున్నారు?' అని విచారింతురు. మీరు మాయూరమున నున్నట్లు చెప్పుటకు మాకు నోరు రాకున్నది. ఈ యాధీనము నకే గొప్పదనము చేకూర్చు మీ రిందే యుండి, పాఠప్రవచనము సాగించునట్లు చేయుట మా కర్తవ్యమై యుండ, 'మాయూరమం దున్నారు' అని చెప్పు టుచిత ముగా తోపదు. ఆగంతుకులలో మాయూరము రాగలవారు వచ్చి, మిమ్ము దర్శించి

పోవుదురు. తక్కినవారు మిమ్ము చూడలేకపోతిమే అను వెలితితోడనే వెడలిపోవు చున్నారు. కావున మీరు ఇకమీదట మీ శిష్యులతోబాటు ఇందే వచ్చియుండవల యును" అని సెలవిచ్చిరి.

పిళ్లైగారు "శ్రీవారి దివ్యచిత్తమురీతి ననుసరించియే నడచుకొనుట దాసుని విధి" అని చెప్పిరి.

అప్పుడు, ప్రక్కనే యుండి యంతయు గమనించుచుండిన ఆఱుముగత్తా పిళ్లై తటాలున లేచిరి. పండారస్వాములకు నమస్కరించి, లేచి నిలువబడి, వినయ ముట్టిపడ నోటిపై చే యిడుకొనియే "అయ్యగారిని పట్టీశ్వరమునకు పిలుచుకొని పోయి కొంతకాల ముంచుకొని పంపించునట్లు నాకు శ్రీవారి యుత్తరువు కావలెను. వారివలన నాకు కావలసిన పనులు కొన్ని యున్నవి. అందుచేతనే ఈ దాసుడు మాయూరమునకు జని అయ్యగారి నిటకు పిలుచుకొనివచ్చినాడు." అని నివేదిం చిరి. సుబ్రహ్మణ్య దేశికులు పిళ్లైగారితో భాషించిన దంతయు వినిన వారిని 'మన పని పాడై పోయినచో నేమి చేయగలవారము? పిళ్లైగారు ఇచ్చటనే నిలిచిపోవుదు రేమో?' అన్న భయము పట్టుకొన్నది.

సుబ్రహ్మణ్య దేశికులు వారి భావము తెలిసికొనిరి. చిరునవ్వుతో "అట్లే చేయవచ్చును. దాని కేమి యడ్డు? పిళ్లైగా రెల్లరకును సొంతమే కదా!" అని నుడి విరి. అప్పుడే ఆఱుముగత్తా పిళ్లైకు ఊరట కలిగెను.

"సరియే, పట్టీశ్వరమునకు పోయి కొంత కాల మట వసించి, ఇటకు రావ చ్చును" అని దేశికులు పిళ్లైగారికి వీడ్కో లివ్వగనే మా గురువుగారు లేచి, వందన మాచరించి, విబూదిప్రసాదమును పొంది మఠమువెలుపలికి వచ్చిరి.

తంబిరానులును, అన్యులు కొందరును వారితో కొంతదూరము వచ్చి వీడ్కొని చనిరి. మాకై ఆఱుముగత్తా పిళ్లై కొనివచ్చిన బండిలో వారును, పిళ్లైగారును ఎక్కిరి. నేనును ఎక్కబోవుచుండగ అక్కడ నున్న యాచార్యుల పాచకులు పంచ నదం పిళ్లై కడు వేగముతో నా యొద్దకు వచ్చిరి. నా చేతిలో నున్న క్రొత్త పుస్త కముల నెల్ల తటాలున లాగికొనిరి. "నాకు కావలయునే" అని నేను చెప్పగ "ఇన్నియు మీ కెందులకు? ఒక్కొక్కటి యున్న చాలదా?" అని చెప్పి ఒక్కొక్క

ప్రతి నా యొద్ద నిచ్చి తక్కినవానిని వారే యుంచుకొనిరి. సుబ్రహ్మణ్య దేశికుల యొద్ద నేను మొట్టమొదటిసారిగా పొందిన బహుమానములు కావా అవి ! పంచనదం పిళ్లె వానిని బలిమి నొడిసికొనినపుడు వారి చెంపలపై రెండు చరపులు చరచవలె నని యావేశము నాకు మొదట కలిగినది. వారియొద్ద జాగ్రత్తగ మెలగవలె నని పిళ్లెగారు నాకు ముందే హెచ్చరిక చేసియుండిరి. అది నేను మరువలేదు. అందుచే నేమియు ననక కోపము నణచుకొని బండి యెక్కితిని.

ప్రొద్దుటినుండి సంఘటిల్లిన యా సంభవములవలన తమిళవిద్యపై తిరువావడుదుఱ ఆధీనసర్వాధికారిమొదలు తంబిరానులు కార్యస్థులువరకు నెల్లరున్ను చూపుచుండిన యాదరాతిశయమును, మానవులతో మసలుకొనెడు తీరును తెలిసి యచ్చెరువొందిన నేను అంతమందిలో కొంచెమేని మర్యాద యెరుగకయు, తమిళము విశిష్టత తెలియకయు మోటుతనముగ నడచుకొన్న పంచనదంపిళ్లెస్వభావమును చూచినపుడు "వేయి వత్సరములు సత్పురుషులతో సహవాసము చేసినను తమ స్వభావము విడువలేనివారును ఈ జగత్తులో నుండనే యున్నారు." అని సమాధానము చెప్పుకొంటిని.

రెండెద్దులు పూన్చిన యా బండి బాటపై చెరచెర బిరబిర పోదొడగెను.

# 19. త్యాగరాజ చెట్టియారు

తిరువావడుదుఱనుండి బయలుదేరిన మేము 'తిరువిడైమరుదూరు'కు సాయంకాల మారుగంటలకు పోయి చేరితిమి. అక్కడ ఆఱుముగత్తా పిళ్లెగారి మరదియగు 'సుబ్బయ్యా పండారం' అనువారియింట విడిసితిమి. రాత్రి యచట వసించి, మరునాటి యుదయమున పట్టీశ్వరమునకు బయలుదేరవచ్చు నని మా గురువుగారు తలచిరి. మరునాటి యుదయమున మేము తిరువిడైమరుదూరు వదలి బయలుదేరితిమి. పట్టీశ్వరమునకు కుంభకోణముమార్గముననే పోవలెను. కుంభకోణమునందు విద్వాన్ 'త్యాగరాజ చెట్టియారు'ను చూచిపోవలయు నని పిళ్లెగారి యాశయము.

త్యాగరాజచెట్టియారుగొప్పదనము నేను చాల దినములనుండియే విను చున్నవాడను. కుంబకోణముకాలేజిలో ప్రధానతమిళోపాధ్యాయులుగనుండిన వారు మిగుల విద్యాధికు లనియు, వారియొద్ద చదివిన విద్యార్థు లందరును మేలగు తమిళ విజ్ఞానము కలవా రనియు చెప్పుకొందురు. కాలేజిలోనున్న తక్కిన యుపాధ్యాయుల కెంత గౌరవమో అంత గౌరవము వారికి నుండెను.

పిళ్లెగారియొద్ద చదువవచ్చినతరువాత చెట్టియారునుగూర్చిన ప్రస్తావన ఎడనెడ వచ్చుచుండును. వారితో పరిచయముకలవారుకూడ చెట్టియారుజ్ఞాన దార్ఢ్యమును కొనియాడి చెప్పుట నేను పలుమారులు వినియున్నాను. అందుచేత చెట్టియారును చూచి పోవచ్చు నని మా యాచార్యులు తలచుట నాకు మిక్కిలి సంతోషము కలిగించెను.

కుంబకోణము చేరగనే తిన్నగ చెట్టియారులయింటికి బండి చేరినది. మేము పోయినపుడు వా రింట లేరు. అందుచే ఆ యింటియరుగుపై మేము కూర్చుంటిమి.

మా రాక యెరిగిన చెట్టియారుశిష్యు లొకరు వేగిరముగ బోయి వారిని పిలుచుకొని వచ్చిరి. వారు "ఏమి, ఇచ్చట కూర్చొనియున్నారే! లోపలకు పోయియుండ కూడదా! సామాను లన్నిటిని దింపి లోపల పెట్టింపకూడదా?" అని యడుగుచునే వచ్చిరి. వచ్చినవెంటనే వారు పిళ్లెగారికి సాష్టాంగప్రణామ మాచరించిరి.

వారిని చూచితిని. వారి దేహము తేజోవంతమై యుండెను. మంచి యెరుపు. మిక్కిలి నిడుపు కాదు. పొట్టియు గాదు. మంచి బలము కల్గిన కట్టుదిట్టమైన యొడలు. వారి నడకలో గాంభీర్యము, చూపులో ధైర్యము, మాటలో సాహసము ను గోచరించినవి. వారు ఉదికి యెండించిన 'చౌకము' నడుముకు చుట్టియుండిరి. వా రెవ్వరినైనను లక్ష్యపెట్ట రనియు, మిక్కిలి 'ఖండితవాది' యనియు మునుపు నేను వినియుంటిని. దానికి తగినట్లే వారి నడకయు, మాటతీరును ఉండినవి. వారు పిళ్లెగారి యెదుట నమస్కరించి లేచినపుడు అంత ధైర్యమందును, అలక్ష్యబుద్ధియందును ఆ వినయము చక్కగ ప్రకాశించినది.

చెట్టియారు "వీ రెవ్వరు?" అని పిళ్లెగారి నడిగిరి. తమయొద్ద నేను కొంత కాలముగ చదువుచుండుట గురువుగారు తెలిపిరి.

నా డమావాస్య యగుటచేత త్వరగ పట్టీశ్వరము పోయి పూజాపురస్కార ములు చేయదలచిన మా గురువుగారు వెంటనే బయలుదేర నుపక్రమించిరి. అప్పుడు చెట్టియారు 'తాంబాళము'లో రెండు అత్తముల యరటిపండ్లు, చీనాకలకండ పొట్లము ఉంచి యాచార్యుల ముందు పెట్టిరి. ఆచార్యులు పండ్లలో కొన్నిటిని, మితముగ కలకండయు తీసికొనిరి. వెంట నున్న మేము కూడ తీసికొంటిమి. మాతోడ చెట్టియారును, మరి కొందరును కొంచెము దూర మనుగమించిరి.

మేము చనుచున్నపుడు చెట్టియారు నన్ను జూచి "ఏయే గ్రంథములు పఠించితిరి?" అని యడిగిరి. వివరముగ నేను చెప్పితిని. "సరియే, ఇప్పు డేమి వినుచున్నారు?" అని ప్రశ్నించిరి. దానికిని ప్రత్యుత్తర మొసగితిని. చెట్టియారు నన్ను విచారించు తెరిగిన పిళ్లైగారికి ముందుకు కాలు సాగలేదు. నేను పద్యము చదువుటయు, అర్థము చెప్పుటయు వారు వినవలె నని మా యాచార్యులు తలచిరి. అందుచే "ఎక్కడైనను ఒకచోట కూర్చొనవచ్చునే. నడచుచునే వినుటకంటె ఒకచో సుపవిష్టుల మైనచో వారును పద్యములు చదివి వినిపింప ననుకూలముగ నుండును" అని చెట్టియారును చూచి చెప్పిరి.

మేము కుంభేశ్వరాలయసమీపమున నపుడు నడచుచుంటిమి. అగుటచే ఆ కోవెల పడమటి వాకిటి మార్గమున లోపలకు నేగి, ప్రక్కనేయున్న శ్రీ సుబ్రహ్మణ్యస్వామి యాలయపు ముఖమంటపమున ఆచార్యు లమరిరి. మేమును ఆసీనుల మయితిమి. చెట్టియారు "ఏదేని పద్యము చెప్పి, యర్థము వివరింపుడు" అనినారు నేను "తుఱైశైయంతాది"నుండి ఒక పద్యము రాగముతో చదివి యర్థముకూడ చెప్పితిని. చెట్టియారు వినగ వినగ పై పైన వేర్వేరు ప్రబంధములనుండి పద్యములు చదువుచుంటిని. చెట్టియారు విని తృప్తి పొంది రనియే తలచితిని. తృప్తిని వారు బాహ్యా రూపముగ చూపలేదు.

"తుఱైశైయంతాదినుండి పద్యము చెప్పితిరే, ఆ గ్రంథ మంతయు చక్కగ తెలియునా?"

"ఏదో ఒక విధముగ తెలియును."

"దానిని పాఠము చెప్పుదురా?"

ఆ ప్రశ్న నన్ను భ్రమింపజేసినది. తుఱైశైయంతాది యమకమయ మగుట కష్టసాధ్యము. అందుచేత నది యంతయు తెలిసి ధారణచేసియుంచుకొనుట అరుదు.

'పాఠ మెవ్వరికి చెప్పుట? వీరికా? పాఠము చెప్పుదు ననిన గర్వి యని తలతురో, ఏమో!' అని నే నాలోచించుచుంటిని. అందుచేత నే నేమియు బదులు చెప్పలేదు. మా యాచార్యు లప్పుడు చెట్టియారును చూచి "ఏమి యి ట్లడుగు చున్నావు? నీవు ఆ యంతాది పాఠము వినలేదా?" అని ప్రశ్నించిరి.

"నేను వినలేదు. మీరు తిరువావడుదుఱకు పోయిన తర్వాత రచించినది యది. నేను కుంబకోణము వచ్చిన పిదప మీరు రచించిన గ్రంథములు చదువలేదు. అయినను వానిని చదివి చూచి యానందించి పాఠము చెప్పుచున్నాను. మీరు తిరు వావడుదుఱకు చనిన పిమ్మట రచించిన గ్రంథములకును, అంతకు మునుపు వ్రాసిన గ్రంథములకును ఎంతయో వ్యత్యాస మున్నది. మునుపు వ్రాసిన పద్యములందు శాస్త్రరహస్యము లధికముగ లేవు. ఇప్పుడు వ్రాసినవానియందు మిగుల నరుదగు భావములును, శాస్త్రవిషయములును ఇమిడి యున్నవి. వానిని చదివి చూచునపుడు కొన్నిటి కర్థము తెలియుటలేదు. ఎవ్వరైన నొక పుస్తకము కొని వచ్చి పాఠము చెప్పు డనిన గ్రుడ్లు తేలవేయవలసినదే కదా? ఈ యంతాదిలో నున్న యమకము లకు సులభముగ నర్థము తెలియునా? మీయొద్దకు వచ్చి వినిననే తెలియును. కొన్ని నెలల క్రితము తిరుచినాపల్లినుండి సదాశివంపిళ్లె వచ్చినాడు. ఈ తుఱైశైయంతాదిని వాడు కొని తెచ్చి పాఠము చెప్పు డని తొందరచేసినాడు. నేను చదివి చూచితిని. ఏమియు తెలియలేదు. "అయ్యగారియొద్దకే వెళ్లి చదువుకొనుము" అని పంపివేసి తిని. అక్కడ మీ యొద్దకు వచ్చియుండునే!"

"రాలేదు."

"వానివలె నింకను ఎవరైన వచ్చి యర్థము చెప్పవలసిన దని యుపద్రవము చేసిన వీరియొద్దకు త్రోసివేయవచ్చు నను తలపుతోడనే యిట్టి ప్రశ్న వైచి తిని."

అప్పుడు ఆఱుముగత్తాపిళ్లె చెట్టియారును చూచి "మీరు, అయ్యగారు మునుపు వ్రాసిన గ్రంథముల నెల్ల వినియున్నారా? అయ్యగారు బాల్యమున పట్టీశ్వరముపై

ఒక 'పదిర్రుప్పత్తందాది' (అంతాదిశతకము) చేసియున్నారు. అది చదివి యున్నారా?" అని యడిగిరి.

"ఏమి? పట్టీశ్వరమున కంతాదియా? నేను చదువలేదే! ఏదీ, మీకు జ్ఞాపకమున్నచో ఒక పద్యము చెప్పుడు చూతము" అనిరి చెట్టియారు.

ఆఱుముగత్తాపిళ్లె వెంటనే ఆ గ్రంథమునుండి ఒక పద్యమును చెప్పిరి. దానిని చెట్టియారు వినిరి. వినిన తరువాత ఆఱుముగత్తా పిళ్లెను, పిళ్లెగారిని ఎగాదిగ చూచిరి. "ఈ పద్యము పిళ్లెగారు వ్రాసిన దని యెట్లు తెలియును?" అని యడిగిరి.

"ఏల తెలియదు? మాయూర్ప్రబంధమును గూర్చియే నాకు తెలియదా? మా నాయనగా రుండగ అయ్యగారు దీనిని వ్రాసిరి."

"ఈ పుస్తకము మీవద్ద నున్నదా? ఉన్నచో ఎవ్వరితోడను చెప్పక, చించి ఏటిలో పడవేయుడు. మీరును ఆ పద్యముల మరచిపోవుడు. అయ్య ఇట్టి ఒక ప్రబంధమును వ్రాసినట్లుకూడ ఎవ్వరియొద్దనైనను ఇకమీదట ప్రస్తావము చేయవలదు."

"ఏల ఇ ట్లనుచున్నారు?"

"ఏలనా? ఇప్పు డయ్యగారు వ్రాయు పద్యములు వినినవారియొద్ద ఈ పద్యములు చెప్పిన నమ్మనే నమ్మరు. మీకు వెర్రివా డను పట్టము కట్టివైతురు. ఇప్పటిలో అయ్యగారు వ్రా సెడు పద్యములు చొక్కమైన అపరంజితునుకలు! పూజాసమయమున ఎలుగుబంటిని లోపలకు తరిమినట్లుగ మంచి పద్యములగూర్చి మేము ముచ్చటించుకొనుచుండగ ఇట్టి పద్యము చెప్పవచ్చితిరే?"

ఆ పద్యములో యమకము లేదు, ప్రాస లేదు. అరుదగు శైవసిద్ధాంతరహస్యము లేదు. ఐనను సులభమైన శయ్య, భక్తివిశ్వాసములు వెలువరచు భావములు నుండినవి. చెట్టియారు దానియందు లోటుపాట్లు చెప్పుట నా కప్పుడు యుక్తముగ తోపలేదు. దానికి తోడుగ వారు ముందు వెనుకలు పొందిక లేక మాట్లాడుదు రని కూడ తలచితిని. తుత్తైశైయమకఅంతాది మున్నగువానికి సులభముగ నర్థ మవగతము కాలే దని వారు మొదట చెప్పిరి. సులభముగ నర్థమగు నీపద్యములో అందము లే దనియు నుడివిరి.

"అయ్యగారినే యడిగి చూడుడు; ఈ యంతాది వారే వ్రాసినదా కాదా యని తెలియనగును. అయ్యగారి వాక్కును మీరు దూషించుట బాగులేదు." అని అబు ముగత్తాపిళ్లె చెట్టియారుతో ననిరి.

"అయ్యగారినే యడుగుదము" అని పలుకుచునే చెట్టియారు మా యుపాధ్యాయుల చూచి "వీ రేదో చెప్పుచున్నారే; ఇది నిజమేనా? ఇట్లుకూడ మీ రొక గ్రంథము వ్రాసియున్నారా? వీరికొరకై చెప్పవలదు. జ్ఞాపకము తెచ్చుకొని చెప్పుడు. ఇట్టి గ్రంథము మీ రెందులకై వ్రాసితిరి." అను నిట్టి ప్రశ్న లడుగ నారంభించిరి.

అన్నిటిని మిక్కిలి యోరిమితో వినుచున్న పిళ్లెగారు "ఏమి నాయనా! త్యాగరాజా, పైపైన పరుగిడుచున్నావే! ఇట్టి ప్రబంధము నేను రచించియుండ కూడదా? ఇం దేపైన దోసగు లున్నవా? సులభశైలిలో పద్యములు వ్రాయుటే తప్పా! సాధారణజనులుకూడ చదివి యర్థ మరయున ట్లుండినచో బాగే కదా. కఠిన ముగ నున్నచో కష్టము గదా?" అని చెప్పిరి.

వినిన చెట్టియారు "అటు లైనచో సరియే. దానిమూలమున మీకు అగౌరవము రాకూడ దనియే నా యభిలాష. సరి. ఆలస్య మయినది. బయలుదేరవచ్చునే?" అనిరి.

చెట్టియారు ఇంత చనవుగ పిళ్లెగారియొద్ద మాట్లాడుదు రని నే తలంపలేదు. వారు చూపెడు నాదరముచేతను, వినయముచేతను తమ్ము శిష్యులుగ తెలియజేసి కొనిరి. మాటలలోననో మనసులు కలిపి మెలగెడు మిత్రులవలెనే ముచ్చటించిరి. తమ మనస్సున నున్న అభిప్రాయములను దాటుమాటులు లేక, మర్యాదకై భయ పడి మనస్సులోననే దాచుకొని యుండలేక వెలువరచిరి.

చెట్టియారు లేచిరి. మేమును లేచితిమి. "అయ్యవద్ద మీరు చక్కగ పాఠ ములు చదువుకొనుచుండుడు. వారియొద్ద నుండుటయే యొక గౌరవ మని తలచి సోమరిగ నుండవలదు. కొలదికాల ముండి, అన్నియు తెలిసిన వని తలచి పరు గెత్తిపోవుటయు తగదు. ఇట్లు పాఠము చెప్పెడువారిని వేరెక్కడను చూడలేము. మీ మేలు కోరి చెప్పుచున్నాను." అని చెట్టియారు నన్ను చూచి చెప్పిరి. ఆ మాటలు నాకు మేలగు సదుపదేశములై యుండినవి.

పిమ్మట మేము బండి యెక్కి పట్టీశ్వరము చేరితిమి.

# 20. 'పట్టీశ్వరము' సంఘటనలు

"శక్తిముట్రప్పులవర్" అనువారినిగూర్చి తమిళము చదివినవారిలో పెక్కురు తెలియుదురు. ఆ కవిగారు వ్రాసిన 'ఆశిరియర్పా' (ఒక జాతివృత్తము) ఒకటి వారియశస్సుకు ముఖ్యకారణము. 'నారాయ్ నారాయ్ శెంగాల్ నారాయ్!' అని యారంభించు పద్య మొక్కటే వారియెడ నైసర్గికముగనే యున్న కవిత్వశక్తిని స్పష్టముగ తెలియజేయుచున్నది. 'చీల్చిన తాటి తేగవలె సన్నని పొడుగైన నోరు గల ఓ నక్కా!' అని వారు నక్కను సంబోధించుచున్నారు. ఈ యుపమానము పాండ్యప్రభువు చిత్తము నాకర్షించినదట! కట్టు బట్టలు లేక, వాడి కృశించి చేతులతో నొడలు కప్పుకొనుచు పడియున్న తమ దుర్దశను ఆ పండితు లెంత రమణీయముగ వర్ణించియున్నారు? తాము పడిన పాట్లన్నియు వారికి పెద్దవిగ తోపలేదు. తమ యర్ధాంగి తమ యింట పడిన యగచాట్లు తలపోసి వాడి వత్తయైనారు! అరుదగు నా పద్యమును రచించినవారు ఈ యూరనే వసించియుండిరి." అని మాయాచార్యులవారు పట్టీశ్వరము చేరిన వెంటనే సెలవిచ్చిరి.

"ఇది పట్టీశ్వరము కదా?" అని నే నడిగితిని.

"ఔను. అదుగో, కనుపించుచున్నదే, అదియే 'శక్తిముట్రము' కోవెల. పట్టీశ్వరము శక్తిముట్రమును సన్నిహితములై యున్నవి. పట్టీశ్వరపు ఉత్తర వీథియే శక్తిముట్రమునకు దక్షిణవీధిగ నున్నది.

"ఆ కవివంశమునకు చేరినవారు ఇప్పు డున్నారా?"

"ఉన్నారు. ఒక్కరు తమిళజ్ఞానము కలవారు, వారిని మీరును చూడ వచ్చును."

మేము పట్టీశ్వరమునకు చేరి ఆఱుముగత్తాపిళ్లె యింటిలో విడిసితిమి. వారా యూరిలో నొక జమీందారువలెనే జీవిక సాగించుచుండిరి. పిళ్లెగారిని వారు మిక్కిలి ప్రీతితో నుపచరించుచు కాపాడుచుండిరి. అగ్రహారమునందు నొక యింట నేను భుజించుట కేర్పాట్లు చేసిరి.

ఆఱుముగత్తాపిళ్లై గొప్ప దాత. తమ సంపదను ఈ మార్గమంచే యుపయోగ పరచవలె నను హద్దులు లేని వారు. ఆ యూరిలో తమ్ము ఒక చిన్న ప్రభువు లనియే తలచుకొని అధికారము 'చలాయించు'చుండిరి. ఎవ్వరు వచ్చినను అన్న మిడుట యందు వెనుదీయరు. పిళ్లైగారు వారియింట వసించిన కాలమున ఒక్కొక్క దినము ఒక్కొక్క పర్వదినముగనే యుండును. కుంభకోణము మున్నగు స్థలముల నుండి పిళ్లగారిని చూచుటకై ప్రతిదినము కొందరు వచ్చుచునే యుందురు.

పిళ్లైగారియెడ మాత్రమే ఆఱుముగత్తాపిళ్లై విధేయతతో నడచుకొందురు. తక్కినవారిని వారు లక్ష్యపెట్టరు. ఎల్లరును వారి యిష్టానుసారమే వర్తింపవలెను. లేనియెడల వారికి మిక్కుటముగ కోపము వచ్చును. ఆ కోపముచే వారు కొందరు పేదలను కఠినముగ శిక్షించుటయు కలదు.

నేను వెంట గొనిపోయిన ప్రబంధము లన్నిటిని ఒక్కొక్కటిగ కొన్నాళ్లలో పాఠము చదివి పూర్తిచేసితిని. ఇకపై పాఠము చదువుటకు వేరు పుస్తక మేదియు లేదు. ఈ విషయమును మా యుపాధ్యాయులకు తెలియజేసితిని.

"తమ్మునియొద్ద పుస్తకము లున్నవి. ఏదైన తీసికొని చదువవచ్చును. మొదట 'తిరునాగైక్కారోణప్పురాణము' చదువుడు" అని వారు చెప్పి, ఆ గ్రంథము ఆఱుముగత్తాపిళ్లైగారియొద్దనుండి తెచ్చి యిచ్చిరి.

అంతవరకు పిళ్లైగారు రచించిన పురాణ మేదియు నేను పాఠము విని యుండమిచే ఆ పురాణము వినుటలో నా కౌత్సుక్య ముండినది.

ఆ పురాణపాఠము విన మొదలిడితిని. వేకువ జాముననే పాఠ మారంభ మగును. ఎనిమిది గంటలవరకు పాఠము విందును. పిమ్మట చలిదియన్నము తిని వత్తును. వచ్చి మరల పాఠము విన నారంభింతును. పది, లేదా పదునొకండు గంటల వరకు పాఠము సాగును. మధ్యాహ్నభోజనమునకు తరువాత పిళ్లైగారు అలవు తీర్చుకొందురు. వారు లేచిన వెంటనే మరల పాఠము చదువుదును. తరచుగ మధ్యాహ్నమునకు పిదప పొరుగూరులనుండి వచ్చెడువారు వారితో భాషించుచుందురు. సాయంకాలమున 'తిరుమలరాయల మేటికి' జని, మరలి వచ్చునపుడు నేను భోజనము చేయు నింటి కేగి యాహారము స్వీకరింతును. నేను వచ్చువరకు ఆ యింటి యరుగుపై ఉపాధ్యాయు లుందురు. అచట చీకటిలో వా రొంటరిగ కూర్చొని యుందురు. ఇంటివారు కొన్ని సమయముల దీపము తెచ్చి యచట నుంతురు.

వని ?" అని మందలింతురు. 'దేవుడా !' అని వారి కోపవచనములు విని నోరు తెరవక నిలుతును.

ఒకనాడు అర్ధరాత్రి అలవాటు చొప్పున నేను పాఠము విన తప్పిపోతిని. అందరును భోజనార్థము లేచినపుడు నేను లేవలేదు. వేకువ జామున లేచి కాలకృత్యములు తీర్చుకొని యలవాటు చొప్పున పాఠము చదువ నెంచి, రాత్రి పుస్తకము లుంచిన చోటికి పోయి చూచితిని. అచ్చట నది కానిపింప లేదు. కొన్ని యితర స్థలము లందును చూచితిని; కనిపింప లేదు. వేరేదైనను చదువుద మని తలంచి నా పుస్తకములకట్ట యుండిన స్థలమునకు జని చూచితిని. ఆ కట్టయు నట కనబడ లేదు. 'ఆయుముగత్తాపిళ్లై చేసిన పనియే యిది. వారి కోప మింకను ఏ యే కష్టముల కల్పింప నున్నరో !' అని తలచినప్పుడు ఒడలెల్ల వణకు పుట్టెను. 'ఈ చోటికి వచ్చి తగులుకొంటిమే !' అని వగచితిని.

వాడిన మొగముతో ఆచార్యులయొద్దకు జేరి "పుస్తకము కనిపింపలేదు" అని చెప్పితిని. వా రచట నున్న 'పనివారి'తో చెప్పి వెదకించిరి. వారు వెదకియు కనుపింప లేదు. "ఈ విషయము తమ్మునియొద్ద చెప్పవచ్చు గదా ?" అనిరి.

ఆయుముగత్తా పిళ్లై యపుడు నిదురనుండి మేల్కొనలేదు. వా రెల్లప్పుడు నెనిమిది గంటలవరకు నిదురింతురు.

కొంచెము సేపైన తరువాత వారు నిదుర లేచి యా మార్గముననే వెడలిరి. అప్పుడు నే మారక యుండుట గాంచి "ఏల వీ రూరక యున్నారు? పాఠము వినుట కేమి ?" అని యడిగిరి. మా యుపాధ్యాయులు మెల్లగ "వారు పుస్తకము పెట్టిన చోట నది యగుపింప లేదట" అని పలికిరి.

"అదా సంగతి ! చదువుచున్న పుస్తకముకూడ జాగ్రత్తగ పెట్టుకొనలేని వీరు ఏమి చదువుదురు ? వీరికి అయ్యగారు పాఠము చెప్పుట వ్యర్థప్రయాసమే. చదువునందే పట్టుదలగలవారైన వీ రిట్లు నిశ్చింతగ నుందురా ?" అని వారు చెప్పుచునే వెడలిపోయిరి.

"ఇట్లే బయలుదేరి యూరికి పోవుదమా !" అని కూడ నాకు తోచెను.

మరల వారు వచ్చిరి. "వీ రెంత కాలముగ చదువుచున్నారుగదా, వీరికి తమిళ మున నేదైన చొరవ యేర్పడినదా? మీరు మిగుల కష్టించి యెడతెరిపిలేక పాఠము చెప్పుచున్నారే! వీరు బాగుగ చింతన చేయుచున్నారా? మీతో నలవడు వీరు చక్కగ పాఠము వినుచుండినచో నిప్పుడు తమిళమున కవిత్వము వ్రాయు నలవాటు వీరి కేర్పడి యుండవలెను. ఏదీ, ఇప్పుడు వీరి నొక పద్యము వ్రాయు మని చెప్పుడు, చూతము. నేను పోయి వచ్చు లోపల ఒక పద్యము రచించి వీరు చెప్పినచో వీరి పుస్తకము లెచ్చట నున్నను తెప్పించి యిత్తును. లేదేని క్రొత్త పుస్తకములైనను కొని యిత్తును." అనిరి.

"తమ్మునిమీదనే ఒక పద్యము చెప్పుడు, చూతము" అని మా యుపాధ్యా యులు నన్ను చూచి యానతిచ్చిరి.

ఆఱుముగత్తా పిళ్లై నేనే పద్యము వ్రాయుదునో, లేదో యని గమనించుటకై ఒక కావలివాని నుంచి "నేను వచ్చునంతలో పద్యము రచించి చెప్పవలెను" అని హెచ్చరికకూడ చేసిరి.

పిళ్లైగారు నన్ను వేరొక చోటికి పిలుచుకొని పోయిరి. అప్పుడు నన్ను కాచు చున్నవారును వెంట వచ్చిరి. మేము కదలిపోవునపుడే నే నొక వెణ్బా మనస్సులో రచించి పూర్తి చేసితిని. దానిని గురువుగారికి చదివి వినిపింపదలచి "శీర్ మరువు మాఱుముగ చ్చెమ్మలే" (సిరిసంపదలు నిండియున్న యాఱుముఖప్రభో!) అని యారంభించితిని. అది వినిన వెంటనే పిళ్లైగారు "ఉండవిండు" అని, మా 'కాపరి' యొద్ద "మీరుపోయి తవళిపిళ్లైయొద్ద (పాచకుడు) నా పూజకు స్థల మేర్పరుప చెప్పి రండు" అని చెప్పి వారిని పంపివేసిరి. పిదప న న్నుద్దేశించి "మీరు చెప్పిన వాక్య మును 'శీర్ మరువుమ్ మాఱుముగ చ్చెమ్మలే' (సిరిసంపదలు నిండిన, మారి పోయిన మొగము గల .......) అనియు పదచ్ఛేదము చేయవచ్చును. తమ్ముడు దానిని విన్నచో ఆగ్రహోదగ్రు డగును. ఇట్లు విరుద్ధార్థప్రతీతి కలుగునట్లు పద్యము వ్రాయజనదు." అని చెప్పుటయ గాక 'వెణ్బా' (ఒక తీరు పద్యము) నాకయి పూర్తి చేసి చెప్పిరి. నేను దానిని మననము చేసి కంఠస్థమగున ట్లొనర్చితిని.

ఆఱుముగత్తాపిళ్లై అవైపు రాగనే, నేను వారియొద్దకు జని మిక్కుటమైన వినయముతో మా గురువుగారు వ్రాసి యిచ్చిన పద్యము చదివితిని.

'అఱుముఖ'భూపాలా, ప్రీతిలేనివారివలె నాయెడ పెడమొగమైయున్నచో
నన్ను చేరదీయువా రెవ్వరు? శ్లాఘ్యమగు ద్రావిడభాష నభ్యసింప
వచ్చిన నాపై పగ మేల? ఎల్లరును నెయ్యముగొనదగు మహా
దయను నీవు చూపుము.

అను నర్థముగల పద్యము నేను చెప్పినపుడే వారి మోమున కొలదిగ 'సంత సపు చిన్నె' గోచరించెను. వారిని 'భూపాలు' రని చెప్పుటలో నధికానందము కలిగి యుండవలెను.

ఇకపై చక్కగ పాఠములు వినుచుండుడు. సోమరితనము వదలిపెట్టుడు. పద్యము లల్లుట యభ్యసింపుడు" అని వారు నా కుపదేశము చేయదొడగిరి. అప్పు డొక భృత్యుడు నా పుస్తకముల కట్టను, మాయూరపురాణమును ఎత్తుకొని వచ్చినాడు. వానియొద్దనుండి ఆ పురాణమును తీసికొని నా యొద్ద నిచ్చి, పుస్తకముల కట్టను ముందున్న స్థలమందే తీసికొనిపోయి పెట్టున ట్లాజ్ఞాపించిరి. నే నా పురాణమును పొంది మా గురువుగా రున్న చోటికి పోతిని. "ఒక గండము గడచి బయటపడితిమి" అని తలపోయుచు వారిని దాసి, జరిగిన సంగతులు నివేదించితిని.

'పురట్టాశి'నెల శనివారములందు కొన్ని యిండ్ల నక్షతలు (బియ్యము) సంపాదించి వానిని కొనిపోయి వండి ఒకవేళ మాత్రము భుజించుట మా కుటుంబపు సంప్రదాయము. ప్రొద్దున స్నానముచేసి పొరుగిండ్లకు తడిబట్టలతో మౌనముగ పోయి తడి తుండుగుడ్డలో అక్షతలు పుచ్చుకొనుట ఒక వ్రతముగ మా కులము పెద్దలు అనుష్ఠించుచుండిరి. దీనిని 'గోపాల (తిరిపె) మెత్తుట' అని యందురు.

పట్టీశ్వరమునందు నే నున్నప్పుడు మొదటి శనివారమునాడు 'గోపాలమెత్తుట'కై ప్రొద్దున స్నానము చేయ బయలుదేరితిని. అఱుముగత్తా పిళ్లై ఏమి విశేష మని విచారించిరి. నేను విషయము చెప్పితిని. అది వినిన వెంటనే వారికి మిక్కిలి కోపము వచ్చెను. "మీరు వైష్ణవులా? ఇట్టి వ్రతముల నన్నిటిని మీయూరియందే యుంచుకొనుడు. ఈ యెల్లలో నట్లు చేయరాదు. శైవులమగు మాతో నలవడు మీకు ఇట్టెల్ల బుద్ధి పోవుట యాశ్చర్యము!" అని దండింప మొదలిడిరి. ఇంతియ కాక నేను భోజనము చేయుచుండు నింటికి 'నేను గోపాల మెత్తుకొని వచ్చిన భోజనము పెట్టరా' దని చెప్పిపంపిరి. నే నేమి చేయుదును! తరతరాలుగ వచ్చిన

యాచారమును విడువకూడ దనియు, అట్లు చేసిన పెద్ద కీడు మూడు ననియు నేను నమ్మియుంటిని. మా కులదేవతయగు శ్రీ వేంకటాచలపతిని స్మరించి, స్వీకరించిన యా వ్రతమునకు భంగము వాటిల్లెనేని కుటుంబమునకే కడగండ్లు కలుగునే యని భయపడితిని. నాటి మధ్యాహ్నము నేను భుజింపలేదు. కొబ్బరితోటకు పోయి క్రింద పడుకొని యాకట నేలపై పొరలితిని ఇట్టి యిడుమల కగ్గముగ జేసిన నా విధిని దూరితిని.

నేను భుజింప రాలే దని తెలిసి నా కాహారము పెట్టెడి యింటివారు మిగుల వగచిరి. వా రచ్చటకు వచ్చి నన్ను జూచి నిర్బంధించుటచే నాటి సాయంకాల మైదు గంటలకు పోయి భుజించితిని. 'పురట్టాశి' నెల శనివారము వ్రతమునకు ఆయూరిలో వీడ్కోలిచ్చితిని.

ఇట్లుండగ శవేరినాథపిళ్లెను పిలుచుకొని రావలె నని ఆచార్యులు మాయూరము నకు చెప్పిపంపిరి. శవేరినాథపిళ్లె వచ్చిన వెంటనే ఒక పెద్ద కార్యము సాధించిరి. ఆఱుముగత్తాపిళ్లెయింటిలో రాత్రి పండ్రెండు గంటలకు పైన భుజించు నలవాటు వారి ప్రయత్నముచే నాగిపోయినది. వారు ధైర్యముగ మాట్లాడుదురు. "పట్టీశ్వర మున, రాత్రి చాల ప్రొద్దు పోవువరకు ఆకటితో నకనక లాడునట్లు చేసిన బ్రహ్మ- దేవుడు మమ్ము బ్రాకులుగ సృష్టింపలేదే!" అను భావ మిముడునట్లు ఒక పద్యము వ్రాసి దానిని బహిరంగముగ చెప్పుచుండిరి. ఆఱుముగత్తాపిళ్లె యది వినిరి. శవేరినాథ పిళ్లె వారికి తగినట్లుగ సంగతులు పక్వముగ జెప్పి వారి మనస్సు మార్చిరి. అది మొదలు రాత్రి పదిగంటలలోపల నందరును భుజించు నలవా టేర్పడెను.

సరస్వతిపూజకు ఉత్తమదానపురమునకు పోతిని. అచట కొన్నాళ్లుండ వలయు ననియే యుద్దేశించితిని. సరస్వతిపూజ నెరవేర్చుకొని మరుసటిదినము 'పునః పూజ'యు నొనర్చితిని. విజయదశమి విద్యార్థులకు విశిష్టదినము కాదా? తమ తమ గురువులొద్ద క్రొత్త పాఠ మారంభించుట మన దేశాచారము. పిళ్లెగారి చేతులార నా డొక గ్రంథము పొందవలె నని యభిలాష నాలో కలిగెను. ఇన్నాళ్లు వారితోడ నుంటిమి. ఏదినము వారితోడ నుండి పాఠము వినవలయునో ఆ దినమున వారి నెడ బాసి యుండుట న్యాయము కాదు. ఎట్లయినను నేడు పోయి వారిని చూడవలె నని నిశ్చయించుకొంటిని.

నడచి సాయంకాలము నాలుగు గంటల వేళకు పట్టీశ్వరము వచ్చి చేరితిని. నన్ను చూచిన వెంటనే "ఏమి, ఇంతలో వచ్చివేసితిరి?" అని గురువుగా రడిగిరి.

"నేడు విజయదశమి. అయ్యగారియొద్ద ఏదేని యొక గ్రంథము పొందవలెనని తలచి వచ్చితిని" అని యంటిని.

వెంటనే గురువుగారు అచ్చటకు వచ్చిన యొకరియొద్ద ఆ యింటిలో పూజలో నుంచియున్న తాళపత్రగ్రంథములలో నొక్కటి యెత్తుకొని వచ్చునట్లు చెప్పిరి. వా రట్లే యొక్కటి కొనితెచ్చి పిళ్లెగారియొద్ద నిచ్చిరి. దానిని వారు నాకు ప్రసాదించిరి. దానిని నేను మిక్కిలి యాసక్తితో స్వీకరించితిని. "ఏమి గ్రంథమో తెరచి చూడుడు" అని వారు చెప్పగ నేను చూచితిని. అది నైషధము! "నైషధము చదివిన కలిపీడ తొలగిపోవు నని పెద్దలు వచింతురు. మీకు 'కలి' నేటితో తొలగిపోయినది. ఇకమీద చింతింపవలసిన పని లేదు". అని యాచార్యు లానతిచ్చినపుడు నా యొడలు పులకితమైనది.

"మాయూరమున అయ్యగారియెడ మొదట పొందినది నైషధమే. అప్పుడే యిట్లు తలచితిని." అని నేను చెప్పితిని. పిదప కొన్ని పద్యములు గురువులముందర చదివితిని.

'పురట్టాశి' నెల గడచి 'ఐప్పశి' నెల వచ్చినది. దీపావళి సమీపించెను. మా జననీజనకులను, బుడుతడగు తమ్ముని చూడవలెనను కాంక్ష నా కుదయించెను. దీపావళికి పోయి తలిదండ్రులతో నుండి రావలె నని తలంచి పిళ్లెగారియొద్ద నా భావము తెల్పితిని.

"అట్లే చేయవచ్చును" అని వారు అనుమతి యిచ్చిరి. బయలుదేరి పోవునపుడు రెండు పట్టంచు ఉత్తరీయములు తెప్పించి నాకు ప్రసాదించిరి. "దీపావళికి ఉపయోగించుకొనుడు. సౌఖ్యముగ దీపావళిస్నానము చేసి కొన్నాళ్లుండి అట్లే మాయూరమునకు రావచ్చును. నేను దీపావళికి అచటికే పోదలచియున్నాను" అనిరి. వారి యపారకృప యరసి నే నచ్చెరువొందితిని. ఆ యుత్తరీయములను వినయవినమ్రుడనై స్వీకరించి యనుజ్ఞ వడసి బయలుదేరితిని.

దీపావళిస్నానము చేసితిని. మా గురువుగారు ప్రేమతో ప్రసాదించిన వస్త్రములు ధరించితిని. అప్పుడు నా కొక యపూర్వానందము అనుభవగోచర మయ్యెను.

దీపావళి కడచిన కొన్నాళ్లకు నాకు తీవ్రమగు జ్వరము తగిలెను; మిక్కిలి శ్రమపడితిని.

# 21. 'తిరువావడుదుఱై' దృశ్యములు

'మార్గళి' నెల చివరికి నాకు జ్వరము పూర్తిగ తగ్గిపోయినది. కాని కొంత బలహీనిమాత్ర ముండినది. పిళ్ళైగారియెడకు పోవలె నను ఉత్కంఠ రాను రాను అధికమైనవి.

మా నాయనగారు తిరువావడుదుఱకు పోయి పిళ్ళైగా రుండుచోటు తెలిసికొని వచ్చునట్లు చెప్పి బయలులేరి పోయి వచ్చిరి. "వారు గురుపూజకై తిరువావడుదుఱకే వత్తురు గాన నీవును అప్పుడే యక్కడకు పోయి వారితో జేరుకొనవచ్చును." అని చెప్పిరి. నేను నట్లే గురుపూజ ప్రతీక్షించుచుంటిని.

'తై' నెల అశ్వినీనక్షత్రమునాడు తిరువావడుదుఱయాధీనస్థాపకులగు 'శ్రీ నమశ్శివాయమూర్తి'గారికి గురుపూజ జరగును. గురుపూజాదినమున ప్రొద్దున నేను తిరువావడుదుఱ వచ్చి చేరితిని. నేను మునుపు చూచిన తిరువావడుదుఱవలె లేదా యూరు. 'గురుపూజ' 'గురుపూజ!' యనుచు ఇరుగు పొరుగు గ్రామవాసులు మిక్కిలి గొప్పగ జెప్పుకొనుట విన్న నాకు ఆ తిరునాళ్ల ఒక పెద్ద యుత్సవముగ జరగగల దను భావముమాత్రమే యుండినది. కాని నే నా నాడు చూచిన దృశ్యములు నాయూహకు ఎన్నియో రెట్లు అధికముగ తోచినవి.

ఎటువైపు చూచినను ఒకే తీర్థప్రజ. తమిళదేశమందుగల యన్ని తెగలవారిని అచ్చట చూచితిని. వేర్వేరు దేశస్థులును వచ్చియుండిరి. విద్వాంసులలో నెన్ని తెగలవారు! సంగీతవిద్వాంసులలో నూర్లకొలదిగ నున్నవారిని చూచితిని. వారిలో హరికథలు చెప్పెడువారును, నోటి పాట పాడువారును, వీణ వేణువు గోటువాద్యము ఫిడేలు మున్నగు వాద్యములందు అందెవేసిన చేతులవారును ఉండిరి. సంస్కృతపండితులలో ప్రత్యేకముగ ఒక్కొక శాస్త్రమునందు పారంగతు లచ్చట విడిసియుండిరి. వేదాధ్యయన మొనర్చెడివారు గోష్ఠులుగ జేరి వేద పారాయణము సాగించుచునే దేవాలయములందును, తక్కిన స్థలములందును ఉండిరి. తేవారప్రబంధములను మధురసంగీతపక్కికలో పాడుచున్న గాయకు

లును, విభూతిరుద్రాక్షల ధరించి, ముఖమందు దివ్యవర్చస్సు వెలుగొందగ హృదయము లరికట్టు 'తేవారము' మున్నగువానిని పాడుచుండిరి.

వివిధప్రదేశములనుండి తంబిరానులు వచ్చియుండిరి. మఠమునకు ముఖ్య శిష్యులగు తగిన ఘనులు పలువురు కానుకలతో వచ్చియుండిరి. ఇతరసందర్భములందు తమ జ్ఞానాచార్యుల దర్శనము చేసికొన వీలుకాకపోయినను, సంవత్సరమున కొక్కసారె గురుపూజాదినమున దర్శనము చేసికొని, ప్రసాదము స్వీకరించి పోవుటలో వారి కొక తృప్తి యుండినది. శ్రీ సుబ్రహ్మణ్యదేశికుల ప్రేమనిర్భర సూక్తులు వారి యంతరంగములను కట్టి లాగుకొని వచ్చినవి.

గురుపూజాకాలముల అన్నదానము చాల విరివిగ జరుగును. ఎవ్వరు వచ్చినను అన్నదానము- చేయుదురుఅనుటకు గుర్తుగా మఠమందు ఉత్సవము మొదటి దినమున 'అన్నధ్వజ' మెత్తుదురు.

తిరువావడుదుఱయం దున్న మఠము చాల శ్రేష్ఠమైయుండుట ఆయూరికి ఒక ముఖ్యమైన గొప్పదనము. దానితోబాటు అది తేవారములందు కీర్తింపబడిన స్థలము. తిరుజ్ఞానసంబంధమూర్తి నాయనారు తమ తండ్రిగా రనుష్ఠించిన యాగమునకై వేయి బంగారు నాణెములు శ్రీ శంకరభగవానులనుండి యా స్థలమున పొందిరి.

నేను తిరువావడుదుఱయందు వీథిలో ప్రవేశించినది మొదలు, అచటి ఆనంద కోలాహలము, నేను చూచిన దృశ్యములును నన్ను భ్రమింపజేసినవి. ఒక్కొక్క ప్రదేశమునను నిలిచి నిలిచి యచటచటి విశేషములు చూచితిని. ఆమహాజనసమూహమందు శ్రీ పిళ్లెగారిని నే నెచ్చట వెదకగలను? వీథివీథుల వెదకి వేసారితిని. కన్ను లలసిపోయినవి. పండ్రెండు గంటలకువరకు తిరిగి తిరిగి కాళ్లు నొప్పు లెత్తినవి. కడుపులో నాకలి గిల్లుచుండెను. భోజనమైన తరవాత చూచుకొనవచ్చును లెమ్ము అని యెంచి భోజనశాలకు పోతిమి.

బాపురే! ఎంత గుంపు! ఏమి కోలాహలము! ఏమి సంతర్పణ! నా కా గుంపులో చోటు దొరకునా? అను సందేహ మొదవెను. ప్రొద్దున తొమ్మిది గంటల నుండి యన్నదానము జరగుచునే యున్నది. నేను చనినపుడు గూడ గుంపున కేమియు లోటు లేదు. మెల్లగ చోటు చేసికొని, భుజించునంతలో తలప్రాణము తోకకు వచ్చెను. అహారాధిక్యముచేత భోజనానంతరముకూడ కొంచె మాయాస పడితిని.

మరల నాచార్యాన్వేషణ కుపక్రమించితిని. భుక్తాయాసమువలన, ప్రొద్దున వెదకినపు డుండిన వేగము నా కిప్పుడు లేదు. మెల్లగ ఒక్కొక్క వీథిగ తిరిగితిని. నడుమ నడుమ నెదురువచ్చిన వారిని "పిళ్లైగా రెచ్చట విడిసియున్నారు ?" అని యడిగితిని. "వా రెచ్చోటను ఉందురు. పండారశ్రీ స్వామివారితోడ సల్లాపము చేయుచునుందురు. విద్వద్బృందములందు నుందురు. లేదా విద్యార్థులకు పాఠము చెప్పుచుందురు" అని చెప్ప వినినపుడు ఏదో తెలియని వేదన జనించెను. "ఆ బృందమున చేరక ఇట్లు మన మొంటరిగ తిరుగుచున్నామే ?" అను తలంపు తలయెత్తెను. వెంటనే వేగముగ నడుగిడ మొదలిడితిని.

కట్టకడపటికి, దక్షిణపు వీథిలోని మఠకార్యస్థు లొకరి యింటి యరుగుపయి మా యాచార్యు లుపవిష్టులై యుండ గాంచితిని. వారి పార్శ్వమున కొందరు ఘనులును, తంబిరానులును ఉండిరి. అందరు మిక్కిలి యుల్లాసముగ సల్లాపము చేసికొనుచుండిరి. పిళ్లైగారు నన్ను చూచిన వెంటనే "ఎప్పుడు వచ్చితిరి ? భోజనమైనదా ? దేహారోగ్య మె ట్లున్నది ?" అని ప్రేమ యలుగులు పొంగి పొరలి పారగ విచారించిరి. నేను సమాధానము చెప్పినవెంటనే "శరీరము చిక్కి యున్నది. ఇంకను ఏదైన నౌషధము సేవించుచున్నారా ?" అని యడిగిరి. "లేదు" అని బదు లిచ్చితిని. పిదప మా తల్లిదండ్రులనుగూర్చి విచారించిరి.

"గురుపూజ యింతవరకు మీరు చూడలేదుకదా ?'' అని ప్రశ్నించిరి.

"లేదు'' అని యంటిని.

"ఇట్టి విశేష మెచ్చటను ఉండదు. ఇది యంతయు సన్నిధానశ్రీవారి యుదారతవల్లను మహిమవలననే జరగుచున్నది"

'సన్నిధానశ్రీ వా' రనగ అధీనాధిపతులగు సుబ్రహ్మణ్యదేశికులే.

''ఇకపై పాఠము విన రావచ్చునుగదా ?"

"నేను కాచుకొని యున్నాను."

గురుపూజ యైన వెంటనే మాయూరము పోవుదును. అటకు చేరిన వెంటనే పాఠ మారంభింపవచ్చును." అని యాచార్యులు చెప్పినపుడు మనసున తాప మడగెను. పాఠము వినుటలో నా కున్న ఔత్సుక్యమును తెలుపుటకు ముందే పాఠము చెప్పుటలో తమ కున్న శ్రద్ధను వారు తెలియజేసిరి.

గురుపూజనాడు రాత్రి భోజనానంతరము అచట సాగుచున్న మహోత్సవ సమారోహముల విలోకింప నేగితిని. శ్రీ సుబ్రహ్మణ్యదేశికు లందమైన నొక 'పల్లకీ'లో కూర్చొని యూరేగిరి. వెంట నంటి వచ్చిన దాసుల బృందము, 'బాణసంచా' వినోదములు, వాద్యఘోషయును, ఆయుత్సవమునకు వన్నె దెచ్చినవి. పలువురు సిద్ధహస్తులైన నాగస్వరవిద్వాంసులు తమ సామర్థ్యము ప్రదర్శించిరి. 'పల్లకీ'లోని యలంకారము కన్నుల నరికట్టినది. మెరవణి జరగుకాలమున శిష్యుల యిండ్లలో నీరాజనము లిచ్చిరి.

'మెరవడి' యైన పిదప కొలువు అమర్చబడెను. అప్పుడు కొలువుమండపమున ఆధీనపు అధ్యక్షులు విజయము చేసియుండ వారికి పూజాదు లొనర్తురు. పూలతో నలంకరింపబడిన మండపమధ్యమందు శ్రీ సుబ్రహ్మణ్యదేశికులు కొంచెమేని చలింపక యాసీనులై యుందురు. వారి యంగప్రత్యంగసన్నివేశము, దివ్య తేజమును, ఏదో ఒక సుందరవిగ్రహమును ప్రతిష్ఠించి ధూపదీపములతో పూజ సలుపునట్లు తోపజేసినవి. కొలువు జరగుచుండుచోట పెద్ద జనసమూహముండినది. తేవారముమధురసంగీతము, వాద్యఘోషయు నెడతెరపి లేక సాగి పోవుచుండినది.

అన్నిటిని చూచి సంతోషించి పిదప పిళ్లైగారి విడిదికి వచ్చితిని. ఆచార్యులు నిదురింపక తమ మిత్రు లొకరితో ముచ్చటించుచుండిరి.

కొలువు ముగిసిన తరువాత విశ్రాంతి తీసికొనక శ్రీ సుబ్రహ్మణ్యదేశికులు వచ్చిన వారికి సెల వొసంగి వారి వారి యూరులకు పంపించుట యలవాటు. మరుసటి దినము ప్రొద్దున బయలుదేరి పోవలసినవారు గురుపూజనాటి రాత్రియే శ్రీ దేశికుల వారిని దర్శించి ఉత్తరువు పొంది పోవుదురు. గురుపూజనాటి ప్రొద్దున 'వేళాళ' ప్రభువులును, తక్కినవారును తమ తమ శక్తికొలదిగ ద్రవ్యమును పాదోపాయనముగ సమర్పించి దేశికులకు వందన మాచరింతురు. వారికిని తక్కినవారికిని వారివారికి తగిన రీతిని సమ్మానము చేసి పంపెడు పనిని ఆధీనకర్తలు నాటి రాత్రి గమనింతురు. సుబ్రహ్మణ్యదేశికు లీ విషయమున కొంచెమేనియు తామసము లేక, వచ్చిన వారి సౌకర్యముల ననుసరించి వెంట వెంట పంపివేయుచుందురు. ప్రభువులను వీడ్కొల్పుటతోబాటు పండితులనుగూడ తగు రీతి సమ్మానించి వీడ్కొల్పుదురు. పలువురు మరుసటి దినముకూడ నుండి సల్లాపము సలిపి వీడ్కొని చనువారును కలరు.

మిత్రులు సంభాషించి వీథ్థొని చనిన పిదప గురువుగారు ఆ యింటినడవ తిన్నెపై శయనించి యుండిరి. ఒక నిమిషమైన కాలేదు. అంతలో నొక వృద్ధులు వచ్చినారు. వారి పేరు పశుపతిపండారము. వారు ప్రాత గాథల త్రవ్వ నారంభించిరి. పిళ్లెగారిని వారి పిన్నతనమున తాము పరీక్షించి రట! అవసరముగ తా మూరికి పోవలయు నట! ఇంతను ఏమేమో 'డొంకతిరుగుడు'గ చెప్పుకొని పోవుచునే యుండిరి. కడకు, తమ కొక పద్యము రచించి యిచ్చిన సుబ్రహ్మణ్యదేశికులయొద్ద తామే రచించిన దని చెప్పుకొని సమ్మానము పొందుటకు చాల అనుకూలముగ నుండునని చెప్పిరి. ఆ కవి శిఖామణి మిగుల ననాయాసముగ ఒక పద్యము వ్రాయించి వారి కిచ్చిరి. వారు దానిని పుచ్చుకొని వెడలిపోయిరి. గురువుగారు మరల నేలపై మేను వ్రాల్చిరి. ఉత్తరక్షణముననే వేరొకరు వచ్చిరి. వారును ఒక పద్యము వ్రాయించి యిం డని వేడుకొనిరి.

ఇట్లే ఒకరి వెనుక నొకరుగ ఆ రాత్రి యంతయు పెక్కురు పిళ్లెగారియొద్ద పద్యములు కొనిపోయి, సుబ్రహ్మణ్యదేశికులయొద్ద సమ్మానము పొంది, వెడలి పోవుచుండిరి. ఇట్టి యా వింత సంఘటనను నేను కొన్ని గడియల కాలము చూచి తిని. తరువాత కూర్కు పట్టెను. వేకువ జామున లేచినపుడే ఆచార్యులు రాత్రి యంతయు నిదురింపనే లే దని తెలియవచ్చెను.

ప్రొద్దు పొడిచిన వెంటనే వారు తమ యనుష్ఠానము నెరవేర్చుకొని సుబ్రహ్మణ్యదేశికుల యొద్దకు జనిరి. నేను వెంటనే యుంటిని. దేశికులు రాత్రియంతయు చే యాపక యిచ్చుచునే యుండుటయు, ఎంతమాత్రము పాలుమాలిక లేక ప్రాతః కాలమున స్నానాదికృత్యములు నిర్వర్తించుకొని తమ శ్రీహస్తపు అలవాటును అవిచ్ఛేదముగ కొనసాగించిరి. పిళ్లెగారిని చూచిన వెంటనే వారికి ముఖవిలాసము, అందుపై మందహాసము నుదయించెను. పిళ్లెగారు వారికి వందన మాచరించి 'తిరు నీఱు' ప్రసాదము స్వీకరించి, యొకచో కూర్చుండిరి.

"రాత్రి పలువురు తమకు శ్రమ కలిగించినట్లున్నదే!" అని దేశికు లడిగిరి. ఆచార్యులు ఎలనగవు విరియింపజేసిరి.

"ఒక్కొక్కరును పద్యములు చదువునపుడు మాకు పరమానందముగ నుండి నది. ఏమి పద్యములు! ఎట్టి వాక్కు! ఎక్కడనుండియే వచ్చునో!" అనినారు దేశికులు.

"ఇది యంతయు మహాసన్నిధానదివ్యకృపావిపులఫలితమే!" అని విధే యత యుట్టిపడ గురువుగారు నివేదించిరి.

"నాలుక వెనుకాడక, తడబడక పద్యములు చెప్పెడు మీ మహిమాతిశయ మును గడచిన రాత్రి చక్కగ తెలిసికొంటిమి".

"చేయి వెనుకాడక, అలయక యిచ్చుచునే యున్న సన్నిధానశ్రీవారి యౌదార్యగరిమచేతనే యంతయు ప్రకాశించుచున్నది."

పండితులును, అధిపతులును పరస్పరము ముచ్చటించుకొను మాటలకు హద్దు కలదా! అచ్చట నున్నవా రెల్లరును అసలుసంగతి సుబ్రహ్మణ్య దేశికుల వలన విని యాశ్చర్యచకితులై స్తంభించిపోయిరి.

పిదప నాచార్యులు అనుజ్ఞ వడసి, ఈవలకు వచ్చి, కొలువుమండపమున నున్న ఒక కార్యస్థులను పిలిచిరి. "స్వామినాథయ్యరు ప్రొద్దుటి పూట భుజించు నలవాటు గలవారు. దాని కేర్పాటు చేయింపవలెను" అని వారితో నుడివిరి. వారు నన్ను అగ్రహారమునకు పిలుచుకొనిపోయిరి. తమ యాహారవిషయమున గల శ్రద్ధ కంటెను నా గురువులకు నా భోజనవిషయమున సావధానత యెక్కువ. ఆ విష యము వేమారు లరసికొని యున్నాను. తన బిడ్డకడుపు వాడియుంట చూడలేని తల్లివాత్సల్యమునకును మా గురువులు చూపెడు వాత్సల్యమునకును భేదమే లేదు.

కార్యస్థులతో పోయి భుజించి వచ్చితిని. పిళ్లైగారు నన్ను చూచి "ఇట్లే నాతో మాయూరము రావచ్చును గదా?" అని యడిగిరి.

"రాలేను. పుస్తకములు, బట్టలు మున్నగునవి ఊరిలో నున్నవి. అయ్యగారిని చూచి, ఎప్పుడు రావచ్చును అని యడిగి పోవుటకే వచ్చితిని. పోయి వెనువెంటనే మరలి వత్తును."

"అవసరము వలదు. ఊరికి పోయి యింకను కొన్నాళ్లుండియే రావచ్చును. అంతలో నేనును మాయూరమునకు పోవుదును. అక్కడికే రావచ్చును."

ఆ రాత్రి తిరువావడుదురలో నుండి మరునాటి ప్రాతఃకాలమున నే నాచా ర్యులయొద్ద ననుమతి పొంది సూర్యమూలకు పోయి చేరితిని. అచ్చట పది దిన

ముల వరకు నుండి ప్రాత పాఠములు పునశ్చరణ చేసె వచ్చితిని. అటు పిమ్మట నొకనాడు మాయూరము వచ్చి చేరితిని. పిళ్లైగారచ్చట నుండిరి.

ఒక రోజు గురువుగారు తమ పుస్తకముల వస్త్రములో నున్న ఒక తాళపత్ర గ్రంథమును తీసికొని రమ్మనిరి. వా రింతకు మునుపే రచింప దొడగియు ఒక కొంత వ్రాయబడి సగములో పూర్తిగాక నిలిచిపోయిన 'అంబర్ పురాణ' తాళపత్ర గ్రంథ మది. 'తిరువంబర్' అని తేవారప్రశస్తిగల శివక్షేత్రచరిత్రను వర్ణించున దది. దానిని మొదటినుండియు నన్ను చదువుచు రమ్మనినారు. నేను మెల్లగ జదివితిని. అప్పుడప్పుడు కొన్ని దిద్దుపాట్లు వారు చెప్పగ వానిని నేను తాటియాకులలో పదిలపరచితిని. రెండు మూడు దినములలో అందులో నున్న పద్యముల నన్నిటిని చదివి దిద్దుపాట్లుగూడ జేసితిని. "ఈ గ్రంథ మారంభించి ఒక్క యేడు అగుచున్నది. అది గడుగున నంతరాయము లేర్పడుచునే యున్నవి. దీనిని మునుపు నేను చెప్పుచు వచ్చుచుండగ నొక్కరు వ్రాసిరి. వారు శుద్ధముగ వ్రాయగలవారు కారు. నే నేదైన చెప్పినచో దానిని చెవిని వేసికొనక, కొన్ని చోట్ల వేరొక విధముగ వ్రాసి యున్నారు. ఇట్లు వారు చేసియుందు రని సందేహించియే మరల చదువు డని చెప్పితిని. చెప్పెడిది చక్కగ వ్రాయగలవారు కడు దుర్లభులు." అని పలికి "ఇక ఈ పురాణమును త్వరలో పూర్తి నొందింపవలయును. మీరు తాటాకులలో వ్రాయవచ్చును గదా ?" ఉపాధ్యాయు లడిగిరి.

"కాచుకొని యున్నాను" అనినాను.

"తిరువావడుదుఱకు వచ్చి యుండగలవాడ నని చెప్పి యున్నాను. తంబిరానులకును పాఠము వినవలె నను నాస యధికముగ నున్నది. దీని నచ్చటికి పోయి పూర్తి చేయవచ్చును." అని వారు నుడివిరి. అప్పుడు నేను తిరువావడుదుఱ ప్రయాణము సమీపకాలమున నుండుట తెలిసి సంతసిల్లితిని.

# 22. ఇబ్బడి లాభము

నేను మా యూరము వచ్చి చేరిన మరుసటి వారమే శ్రీ పిళ్లెగారు తిరువావడు దురై నుద్దేశించి బయలుదేరిరి. నేనును శవేరినాథ పిళ్లెయు వారివెంట వెడలితిమి. కొన్ని తాటియాకు పుస్తకములను, మాకు కావలసిన కొన్ని యుడుపులను మేము వెంట కొనిపోయితిమి.

మాయూరము పొలిమేర దాటి బండి సాగుచుండినది. "అంబర్ పురాణ తాళపత్రగ్రంథము తీసికొని రండు" అని యాచార్యులాన తీయ, నేను దాని నుద్ధరించి విప్పితిని. "గంటము తీసికొనుడు" అని వారు చెప్పిరి. నేను "మునుపే మొత్తమును చదివి చూపి తప్పులు దిద్ది యున్నామే!" అని తలచియుంటిని.

ఆకులు విప్పి అంబర్ పురాణమందు వ్రాయబడిన చివరి పద్యము చదువుడనిరి. తరువాత నేదియో కొంచెమునే పాలోచించిరి. తరువాత క్రొత్త పద్యములు చెప్ప నారంభించిరి! ఇది యొక మహాద్భుతము! బండిలో ప్రయాణము చేయుచున్నాము. ఇపుడు మనస్సు పరుగు లిడునా? కల్పన లూరక లెత్తునా? పద్యములు స్ఫురించునా? అట్లు తోచినను నాలుగైదు పద్యములకు మించి చెప్పనగునా? అని నేను పలుమారులు యోచింప దొడగితిని.

వారు పద్యములు కంఠపాఠము చేసి యొప్పగించునట్లు తడబాటు లేక, వెదకి కొనక ఒక్కొక్క పద్యముగ చెప్పుచుండిరి. బండి మందగమనమున పోవుచుండెను. వారి కవితాప్రవాహ మేటివలె జాలువారుచుండెను. నా చేయిచు గంటమును పరుగులెత్తించినది. బండికుదుపులో నక్షరములు మారియు బంతులు వంకరపోయియు నుండెను వారు చెప్పెడు పద్యములో నిర్దుష్టములై, భావోదారములై యుండినవి.

ఉత్తరదేశమం దున్న 'నందుడు' అను రాజు 'తిరువంబరు' నందు సేవ యొనర్చి లాభము పొందెను- అనునది పురాణచరిత్ర. అత డాస్థలమునకు వచ్చె నని సంగ్రహముగ చెప్పి ముగింపక మార్గమధ్యమందున్న స్థలముల నన్నిటిని సేవించు కొని వచ్చుచుండె నని వ్రాసి, ఆ యా స్థలముల మహిమను వర్ణించుటకు ఒక మంచి

యవకాశము కల్పించుకొనినారు కవిగారు. శివస్థలసంబద్ధముంగు పలు వృత్తాంతము లెరిగి యుండిరి. సందర్భము లభించినపుడెల్ల వానిని నొక్కి చెప్పవలె నని వారి యుత్కంఠ. అందుచే నందుకు పలు శివక్షేత్రములను దర్శనము చేసికొని యానందించె నను చరిత్రను మిగుల విపులముగ చెప్పజొడగిరి.

అప్పు డప్పుడు ఆచార్యులుగారు ఒక్కొక పద్యముగ క్రొత్తగ చెప్పుచుండ నేను వ్రాయుచుంటిని. ఆ కాలమందును వారి కవిత్వము గాంచి నే నబ్బురపడితిని. అయినను ఈ ప్రయాణమందు నాకు కలిగిన యాశ్చర్య మన్నిటిని మీరినది. ఒక చరిత్ర యొక పద్ధతి నమర్చుకొని యనుస్యూతముగ మాట్లాడునట్లే పద్యము లల్లుట నేను కథలలో మాత్ర మెరిగియుంటిని. కంబమహాకవి యొకనాడు ఏడు నూర్ల పద్యములు రచించి రని విందుము. 'అన్ని పద్యము లంత వేగముగా చెప్ప నగునా? అది కేవలము కట్టుకథగా నుండి యుండవలెను. లేదా కంబకవి దైవ శక్తిసంపన్నుడయి యుండవలెను' అని నేను తలచియుంటిని. ఆనాడు మా గురువుగారు పద్యములు చెప్పిన వేగమును, అటుతరువాతను పలుమారులు వారి కవితా స్రవంతి పొంగి ప్రవహించుటయు కనులార గాంచిన నాకు ఆ ప్రాత గాథ వాస్తవముగనే యుండు నను నమ్మిక కుదిరెను.

బండిలో పోవుచుండుటయే మేము మరచితిమి. తమ భావనాప్రపంచమున వారు సంచరించిరి. అం దుండి యొక్కొక్కపద్యముగ వారు రాల్చిరి. వానిని నేను వ్రాసితిని.

"తిరువావడుదురకు వచ్చి చేరితిమి" అని బండియతడు చెప్పునపుడే మా నందుని, అత డేగుచున్న మార్గమును మరచి తల యెత్తి చూచితిమి. "సరి, తాటి యాకులను కట్టిపెట్టుడు. తరువాత చూచుకొనవచ్చును." అని యుపాధ్యాయు లాజ్ఞాపించిరి. తిరువావడుదురయం దాచార్యులుగారు అనుష్ఠానము ముగించుకొని శ్రీ సుబ్రహ్మణ్యదేశికుల దర్శనార్థము బయలుదేరిరి. నీడవలె నేను వారిని వెంబడించితిని. మేము వచ్చిన వార్త యంతలో తంబిరానులకు తెలిసిపోయెను. వారు మఠము వాకిట పిళ్లెగారిని ప్రతీక్షించుచు నిలువబడి యుండిరి. వారిని చూచిన వెంటనే పిలుచుకొని పోయి లోపల యాధీనకర్తలయొద్ద నివేదించిరి.

సుబ్రహ్మణ్యదేశికుల సంతోషము వారి మోముననే విశదమైనది. ఆచార్యులు దేశికులకు నమస్కరించి సమీపమున నుపవిష్టులైరి. నేను వారి వెనుక నుంటిని. తంబిరానులును ఉండిరి. "ఇకపై తంబిరానుల కుత్సాహముగ నుండును. మనకును సంతోషమే" అని దేశికులు పలికి "పాఠ మెప్పు డుపక్రమింపవచ్చును?" అని యడిగిరి.

"సన్నిధానముశ్రీవారి యుత్తరువుకై వేచియున్నాను. నేడే యారంభింప వచ్చును" అని పిళ్లైగారు వచించిరి.

"ఇప్పుడే వచ్చియున్నారు. ఇంతలోపలనే శ్రమ కలిగింపరాదు. రేపు ప్రాతఃకాలమునుండి ప్రారంభింపవచ్చును." అని చెప్పి వేరగు పలువిషయములు మాట్లాడుచుండిరి. పిమ్మట, అనుజ్ఞ వడసి మేము మా 'బస'కు వచ్చి చేరితిమి.

మరువాటి ప్రొద్దున మఠమునకు జేరి సుబ్రహ్మణ్యదేశికుల మ్రోల 'హాజ' రైతిమి. తంబిరానులు పాఠము విన సంసిద్ధులై యుండిరి. వారి బృందమునకు కుమారస్వామి తంబిరాను అగ్రేసరుడై యుండెను. పిళ్లైగారి పాఠప్రవచనమును మహోత్కంఠతో నెదురుచూచుచుండిరి.

"ఏమి పాఠ మారంభింపవచ్చును?" అను నాలోచన యుదయించినపుడు సుబ్రహ్మణ్యదేశికులు "అందరికిని ఒకే పాఠము చెప్పుటకంటెను— కుమారస్వామి తంబిరాను మునుపే కొన్ని గ్రంథములు చదివియుండుటచేత, వాని కొక పాఠము, మిగిలినవారి కొక పాఠమును జరుపవచ్చును. కుమారస్వామితంబిరానుకు 'తిరువానైక్కా' పురాణ మారంభింపవచ్చును. తక్కినవారు 'శ్రీ కాళహస్తి పురాణమును' వినవింతు." అని చెప్పి ఇంకను పాఠమునకు సంబంధించిన కొన్ని సంగతులు చర్చించిరి.

తంబిరానులగూర్చియు, వారికి చెప్పవలసిన పాఠములనుగూర్చియు సంభాషణ సాగినపుడు నా కొకవిధమగు మనోవేదన జనించెను. 'వారు నన్ను మరచిపోయిరే! నేను తంబిరానులతో చేరి చదువరాదో! ఆధీనసంప్రదాయమునకు అది విరోధముగ నుండునో! పిళ్లైగారు తమ బసలో నున్నప్పుడు చెప్పెడు పాఠముల తోడనే నిలచిపోవలెనా? అట్లగుచో నే నీ యూరికి వచ్చుటవలన ప్రయోజనమే

లేదే?' అని తలచి తలచి నా మనస్సు లికమకమైనది. నేను వాడిన మొగముతో నాలోచనలో మునిగియుంటిని.

అప్పు డాచార్యులు నన్ను జూచిరి. నా మనస్సులోని భావములు వారు తెలిసి కొని రని తోచినది. అట్లు వారు చూచినప్పుడు గొప్ప యింగితజ్ఞులగు సుబ్రహ్మణ్య దేశికులు మా యిరువురి యభిప్రాయమును ఎరిగినవారివలె "వీరి నేతరగతిలో చేర్చ వచ్చును?" అని యడిగిరి. ఆ ప్రశ్న నా కొక తీరగు ప్రబోధము కలిగించెను. ఆలోచననుండి తటాలున మేలుకొంటిని. నాకున్న కుతూహలము ప్రేరేపింపగ, పిళ్లె గారు సమాధానము చెప్పుటకు ముందే "నేను రెండు తరగతులయందును జేరి పాఠ ములు విందును" అని చెప్పితిని.

ఎవ్వరును అడ్డు చెప్పలేదు. మా గురువులును, దేశికులును తమ మందస్మిత మతో నా యౌత్సుక్యసస్యములకు నీరు పోసిరి.

"ఎల్లరకు లాభ మొక భాగము. మీకు లాభము రెండింతలు!" అని దేశికులు చెప్పినపుడు, కొలది క్షణములకు పూర్వము నేను మునిగియుండిన విచారసాగరము ఎక్కడ దాగెనో తెలియలేదు. సంతోషశిఖరము నధిష్ఠించితిని.

"మీయొద్ద పుస్తకము లున్నవా?" అని ఆ యుదారు లడిగిరి.

వారి యెదుట లే దని చెప్పుటకు సిగ్గుసంకోచము లుండునా? లే దనినచో ఉన్నదని యిచ్చు మహావదాన్యులగు దేశికులు నే నా మాట యనిన వెంటనే మఠ గ్రంథాలయమునుండి 'తిరువానైక్కా' పురాణమును, శ్రీ కాళహస్తిపురాణమును తెప్పించి నా కొసగిరి.

"పాఠము జరగునపుడు స్వామినాథయ్యరునే చదువనిండు." అని దేశికు లుత్తరు విడిరి. నేను రాగయుక్తముగ చదువుదు నని వారికి మునుపే తెలియును గదా!

దేశికులయభీష్టము ప్రకారమే పొద్దున వారి సమక్షమున తిరువానైక్కా పురాణము నడచినది. అపరాహ్ణమున తక్కినవారికైన శ్రీ కాళహస్తిపురాణము మఠమునకు చెందిన వేరు తావుల జరిగెను. రెండు తరగతులందును నేనే చదువు చుంటిని.

సుబ్రహ్మణ్యదేశికులయెదుట పాఠము నడచునపుడు నడుమ నడుమ నేను రాగయుక్తముగ చదివెడు పద్ధతిని దేశికులు మెచ్చుకొందురు. తిరువానైక్కా-పురాణము కఠిన మగుటచే ఒక దినమునకు ఏబది పద్యములకు పైబడి సాగలేదు. సుబ్రహ్మణ్యదేశికులును తమకు తోచిన భావములను సముచితస్థలములందు చెప్పుదురు. దేశికుల దర్శనార్థము ప్రొద్దున అడుగడుగున పలువురు ప్రభువులు, విద్వాంసులును వత్తురు. అప్పుడును పాఠము సాగుచునే యుండును. వచ్చినవారును విని యానందింతురు. అట్టి సందర్భములందు పాఠము మరింత రసవంతముగ నుండును. వచ్చియున్నవారును విని లాభము పొందునట్లుగ పిళ్లెగారు అసంఖ్యాకములగు గ్రంథాంతరసంవాదముల చూపింతురు. శైవసంప్రదాయములు వచ్చినచోట దేశికులు శైవసమయసిద్ధాంతశాస్త్రములనుండి సంవాదములు జూపి, విషయముల సద్భుతముగ నుద్ధరించి బోధింతురు. అట్టి వేళల ప్రొద్దుపోవుటే తెలియదు. 'తమిళ సంతర్పణ' అని 'యర్థవాదము'గ చెప్పు టలవాటు. కాని నే నచట ననుభవించినది నిజముగనే విందువలన గలిగెడు నానందముగనే యుండినది. ఆహారవిషయ మట తలపునకు వచ్చుటకే యవకాశము లేదు.

పాఠము వినునపుడు ఒక్కొక్క పద్యమును నేను మూడుసార్లు చదువుదును. అర్థము చెప్పుటకు ముందు ఒకసారి పద్యము పూర్తిగ చదువుదును. అర్థము చెప్పునపుడు చిన్న చిన్న భాగములుగ విభజించి చదువుదును. అర్థము చెప్పి పూర్తియైన పిదప మరల నొకసారి పద్యమంతయు చదువుదును. ఈ యలవాటు వలన ఆ పాఠము నా మనస్సులో దృఢముగ నాటుకొనినది. పిళ్లెగారు పాఠము చెప్పెడు రీతి యిది.

తిరువావడుదుఱమఠమునకు చెందిన అన్నసత్రమునందు నేను ప్రొద్దుట, మధ్యాహ్నమున, రాత్రియు భోజనము చేయుచుంటిని.

# 23. వాత్సల్యమూర్తులు మువ్వురు

రెండు తరగతుల పాఠములును ప్రాతస్సాయంకాలములందు క్రమముగ జరగుచుండెను. సుబ్రహ్మణ్యదేశికులకు రాను రాను నాపయి వాత్సల్యము నెల కొనజొచ్చెను. పిళ్లైగారికి నాయెడ నున్న వాత్సల్యాతిశయము తెలిసిన దేశికులు నాయెడ నధికాదరము చూపిరి. ఆ యిరువురి ప్రేమచేత తక్కిన వారి కూరిమియు నే నార్జింప గలిగితిని. మఠములోనివారు నన్నును మఠమునకు చెందినవాడ ననియే యెంచి మతింపుతో చూచిరి. మఠపు ఉద్యోగస్థులు నాతోడ నెయ్యముగ మాటాడు టయే గాక, నాకేదైన కావలసి యున్నచో వెంటనే యిచ్చి యుపకరించి, తమ ప్రీతిని కార్యరూపమున చూపిరి.

'మాఘ' నెల మహాశివరాత్రి వచ్చినది. తిరువావడుదురయందున్నవారికి ఏవైన సరకులు కావలసియున్న మఠపు ఉగ్రాణమునుండియే సంపాదించుకొన వలెను. ఆ కాలమున ఆ యూరిలో నంగళ్లు లేవు. శివరాత్రి యగుటచే సాయం కాలమున ఆలయమునకు జని స్వామిదర్శనము చేసికొన సంకల్పించితిని. కొబ్బరి కాయ, పండ్లు, వక్కలు, తమలపాకులు మున్నగునవి కావలెను. అంగళ్లో లేవు. 'మఠమున ఉగ్రాణమునుండి పుచ్చుకొనవచ్చును' అని తలచి, పొద్దున పాఠము ముగిసిన వెనుక నచ్చటకు పోయి, బయట నిలువబడియే ఉగ్రాణపుటుద్యోగుల యొద్ద నాకు వలసినవానిని చెప్పితిని, "అయ్యరుగారు ఎప్పు డేది యడిగినను ఇవ్వ వలెను" అని సన్నిధానమున ఉత్తరువు అయియున్నది" అని కంచుగంటవలె నొక కంఠము విననాయెను. అశరీరవాణివంటి యా ధ్వని ఏ వైపునుండి వచ్చినదో యని గమనించితిని. 'కందస్వామి ఓదువార్' అనువారు అలాగున చెప్పుచునే వచ్చిరి. అచట సమీపమందలి గవాక్షమున కావలి ప్రక్కన పండారసన్నిధి శ్రీవారు విచ్చేసియుండుట చూచితిని. వెంటనే నేను కొంచెము సిగ్గిలితిని. "ఏది కావలసి యున్నను పుచ్చుకొనవచ్చు నని యుత్తరువైనది" అని దగ్గరకు వచ్చిన ఆ ప్రబంధగాయకులు మరల నొడివిరి. దానిని బలపరచుచున్నట్లు దేశికులు ఎల నగవు విరియజేసిరి. వలసిన వస్తువులు అడ్డము లేక యన్నియు పొందితిని. సహజము

గనే అక్కడవేళల నుపకరించుచుండిన యా యుగ్రాణపు అధికారులు అదిమొదలు నా సూచన తెలిసి నా కావశ్యకములైనవానిని అప్పుడప్పుడిచ్చి యుపకరించుచుండిరి. తరువాతి దినములందును నాకు వలసిన వస్తువులు ఆయా యవసరములందు ఉగ్రాణమువా రిచ్చుటయు నేను పుచ్చుకొనుటయు నలవాటై పోయినది.

ఒకరోజు పొద్దుటివేళ మఠమునుండి వెలుపలికి వచ్చి, భోజనము చేయు నింటి ముఖమై పోవుచుంటిని. అప్పుడు గంట పదునొకండుకు పైబడియుండును. నా కెదురుగా మహానస (పాకశాల) విచారణకర్తలగు 'ముత్తుస్వామి ఓదువార్' అనువారు వచ్చిరి. వారి ప్రేమయు, మర్యాదయు ఎప్పుడు చూచినను వారితో కొన్ని మాటలు ముచ్చటింప వలె నని నన్ను పురికొల్పును. అందుచే వారిని చూచినవెంటనే "తూర్పువైపునుండి వచ్చుచున్నారే, అగ్రహారమున నేదైన పని యుండినదా?" అని యడిగితిని.

"అయ్యాను, అమ్మను చూచి వచ్చుచున్నాను" అనిరి.

"మీ యిల్లు ఉత్తరవీథిలో గద యున్నది? ఇచ్చటికి మీ తల్లిదండ్రులు రా కారణ మేమి?"

"కాదు. అన్నగారి తల్లిదండ్రులు వచ్చి యున్నారు" అని వారు చెప్పిన వెంటనే "ఏమీ, ఎక్కడికి వచ్చిరి?" అని సంభ్రమముతో వారిని చూడవలె నను నుత్కంఠ వెలువరచితిని.

'ఓదువారు' ప్రాయమున నాకన్న పెద్దలైనను నన్ను 'అన్న' అనియే పిలుచుచుండిరి. నా జననీజనకులు నాడు వచ్చునట్లు నాకు ముందుగ తెలియజేయలేదు. వారిని నే నెదురుచూడను లేదు. "వా రెచ్చట విడిసి యున్నారో! క్రొత్త చోటు గదా. భోజనవేళ మీరుచున్నదే! నాయనగారు పూజ చేసికొనవలెనే" అని యి ట్లెల్ల నేను విస్తరముగ నాలోచించుచుంటిని. నా హృద్గతభావమును ముఖభంగిమలచే నొక విధముగ నూహించుకొనిన ఓదువారు "విచారింపకుడు. వారు ప్రాతఃకాలముననే వచ్చినారు. వా రరుగుదెంచి అన్నగారిని విచారించినపుడే 'ఫలానా'వా రని తెలిసికొంటిని. వారికి సత్రమున తగిన చో టిచ్చి కావలయు వస్తువులు పంపితిని.

అయ్యగారి పూజకు అపేక్షితములైన పాలు మున్నగు ద్రవ్యములు పంపియుంటిని. వారచట స్నానము, పూజయు ముగించుకొని యన్నగారి రాకకై కాచుకొని యున్నారు. పోయి భోజనము చేసికొనవలసినదే. ఇప్పు డచటికి పోయి విచారించియే వచ్చుచున్నాను" అనిరి.

నాకు తెలియక జరిగిన యీ సమాచారములు విని నే నచ్చెరు వొందితిని. ఓదువారి ప్రేమ, వితరణ, మతమందలి క్రమశిక్షణయు కొనియాడుకొనుచునే నేను చెచ్చెర నా కన్నవా రున్నచోటికి పోతిని.

నే నటకు చేరిన వెంటనే "ఎట్టి మనుష్యులు! ఏమి యేర్పాటులు! ఏమి విచారణ!" అని మా నాయనగారు తమ సంతోషము వెలిబుచ్చిరి. "శామా, ఇట్టి ప్రవేశమును నేను చూడనేలేదు. మేము నిన్ను చూచిపోవలె నని నేడు ప్రొద్దున నిటకు వచ్చితిమి. కొందరు సత్రమునందు విడిసియుండవచ్చు నని చెప్పిరి. అప్పు డిచ్చటికి చేరితిమి. ఇక్కడ నొక్క రెదురైరి. "మీ రెవ్వరు?" అని యడిగిరి. నిన్ను చూడ వచ్చియున్నట్లు చెప్పితిని. వెంటనే మాకు కావలసిన దంతయు శ్రద్ధగ విచారించి యుపకరించిరి. ఇట్టి మనుష్యులను నే నింతవరకు చూడలేదు. వా రెవ్వరు?" అని మా యమ్మగారు నడిగిరి.

'వారు నా కొక తమ్ములు' అని మనస్సులో ననుకొంటిని. ఓదువారికి నాపై గల ప్రీతి నా మనస్సు చక్కగ నెరుగును. వారి కంత తెలియదు కదా!

"నీ తమ్ముని చూచితివా?" అని యడుగుచునే బుడుతడగు నా తమ్ముని నాయొద్ద మా యమ్మగా రిచ్చిరి. నేను సంతోషముతో పుచ్చుకొని అక్కున నొత్తి కొంటిని.

మా యమ్మగారు వండగ, మా నాయనగారు ఆరాధనమున 'నైవేద్యము' పెట్టిన యాహారమును పుచ్చుకొని చాల దినము లైనవి. నా డట్టి యాహారము పుచ్చు కొని యానందించితిని.

ప్రతిదినము సాయంకాలమువేళ ఆచార్యులవారితోడ తిరువావడుదురైయం దున్న 'కోట్టుమాంగుళమ్' కోనేటివరకు పోయి, అనుష్ఠానములు నెరవేర్చుకొని వచ్చుట నా యలవాటు. చీకటివేళల యాచార్యుల చేయి పట్టుకొని పిలుచుకొని

వత్తును. అనా తట్లు జని మరలి వచ్చునపుడు "మీ తల్లిదండ్రులు వచ్చియున్నారని చెప్పితిరే? వా రెచ్చట విడిసియున్నారు? ఇప్పుడు చూచి పోయెదను" అనిరి.

"శ్రమ వలదు. వారే అయ్యగారిని చూడవత్తురు" అని నేను చెప్పియు వారు నిర్బంధింపగ వారిని నా తల్లిదండ్రులయెడకు పిలుచుకొనిపోతిని.

సత్రమందు ఒక 'బెంచి'పై యాచార్యు లమరియుండిరి. తండ్రిగారును కూర్చొనిరి. నాయనగారిని గురువుగారు యోగక్షేమములు విచారించుచుండగ మా యమ్మగారు వచ్చిరి. అంతకు మునుపు మా యుపాధ్యాయులను వారు చూడ లేదు.

"బిడ్డను మీరే కన్నవారివలె కాపాడుచున్నారు. మే మేవిధమునను వానికి కొరగానివారమై యున్నాము. మీ యాదరమువలననే వీడు ముందుకు రావలెను'' అని కన్నుల నీ రుబికి వచ్చుచుండగ వారు పలికిరి.

"మీరు కొంచెమేని దిగులుపడవలసినది లేదు. మీ కుమారుడు మంచి బుద్ధిశాలి. బాగుగ చదువుకొనుచున్నారు. భగవత్కృపచే ఉచ్చదశకు వత్తురు" అని మా యాచార్యులు చెప్పిన చల్లని పలుకులు మా యమ్మగారి హృదయమును చల్లపరచెను. నాయెడ వాత్సల్యము చూపు ఈ ముగ్గురకును ఈడైనవారు వే రెవ్వరును లేరు. ఆ ముగ్గురును ఒక్కచో జేరి నాయభివృద్ధినిగురించి ముచ్చటించునపుడు వారి వాత్సల్యము వెలువడెను. ఆ ముగ్గురి వాత్సల్యమునందును మూడు తీరుల నైసర్గికగుణము లున్నవి. వానిలో హెచ్చు తగ్గు లున్నవని చెప్పనగునా? ఈ విధమున నిది శ్రేష్ఠమైన దని యేమైనను హద్దులు పెట్ట వీలగునా? ఒకే ప్రేమమయముగ కన్పించిన యా దృశ్యము ఇప్పుడు తలచుకొన్నను నా యుల్లమందు మహానంద ముప్పతిల్ల జేయును. ఆ ముగ్గురిని 'మూవురు వాత్సల్యమూర్తులుగ' నేటికిని కొని యాడుచుందును.

మర్నాడు వేకువన నా తల్లిదండ్రులు సూర్యమూలకు నా తమ్మునితోబాటు వెడలిపోయిరి.

౧౮

౯౩

౯౩

# 24. ఎడనెడ

నాకు కావలసిన మంచి వసతులు, తమిళవిద్యాలాభమును తిరువావడుదుఱ యందు ప్రాప్తించినవి. ఆటంకములు లేక మది సంతోషించుటకు వలసిన యాను కూల్యము లన్నియు కొదవలేక యచ్చట నుండినవి. అయినను నడుమ నడుమ ఆ సంతోషమునకు ఆఘాతము కలుగకపోలేదు.

రాత్రి భోజనమైన పిదప మఠమునకు వచ్చి అచ్చటనున్న కుమారస్వామి తంబిరానుతో పాఠములు చదివి చింతన చేయుచుందును. పదపడి యచ్చటనే పరుండుదును. ఆయలవాటు తిరువావడుదుఱ చేరిన తరువాత కొన్ని నెలలవరకు నుండినది. మఠమున వసించుచుండిన కాలమున ఒకనాటి రేయి వారితో నలవాటు చొప్పుననే చదువుచుంటిని. మఠమునకు తూర్పు వైపున నున్న వనమందిరమున తంబిరానులు వసించుటకై రెండు గదు లున్నవి. కుమారస్వామి తంబిరాను ఒక గదిలో వసించుచుండిరి. దాని కెదురుగా నున్న గదిలో "పన్నిరుకై తంబిరాను" అనువా రుండిరి. వారు మంచి పలుకుబడి గలవారు. ఆధీనమందు 'జవాబుదారీ' గల యుద్యోగములు వహించినవారు. గదులకు మధ్యనున్న చావడిలో మే ముండి చదివిన పుస్తకములు చింతన చేయుదుము. అప్పుడు వారును వెంట నుండి గమనింతురు. చదువుకొనుచుండిన నేను అలపు హెచ్చుటచేత నచటనే పండుకొని నిదురించితిని. రాత్రి పది గంట లుండును. కుమారస్వామితంబిరాను, పన్నిరుకై తంబిరానును మాట్లాడుకొనుచుండిరి. ముత్తుస్వామి ఓదువా రచ్చటకు వచ్చిరి.

వారు వచ్చిన సమయమున తంబిరాను లిరువురును నాటి సాయంకాలము జరిగిన యొక చౌర్యమునుగూర్చి సంభాషించుచుండిరి. పన్నిరుకై తంబిరాను ఒక శ్రేష్ఠమగు 'ఏఱుముఖ రుద్రాక్ష కంఠిక' (క్రమముగ హెచ్చెడు ముఖములుగల రుద్రాక్షలు కూర్చిన యొక తావడము) ధరించియుండిరి. ఇరువైపుల మణులు పొదిగిన బంగారు మొగపులు ఉండెను. ఇంచుమించు రెండు వేల రూపాయల మతింపు గలది. నాటి సాయంకాలము తంబిరాను సరోగృహమునకు పోయి వచ్చి కొన్ని పనులు చూచుకొనిరి. కొంచెము పేపైన పిదప చూడగ 'కంఠిక' కనుపింపలేదు. బహుమూల్యమగు వస్తు వగుటచేత మఠకార్యస్థులు దానిని వెదకజొచ్చిరి.

"మతపాతకులను విచారింపవలెను. ఈ మఠమం దిట్లు జరిగినచో మఠము నకే యపఖ్యాతిగదా ?" అనిరి పన్నిరుకై తంబిరాను.

"ఒక్కొక్క పిల్లవానిని పిలిచి విచారింపవలెను. ముచ్చిలినవాడు తేలికగ నొప్పుకొనడు. కట్టివేసి కొట్టవలెను" అని చెప్పిరి కుమారస్వామి తంబిరాను.

అచ్చట నున్న ముత్తుస్వామి ఓదువారు, వారి సంభాషణ ఫలానావిషయమునకు సంబంధించిన దని తెలిసి "ఇది యరసి శ్రీ సన్నిధాన స్వామివారును చింతాక్రాంతులై యున్నారు. ఇంతటి సాహసకార్యము చేసినవా రెవ్వరై యుండనోపు ? అచ్చటచ్చట విచారణ సలుపుచున్నారు" అని చెప్పి, ఆ సంభాషణలో చేరిరి.

వారు ముగ్గురును మాట్లాడు సవ్వడివలన నా నిదుర చెదరిపోయినది. బాగుగ నిదురించిన నాకు కొంచెము మెలకువ కలిగెను. కన్నులు తెరువక మరల నిద్రను ప్రతీక్షించుచు పరుకొనియే యుంటిని. అప్పు డచటికి వచ్చిన వేరొక వ్యక్తి "ఇచ్చటికి వచ్చిన క్రొత్త మనుష్యులనుకూడ విచారింపవలెను" అనిరి.

"క్రొత్త మనుష్యు లెవ రున్నారు ? అందరును ప్రాత పందికొక్కులే ! ఇది వారి పనిగనే యుండును" అని కుమారస్వామి తంబిరా ననిరి.

"ఇట్లు చెప్పనగునా ? ఈ అయ్యరు క్రొత్తవారు కారా ? వీ రపహరించి యుండరాదా ?" అని యా వ్యక్తి యనెను.

ఆ మాట నా చెవిని పడినదో, లేదో నాకు వడకు పుట్టినది. అరకొరగా నుండిన మైకముకూడ ఎక్కడికో ఎగిరిపోయెను.

'ఏ పాప మెరుగని మనల సందేహించుచున్నారే ! 'దొంగ'పట్టము కట్టుకొనవా వీరితో పరిచయము సంపాదించుకొనుచుంటిమి. కట్టా ! ఎందులకై మన మిచ్చటకు వచ్చితిమి ?' అని యిల్లెల్ల నా మనసు చింతింప దొడగెను.

"ఏమంటివి ? ఓరి పాపిష్ఠా ! ఆ మాట మరల చెప్పకుము" అని పన్నిరుకై తంబిరాను ఆ మనుష్యుని చూచి చెప్పిరి.

కుమారస్వామి తంబిరానో మిక్కుటపు కోపచిహ్నములు మొగమున తోప "మి మ్మెవరయ్యా అడిగిరి ? మనుష్యుల తారతమ్యములు లవలేశమైనను ఎరుగని

మీరు మీ యభిప్రాయము చెప్ప వచ్చితిరే: వచ్చిన త్రోవ చూచుకొని పొండు. ఇకపై నిచ్చట నిలువవలదు" అని కఠినముగ చెప్పిరి.

ఓదువారు "వారిని చెప్పినచో నాలుక త్రుళ్లును. ఉండి యుండి పరమ సాధువగు వారిని చెప్ప మీ కెట్లయ్యా మనసు వచ్చినది?" అనిరి. ఆ వ్యక్తి ఏమియు బదులాడలేక లేచి వెడలిపోయిరి.

ఆ మూవురి మాటలు నే నాలించితిని. మంచి కాలము, బ్రతికితిమి: అను నూరటయు కలిగెను. వెంటనే లేచితిని. "ఇంత సేపు నన్నుగూర్చి నడచిన సంభాషణ గమనించితిని. నాకు మొదట నేర్పడిన సంకటమును మీరు తొలగించితిరి. నా యుల్లము తల్లడిల్లినది. ఇప్పుడే నా మనస్సు కుదుట బడినది. న న్నొక పెద్ద యపవాదునుండి కాపాడితిరి." అని వారిని చూచి చెప్పితిని. అట్లు మాట్లాడు నపు డొకతీరగు సంభ్రమము కలిగెను. దానిని గమనించిన పన్నిరుకై తంబిరాను "మీ రేల చింతింపవలెను? మే మెద్ది యైనను విశ్వసింతుమా? ఏ కాలమందైన మీ కే లోటును రాకుండునట్లు చూచుకొందుము. ఆ వచ్చిన మనుష్యుడు ఏదో తెలివితక్కువతనముగ చెప్పినా డని తలంపవలెను. దానిని మరచిపొండు" అని చెప్పి న న్నూరడించిరి.

ఎటు చూచినను ఈ దొంగతనమును గూర్చిన మాటలే. మరునాటి ప్రాతఃకాలమున పది గంటలకు మఠమున నొక ప్రక్క పన్నిరుకైతంబిరాను కొందరితో ముచ్చటించుచుండిరి. అప్పుడు తటాలున నొక భృత్యుడు సరోగృహమునుండి మిక్కిలి వేగముగ పరుగెత్తుకొని వచ్చి తంబిరానువద్ద ఆ కంఠిక యిచ్చి "స్వామీ, నేటి ప్రొద్దున నేను అన్ని ప్రదేశములు చిమ్మి బాగు చేయుచుంటిని. 'మెట్లరేవు' గోడలోని యొక గూటిలో నున్న వినాయకునకు వెనుక నేదో తళుక్కు మని మెరసెను. వెంటనే గమనించితిని. ఈ కంఠిక కనపడెను" అని చెప్పినాడు.

దానిని తీసికొని పన్నిరుకై తంబిరాను మిక్కిలి సంతోషించిరి. "నిన్న నే ననుష్ఠానమునకు పోవునప్పు డచట దీనిని గూటిలో పెట్టి తోటకు పోతిని. అప్పుడు తటాన నొక సేవకుడు "శ్రీవారు అవసరముగ విలుచుచున్నారు" అని పేగులు తెగునట్లు పరుగెత్తుకొని వచ్చి చెప్పినాడు. 'అదేమిటో!' యని నేనును మిక్కిలి త్వరితముగ వే రేదియు గమనింపక సన్నిధానమునకు పోతిని. శ్రీవారు ఒక ప్రముఖ

కార్యవిషయమున నా కాజ్ఞ యిడిరి. కొంచెము సేపు అదే ఆలోచనలో నుంటిని. కంఠికను కూర్చి జ్ఞాపకమే రాలేదు. కొంచెము సేపైన తరువాతనే ఆ స్మృతి కలిగెను. పలు మారు లాలోచించియు అది దాచిన చోటు జ్ఞప్తికి రాలేదు. నేను దాచిన చోటు తప్ప తక్కిన చోట్లంతటను వెదకితిని. ఇతరులచే వెదకించితిని. అగుపింపలేదు. ఎట్లో ఈ విషయము సన్నిధానమునకును తెలిసిపోయెను. వయస్సు కానుకాను విస్మృతి కలుగుచుండును. అనావశ్యకముగ పలువురికి సంకట మేర్పడెను. పాపము స్వామినాథయ్యరు మిగుల మనోవైకల్యము నొందిరి!" అని యందరియొద్దను చెప్పి దానితోబాటు నాకును ఆ విషయము చెప్పిపంపిరి. ఈ వార్త చెవిని పడిన వెంటనే నేను విఘ్నేశ్వరుసన్నిధికి జని మ్రొక్కు లిడితిని.

వేరొక సమయమున మా గురువుగారియెడ ఎవరో ఒకరు నాపై చాడీలు చెప్పిరి. అందుచే గురువుగారికి నాపై కోపము కలిగెను. ఎవరిపైనైనను వారు కినుక బూనినచో వారితో మాటాడకుండుటయే వారి యలవాటు. నా యెడను అట్లే యుండ సాగెను. మఠమందు పాఠము జరుగుచుండునపుడు చదువుటయు, ఉపాధ్యాయు లేవైన పద్యములు చెప్పిన వ్రాయుటయు నను ఈ పనులు నేను చేయుచుంటిని. నేను సమీపమున నున్నపుడు "తాటియాకుల చేత బట్టుడు, వ్రాయుడు" అని చెప్పరు. పద్యశించియే ఏదైన నొక పద్యపు మొదటి పాదమును ఆరంభింతురు. అది క్రొత్త పద్యముగ నున్నచో దానిని వ్రాయవలె నని వారి సూచనగా నేను తెలిసికొని, తాటియాకు, గంటము నెత్తుకొని వ్రాయ నారంభింతును. వారు చెప్పుకొనుచుపోవుచుందురు. నిలుపవలసి యున్నచో 'సరి' అని యందురు. ఆ సూచన తెలిసి నిలిపివైతును.

ప్రత్యేకముగ పాఠము వినుటయు, మాట్లాడుటయు లేక ఈ స్థితిలో కొన్నాళ్లనే నుండివచ్చుట నా మనస్సును మిక్కిలి నొవ్వజేసెను. దీనిని నే నెవ్వరియొద్దను తెలియజేయలేదు. నా మనస్సునందే నేను లోలోన కుందుచుంటిని.

అప్పుడు మాయూరమున వసంతోత్సవము జరిగెను. ఆ యుత్సవము తిలకింప సుబ్రహ్మణ్యదేశికు లొకనాడు శిష్యగణముతోడను, పరివారముతోడను చనిరి. ఆచార్యులును వెడలిరి. వారితో నేనును కొందరు విద్యార్థులను ఏగినారము. సాయంకాలము మాయూరము పోయి చేరితిమి. సుబ్రహ్మణ్యదేశికులు పరివార

జనముతో శ్రీ మాయూరనాథుల యాలయమునకు పోయి దర్శనము చేసికొని పిదప మఠమునకు మరలి వచ్చిరి. వచ్చునపుడు నన్నొక కార్యస్థులతో బంపి, ఆహార స్వీకరణము చేసికొని రమ్మని యాన తిచ్చిరి. ఈ విషయము పిళ్లెగారికి తెలియదు. వారు తమ యింట బస చేసిరి.

నేను భోజనము చేసికొని పిళ్లెగారి యింటికి వచ్చి యరుగుపయి నుంటిని. అప్పుడు మఠమునందు బంతులు జరుగుచుండుటచే అక్కడ భుజింప పిళ్లెగారు పోయియుండిరి.

మఠమున బంతులు జరగు కాలమున సుబ్రహ్మణ్యదేశికులు కూడ అక్కడికే పోయి భుజింతురు. ఆ బంతులలో తంబిరానులు, శైవులగు శ్వేతాంబరులును వేర్వేరు వరుసలలో నిమరి భుజింతురు. శ్వేతాంబరుల వరుసలో మొదటి స్థానము పిళ్లెగారి హక్కు.

అలవాటుచొప్పున అచ్చోట నాచార్యులాసీనులైనపుడు వారి మోమున ఎప్పటి తేటదనము లేదు. ఏదియో ఒక దిగులు వారి మోమున దోచుచుండెను. భుజించుటకై ఆసనమున నుపవిష్టులైన వారు చివాలున లేచిరి. అట్లు చేయుట కెవ్వరును సాహసింపరు. సంప్రదాయము చక్కగ నెరిగిన వారు అట్లు లేచి యుండుటను జూచి యెల్లరును వెరగుపడిరి. సుబ్రహ్మణ్యదేశికులు వారి కేదో చింత యుండుటరని యొకరిమూలమున విచారించిరి. "స్వామినాథయ్యరు నాతోడ వచ్చిరి. వారి యాహారమునకు తగు నేర్పా టేమియు చేయక వచ్చివేసితిని. ఉపవాసముగ నుందురేమో యని తలచి విచారించి వచ్చుటకై లేచినాడను" అని వారు చెప్పుట విన్న దేశికులు - "వారి నొక కార్యస్థులతో భుజింప పంపియున్నాము. ఇంతలో వారు భోజనమై వచ్చియుందురు." అనిరి.

ఆచార్యులొక విధముగ ఊరట చెందిరి. ఐనను వారి మనస్సు కుదురుకొనలేదు. భోజనముపై మనసు పోక భుజించువానివలె నటించుచు నుండి ఎల్లరును లేచుటకు మునుపే యుత్థాన మొనర్చిరి. చేతులైనను కడిగికొనకయే బహువేగముగ మఠమునకు ప్రక్కనే యున్న తమ యింటికి వచ్చిరి. వారు వేగముగ వచ్చుటను వీక్షించి, తిన్నెపై నున్న నేను లేచి నిలిచితిని.

నే నున్న చోట దీపము లేకపోవుటచే వారు నా దగ్గరకు వచ్చి నా ముఖ మును తేర జూచి "స్వామినాథయ్యరా! భోజనము చేసితిరా!" అని యడిగిరి. "ఐనది" అని నే చెప్పినది విని పిదప వారి మనస్సు సమాధానపడినది. లోపలకు పోయి. చేతులు కడిగికొని దీపము తెచ్చిపెట్టు మని చెప్పిరి.

పిమ్మట నాతో మిక్కుటమగు ప్రేమతో భాషింపదొడగిరి. నా రంత వేగముగ వచ్చుటయు, నా ముఖమును తీక్ష్ణముగ పరికించుటయు, కొన్నాళ్లనుండి మాటాడకుండిన వారు అంతటి ప్రీతితో మాటాడుటయు నాకు స్వాప్నికసంఘటన వలె నుండెను.

కొంచెము వేపటికి తరువాత మఠమునుండి కొందరు వచ్చి నన్ను జూచి "అయ్యగారికి తమయెడ నున్న ప్రేమను నేడు మేము తెలిసికొంటిమి. మీ భాగ్యమే మహాభాగ్యము" అని చెప్పి అక్కడ సంఘటిల్లిన వృత్తాంత మంతయు చెప్పినపుడు నా కంతయు నవగత మాయెను. కొన్నాళ్లుగ తాము నాయెడ చూపుచుండిన పెడ మొగమునకు తామే పరిహారము వెదకికొనినవారివలె మా యాచార్యులు కనుపించిరి.

# 25. మహావైద్యనాథయ్యరు

మాయూరమునందు వసంతోత్సవమైన పిదప సుబ్రహ్మణ్యదేశికులు తిరువావడు దుఱకు సకలపరివారములతో మరలివచ్చిరి. వారితో పిళ్లైగారును, మేమును వచ్చితిమి. అలవాటుప్రకారము మఠమునందు పాఠములు సాగుచుండినవి.

కొన్నాళ్ల రాత్రులందు పాఠము లేనపుడు సుబ్రహ్మణ్యదేశికులయొద్దకు నేను పోవుట కలదు. అప్పుడు పిళ్లైగారు చెప్పెడు పాఠములగూర్చి విచారింతురు. 'అరు దగు విషయము లేమేమి చెప్పినారు?' అని యడిగి, తెలిసి కొనియాడుదురు. కొన్ని ప్రాత చరిత్రలు చెప్పుదురు. నేను సంగీతమందు పరిశ్రమించినవాడ నని తెలిసినవా రగుటచే సంగీతవిద్వాంసులకు సంబంధించిన పలువృత్తాంతములు చెప్పుదురు.

ఒకనాడు "మహావైద్యనాథయ్యరు నెరుగుదురా?" అని వా రడిగిరి.

"వారినిగూర్చి వినియున్నాను. చూడలేదు" అని యంటిని.

"మీ రవశ్యము చూచి వారితో పరిచయము చేసికొనవలయును. ఈ మఠమునకు ఆప్తులలో వారు ముఖ్యులైనవారు. తమిళమున పిళ్లైగా రెట్లో, అట్లే సంగీతవిషయమున వారిని చెప్పవలెను. వారు తమిళమునను మంచి వ్యాసంగము కలవారు. వారు ఇక్కడకు మాటిమాటికిని వచ్చి మాకు సంతోషము కలిగించి పోవుచుందురు."

"వారి సంగీతము ఇంతవరకును వినకుండుట నా దురదృష్టమే" అంటిని.

"వారిని మొట్టమొదట మేము 'కల్లిడైక్కుఱిచ్చి' లో చిన్నవట్టమునందుండగ చూచితిమి. అప్పుడు మిక్కిలి బాల్యమున నుండిరి. అప్పుడే వారియెడ సంగీతప్రావీణ్యము మిక్కిలి ప్రకాశించెను. పెద్ద వైద్యనాథయ్యరు, చిన్న వైద్యనాథయ్యరు అని యిద్దరు విద్వాంసులును, ఇతరులు పలువురును వచ్చియుండిరి. ఇక్కడవలెనే కల్లిడైక్కుఱిచ్చియందును మాటి మాటికి పలువురు విద్వాంసులు వచ్చి పోవుచుందురు. ఒకనా డొక మహాసభ చేయించి ఈ మూవురు వైద్యనాథయ్యరులను పాడించితిమి. తక్కిన వారికంటె మహావైద్యనాథయ్యరుగారి సామర్థ్యమే మిన్నగా నుండినది. ఈ విషయమును వారితో పోటీపడిన విద్వాంసులే ఒప్పుకొనిరి. ఆ మహాసభలో అందరు విద్వాంసుల సమ్మతితో వారి పేరుకు ముందు 'మహా' (మహత్) అను పట్టము ప్రసాదింపబడెను. అంతకు మునుపు వట్టి వైద్యనాథయ్యరుగనే యుండిన వారిని నాటినుండియు నెల్లరు 'మహావైద్యనాథయ్యరు' అని పిలువజొచ్చిరి."

సుబ్రహ్మణ్యదేశికు లింకను ఆ సంగీతవిద్వాంసుని గొప్పతనము నెత్తిచెప్పి "మహావైద్యనాథయ్యరుగారి యన్నగారగు రామస్వామి అయ్యరు అనువారు తమిళమున మంచి జ్ఞానము గలవారు. పద్యములను, కీర్తనలను వ్రాయుదురు. 'పెరియపురాణ' మంతయు కీర్తనలుగా వ్రాసి యున్నారు. మహావైద్యనాథయ్యరుగారికి తమిళవిజ్ఞానము వృద్ధియగుటకు వారు ముఖ్యకారణము" అనిరి.

మహావైద్యనాథయ్యరుగారి గొప్పతనము, వారియెడ ఆధీనపు పెద్దల కున్న ప్రేమయు బాగుగ తెలిసికొనినది మొదలు ఆ పెద్దలను దర్శింపవలె నను 'తహ-

తహ' నా కేర్పడెను. వారు తమిళమునందును మంచి పాండిత్యము గలవారు అని తెలిసినపుడు ఆ యభిలాష యధిక మాయెను. అది నెరవేరు కాలము వచ్చినది.

ఒక రోజు 'కోడకనల్లూర్ శ్రీ సుందరస్వామిగారు' అను నొక ఘనులతో మహావైద్యనాథయ్యరు మఠమునకు వచ్చిరి. వారిని చూచుటే నాకు మిక్కిలి యానందముగ నుండెను. వారి ముఖమున నున్న వెలుగు, ప్రశాంతియు వారి హృదయస్వభావమును తెలియజేసినవి. వారి యాకారదర్శనముమాత్రముననే నా యుత్కంఠ తగ్గలేదు. వారు నడుమ నడుమ మాట్లాడిన మెల్లని మాటలలో మాధుర్య మెంతేనది. ఈ మాధుర్యముకూడ నా మనస్సు నాకర్షించినది. ఐనను ఆ మాటల వలనకూడ నా యౌత్సుక్య మణగలేదు. వైద్యనాథయ్యరుగ నుండిన వారు ఎందుచే మహావైద్యనాథయ్యరైరో అట్టి వారి సంగీతమును వినవలెనను నాస మిక్కుటమాయెను. 'వీరు వచ్చియున్న పనియే వేరు. ఈ సభలో ఏ సంబంధ మును లేక మన కోరిక నెరవేర్చుటకై వీరు పాట పాడుట సాధ్య మగునా? ఇంతటి యాశ మన కుండుట వీరికి తెలియజేయుటకైనను సందర్భ మున్నదా? ... ఎట్లయి నను ఒక్క పాట వినిన చాలునే!... ఒక్క పాటయైన నేమి? వంద పాటలైన నేమి? దాని కిదియా సమయము!' అని నా మనస్సునందే ఆక్షేపసమాధానము లుప్పతిల్లి నవి. నా యాలోచనలో సుందరస్వామిగారును, దేశికులును ఏమి మాట్లాడి రనికూడ నేను చక్కగ గమనింపనైతిని.

తటాలున, నా కాశ్చర్య మేర్పడ సుబ్రహ్మణ్యదేశికులు మాటాడ దొడగిరి: "మీ సంగీతము వినవలె నని ఇక్కడ చదువుకొను విద్యార్థులు కొందరు ఉవ్విళు లూరుచున్నారు. పిళ్లెగారి రచనలగు కొన్ని పాటలు పాడిన తృప్తిగా నుండును" అని వారు మహావైద్యనాథయ్యరు నుద్దేశించి చెప్పినపుడు నా చెవులనే నేను నమ్మ లేకపోతిని. 'మనము కల గనుచున్నామా! మన భావనాఫలితముగ నేర్పడిన పగటి కలయా యిది!' అనికూడ తలచితిని. మంచికాలము! అది వాస్తవరూపముగనే యుండినది.

"దాని కేమి యభ్యంతరము! కాచుకొనియున్నాను" అని చెప్పి మహావైద్య నాథయ్యరు పాడదొడగిరి. దేవగాన మని చెప్పుదురే, ఆ సంగీత మిట్లే యుండునేమో యని నాకు తోచినది. మొదట తమిళ సూతసంహిత'నుండి కొన్ని పద్యములు

చెప్పబోయిరి. తమిళపద్యములుగా నుండినందున మొదట అవి నా హృదయము నాకర్షించినవి. పిళ్లెగారి 'వాక్కు' అను గొప్పతనముకూడ దాని కుండినది. మహావైద్యనాథయ్యరుగారి మధురగానముకూడ చేరి యా కవితకు ఎప్పుడును లేని యందము నిచ్చినది. ఆ మధురగానము ఈ లోకమునే మరచునట్లు చేసెను. భావ మెరిగి వారు పాడునపుడు ఒక్కొక్క మాటయు హృదయములో నిలిచి నిలిచి యొక పెద్ద చిత్రము సృష్టించుచుండెను.

పద్యములను చదివి పిదప అర్థమును వివరించిరి. పద్యములను చదువునపుడే అర్థము తెలిసిపోయెను. పిదప సుబ్రహ్మణ్యదేశికులు "మీ యన్నగారి రచనయగు పెరియపురాణకీర్తనలనుండి కొన్నిటిని పాడవలెను" అనిరి. వైద్యనాథయ్యరువద్ద నున్న 'సత్తా' ఇంతటి దని దేశికులకు బాగుగ తెలియును. వా రొక్కటొక్కటిగ అడుగుచునే యుండగ ఆ గాయకశిఖామణి యడ్డులేక పాడుచునే యుండిరి.

వారు కీర్తనలు పాడునప్పుడు ఫిడేలు, మృదంగము మున్నగు ప్రక్కవాద్యములు లేవు. ఆ కారణమున వారి సంగీతమునకు వెలితి యున్నట్లు నాకు తోపలేదు. వారు చేతిలో మెల్లగ తాళము వేసి పాడినపు డెల్లవారి హృదయములును ఈ గానములో లీనములై ప్రక్కవాద్యములు వాయించిన వనియే చెప్పవలెను.

అంతవరకు ననుభవించి యెరుగని మహానిర్వృతిని నాడు పొందితిని. "వీరి తోడనే పోయియుండి సంగీతాభ్యాసము చేయుదమా" అను నాసకూడ నడుమ తోచెను. ఒక విధముగ మహావైద్యనాథయ్యరుగారి గానామృతధారావర్షము వెలిసినది. సుందరస్వామి యనుజ్ఞ పొందిరి. వారితోడ మహావైద్యనాథయ్యరును, అన్నలును పీఠ్యాని వెడలిపోయిరి.

నాటి యపరాహ్ణమున సుబ్రహ్మణ్యదేశికులను నేను చూచినపుడు "ప్రొద్దున మహావైద్యనాథయ్యరుపాట వింటిరా?" అని వా రడిగిరి. "ఇట్టి గానమును ఇంత వరకు నేను వినసే లేదు. వారి శారీరము అందరికి అబ్బదు. పట్టి సాధనవలన మాత్రమే వచ్చినది కా దది" అని యంటిని.

"సాధనమాత్రమే చాల దనునది సత్యమే. వారు మహాశివభక్తులు. పరమశివుని కృప వారికి మంచి శారీరసంపత్తి నొసగియున్నది. వారు చేయుచుండు

అభ్యాసము ఆ గాత్రమునకు పుష్టి నిచ్చుచున్నది. అన్నిటికిని పైబడి వారి పరిశుద్ధ మైన నడవడి ఆ దివ్యశారీరమునందము చెడకుండ కాపాడుచున్నది" అని వారు చెప్పి "వారి తమిళజ్ఞానముకూడ మీకు తెలిసియుండునే?" అనిరి.

"ఔను. వారు పద్యములు చదువునపుడే అర్థము తేటపడును" అని నే నంటిని.

# 26. వ్యాధియు వియోగమును

మా యాచార్యులకు చిదంబరంపిళ్లె యను నొక కుమారు లుండిరి. వారికి తగిన యీడు వచ్చిన తరువాత పెండ్లి సేయుటకైన ప్రయత్నములు నడచినవి. దానికి కావలసిన యేర్పాట్లు గమనించుటకై యాచార్యులవారు మాయూరమునకు పోయిరి. నేనును వెంట వెడలితిని. చిదంబరంపిళ్లెవివాహము నిర్ణయించిన మహూర్తములో మిక్కిలి వైభవోపేతముగ జరిగెను. అందుకు పలువురు పెద్దలు వచ్చి. యోగక్షేమము లరసి యానందించిపోయిరి.

మాయూరమునందు నాకు ఆహారవసతులు లేకుండెను. అందుచే "మీరు తిరువావడుదురకు పోయి అక్కడ నున్నవారితో ప్రాత పాఠములు చదువుకొను చుండుడు. త్వరలో నే నటకు వత్తును." అనినారు ఆచార్యులుగారు.

ఎందుచేత నట్లు చెప్పిరో నాకు తెలియలేదు. "నేను అంతవరకును ఇచటనే యుండి అయ్యగారితోడ వత్తునే" అని యంటిని.

"వలదు. ఇక్కడ మీకు ఆహారసౌకర్యములు చాలినంత లేవు. తిరువావడు దురయందు సన్నిధానమువా రన్నియు గమనించుకొందురు" అని నొక్కి చెప్ప గనే నేను కా దన జంకి తిరువావడుదురకు వచ్చి చేరితిని.

ఒకనాటి రేయి సుబ్రహ్మణ్యదేశికులతో నేను మాట్లాడుచుండగ "పిళ్లెగారి యొద్దకు పోయి ఒక సమాచారము చెప్పిరావలెను" అనిరి.

"ఆజ్ఞానుసారముగనే చేయుదును" అని నేను చెప్పితిని.

'తిరుప్పెరుందుఱ'యందు ఆలయవిచారణ చేయుచుండిన సుబ్రహ్మణ్య తంబిరా ననువారు సుబ్రహ్మణ్యదేశికులకు ఒక విన్నపము పంపియుండిరి. పిళ్లైగారిని దేశసగ. రాదిప్రశస్తితోడ నొక స్థలపురాణము వ్రాయున ట్లాజ్ఞాపింపవలె ననియు, అట్లు వారు రచించి సభగూర్చి 'పరిషదామోదము' పొంది, ముగించినచో రెండు వేల రూపాయల సమ్మానము చేయనున్నట్లును తంబిరాను అందులో తెలియజేసియుండిరి. ఆ లేఖను గూర్చి సుబ్రహ్మణ్యదేశికులు నా యొద్ద చెప్పి "మంచి సందర్భమున ఈ ప్రార్థన వచ్చి యున్నది. పిళ్లైగారు తమ కుమారునకు వివాహము చేసియున్నందున శ్రమపడి యుండవచ్చును. దానిని తొలగించుకొనుటకు ఇది మంచి యదను. మీరు పోయి ఈ విషయమును తెల్లముగ తెలియజేయుటతోబాటు, 'అట్లు చేయుట పలు విధముల ననుకూలముగ నుండు'నని మేముకూడ అభిప్రాయపడుచుంమనట్లు చెప్పుడు. తిరుప్పెరుందుఱకు సంబంధించిన సంస్కృతపురాణమునకు తమిళభాషానువాదమును, ఆ స్థలవిషయమున ముందే యున్నట్టి రెండు ప్రాత పురాణములను తంబిరాను పంపియున్నారు. వానినిగూడ పిళ్లైగారియొద్దకు తీసికొనిపోయి యిచ్చి రండు" అని చెప్పి ఆ పురాణములు నా యొద్ద నిచ్చిరి.

నేను మరునాటి ప్రాతఃకాలముననే మాయూరము నడచి వెళ్లితిని. ఆచార్యుల యొద్ద వృత్తాంతము చెప్పి పుస్తకముల నిచ్చితిని. వా రా విషయము నానందముతో స్వీకరించిరి. అప్పుడు వారి చిత్తము తిరుప్పెరుందుఱవిఘ్నేశ్వరుల సన్నిధికి పోయి నిలిచియుండవలెను. "చేయుదును" అనియో, "తిరువావడుదుఱకు బయలు దేరుదము" అనియో వారు చెప్పలేదు.

> 'నెలరాజు వలపుగొను జటాజూటముగలవాని(శివుని)తోబాటు ఎండ కోరెడు ('వెయిలువంద') మత్తగిల్లిన గున్న యేనుగును (వినాయకుని) భావించి జీవింతము.'

అను భావముగల ఒక పద్యపు చరణము వారిముఖమునుండి బయలువెడలెను. అప్పుడు 'ఇప్పుడే వీరు పురాణమునకు విఘ్నేశ్వరప్రార్థన చేసినారు' అని తలచితిని. 'వెయిలువంద వినాయకర్' అనునది తిరుప్పెరుందుఱయందు విజయము చేసి యున్న స్థలవినాయకుల నామధేయము.

"సన్నిధానము శ్రీవారి దివ్యచిత్తానుసారము నడచుకొనుటచే నాకు పరమ సుఖము. మీరు 'తిరుప్పెరుందురై' చూడలేదే?" అని యాచార్యు లడిగిరి.

"లేదు. మాణిక్యవాచకర్ దివ్యకృపాభాజనమగు స్థల మని అయ్యగారు చెప్పగా వినియున్నాను."

"ఔను. అది ప్రశస్తస్థలమే. 'ఆవుడైయార్ కోయిల్' అని యిప్పు డెల్లరును చెప్పుదురు. భగవత్కృపవలన పురాణమునకు ఆమోదముద్రోత్సవము జరుగుచో అన్నియు మీరు చూడవచ్చును."

తిరుప్పెరుందురై చూడవలె నను కోరిక నాకు కలిగెను. మా యాచార్యుల వారు ఆ స్థలపురాణమును చెప్పుచుండగా దానిని నేను వ్రాయవలె నను ఆశ అంతకు ముందే యుదయించెను.

మూడు దినములు మాయూరమున నిలిచియుంటిని. పిమ్మట ఆచార్యులు బయలుదేరగనే నేనును బయలుదేరి తిరువావడుదురై చేరితిని. తిరువావడుదురైకు వచ్చిన పిదప మరల పాఠములు యథాక్రమముగ సాగినవి.

కొన్ని దినములకు తరువాత పిళ్లైగారు తిరుప్పెరుందురైపురాణము వ్రాయజొచ్చిరి. మొదట వినాయకవందనపద్య మొకటి చెప్పి ముగించిరి. మాయూరమున నేను పోయి వారిని చూచినప్పుడు ఒక్క చరణము చెప్పి యుండుట వారికి జ్ఞాపకము లేదు. అందుచేత వారు వేరొక పద్యము చెప్పిరి. అది ముగియగనే "ఈ విషయమై నేను మాయూరమునకు వచ్చినపుడు 'వెయిలువందవినాయకుని' గూర్చి తా మొక చరణము చెప్పుట నాకు స్మృతిలో నున్నది" అని చెప్పి, పాదమును చదివితిని.

వినిన వారు వెంటనే దానినే చరమచరణముగ నుంచి యొక పద్యము చెప్పిరి; నేను వ్రాసితిని. అటుపైనను పద్యములు చెప్ప జెప్ప వ్రాయుచునుంటిని. కొన్ని రోజులలో భగవన్మంగళాశాసనమును, నాట్టుప్పటలమును (దేశవర్ణన) నెరవేరినవి. తిరుప్పెరుందురైవిషయమున మునుపే యున్న స్థలపురాణములు రెండును స్థలచరిత్రలను ప్రకటించు నుద్దేశముతోడనే పుట్టినవి. పిళ్లైగారు వ్రాయునట్టి పురాణములందు దేశప్రశస్తి నగరప్రశస్తి మొదలగు వర్ణనలు, కల్పనాసామర్థ్యము మిక్కుటమై యింపెసలారు టెరిగినవారు ఆ విధముగ తమ తమ యూరులకును

పురాణము కావలె నని కోరుదురు. తిరుప్పెరుందురకు క్రొత్తగ పురాణము వ్రాయింపవలె నను ప్రయత్నముకూడ అట్టి కోర్కెవల్ల పుట్టినదే.

ఒకనాడు తటాలున నాకు తీవ్రముగ జ్వరము వచ్చెను. దేహ మంతయు బొబ్బలు పొటకరించినవి. ఎల్లరును పెద్దమ్మవారు పోసియున్న దని చెప్పిరి. అందుచే పాఠము వినుటకు గాని తక్కిన పనులు చేయుటకు గాని ఎంతమాత్రము సాధ్యము కాలేదు. సత్రపు నడవలో పడుకొనియే యుంటిని. పిళ్లెగారు కొన్ని సమయము లందు వచ్చి సమీపమున కూర్చొని "మీ కిట్టి యనారోగ్యము కలిగినదే" అని వగ చెందుదురు. నా కనురెప్పలమీదకూడ బొబ్బలు లేచియుండుటచేత కన్నులు తెరువ వీలు కాలేదు. పిళ్లెగారు వచ్చినపుడే పడుకమీద లేచి కూర్చుందును. దుఃఖము పొంగివచ్చును. నేత్రములో తెరువ రావు. కన్నీరు కారుచుండగ నేను నా దుఃఖము తెలుపుకొంటిని. "మా తాతగారి యూరగు సూర్యమూలకు పోయి శరీరారోగ్య మేర్పడిన తరువాత వత్తును" అంటిని. అట్లే చేయవచ్చు నని చెప్పి, నన్ను పంపించు టకు వలయు నేర్పాట్లు చేసిరి.

'తై' నెలలో నడచునట్టి గురుపూజ దగ్గరుచుండినది. అందుకొరకై పలు వురు వత్తురు గనుక ఆ సమయమున తిరువావడుదురయం దుండుట మంచిది కాదు అని తలచియే నేను సూర్యమూలకు పోవుదు నని మా యుపాధ్యాయులతో చెప్పితిని.

నా యనారోగ్యమును, అందుచే పిళ్లెగారి కేర్పడిన దుఃఖమును ఎరిగిన సుబ్రహ్మణ్యదేశికులు అప్పుడు నడచుచుండిన పెరియపురాణపాఠమును అంత టితో ఆపునట్లు ఆనతిచ్చిరి. న న్నొక పల్లకీలో పరుండబెట్టి సూర్యమూలకు పంపిరి. 'వెదురుదండె గల యా పల్లకీ పైకప్పు లేనిది. ఆ యవసరమున వే రేమి చేయుటకును వీలు కాలేదు. కన్నులు మూసికొనియే అందరియొద్దను అనుజ్ఞ వడసితిని. పిళ్లె గారును, తక్కినవారును నన్ను చూచి మిక్కిలి దుఃఖపడిరి.

"స్వామినాథయ్యరూ! పోయి వత్తురా?" అని మాట్లాడలేక తడబడుచు మాటలను ఒక్కటొక్కటిగ పొంగి పొరలి వచ్చు దుఃఖమున తడుపుచు వాచా ర్యులు పలికిరి.

నాకు మాట్లాడ నోరు పెగలలేదు. ఏమో ప్రలపించితిని; విలపించితిని. ప్రొద్దున ఎనిమిది గంటలకు పల్లకీలో సూర్యమూల కభిముఖముగ పయన మైతిని.

పల్లకీ సూర్యమూలకు సమీపమందున్న ఒక తోపుమార్గముగ పోవునపుడు మా నాయనగా రెదుడ వచ్చిరి. నే నున్న దశను చూచి వారు ప్రమాన్పడిరి. వారు వచ్చిన తీరు ఏదో ఒక విశేషమును సూచించినది. కనులు బాగుగ తెరచి చూడ నాకు సాధ్యము కాలేదు. "మాట్లాడక యింటికి పొమ్మ పిదప మాట్లాడుకొనవచ్చును" అని చెప్పి నాయనగారు వెడలిపోయిరి.

నేను పల్లకీలో సూర్యమూలకు చేరినపుడు పగలు పదునొకండు గంట యుండును. అమ్మవా రను కారణమున నేను 'పరాసరి' మామగారి యింటికి వెళ్లుట అచ్చట నున్నవారు సమ్మతింపలేదు. పొరుగూళ్లనుండి కొందరు వచ్చి యుండిరి. నే నున్న పల్లకీ ఇంటి కెదుట నున్న టెంకాయతోపులో దింపి యుంచిరి.

అక్కడ అందరు గుమిగూడి యుండుటకు కారణము 'ఇది' యని తెలిసి నపుడు నేను పిడుగుపడినవాని చందముగ నైతిని. నే నచట చేరిన దినమునకు ముందు రోజు మా యనుంగు మాతామహులును, శివభక్తిని నాకు బాల్యమందే ఉగ్గుపాలతో పెట్టినవారును అగు కృష్ణశాస్త్రిగారు శివసాయుజ్యము నందిరి. వారి మధు మయభాషణమును, శివపూజాధురంధరత్వమును వే రెచ్చట చూడగలుగుదుము అని విలపించితిని.

ఇట్టి స్థితియందు కొబ్బెరతోటలో నేను పల్లకీలో పడియుండియే పగచు చుండగ అస్థిసంచయనము జరిపించి మా మామగారగు శివరామయ్యారుతో మా తండ్రి గారును తదితరులును వచ్చిరి. నన్ను ఇంటిలోనికి పోవ సమ్మతింపకున్న వారిని చూచి మా మామ కోపగించుకొనిరి. "మన బిడ్డడు; వాడు కష్టపడునప్పుడు వానికి ఉపయోగపడని యిల్లు మరెందులకు? బలే! బిచ్చగానివలె తోటలోనే యుంచితిరా? మీ మనస్సు రాయా?" అని చెప్పి ప్రక్క నెవ్వరును కాపురములేక ప్రత్యేకముగ నుండిన వేరొక యింటిని తెరచి చెచ్చెర న న్నటకు కొంపోయి యుంచునట్లు చేసిరి.

తరువాత మా తండ్రిగారు, తల్లిగారును వచ్చి మిగుల దుఃఖించిరి. కావలసిన యుపచారములు ఇతరులు చేయుచుండ నే నా యింటిలో వసించుచుంటిని.

ఒకనాడు నాకు అమ్మవారి తీవ్రత అధికమైనది. నేను స్మృతి కోల్పోతిని. అప్పు డందరు భయపడిరి. మా తల్లిదండ్రులు కన్నీరు కార్చిరి.

నాకు కొలది స్మృతి కలిగినప్పుడు 'మనము మిక్కిలి యపాయదశలో నున్నాము' అని యెరుక గలిగెను. చెంతనే కంటికి మంటికి నేకధారగ నేడ్చుచున్న మా యమ్మగారిని చూచి "నేను జన్మించియు మీ కేమియు చేయలేక పోవుచున్నాను" అని బలహీనమగు స్వరమున చెప్పితిని. దానిని విని వారు వలవల విలపించిరి. మా నాయనగారును దుఃఖసాగరమున మునిగిరి. ఏమియు నెరుగని మా తమ్ముడు చెంగట నుండి దిక్కులోచక మిణకరించెను.

భగవంతుని దివ్యకృపచేత గండము గడచినది. అమ్మవారు తీవ్రముగ నున్నను, ఆ తీవ్రత నా శరీరమున మచ్చలుమాత్రమే కలిగించి యంతటితో నాగినది.

మార్గశిరనెల యంతయు నేను కష్టంగను కడగండ్లు పాలైతిని. 'తై' నెల పుట్టినది. నాకు కొంచెము తేరిక యేర్పడెను. శిరస్స్నానము చేయించిరి. తిరువా-వడుదుఱయందు అశ్వినీనక్షత్రమునాడు గురుపూజోత్సవము నడచినది. నాటిరాత్రి సూర్యమూలయందు మా మామగారి యింటి తిన్నెపై పడుకొనియే చూచినప్పుడు తిరువావడుదుఱయందలి 'యాకాశబాణములు' కనిపించినవి. గతవత్సరమున నే నా యూరిలో కాంచిన దృశ్యములు ఒకదాని వెనుక నొకటిగ నా జ్ఞాపకమునకు వచ్చినవి. మా గురువుగారు పలువురికి పద్యములు వ్రాసి యిచ్చినది తలచినపుడు 'ఈ సంవత్సరముకూడ నట్టి యద్భుతసంఘటన చూడ నోచుకొననైతిని గదా' యని వెతగూరితిని.

'మనము లేని సమయమున విద్యార్థుల కే యే పాఠములు జరిగినవో; మన మే యే యరుదైన విషయములు వినలేకపోతిమో' అను చింతయు నా కుండినది. పిళ్లెగారు మార్గశిమాసమున బయలుదేరి కొన్ని యూళ్లకు బోయి తైనెల గురుపూజకు వచ్చి రను వార్త నాకు తరువాత తెలియవచ్చెను. అప్పుడే మన కధికమైన నష్ట మేర్పడలేదు అని తలచి యూరడిల్లితిని. పిళ్లెగారి కోరికచొప్పున అడుగడుగున తిరువావడుదుఱనుండి కొందరు వచ్చి నన్ను చూచిపోవుచుండిరి.

నా శరీరస్థితి క్రమక్రమముగ గుణపడుచుండుటచేత "ఇక త్వరలో పిళ్లైగారి యొద్దకు పోవలెను" అని మాటిమాటికి చెప్పుచుంటిని. మా నాయనగారు నా యాత్ర మెరిగి ఒకరోజు నన్ను పిలుచుకొని తిరువావడుదుఱ వచ్చిరి.

మఠమునందు తూర్పున నున్న వనమందిరమున పిళ్లైగారు పులువూరి నడుమ నుండి సంభాషించుచుండిరి. అచ్చటి కేగి యాచార్యులను చూచితిని. అప్పుడు నేను, నా దేహముపై నున్న స్ఫోటకముమచ్చలు కనిపించినచో వారు దుఃఖింతు రని తలచి, వారి కన్నుల బడకుండునట్లు పెల్లుగ విబూది యొడ లెల్ల పూసికొంటిని. ఆచార్యులు నన్ను చూచిన వెంటనే మిక్కిలి వాత్సల్యముతో "స్వామినాథయ్యరూ, ఇప్పుడు శరీరము తేలికగ నున్నదా ? దేహ మంతయు మచ్చలు కనిపింపకుండ 'విభూతికవచము' ధరించియున్నట్లు తోచుచున్నది. మీ జ్ఞాపకముగనే యుంటిని. కణ్ణప్ప నాయనారుపురాణముతో పెరియపురాణము నిలిచియున్నది." అని చెప్పిరి. తరువాత మా నాయనగారిని చూచి క్షేమసమాచారములు విచారించిరి.

నా శరీరకార్శ్యము చూచిన గురువుగారు మా నాయనగారితో "వీరి కింకను బాగుగ ఆరోగ్యము కలుగలేదు. ఇక్కడ ఆహారపువసతి చాలినంత లేదు. వీరి తల్లిగారిడు ఆహారమును భుజించియే వీరి శరీరము తేరుకొని బాగుపడవలెను. స్వగ్రామమందే ఇంకను కొన్నాళ్లుండి పూర్ణారోగ్యము కలిగిన తరువాత రావచ్చును" అని నుడివిరి. 'వీరు మనలను మరల ఊరికే పంపించివేతురేమో' అని భయపడితిని.

"అయినను వీరి నెడబాసి యుండుట నా కసౌఖ్యముగ నున్నది. వీ రూరికి చనిన పిదప నేనును కొన్ని గ్రామములకు పోయివచ్చితిని. తరువాత గురుపూజ వచ్చెను. పిమ్మట 'మహామహము' వచ్చినది. పాఠము జరుగలేదు. ఇకపై పాఠము నిలిపియుంచుట ఉచితము కాదు. ఒక యాలోచన స్ఫురించుచున్నది. మీ రట్లు చేయుచో ననుకూలముగ నుండును." అని గురువుగారు మా నాయనగారితో మరల బలికిరి.

"ఏమి చేయవలెను ?"

"వీరి తల్లిగారిని పిలుచుకొని 'దేవతార్చన'నతో వచ్చి తా మిచ్చట కొంత కాల ముండి వీరి సంరక్షణ చూచుకొనుచున్నచో బాగుగ నుండును."

"అట్లే చేసెదను. అందులో నేమి కష్ట మున్నది?" అని మా నాయనగా రాడబడిరి. అప్పుడు నాకు కల్గిన హర్షోత్కర్షకు హద్దులు లేవు.

తండ్రిగారు వెంటనే వీధ్యాని చని మా యమ్మగారిని పిలుచుకొని వచ్చిరి. పిళ్లెగారు తిరువావడుదురయందు మే ముంటుటకు వలసిన సౌకర్యములను మఠము కార్యస్థుల మూలమున కల్పించిరి.

# 27. 'పట్టీశ్వరము'న పడిన పాట్లు

చిదంబరంపిళ్లెవివాహమునకుగాను మా యాచార్యులు తమ శక్తికి మించిన వ్యయము చేసిరి. వెచ్చించునపుడు మిక్కిలి యుత్సాహముగనే యుండినది. వివాహమైన పిదప బట్టలకొట్టువాడును, తక్కిన 'దుకాణదారు లును వచ్చి పైక మడిగి నప్పుడే లోకమందలి యనుభవముప్రకారము వీరికి వివాహపు ఖర్చుల కొలది తెలిసినది. 'ఆ ఋణమును ఏ విధముగ తీర్పవలెను?' అను చింత కలిగెను. ఆర్థికపు చిక్కులు పోనుపోను హెచ్చైనవి. ఇందుచే మిక్కుటమగు చింతలో మునిగి యుండిరి. ఒక పెద్ద మొత్త మిచ్చి యుపకారము చేసి వారి కున్న మానసికదుఃఖ మును పోగొట్టగల దాత యొక్కడును ఇప్పుడు లేడు. వేరు విధముగ డబ్బు గడించుటకును మార్గము లేదు. ఏదేని యొక గ్రంథము వ్రాసి, సభయం దామోదింప జేసినచో, అప్పుడు గ్రంథము వ్రాయించినవారు ఆర్థికసహాయము చేయుట కలదు. ఇది తప్ప రాబడికి వేరు త్రోవ లేదు. తిరుప్పెరుందురపురాణమును రచించి, పరిషదామోదము జరిపించిన రెండు వేల రూపాయలవరకు లభించు నను నమ్మిక యుండి నది. పురాణము ఆరంభదశయందే యుండినది. అది యంతయు వ్రాసి పూర్తిచేసి 'ఆమోదముద్ర' అయిన పిమ్మటనే గదా ధనము లభించును. అంతవరకు ఋణ దాతలకు బదులు చెప్పవలెనే!

వీరి కొక యాలోచన తట్టినది. తిరుప్పెరుందురపురాణమును ఆమోదింప జేసిన వెంటనే మన కెట్లైనను ధనము లభించును. ఇప్పుడు మఠమందలి అధి కారు లెవ్వరియొద్దనైనను ఐదు వందల రూపాయలు అప్పు పుచ్చుకొని అవసరమగు

ఋణబాధల తీర్చుకొని, అటుపై ఐదు వందలు అప్పు తీర్చివేయవచ్చును - అని వారు తలంచిరి. వారి జీవనపద్ధతి యట్లే యుండెను. ఇంటిఖర్చులకు హద్దుపద్దులు లేవు. అప్పు చేయుచునే యుందురు. ఎక్కడైనను పురాణము వ్రాసి యంగీకారము పొందినచో వేయి, రెండు వేలు లభించును. దానితో అప్పు తీర్తురు. పిదప ఖర్చు చేయవలసి వచ్చినప్పుడు ఋణము చేయుదురు.

మఠమున వారి భోజనాదులకు వలసిన వసతులు చేయబడియున్నను వారి ధారాళమైన ఖర్చుకు తగిన యార్థికసహాయము లభింపలేదు. వీరి మెత్తని మనసు, పెద్దరికమును వీరి నెల్లప్పుడును ఋణగ్రస్తులనుగనే యుంచినవి.

మఠమున ప్రధాననిర్వాహకులుగ నుండిన ఒక తంబిరానును ఆచార్యులు అప్పు అడిగించిరి. ఆ తంబిరాను అప్పిచ్చుటకు ఒడబడలేదు.

ఇతరులను ఋణ మడుగుటవలన నేర్పడు దుఃఖమును వారప్పుడు బాగుగ తెలిసికొనిరి. 'మన మీ మఠమునందు ఇన్నినాళ్లుగ పరిచితులమై యుంటిమే. మన యెడ నెల్లరకును మదిం పున్న దనుట వీరికిని తెలియును. అట్లయ్యు వీరు ఋణ మివ్వక త్రోసిపుచ్చుచున్నారు. లోకపు తీ రిదియే కాబోలు. ఆ యా సందర్భములందే మనుష్యుల నైజగుణము మనము తెలిసికొందుము. వారి ననిన ఫలిత మేమి? మన ము జాగ్రత్తగ నుండవలెను. సన్యాసివేషము పూనిన వీరే యి ట్లున్నచో ఇతరు లె ట్లుందురు?' అని తలచి తలచి వారు వగచిరి. మరి కొందరినికూడ అడిగి చూచిరి. ఏమియు ప్రయోజనము లేదు. అధీనకర్తలు పెక్కు సమయములందు విశేషముగ ధనసహాయము చేసియుండుటచేతను, మఠమునందప్పుడు ధనవ్యయ మధికముగ నుండుటవలనను, వారియొద్ద తమ లోటును సమక్షమున తెలియజేయ ఆచార్యులకు మన సొప్పలేదు. ఆర్థికసంకటము పరిహరించుకొను త్రోవ లేక కలత చెందియున్న వారికి వే రెచ్చటకైనను పోయి కొంతకాల ముండి మనశ్శాంతి గలిగిన పిమ్మట రావచ్చు నను తలంపు కలిగెను.

పలు విధముల యోచించి పర్యవసానముగ మా యాచార్యులు పట్టీశ్వరమునకు పోవుటకు తీర్మానించుకొని సుబ్రహ్మణ్యదేశికులయొద్ద యుక్తిగ తెలియజేసి యనుమతి పొందిరి. ఆ సమయమున నా తల్లిదండ్రులు తిరువావడుదురయందే యుండిరి గాన ప్రయాణము నిశ్చితమైన వెంటనే గురువుగారు మా నాయనగారిని

చూచి "ఇంకను కొన్ని దినములలో ఒక రోజు చూచుకొని పట్టీశ్వరము మొదలగు ప్రదేశములకు పోయి రాదలంచియున్నాను. ఇచటికి మరలివచ్చుటకు ఇంకను కొన్ని నెలలు పట్టును. అగుటచే మీరును స్వామినాథయ్యరుతో బయలుదేరి నేను పోవు నప్పుడు పట్టీశ్వరము వచ్చివేయుడు. అచ్చట కొన్నాళ్లుండి తరువాత 'ఆవుదైయార్' కోవెలకు పోవచ్చును" అని చెప్పగనే వారు దాని కొక విధముగ సమ్మతించిరి. కాని నా తల్లిదండ్రులు మాతో వచ్చుట నా కిష్టము లేదు. మా నాయనగారి నియమ-నిష్ఠలకు మేము పోవుచోట్ల తగిన వసతి యుండ దను తలపే దానికి కారణము. పట్టీ-శ్వర మన్ననే నా కొక భయ మున్నది. అక్కడ పిళ్లైగా రుంటుటవలన నే నుండవలసిన యావశ్యకత యేర్పడినది. నా తల్లిదండ్రులును అక్కడికి వచ్చియుండినచో తరువాత ఆఱుముగత్తాపిళ్లై కోపము ఏ యే రూపముగ వెలువడునో యని భయపడితిని. కాగ, నేను తగిన కారణములు పిళ్లైగారియొద్ద చెప్పి నా తల్లిదండ్రులు వెంబడి వచ్చుట నిలిపివేసితిని. పిదప నేను మా నాయనగారిని పిలుచుకొని సూర్యమూలకు పోయి వారి నచ్చట వదలి కొన్ని దినము లుంటిని.

ఆచార్యులు పట్టీశ్వరమునకు శ్రీముఖనామ సంవత్సరము 'వైగాశి' మాసము (మే, 1873) పోయి చేరిరి నేను సూర్యమూలనుండి అటకు పోతిని. త్వరలో తిరుప్పెరుందుఱపురాణము రచించి పూర్తి చేయవలె నను నాత్రము వారి కుండెను. అందుచేత విడువక, ప్రతిదినము పురాణమందు కొన్ని పద్యములు వ్రాయుచుండిరి. పద్యములు చెప్పుచుండగ ఒక పర్యాయము తాటియాకులపై వ్రాయుటయు, పిదప వ్రాసినదానిని చదివి చూపి, వారు చెప్పెడు దిద్దుపాట్లు గుర్తించుకొని మరల వేడు తాటి యాకుపై చక్కగ వ్రాయుటయు నా పనులు. ఇట్టి పనులచేత నేను ప్రత్యేకముగ పాఠములు విన వీలు కాలేదు. అయినను ఆ పురాణపద్యములు వ్రాయుటయు, నడుమ నడుమ ఆ పద్యములకు సంబంధించి వారు చెప్పెడు సంగతుల వినుటయు నాకు మిక్కిలి యుపయోగముగా నుండినవి.

ఒక నా డుదయమున ఆచార్యులు పద్యములు చెప్ప నేను వ్రాయుచుంటిని. దాని నొక్కచోట నిలిపివేసి, నన్ను చలిదియన్నము తిని రమ్మని వారు పంపిరి. నేను తాటియాకులను, గంటమును వారియెదుటనే ఒక్కచోట నుంచి పోయి కొంచెము నే పైన పిమ్మట వచ్చితిని. ఆమధ్యకాలములో వారు తమ మనస్సులో పైన చెప్పవలసిన పద్యములకు వలసిన భావములు విమర్శించి యుంచుకొనినారు. అందుచేత

నేను వచ్చిన వెంటనే ఏమియు ననక పద్యములే చెప్పదొడగిరి. నేను తాటాకులను. గంటమును చూడగ తాటాకులు మాత్ర ముండినవి. గంటము కనిపింపలేదు. పరి సరము లందు వెదకితిని. నేను పద్యములు వ్రాయక ఇట్లు వెదకుచుండుట చూచిన గురువుగారు "ఏమి వెదకుచున్నారు ?" అనిరి. నేను సంగతి తెలియజేసి "ఎవ్వరైనను తీసి యుండవచ్చును. విచారించి కొని వత్తును." అని పలికి వెడలిపోతిని. నా గంట మెచ్చటను అగుపింప లేదు. అచ్చట లెక్కలు వ్రాయుచున్న కరణము నడిగితిని. వారు తమకు తెలియ దని చెప్పిరి. 'వే రే దైన గంట మున్నచో నిప్పింపుడు' అని నేను వేడగ వారు తమ గంటము నింటిలో పెట్టినట్లు చెప్పిరి.

మునుపటిసారి పట్టీశ్వరమం దున్నప్పుడు ఆఱుముగత్తాపిళ్లె నా పుస్తక ములు దాచిపెట్టిన వృత్తాంతము నా జ్ఞాపకమునకు వచ్చెను. 'ఇంకను అట్టి సంకట ములు మనల విడచిపోవునట్లు లే వని తోచుచున్నవి.' అని నా యెడద వడకెను. ఏమియు తోచక పిళ్లెగారియెదుట వాడిన మోముతో వచ్చి గంట మగుపింపలే దని తెలియజేసితిని. తాము మనస్సులో నూహించి చక్కబరచి, సిద్ధపరచుకొనియున్న పద్యములు చెప్పవలె నని, నా రాక నధికౌత్సుక్యముతో ప్రతీక్షించుచుండిన వారి కిది కడు దుఃఖము కలిగించెను. ఈ కవిగారు పద్యరచనకై యాలోచింతురా ? ఈ దుఃఖముపై మనసు పోనిత్తురా ?

అప్పు డచ్చటికి ఆఱుముగత్తాపిళ్లె వచ్చిరి. "ఏమి ? వీ రేదియు వ్రాయక ఇట్లు తిరుగుచున్నారు !" అని యడిగిరి. పిళ్లెగారు కారణము చెప్పినపుడు "వీరు మిగుల అజాగ్రత్త గలవారు ! పుస్తకము గాని, గంటము గాని వీరు పదిల ముగా నుంచుకొనరు. మీయొద్ద నెన్నియో మారులు చెప్పియున్నాను. వీ రెందు లకును కొరగానివారు." అని తమ విమర్శ యారంభించిరి. 'మరల తగులు కొంటిమే' అను కలత నాకు కల్గెను.

పిళ్లెగారు వారితో ననునయముగ మాట్లాడి వారిని శాంతపరచిన తరువాత "ఏదీ, వీరు గంటము నిమ్మని యొక పద్యము క్రొత్తగ రచించి చెప్పు మనుడు. దానిని నేను తెప్పించి యిత్తును." అని వా రుత్తరు విచ్చిరి. దిక్కు తోచక యున్న పుడు నాకు పద్య మూహింప గల మనశ్శాంతి యేది ? "తమ్ముడు కోరుచున్నట్లు ఒక పద్యము చెప్పుడు" అని యాచార్యు లాజ్ఞాపించిరి. వెంటనే నే నాలోచింప మొదలిడితిని. మంచి కాలము ! ఆఱుముగత్తాపిళ్లె ఎదుటనున్న తోటకు జనిరి.

ఆ సమయము జూచి మా గురువుగారు మొదట 'గంట మొక్కటి నేడు నాకు ప్రసాదింపుము' అను నర్థము గల ఒక 'వెణ్బా' నాల్గవచరణమును చెప్పిరి. అక్లే యారంభించి కొలది కొలదిగ వెనుక నుండియే. మొదటిచరణమువరకు చెప్పి పూర్తిచేసిరి. ఆ 'వెణ్బా' పూర్తిగ నేను కంఠస్థము చేసికొంటిని. ఆఱుముగత్తా పిళ్లె వచ్చిన వెంటనే—

> విస్తృమరయశోవిరాజితా, ఆఱుముఖప్రభూ, సతతోత్సాహీ, అనారతము నిష్టమగ పురాణము వ్రాయుటకై మైనమం దొత్తెడు పదార్థన్నె పసిండితో రూపొందిన గంట మొక్కటి నేడు నాకు ప్రసాదింపుము.

అను భావముగల యా వెణ్బా చెప్పితిని. వారికి తృప్తి కలిగినదో, లేదో నే నెఱుగను. కొంచెమునేపటిలో నా గంటము నాయొద్దకు వచ్చి చేరెను.

ఈ సంఘటనచేత పిళ్లెగారిహృదయము గాయపడినది - "ఈ లోకమున మన మన స్సెరిగి ప్రేమ జూపువా రెక్కడను లేరే! వట్టి పిడికెడు మెతుకులకై యెన్ని సంకటములకు లోనుగావలసివచ్చుచున్నది. ?" అని వగచిరి.

# 28. గ్రామ యాత్రలు

ఎడ నెడ మేము కుంబకోణమునకు జని త్యాగరాజచెట్టియారుతో ముచ్చటించుచు ప్రొద్దు పుచ్చుచుందుము. అటవిడుపురోజులలో చెట్టియారే పట్టీశ్వరమునకు వత్తురు. అట్లు వచ్చినపుడు పట్టీశ్వరమున ఆఱుముగత్తాపిళ్లెయిల్లు సందడిగ నుండును. చెట్టియారు 'ఖండితవాది'యైనను ఆ భాషణమున నొక స్వారస్య ముండును. వారు వచ్చిననే పిళ్లెగారికిని నాకును మిక్కిలి సంతోషము కలుగును.

ఇట్లు అడుగడుగున త్యాగరాజుచెట్టియారును కలసికొనుట సంభవించుటచేత నాకును వారికిని ఉన్న పరిచయము రానురాను ముదిరెను. మనస్సున నేదో యుంచుకొని వెలుపల ప్రేమగలవానివలె నటింపక బహిరంగముగ తమ యుద్దేశము

లను వెలువరచు వారియెడ నా కున్న ప్రేమ దృఢపడ జొచ్చెను. ఒక కళాశాలలో వా రుపాధ్యాయులుగ నుండుట వలనను, ఉత్తమవిజ్ఞానవంతు లగుటచేతను వారికి మంచి పలుకుబడి యుండుటను నే నెరిగితిని. కుంబకోణమందు వారి యింట బస చేసిన కాలములో పలువురు పెద్దలు వారియొద్దకు వచ్చుటయు, ఇతరులయెడ వారు నడచుకొను తీరును గమనించితిని. అందుచే వారి కుండిన మంచి మదింపు నాకు చక్కగ స్పష్టముగ తెలిసెను. వారు తమ యుద్యోగపుప్రాపుచే ఎవ్వరి దయయు నెదురుచూడ నక్కరలేని స్థితిలో నుండిరి. పిళ్లెగారు కొన్ని సమయముల తమ జీవనమున కై పరహస్తముల ప్రతీక్షింపవలసిన స్థితిలో నుండుటయు గమనించిన నేను 'మనముగూడ నిట్లే యుండవలసివచ్చును' అని వా రిరువురి స్థితిగతులు పోల్చి చూచి తెలిసికొంటిని.

ఇట్టి యెరుక ఏర్పడినది మొదలు 'మనకును ఒక యుద్యోగ మున్నచో ఆర్థికచింత లేక యుండవచ్చునే' యను తలంపు నాకు కలిగెను. ఒకసారి త్యాగరాజచెట్టియారును కలిసికొనిన సమయమున "నా కెక్కడనైన నొక పాఠశాలలో పని చూచి యిప్పించినచో మిక్కిలి యుపకారముగ నుండును. అదియు చూచుకొనుచు తీరుబడివేళల అయ్యగారియొద్దను చదువుచు నుందును." అని చెప్పియుంటిని. ఇది పిళ్లెగారికి తెలియదు. "సమయము వచ్చినపుడు చూచుకొనవచ్చును" అని చెట్టియారు చెప్పియుండిరి.

ఒక రోజు త్యాగరాజచెట్టియారు పట్టీశ్వరము వచ్చియున్నప్పుడు "కుంబకోణమునందు రావుబహదూర్ అప్పుశాస్త్రిగారు మొదలగువారు ముగ్గురు ఘనులు చేరి "నేటివ్ హైస్కూల్" అను పేరుతో నొక పాఠశాల నారంభింపబోవుచున్నారు. ఆ మువ్వురును నాయెడ ప్రీతిగలవారు. ఆ పాఠశాల కొక తమిళపండితులు కావలెను. తగినవారి నొక్కరిని చూచిపెట్టు డని వారు కోరి యున్నారు. వెంటనే మీ జ్ఞాపకము వచ్చెను. మొదట నెలకు పదియేను రూపాయ లిత్తురు. తరువాత వేతనము హెచ్చును." అని వారు నాతో ననిరి. దానిని వినినపుడు ఒప్పుకొనవలెనను సంకల్పమే మొదట నాలో కలిగెను. పిళ్లెగారికి మే మిరువుర మీ విషయము తెలియజేసితిమి.

వారు కొంచెముసేపు మౌనముగ నుండిరి. వారి మనస్సులో బహుభంగుల భావములు పరుగులెత్తిన వని తోచినది. పిమ్మట త్యాగరాజచెట్టియారును చూచిరి. "త్యాగ

రాజా, ఇప్పుడేమి యవసరము? వీ రింకను చదువుటకే వీరము ప్రారంభించిరేమో. ఉత్సాహముగ చదువుకొనుచున్నారు. ఇప్పుడే యుద్యోగమునకు పోయినచో నింత యుత్సాహముగ చదువుకొన వీలుకాదు. సమయమును దొరకదు. ఇంకను కొన్ని సంవత్సరములు చదువుకొననిమ్ము తరువాత కావలసినచో చూచుకొనవచ్చును" అనిరి. నా యభీష్టము నడుగకయే వా రట్లు చెప్పినను నా కేది శ్రేయస్సో వారికి వారు యోచించియే యట్లు పలికిరి. చెట్టియారును వారు చెప్పినది యొప్పుకొనిరి. "అయ్యా గారు చెప్పినది వాస్తవమే. బాల్యమున చదివినదే ధారణలో నుండును. రోజులు గడచుకొలది గొప్ప యుద్యోగము మిమ్మే వెదకికొని వచ్చును. మీరు విచారపడ వలదు. వీరియొద్ద బాగుగ చదువుకొనుచుండుడు" అని నాతో పలికిరి.

నేనును యోచించి చూచితిని. వారిరువురును నా శ్రేయస్సు నుద్దేశించియే చెప్పుచుండుట యెరిగి నా కోరిక మార్చుకొంటిని.

ఆచార్యులు కొందరు మిత్రుల వేడుకోలు ననుసరించి తంజావూరునకు జని యొక నెల యుండిరి. అప్పుడు నే నుత్తమదానపురమునకు బోయి తలిదండ్రులతో నుంటిని. తిరుప్పొటుండుఅపురాణమును మా గురువుగారు వ్రాయుచువచ్చిన కాల మగుటచే నా మనస్సు వారి కవిత్వములో లీనమయి యుండినది, నేనును పద్యములు వ్రాయు ప్రయత్నములో నాసక్తుడ నయితిని. ఉత్తమదానపురమునం దుండి నప్పుడు నాకు తీరిక యుండుటచేత నా ప్రయత్న మధికమాయెను. ముక్తకములు పెక్కు వ్రాసితిని.

మొదట వాగ్దేవివిషయమున పద్యములు వ్రాయ దొడగితిని. నేను చెప్పుచుండగా మా పిన తండ్రిగారు వ్రాయుచువచ్చిరి. కొన్ని 'వెణ్బా' లను, 'కట్టళైక్కలిత్తుఱై' వృత్తములను కొన్నిటిని వ్రాసితిని.

> వంచకనృశంసజనదుర్లభసుధాధారాస్వరూపిణీ, సకలకలాకల్పలతికా, దొన్నియబోలు తమ్మిపై వసించెడు 'మనోమణీ', మనోవేదన లెల్ల వెళ్ల బోసికొనిన నన్ను రుచిరరాజహంసముపై మెల మెల్లగ నెక్కియే వచ్చి యనుగ్రహింప దగిన తరుణ మిదియే.

అను భావముగలది వానిలో నొక్కటి. ఇట్లు పద్యములు వ్రాయుచు వచ్చినపుడు నా హృదయములో నొక పెద్ద తృప్తి యేర్పడును.

అటుపిమ్మట 'స్వామిమల'లో నుండు సుబ్రహ్మణ్యస్వామినిగూర్చి పదు నారు 'కట్టళైక్కలిత్తుఱై' పద్యములు వ్రాసితిని. ప్రశస్తశాస్త్రరహస్యములు గాని, భావనలు గాని యీ పద్యములలో తావుకొనలేదు. నా యనుభవము కొలదిపాటిది. అలవాటును తక్కువ. ఆ పరిమితిలో ఎట్టి భావము లుండునో అట్టివానినే యీ పద్య ములలో చూడవచ్చును.

మా బంధువులును, సంగీతమందు చక్కగ పరిశ్రమించినవారును అయి వట్టి 'శేషఅయ్యర్' అను వృద్ధులు ఉత్తమదానపురములో నుండిరి. తమిళవిద్వాం-సులుగనున్న వారియెడకు తమిళము చదువుకొనువా రెవ్వరేని జనినచో వారిని పరీ క్షించుట ఆ కాలపు టలవాటు. విద్యార్థు లట్లు పరీక్షసేయువారిపై కినియరు. నేను 'శేషఅయ్యరు' వద్దకు వెళ్లి మాట్లాడినప్పుడు వారు నన్ను పలుప్రశ్న లడిగిరి. 'మనము పెద్ద విద్వాంసులయొద్ద చదువుకొనుచున్నాము. పద్యములు వ్రాయు నభ్యాసముగూడ మనకు కలిగియున్నది' అను భావముతో గర్వించియున్న నేను వా రడిగిన ప్రశ్నలకు అలక్ష్యముగ సమాధాన మిచ్చితిని.

వారు కంబరామాయణమునందు మంచి పరిచయము కలవారు. అందుండి ఒక పద్య మెత్తి చెప్పి "దీని కర్థము తెలిసిన చెప్పుము. చూతము!" అనిరి. నేను "ఇంకను కంబరామాయణము చదువలేదు" అని వారియొద్ద చెప్పియుండవచ్చును. "చూతముగాక! మన జ్ఞానమున కందకపోవునా?' అను భావముతో ఆ పద్యము గమనించి చూచితిని.

యుద్ధకాండమున 'వరుణుని మార్గ మభ్యర్థించు పటలము'న ఆ పద్య మున్నది. వరుణుడు రాకుండుట జూచి క్రుద్ధుడైన శ్రీరామచంద్రుడు సముద్రముపై బాణము ప్రయోగింప, నంతట వరుణుడు భయకంపితుడై పెక్కు భంగుల నా భగ వంతుని స్తుతించుచునే వచ్చి పాదాక్రాంతు డాయెను.

క్రమ్మిన చీకట్లు చిమ్మివేసెడు సూర్యదేవు నధిక్షేపించెడు మాలలు వేయింటిని చేతులార మహీతలముపై పాదోపాయనముగ నునిచి 'పిన్నలు తప్పులు చేసిన క్షమించుట పెద్దల చెయిదము. వేయిపేళ్ల గల సామీ, శరణు!' అని పాదములపై వ్రాలెను.

"వరుణుడు పలు రత్నహారములు తెచ్చి రామచంద్రుని పాదారవిందములం దుంచి 'పిన్నలు దొసగు లొనర్చిన నోర్చుకొనుట పెద్దవారి చేత. నీవే శరణు!' అని పాద ములపై బడినాడు" అనునది దాని భావము.

అట 'పాయిరుళ్ శీక్కుం దెయ్వప్పదిక్కుం పృశిక్కుం మాలై యాయిరం కరత్తాన్ మణ్మే లడియుఱైయాగ వైత్తు....' అను వాక్యాంశమునకు 'క్రమ్మిన చీకటిని చిమ్మివేయు దేవుడగు సూర్యుని దూరెడు వెలుగుగల హారమును వేయి చేతులుగల వరుణుడు భూమిపై శ్రీపాదోపాయనముగ నుంచి....' అని నే నర్థము చెప్పుచు వచ్చినపుడు శేషఅయ్యారు మధ్య అడ్డు తగిలి "అగు, అగు! వేయి చేతులుగల వరుణు డనుచున్నావే, అది పద్యమునం దెచ్చట నున్నది?" అని యడిగిరి.

" 'ఆయిరం కరత్తాన్' అని యున్నదే" అని నే నంటిని.

వారు నవ్విరి. పిదప "వరుణునకు వేయి చేతు లున్నవనుటకు నెచ్చటనైన ఆధార మున్నదా?" అని యడిగిరి.

"ఇందుననే యున్నది" అని నా సమాధానము.

"మీ యాచార్యులు దీని కిట్టులేనా యర్థము చెప్పిరి?"

"నేను చెప్పినదానియం దేమి తప్పు? అది ముందు చెప్పుడు."

"ఆయిరం అను పదమును కరత్తాన్ అను పదముతో నన్వయింపరాదు. (కరత్తాన్ అని కాదు, కరత్తాల్ అని పదచ్ఛేదము) సూర్యు నధఃకరించు మాలలు వేయి అని విడదీసి, వేయి మాలలను కరముతో (కరత్తాల్) భూమిపై శ్రీపాదము లందు కానుకగా నుంచి అని కూర్చి యర్థము చెప్పవలెను. నీ వవసరపడితివి" అనినా రా పెద్దలు. నాకు గర్వభంగ మైనది. 'ఎవరెవరియొద్ద ఎట్టియెట్టి జ్ఞానశక్తు లున్నవో యని తలపక, వీరియెడ మదింపు లేక మనము మన యవివేకమును బయలుపరచుకొంటిమే' అని వెతజెందుటతోబాటు వారిని చూచి "నేనుగా నూహించి యర్థము చెప్పితిని. మా గురువుగారియొద్ద నింకను పాఠము చదువలేదు. మీరు చెప్పిన యర్థమే సరి యని తోచుచున్నది" అని వినయముతో నంటిని.

"ఏదియైనను ఆలోచించి చెప్పవలెను. నీవు ధైర్యముగ అర్థము చెప్ప ముందుకు వచ్చుటనుగూర్చి సంతోషపడుచున్నాను" అని చెప్పి వారు నన్నాశీర్వదించి పంపిరి.

## 29. 'తిరుప్పెరుందుఱై'లో....

నేనును, గురువుగారును తిరువావడుదురైకు పోతిమి. త్వరలో తిరుప్పెరుందుఱపురాణమును పూర్తి చేయింపవలె నని సుబ్రహ్మణ్యతంబిరాను దేశికులకు లేఖ వ్రాసియుండిరి. దేశికు లీ విషయమును పిళ్లెగారికి తెలియజేయగనే, యాచార్యులు "త్వరలో బయలుదేరిపోయి పురాణమునకు 'సభాస్వీకారము' చేయింప దొరకొనవలెను," అని ప్రీతితో బలికిరి. పురాణమునందు కొన్ని పటలములు మాత్రమే అయియుండెను. 'అంతయు వ్రాసిన పిమ్మటనే గదా పరిషదామోదము కావలెను' అని నే తలంచితిని. పిదప పిళ్లెగారి యలవాటు తెలియవచ్చెను. ఒక పురాణమును పూర్తిగ వ్రాసిన తరువాతనే 'అంగీకారముద్ర' పొందవలె నను నియమము వారికి లేదు. పురాణపు వెనుకటి భాగములు వ్రాయుచునే యుందురు. ముందటి భాగముల కంగీకారముద్ర పొందుచునే యుందురు. కొన్ని సమయముల ఆనాడు పూర్వాహ్ణమున వ్రాసిన పద్యములకు అపరాహ్ణమున ఒప్పుదల యగుటయు కలదు. పెట్టెనిండుగ పైక ముంచుకొనినవాడు ఎట్టి సమయమందైనను కావలసిన మొత్తమును తీసికొని వెచ్చించునట్లుగ వా రెట్టి వేళల తలచినను, తమ హృదయపేటిక తెరచి, కావలసిన కవితలను ఎత్తికొని ప్రకటించు దశలో నుండిరి. ఆ పెట్టె తెరచుటకు కావలసిన తాళపుచెవి యగు నుత్సాహముమాత్రము వారియొద్ద నుండవలెను. అప్పుడు వారినుండి ప్రవహించు కవితాస్రవంతి నెవ్వరు నరికట్టలేరు.

'మార్గళి' నెల. శ్రీఆర్ద్రామహోత్సవము దగ్గరినది. ఆర్ద్రాదర్శనమునకు తిరుప్పెరుందుఱకు బని పురాణమునకు అంగీకారముద్ర పొంది మరలి రావచ్చు నని మా యాచార్యుల నిర్ణయించిరి. ఎల్లరియొద్దను అనుమతి వడసి వారు (1873 డిసెంబర్) బయలుదేరిరి.

తిరుప్పెరుందురై చేరితిమి. ఆచార్యుల వారి రాక ఎల్లరకు మహానంద మొసఁ గూర్చెను. కోవెలవారు మేళతాళములతో వచ్చి యా కవిశ్రేష్ఠులను చూచి, ప్రసాద మిచ్చి దర్శనమునకు పిలుచుకొనిపోయిరి. ఆలయమందు సుబ్రహ్మణ్యతంబిరాను వారికి 'స్వాగత' మిచ్చిరి.

తిరుప్పెరుందురై పురాణసభామోదము ఆరంభించుటకు ఒక మంచి రోజు నిర్ణయింపబడినది. ఈ మధ్యలో ఆ పురాణభాగములు రచించుచుండిరి. నేను వానిని వ్రాయుపని చేయుచుంటిని.

మాతోడ నున్న శవేరినాథపిళ్లై క్రైస్తవులై యున్నను విభూతిధారణ చేయువారు. తిరుప్పెరుందురయందు వారి నెవ్వరును క్రైస్తవు లని తెలిసికొనలేదు. కొందరు భక్తులు కూడియున్న యాచోట వారును శివభక్తులుగనే వెలుగొందిరి. శైవులతోడ పంక్తిభోజనము చేయుటలేదు. ఆకృతి, భాషణము, నడక, ఉడుపులు, భావనలు అన్ని విషయములందును వారికిని శైవులకును భేదమే కానరాదు. అయినను 'శవేరినాథన్' అను పేరుమాత్రము వారు క్రైస్తవు లని పట్టించుచుండెను. వారు పేరునుబట్టియు శైవులుగనే యుండవలె నని యభిలషించిరి

తిరుప్పెరుందురై చేరిన కొన్నాళ్ల తరవాత తమ కోరికను వారు గురువుగారికి తెలియజేసికొనిరి. "ఇచట నంతయు శైవమయమై యున్నది. నేనును ఇతరుల వలెనే యున్నాను. నా పేరే నన్ను బయటపెట్టుచున్నది. దానిని మార్చి శైవ నామమే యుంచుకొనవలె నని సంకల్పించుచున్నాను. పురాణపరిషదామోదము జరుగుచుండగ అయ్యగారు ఏదైన గమనించుకొమ్మని నన్ను పిలువవలసివచ్చును. శివభక్తి సంపన్నులు నిండిన సభలో క్రైస్తవనామముతో నన్నయ్యగారు పిలుచునప్పుడు సభ్యు లేమైన తలపవచ్చును." అనిరి. "వాస్తవమే" అని పలికి మా యుపాధ్యాయులు "ఇకపై 'శివగురునాథపిళ్లై' అను పేరుతో నిన్ను పిలువవచ్చు నని తోచెడిని. ఈ పేరు ఉచ్చారణమున నీ ప్రాత పేరును పోలియున్నది" అనుచు నామకరణము చేసిరి

శవేరినాథపిళ్లై గంతులు వేయుచునే నా యొద్దకు పరుగెత్తుచు వచ్చిరి. "ఇటు చూడుడు! నేడుమొదలు నేను సంపూర్ణశైవుడను. నా ప్రాత పేరు మరచిపొండు.

నే నిప్పుడు శివగురునాథుడను. మీ వైష్ణవనామమును మార్చి, స్వామినాథయ్యరు అని పేరు పెట్టినారు కదా! ఆ భాగ్యము నాకును లభించినది. నా క్రైస్తవనామము మార్చి 'శివగురునాథన్' అని పేరు పెట్టినారు. ఆచార్యులు మన యిరువురిని ఒకే స్థానమున నుంచి ప్రేమతో చూచుకొనుట కిది యొక గురుతు. రెండు పేళ్లకును అర్థ మొక్కటే గదా? స్వామినాథు డన్న నేమి? శివగురునాథు డన్న నేమి? రెండు నొక్కటే" అనిరి.

తిరుప్పెరుందురయందు 'గ్రంథామోదముద్రోత్సవము' ఒక శుభదినమున ఆరంభింపబడెను. సుబ్రహ్మణ్యతంబిరాను అందులకై విరివైన యేర్పాట్లు చేయించిరి. పొరుగూరులనుండి ఘనులును, విద్వాంసులును, శివభక్తిసంపన్నులును గుంపులు గుంపులుగ వచ్చి చేరియుండిరి.

'కుదిరై స్వామి' మండపమున పరిషదామోదము జరిగినది. అప్పుడు నేనే రాగముతోడ పద్యములు చదివితిని. పాఠము చదువునప్పుడును, తక్కిన సమయము లందును తమిళపద్యములు చదువునట్టి యలవాటు నా కున్నను, అంత పెద్ద సదస్సులో మొట్టమొదటిసారిగ నాడే చదువదొడగితిని. సభ్యసమూహమును జూచి నాకు జంకు కలుగలేదు. ఉత్సాహమే కలిగెను.

ఒక్కొక్కదినమునను అపరాహ్ణమున 'ఆమోదసభ' జరుగును. ప్రాయశః అయిదు గంటల వరకు సాగుచుండును. కొన్నాళ్లు అంతకంటె కొలది కాలము హెచ్చుగుటయు గలదు. అచ్చటికి వచ్చియున్నవా రడుగడుగున వచ్చివచ్చి మాట్లాడుచుండుటచేత తక్కిన పనులందును మా గురువుగారికి తీరికయే లేదు.

పురాణమునందు కొన్ని పటలములు మాత్రమే వ్రాయబడి యుండినవి. అనుదినము ఆమోదపరిషత్తు జరగుచుండుటచేత పైపై పద్యములు రచియింపవలసిన పని యావశ్యకమై యుండెను. కాని గురువుగారు దానివిషయమై విచారపడినవారి వలె కనుపింపలేదు. వచ్చినవారితోడ ముచ్చటించుటయందే కాల మధికాంశము గడచెను.

మునుపే వ్రాసియున్న పద్యము లన్నియు పరిషదామోదము పొందినవి. మరునాడు సభామోదమునకు పద్యములు లేవు. నే నీ విషయము రెండు దినములకు

ముందుగనే తెలియజేసితిని. గురువుగారు "చూచుకొనవచ్చును" అని చెప్పి అట్టి ప్రయత్నము పట్టించుకొనక యుండిరి.

'ప్రాతఃకాలమున వ్రాసి సాయంకాలమున ఆమోదము పొందుట వీరికి సులభముగా నుండవచ్చును. కాని ప్రొద్దున తీరుబడి యెక్కడ నున్నది? ఎల్లప్పుడును ఎవ్వరో వచ్చి మాటాడుచునే యుందురు. వీరికి పద్యములు రచించు నవకాశ మెట్లు లభించును? ఆమోదసభను రెండు దినములు నిలిపివేయవలసినదే యుండును' అని నేను తలచియుంటిని.

మరుసటి దినము ప్రొద్దు పొడిచినది. అలవాటుప్రకారము ప్రొద్దున కొందరు వచ్చి మాటాడ దొడగిరి. "సరియే. నేడు సభామోదము నిలుపవలసినదే." అని నేను నిశ్చయముగ ననుకొంటిని. వచ్చి మాటాడుచుండినవారియెడ నాకు కోపముగూడ గలిగెను.

కొంచెముసేపటికి తరువాత గురువుగారు నన్ను బిలిచి తాటాకుల పుస్తకము గంటము తీసికొని రమ్మనిరి. నేను వానిని కొనిపోయితిని. వారి సమీపమున కూర్చుంటిని. "మంచికాలము! ఇప్పటికైనను వీరికి జ్ఞాపకము వచ్చినదే." .అని నాకు సంతోషము కలిగెను. అట నున్నవా రెల్లరను వీడ్కొని పంపెంచివేసి పద్యములు వ్రాయ బూనుకొందు రని నే నెదురుచూచితిని.

నే నెదురుచూచినట్లు జరుగలేదు. ఆ కవిసార్వభౌములు వా రున్నప్పుడే కవిత్వము నారంభించిరి. ఆ వచ్చియున్నవారును అడ్డమాకలు లేక వారు పద్యములు రచించు నద్భుతమును గమనించుచుండిరి. నడుమ నడుమ వారితో ముచ్చటలాడుచునే పద్యముల నొక్కటొక్కటిగ చెప్పుచు వచ్చిరి. అన్నినాళ్లనుండి వారితో పరిచయ ముండియు, అట్టి యద్భుతసంఘటనను నే నంతవరకు చూచి యెరుగను. పరులతో మాట్లాడుచునే, అదే సమయమున భావసాంద్రములగు పద్యము లెన్నిటినో ఒకటి వెనుక నొకటిగ ప్రవాహముగ రచించుచున్న వారి యనితర-సాధారణకౌశలముచూచి నేను మనస్సులో నాశ్చర్యపడుచు వ్రాయుచుంటిని. అష్టావధానముచేయువారు కూడ కొన్ని పద్యములే రచింతురు. మా గురువుగారన్నో పురాణగ్రంథములే రచించుచుండిరి. ఆ జనసమూహము నడుమ వారితో

మాట్లాడుచుండునపుడే వారి మనస్సులో కల్పనాపరంపర యెట్లు తోచెనో యనున దొక మహాద్భుతము.

ఆ కవిగారి మానసికస్వరూపమును రోజులు గడచుకొలది తెలిసికొనగలిగి-తిని. వారి హృదయము కవిత పండించు పొలము. అందులో నెప్పుడెప్పు డుత్సాహము నిండి యుండునో ఆ యా వేళలం దెల్ల నవిచ్ఛిన్నముగ కవిత లుదయించుచునే యుండెను. పలువురు మిత్రులతో మాట్లాడుచుండునపుడు వారి మనస్సులో నట్టి యుత్సాహ ముండినది. దాని కడ్డుపడునట్టి ఋణాదుల స్మరణ వారి కప్పుడు కలుగనే లేదు. అట్టి జ్ఞాపకము మరుగుపడియున్న యా సందర్భములందు అలసట లేక కల్పనలు పైపై నుదయించుచునే యుండును.

నాడు పరిషదామోదము పొందుటకు కావలసిన పద్యములను వ్రాసియుంచి, పూజ మున్నగునవి నెరవేర్చుకొనుటకై గురువుగారు వెడలిరి. తక్కినవారును సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి. నాడు మొదలు ప్రతిదినము ప్రొద్దున పద్యములు వ్రాసి సాయంకాలము సభామోదము పొందుట పరిపాటియై పోయినది.

కొంతకాలము ఆచార్యులు చెప్పెడు పద్యములు వ్రాయుటయు, ఆమోద-సభలో చదువుటయు - అను ఈ పనులు నేను చేయుచుంటిని. 'నేర్చి చదివెడు' నుద్యోగము వహించుచున్న నాకు ప్రత్యేకముగ పాఠము చదువుటకు వీలుకాలేదు. అయినను మాణిక్యవాచకర్‌చరిత్రనుగురించి జరిగిన విమర్శవలన నేను మిగుల లాభమును పొందితిని. తమిళపురాణములు కొన్ని చదివినప్పుడు వాని పాఠము వినుటవలన నేర్పడు ప్రయోజనముకన్న హెచ్చు లాభమే కలిగెను.

నేను పద్యములు 'నేర్చి చదివెడి' యుద్యోగమున చాల కాల ముండలేదు. నా దురదృష్టము నడుమ జొచ్చినది. నాకు జ్వరము వచ్చినది. దానికితోడు కడుపులో 'బిళ్ల' యేర్పడి హింసింపదొడగెను. విరేచనములును అగుచుండినవి. పద్యములు వ్రాయుటయు, ఆమోదసభలో చదువుటయు నేను మానుకొనవలసివచ్చెను. లేవ. లేక పడుకొనియే యుంటిని.

మా యుపాధ్యాయులు తిరుప్పెరుందురైకు వచ్చినది మొదలు ఉత్సాహముగ నుండిరి. పలువురు స్నిగ్ధులతోడి సల్లాపమును, అచ్చట తమకై యొనర్చెడి యుప-

చారములను దానికి కారణము. ప్రతిదినము ప్రొద్దున మొదలు రాత్రి చాల ప్రొద్దు పోవువరకును తమ్ము గౌరవించి యాదరించు జనుల నడుమ నుండి సంపాదించు పరిచయమువలన దుఃఖహేతువులగు నితరస్మృతులు తల యెత్తుటకే యవకాశము లేదు.

మధ్యలో నా కేర్పడిన వ్యాధి వారి ప్రశాంతమానసికస్థితిని కలచివేసెను. నేను 'నా దురదృష్ట మిట్లు దాపురించినది' అని తలచితిని. వారో "రావిచెట్టును పట్టిన దయ్యము విఘ్నేశ్వరునిగూడ పట్టిన చందాన నన్ను పట్టిన శనైశ్చరుడు నన్ను జేరినవారినిగూడ బాధించుచున్నాడే!" అని చెప్పి వగచిరి.

పురాణసభామోదము జరగని సమయములందు నా చెంతనే యుండి గమనించుచుండిరి. తగిన వైద్యులను రావించి చికిత్స చేయించిరి.

నేను రోగమువాతపడినందున ఆచార్యులు చెప్పెడు పద్యములను వేరొకరు తాళపత్రముల వ్రాయుచుండిరి. సభామోదము జరుగుచుండగ పద్యములు చదువు పని శివగురునాథపిళ్లైగా మారిన శవేరినాథపిళ్లై స్వీకరించిరి.

పిళ్లైగారికి నా యనారోగ్యమువలన నేర్పడిన మనఃక్లేశ మెల్లరికిని తెలిసెను. ఒక్కొక్కదినమునను సభామోదము జరిగిన వార్త శవేరినాథపిళ్లై వచ్చి నాకు చెప్పుచుండిరి. పిళ్లైగారును చెప్పుట కలదు.

పిళ్లైగారియొద్దకు వచ్చిన తరువాత ఇది మూడవసారి వచ్చిన జబ్బు. మునుపు అనారోగ్యము సంభవించిన కాలముకంటెను ఇప్పుడు సంభవించిన కాలము మిగుల ముఖ్యమైనది. పరిషదామోదమహోత్సవమున కలిసికొని సంతోషించు భాగ్యము నది యడ్డుకొన్నది. రానురాను అనారోగ్య మధిక మాయెను. జ్వరాధిక్యముచేత కొన్ని వేళల నేను స్మృతిలేక పడియుంటిని. ఆచార్యులకును, పెరవారలకును దిగు లధిక మాయెను. ఇక నిచ్చట నున్నచో ఎల్లరకు నసౌకర్యముగ నుండు నని యరసి నేను గురువుగారితో "మా యూరుకు పోయి మందు పుచ్చుకొని గుణమైన వెంటనే మరలి వత్తును" అని చెప్పితిని.

దానిని వినగనే వారికి దుఃఖ ముబికి వచ్చెను. "పరమశివుడు మనల మిక్కిలి పరీక్షించుచున్నాడు. మీ కారోగ్యము బాగుగ నున్నప్పుడు ఇచ్చటనే యుండి

సహాయపడుచుండురు. ఇప్పు డనారోగ్యము కలిగిన దని యూరికి పంపుచున్నాము. అసౌఖ్యమును మార్పు మనకు వీలుకాలేదు. మీ తల్లిదండ్రు లే మనుకొందురో!" అనిరి.

"వా రేమియు ననుకొనరు. అయ్యగారి గాఢవాత్సల్యము వారు బాగుగ నెరిగిన వారు." అని నే నంటిని. గురువుగారు నా యోచన నంగీకరించిరి.

తగిన యేర్పాట్లు చేసి వారు న న్నుత్తమదానపురమునకు బంపిరి. ఎడబాయ మనసు లేకయే అవుడైయార్‌కోవెలను వదలి యుత్తమదానపురము వచ్చి చేరితిని.

# 30. పురాణ ప్రవచనము

నా జననీజనకులు ఉత్తమదానపురమునందే యుండిరి. గొప్ప వైద్యు డొకడు నా దేహస్థితి పరీక్షించినాడు. జ్వరపు బిల్ల ఉన్న దని చెప్పి మం దిచ్చినాడు. ఆ బిల్ల రానురాను కరగిపోవుచుండెను. జ్వరముకూడ తగ్గిపోయెను.

శ్రీముఖనామసంవత్సరము మాశినెల ఆరంభమున (1874 ఫిబ్రవరి) నేను ఉత్తమదానపురమున కరిగితిని. అచ్చట నొక మాసకాలము చికిత్స నొందితిని. పిళ్లైగారియొద్ద పాఠములు నేర్చిన గ్రంథములను చదువుకొనుచునే ప్రొద్దు పుచ్చితిని.

ఇరుగుపొరుగుల గల 'మిరాసిదారులు' నాయెడను, మా నాయనగారియెడను ప్రీతి యుంచి మాటిమాటికి వడ్లు పంపుచుండిరి. ఐనను కుటుంబనిర్వహణము శ్రమావహముగనే యుండెను. దానితోబాటు నా వివాహమునకై చేసిన యప్పులో 150 రూప్యములు చెల్లిపోక నిలిచి యుండినవి. ఆ సంకటము మరియొక దుఃఖము కలిగించెను. దేహములో నున్న జబ్బు రానురాను తగ్గిపోవుచున్నను మనస్సులో నేర్పడిన జబ్బు వృద్ధిపొందుచుండెను. నే నంతవరకు కుటుంబభారమును నెత్తిన వేసికొనక యుంటిని. మా నాయనగారు రానురాను విరక్తు లగుచుండిరి. పినతండ్రిగారో కుటుంబభారము మోయలేక తల్లడిల్లిరి.

'ఇట్టి దశలో మన మేమియు సాయము చేయక యుండుట ధర్మము గాదు' అని భావించితిని. 'ఇక కుటుంబఋణము తీర్చుటలో మనకు వీలయినంతవట్టు ఏమైన చేయవలెను' అను సంకల్పము దృఢముగ నేర్పడుచుండినది. 'పిళ్లైగారిని వదలి వచ్చితిమి. మరల నచ్చుటకు పోవలదా ? కుటుంబభారము మోయుట ఎప్పుడు నుండునదే. పిళ్లైగారియొద్ద నుండి విజ్ఞానము పెంపొందించుకొనుట కనువగు ఈ సందర్భమును మనము జారవిడువరాదు'. అని మరియొక యాలోచన తోచెను. 'మనము ఋణగ్రస్తుల మనుకొన్న వారును అట్లే యున్నారే ! ఎట్లైనను, అప్పులు తీర్చుకొన్నచో పిదప యథాపూర్వముగ వారియొద్దకు పోయి చేరవచ్చును. అప్పు పెరుగనీయరాదు.' అను సంకల్పమే మీరి నిలిచినది.

మా నాయనగారొక్క యుక్తి చెప్పిరి. "శెంగణము మొదలగు ప్రదేశముల కరిగి ఏదేని పురాణప్రవచనము చేసినచో ధనము లభించును. దానితో అప్పు తీర్చి వేయవచ్చును." అని వా రనిరి. వారు తమ యనుభవమువలన తెలిసికొనిన విషయ మది. తా మా ప్రాంతముల సంచారము చేసి కథాప్రవచనములు చేసినట్లు నేను చేసినచో శ్రేయస్సాదగూడు నని వారు తలచిరి. వారు చేసిన పనియే నేనును 'అరటి చెట్టుక్రింది యరటిమొలకవలె' చేయవలె నని వారు మును పనుకొనిన భావము అప్పుడు నెరవేరవచ్చు నని వారి నమ్మిక.

నాకు వారు నుడివినది యుచితముగనే తోచెను. క్రొత్త యుద్యోగ మొకటి వహించి క్రొత్త మనుష్యులతో పరిచయము సంపాదించుకొనుటకంటె, పరిచితమైన ప్రదేశమున వంశపారంపర్యముగ వచ్చిన యుద్యోగమున జొచ్చుట సులభము కాదా ? శెంగణము మున్నగుచోట్ల నున్నవారి స్వభావమును నేనును తెలిసికొంటని. తమిళ గ్రంథప్రవచనము చేసినచో మిక్కుటమగు మతింపు. ఆర్థికసహాయముకూడ లభించు ననియు నెరుగుదును. ఆయుస్సంతయు పురాణప్రవచనము చేయుచు పుణ్యము, ప్రఖ్యాతి, ధనముకూడ నేకకాలమందే పొందవచ్చును.

అంతయు సత్యమే. అయిన, నా తమిళవిద్యోపార్జన యంతటితో కట్టిపెట్ట వల సినదేనా ? పిళ్లైగారి యసాధారణసౌభాగ్యమైన వాత్సల్యము, వారిమూలమునవైన తిరువావడుదుఱయాధీనపరిచయమును పొందిన వెనుక, వానిని మరచి యూరూరుగ

దిరుగుచు అలియుచు జీవనము చేయుట సబబా? భగవంతు డిట్టి దశలో వదలి పెట్టునా?

నా మన సిట్లెల్ల పలువిధముల వ్యాపించి, విస్తరించి యెన్నియో యూహించి వది. 'ఇప్పుడు మెడ పట్టుకొని యిరుకున బెట్టి నొక్కెడి ఋణబాధను తీర్చుట ముఖ్యకర్తవ్యము' అను తలపుతో శెంగణమునకు పోవుద మని మా నాయనగారి యొద్ద చెప్పితిని. వారికి కల్గిన తృప్తికి మేర లేదు. ఋణవిముక్తికి త్రోవ కనిపించిన దనునది మాత్రమే యా తృప్తికి కారణము కాదు. తా మలవడిన ప్రదేశములను మరల చూడవచ్చు ననెడి యౌత్సుక్యమే ముఖ్యకారణము.

నేమను మా తండ్రిగారును నిర్ణయించుకొనినట్లే భవసంవత్సరము 'వైగాశి' నెల (1874, జూన్) యంతమున శెంగణముముఖమై తల్లిదండ్రులతో బయలు దేరితిని. మొదట అరియలూరికి జని యచ్చట నొక్కపూట బస చేసితిమి. పిదప కున్నముమార్గముగా శెంగణము చేరితిమి. అక్కడ వృద్ధాచలరెడ్డియారును, ప్రాతమిత్రులు కొందరును మమ్ము జూచి మిక్కిలి యానందభరితులైరి. నన్ను చూడగనే వృద్ధాచలరెడ్డిగారి యుల్లము సంతసమున నుప్పొంగినది. మమ్ము మునుపే యెరిగినవారు ఒక్కరొక్కరుగ వచ్చి వచ్చి చూచి ప్రియమార ముచ్చటించి యానందించిరి.

మును పచ్చట కాపుర మున్న రోజులలో చూడని యొక క్రొత్త విషయము నప్పుడు కనుగొంటిని. నేను పిళ్లెగారియొద్ద పాఠములు వినినవాడ నగుటచే నా కొక యసాధారణగౌరవ మేర్పడెను. పిళ్లెగారి విద్యావైభవము, కవిత్వశక్తి మున్నగు వానినిగూర్చి యెల్లరును ఏమేమో కథలవలె చెప్పిరి. వారియొద్ద తమకు తెలిసిన యొకరు విద్యార్థిగ నున్నా రనుటలో వా రొక తృప్తిని, గౌరవమును పొందిరి. నా విద్యాభివృద్ధి నభిలషించువారిలో ఆ ప్రదేశమునగల మిత్రులనుగూడ చేర్చుకొనవలెను.

అంతకు మునుపు నేను మా నాయనగారిపై ఆధారపడి యుంటిని. వచ్చెడువా రందరును వారికి మర్యాదలు చేయుచు, వారి సంగీతము వినుచు నుండిరి. ఇప్పుడో, మా నాయనగారు ఎన్నానుకొని నిలుచు దశలో నుండిరి. నాతో మాట లాడుటయందును, నా మూలముగ విషయములు తెలిసికొనుటయందును మిత్రు

లాసక్తి చూపిరి. "అంతయు పెద్దయ్యగారు చేసికొన్న పూజాఫలము!" అని మా నాయనగారిని శ్లాఘించి విరమించినపుడు వారికి మా తండ్రిగారి యెడ నుండు ప్రేమ వ్యక్తమైనది.

వృద్ధాచలరెడ్డిగారి పిల్లలకు నైషధము మున్నగు పాఠములు నేర్పుచుంటిని. మరికొందరు బాలురును నా యొద్ద పాఠములు వినిరి.

కావలసిన వస్తువులు పొందుచు మే మచటనే సుఖముగ నుంటిమి. ఆహారాది సౌకర్యములందు మా కే కొదవయు లేదు గాని, అప్పు చెల్లించుటకు కావలసిన యార్థిక సహాయముమాత్రము దొరకలేదు. నే నాలోటును వృద్ధాచలరెడ్డిగారి పెద్దకుమారులగు నల్లప్పరెడ్డిగారియెడ తెలుపుకొంటిని. వారు, చేరువగనున్న 'కారై' (కారైక్కుడి) అను గ్రామమున వసించెడు సంపన్నులును, మిత్రులును అగు కృష్ణస్వామి రెడ్డిగారియొద్ద మాకు సహాయము చేయవలె నని చెప్పి, వారి యంగీకారము పొంది, మమ్ము 'కారైక్కుడి'కి పంపిరి.

కారైక్కుడియందు 'తిరువిళైయాడల్ పురాణము' చెప్పవలె నను నిర్ణయము చేయబడెను. ఊరిలో నున్నవారికి తెలియజేసి, ఆ ప్రయత్న మందరు నాదరించునట్లు చేసిరి.

పురాణప్రవచనము శుభముహూర్తమున నారంభింపబడెను. నా ప్రథమ ప్రయత్న మగుటచే నేను మిగుల జాగరూకుడనై యుపన్యసించుచుంటిని. దినదినము నను సూర్యోదయమువేళకే మాకు కావలసిన బియ్యము మున్నగు నాహారపదార్థములును, కాయగూరలును వచ్చును. మా తల్లిగారు వానిని చూచి తమ యుల్లము చల్లబడ మురియుదురు. అట్టివే యగు మర్యాదలు మునుపు మా నాయనగా రుపన్యసించుచుండినపుడు చూచియుండినను, ఇవి యిప్పుడు నేను సంపాదించిన వను భావమే యా సంతోషమునకు కారణము. 'బిడ్డ తన చేతులతో సంపాదించినాడు." అని యొక్కొక వస్తువును చేతుల నెత్తియెత్తి యుంచుకొందురు.

మా తండ్రిగారును దిగులు లేక ఆనందముగ శివపూజయు, ఈశ్వరధ్యానమును చేసికొనుచునుండిరి. భగవంతు డిట్టి దశలో కుటుంబమున కుపయోగపడునట్లు మనల చేసినాడు గదా అను భావముచే నాకుగూడ తృప్తియు, నుత్సాహమును కలిగినవి.

ఇంతలో యానందములోను నడుమ నొక బెంగ తలచూపినది. నేను పురాణ ప్రవచనము చేయ నారంభించిన ఆ ప్రాంతములందు వానలు లేకుండెను. అందుచే గ్రామవాసు లుత్సాహము లేక యుండిరి. కృష్ణస్వామిరెడ్డిగారును, మరి కొందరును గ్రామస్థులొద్ద ఉపన్యాసవిషయ మెత్తి చెప్పి, వా రిచ్చు ధనము కూడబెట్టి పురాణ సమాప్తిసమయమున నాకు సమ్మానము చేయ సంకల్పించియుండిరి. వానలు లేవను వెలితిచేత ఆ ప్రయత్నము తలపెట్టుటకు వారి కుత్సాహము పుట్టలేదు. పురాణము పూర్తిగ నెరవేర్చుటకు చాలినంత సహాయమైనను లభించునా యను సందేహము కూడ కల్గెను. మీనాక్షీపరిణయఘట్టముతో నిలుపుకొనవచ్చు నని తలంచియుండిరి.

పురాణమందు 'నాట్టుప్పటలమ్' నడచినది. నేను నా సంగీతపరిచయ మును, తమిళ్ గ్రంథపరిశ్రమను చక్కగ నుపయోగపెట్టితిని. నేను నేర్చిన గ్రంథములనుండి యుదాహరణము లెత్తి యిచ్చి యర్థము వివరింతును. వినెడువారు "వీ రెన్ని పుస్తకములు చదివియున్నారు?" అని యాశ్చర్యపడుదురు.

నా యదృష్టవశమున ఒకనాడు ప్రవచనము సాగుచుండగనే పెద్ద వర్షము కురిసి భూమిని, మనుష్యుల మనస్సులనుగూడ చల్లబరచెను. అందుచే నచ్చట నున్నవారు పండించు పైరులలో ఫలిత ముండెనో లేదో, నే నొనర్చు పురాణప్రవ చనకృషిలో మాత్రము మంచి ఫలితము దక్కినది. "తిరువిళైయాడల్ పురాణ మారంభించినందుననే వాన కురిసినది." అను మాట జనులమధ్య వ్యాపించెను. అప్రతీక్షితముగ నాకు మతింపు పెరిగెను. తరువాత పురాణప్రవచనము నిలిపి వేయవలె నను మాట వారు బొత్తిగ మరచిపోయిరి.

పురాణకాలక్షేపము ఊరిమధ్య నున్న విఘ్నేశ్వరాలయమున జరిగినది. ప్రతిదినము రాత్రి ఏడు గంటలు మొదలు పది గంటల వరకు సాగును. ఇరుగు పొరు గులనుండి పలువురు వత్తురు. వాన కురిసిన తరువాత వచ్చువారి సంఖ్య పెరిగినది. శ్రోతల సంఖ్య పెరుగను పెరుగను మేము పొందెడి యాదరముకూడ పెరుగు చుండెను.

రోజుకు రోజు జనుల యుత్సాహము, ఆదరమును అధిక మాయెను. నాకును ఉపన్యసించుటలో దిట్టతనము కలిగెను. ఇట్టి దశలో నా మనసుమాత్రము నడుమ నడుమ బాధపడుచునే యుండెను. ఉపాధ్యాయుల నెడబాసి యుండుటయే దానికి కారణము.

నేను తిరువిళైయాడల్ పురాణము ప్రవచనము చేయుచున్నట్లును. త్వరలో దానిని సమాప్తి నొందించి పాఠము విన రావలచియున్నట్లును మా గురువుగారికి వ్రాసితిని. గురువుగారు ప్రత్యుత్తరము వ్రాయుదు రని నమ్మియుంటిని. వారియొద్ద నుండి ఒక్క జాబుకూడ రాలేదు. నే నెన్నో నెలలుగ వదలియుండుటవలన వారికి కోపము వచ్చెనో, లేక నేను వచ్చెద నని వ్రాయుట వారు నమ్మలేదో యని తలచితిని. నే నాచార్యులవారిని చూచిన మొదటి దినమున "ఎందరో వచ్చి చదువు కొందురు. కొంత కాల ముండి పోవుచుందురు." అని వారు చెప్పినది నా స్మృతికి దోచినది. "అట్లు విడిచిపోయినవారిలో నన్ను నొక్కనిగ పరిగణించిరేమో !" అని తలచినప్పుడు నాకు ఇట్టి దని చెప్పరాని దుఃఖము తలయెత్తెను. 'మన మిచ్చటికి వచ్చినది తప్పు. వారి నెడబాసి యిన్ని నెలలు వసించియుండుట నిజమైన ప్రేమ కనుచితము' అని తలచితిని. ఈ సంకల్పము నా మనస్సులో నుదయింపగనే కార్తెక్కుడిలో జరిగిన కాలక్షేపము, అచట నున్నవారి యాదరము, ప్రకృతిదృశ్యముల రామణీయకము మున్నగువాని నన్నిటిని మరచితిని. ఏమి యున్న నేమి? ఆచార్యుల ప్రేమ లేని చోటు స్వర్గలోకమై యున్న నేమి? ఆచార్యుల వియోగ దుఃఖానలము ఈ ప్రదేశ మంతయు ఎడారి చేసివేసినది. వందలకొలది జనులు ప్రేమతో నాదరించుచున్నను ఆ యొక్కరు లేని లోటే పెద్దదై తోచెను. అందరి యెదుట నిలిచి యుచ్చస్థానమం దుండి ప్రవచనము చేసినను మా యాచార్యుల వెనుక గంటము, తాటియాకులు చేతబట్టి నిలిచి, వారి ప్రేరణ తెలిసి నడచుకొనుటయం దున్న సుఖముకంటె నది గొప్పదిగ తోపలేదు.

"త్వరలో పురాణమును ముగించుకొని పిళ్లైగారియొద్దకు పోవలెను" అని మా నాయనగారియొద్ద చెప్పదొడగితిని.

వా రింకను కొన్ని నెల లచ్చటనే వసింపవలె నని యభిలషించిరి. నా విద్య ఆ మితిలోనే నా జీవికకు పర్యాప్త మనికూడ వారు తలచియుండవచ్చును. నా యభిప్రాయమును వారు కా దనలేదు, ఔ ననలేదు.

తిరువిళైయాడల్ పురాణము ఒక విధముగ సమాప్త మైనది. ఒక పురాణము పూర్తి యగుచో కడపటి దినము పెద్ద యుత్సవమువలె జరిపించి, అందరును కూడి పౌరాణికులకు సమ్మానము చేయుట యాచారము. కార్తెక్కుడియందును, పౌరా-

గూళ్లలోను ఉన్నవారు, తమ తమ కెంత సహాయము చేయ వీలగునో అంతయు చేయ సిద్ధముగ నుండిరి. కృష్ణస్వామిరెడ్డియారు అందరియొద్దనుండియు డబ్బు ప్రోగు చేయుచుండిరి. మొత్త మంతయు చేర్చుటకు కొన్ని దినములు పట్టినది. అందుచేత పురాణమందు కడపటి పటలముమాత్రము చెప్పక దానికి వెనుకటి పటలమువరకు నేను చెప్పి ముగించిన తరువాత కొన్నాళ్లు ప్రవచన మాగియుండినది.

'పిళ్లెగారు కమ్మ వ్రాయలేదే' అను విచారము నా హృదయమున గ్రుచ్చుచునే యుండెను. కాలక్షేపమును కొన్నాళ్లు ఆపవలసిన సమయము సంఘటిల్లగనే ఆచార్యులవారిని పోయి చూచి వచ్చుటకు అదియే సరియైన యదనని తలచి నా తలి దండ్రులను కారైక్కుడిలో వదలిపెట్టి నేను తిరువావడుదురకు బయలుదేరితిని. నా యావేగమును చూచిన మా నాయనగారు నా కడ్డు చెప్పలేదు. "పోయి అచిరకాలములో రమ్ము. పురాణసంపూర్తిని చాల దినములు నిలిపియుంచరాదు" అని మాత్రము చెప్పి పంపిరి.

ఏనాడు బయలువెడలితిని, ఎట్లు నడచితిని— మున్నగువానిలో నా కేదియు జ్ఞప్తిలో లేదు. అవిష్టునిభంగి కారైక్కుడి వదలి బయలుదేరినవాడను తిరువావడుదురకు పోయి నిలిచితిని. తిరువావడుదుర పొలిమేర త్రొక్కినపుడే నా నిసర్గచైతన్యము నాకు వచ్చెను. తిన్నగ మఠమునకు పోతిని. మొదట నొక మిత్రులు నన్ను గాంచగనే నా యోగక్షేమములు విచారించిరి. నేను వారికి బదులు చెప్పలేదు. "పిళ్లెగా రెచ్చట నున్నారు ?" అని వారిని విచారింతిని.

"వా రిచ్చట లేరు" అని సమాధానము వచ్చెను. నేను గ్రమాన్పడితిని. తరువాత నొక తంబిరానును చూచితిని. వారు నాతో మాటాడుటకు మునుపే వారి నుద్దేశించి "పిళ్లెగా రెక్కడ ?" అని యడిగితిని. "వారు 'అంబరు'కు పోయియున్నారు" అని వారు ప్రత్యుత్తర మిచ్చిరి.

నాకు తిరువావడుదురయం దుండ మనసొప్పలేదు. 'అంబరు'మొగమై బయలువెడలితిని.

ప్రొద్దున బయలుదేరి మధ్యాహ్న మొంటిగంటవేళకు 'అంబరు'కు చేరితిని. పిళ్లెగా రచ్చట స్వర్గపురమఠమున విడిసియున్నా రని యెరిగి నే నచ్చటికి చనినాను.

అక్కడ మా గురువుగారు మధ్యాహ్నభోజన మైన పిదప సలవాటుచొప్పున కునుకు దీయుచుండిరి. ప్రొద్దున మొదలు ఆహారము లేకపోవుటచేతను, చాల దవ్వు నడచి వచ్చుటచేతను మిక్కిలి యాకలియు, అలసటయు నేర్పడినవి. కాని యాచార్యులను చూచి ముచ్చటింపవలె నను యీ యాకలి వానిని మీరి యుండినది.

ఆచార్యులు మేల్కొనిరి. వారి తల్లిని వాత్సల్యపరిపూర్ణకటాక్షము నాపై ప్రసరించెను.

"స్వామినాథయ్యరా ?"

"ఔను."

తరువాత కొన్ని నిమిషములు ఇరువురము నేమియు మాటాడలేదు. మాటాడ వీలుకాలేదు. కన్నులే మాట్లాడుకొనినవి. నా కన్నులందు కన్నీటి చుక్కలుబికి వచ్చి చూపును మరగుపరచినవి.

"సౌఖ్యమా ?" అని యాచార్యు లడిగిరి.

"సౌఖ్యమే" అంటిని. నే నపరాధివలె దైన్యము తోచు గొంతుకతో బదులు పల్కితిని.

"పోయి చాల నా ళ్లుండిపోతిరే !" అని గురువుగా రడిగిరి.

దానికి నే నేమి బదులు చెప్పగలవాడను ? సాంసారికక్లేశములవలన నట్లు చేయవలసివచ్చె ననియు, ఒక్కొక్క దినమునను వారిని తలచి తలచి వగచితి ననియు పలికితిని.

"వీ రింకను భుజింపలేదు" అని చెంతనున్నవారు మాటలమధ్యలో తెలిపిరి. నేను భుజింపలేదను విషయ మప్పుడే నాకును స్మృతికి వచ్చినది.

"భోజనము కాలేదా ! మునుపే చెప్పకూడదా ! ముందు పోయి భుజించి రండు" అని యాచార్యు లానతిచ్చిరి. పోయి వేగిరముగ నోగిరముగొని వచ్చితిని.

పిదప నిరుపురము ముచ్చటించుకొనుచునే యుంటిమి. పది నెలలుగ అణచి పెట్టుకొనిన ప్రేమ పొంగి గట్లు త్రెంచుకొని పొరలి పారినది. నా హృదయపుటాకలి యొక విధముగ నణగినది. ఆచార్యులు ఋణబాధనుండి విముక్తులు కాలే దని నేను తెలిసికొంటిని. అంబర్‌పురాణసభామోదమునకై వా రటకు వచ్చుటకు కారణము ఆర్థికసహాయము పొందవచ్చు నను తలపే యని యూహించి యరసికొంటిని.

అంబరునందు కొన్ని దినము లుపాధ్యాయులయొద్ద కొన్ని గ్రంథముల పాఠము చదివితిని. అచ్చట పది దినములు బస చేసితిని. తరువాత "కారైక్కుడికి పోయి పురాణము పూర్తిచేసికొని వచ్చెదను." అని యాచార్యులతో చెప్పితిని. వారికి అనుమతింప మనస్సు రాలేదు. నా ప్రయాణ మాపుటకును మన సొప్పలేదు. "సరి. పోయి రండు. వేగ మరలి రండు" అనిరి.

నేను వారిని వదలిపెట్టుటకు మనస్సు రాకయే యనుమతి వడసి కారైక్కుడి వచ్చి చేరితిని. అటకు వచ్చిన వెంటనే తిరువిళైయాడల్‌పురాణప్రవచనము సమాప్తి నొందించు విషయమున నాకు త్వర యధిక మాయెను.

అందుల కొక శుభదినము నిర్ణయింపబడెను. నిర్ణీతదినమున ఊరంతయు జనసమూహములతో నిండియుండెను. ప్రవచనము జరుగుచుండిన విఘ్నేశ్వరాలయముముం దున్న పందిరి విప్పి, ఒక పెద్ద పందిరి వేసిరి. అరటి మ్రాకులు, పోకలు, ఎలనీరుకాయల గుత్తులు, మామిడాకు తోరణములు, తెరుబట్టలు మొదలగు వానిని కట్టి పందిరి యలంకరించిరి. గొప్ప తిరునాళ్లవలె నందరు నుత్సాహముతో నుండిరి. సాయంకాలమునకు మునుపే ప్రవచన మారంభింపబడెను.

ప్రవచనము మంగళాశాసనముతో నెరవేరినది. పిదప సమ్మానములు పలు విధముల వచ్చినవి. వస్త్రములు, ధనము.అన్నియు లభించినవి. రెండు వందల రూపాయల వరకు రొక్కము లభించెను. ఖర్చులకై చేసిన చిన్న చిన్న యప్పులు తీర్చివేయగ నూటయేబది రూప్యములు మిగిలినవి. ఈ రొక్కముతో వివాహమునకై పుచ్చుకొనిన యప్పులో మిగిలియుండినదానిని తీర్చివేసితిమి.

అందరియొద్దను అనుజ్ఞ పొందితిని. ముఖ్యులలో నొక్కరొక్కరును ప్రత్యేకముగ వచ్చి "అయ్యగారు మమ్ము మరవరాదు. మీ కొరత తీర్చికొని, యిచ్చటికే

వచ్చియుండి మా కొరతయు తీర్చవలెను." అని వేడుకొనిరి. వారి మాటలలో నెంత ప్రేమానురాగములు! ఎంత మార్దవము! ఎంత ప్రపత్తిభావము! భగవంతుడు ప్రేమ అను నొక గుణమును మనుజుల మనఃకుహరములందు దాచియున్నాడు. ఆ మేలగు సంపద లేనిచో ఈ లోకము నరకలోకముతో సమానమైపోవును.

నేను పయనమైనపుడు మా యమ్మగారు ఒక 'మైలు' దూరమువరకు వెంబడి వచ్చి, విడిచియుండ మనసు రాక కన్నీరు ధారలుగట్ట "దేవుడే కాపాడవలయును" అని చెప్పి వీడ్కొనిరి.

# 31. ఆచార్యుల అనారోగ్యము

నేను లిన్నగ తిరువావడుదుఱ వచ్చి చేరితిని. అంబరులో పురాణము పరిషదా-మోదము పొందిన పిదప నాచార్యులు తిరువావడుదుఱకు వచ్చిరి. నేను వారిని చూచిన వెంటనే "క్రమ్మర పోయెడి యుద్దేశము లేదుగదా? ఇచ్చటనే యుండవచ్చునుగదా?" అని యడిగిరి.

"ఇచ్చటనే యుండి పాఠము వినుటయే తప్ప నాకు వేరు పనియే లేదు." అని చెప్పితిని. తల్లిదండ్రుల కుశలోదంతము మొదలగునవి వారు పరామర్శించిరి.

అటుపిమ్మట "సన్నిధానశ్రీవారిని పోయి చూచి రండు. కొన్ని నెల లుగ మీరు చూడలేదుగదా?" అని యాచార్యులు చెప్పగనే, నేను మఠమునకు నరిగి శ్రీ సుబ్రహ్మణ్యదేశికులను చూచితిని.

"ఎన్నో నెలలుగ మిమ్ము చూడలేదు. పిళ్లెగారు సారెసారెకు మిమ్ముగూర్చి ప్రస్తావించుచుందురు. క్షేమమే కదా?" అని దేశికు లడిగిరి.

నేను తగినట్లు ప్రత్యుత్తర మిచ్చితిని. పిదప "పిళ్లెగారికి మీవంటివా రొక్కరు ఎల్లప్పుడు దండ నుండవలెను. వారికి మునుపటివలె దేహదార్ఢ్యము లేదు. పాఠము చెప్పెడు విషయమున నధికముగ వారి నాయాసపెట్టరాదు. వారియొద్ద వినవలసిన పాఠ-

ములు మీరును, ఇతరులును వినుచు రండు. క్రొత్తగా వచ్చినవారికి మీ వంటి ప్రాత విద్యార్థులు పాఠము చెప్పవచ్చును. పిళ్లెగారికి కొంత శ్రమ తగ్గును. మఠమునందు విద్యార్థుల సమూహ మధికముగా నుండుట చూడ మాకు కడు సంతసముగ నున్నది" అని దేశికులు ప్రేమతో బలికిరి.

నేను వినయముతో సెల వొంది పిళ్లెగారి పజ్జ చేరితిని. కంబరామాయణము వినవలె నను నా యుత్కంఠ నుపాధ్యాయులకు తెలియజేసితిని. కుమారస్వామి తంబిరాను, కవేరినాథపిళ్లెయు, మరికొందరును నాతో చేరియే ప్రార్థించిరి. ఆచార్యులు మా యభీష్టము మన్నించి యా మహాకావ్యమును మొదటినుండియే పాఠము చెప్ప నారంభించిరి.

'శీకాళి' తాలూకాలో 'ఇడమణల్' అను గ్రామమున మా పినతల్లిగారి పెనిమిటి 'కరణీకము' నిర్వర్తించుచుండిరి. వారి పేరు సుందరమయ్యరు. శాంత స్వభావమును, 'చలాకీ'తనమును గలవారు, సంగీతజ్ఞానసంపన్నులు, శివభక్తి యుక్తులు. తిరువావడుదురయం దాకాలమున కరణముగ నున్నవారు వేరొక గ్రామమునకు పోవలె నను నుద్దేశముతో నుండిరి. మా పినతండ్రిగారు తిరువావడుదురకు రావలె నని యభిలషించిరి. ఈ యిరువురును తమలో మాట్లాడుకొని స్థానములు పరస్పరము మార్చుకొనిరి. ఇట్టి యేర్పాటువలన మా పినతండ్రిగారు తిరువావడుదురకు తమ కుటుంబముతోబాటు వచ్చి చేరిరి. దానికి నా ప్రయత్నముకూడ కారణమై యుండెను.

వారు తిరువావడుదుర వచ్చినపుడు "ఇకమీదట నే విచారము లేక సరియగు వేళల భోజనము చేసికొనుచు, వీరి రక్షణలో నుండవచ్చును" అని తలచితిని. వారి యింట భుజించుచుండదొడగితిని.

మా గురువుగారు కంబరామాయణము పాఠము చెప్పుచుండిరి. కంబరామాయణ మందలి తులలేని తియ్యందనము, వారికి తమిళభాషపై నున్న యభిమానమును ఆ పాఠము నడచుటకు కారణము. కాదేని అట్టి దశలో నుపాధ్యాయులు విద్యార్థులకు పాఠము చెప్పుటే సాధ్యము కాదు. వారి శరీరము శైథిల్య మొంది యుండెను.

'పిత్తపాండువు' అను వ్యాధి వారిని పట్టుకొన్నది. వారి పాదములు పట్టి పీడించి, కడుపుకూడ వాచునట్లు చేసెను. మాటి మాటికి అలసటయు, బలహానియు కలుగు చుండెను.

స్వాభావికముగ పాఠము చెప్పగల యుత్సాహము వారి కిప్పుడు లేదు. ప్రతి దినము నూరు, నూటయేబది పద్యములు జరుగుచుండినవి. ప్రతిపద్యమునకును అర్థము చెప్పలేదు. మేము చదువుకొనుచునే పోవుచుందుము. అటనట రసభరితమగు భాగములకే సంగ్రహముగ నర్థము చెప్పుదురు. మాకు పాఠము చెప్పుట నామమాత్ర ముగ నుండినది. కాని వారు వానిని పూర్ణముగ ననుభవించిరి. రామాయణపద్య ములు వారి బలహీనదశలో మందువలె పనిచేసినవి.

ఎడనెడ కంబకవి పలుకుబళ్లను కొనియాడి మనసు కరిగి యనుభవింతురు. కొన్ని పద్యములు మరల మరల పలుమారులు చదువు మని చెప్పెడువారు. వానిని వివరించి చెప్పి ఇవి యివి యిందులో నున్న నయగారపు సొంపు లని యెత్తిచెప్పుట యందుకంటె, పలుమారులు చదివించి విని యనుభవించుటయందే వారి కధికసుఖ ముండెను. కొన్ని పద్యములకు వారు మాటలతో నర్థము చెప్పుట లేదు. కన్నీరు జాలువారగ కరగిపోవుచున్న వారి సాత్త్వికభావములే వ్యాఖ్యాన మాయెను. "ఇకపై నిట్టివా రెవ్వ రవతరింతురు? ఏమి యందము! ఏమి యందము! యోచించి చేసిన రచనయా యిది! నిసర్గసిద్ధముగనే వచ్చెడు మాటలలోని మాధుర్య మెటు లున్నది!" అనుచుందురు. కంబకవిపద్యములు మనముకూడ తెలిసి యానందించుచున్నాము. వారును తెలిసి యనుభవించిరి. కాని మహాకవులగు వారు పొందిన యనుభవము మన కుండునా?—అన్నది సందిగ్ధమే! కవుల యుల్లమును కవులు తెలిసి యనుభవించు తీరే వేరు కాబోలు!

గురువుగారు కంబకవిని కొనియాడునపుడెల్ల నేను కంబకవికంటెను మాగురువు గారినే ఎక్కువ యని తలతును. 'ఇట్టి మహాగ్రంథము మునుపే వినకపోతిమే' అను చింత కలుగును. 'వీరి కీ వ్యాధి వచ్చియున్నదే! ఇదెట్లు పర్యవసించునో?' అను భయము కూడ నా మనస్సు నలయింపజేసెను.

ఐప్పశి నెలలో దీపావళికి తమ కుమారుల ప్రార్థన యంగీకరించి ఆచార్యులు మాయూరమునకు జనిరి. వారు వెడలునప్పుడు వారితోబాటు కొందరు విద్యార్థులును బయలుదేరి పోయిరి. ఆచార్యులవారికిని, వారితోడ నరిగినవారికిని దీపావళినాడు ధరించుటకై క్రొత్తబట్టలను సుబ్రహ్మణ్యదేశికులు పంపిరి.

నేను తిరువావడుదురయందే యుంటిని. మా పినతండ్రిగారితో దీపావళి స్నాన మొనర్చితి. మఠమునం దున్నవారికిని, తక్కినవారికిని అధీనకర్తలు దీపావళికై నూతనవస్త్రములు ప్రసాదించిరి. ఏ కారణముననో నాకు లభ్యము కాలేదు. తులామాస మైన వెంటనే ఆచార్యులవారిని పిలుచుకొని రావలె నని సుబ్రహ్మణ్య దేశికులు నన్ను మాయూరమునకు బంపిరి. నేను పోయి పిళ్లెగారిని చూచిన వెంటనే వారు మొదట నన్ను జూచి "దీపావళికై మీకు మఠమునుండి వస్త్రములు లభ్యము కాలే దటగదా?" అని యడిగిరి. ఆ విషయము వా రెట్లో తెలిసికొనిరి. అందుచే నాకు విశేషముగ విచారము లేకపోయినను వారిని మాత్ర మా విషయము మనసులో గ్రుచ్చుచునే యుండెను. "మఠములో చదువుకొను పిల్లవాండ్ర కందరికిని వస్త్రముల నిచ్చునపుడు మిమ్ము మాత్రము మరచుట పాడి కాదు. మీయెడ శ్రీవారి కెంతయో ప్రేమ యున్నదే; గమనింపవలదా?" అని వారు చెప్పిరి.

"పెద్ద గుంపులో మరచి యుండవచ్చును. లేదా యిచ్చినట్లు తలచి యుండవచ్చును. దీనికి మరియొకతీరు కారణ ముండదు." అని నేను సమాధాన మిచ్చితిని.

"సమాధానము వలదు. నిక్కువమైన కూరిమి బయలుపరచుట కనువగు సందర్భములు మనుష్యులకు సారెసారెకు సంభవింపవు. అట్లు సంఘటిల్లినపుడు దానిని బయలుపరపనిచో ప్రేమ యున్నట్లు చెప్పుకొనుటలో ప్రయోజన మేదియు లేదు. భాగ్యవంతుల కలక్ష్యముగా తోచు నొక్క చిన్న విషయము వాస్తవికప్రేమ నెదురు చూచువారికి మిక్కుటముగ మనమున వెలితి కలిగించును" అనిరి. ఆచార్యులవారి కా విషయమున నెంతటి మనఃక్లేశ ముండినదియు ఆ మాటలు విశదపరచినవి.

వారు దానితో నిలువలేదు. ప్రక్క నున్న యొక్కరిని బిలిచి వారియొద్ద పైక మిచ్చి, బట్టలకొట్టునకు పోయి, ఒక 'పదియారు పంచెలచాపు' కొని తె మ్మని, తెప్పించి తామే యాబట్టలకు పసుపు రాచి, నా చేతుల నుంచి "ధరింపుడు" అని వాత్సల్యము

తోడ బలికిరి. నే నట్లే వానిని కట్టుకొంటిని. దీపావళి నాకు రెండుసా ర్లయినది. తిరువావడుదురయందు అందరితోబాటు స్నానము చేసి యెల్లరకును సాధారణమైన దీపావళిపండుగు చేసికొంటిని. నాడు మాయూరమున ఆచార్యసన్నిధానమున వారి ప్రణయనిర్భరకటాక్షప్రవాహనిమగ్నుడనై, వారు తమ శ్రీహస్తములతో ప్రసాదించిన వస్త్రములు ధరించి మరియొక దీపావళి జరపుకొంటిని. నాడు నాకు కలిగిన యానంద మపారము.

న న్నొకసారి చూచి "ఇప్పు డెంత బాగున్నది!" అని చెప్పి ఒక నిట్టూర్పు పుచ్చినా రాచార్యులుగారు. అప్పుడు దీర్ఘకాలముగ నున్న ఒక లోటు తీర్చుకొనిన వారివలె వారు తోచిరి.

నేను వచ్చిన పని మెల్లగ వారియొద్ద చెప్పితిని. "ఇంకను కొన్ని దినము లిక్కడనే యుండిపోవచ్చును. మీరును ఉండుడు" అని వారు చెప్పగ నట్లే మాయూరము నందు కొన్నా ళ్లుంటిని.

ఒకనాడు మాయూరమున నంగడివీథిలో నొకచోట నొక్కడు రామాయణ మేడుకాండలును విక్రయించుచుండెను. రామాయణపాఠము చదువుచుంటు కాల మగుటచేతను, పెక్కు దినములుగ ఎరవు తెచ్చుకొన్న పుస్తకముతోడనే చదువు చుండుటచేతను వానిని చూచిన వెంటనే కొనివేయవలె నను అభిలాష కలిగెను. ఆ యభిలాష నెరవేర్చుకొన నాచేత ద్రవ్యము లేదు. వెల విచారించితిని. "ఏడు రూపాయలకు ఒక పైస కూడ తగ్గదు." అని ఆపణికు డనెను. ఎట్లయినను ఆ పుస్తకములు కొనియే తీరవలె నను కోరిక ప్రబల మాయెను. ఏ త్రోవయు కానరాలేదు.

పిమ్మట నచ్చటినుండి తిన్నగ తిరువావడుదురకు కొంచెము దూరము పరు గెత్తుచును, మరికొంచెము దూరము నడచుచును జని మా పినతండ్రిగారికి సంగతి చెప్పి ధన మడిగితిని. అప్పుడే వారికి జీతము వచ్చియుండెను. జీతమే యేడు రూపాయలు. వారు కొంచెమేని యడ్డు చెప్పక, ఆ రొక్కము చేత పెట్టినంతట, మరల మాయూరమునకు వచ్చి యంగడివాని యొద్దకు నేగి కంబరామాయణ మారు కాండలును, ఉత్తరకాండయు కొంటిని. తిరువావడుదుర పోయి వచ్చిన ఆయాసము ఆ పుస్తకము పొందిన యానందమున మరుగుపడిపోయెను.

పుస్తకములు చేత నిడుకొని విప్పారిన మోముతో గురువుగారిని డాసి వానిని వారియొద్ద నిచ్చితిని.

"ఏమి పుస్తకములు?"

"కంబరామాయణము. ఆచార్యుల శ్రీహస్తములనుండి పొందవలె నని యుంచితిని"

"వెల యెంత?"

"ఏడు రూపాయలు."

"రొక్క మెక్కడిది?"

నేను తిరువావడుదురకు నడచి పోయి ధనము తీసికొని వచ్చిన సంగతి వారికి నివేదించితిని. అది వినిన వెంటనే "అరరే! ఇందుకై యింత కష్టపడవలెనా? నాయొద్దనే పుస్తకము లున్నవే! వానిని తీసికొనవచ్చునే! నాయొద్ద నొక్కమాట చెప్పియుండరాదా? సరి. కొనినయైనది. బాగుగ చదివి పేరు, ప్రతిష్ఠ పొందవలెను" అని చెప్పుచు వానిని నా చేతులలో నుంచిరి.

వానిని పుచ్చుకొని కన్నుల కొత్తుకొంటిని. కొన్ని పద్యములు పాఠము వింటిని. ఎప్పటియట్లు ఆచార్యు లుండినచో అప్పుడు-నేను రెండు కాండలు పాఠము చదివియుందును. వారి శరీరాస్వాస్థ్యము తెలిసి నేను దుఃఖించితిని నా యెదలో నొకతీరగు భయము లోలో కుములుచునే యుండెను.

కొన్నాళ్లకు పిదప నాచార్యులు పల్లకిలో తిరువావడుదురకు వచ్చిరి. వారితో నున్న తక్కిన విద్యార్థులును, నేనును వారిని వెంబడించి వచ్చి చేరితిమి.

# 32. శివలోకద్వార మపావృత మాయెను

'యువ'సంవత్సరము కార్తికమాసారంభమున (నవంబర్, 1875) మా యాచార్యులు తిరువావడుదురై వచ్చిచేరిరి. కంబరామాయణమందు అయోధ్యా కాండము పాఠము నడచినది. వారి యస్వస్థతవలన ఒకరోజుకు ముప్పది పద్యములు మాత్రమే పాఠము విన వీలాయెను. తగిన వైద్యులు గమనించుచుండిరి. సుబ్రహ్మణ్యదేశికులు అడుగడుగున ఆచార్యులకు వలసిన సౌకర్యములు అమర్చుచుండు డని సెలవిచ్చుచుండిరి. వైద్యులొసగిన చికిత్స దేశికులు మున్నుగవారి ప్రీతిని తీర్చినదే గాని వ్యాధిని పోగొట్టుట కుపయోగపడలేదు. కాలము కలిసిరాలేదు. కుమారస్వామితంబిరాను, వారు చేసెడి పూజ తామే చేసి ప్రసాద మిచ్చుచుండిరి.

ఆచార్యుల దేహము బలహీనమయ్యు వారి గుణాధిక్యము మార్పు చెందలేదు. ఆ యస్వాస్థ్యమందు వారి జ్ఞానము, ప్రేమ, మర్యాద, గొప్పతనము శ్రేష్ఠములుగ తోచినవి.

ఆ పాడు రోగము ఆచార్యుల దేహమున నున్న బలమును కాలము గడచు కొలది తగ్గించినది. అస్వస్థతయు అధికమాయెను. పాఠము నిలచిపోయెను. పండు కొనినవారు పండుకొనియే యుండ నారంభించిరి. వారికి కావలసిన పనులు విడువక వెంట నుండి శవేరినాథపిళ్లై చేయుచుండిరి. నేనును వీలయినంతవరకు చేయుచుంటిని.

గురువుగారు 'దీర్ఘయాత్రకు' సిద్ధమై యున్నారను సూచన యెల్లరకు తెలిసి పోయెను. వారి కుమారులును, భార్యయు మాయూరమునుండి తిరువావడుదురైకు వచ్చిరి.

ఆచార్యులవారు పాఠము చెప్పుట నిలిపివేసినను మే మేదేని సందేహ మడిగి నపుడు దానిని తీర్చుచుండిరి. వారు తమకు అభిమానపాత్రములగు పుస్తకములను చదివించి వినుచుండిరి. నేనే చదువుచుంటిని.

వారు పడుకమీదనే పడుకొనియుందురు. వారి సమీపమునుండి శవేరినాథ పిళ్లై కాలుచేతులు తడవుచునే యుండిరి. నేను కూర్చొని తేవారమో, తిరువాచకమో

వారి చెవిలో పడునట్లు చదువుదును. ఇతరవిద్యార్థులును, ఆచార్యులవారిని చూడ వచ్చు మిత్రులును చుట్టుముట్టి యుందురు. అందరి కన్నులును గాఢమగు భీతిని కనుపరచును.

తేవారము చదువుచునే యుండునపుడు నా కేదేని సందియము పొడముచు. అది యాచార్యుల నడిగెదను. వారు నోలిదిమాటలతో విశదపరతురు. నడుమ నడుమ నిలిచి నిలిచి వివరింతురు. తేవారమందును, తిరువాచకమందును దీర్ఘకాలముగ పరిశోధన సలిపినవారగుటచే నేను సందేహమడుగగ వారిచ్చు సమాధానము పెన్నిధియై తోచును. విషయవైశిష్ట్యముమాత్రమే దానికి కారణము కాదు. అన్నియు ఉడిగిపోయిన దశయందును తమిళజ్ఞానముమాత్ర ముడిగిపోక ఆచార్యులు నుడివినవి యగుట నవి యత్యధికమైన విలువగలవిగ తోచినవి. 'ఆచార్యులు చివరి రోజులలో చెప్పెడు మాటలివి' అను జ్ఞాపకము లోపల నుండుటచే వారు చెప్పెడి యొక్కొక్క విషయమునను మనసు లగ్నముచేసి వింటిని. అట్లు వినెడు ఒక్కొక్క సమయమందును భవిష్యత్తు స్మృతికి వగిలి దుఃఖింపజేయును. 'ఇట్టి శ్రీసూక్తులు వినలేకపోవునట్టి కాలము దాపురించినదే' అను భావము నెంత ప్రయత్నించియు మార్చ వీలు కాలేదు.

తిరువావడుదురైయాధీనసంస్థాపకులగు శ్రీ నమశ్శివాయమూర్తి గురుపూజ తై మాసమున వచ్చెను. ఆలయమున నుత్సవమును ఆరంభమాయెను. మఠమందును, ఆలయమందును ఉత్సవములు ఏకకాలమునందే నడచెను. అలవాటుప్రకారము గ్రామాంతరములనుండి పలువురు వచ్చియుండిరి. తంబిరానులు, విద్వాంసులు ప్రభువులును కూడియుండిరి. వచ్చినవారిలో పెక్కురు పిళ్లైగారి దేహస్థితి తెలిసి చింతచే కలగి దిక్కు తోచక యుండిరి. ఎల్లరును వారి గుణాతిశయములు తలచి తలచి ద్రవించిరి. 'ఇక వీరికి తరువాత వీరివంటివారి నెవ్వరిని చూడగలము?' అను భావమే యెల్లరికిని గలిగెను.

సుబ్రహ్మణ్యదేశికులు గురుపూజాకార్యక్రమమున మునిగియుండియు వారికి మనశ్శాంతి లేదు. మాటిమాటకి పిళ్లైగారి దేహస్థితిని విచారించుచుండిరి. 'ఇప్పు డెట్లున్నది? ఏదైన నాహారము పుచ్చుకొనిరా? స్మృతి యున్నదా? మాటలాడుచున్నారా? మాట్లాడిన తెలిసికొనుచున్నారా?' అని యిట్టి ప్రశ్నలు వేసి తెలిసికొనిరి.

తైమాసము ఇరువదియవ తేది (31-1-1876) ఆచార్యులకు వ్యాధి హెచ్చెను. నేనును, శవేరినాథపిళ్లెయు ఏమియు తోచక కొలది కొలదిగ పాలు ఇచ్చుచుంటిమి. రాత్రి కోవెలనుండి శ్రీగోముక్తీశ్వరులు ఊరేగింపుగ బయలుదేరిరి. నేను స్వామిదర్శనమునకై పోయినపుడు గోపురద్వారమున స్వామితో వచ్చిన సుబ్రహ్మణ్యదేశికులు పిళ్లెగారి స్థితిని విచారించిరి. నాకు ఏమి చెప్పుటకును తోచలేదు. దుఃఖ ముదికి వచ్చెను. "ఇప్పుడు వారికి మాట్లాడ వీలుగలేదు. మన మేమైన చెప్పినచో తెలిసికొందురు. కొద్ది కొద్దిగ పాలు పోయుచున్నాము." అని తడబడుచునే చెప్పితిని. వారు కొంచెము బ్రమసి నిలిచిరి. "ఈ స్థితిలోనైనను పిళ్లెగారు జీవించియున్నచో ఆధీనమునకు మిక్కిలి గౌరవముగ నుండును. శ్రీగోముక్తీశ్వరుల దివ్యకృప ఏమి చేయునో" అని పలికి "పోయి గమనించు కొనుము" అని యనుజ్ఞ యిచ్చి పంపివేసిరి. నేను పిళ్లెగారియొద్దకు పోతిని.

ఆచార్యుల కడుగడుగున చైతన్యము తప్పిపోవుచుండెను. నడిరేయికి తరువాత చాలసేపు ప్రజ్ఞయే లేకుండిరి. పిదప కన్నులు తెరచి చూచి ఏదో చెప్ప నోరు కదలించిరి. ఆ సూచన 'తిరువాచకము' అని చెప్పినట్లు తోచెను. నేను తిరువాచకము నెత్తుకొని 'అడైక్కలప్పత్తు' (శరణాగతిదశకము) చదువుచుంటిని. పరమేశ్వరుని పాదారవిందముల శరణుజొచ్చుటకు యోగ్యత గలవారే మా గురువుగారు. వారు కన్నులు మూసికొనియేయుండిరి. తిరువాచకపద్యములు వారి శ్రవణమార్గమున హృదయము ప్రవేశించి పరమానందము పండించియుండనోపు ! ఆ నిర్వృతి వారి మోమున ఒక వికాసము విరియజేసెను.

వారి నెన్నుదుట విబూది మెండుగ నొక్కరు పెట్టిరి. శవేరినాథపిళ్లె వారిని తన రొమ్మున నాన్చుకొనిరి. శరణాగతిదశకమును చదువుచుంటిని. తటాలున వారి శరీరమున అరికాలు మొదలు బ్రహ్మరంధ్రమువరకు ఒక విధమగు ఉలికిపాటు పుట్టెను. మూసికొనియున్న కన్నులలో కుడికన్ను తెరచుకొనియెను. అంతియే. శివలోకమునం దదే సమయమున ఆ ధన్యాత్ముడు ప్రవేశించుటకు ద్వారము తెరచుకొనియెను కాబోలు ! వారి యుచ్ఛ్వాసనిశ్వాసములు నిలిచిపోయినపుడే వారి తమిళ భాషాభిమానము నిలిచెను. నా చేతినుండి తిరువాచకము తిన్నగ జారెను. కన్నుల నుండి కన్నీరు నెలయేరై పారెను.

అచ్చట నున్నవారిలో కొందరు బిగ్గరగా నరచిరి. కొందరు దుఃఖ మోర్వ లేక నోరు నొక్కుకొనిరి. నే నేమియు తోచక మా యాచార్యుని పవిత్రదేహమును, ప్రశాంతి నడయాడు మొగమును, నాకు ప్రియమార పాఠములు చెప్పుచుండిన శ్రీవదనమును, వాత్సల్యము తొణకుచుండు కటాక్షములతో నన్ను కోమలముగ స్పృశించు కన్నులను చూచి చూచి వెక్కి వెక్కి యేడ్చితిని. "ఇప్పటి యీ దుర్ఘటన యసత్యము కారాదా? అను తలంపుతో చూచుచుండగ వారి కన్నులు రెప్ప లాడ్చుచున్నట్లే తోచును; నోరు కదలుచున్నట్లు కన్పట్టును. ఊపిరాడుచున్నట్లు గోచరించును. కాని యుత్తరక్షణముననే అంతయు కేవలభ్రమయే యని తెలియును భావనాకల్పితభ్రమసంజనితదృశ్యములే యివి యనియు తెల్లమగును.

గురువుగారి కుమారులును, భార్యయు అచటనే యుండిరి. మరియు పలువురు మిత్రులు గూడియుండిరి. ఆచార్యులు మరుగైపోయి రను వార్త వెంటనే యెల్లెడల వ్యాపించెను. శ్రీ సుబ్రహ్మణ్యదేశికు లీవార్త విని దురపిల్లిరి. వారి కేపనియు చేయ కాలుసేతు లాడలేదు.

తెల్లవారెను. కారు చీకట్లు క్రమ్ముకొనియున్న మా హృదయములందు మాత్రము సూర్యోదయము కాలేదు. పలువురు వచ్చి వచ్చి యాచార్యుల దివ్యదేహము చూచి చూచి విలపించ సాగిరి. అధీనజ్ఞానాచార్యులు సమాధి పొందిన దివ్యదినము తిరునాళ్లలో పాల్గొని యానందింపవచ్చినవారిలో పలువురు అధీనతమిళాచార్యులు శివసాయుజ్య మొందిన వార్త విని దుఃఖసముద్రమున మునిగిరి. సుబ్రహ్మణ్యదేశికులు పైన జరుగవలసిన కార్యములకైన యేర్పాట్లు చక్కగ చేయదొడగిరి.

ఆ దివ్యదేహమును రుద్రభూమికి తీసికొనిపోవునప్పుడు నేను కాంచిన దృశ్యములను, వినిన మాటలను ఇప్పుడు తలచుకొనినను గుండె ఝల్లుమనును. ఎల్లరును ఎలుగెత్తి యేడ్చిరి. వారి జ్ఞానవైశిష్ట్యము శ్లాఘించి దుఃఖించువారును, వారి కవితామాధుర్యము కొనియాడి కరగిపోవువారును, శిష్యులయెడల వారు చూపుచుండిన యత్యంతాభిమానము చాటి చెప్పి దురపిల్లువారును, వారి గుణవిశేషములు వర్ణించి వర్ణించి విలపించువారును— ఈ విధముగ నెటుజూచినను జనులు క్రిక్కిరిసి యుండిరి.

అభిషేకస్థులు అప్పుడు తిరువాచకము పారాయణ చేయుచుండిరి. దానిని వినిన మా నాయనగారు "ఇకపై వీరివలె తిరువాచకము వ్యాఖ్యానించి చెప్పగలవా రెవ్వరు

పుట్టగలరు?" అని పలికి వగచిరి. గురువుగారు తమ జీవితము కడపటి దినములలో చివరి నిమిషమువరకును తిరువాచకమం దైక్యమై యుండు మెరిగినవాడ నగుటచే ఆ మాటలు వినగ నా హృదయము, ప్రాణములును కంపించెను.

పలువురి యెదలకు, కనులకు, వీనులకును నిర్వృతి విస్సుచు జీవించుచుండిన ఆ ధన్యజీవిదివ్యదేహమును అగ్నిహోత్రు డాహుతిగా స్వీకరించెను. చిదంబరంపిళ్లై తమ తండ్రిగారి యౌర్ధ్వదైహికక్రియలు నిర్వర్తించిరి. అన్నియు ముగియుటకు దాదాపు పన్నెండు గంట లాయెను. పిమ్మట సందరును స్నాన మాచరించి మరలిరి. నేనును మా యాచార్యులవారి నిక జన్మలో చూడలేని స్థితిలో వీడి స్నానము చేసి వచ్చితిని.

ఊరు ఊరంతయు శోభారహితమై యుండెను.

# 33. అభయ వాక్కు

ఆచార్యవియోగము కలిగిన తరువాత జగత్తంతయు శూన్యముగా తోచెను. ఇంటికి వచ్చి యొక్కచో కూర్చుంటిని. ఏ పని చేయుటకు తోచలేదు. ఎవ్వరియొద్ద నేని మేదేని మాటాడుటకును కోర్కె జనించుటలేదు. ఆచార్యులు బాల్యమున వ్రాసిన 'త్యాగరాజలీల' అను గ్రంథమును చేత నిడుకొని చదువుచునే యుంటిని. కాని మనస్సంతయు దానియం దాసక్తము కాలేదు. సారెసారెకు వారి తలంపు తల యెత్తి వెతల గుడువబెట్టుచుండెను. వారి కల్పనాపటిమ మిక్కిలి శ్లాఘ్యమగు రీతి నా గ్రంథములో పొందికగ నుండెను. దానిని చదువ చదువ వారి వియోగమువలన ఏర్పడిన శోకోద్రేక మధికమాయెను. కన్నీరు కార్చుచునే చదివితిని. తిండి తీర్థముల మీదికి మనసే పోలేదు.

ఒంటిగంట తరువాత మఠమునకు బయలుదేరితిని. అచ్చట నొకచోట కుమారస్వామి తంబిరాను కొందరితో సల్లాపము చేయుచుండిరి. ఆ సంభాషణ పిళ్లై గారిని గూర్చియే. నే నచ్చటికి పోయిన వెంటనే వారు నన్ను జూచి "అందరికంటెను మీకే దుఃఖము హెచ్చుగ నుండును" అనిరి. నేను మౌనముగ నుంటిని. "పిళ్లైగారు

మఠములో నున్న రోజులలో వెలుపలి యూళ్లనుండి యెందరో వచ్చి వారి యొద్ద పాఠములు చదువుచుండిరి. మఠమునం దెల్లప్పుడును విద్యార్థిబృంద ముండెడిది. ఇకపయి న ట్లుండుట కవకాశమే లేదు. వారు వారు తమ తమ యూళ్లకు పోవలసినదే" అని మిగుల దుఃఖించుచు వారు పలికిరి.

వారి మాటలవలన నా కొక క్రొత్త చింత పుట్టెను. "ఎల్లప్పుడును పిళ్లెగారితో నుండి పాఠములు వినుచు, వ్రాయుచు సుఖముగ కాలము వెళ్లబుచ్చితిమి. ఇకపై మన మేమి చేయుట! ఈ మఠమునకును మనకును ఎట్టి చుట్టరిక ముండబోవును. మన గతి యింకే మగును?" అను బెంగ తలయెత్తెను. నా కొక పెద్ద దిక్కై తనరారిన పిళ్లెగారు కానరామిచే వేఱ పట్టుగొమ్మలేక, దిక్కులేక తిరుగాడుచు నలయుచు నుండవలసిన దుర్దశ కలుగునేమో?" అని భయపడితిని.

ఇట్టి యీ తికమకలో నచ్చట నిలుచుటకంటె సుబ్రహ్మణ్యదేశికుల యొద్దకు బోయి వారిని చూచివచ్చుట మే లని తలచి మఠములోపలకు నరిగితిని. అచ్చట 'ఒడుక్కము' (ఆస్థాని)లో వా రమరి యుండిరి. వారిని చూడగనే, అంతవరకు నాలో నణగియుండిన దుఃఖము పొంగులెత్త గోడుగోడున గొంతెత్తి విలపించితిని. ఎంత ప్రయత్నించియు వెక్కి వెక్కి యేడ్చుట తగ్గలేదు. అణచుటకు వీలుకాక పెల్లుబికి వచ్చు నా దుఃఖము కనిన దేశికులు, "వగచి సాధించున దేమున్నది? తీరని లోటు సంఘటిల్లినది. మాకును దుఃఖము దుర్భరముగ నున్నది. వెలువరచకున్నాము. మీరు తాళలే కున్నారు. మీయెడ వారి కున్న వాత్సల్యము వే రెక్కడ చూడనగును?" అనినారు.

ఆ మాటలు నా దుఃఖమును మరింత ప్రేరేచినవి. మరల పనవిపనవి యేడ్చితిని.

"జరగిపోయిన సంఘటనలు తలచి వగచుటచేత లాభ మేమియు లేదు. పిళ్లెగారు లే రను లోటు తప్ప వే రే లోటును ఇచ్చట నుండదు. మీ రికపై వినవలసిన పాఠములు మాయొద్దనే వినవచ్చును. క్రొత్త విద్యార్థులకు పాఠములు చెప్పుచు నెల్లప్పుడు మాయొద్దనే వసింపవచ్చును. మీ కెట్టి కొరతయు లేకుండునట్లు మేము చూచుకొందుము. ఈ యూరే మీ యూ రని భావింపుడు. మీరును తంబిరానులవలె మఠమువిద్యార్థిగనే యుండవచ్చును. మీ కేవిధమునను కొదవ యుండదు." అని

వారు నా కూరాప్పు చెప్పిరి. అ 'యభయవాక్కు'లు కేవలము మొగమిచ్చుకపు మాటలు కా వని నాకు తెలియును.

మెల్లగ ననుజ్ఞ పొంది మరలితిని. సుబ్రహ్మణ్యదేశికులు నాయెడ యధికాభిమానముకలవా రని తెలిసియు కుమారస్వామితంబిరానుమాటలు విని కలిగితిని. పిళ్ళెగారి వాత్సల్యమున పెరిగిన నాకు తదితరుల వాత్సల్యస్థితిని తెలిసికొను సందర్భమే కలుగలేదు. పిళ్ళెగారి యెడబాటుకు తరువాత దేశికుల వాత్సల్యముమహత్త్వము సుస్పష్టరూపమున తెలియజొచ్చెను.

సుబ్రహ్మణ్యదేశికులు పిళ్ళెగారు చేసియున్న ఋణము లెల్ల తీర్చి వారి కుటుంబమునకు కావలసిన సౌకర్యముల నుచితముగ చేయించి పంపిరి. చిదంబరంపిళ్ళె తమ తల్లిగారు మున్నగువారితోబాటు మాయూరమునకు బోయి యట నుండ దొడగిరి.

నా తల్లిదండ్రులు నాతోబాటు మా పినతండ్రిగారి యింట వసించుచుండిరి. వా రట్లు వసించియుండుట సుబ్రహ్మణ్యదేశికులకు తెలియదు. ఒకసారి 'పుదుక్కోటనుండి వచ్చిన త్యాగరాజశాస్త్రిగారు మా నాయనగారిని చూచి, సంగీతవిషయమున సంభాషించి సంతోషించిరి. వారికిని మా నాయనగారికిని మునుపే పరిచయ ముండెను. ఘనం కృష్ణయ్యరుకీర్తనలు మా నాయనగారి నోట విన్న శాస్త్రిగారు వారి రచనను మిక్కిలి కొనియాడిరి.

పిమ్మట త్యాగరాజశాస్త్రిగారు మఠమునకు పోయి దేశికులతో మాట్లాడు సందర్భమున మా నాయనగారి శివభక్తిపరత్వమును, శివపూజాప్రవణతయు, సంగీతజ్ఞాన విశిష్టతయు ప్రశంసించి చెప్పిరి. అంతవరకు మా నాయనగారినిగూర్చి యేమియు నెరుగని దేశికులు "అటులనా? మా కింతదనుక విషయమే తెలియదే. స్వామినాథయ్యరును చెప్పలేదే" అని చెప్పి యచ్చటనే నిలిచియున్న నన్ను జూచిరి.

"మీకు సంగీతమున అభ్యాస ముండుటకు మీ నాయనగారే కారణమై యుండవలెను" అని దేశికులు చెప్పిరి.

"ఔను".

"ఇన్నాళ్లుగ మీ నాయనగారిని ఇచ్చటికి పిలుచుకొనిరాలేదే? వా రింతకు మునుపు ఈ యూరికి వచ్చియుండలేదా?"

"కొన్నితడవలు వచ్చియున్నాను. సన్నిధానముశ్రీవారికి అనావశ్యకముగ ఇబ్బంది కలిగింపరా దని తలచితిని".

"ఇబ్బందియా! ఇట్టివారిని చూచుటలో మా కెంతయో తృప్తి యని మీకు తెలియదా?"

నాటి యపరాహ్ణమున మా నాయనగారు మఠమునకు వచ్చి సుబ్రహ్మణ్య-దేశికులను జూచి పెద్దప్రొద్దు ముచ్చటించుచుండిరి. అది మొదలు మా తండ్రిగారు దేశికుల సన్నిధికి జని దర్శించి సల్లాపము లాడ దొడగిరి. ఈ యలవాటువలన మా నాయనగారికి సుబ్రహ్మణ్యదేశికుల గొప్పతనము, జ్ఞానదార్ఢ్యము, ఔదార్యము, విద్వాంసులయెడ వారు చూపునట్టి మహాభిమానమును వ్యక్త మయ్యెను. మఠమున నెవ్వరేని సంగీతవిద్వాంసులు వచ్చి పాడినచో దేశికులు మా నాయనగారిని పిలిపించి వినునట్లు జేయుదురు.

తిరువావడుదుఱమఠమున చదువుచు వచ్చినవారిలో 'మేలగరం చంపక-కుట్రాలక్కవిరాయరును' నేనును సహోదరులవలెనే మెలగుచుంటిమి. మే మిరువు రము తరచు చేరి చదువుటయు, కలసిమే యుండుటయు నలవాటు. ఒకనాడు మా యిరువురిని దేశికులు పిలిచి "మీ రిరువురును మాయొద్ద పగటివేళలయందును రాత్రి భోజనానంతరమును వచ్చి చదువవలసిన గ్రంథములు చదువుచుండుడు. ఇంతవరకు చదివిన పుస్తకములను తక్కిన కాలములం దిరువురును జేరి పరిశ్రమించి చదు-వుడు. చదువుకొనుటకై యిటకు వచ్చినవారికి వా రే యే పాఠములు చదువ నభి లషింతురో తెలిసికొని, వారి వారి యోగ్యతకు తగినట్లు పాఠములు చెప్పుచుండుడు. పాఠప్రవచనముచే మీ విద్య వృద్ధిబొందును." అని చెప్పి వానికి కావలసిన యేర్పాట్లు చేసిరి. నా సహపాఠి కుమారస్వామితంబిరాను మున్నగువారికిని ఇట్టే యాజ్ఞ యొసంగిరి. ఆ తీరుననే చేయుచువచ్చితిమి.

నేను, చంపకకుట్రాలక్కవిరాయరు, తదితరులును పిళ్లెగారు వసించి యుండిన యింటినే మా నివాసముగా నేర్పరచుకొని చదువుకొనుచు, చదువు చెప్పుచు నుంటిమి. భారతము, భాగవతము, తిరుక్కుట్రాలప్పురాణము మున్నగు కావ్యము లను, పలుతీరుల ప్రబంధములను చదివి విమర్శించితిమి. కంబరామాయణమున అయోధ్యాకాండమున ఒక్క భాగమువరకు పిళ్లెగారియొద్ద పాఠము వినియుంటిమి.

ఆపైన ఆ కావ్యము సంపూర్ణముగ చదువ వలె నను నభిలాష మాకు కలిగెను. అందుచే పిళ్లైగారి తాళపత్రప్రతియు మఠమునందలి తాళపత్రప్రతులను దగ్గర నుంచు కొని రెండు మారులు పూర్ణముగ చదివితిమి. చదివెడు వేళల చూచిన పాఠభేదము లను మా 'చేతిపుస్తకము'నందును, వేరు విడి కాగితములందును వేరు వేరుగ గుర్తించుకొనుచు వచ్చితిమి.

సుబ్రహ్మణ్యదేశికులయొద్ద మేము శైవసిద్ధాంతశాస్త్రములను, కొన్ని కావ్యము లను 'నన్నూల్' మొదలగు లక్షణగ్రంథములను పాఠము చదివితిమి. విద్యార్థిదశయం దుండి మేము నేర్చుకొనుచువచ్చిన యా కాలమున దేశికుల యాజ్ఞమేరకు ఆచార్యపదవియం దుండి మఠమునందున్న చిన్నతంబిరానులకును, తక్కినవారికిని తమిళగ్రంథములు నేర్పుచును వచ్చితిమి. అప్పుడు నాయెడ చదువుకొనిన విద్యార్థులు పలువురు. తక్కినవారికిని ఎందరికో పాఠము చెప్పితిని. నాయొద్ద పాఠములు నేర్చినవారిలో కొందరు ప్రాయమందు నాకంటె పెద్దవారు. అయినను వారు నాయెడ మిక్కిలి మర్యాదతోడను, ప్రేమతోడను మెలగుచుండిరి. ఎల్లరును నా కెట్టి కొదవయు రాకుండ కాపాడు స్వభావము కలవా రయిమే యుండిరి.

'కావడిచిందు' వ్రాసినట్టి 'చిన్నకుళమ్ అణ్ణామలైరెడ్డియార్' ఆకాలమున తిరువావడుదుఱమఠమందు తమిళము నేర్చుకొనవలె నని వచ్చిరి. సుబ్రహ్మణ్య-దేశికులు వారిని నాయెడ నప్పగించిరి. నేను వారికి 'నన్నూల్', మాయూరపురాణమును పాఠము చెప్పుచుంటిని. అప్పుడే వారికి పద్యము లల్లెడి సామర్థ్యము చక్కగ నుండెను. యమకము (మడక్కు), అంత్యప్రాసము (తిరిబు), ఛందో-వైచిత్రి మున్నగు విశేషరచనలతో పద్యము లతిత్వరలో వ్రాయుదురు. పాఠములు వినుచుండినపుడు లక్షణగ్రంథముపై వారి బుద్ధి ప్రసరింపలేదు. కొంతకాల ముండి యనుమతి పొంది తమ యూరు చేరిరి.

నాతో నుండిన మా నాయనగారు మరల ఉడయార్పాళెముప్రాంతములకు పోవలె నని తలచిరి. ఏ పనియు లేక తిరువావడుదుఱయందు గోళ్లు గిల్లుకొనుచు కూర్చుండుట వారి కిష్టము కాలేదు. నన్నును తమ వెంట పిలుచుకొని పోవలె నను కోరిక వారి కుండెను. పురాణప్రవచనము చేసికొనుచు నేను కుటుంబజీవనము సాగింపవలె నను నభిప్రాయము వారికి మారలేదు. "ఈ యూరిలో నీ విట్లే యున్నచో మే మెచ్చట నుండగలము ? నీకో వివాహ మయినది. నీవు గార్హస్థ్య

జీవనము నెరపవలదా? ఇది మంచి స్థలమే. మనుష్యునకు భుక్తిమాత్రమే చాలునా? ఎన్నాళ్లు మేము విన్ని విడిచి యూరూరుగ తిరుగుచు జీవింపగలము? పండార సన్నిధిశ్రీవారి యనుజ్ఞ వడసి విన్నును పిలుచుకొని పోవలె నని తలచియున్నాను" అని వారు చెప్పిరి. అట్లే చేయవచ్చును అనిగాని, వలదు అనిగాని నేను చెప్పలేదు. తిరువావడుతురై వీడి సాగిపోవ నాకు మనసు రాకున్నది. తల్లిదండ్రుల నెడబాసి యుండు టనినను దిగులుగనే యున్నది. దేనికిని సాహసింపలేకుంటిని.

ఇట్లుండగ, ఒక్కనాడు సుబ్రహ్మణ్యదేశికులయొద్దకు మా నాయనగారు పోయి తా మూరికి పోదలంచి యున్నట్లును, నన్నును తమతోడ పిలుచుకొనిపోవ నున్నట్లును తెలియజేసిరి. వెంటనే దేశికులు "మీ కుమారులు ఇక మా యొద్దనే యుండవలసినవారు. వీ రింకను చదువవలసిన గ్రంథము లున్నవి. వానిని మేమే పాఠములు చెప్పెదము. ఇక్కడికి చదువుకొన వచ్చు పిల్లవాండ్రకు పాఠములు చెప్ప వీరు మిగుల నుపయోగపడుదురు. పిళ్లైగారియొద్ద నేర్చిన చదువు ఇటుపైననే అధికమైన ఫలిత మివ్వనున్నది. మీరుమాత్ర మిప్పుడు ఊరికిపోయి పాత్రలు, తదితరవస్తువులను తీసికొని స్థిరవాసముగ వచ్చివేయుడు. మీకు వలయు సౌకర్యము లన్నియు నిక్కడే లభ్యమగునట్లు చేసెదము. ఇల్లు కట్టించి యిత్తుము. ఎట్టి చింతయు చీకును లేక కావేరీస్నానము, శివపూజయు చేసికొనుచు సుఖముగ నుండవచ్చును" అని చెప్పిరి.

దేశికు లిట్లు చెప్పుచున్నప్పుడు మా నాయనగారికి రానురాను సంతోష మధికమాయెను. వారు తమ్మే మరచిరి. దేశికులు భాషణ నిలిపివేసినవెంటనే చేరువనున్న ఒక 'దీపముపెమ్మె' నుండి రెండు విప్పురవ్వలు క్రిందపడినవి. "అయ్యా, మంచి శకున మగుచున్నది. మీరు సౌఖ్యముగ నుందురు. మీరు పోయి వైళమ రండు" అని మరల చెప్పి వస్త్రము లిచ్చి మర్యాద చేసి వెచ్చమునకై పది రూపాయ లిచ్చిరి. వాని నన్నిటిని దగ్గరగ నుండి గమనించుచుండిన నాకు హృదయమున నిముడని మహానందము కలిగెను.

కౌటుంబికస్థితిగతులగూర్చియే చింతించి చింతించి విచారసాగరమున మునిగియున్న మా నాయనగారికి అప్రతీక్షితముగ ఆ విచారము తొలగుటకు తగిన

మార్గము దొరకగనె వారు మిగుల సంతసించిరి. దేశికులను శ్లాఘించి తిన్నగ ఇంటకు వచ్చిరి. వచ్చునపుడే "ఎట్టి ప్రభువు! ఎట్టి ప్రభువు! ఇట్టి చో నెక్కడను చూడలేదు. మన మొనర్చిన పూర్వజన్మపుణ్యఫలితమే యిది." అని చెప్పుచునే వచ్చిరి. పిదప నొక శుభదినమున మా నాయనగా రందరియొద్దను అనుమతి పొంది తల్లిగారిని, తమ్ముని పిలుచుకొని బయలుదేరి ఉడయార్‌పాళెమునకు పోయిరి.

మాయూరమున మునసబుగ నున్న వేదనాయకం పిళ్లె కొన్ని తడవలు తిరు-వావడుదుఱమఠమునకు వచ్చియుండుట కలదు. వచ్చినప్పుడెల్ల వారు సుబ్రహ్మణ్య దేశికులపై పద్యములు రచింతురు. వానిని నేను చదివి వినిపింతును. సులభశైలిలో వినువారు త్వరితముగ నర్థము గ్రహించి యానందించుట కనువుగ ఆ పద్యము లుండును. ఒక క్రైస్తవఘనుడు శైవమఠాధిపతిని స్తుతించుట యన అది మిక్కిలి యరుదగు సంగతిగదా! అంతియ గాక తగు బాధ్యతగల రాజకీయోద్యోగ మొక్కటి వహించువారును, ఇతరులను అధికముగ లక్ష్యపెట్టనివారును అగు వేదనాయకంపిళ్లె శ్లాఘించుట ఎల్లరకు నాశ్చర్యము కలిగించెను.

పిళ్లెగారి శిష్యుడగు వేదనాయకంపిళ్లె ఆచార్యుల మూలమున తిరువావడుదుఱ మఠము వైభవమును, దాని యధిపతుల విద్యావివేకసంప్రదాయవైశిష్ట్యములను గ్రహించియుండిరి. తామే సాక్షాత్తుగ చూచినప్పు డా మఠము తమిళవిద్య పెంపొం చించు తావలముగ నుండుట తెలిసికొనిరి. దీనివలన సుబ్రహ్మణ్యదేశికులయెడ వారికి మంచి మదింపు కలిగెను.

వా రప్పుడప్పుడు చెప్పిన పద్యములు పెక్కు. ఎవరైనను మఠమునకు వచ్చి నచో వారు "మునసబు వేదనాయకంపిళ్లెగారు సన్నిధానముశ్రీవారిపై కవిత్వము చెప్పియున్నా రట గదా?" అని అడుగుదురు. వెంటనే దేశికులు ఆ పద్యములు చదువు మని నా కుత్తరు విడుదురు. నేను సరాగముగ చదివి యర్థముగూడ చెప్పుదును.

మఠనిర్వహణసంబంధమున నేదేని గమనింపవలసి యున్నను, ఆంగ్లమున విన్నపము మున్నగునవి వ్రాయవలసి యున్నను సుబ్రహ్మణ్యదేశికులు వేదనాయకం పిళ్లెకు చెప్పి పంపుదురు. వకీలులు అడుగడుగున మఠమునకు వచ్చి మెలగెడు

కాలము కా దది. మిక్కిలి సులభముగ వ్యవహారములు పరిష్కరించుకొను నభ్యాసము సుబ్రహ్మణ్యదేశికులయెడ నమరియుండెను.

ఈ విధముగ వేదనాయకంపిళ్లెయొద్ద నేదేని పని యున్నచో తరచుగ దేశికులు నన్నే పంపుదురు. నేను మాయూరమునకు జని, వారి యింటి కరిగి, వారితో మాట్లాడి, వచ్చిన పని నెరవేర్చుకొని మరలుదును. ఇట్లేగు వేళలం దెల్ల వేదనాయకంపిళ్లె వ్రాసిన క్రొత్త పద్యములను వారి తమ్ములమూలమున సంపాదించి చదివియు, చదివి చూపియు నానందింతును. తమిళగ్రంథసంబద్ధవిషయముల గూర్చియు, పిళ్లెగారినిగూర్చియు సంభాషింతుము. వారు నాయెడ మిక్కిలి ప్రీతితో మెలగిరి. వారి చివరిదశవరకును ఆ పరిచయము వీడిపోక వృద్ధి పొందెను.

# 34. క్రొత్త యిల్లు

తిరువావడుదురయందు కొలనియుత్తరతీరమున తూర్పు-పడమరలుగ ఒక యగ్రహార మున్నది. సుబ్రహ్మణ్యదేశికుల యుత్తరువుమేరకు దాని యుత్తర శ్రేణిలో తూర్పు చివర రెండు కట్లతో వసతులు గల యిల్లొకటి నిర్మింపబడెను. మఠమునుండి మంచి 'సామానులు' పంపి ఆ యిల్లు కట్టించిరి. అది కట్టి పూర్తి కాగనే దేశికులే స్వయముగ వచ్చి దాని నొకమారు పరికించి పోయిరి. "ఈ యిల్లు ఎందుకై కట్టబడెను." అని యెవ్వరికిని వ్యక్తముగ తెలియ లేదు. తంబిరానులు మాత్రము "మా కోర్కెలు పండెడు కాల మాసన్నమైనది." అని సంతోషపడిరి. నేమను ఒక విధముగ నూహించి యరసికొంటిని.

ఒకనాడు దేశికులు నన్ను చూచి "మీ నాయనగా రూరికి పోయి వత్తు నని చెప్పిరే; ఏల రాలేదు?" అని యడిగిరి.

"వారు ఆ ప్రాంతములం దున్న యాప్తుల యాదరువు పొందుచున్నారు"—అంటిని.

"వారికి వెంటనే జాబు వ్రాసి యిక్కడికే పిలిపించి తెలియజేయుము. ముదిప్రాయమున మిమ్ము వదలి వా రుంటుట పాడి గాదు." అని పెద్దలు చెప్పిరి.

వారు చెప్పినది వాస్తవమే. నాకును వారి నెడబాసి యుంట దిగులుగనే యున్నది. ఆ బెంగ పోకార్చుకొన నాకు ధైర్యము చాలదు. నేను వా రున్నచోటికి పోయి యుండవలయును. లేదా వారే నే నున్న చోటికి రావలయును. పెద్దల కట్టడ నా కుత్సాహ మిచ్చినది. జాబు వ్రాసితిని. నా తల్లిదండ్రులు ఒక వారములో తిరువా వసుదుల వచ్చి చేరిరి.

పెద్దల యాలోచన అప్పుడే నాకు తెల్లమాయెను. తాము కట్టించిన క్రొత్త యింటిలో నన్నును, నా తల్లిదండ్రులను వసింపజేయవలె నను ప్రేమపూర్ణమైన వారి భావము తెలిసి యుల్లమున నుప్పొంగితిని. అంతమాత్రమే కాదు. నేను స్వతంత్రముగ గార్హస్థ్యము నెరపవలె ననియు, నిరంతరముగ [illegible] కావలె ననియు వారి యభిలాష యున్న దనియు నెరిగి నా పూర్వపుణ్యమును దీవించితిని.

ఈశ్వరసంవత్సరపు కార్తికమాసము (నవంబరు 1877) మేము క్రొత్త యింటికి పోయి వసింప నారంభించితిమి. నాకు కలిగిన సంతోషముకంటెను నా తల్లిదండ్రులు మున్నగువారికి ఎన్నియో రెట్లు అధికసంతోషము కలిగెను. నెల కొక యూరు, రోజు కొక యిల్లుగ నలయుచు నలగుచు బ్రదుకుచుండిన వారికి స్థిరముగ నొక్కచో నెమ్మదిగ బ్రదుకుట యన్న నది యింద్రభోగముగా నుండెను.

నేను గృహస్థజీవనము మెయికొంటిని. మా కుటుంబమునకు కావలసిన సామగ్రి యంతయు మఠమునుండి లభించెను.

ఒకనాడు మా యింటి వాకిటిముందు మూడు బండ్లు వచ్చి నిలిచెను. కొందరు మనుష్యులు రెండు గాదెలు కొనివచ్చి యింట నుంచిరి. కొందరు బండ్లలో నున్న అరువది 'కలముల' వడ్లు ముప్పది ముప్పది కలములుగ ఆ రెండు గాదె-

అందును పోసి మట్టి పూసి "ఇక్కడికి చేర్పించునట్లు సన్నిధానమున ఉత్తరువైనది" అని చెప్పి వెడలిపోయిరి. అటుపిమ్మట 'ప్రాయసం పొన్నుస్వామి చెట్టియారు' అనువారు వచ్చిరి. "తమ యింటి ఖర్చుకై అరువది కలముల ధాన్యము చేర్పించు నట్లు సన్నిధానశ్రీవారి యాజ్ఞ. గ్రామాంతరములనుండి వచ్చిన యతిథులకువలె దినదినము మఠమునుండి సామగ్రులు పొందుచుండు టుచితముగ నుండ దనియు, ఇక నిరంతరముగ ఇక్కడనే మఠమునకు చెందినవారుగ నుండవలె ననియు ఏర్పాట్లు చేయ సన్నిధానశ్రీవారి దివ్యచిత్తసంకల్పము. వెచ్చములకై ఈ మొత్త మివ్వవలె ననియు ఉత్తరువైనది." అని చెప్పి నా చేతిలో ఏబది రూపాయలు నుంచిరి.

నేను మైమఱచిపోతిని. మా నాయనగా రప్పుడు శివార్చనకై గంధము తీయుచుండిరి. నేను విత్తమును వారిచేత నిడి ఏమనుటకును తెలియక యూరక నిలుచుంటిని. వారు దానిని తీసికొని కన్నుల కద్దుకొనిరి. "అంతయు పరమేశ్వరుని దివ్యకృప" అని చెప్పి కృతజ్ఞతాపూర్ణదృష్టితో నిరుత్తరులై నిలిచిరి.

నాడు మధ్యాహ్నముమీదట మా నాయనగారు మఠమునకు పోయి సుబ్రహ్మణ్యదేశికులను చూచి ధాన్యము, పైకము చేరిన సంగతి తెలియజేసి మితిలేని సంతోషము, కృతజ్ఞతయు గోచరింప సంభాషించిరి. అప్పుడు దేశికులు "ఈ మఠమందు పెద్ద కార్యస్థులకుగూడ నెలకు ఐదు కలముల ధాన్యమే వేతనము. అంతకు పై తమ కుటుంబమునకు కావలె నని మనసున్నను అలవాటుకు విరుద్ధముగ నేదేని యొక పని చేసినచో అనావశ్యకమగు నపవాదు కవకాశ మిచ్చిన ట్లగు నని అట్లు చేయలేదు. దీనిని పుచ్చుకొని ఉచితరీతిని ఉపయోగపరచుచు వచ్చి నచో కావలసినదాని నప్పుడప్పుడు పంపుదుము. దిగులు పడవలదు." అని చెప్పిరి.

ధర్మపురాధీనభాగవతులలో నొక్కరై, తమిళపండితోత్తములై కాశికా నగరమున కొన్ని యేడులు వాసము చేసినట్టి 'శ్రీ పరమశివ తంబిరాను' అనువారు సుబ్రహ్మణ్యదేశికులయెడ మిక్కుటపు భక్తి గలవారై ధర్మపురాధీనాధిపతుల యనుజ్ఞ వడసి ప్రాయశః తిరువావడుదుఱయందే వసించుచుండిరి. వారియెడ సుబ్ర

హ్మణ్యదేశికులకు అధికాభిమానము కలదు. వారు తిరువావడుదురైయం దున్న పుడు ఉత్తమగ్రంథములు చదివి విమర్శించుచు విద్యార్థులకు పాఠములు బోధించుచు నుండిరి.

సుబ్రహ్మణ్యదేశికులపై వారొక 'ముమ్మణికోవై' రచించిరి. దేశికుల మ్రోల ఆ ప్రబంధమునకు సభారోహణోత్సవము గావింపబడెను. అది యాశీర్వాద పద్యములో ముప్పదియొక పద్యములు కలది. 'ముమ్మణికోవై'కు పదుగురు ప్రసాదించిన ప్రశస్తి పద్యములు ఇరువదియారు. వానిని ఆ ప్రబంధముతోడ చేర్చి 'తిల్లైయంబూర్ చంద్రశేఖరకవిరాజపండితులు అచ్చొత్తించిరి.

ఆ కాలమున మఠములో నున్న తంబిరానులును, విద్యార్థులును ప్రశస్తి పద్యములు వ్రాసి యిచ్చిరి. ఆ యా ప్రశస్తిపద్యములకుముందు వానిని వ్రాసిన వారి పేరు, వారి కున్న బిరుదులు ప్రకటింపబడెను.

నేనును రెండు ప్రశస్తిపద్యములు రచించితిని. సుబ్రహ్మణ్యదేశికుల మహాభిమానమున అన్ని తెరగుల యానుకూల్యములను పొందిన నేను వారిమెడ నా కున్న కృతజ్ఞతను ప్రకటింప త్రోవ గానక యుంటిని. మంచికాలము: ఈప్రశస్తి పద్యములు దానికి కావలసిన సందర్భము నేర్పరచినవి. విద్యాసంపదయు, ఆర్థిక సంపదయు ఒక్కెడనే ప్రసాదించుచున్న దేశికుల మహిమను రెండవ పద్యమున ప్రకాశపరచితిని: ఆ పద్యభావ మిది :

> 'నన్ను సుప్రతిష్ఠితు జేయ రెండు పదార్థములను (విద్య, విత్తము) ఒక్కెడనే యొసగెడు దయానిధియు, ప్రసన్నకసందకుసుమోపవనశోభి శ్రీగోముక్తీశ్వరనగరనివాసియు నగు సుబ్రహ్మణ్యదేశికుల చరణ నళినములపై సకలజనసంస్తవనీయగుణాశ్రయుడై 'పండితసింహ' మని పొగడ్త గన్న పరమశివమునివరుడు దివ్యామృతముతో తులతూగెడు 'ముమ్మణికోవై' అను గ్రంథమును రచించి యర్పించెను.'

ప్రశస్తిపద్యమునకు ముందు నా పే రమర్చునపుడు 'తిరువావడుదురై ఆధీన విద్వాన్' అని యుంచవలె నని సుబ్రహ్మణ్యదేశికులు చెప్పిరి. అట్లు చేయుటలో

నాకు సమ్మతి లేదు. "పిళ్లైగారు అధీనవిద్వాంసులుగ వెలుగొందిన యచ్చోట నేనీ పట్టము వహింప కొంచెమేని యోగ్యత కలవాడను కాను. 'శ్రీవారియొద్ద చదువుకొనువాడను' అని ముద్రించినచో అదియే మహాభాగ్యముగ తలతును" అంటిని.

"ఈ పట్టి మచ్చొత్తింప మీ రడ్డు చెప్పినను మరొకవిషయమున మీ రడ్డు పెట్టలేరు" అని దేశికులు పలికిరి.

"ఆ విషయ మెద్ది?" అని నే నడిగితిని.

" మీ పేరు 'తిరువావడుదుఱై స్వామినాథయ్యరు' అనియే పొందుపరచవలెను."

"దానికి తగినట్లుగ సన్నిధానశ్రీవారు సన్ను చేసి తరువాత ఆ ప్రకారమే యమర్చుటలో నేమి తప్పు?" అని నే నంటిని.

నా ప్రతిపత్తిపత్రమునకు పైన "తిరువావడుదుఱై అధీనమహాసన్నిధానశ్రీవారి యొద్ద విద్య నేర్చినవాడును, వెంకటసుబ్బయ్యరుగారి కుమారుడును అగు తిరువావడుదుఱైస్వామినాథయ్యరుగారు రచించిన 'అఱుసీర్ కళి నెడిలడి యాసిరియవిరుత్తం'" అను శీర్షిక యుంచబడెను.

సుబ్రహ్మణ్యదేశికులు 'అధీనవిద్వాన్' అని వేయవలె నని చెప్పుటే నా కుత్సాహ మొసంగెను. వారికి నామీద గల యభిప్రాయ మరసితిని. ఆ పేరును అప్పుడు ముమ్మణికోవైప్రబంధమున అచ్చొత్తింపకున్నను దేశికులు తరువాతి కాలమున తమ కోర్కె నెరవేర్చుకొనిరి. నేను కుంభకోణముకళాశాలలో ఉద్యోగము పొందిన తరువాత వారు నాకు వ్రాసిన లేఖలలోను, పంపిన పుస్తకముల ముఖపత్రములందును 'మా అధీనవిద్వాంసులు, అధీనమహావిద్వాంసులు' అని యిట్లెల్ల వ్రాయుట అలవాటుగ పెట్టుకొనిరి.

ఆ కాలమున తిరువావడుదుఱైమఠమున నున్న కొలువుమండపమునకు ముంగిట కొబ్బరియాకులతో అతివిశాలముగను, రమణీయముగను పందిరి వేయబడియుండెను. దానిని 'బల్లకూర్పుమండపము'గ నిర్మింపజేయవలె నని తలంచి చేవంతిపురమున నుండిన పెద్ద కార్బారి వేణువనలింగతంబిరాను దానికి

వలసిన ప్రయత్నములు సలిపిరి. అది యెరిగిన 'శ్రేటూర్' జమీందారు, 'శివగిరి' జమీందారును అందులకు వలయు 'తేకుకలప' యంతయు పంపిరి. ఒక సంవత్సరకాల మా పని సాగెను. స్తంభములే లేక ఒకే కప్పుగ ఆ మంటప మమరెను. ఆ మండపమును కట్టించి పూర్తి చేయింపవలెనను పట్టుదలతో ప్రయత్నించిన వారు వేణువనలింగతంబిరాను లగుటచేత ఆ మంటపమునకు 'వేణువనలింగవిలాసము' అను పేరు పెట్టబడెను.

ఈశ్వరసంవత్సరము తై నెల మొదటి తేది మండపప్రవేశమహోత్సవము నడచెను. గ్రామాంతరములనుండి పలువురు మునులును, విద్వాంసులును ఆ యుత్సవ విశేషమునకు వచ్చియుండిరి. అట్టి మండపము చోళదేశమునందు లేకపోవుటచేత పలువురు దానిని చూచుటకయియే వచ్చిరి.

ఉత్సవము జరిగిన దినము మధ్యాహ్నమున అన్నదానము, రాత్రి మెఱవణియు జరిగినవి. తంబిరానులును, ఇతరులును ఆ మండపమును కొనియాడుచు పద్యములు వ్రాసిరి. ఊరేగింపైన పిదప సుబ్రహ్మణ్యదేశికులు 'ఒడుక్కము' (ఆస్థాని) నకు వచ్చి యమరిరి. అప్పుడు వారి కోర్కె చొప్పున వేణువనలింగవిలాసప్రశస్తి పద్యములను నేను చదివి వినిచితిని. తంబిరానులు మున్నగువారు అచ్చట సమావిష్టులై యుండిరి.

తంబిరానులును, తక్కినవారును వేర్వేరుగ పద్యములు రచించియుండిరి. వారు వారు వ్రాసిన పద్యములు నాయొద్ద నిచ్చిరి. వాని నన్నిటిని సంకలితము చేసి యుంచుకొని నేను చదివి వినిపింపదొడగితిని. ముప్పది పద్యము లుండినవి. ఒక్కొక్క పద్యమును రాగయుక్తముగ చదివి నాకు తోచిన నయగారముల నెత్తి చెప్పితిని. నేను వ్రాసియున్న మూడు పద్యములను చదివితిని. అం దొక పద్యమున "ఈ మండపమును కాలు (స్తంభము) లేని మండప మని యెల్లరు చెప్పుదురు. ఇట 'తెన్ కాల్' (దక్షిణ మారుతము) ఎల్లవేళల తిరుగాడుచుండుటచేత నే నటుల నుడువను." అను భావము నను చొన్పితిని. 'కాల్' అను పదమునకు స్తంభము, గాలి అను రెండర్థములు తోచునట్లు చదివిన యా పద్యము విని యెల్లరు సంతోషించిరి. (ఈ మండపమునకు ఒక కాల్ (స్తంభము) లేకపోయినను, మరొక యర్థమున కాల్ (గాలి) ఉండుటచే, కాల్ లేని మండప మనరాదు అని శ్లేషతో తెచ్చిన చమత్కారము.)

అన్నిటిని విన్న సుబ్రహ్మణ్యదేశికులు "చక్కగ నున్నవి. అన్నిట పిళ్లె గారి కవిత్వపు పోకడలే" అని తమ తృప్తి తెలియజేసిరి. అంతకంటెను మేలగు వేరొక ప్రశంస యుండు నని మాకు తోచలేదు. ఆ సభలో పలువురియెదుట లభించిన యీ మతింపు మా కపారసంతోషము నిచ్చినది. పిళ్లెగారి స్మరణతోడనే నాటి రేయి మేము నిదురించితిమి.

# 35. పాండ్య దేశ యాత్ర

పై బేర్కొన్న దక్షిణదేశపు పెద్ద కార్బారి యగు వేణువనలింగతంబిరాను అంబాసముద్రమునకు చేరువగ నున్న చేవంతిపురమున మనోజ్ఞమగు నొక మండప మును కట్టించి, దానికి 'సుబ్రహ్మణ్యదేశికవిలాసము' అని పేరు పెట్టిరి. అటు తరువాత వా రొకసారి తిరువావడుదురకు వచ్చి సుబ్రహ్మణ్యదేశికుల సన్నిధిని "సన్నిధానముశ్రీవారు పరివారసమేతముగ చేవంతిపురమునకు విచ్చేసి కొన్ని దినములుండి గ్రామములను గూడ పర్యవేక్షణ చేసిరావలెను." అని విజ్ఞప్తి చేసిరి. అదే సమయమగు ఈశ్వరసంవత్సరము తైమాసమున మధురశ్రీమీనాక్షీసుందరేశ్వరాలయమునకు అమరావతి పుదూర్ వయినాకరం కుటుంబస్థులు మహాకుంభాభిషేకము జరిపింప వేర్పాట్లు చేసియుండిరి. ఆ కుంభాభిషేకమునకు వచ్చియుండి దానిని విజయవంతము చేయవలె నని వారును సుబ్రహ్మణ్యదేశికుల నభ్యర్థించిరి.

తంబిరాను, సంపన్నులగు వైశ్యులును చేసికొనిన ప్రార్థనను మన్నించి దేశికులు మధురకుంభాభిషేకమునకుపోయి, అచ్చటినుండి దక్షిణదిగ్యాత్ర చేసి చేవంతిపురమునకు పోవచ్చు నని నిశ్చయించిరి. దానికి తగిన యేర్పాట్లు విరివిగా చేయబడెను.

తైపుష్యమునకు ముందురోజు దేశికులు పరివారముతో యాత్ర మొదలిడిరి. తిరువిడైమరుదూరులో అప్పుడు బ్రహ్మోత్సవము జరిగెను. అచ్చటికి పోయి తై పుష్యమునాడు తేరు ప్వస్థానము చేరునట్లు చేసిరి. ఆ ప్రయాణమునకు వలసిన కిత్త

నారసంచి యొకటి, పట్టుతలగడతో కూడిన ఒక జముకాణమును వాడు నా కచ్చట నిచ్చిరి.

తరువాత నన్ను దురంగట కూర్చొనబెట్టుకొని "మేము యాత్ర చేయు స్థలములందెల్ల మి మ్మిట్లుంది పెట్టవలసియుండును. తమిళభాషాభిమానులగు పెద్ద మనుష్యులు పలువురు వత్తురు. వారు తనియునట్లు తమిళపద్యములు చదువుట మీ కర్తవ్యము" అని చెప్పిరి. "అట్లు చేయుట నా భాగ్యము" అని నే నంటిని.

వారి యాజ్ఞానుసార మొక తంబిరాను గౌరీశంకరకంఠిక (ఒకజాతిరుద్రాక్ష మధ్య చీలి రెండు తునక లతికిన ట్లుండును. అందుచే నది గౌరీశంకర (అర్ధనారీశ్వర) రూప మని తలపబడును. అట్టి రుద్రాక్ష పొదిగిన కంటె) ఒకటి తెచ్చి నా మెడలో వేసి, ఒక సాలువు కప్పిరి. నే నా సమయమున ఆనందాతిశయముచే రిచ్చ పడితిని. రోమాంచ మొదవెను. "ఇట్లే తిరువావడుదుఱకు పోయి నాయనగారి యొద్ద యనుజ్ఞ వడసి ఇటకు వచ్చివేయుడు. మాతో బయలుదేరవచ్చును" అని చెప్పి దేశికులు నన్ను తిరువావడుదుఱకు పంపిరి.

యాత్రలో నాకు బహుభంగుల నభ్యుదయము కలుగు ననుటకు ఆ సమ్మానములు శుభనిమిత్తములై యుండినవి. మా నాయనగారికి మునుపే ప్రయాణ విషయము తెలియజేసియున్నను నేను పొందిన యీ బహుమతులు వారు చూచి సంతోష పడవలె నను తలంపుతో దేశికులు నేను తిరువావడుదుఱకు పోయి రావలె ననివచించి రని నేను తెలిసికొంటిని. తిరువావడుదుఱకు పోయి కంటె, సాలువయు మా నాయన గారికి చూపినపుడు వారు పొందిన యానంద మసాధారణము.

పిదప సెలవు పుచ్చుకొని తిరువిడైమరుదూరు వచ్చి చేరితిని. దేశికుల పరివారముతో కలసి నేనును ప్రయాణమైతిని. మరుసటి రోజు ప్రొద్దున 'మన్నార్‌గుడి' చేరితిమి.

మన్నారుగుడిలో విడిసియున్నపుడు దేశికులు నా చెవుల నున్న ప్రాత అంటు పోగులను తీసివేయించి, ఏబది రూప్యములకు పైబడిన మతింపుగల మొగ్గలు తీర్చి కెంపులు పొదిగిన క్రొత్త అంటుపోగులు ధరింపజేసిరి.

మన్నారుగుడినుండి బయలుదేరి పోవుచుండగ పట్టుక్కోటయందు దేశికులు నా కొక యుంగరము ఇచ్చి ధరింపజేసిరి. అట్లే తిరుప్పెరుందురకు పోయి కొన్ని దినము లుంటిమి. అప్పుడు తిరుప్పెరుందురయం దున్న ఆలయవిచారణ కర్తయగు సుబ్రహ్మణ్యతంబిరాను, దేశికులు 'విజయము' చేయుటకై తగిన విశిష్ట మగు నేర్పాట్లు చేసి మిక్కిలి సావధానులై యుండిరి.

చోళదేశ మతిక్రమించి పాండ్యదేశపు టెల్లలలో నడుగిడిన వెంటనే సుబ్రహ్మణ్యదేశికులు "ఇంతవరకు చోళదేశమునే మీరు చూచియున్నారు. ఇకపై పాండ్యదేశపు పెంపుసొంపు చూడవచ్చును." అనిరి. అట్లు పలుకునపుడు వారి కంఠస్వరమున ఒక తీరగు నుత్సాహ ముండినది. తమ స్వదేశమగు పాండ్యదేశము చేరినపుడు వారి కుత్సాహ ముండుట సహజమే కదా ?

దేశికులు 'తిరుప్పూవణము'నకు వచ్చి విడిసిరి. దాని నెరిగి మధురవాసులగు పెద్దలును, మధురదేవాలయకైంకర్యపరులగు శ్రేష్ఠికులజులును అచ్చటికే వచ్చి, దేశికులను చూచి స్వాగత మిచ్చి కొనియాడి వెడలిపోయిరి. పిమ్మట దేశికు లచ్చటి నుండి బయలుదేరి యొకనా డుదయమున మధురకు చెందిన 'వండియూర్ తెప్పక్కుళము'నకు పడమటి గట్టున నున్న కోవెలలో పరివారముతోడ విడిసిరి. మధురానగరిలో నున్న కొందరు పెద్దలు మరునా డుదయము వచ్చి సకలమర్యాదలతో దేశికులను పిలుచుకొని పోయిరి. వేగవతీ (వైగై) నదిదక్షిణతటమున దేశికుల విడిదికై ఏర్పాట్లు చేయబడిన ఒక సత్రమందు వారు దిగిరి. దానికి చుట్టు చాలదూరము వరకు కొట్టాములు, పందిళ్లు వేసి యలంకరింపబడియుండెను.

వేలకొలది యతిథులు భుజించుటకు చాలినంత బియ్యము మున్నగు పదార్థములు తిరువావడుదురనుండి బండ్లపై వచ్చి కుప్పలుతిప్పలై యుండెను. వేగవతికి ఉభయతీరముల దట్టమైయున్న కొబ్బరితోటలును, ఆ నదియందలి విశాలము లగు ఇసుకమేటలును, నీటి పారుదలలును కన్నుల నిట్టే యాకర్షించినవి.

మహాకుంభాభిషేకమునకై వచ్చిన జనసమూహము లెక్కింప తరముగాదు. కాశి మొదలు కన్యాకుమారి వరకు నున్న జమీందారులును, మిట్టాదారులును తమ తమ బలగములోడ వచ్చి చేరియుండిరి. తమిళదేశమున నాలుగు చెరగుల నున్న ప్రభువు లెల్లరు ఆ నగరమున నొకే చోట చేరియుండిరి. వారిలో పెక్కురు

వచ్చి సుబ్రహ్మణ్యదేశికుల దర్శనము చేసికొనిపోయిరి. వారు వచ్చునప్పుడెల్ల వెంట నుండి పద్యములు చదివెడు పనిలో నేను నిమగ్నుడనై పోతిని.

కుంభాభిషేకము నిర్ణీతసమయమున మహావైభవముతో నడచెను. సుబ్రహ్మణ్యదేశికులు దేవాలయమునకు పోయి దర్శనము చేసికొనిరి. నేనును పోయి సేవించితిని. ఆ జనసమూహమున, ఆ ఆలయపు వాస్తవికసౌందర్య మరసి యానందించు నవకాశ మబ్బలేదు. అప్పుడే మొదటిసారిగ *మణిఅయ్యరును మేము చూచితిమి. దేశికులును, వారికి చెందినవారును శ్రమపడక కుంభాభిషేకదర్శనము చేసికొనుటకు వారు వెంట నుండి సహాయము చేసిరి. వారిని చూచిన యా కొలది నిమిషములలో వారి 'చలాకీ'తనము, ఉపకారచింతయు, జనులకు వారియెడ నున్న గౌరవభావమును మేము తెలిసికొంటిమి.

కుంభాభిషేకదర్శనానంతరము దేశికులు తమ విడిదికి పోయిరి. మణిఅయ్యరును చూచినది మొదలు వారితో కొంచెము సేపు ముచ్చటింపవలె నను భావము వారికి కలిగెను. అందుచే తగు పెద్దమనుష్యుల మూలమున "తమరిని చూచి మాట్లాడి పరిచయము చేసికొనవలె నను నుత్కంఠ యధికముగ నున్నది. మే మచ్చటికి వచ్చి చూడ వీలు కాలేదు. ఒక్కొక్క నిమిషమునను తమరిని చూడవలె నను కలవరముతోడనే యున్నాము" అని చెప్పి పంపిరి. దానిని విని మణిఅయ్యరుగారు "మాకును వారిని చూడవలె నను ఔత్సుక్యము ఉన్నది" అని చెప్పి ఒక నిర్దిష్టసమయమున రానున్నట్లు ముందుగనే తెలియజేసి అట్లే దేశికుల విడిదికి వచ్చిరి. ఆ మేధావిని చూడవలయు ననియు వారి సంభాషణ వినవలె ననియు తలచి పలువురు గుమిగూడియుండిరి. దేశికులు తగిన ప్రతినిధిని నియమించి వారి కెదురేగించి, వారిని పిలిపించి రావించి, కూర్చుండబెట్టి సంభాషణ యుపక్రమించిరి.

సహృదయులగు మణిఅయ్యరును, మిక్కిలి రసికులగు సుబ్రహ్మణ్యదేశికులును మాట్లాడునపుడు ఆ సంభాషణలో మాధుర్యము నిండి పొంగారుచుండెను. అక్కడ సమావిష్టులై యున్నవారు తెరచిన కన్నులు మూయకయే, చెవు లొగ్గి, వారిని చూచుచును, వారి సంభాషణ వినుచును ఆనందించిరి. మణిఅయ్యరు జంకుగొంకులు

---

* తరువాతి కాలమున న్యాయాధిపతిగ నున్న సర్ ఎస్. సుబ్రహ్మణ్య అయ్యరుగారు.

లేక, అడ్డమాకలు లేక విషయములు ప్రతిపాదించునపుడు వారి ధైర్యము, సత్యమందు వారి కున్న విశ్వాసమును వ్యక్తమాయెను. దేశికులు మిక్కిలి మృదువై, సన్ననై, మధురమైయున్న మాటలతో ఆ పెద్ద మనుష్యులను శ్లాఘించిరి. సంస్కృత శ్లోకములను, తమిళపద్యములను చెప్పి హర్షింపజేసిరి. మణిఅయ్యరు కావ్యరసమనుభవించు స్వభావముగలవా రగుటచే వానిని విని యనుభవించిరి.

ఆ మహాజనసముదాయమున మధురామహాపత్తనమునకు ప్రాణసమానులైయున్న మణిఅయ్యరుగారి మ్రోల ఏదైన పద్యములు చదివెడు సందర్భము నాకు లభించు నని యెదురుచూచితిని. అప్పుడు సమీపమున నున్న వేణువనలింగ తంబిరాను ఒక సందర్భమును కలిగించిరి. మాటల మధ్య "మాయూరము మునసబు వేదనాయకంపిళ్లెగారు మహాసన్నిధానశ్రీవారి విషయమై పెక్కు పద్యములు రచించియున్నారు." అని చెప్పి నన్ను చూచిరి. మణిఅయ్యరుకూడ "ఏదీ, ఆ పద్యములు వినవచ్చును గదా?" అని చెప్పగనే నేను నా యుద్యోగము చూచుకొన నారంభించితిని. వేదనాయకంపిళ్లె చెప్పిన పలు పద్యములు చదివి వానికి కావలసిన సందర్భమును, అర్థమును విశదీకరించితిని. 'ఈ విధమైన మహాసభను వేరెచ్చట చూడగలము' అను భావముచే నాకు రాను రాను ఉత్సాహము పొంగుచుండెను.

> "నిరర్గళవితరణశీలా, సుబ్రహ్మణ్యయ్యా, ని న్నాశ్రయించినవారు పొందెడు బహుమానదానములు వారు వర్ణింపవలెనా? వారి కుక్షి చెప్పును. నడుము నుడువును. కర్ణములు కంఠమును వచించును. సగర్వమగు నడకయు పలుకును. చేతిలోని గొడుగు తెలుపును. నేను చెప్పవలసినది వే రే మున్నది?"

అను భావము గల పద్యమును చెప్పి విపులముగ నర్థవివరణ చేసితిని. పిదప "ఈ పద్యమున శ్రీవారి దానప్రకారములు వర్ణింపబడినవి. ఒకొక్క వస్తువును ప్రత్యేకముగ పొందినవారలు పలువురు గలరు. అన్నిటిని ఒక్కడే పొందుట కుదాహరణము నేనే. నేను మఠమునన్నమే పలు వత్సరములుగ తినుచున్నాను. నడుమునకు చుట్టుకొనిన బట్టలును పెట్టెలో నున్నవియు శ్రీవారు ప్రసాదించినవే. మెడలో నున్న గౌరీశంకరకంఠికయు వారి యనుగ్రహమే. చెవులకు తొడిగిన పోగులు, వ్రేలి యంగుళీయకమును వారి ప్రసాదమే. కాన నా కడుపు, నడుము, మెడ,

చెవులు, చేయి ఇవన్నియు శ్రీవారి యౌదార్యమును చాటుచున్నవి. కాని వేదనాయకం పిళ్లెగారు ఈ పద్యమందు వర్ణించిన సావష్టంభగమనము, చేతిగొడుగును నా యెడ లేవు. వీనిని నేను కోరను లేదు" అని నేను పలికి నిలిచినప్పుడు సభాసదులందరును తమ హర్షమును కోలాహలముతో తెలియజేసిరి. 'ఒక క్రైస్తవుడు ఇంత దూరము శ్లాఘించియుండెనే' యని పలువు రబ్బురపడిరి. ఏదో యొక పెద్ద పని నెరవేర్చిన వానివలె నేను తృప్తుడ నైతిని.

నే నా సభలో అట్లు ప్రసంగించుట సుబ్రహ్మణ్యదేశికులు విని మందస్మితముతోడనే తమ సంతసమును వెలిబుచ్చిరి. వారి చిరునగవు వారి సంతోషమును ప్రకటించెనని నే నప్పు డనుకొంటిని. అందులో మరొక సూచన యున్న దనియు 'సావష్టంభగమనము, చేతిగొడుగును లేవు' అని నే ననినది వారి హృదయములో పాదుకొనిన దనియు అప్పుడు నాకు తెలియలేదు; పిదప తెలియవచ్చెను.

మణిఅయ్యరు సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి. సుబ్రహ్మణ్యదేశికులు కొన్నాళ్లు అచట విడిసియుండిరి. తరువాత నన్ను పొగబండిమార్గముగ తిరునల్వేలి వెళ్లి యుండు మనియు, తాము 'రోడ్డు' మార్గముగ రాగల మనియు చెప్పి పంపిరి. నే నట్లే తిరునల్వేలి పోయి చేరితిని.

నిశ్చితశుభవేళ దేశికులు చేవంతిపురమునకు బోయి మఠమున విడిసిరి. పాండ్యదేశము పాలించుచుండిన నాయకరాజుల యధికారియగు 'చేవంతియప్పనాయకర్' అనువారిచే మఠమున కివ్వబడిన గ్రామము లెనిమిదింటిలో ముఖ్యమైనది చేవంతిపురము. అందు వారిచే నిర్మింపబడిన 'చేవంతీశ్వరము' అను నాలయ మొక్కటి కలదు.

వేణువనలింగతంబిరాను అచట కట్టించిన మఠాలయమునకు 'సుబ్రహ్మణ్యదేశిక విలాసము' అని పేరు పెట్టుటతోబాటు సుబ్రహ్మణ్యదేశికుల శ్రీమూర్తి నొక్కదానిని బొందుపరచి ప్రతిష్ఠ చేయించి పూజ చేయు నేర్పాట్లు చేసిరి. దేశికులే స్వయముగ విచ్చేసినందున వారికి కలిగిన యానందమునకు మేరయే లేదు. నా డొక గొప్ప యుత్సవదినముగనే కొండాడబడెను.

ఆ మనోహరమఠాలయమును ప్రశంసించుచు విద్వాంసులు పలువురు పద్యములు వ్రాసియుండిరి. నాటి మెరవణి యైన పిదప రెండు గంటలకుపైన వ్యాద్యముల

వచ్చితిని దేశికుల సన్నిధానమున పలువురు విద్వాంసులును, ప్రభువులును సమావేశమై యున్న సభలో నేను చదివితిని. కొందరు తాము వ్రాసిన పద్యములందలి స్వారస్యవిశేషముల తామే యెత్తిచూపిరి. అన్నియు చదివి ముగించునప్పటికి తెల్లవారెను. నే నెనిమిది పద్యముల వ్రాసితిని.

ఆ పద్యము లన్నియు ముద్రింపవలె నని వేణువనలింగతంబిరాను కోరిరి. అట్లే చేయుటకు ఏర్పాట్లు జరిగినప్పుడు తిరువావడుదుఱయందున్న వేణువనలింగవిలాసమును ప్రశంసించి వ్రాసిన పద్యములనుకూడ చేర్చి ప్రకటింపవచ్చు నని పలువురు చెప్పిరి. అట్లే ఆ రెండు విధముల పద్యములను వేరగు కొన్ని పద్యములతో బాటు తిరునల్వేలి 'ముత్తమిళాకరము' అను ముద్రణాలయమున నొక పుస్తకముగ అచ్చొత్తించి ప్రకాశమొనర్పబడినవి. ఆ పుస్తకమును దిద్ది తీర్చి వ్రాసి యిచ్చినవాడను నేనే. తరువాతి కాలమున ఎన్నో పుస్తకములు పరిశోధించి ప్రకటించు పనిలో మునిగిన నేను మొట్టమొదట ప్రకటించిన దీ గ్రంథమే. ఆ కాలమున పుస్తక ప్రచురణపద్ధతి నాకు కొంచెమేనియు తెలియదు. ఐనను నేను పరిశోధించి ప్రకటించిన మొదటి పుస్తక మను భావముచేత దానిపై నా కొక యసాధారణాభిమానము నేటికిని ఉన్నది. దాని ముఖపత్రముపై ఇట్లు ముద్రితమై యున్నది :

"శ్రీ గణపతి సహాయము. శ్రీ కైలాస పరంపర తిరువావడుదుఱ ఆధీనమునకు చెందిన చేవంతిపురమున పై బేర్కొన్న ఆధీనపు పెద్ద కార్బారి వేణువనలింగస్వామివారు వ్రాయించిన 'సుబ్రహ్మణ్యదేశికవిలాస ప్రశస్తి'. పై జెప్పిన తిరువావడుదుఱలో పై స్వాములవారు వ్రాయించిన 'కొలువు మండప' మగు 'వేణువనలింగవిలాస ప్రశస్తి'. ఇది పలువురు పండితులచే రచియింపబడి పై బేర్కొన్న ఆధీనపు భాగవతబృందమం దొక్కరైన 'అఱుముగస్వామి'వారిచేతను, పై తిరువావడుదుఱ వేంకటసుబ్బయ్యరుగారి కుమారులగు స్వామినాథయ్యరుగారిచేతను పరిశీలింపబడి తిరునల్వేలి ముత్తమిళాకరము ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది బహుధాన్య సంవత్సరము, 'ఆని' మాసము."

ఆ పుస్తకమందు వేణువనలింగతంబిరానుల చరిత్రసంగ్రహము, తిరువావడుదుఱ కుమారస్వామితంబిరాను రచించిన స్తోత్రపద్యములును, వేదనాయకంపిళ్లై సుబ్రహ్మణ్యదేశికులను కొనియాడి పాడిన పాటలును సంకలితము లాయెను. తప్పొప్పుల పట్టి చేర్చవలసివచ్చెను. అన్నియు కలిపి 32 పుట లాయెను.

ఆ పుస్తకము అచ్చగుచుండునపుడు నేనును, ఇతరులును దాని యందుము చూచుకొనుచుంటిమి. సంప్రదాయమునకై ఆఱుముగతంబిరాను పేరు చేర్చి ముద్రించియున్నను వారు నాకే యప్పగించియుండుటచేత నేనే మొత్తము గమనించి చూచితిని. అందుచేత నాకు ఆ పుస్తకము చూచినపుడెల్ల ఆనందము పొంగు చుండును.

దేవంతిపురమునుండి తిరుక్కుట్రాలమునకు పోయి కొన్ని దినము లున్న పిదప ఆధీనమునకు చెందిన గ్రామములను ఒక్కటొక్కటిగ చూచుకొనుచునే సుబ్రహ్మణ్యదేశికులు యాత్ర సాగించుచుండిరి. వెంబడి వచ్చిన మహావైద్యనాథ-య్యరును, వారి యన్నగారగు రామస్వామిఅయ్యరును ధరించియున్న రుద్రాక్ష కంఠికలను తీసికొని వానికి బంగారు బిళ్లలు వేయించిరి. నాకు తిరువిడైమరుదూ-రులో ఇచ్చిన కంఠెలో బంగారు నీరుపోసిన వెండి బిళ్లలే యుండినవి. ఆ కంఠెకు కూడ బంగారు బిళ్లలు వేయించి నా కిచ్చిరి. అప్పుడు రామస్వామిఅయ్యరు శ్లేషో క్తిగ 'వెళ్లివిల్లై తంగవిల్లై' అని చమత్కరించిరి.

(విల్లై = బిళ్ల, వెళ్లివిల్లై = వెండి బిళ్ల(లు). ఇట 'తంగవిల్లై' అనుచోట సభంగ శ్లేష: (1) తంగ + విల్లై = బంగరు బిళ్ల (లు). (2) తంగ (+వ్) + ఇల్లై (సంధిలో వకారాగమము), తంగవిల్లై = నిలువలేదు అని. కాగ వెండిబిళ్లలు నిలువలేదు అనియు, బంగరుబిళ్లలై మారిన వనియు భావము.)

'తిరుచ్చెందూరు'కు పోయి, కొన్నాళ్లు మకాము చేసితిమి. అప్పుడు సుబ్ర-హ్మణ్యదేశికులు, నన్నును మహావైద్యనాథయ్యరును బిలిచి, ఊరికి బోయి కొన్ని దినము లుండి తిరుప్పెరుందురకు మేము వచ్చి చేరునట్లును, అంతలో తాము తిరుప్పెరుందురకు వచ్చి చేరవచ్చు ననియు ఆజ్ఞాపించి పంపిరి. మేము బయలు దేరితిమి.

# 36. కవితారాధన

తిరువావడుదుఱయందు కుమారస్వామితంబిరాను చిన్న కార్వారిగా నుండిరి. సుబ్రహ్మణ్యదేశికుల యాత్రాకాలమున వారు తిరువావడుదుఱయందు కొన్ని పరిష్కారములు చేసిరి. కోవెల, మఠము, నందనవనములు (పూదోటలు) మున్నగువానిని చక్కగ నుండునట్లు గమనించుచుండిరి.

తిరునల్వేలినుండి నేను తిరువావడుదుఱకు వచ్చి కొన్ని వారములు వసించియుంటిని. ఆ కాలమున కుమారస్వామితంబిరానుతో తమిళసాహిత్యగోష్ఠి సలుపుచు సుఖముంటిని. యాత్రాకాలమున కలిసికొన్న పండితులనుగూర్చియు జరిగిన సంఘటనలను గూర్చియు వారికి చెప్పితిని.

కుమారస్వామితంబిరాను దక్షిణవీథిలో నున్న కోనేటి గట్టున నొక మందిరము నిర్మింప సమకట్టి వలసిన యేర్పాట్లు చేసిరి. చాల లోతుగ "పునాదులు" వేసి 'బేలుదారులు' పనిచేసిరి. దానిని పరికించుటకై తంబిరాను వెడలినపుడు నేనును వారితో పోయియుంటిని. అచ్చోట నొక వృద్ధు నడచుచున్న పనులపైచూపు చూచుచుండెను. అతడు ఎముకలగూటిపై కప్పిన ఉత్త తోలుమాత్రముగ నుండెను. నిలుచుటకే శక్తి లేకయుండెను. వాని జూచిన వాని మేన ప్రాణము లున్నవో, లేవో అను సందేహము పొడమును. అత డచట నెట్లు వారినుండి పని రాబట్టునాయని యక్కజపడితిని. తటాలున నొక యదలింపు కేక వినిపించెను. అట్టి దేహము నుండి యా ధ్వని పుట్టె నని తెలిసికొనినపుడు నేను నిశ్చేష్టుడనైతిని. 'ఇతడా యదలించినాడు!' అను సందేహముతో మరల వానిని జూచితిని. మునుపు వినినదానికంటె మిక్కిలి బలీయమగు నదలింపు శబ్ద మతనినుండి యుద్భవించెను. తంబిరానును జూచితిని. ఆశ్చర్యము సూచించుచు "ఈ యొడలినుండియు నిట్టి మహాధ్వని పుట్టు నొక్కో!" అని చెప్పితిని. నా హృదయము పద్యములు వ్రాయుటలో నాసక్తమై యుండుటవలన ఆ ప్రశ్న యొక పద్యపాదముగనే యమర్చి యడిగితిని. వారు నవ్వుచునే "మూర్తి చూచియె చుల్కన చేయరాదు." అని బదులు పల్కిరి.

పిదప "మీ ప్రశ్నను నాలుగవ చరణముగ నుంచి ముందటి మూడు చరణములు రచించి యొక పద్యము పూర్తి చేయుడు." అనిరి. అట్లే చేసి చెప్పగ వా రానందించిరి.

అప్పుడు గంట పదునొకం డాయెను. నేనును, వారును కావేరీస్నానమునకై బయలుదేరితిమి. పోవునపుడు "కోనేటియందే స్నానము చేసియుండవచ్చును. కావేరికి పోయిన నాలస్యమగును. నేను వచ్చినచో పని నిలిచిపోవును" అని చెప్పిరి. "మీరు నడచినచో నది నిలిచిపోవును. అప్పటనే మీరు నిలిచిన అది నడచున ట్లున్నది" అని చెప్పి వెంటనే—

"కొండొక కాలమున గోవత్సముతో కపిత్థమును గొట్టిన శ్రీకృష్ణునకు గూడ భయము గొల్పెడువాడును, విషము త్రాగి సభాతాండవ మిష్టపడెడువాడును అగు శ్రీగోముక్తీశ్వరుని శ్రీకైంకర్యమును పొరపాట్లు లేక నిర్వహించెడు వారును ఉదారయశస్కులును అగు కుమారస్వామిమునివరులు పాదనిర్మాణము చేయింప, అట్టి వారు నిలిచినచో ఆ పని నడచును; వారు నడచినచో అది నిలిచియే పోవును".

అను భావము గల పద్యమునుగూడ చెప్పితిని. "నే డేమి, కవితావేశము పొంగి వచ్చినట్లున్నదే!" అని చెప్పి తంబిరాను ఆ పద్యము మరల మరల జెప్పుచుండ విని యానందించిరి.

కుమారస్వామితంబిరాను దక్షిణసరోగృహమునకు నాలుగువైపుల నున్న పూదోటలలో పలుతీరుల పూల మొక్కలు నాటించి, పాదులు కట్టి, దవనము, మరువము మున్నగువానిని హెచ్చుగా పైరు చేసి సమీపముల నున్న దివ్య స్థలములకు పంపెడువారు. మా నాయనగారి పూజకును ప్రత్యహము పంపుదురు.

చిదంబరము శ్రీ నటరాజస్వామివారికి వానిని కొనిపోయి సమర్పింప జేయవలె నని తంబిరాను సంకల్పించిరి. ఒక దిన మొక పెద్ద పుటిక కట్టి దవనము, మరువమును అందులో నుంచి, కొందరు తంబిరానులను, నన్నును వెంబడి పిలుచుకొని చిదంబరమునకు బయలుదేరిరి. పగలు పండ్రెండు గంటలకు రైలుబండి యెక్కిపోతిమి. రైలుబండి క్రొత్తగ వచ్చిన కాల మగుటచే అందులో నెక్కిపోవుట

మిగుల వినోదముగ నుండెను. అధికముగ గుంపు ఉండదు. బండికి ఇద్దరికి పైబడి యుండుట అరుదు. మేము కొంచెమునేపు మా యిచ్చవచ్చిన వేర్వేరు పెట్టెలలో నెక్కి శ్రమాపనోదనము చేసికొంటిమి. పిదప నొక్కటిగ జేరి యొక్క చోటనే యాసీనులమై ముచ్చటించుకొనుచుంటిమి, అందరమును ఒక్కెడనే చదివిన వార మగుటచే వినోదముగ పెక్కు విషయములనుగూర్చి మాట్లాడుకొంటిమి. రైలుబండిలో ప్రయాణము చేయుటనుగూర్చి ఒక్కరొక్కరును ఒక్కొక్క పద్య ముగ వ్రాయవలె నని రచింపదొడంగితిమి. ఎల్లరును పద్యములు వ్రాయ నేర్చిన వారే. ఒక్కొక్కరును తమతమ భావము నుంచి పద్యము రచించి చెప్పిరి. ఒకే విషయమునుగూర్చి పలువిధములగు భావముల నమర్చిన పద్యము లగుటచేత నవి రసవంతములై యుండినవి. నేను రెండు మూడు పద్యములు రచించి చెప్పితిని. వానిలో ఒక 'వెణ్బా'లోని ముందు భాగముమాత్రమే ఇప్పుడు జ్ఞప్తియందున్నది.

"మెయ్యవచ్చు, బట్టలు కట్టంగవచ్చు,
నిదుర పోవచ్చు, గ్రంథాలు చదువవచ్చు..."

తిరువావడుదురయందు రెండునెలలు వసించి యుంటిమి. సుబ్రహ్మణ్య-దేశికులు తా ముద్దేశించిన చొప్పుననే తిరుప్పెరుందురకు వచ్చి చేరిరి. కొన్ని దినము లకు తరువాత దేశికులవద్దనుండి 'తండ్రిగారు మున్నగువారితో తిరుప్పెరుందురకు వచ్చి కొంత కాల ముండవలయు' నని నాకొక యుత్తరువు వచ్చెను. నేను మా తలిదండ్రులను పిలుచుకొని తిరుప్పెరుందుర చేరితిని. అచ్చట మాకై ప్రత్యేకముగ నొక విడిది యేర్పాటు చేయబడెను. సుబ్రహ్మణ్యదేశికుల దర్శనమును, సల్లాప మును అనుభవింప దలచి పలువురు ప్రభువులును, పండితులును వచ్చిపోవు చుండిరి.

ఆ కాలమున తిరుప్పెరుందుర విచారణకర్తలగు సుబ్రహ్మణ్యతంబిరాను కోవెల మొదటి ప్రాకారమునకు పశ్చిమముగ నొక యాలయము కట్టించి అందు 'మాణిక్యవాచకర్' విగ్రహమును ప్రతిష్ఠ చేయించి కుంభాభిషేకము జరిపించిరి. మహావైద్యనాథయ్యరుగారి యన్నగా రగు రామస్వామిఅయ్యరు మునుపే పెరియ-

పురాణకీర్తనలు రచించియుండిరి. అందు శైవసమయాచార్యులగు మువ్వురి చరిత్రయణగి యున్నది. నలుగురు శైవసమయాచార్యులలోనుండు మాణిక్యవాచకరు చరిత్రమాత్రమే తమిళకీర్తనలుగ లేకుండుటచేత దానిని వారు ప్రత్యేకముగ కీర్తనరూపమున వ్రాసి యచ్చట గ్రంథావిష్కరణము చేసిరి. అప్పుడు కుంభాభిషేక వైశిష్ట్యమును గూర్చియు, మాణిక్యవాచకరుచరిత్రను గూర్చియు వేర్వేరుగ పలు పద్యములు రచించి, చదివి వినిపించితిమి.

పిమ్మట తిరువావడుదురైకు బయలుదేరవలె నని తీర్మానించిన దేశికులు అందులకైన యేర్పాట్లు చేయజొచ్చిరి. నా తల్లిదండ్రులను తిరువావడుదురైకు ముందుగనే పంపివేసి నేనుమాత్రము దేశికులతో నుంటిని. మరలివచ్చునపుడు 'తిరుప్పనందాళ్'కు విచ్చేయవలె నని అచ్చట నున్న కాశీమఠాధ్యక్షులగు 'రామలింగ తంబిరాను' విజ్ఞప్తి చేసికొనియుండుటచే దేశికులు వారి కోర్కెను మన్నించి, తిరు-ప్పెరుందురైనుండి పరివారముతోడ బయలుదేరి త్రోవలో నున్న పెక్కు గ్రామములందు భక్తులు చేయు నుపచారములు స్వీకరించి కుంభకోణముమార్గముగ 'తిరు-ప్పనందాళ్'కు చేరిరి.

సుబ్రహ్మణ్యదేశికుల రాక యెరిగి రామలింగతంబిరాను బాట కిరువైపుల పెక్కు 'మైళ్ల' దూరమువరకు అరటిచెట్లు, తోరణములు కట్టించి యలంకారములు చేసియుండిరి. తిరుప్పనందాళ్ మఠములోపల, ఒక పెద్ద 'బంగళాను' వెదుళ్లతో నమర్చిరి. దానిని చూచినపుడు రాతిభవనము వలెనే తోచెను.

సుబ్రహ్మణ్యదేశికు లచ్చట విడిసిరి. రామలింగతంబిరాను చేసిన పరిచర్య లిట్లుండిన వని వర్ణింప నలవిగాదు. పాటకచ్చేరీలు జరిగినవి. పలువురు తమిళ, సంస్కృతపండితులు వచ్చి సుబ్రహ్మణ్యదేశికు లటకు విచ్చేసిన ప్రాశస్త్యమును కొనియాడి పద్యములు రచించిరి. నేనును తక్కిన విద్యార్థులును దేశికులను, రామ-లింగతంబిరానును స్తుతించి పలు పద్యములు రచించితిమి. అన్నియు 'పెక్కురు పండితుల పద్యసంపుటి' అను పేరుతో నొక్కటిగ చేర్చి పుస్తకరూపముగ ఆ కాలమున అచ్చొత్తింపబడెను.

తిరువావడుదుఱయుత్సవమును, గురుపూజయు సమీపించినందున దేశికులు బహుదినములు తిరుప్పనందాళనందు నుండ వీలుకాలేదు. కొన్నాళ్లుండి పదపడి బయలువెడలి 'తుఱైశై' చేరిరి. గురుపూజాదులు వైభవముగ జరిగినవి. దేశికులు యాత్రచే గల్గిన శ్రమ మపనయించికొనుచు అలవాటుచొప్పున జరుగుచున్నదానిని గమనించుచుండిరి. యాత్రామధ్యమున అచ్చటచ్చట గలసికొని పరిచితులైన పలువురు పెద్దలకు జాబులు వ్రాయించిరి. నడుమనడుమ పిల్లవాండ్రకు పాఠములు చెప్పుటయు కలదు.

తిరికసమయములందు చిన్నపట్టము నమశ్శివాయదేశికులయొద్ద నేను తమిళగ్రంథములు పాఠము వినుచుంటిని. పలువురు విద్యార్థులకు పాఠము చెప్పుచుంటిని. నమశ్శివాయదేశికులు కొంచెమైన తీరుబడి లేక పాఠములు చెప్పుదురు. అందులో వారికి వెనుకంజయే లేదు. ఇతరులకు వారు పాఠములు చెప్పునపుడు నేను వెంటనుండి వినుచుందును. వారి యిచ్ఛచొప్పున నేనును వారియెదుట కొందరికి పాఠములు చెప్పుదును. అన్ని విషయములందు కచ్చితముగ నుండు వారు పాఠము చెప్పునప్పుడు నేను లేనిచో వెంటనే పిలిపింతురు.

ఒకరోజు పగటి భోజనమునకు తరువాత దక్షిణసరోగృహపుష్పోద్యానమున నమశ్శివాయదేశికులు కొందరు విద్యార్థులకు పాఠము చెప్పుచుండిరి. భుక్తాయాసముచే నే నొక్కచోట పడుకొని నిదురించుచుంటిని. పాఠము నడచుచున్నప్పుడు నేను సమీపమున లేకుండుట గమనించిన వారు వెంటనే నన్ను తోడ్కొని వచ్చుటకై యొకరిని పంపిరి. వారి యాజ్ఞ మీరి మాట్లాడుట కెవ్వరును సాహసింపలేరు. నన్ను పిలువవచ్చినవారు నేను నిదురించిన ప్రదేశమునకు వచ్చి, అలసి యాదమరచి నిదురించిన నన్ను పిలిచి చూచిరి. నేను లేవలేదు. పిదప తట్టి లేపిరి. మేల్కొంటిని. అయినను నా కున్న నలత తొలగలేదు. సగము నిద్దురలో లేచినందున శ్రమ యధికమాయెను.

'పెరవారి కష్టము తెలియలేదే, ఇట్లు నిర్బంధించుచున్నారే!' అను భావము నా కేర్పడెను. నా కష్టమును నేను వెలిబుచ్చ వీలగునా? లేదా, అప్పుడు పోకుండగ నుండుటకు అలవి యగునా?

నేను నడచి పోవుచుంటినే కాని నా కాళ్లు తడబడినవి. నిద్రాభారము కంటిరెప్ప లను క్రిందకు లాగినది. పోయెడు దారిలో 'సూదిమిరప' మొక్క యొక్క టున్నది. అందుండి యొక పండు కోసి, నలిపి నా కన్నులకు పూసికొంటిని. నా కున్న యప్పటి కష్టము రానున్న ఫలిత మూహింపలేని దశలో న న్నుంచినది.

మిరపకాయ పూసికొనుటయే తడవు. కన్ను లంతయు ఒకటే మంటగ మండ నారంభించెను. 'తేలుకు భయపడి పాముపాల బడిన' కథ యైనది నా స్థితి. నే నటుపై నడవలేకపోతిని. నేలపై చతికిలబడితిని.

నా చర్య యెరిగిన యెల్లరు దుఃఖపడిరి. నా మిత్రులు మాత్రము నా కష్ట మెంతటి శ్రమ యుండి యుండవలెనో యని దాని నూహించుకొనిరి.

మఠమునకు కొన్ని సందర్భముల అవధానము చేయు పండితులు వచ్చి తమ సామర్థ్యము ప్రదర్శింతురు. అష్టావధానము, షోడశావధానము, ద్వాత్రింశదవధానము, శతావధానము అను అవధానములు చేయువారు వత్తురు. వారి ప్రావీణ్యము జూచి నేనును, ఇతరులును అచ్చెరువొందుదుము. 'మనమును ఇట్లే అవధానము చేయ వలెను' అను నాశ నాకును, ఇతరులకును ఏర్పడెను. అభ్యాసమును చేయు చుంటిమి. పిదప నొక్కనాడు నేను నా తోడ చదువుకొనుచున్నవారిని, నా యొద్ద చదివిన విద్యార్థులను ఉంచుకొని అవధానము చేయ నుపక్రమించితిని. కొందరు పద్యములకు సమస్యల నిచ్చిరి. కొందరు గ్రంథములందలి సందేహము లడిగిరి. కొందరు ప్రాతపద్యములు చెప్పి, మరల నాచే వానిని చెప్పించిరి. కొందరు లెక్కలు వేసిరి. వాని కన్నిటికిని నేను తగినట్లు సమాధానము చెప్పితిని. తక్కిన విద్యార్థు లను ఇట్టి ప్రయత్నములో అనుబంధించుటయు నుండెను.

ఒకసారి మాయూరము వేదనాయకంపిళ్లై సుబ్రహ్మణ్యదేశికుల విషయమున కొన్ని 'వెణ్బా'లు రచించి, వానిని దేశికుల సమక్షమున చదివి వినిపింపవలె నని నా కొక పద్యరూపమున తెలియజేసి వానినిగూడ పంపియుండిరి. దేశికుల మ్రోల నే నా పద్యములు వినిపించుటయేగాక ఆ వృత్తాంతమును ఈ క్రింది పద్యరూపమున వేదనాయకంపిళ్లైగారికి తెలిపితిని :

"తమ పుట్టిల్లే యని అనుకొనెడు వసువున పెక్కుఱు పండితమండనులకు రవాదుల నిచ్చెడు వితరణశీలుడవగు ఓ వేదనాయకప్రభూ, నీవు మదిలో మిగుల ముదమంది పంపిన 'వెజ్బా'ను వెంటనే సద్గ్రంథవిమర్శకసుధీ హృదయనివాసి యగు సుబ్రహ్మణ్యదేశికులయెడ నివేదించితిని. వచోదూర యశోభిరామా, ఎవ్వరి హృదయమును నొవ్వకుండునటుల నీ సంపత్సమృద్ధి నభివర్ణించితిని." (పద్యభావము)

అప్పుడప్పుడు కొన్ని చిన్న ప్రబంధములు వ్రాసితిని. సందర్భానుగుణముగ ముక్తకపద్యములనుగూడ రచించితిని. ఈ విధముగ పలురీతుల కవితారాధన యందు నిమగ్నుడనైయున్న నా కావ్యరచనాప్రయత్నము పెంపొందుచువచ్చెను. అందుచేత నితరులకు సంతోషమును నాకు పైపై ఉత్సాహమును ఫలించెను. సుబ్రహ్మణ్యదేశికులు "పిళ్లైగారి పోకడలు చక్కగ పట్టుకొనియున్నారు. మీ పద్యములు వారి స్మృతి కలిగించుచున్నవి" అని యపుడపుడు చెప్పుచుండువారు. "పిళ్లైగారు పెట్టిన బిచ్చమే నా తమిళపుతెరువు" అను స్మృతియందే జీవించుచున్న నా హృదయమును ఆ మాటలు మిక్కిలి చల్లబఱచేసినవి.

# 37. క్రొత్త బ్రతుకుతెరువు

1880 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 12 వ తేది గురువారము తెల్లవారెను. నాటి యుదయమున నే నలవాటుచొప్పున ఉత్సాహముగ నుంటిని. 'తిరువావడుదుఱై ఆధీనపు ప్రాపు నన్నుచ్చదశయందుంచి వృద్ధికి తెచ్చెను' అను తలపు నాకును, నాకు సంబంధించినవారికిని ఉండినది. నా జీవితమందు ఒక విధమైన నిలుకడ యేర్పడిన దనియే నేను భావించితిని. పిళ్లైగారి పదవి వహించెడు యోగ్యత నాకు లేకున్నను వారి విద్యార్థిపరంపరను వృద్ధికి తెచ్చు కైంకర్యము నా జీవనముఖ్య కార్యముగ నుండు నని యెదురుచూచితిని.

కాని దేవుని తలంపు మరొక విధముగ నుండినది. మఠసంబంధ మొక్క-డానితో నిలువక నా యుపాధ్యాయవృత్తియు, పరిశోధనయు, తమిళభాషాసేవయు పైపై విస్తృతి నొంద వలసిన సుచరితము నాయెడ నుండినది కాబోలును! అది తన ప్రభావము చూప నారంభించెను; కుంభకోణమునుండి త్యాగరాజచెట్టియారను గురువారమునాడు అపరాహ్ణవేళ (ఆ సుచరితము) తిరువావడుదురైకు తీసికొనివచ్చి చేర్చినది. నా నూతనజీవన మారంభమాయెను.

త్యాగరాజచెట్టియారు మఠమునకు వచ్చినపుడు చిన్న పండారస్వామియగు శ్రీ నమశ్శివాయ దేశికులు పగటి భోజనము చేసి భుక్తాయాసము తీర్చుకొనుచుండిరి. అప్పుడు రెండుగంట లుండును. దేశికుల కోర్కెమేరకు ఆ సమయమున కొందరు విద్యార్థులకు నేను కాంచీపురాణము పాఠము చెప్పుచుంటిని. తిన్నగ మే మున్న చోటికి చెట్టియారు వచ్చిరి. తమ రాక యెరిగి వచ్చిన నమశ్శివాయదేశికులకు నమస్కరించి వారు కూర్చొనిన తరువాత మాటాడిరి. ఒక గంటసేపటివరకు మాట్లాడుచుండి "మహాసన్నిధానశ్రీవారి దర్శనము చేసికొనవలె నని వచ్చితిని. ఉత్తరు వీయవలెను." అని చెప్పి బయలుదేరిరి. వారి మాట చొప్పున నేనును వెంట నేగితిని.

శ్రీసుబ్రహ్మణ్యదేశికులయొద్దకు మేము వెళ్లిన సమయమున వా రొకరికి కంబరామాయణమునందున్న సందేహములను తీర్చుచుండిరి. చెట్టిగారును, నేనును అది గమనించితిమి. సందేహము అడిగినవారు తమ పని ముగించుకొని వెడలి పోయిన తరువాత చెట్టియారును, సుబ్రహ్మణ్యదేశికులును కంబరామాయణము విశిష్టతనుగూర్చి సంభాషించిరి.

ఇట్లొక గంట ప్రొద్దు సంభాషణయైన పిమ్మట చెట్టియారు "ఒక విజ్ఞప్తి" అనిరి.

సుబ్రహ్మణ్యదేశికులు :—ఏమి, చెప్పవచ్చునే.

చెట్టియారు :—స్వామినాథయ్యరుకు నా యుద్యోగ మిప్పింప సంకల్పించు చున్నాను. కృప జేసి శ్రీవారు దాని కుత్తరు నిప్పింపవలెను.

దేశికులు :—దాని కేమి? చూచుకొందము లెండు. మీ రుద్యోగము విడిచి పెట్టునపుడు ఆలోచించుకొనవచ్చునే?

చెట్టియారు :—పనినుండి విరమించుకొంటిని. డాక్టరుసర్టిఫికేటుకూడ ఇచ్చి యయినది. ఇప్పుడు నా పదవిలో నెవ్వరును లేరు.

అతర్కితమగు నీ వార్త విని దేశికులు నిశ్చేష్టులయిరి. నేనును భ్రమ సితిని.

దేశికులు :—ఈ విషయము మీరు ముందుగ తెలియజేయలేదే? మీ రింకను కొన్ని సంవత్సరములు పని చూచుకొనగల రని మేము తలచుచుంటిమి.

చెట్టియారు :—పనినుండి విరామము పొందునట్లుగ నే నొక వారము క్రింద టనే వ్రాసి యిచ్చితిని. స్వామినాథయ్యరును నా స్థానమున నియమించుటకైన యేర్పాట్లు చేసియున్నాను. వీరిని పంపి పనిచూచుకొనున ట్లుత్తరు వనుగ్రహింప వలెను.

దేశికులు రెండు నిమిషము లాలోచించిరి. పిమ్మట "వీ రిచ్చట నుండుట మిక్కిలి యుపయోగకరముగ నున్నది. అ ట్లగుట నిప్పుడు వీరిని పంపుటకు వలను పడదు" అనిరి.

చెట్టియారు కడు విచారముతో "సన్నిధానమున అ ట్లుత్తరువు రాకూడదు. కాలేజి ప్రిన్సిపాలు గోపాలరావుగారియొద్ద నేను మాట యిచ్చితిని. మరి కొందరు ఈ యుద్యోగమునకై మిగుల ప్రయత్నించుచున్నారు. వీరికే యిప్పింపవలె నని చెప్పి రావుగారి వాగ్దానముకూడ పొంది వచ్చియున్నాను. వీరియెడ శ్రీవారికి గల మిక్కుటపు వాత్సల్య మరసి, ఇది మంచి పని యను భావముతో ఈ ప్రయత్నము చేయదొడగితిని. ఇందువలన నెల్లరకును శ్రేయస్సు, కీర్తియు కలుగును" అని వచించిరి.

దేశికులు సమ్మతింపలేదు. చెట్టియారు మరల కొన్ని హేతువులు చెప్పి సమర్థించి నన్ను పంపవలయు నని వేడుకొనిరి. రాత్రి ఏడు గంట లయిన పిదప దేశికులు "ఉండవిండు. అనుష్ఠానము ముగించుకొని నమశ్శివాయమూర్తిదీపారాధనదర్శనము నకు రండు" అని చెప్పి యనుష్ఠానములు నెరవేర్పబోయిరి.

చెట్టియారును నేనును లేచి ఈవలికి వచ్చితిమి. త్రోవలో నెదురుపడిన కుమారస్వామితంబిరానును చూచి చెట్టియారు తాము వచ్చిన పని తెలియజేసిరి. వారు,

"మీరు చెప్పెడిది సాధ్యపడని సంగతి. మఠమునకు, మిక్కిలి యుపయోగముగ నున్న వీరి నెడబాయుటకు శ్రీవా రొప్పుకొందురా? నాకు నుచితముగ తోచలేదు. తక్కినవారు నట్లే యభిప్రాయపడుదురు" అనిరి.

"ఈ సంకటమునకు నే నేమి చేయుదును?" అని గొణుగుచునే చెట్టియారు వారిని వదలి నడచిరి. పిదప నన్ను చూచి "వీరి మాటల నన్నిటిని లక్ష్యపెట్టవలదు. ఏమియు మాటాడక 'పోవుచున్నాము' అని చెప్పివేసి నాతో రండు. ఈ మఠమున జీవితకాల మంతయు సేవజేసినను మీ కీ దశనుండి కొంచెమేని యున్నతదశ కలుగదు. ఇక్కడ ఒక సంవత్సరమునకు లభించు నేబది రూప్యములు అచ్చట ప్రతిమాసము పొందవచ్చును. ప్రొద్దు పొడిచినది మొదలు రాత్రి పదిగంటలవరకు ఇచ్చట గొంతు నొప్పి పుట్టునట్లు పాఠము చెప్పవలెను. తక్కిన పనులుకూడ గమనింపవలెను. అచ్చట దినమునకు నాలుగు గంటలకు పైబడి పని యుండదు. ప్రతివారము రెండు దినములు ఆటవిడు పుండును." అని వారు ఇంకను పలు విధములుగ రెండుచోట్లకును గల వ్యత్యాసమును బాగుగ చెప్పిరి. ఇదియంతయు నేను చెవిలో వేసికొనక "కుంబ కోణమునందున్న సౌకర్యములనుగూర్చి తాము చెప్పినదానిని నేను గమనించితిని. ఇంతకంటెను మేలైన చోటొక టుండు నని యింతవరకు నాకు తోచలేదు. ఏ విధ మునను ఇచ్చట కొదవ లేదు. వేతనము స్వల్ప మనరాదు. మా కే విధముగను చింతయే లేకుండునట్లు సన్నిధానశ్రీవారు చూచుకొనుచున్నారు" అని ప్రత్యుత్తర మిచ్చితిని. తిరువావడుదురైమఠమునన్నము ఎంతగ నా యొంట బట్టి యున్నదో ఆ సంగతి చెట్టియారు చక్కగ తెలిసికొనలేకపోయిరి.

నా మన స్పూగిసలాడుచుండెను. కాలేజియుద్యోగము నా చిత్తము నాకర్షించి నది. కాని తిరువావడుదురైమఠమునందున్న ప్రేమ నా ప్రాణములతో నొక్కటై కలసి పోయెను. సుబ్రహ్మణ్యదేశికులు నన్ను పంప సమ్మతింపలేదు—అని తెలిసికొని-నపుడు నాయెడ వారికి గల యభిమానము నొక్కసారి యోచించిచూచితిని. "మానవునకు ధన మొక్కటేనా పెద్దది? మఠమునకు లేని గొప్పతనము కాలేజికి రాబోవునా? దీని గౌరవ మేమి? గొప్పతన మేమి? దీని సంబంధ మేర్పడుట యంత సులభమైనది కాదు." అని యి ట్లెల్ల నేను సుదీర్ఘముగ నాలోచించితిని. ఎడనెడ త్యాగరాజచెట్టి యారు పలికిన యాశాజనకములగు పలుకులు నాకు మైకము కలిగించినవి.

చెట్టియారు చెప్పిన దంతయు విడువక వినుచుండిన నేను ఒక విధమైన నిర్ణ-యమునకు వచ్చి "సన్నిధానశ్రీవారు ఉత్తరు వొసగిననే నేను వత్తును. లేనిచో రాజాలను" అని తీర్మానముగ వారికి చెప్పివేసితిని.

"నా మాటలయందలి న్యాయము మీ కిప్పు డవగతము కాదు. తరువాత తెలియవచ్చును. శ్రీవారి యుల్లమును మరల కరగింప ప్రయత్నింతును." అని పలికి వారు తాము విడిసియున్నచోటికి జనిరి.

ఏమియు తేలని యాలోచనలతో నే నిల్లు చేరితిని. నా తలిదండ్రులయొద్ద విషయమును వెలిబుచ్చితిని. నాయనగారు "ఇచ్చట నెన్నో వసతు లున్నవి. జను లెంతో యాదరముతో నున్నారు. ఇట్టి ప్రదేశము వే రెక్కడు దుండును?" అనిరి అమ్మగారికిని తిరువావడుదుఱ వదలిపెట్టుటకు మనసొప్పలేదు.

మరునాడు శుక్రవారము. ప్రొద్దున లేచితిని. మనస్సు నిలుకడ లేక యుండినది. చెట్టి యారు నన్ను తోడ్కొని సుబ్రహ్మణ్యదేశికులయొద్దకు జనిరి. చనునప్పుడు వారు "మీ రూరక యుండుడు. మీ అభిప్రాయ మేదియు చెప్పవలదు. శ్రీవారి సమ్మతి నెట్లైన పొందియే తీరుదును.'' అని చెప్పిరి.

దేశికులను చూచి, వందన మొనర్చి చెట్టియారు దగ్గర కూర్చుండిరి. నేనును కూర్చుంటిని. చెట్టిగారు నన్నుగూర్చి సంభాషణ యుపక్రమింతు రని యెదురుచూచి తిని. కాని వారు వేరు విషయమునుగూర్చి మాటాడ మొదలిడిరి. "పిళ్లైగారు తిరు చ్చిరావల్లిలో నుండినపుడు 'త్యాగరాజలీల' రచించిరి. అది పూర్తి కాలేదు. వా రది రచించుచుండగ నేనే దానిని తాటాకులలో వ్రాసితిని. ఆ ప్రతి యిచ్చట నున్నది. ఆ గ్రంథములోని పై భాగమును నేను వ్రాసి పూర్తిచేయవలె నని తలచుచున్నాను. ఆప్రతి వెదకి యిచ్చునట్లు సెల వొసంగవలెను" అని వారు ప్రార్థించిరి. దేశికులు ప్రతి తీసుకొని వచ్చుటకు న న్నంపిరి. నేను పోయి గ్రంథాలయమున పావుగంట నేపు వెదకి ఆ తాళపత్రగ్రంథమును తీసికొని వచ్చి యిచ్చితిని. నేను పుస్తక శాలకు పోయియున్నపుడు దేశికులును, చెట్టియారును నన్నుగూర్చియే మాట్లాడు కొనుచుండి రని తెలియవచ్చెను.

దేశికులయొద్దనుండి చెట్టియారు త్యాగరాజలీలతాటాకుప్రతి సంపాదించు కొనిరి. పిదప "నేను వచ్చిన పనిని అనుకూలముగ ముగియునట్లు చేసి నన్ను సంతోషపెట్టి పంపవలయును." అని నొక్కి నొక్కి చెప్పి ప్రార్థించిరి.

దేశికులు :— "మీ రిప్పు డిచ్చటనే యుండు టవసరము. పిదప సందర్భ మేర్పడినచో చూచుకొనవచ్చును."

త్యాగ :- "పిదప సందర్భము దొరకు టరుదు. ఆ స్థానము మిక్కిలి యున్నత మైనది. జీతము తక్కువగ నున్నను దానివలన కలుగు గౌరవ మధికము. అక్కడ చదువుకొను పిల్లవాండ్రందరును తరువాతి కాలమున గొప్ప గొప్ప ఉద్యోగస్థులు కాగలరు. ఈ మతముసంబంధముగలవారు అచ్చట నున్నా రనునది ఈ చోటికి గొప్ప గౌరవము కాదా? ఇంతవరకు నేను మతమునుగురించి యెన్నియోమాటలు ప్రస్తావించియున్నాను. నాకు తరువాత తెలియనివా రెవ్వరైన వచ్చినచో మతము సంబంధము వదలిపోవును. మీ రున్నచో నది యనువర్తించును. అందుచే పలు విధము లగు ఆనుకూల్యము లున్న వనునది శ్రీవారికి తెలియనిది కాదు. ఈ మతసంబం- ధము కలవారుగను, అయ్యగారియొద్ద చదివినవారుగను ఉండవలె ననునదే నా యాశయము. మీ రచ్చటకు వచ్చినను ప్రతివార మిచ్చటకు రావచ్చును. విరామదినము లలో ఇటకే వచ్చి యుండవచ్చును. నే నిన్ని విషయములను ఆలోచించియే ఈ విన్న పము చేసికొంటిని. నేను వేడుకొను ఈ వరమును ప్రసాదించి యనుగ్రహింప వలెను."

ఇట్లు చెప్పి, చెట్టియారు లేచి కేలు మోడ్చి వందన మొనర్చిరి. వారు మెట్లుమెట్లుగ విషయములు ప్రతిపాదించునపుడు దేశికులు మిక్కిలి యవధానముతో వానిని వినుచుండిరి. చెట్టియారు చెప్పిన మాటలతోబాటు వారి ముఖభావములు, కై మోడ్పును కలసి వారి కా విషయమున నెంతో యౌత్సుక్య మున్న దని తెలియజేసి నవి. నా స్థితియు, మతముకీర్తియు ఈ పనిచే నభివృద్ధిపొందు నని దేశికులు తెలిసి కొనినట్లుగనే తోచినది. వారి మనసు కరగినది. కొంచెముసేపు మౌనముగ నుండిరి. "సరిమే, ఏమి చేయవలయును?" అని యడిగిరి.

ఆ ప్రశ్నలో అనుకూలమైన ధ్వని యుండుట చెట్టియారు తెలిసికొనిరి. వెంటనే "వీరి కుద్యోగ మిప్పింపవలె నని గోపాలరావుగారి కొక కమ్మయు, వీరి

కొక యోగ్యతాపత్రికయు సన్నిధానశ్రీవారు తమ శ్రీహస్తములతో ప్రసాదింప వలెను." అని యడిగికొనిరి. దేశికులు వ్రాయసకాడగు పొన్నుసామిచెట్టియారును రప్పించి రెంటిని చెప్పి వ్రాయించిరి. యోగ్యతాపత్రిక క్రింద కనుపరచిన రీతిగ నుండెను.

ఈ పత్రికలో వ్రాయబడియున్న స్వామినాథయ్యరు మా యాధీనవిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్లెగారియొద్ద ఆరేండ్లు లక్ష్యలక్షణ గ్రంథములు చక్కగ చదువు కొనుటయేగాక మాయొద్దకూడ నాలుగు సంవత్సరములుగ చదువుకొనుచున్నారు. లక్ష్య లక్షణ గ్రంథములను తేటతెల్లముగ బోధించుటయందు సమర్థులు. మంచి నడవడిక కలవారు.

ప్రమాథిసంవత్సరము, కుంభరవి, 3 వ తేది }
తిరువావడుదుఱై-అధీనము } సుబ్రహ్మణ్యపండార సన్నిధి.

రెంటిని వ్రాయించిన తరువాత గోపాలరావుకైన జాబుపై చేవ్రాలు చేసి, యోగ్యతాపత్రికపై చేవ్రాలు చేయు సమయమున సభాపతిపూజాఘంట గణగణ మని మ్రోగెను. అప్పుడు చెట్టియారు "వీరి కుద్యోగ మైనది" అని సంతోషమున లేచి, చప్పట్లు చరచుచు నాట్య మాడిరి. నన్ను పంపెడు విషయమున మనశ్శాంతి లేక యున్న దేశికులకు సంపూర్ణసమ్మతి కలిగెను. "వీరిని పంపించుటకు మనకు సమ్మతి లేకున్నను దైవ మాజ్ఞాపించుచున్నది. దైవసంకల్పము నడ్డుకొన సాధ్యమా ! సరి. శుభసమయము చూచి వీరిని పంపింతుము. విచారపడవలదు" అని వారు పలికిరి. చెట్టియారు మిగుల సంతోషించిరి.

కుంబకోణముకాలేజిలో నుద్యోగమునకై నన్ను పంపుటకు శ్రీ సుబ్రహ్మణ్యదేశికులు సమ్మతించి రను వార్త ప్రచండవేగముతో నన్నియెడల వ్యాపించెను. మఠమునకు సంబంధించినవా రెల్లరును ఇది విని నగచిరి. త్యాగరాజచెట్టియారు పగటి భోజనమునకైన నుండక "ఇంటిలో నొక శ్రాద్ధము జరుగవలెను" అని సుబ్రహ్మణ్యదేశికులయొద్ద చెప్పి, చెచ్చెర సెలవు పుచ్చుకొని కుంబకోణమునకు వెడలిపోయిరి.

నే నింటికి పోయి మా తల్లిదండ్రుల కీ విషయము నివేదించినపుడు వారు సంతోష మనిగాని, దుఃఖ మనిగాని తెలియని ఒక వింత యవస్థలో నుండిరి. నాకో ఒకే

మైకము క్రమ్మినట్లుండెను. పరిచిత మయిన యీ ప్రదేశమునెడ గల యాసక్తియు, నూతనప్రదేశమున కలుగబోవు గౌరవమును ఒకదానితో నొకటి పోరాడి నా మనస్సు నలియజేసినవి.

సుబ్రహ్మణ్యదేశికులు కర్పూరహారతి యిచ్చి మహాపూజమండి భక్తులకు విబూది ప్రసాదించుటకై 'ఒడుక్కము'నకు పోవుట యలవాటు. తంబిరానులు పలువురును, భక్తులు పలువురును వెంట నంటిపోవుదురు. అప్పుడు చిన్నపండార-సన్నిధిస్వామివారు సుబ్రహ్మణ్యదేశికులకు కైదండ యొసగి పిలుచుకొని వత్తురు.

ఆ దినము పూజ జరిగిన తరువాత దేశికులు 'ఒడుక్కము'నకు వచ్చిరి. నన్ను కుంబకోణమునకు పంపించు విషయమునుగూర్చియే వారి మనస్సు చింతించుచుండి యుండవలెను. అప్పుడు వారు చిన్నపండారస్వామిని చూచి "చిన్నపండారస్వామీ, స్వామినాథయ్యరును త్యాగరాజచెట్టియారుగారి యుద్యోగమునకు పోవుటకు సిఫారసు చేసితిమి. చెట్టియారు నిన్న వచ్చి పోయినది వారిని పిలుచుకొని పోవుటకే. మేమును సమ్మతించి యోగ్యతాపత్రికయు, 'సిఫారసు' పత్రమును వ్రాసి యిచ్చి యున్నాము" అనిరి.

నమశ్శివాయదేశికు లాశ్చర్యపడి "అట్లు చేయవచ్చునా! వా రిచ్చోటి సంప్రదాయముల నెల్ల చక్క నెరిగినవారు. వచ్చెడు విద్వాంసులయెడను, ప్రభువులయెడను మర్యాదగ నడచుకొనువారు. విద్యార్థులకు బాగుగ పాఠములు బోధించుచున్నారు. వా రుండుట ఈ చోటికి ఉపయోగముగ నున్నది. వారిని పంపించుట యందు దాసునకు సమ్మతియే లేదు" అనిరి.

మఠమునకు చెందినవారి కందరికిని ఇట్టి భావమే యుండెను. అందరును సుబ్రహ్మణ్యదేశికులు దీని కెట్లు సమ్మతించిరా యనియే తలచి విస్మితులైరి. ఇతరులు నొక్కిచెప్పినను నన్ను మఠమునుండి వెలుపలికి పంపించుటకు వా రొప్పుకొన రనియే వా రందరు తలంచియుండిరి.

నమశ్శివాయదేశికులు చెప్పినది విన్న ఆధీనాధ్యక్షులు తమ భావమును విశద పరచిరి. "మీరు చెప్పెడిది సత్యమే. వారివలన మఠమున కెంతో లాభ మున్న దన్నది యెల్లరకును తెలిసినదే. అయినను వారి శాశ్వతశ్రేయస్సు నుద్దేశించియే దీనికి మే మొడబడితిమి. ఇచ్చట మే మున్నంత కాలము వారి కే కొదవయు

మందుకు. కాల మొకే తీరుగ నుండదు. మా కాలమునకు తరువాత వారియెడ మావలెనే ప్రీతి యుంచి కాపాడుదు రని నిశ్చయముగ చెప్ప వీలుకాదు. ఎవరైన నొక్కరు ఇచ్చట తటాలున వెలసి 'వీరు చెప్పెడి పాఠమును నేనే చెప్పుదును. వీరికి జీత మిచ్చుట అనవసరము' అని చెప్పవచ్చును. పిదప వా రేమి చేయుదురు? ఇట్టి ప్రదేశములందు పలువురి దయ యుండిననే నిలుకడగ నుండ వీలగును. అధ్యక్షులు మొదలుకొని ఉగ్రాణమువాని వరకు అందరి ప్రీతియు ఒకరు పొందియుండు టన్నది అరుదగువానిలో నెల్ల అరుదు. మనచే ఆదరింపబడినవారు సౌఖ్యముగ నుండవలె నని మా యాశయము. అందుచే స్వామినాథయ్యరు రాజకీయోద్యోగమునందు నెల కొన్నచో పిదప వారి యభివృద్ధి కెట్టి లోటును సంభవింప దని తలచియే వారిని పంప నిశ్చయించితిమి. వారు సుఖావహ మగు స్థితిలో నుండుట మనము ఉండు నప్పుడే కనులార గాంచవలెను" అనిరి.

మధ్యాహ్నముమీదట దేశికులు మా నాయనగారిని, పినతల్లిభర్తగారిని పిలుచుకొని వచ్చునట్లు చేసి తమ తీర్మానము తెలియజేసిరి. వారు కలగిపోయిరి. దేశికులు తగిన సమాధానములను సమర్థించి చెప్పిరి.

అటు తరువాత మూడు గంటలకు జోస్యుల రావించి మంచి రోజు చూడు డని చెప్పగ వారు "నేటి రాత్రి ఎనిమిది గంటలకే మంచి వేళగ నున్నది. అప్పుడు పంపవచ్చును" అని చెప్పిరి. వెంటనే దేశికులు నాకు చెప్పి పంపి రావించి "నేటి రాత్రి మిమ్ము పంపింపనున్నాము. సిద్ధముగ నుండవలెను" అని వచించిరి. నా మనస్సు మిక్కిలి కలగబారెను. ఇంత త్వరలో వారిని బాయవలసి యుండు నని నేను తలపనే లేదు. గురువారమునాడు ఈ ప్రస్తావ మారంభమైనప్పటినుండి దీని సంబంధమున జరుగుచు వచ్చిన యేర్పాట్లు, 'దైవసంకల్పము దేనిని జరిపించునో అది మిగుల వేగిరముగ సాగును' అనుటను, 'తక్కిన సంఘటన లన్నియు దానితో పొందికగ అనుకూల్యము గలిగించు' ననుటను బోధించినవి.

"నేటి రాత్రియే బయలుదేరవలెనా?" అని నేను మెల్లగ తడబడు గొంతుకతో నడిగితిని.

"ఔను. మంచి సమయము చూచి చెప్పు డని జోస్యుల నడిగినపుడు, రాత్రి యెనిమిది గంటలకుపై బయలుదేరుట మిక్కిలి మంచి దని చెప్పిరి. మంచి పని వేగమే నెరవేర్చుట శ్రేయస్కరము" అనినారు దేశికులు.

మాట్లాడ నాలుక కదలలేదు. ఇంటికి పోయి ప్రయాణసన్నాహములు చేయ మొదలిడితిని. ఎట్టి యేర్పాటు చేయుట? దేనిని తీసికొనిపోవుట. దేనిని వదలి పోవుట? అవి బోధపడలేదు. ఏవో చేతికందిన బట్టలను, పుస్తకములను తీసికొంటిని.

సాయంకాలము సుబ్రహ్మణ్యదేశికులు దేవాలయమునకు పోయి దర్శనము చేసికొని మఠమునకు వచ్చి నన్ను రమ్మని చెప్పి పంపిరి. పోతిని. "సరియైన కాలమున మీరు బయలుదేరవలెను" అని చెప్పినారు. 'మొకమాలు పట్టుఅంగీయు, తలగొడుగు, చిన్నఅంగీ, జరీపనిగల పెద్ద తెల్లని దుప్పటము, బహుమూల్యమగు పాలువు - వీని నన్నిటిని ప్రసాదించి, "అన్నియు ఉపయోగించుకొనుము" అని వాత్సల్యము తొణికిసలాడ చెప్పిరి. పిమ్మట పెద్ద చంద్రకలపచేతిపెట్టె యొకటి, ఒక చిన్న మేజా, ఒక చిన్న చేతిపెట్టె, కొలంబోనగరమందున్న భక్తు లొకరు తెచ్చియిచ్చినట్టిదియు, నలువది రూపాయలు విలువగలదియు నగు దంతపుపిడి యమర్చిన పట్టుగొడు గొకటి—వీనిని తెప్పించి ఒక్కొక్క పెట్టెయందును ఒక్కొక పదకొరూపాయి పెట్టి నా కిచ్చిరి. ఆసన్నపరిచారకులగు షణ్ముగంపిళ్లె అనువారిని పిలిచి, "రేపు మీరు కుంబకోణమునకు పోయి వారి కాళ్లకు పాపోసుల జోడు కొని యిచ్చి, ఈ గొడుగుకు ఒర తొడిగించి, ఇంకను వీరి కే మేమి కావల యునో అవి యన్నియు సమకూర్చి రండు" అని యాజ్ఞాపించిరి.

నన్ను చూచి "స్వామినాథయ్యరూ, మనము మధురకుంభాభిషేకమునకు పోయి యున్నపుడు ఒక మహాసభలో మణిఅయ్యరుగారియెదుట వేదనాయకంపిళ్లె గారి పద్యములను చెప్పి "సావష్టంభమగు నడకయు, గొడుగును నాయెడ లేవు" అని చెప్పినది మీకు జ్ఞప్తిలో నున్నదా? ఆ లోట్లు రెండును ఇప్పుడు తీరినవి." అని చెప్పిరి. నేను బహుదినముల క్రిందట చెప్పినదానిని స్మృతియం దుంచుకొని దేశికులు అప్పు డట్లు చేయుటను, వారి ప్రేమను తలచి తలచి కరిగిపోతిని. "సగర్వ మగు నడక యేనాటికిని రాదు" అని చెప్పితిని.

మీరు త్యాగరాజచెట్టియారుగారి పదవి వహించి గొప్ప ఖ్యాతి సంపాదించు టయే గాక, చెన్నపట్టణమునకు పోయి తాండవరాయమొదలియారు, మహాలింగయ్యరు, విశాఖప్పెరుమాళయ్యరును ఉండి పాలుపారిన స్థానమును పొంది మంచి యశస్సు నార్జించి శోభిల్లవలెను" అని పలుకుచు తాంబూల మిచ్చిరి.

తల్లి తనబిడ్డకు ఉన్నతమగు పదవులెల్ల లభింపవలె నని మనసార తలంచి దీవించునటులు ఉండినవి వారి మాటలు. ఆ మహావాత్సల్యములో మునిగియున్న పుడు దాని సంపూర్ణవైశిష్ట్యము నాకు తెలియలేదు. ఎడబాయ నున్నా మను తలపు కలిగినపుడే దాని గొప్పతనము ఎన్నో రెట్లధికముగ తోచినది.

మంచి వేళ వచ్చినది. నేను సెలవు పుచ్చుకొంటిని. నా కాళ్లు మెల్లగ నడచినవి. శరీరమాత్రము ముందుకు నడచినదే కాని నా మనస్సు అచ్చటనే పడియుండెను. వచ్చునపుడు ఉగ్రాణమువాకిట నాకు తెలియకయే నిలిచితిని. నే నెట్టి వేళయైనను, ఏ వస్తువు కావలసినను పొందుచుండిన ఆ చోటు వదలిపెట్ట మనసు రాలేదు. నే నెచ్చట నట్టిచోటు లభించును ? ముందుకు సాగితిని. అచ్చటచ్చట నున్న దీపస్తంభముల చూచితిని. వానిక్రింద నెమ్మదిగ కూర్చొని ఎన్నాళ్లో చదువుకొంటిని. ఎట్టి చింతయు లేక పుస్తకములందే కన్నులు, హృదయము ఏకమైపోవునట్లు చదువుకొన సహాయపడిన వానిని వీడిపోవుచున్నామే అను తలపుతోడ దుఃఖము సమ్మిశ్రమై వచ్చెను. కొలువుమండపమునకు వచ్చితిని. అచ్చట సహాధ్యాయులతో చదువుకొనిన ప్రదేశములు చూచి మనసు కలగగ నిలిచిపోతిని. పెక్కు రాత్రులు 'లెక్కలచుట్టలు' తలక్రింద తలగడగ నిడుకొని ఆదమరచి నిద్రించుచుంటిని. ఆ చుట్టలను చూచితిని. అచ్చట నున్న ఒక్కొక్క వస్తువు సజీవమై నాతోడ ముచ్చటించున ట్లుండెను. వానినుండి నేను సెలవు పుచ్చుకొంటిని. 'అవి జడపదార్థములు కావా ? వానిపై అంతటి మమకార ముంచుట వెర్రితనము కాదా !' అని పెరవారికి తోచును. నాకు ప్రపంచమంతయు తిరువావడుదుఅమతమునందే యున్నది. అచ్చట నున్న వస్తువుల నెడబాసి చనునపుడు ప్రపంచమునే వదలిపెట్టుచున్నా మన్నట్టి తీవ్రభావము నాలో నేర్పడెను.

త్రోవలో నగుపించిన మిత్రు లందరియొద్ద చెప్పి యింటికి చేరితిని. భోజనము చేసికొని మఠమునుండి వచ్చిన బండిలో నెక్కి 'నరసింగంపేట' 'రైలు స్టేషను'కు వచ్చితిని. నన్ను వీడ్కొల్పుటకై తంబిరానులును, ఆప్తమిత్రులును, విద్యార్థులును వచ్చిరి. వారు ఎడబా టోర్వలేక దుఃఖించిరి. నేను కన్నీ రొలుక ఎల్లరియొద్ద అనుజ్ఞ పుచ్చుకొంటిని.

పొగబండి వచ్చెను. ఎక్కి కుంభకోణము చేరితిని.

# 38. పరీక్షలో విజయము

కుంబకోణము స్టేషనులో దిగి రాత్రి పదిగంటలకు నేను తిన్నగ త్యాగరాజ-చెట్టిగారి యిల్లు చేరితిని. విద్యార్థులతో మాట్లాడుచున్న చెట్టియారు అప్పుడే వారికి సెల వొసంగి పంపివేసి భోజనముకై పోవ లేచిరి. అంత త్వరలో వారు న న్నెదురు చూడలేదు. అందుచే నన్ను చూచిన వెంటనే యబ్బురపడి "ఏమిటి! ఇంతలో మిమ్ము పంపుటకు శ్రీవారికి మనసు వచ్చినదా?" అనిరి.

"ఔను. నేడు మంచిరోజుగ నున్నందున నన్ను పంపిరి. శ్రాద్ధ మని చెప్పి మీరు అవసరపడి వచ్చివేసితిరే, సరియగు కాలమున అది నడచెనా?" అని యడిగితిని.

వారు నవ్వుచునే "శ్రాద్ధము లేదు, ఏమియు లేదు. శ్రీవారికి మీపై నున్న కూరిమి చక్కగ నెరుగుదును. నే నచ్చట నిలిచియున్నచో తటాలున వే రేదైన తలచి మిమ్ము పంప వీలులేదు అని చెప్పినను చెప్పవచ్చును. ఆ భయమువలన వారు మాట యిచ్చిన వెంటనే బయలుదేరి వచ్చితిని. తటాన బయలుదేరుటకు కారణముగ 'తిథి' యని యసత్య మాడితిని. మంచి పని చేయునపుడు అసత్యమాడినను దోషము కాదు. 'నిర్దుష్టమగు శ్రేయసు కలిగించునెడల అసత్యముగూడ సత్యమందే చేరును' అను భావము గల కుఱళ్ దానినే కదా చెప్పుచున్నది." అనిరి.

తరువాత వారు ఆహారస్వీకారము చేసి కొంచెముసేపటిలో వచ్చిరి. తరువాత నేనును, వారును చాలసేపు మాట్లాడుకొంటిమి. సుబ్రహ్మణ్యదేశికులు నా కొసగిన సాలువు మున్నగువానిని చూపితిని. మిగుల సంతసించిరి. తా ముద్యోగమునకు వచ్చి నప్పటి చరిత్రయు, తమపని నా కిప్పింపదలచి రెండేండ్లుగ ప్రయత్నించుచుండుటయు వారు స్పష్టపరచిరి. కాలేజిగొప్పతనము, అచ్చట నున్న యుపాధ్యాయుల స్వభావము, పాఠము చెప్పవలసిన విధానము మున్నగు నుపయుక్తాంశముల నెన్నిటినో చెప్పిరి. నాటిరాత్రి వారియింటనే యుంటిని.

మరునాడు శనివారము ప్రొద్దున లేచి కాలకృత్యముల తీర్చుకొనిన పిదప చెట్టియారు తమ బీరువానుండి దాదాపు నూరు పుస్తకములు తీసి విభజించి, మూడు కట్టలుగ మూడు దస్త్రములందు కట్టిరి. వారియొద్ద నున్న ఒంటెద్దు బండిలో వారు వాని నుంచి, అందు న న్నెక్కు మని చెప్పి తాముకూడ ఎక్కి కూర్చుండిరి. బండి బయలుదేరినది.

"మీ సామర్థ్య మీ కాలేజిఉపాధ్యాయులకు తెలియపరచవలదా? అందుల కయితే మిమ్ము పిలుచుకొనిపోవుచున్నాను" అని చెట్టియా రనిరి.

"గోపాలరావుగారిని చూచుటకా?" అని ప్రశ్నించితిని.

"వారు మూలవిరాట్టు. వారిని చూచుటకు ముందు పరివారదేవతలను చూడ వలెను" అని వా రనిరి.

కాలేజిలో ప్రిన్సిపాలుకు తరువాతి స్థానము వహించిన సాధు శేషయ్యరింటికి పోయి దిగితిమి. పుస్తకములను వారియింటి మిద్దెమీద వా రున్నచోట నున్న ఒక వెడల్పైన 'రౌండు టేబిలు' మీద పెట్టించిరి. శేషయ్య రెక్కడో వెలుపల పోయి యుండిరి. చెట్టియా రొక కాగితపు తునుక తీసికొని "నా పదవికి నేను సూచించిన వారిని ఇప్పటికి పిలుచుకొని వచ్చియున్నాను. మీ రిటకు వచ్చి స్వయముగ పరీక్షించి నేను వారినిగూర్చి నొడివినది సత్యమా అనునది తెలిసికొనవచ్చును?" అని వ్రాసి కవరులో పెట్టి కళాశాలోపాధ్యాయులగు ఆర్. వి. శ్రీనివాసయ్యరు మున్నగువారికి చూపించి వచ్చున ట్లొకరిని పంపిరి. అది యెల్ల గమనించిన నాకు చెట్టియా రేదో పెద్ద సభ కూర్చ సన్నాహము చేయుచున్నట్లు తోచినది.

కొంచెము సేపటిలో ఆర్. వి. శ్రీనివాసయ్యరు మరికొందరు ఉపాధ్యాయు-లతో అక్కడికి వచ్చిరి. ఎచ్చటకో పోయియున్న శేషయ్యరును వచ్చిరి. వచ్చిన వెంటనే తమ 'మేజా' పై నున్న మూటలు గమనించి "ఇది యేమి?" అని యడిగిరి.

"అన్నియు తమిళగ్రంథములు," అని చెట్టిగా రనిరి. తరువాత నన్ను పరి-చయము చేసిరి.

వచ్చియున్న ఉపాధ్యాయులలో నొక్కరు "తమిళపుస్తకము లిన్ని యున్నవా?" అని యడిగిరి.

చెట్టియారు "ఇంక నెన్నియో యున్నవి. అముద్రితములైన తాళపత్రగ్రంథములు వేలకొలదిగ నున్నవి." అని పలికి వారి విస్మయ మినుమడింపజేసిరి.

మరియొకరు "ఇవి యే యే పుస్తకములు? ఇన్ని యెందులకు?" అని యడిగిరి.

"స్కాందపురాణము, కంబరామాయణము, భారతము, నైషధము మొదలైన కావ్యములును, పెక్కు ప్రబంధములును, స్థలపురాణములును, 'నన్నూల్' మున్నగు లక్షణగ్రంథములును ఉన్నవి. ఈ పుస్తకములందు ఎవరెవరికి ఏదేది యిష్టమో దానిని విప్పి యెత్తి వీరియొద్ద నిచ్చి విషయమును, సందర్భమును, అర్థమును అడిగిన చో వీరు నిర్దుష్టముగ సమాధాన మిత్తురు. అందుండి నేను మునుపు చెప్పినది సత్యమని తెలియును." అని చెట్టియా రనిరి.

వెంటనే చెట్టియారు నన్ను చూచి నాకు పండారసన్నిధివా రొసగిన యోగ్యతా పత్రికను చూపు మనిరి. నేను తీసి యిచ్చితిని. దానిని వారు పుచ్చుకొని 'వి. హను-మంతరావు' అను ఉపాధ్యాయులయొద్ద నిచ్చి చదువు మనిరి. వా రట్లే చదువ దొడగి "ఈ పత్రికలో వ్రాయబడియున్న స్వామినాథయ్యరు మా అధీనవిద్వాన్" అని చదివి నిలిపి తక్కినవారి ముఖము చూచిరి. విరామచిహ్నము లేక వ్రాసియున్న ఆ పత్రికలోని వాక్యములను ఎచ్చట కావలసినను నిలుపవచ్చును. సుబ్రహ్మణ్య-దేశికులు "మా అధీనవిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్లెగారియొద్ద ఆరేండ్లు లక్ష్య లక్షణ గ్రంథములు చక్కగ చదువుకొనుటయే గాక" అని యా శ్రేష్ఠత పిళ్లెగారికే చేర్చి వ్రాయించియుండిరి. హనుమంతరావు "స్వామినాథయ్యరు మా యధీనవిద్వాన్" అని నిలుపుట నాకు గొప్ప అనుకూల్యము కలిగించెను. నన్నే 'అధీనవిద్వాంసు' డని యెల్లరు తలచి యబ్బురపడిరి. దీనిని గమనించిన నేను 'పూర్వజన్మసుకృతఫల మిది' అని తలచి మిగుల నానందించితిని.

అటుపిమ్మట అచ్చట నున్న ఒక్కరొక్కరును ఒక్కొక్క పుస్తకము చేత నెత్తికొని యుంచుకొనిరి. మొదట ఒక్కరు 'ప్రభులింగలీల'ను నాయొద్ద విప్పి యిచ్చి మధ్య ఒక పద్యము చూపి అర్థము చెప్పవలె నని కోరిరి. నేను దానిని పరాగముగ చదివి, సందర్భమును వ్యక్తపరచి, అర్థము విపులముగ చెప్పితిని. అప్పుడు శివరామయ్య రను ఉపాధ్యాయులు "మీరు ఎట్లు కావలసినను వీరిని పరీక్షించుకొనుడు;

నావరకు తృప్తియే. వీరికి సంగీతజ్ఞాన మున్నది. పద్యములు వీనుల విందుగ చదువు చున్నారు" అనిరి.

"చదువునపుడే నిదానముగ నిలిపి నిలిపి అర్థము - స్పష్టపడునట్లు చదువు చున్నారు." అని మరియొకరు పలికిరి

పిదప సాధు శేషయ్యరు తిరువిళైయాడల్ పురాణమున కొన్ని పద్యముల నెత్తి యిచ్చిరి. వానిని తగినట్లు చదివి వినిపించి, అర్థము వివరించితిని.

నన్నూలులో మిగుల సూక్ష్మములగు ప్రశ్నలను కొన్నిటిని ఆర్. వి. శ్రీనివా-సయ్య రడిగిరి. అన్నిటికిని తృప్తిగ సమాధాన మిచ్చితిని. ఇట్లుపాధ్యాయు లొక్క-రొక్కరును తమకు తమకు తోచినట్లు ప్రశ్నించి తనివి చెందిరి.

తరువాత చెట్టియారు "క్రొత్తగ పద్యములు వ్రాయు నభ్యాసముకూడ వీరి కున్నది." అని చెప్పి, నే రచించిన పద్యములు కొన్నిటిని చదువు డని చెప్ప గనే నే చదివితిని. శ్రీనివాసయ్యరు "పాఠము చెప్పెడు సామర్థ్య మున్నదా యని మనము పరీక్షింపవలసినదే కాని పద్యరచనాసామర్థ్యము గమనింపవలసిన పని లేదు" అనిరి.

"ఆ శక్తి యున్నచో వద్దమన ట్లున్నారే మీరు!" అని చెట్టియారు చెప్పగ ఎల్లరు నవ్విరి.

ఒక ఉపాధ్యాయులు "ఇప్పు డట్లు పద్యములు (ఆశువుగ) చెప్పుదురా?" అని యడిగిరి.

చెట్టియారు "ఏదైన నొక విషయ మిచ్చినచో వేగిరముగ నది యమర్చి పద్యము చెప్పుదురు" అనిరి.

'ఏ విషయమునుగూర్చి పద్యము చెప్పు డని యడుగుదమా' యని యెల్లరును యోచించుచుండ చెట్టియారు శేషయ్యరునుగూర్చి చెప్పవచ్చుననిరి. శేషయ్యరో 'ఆరావముదన్' (కుంబకోణముదేవాలయమందలి విష్ణుమూర్తి) స్వామిని గూర్చి యుండనిండు" అనిరి. మరియొకరు "ఆరావముదన్ విషయమున ఒక ప్రాతపద్యము చెప్పినను చెప్పవచ్చును" అని చెప్పి, శ్రీనివాసయ్యరుపై చేయవచ్చు ననిరి. శ్రీనివా-

సయ్యరు "ఇచ్చట నున్నవా రెల్లరకును ఈ చెట్టియారు తమిళోపాధ్యాయులు. వారి విషయమున రచించుటయే యుత్తమముగ నుండును" అనిరి. శేషయ్యరుతోబాటు అంద రును దానికి సమ్మతి తెల్పిరి.

చివరకు "నామీదకే త్రోసివేసినారా? సరి. ఏవిషయ మమర్చవలెనో, అదియు చెప్పివేయుడు" అని చెట్టియారు చెప్పిరి.

అప్పుడు శ్రీనివాసయ్యరు "మీనాక్షిసుందరంపిళ్లైగారియొద్ద మీరు మొదట చదివినవారు. నేను తరువాత చదివినవాడను. ఇందుచే జ్యేష్ఠకనిష్ఠసంబంధము మన కిరువురకు నున్నది. ఈ బాంధవ్యముచే మీ రింతవరకు నిర్వహించుచుండిన పని నా కిప్పింపవలెను." అని యీ భావ మిమిడ్చి అయిదు నిమిషములలో ఆటుశీర్ కళి నెడిలడి యాశిరియ వృత్త మొక్కటి రచించి చెప్పవలెను" అని వచించిరి.

అందరును మౌనముగ నుండిరి. చెట్టియారు నా ముఖమునే చూచుచుండిరి. వారి ముఖమున విచారచిహ్నము పర్వెను. నేను విషయ మవగాహన చేసికొని మన స్సులో నమర్చుకొనుచుంటిని. చెట్టియారు నామీద నుంచిన చూపు మరలింప లేదు. నేను పద్యము చెప్పుదునో, చెప్పలేనో అను సందేహము వారి కుండెను కాబోలు! నాలుగు నిముసములు గడచినవి. ఐదవ నిముసమున—

> "ప్రధానద్రావిడాచార్యపదవి నలంకరించిన త్యాగరాజసమాహ్వయుడవగు నో ఉత్తమా, 'ప్రాప్త'మగు కీర్తిని బొంది వెలుగొందెడు మీనాక్షీ సుందరవిద్వత్సార్వభౌములయెడ సలక్షణద్రావిడమును నేర్చిన విధమునకు తగిన చొప్పున నీ వింతదనుక మిగుల బొందికగ నున్న కుంభకోణ నగరకళాశాలలోని నీ స్థానమును నాకు ప్రసాదించుట లెస్స."

అను భావము గల పద్యము చెప్పి ముగించుచే తడవు చెట్టియారు గంతులు వేసి "నా కడుపున పాలు పోసితిరయ్యా!" అని చెప్పి మిక్కిలి కౌతుక మందిరి తక్కినవారును 'సెబాసు!' అనిరి.

నేను పద్యమున కర్థము చెప్పితిని. చెట్టియారు "ఆ (వాయ్ప్ప) 'ప్రాప్త'మగు అను పదమును చూచి సంతోషింపవలెను. ఇంత త్వరలో ఈ విధముగ పద్య

మల్లాది అయ్యగారియొద్ద చదివి యలవడినవారికే తెలియును. 'తానుగనే వచ్చి ప్రాప్తించిన కీర్తి పొంది వెలుగొందునట్టి' అని యర్థము" అని తక్కినవారిని చూచి చెప్పిరి.

అర్థము చెప్పి పూర్తి చేయునపుడు 'త్యాగరాజసమాహ్వయునగుటే ఉత్తమా' అను సంబోధనకు వ్యాఖ్య చెప్పి, "ఆ పేరుకు తగినట్లుగ నా కుద్యోగ మిప్పించిననే మీ పేరు నిలుచును. లేనిచో నిలువదు" అంటిని.

"ఇన్ని విషయములను పొందికగ త్వరలో నమర్చు టాశ్చర్యమే. నేను చెప్పిన భావమును పరిశుద్ధాంధ్రభాష నేర్చిన విధమునకు 'తగిన చొప్పున' అని సంగ్రహించి చెప్పి, స్పష్టపరచి యున్నారు." అని శ్రీనివాసయ్యరు సంతోష పడిరి.

ఎల్లరు తమ తమ తృప్తి తెలియజేసిరి. "సాయంకాలము గోపాలరావుగారిని చూడవలెను; ఇచ్చటనే నిలిచియుండుడు. నేను వచ్చి పిలుచుకొని పోవుదును." అని చెప్పి చెట్టియారు తమ యింటికి పోయిరి. తక్కినవారును తమ తమ నివాసముల కరిగిరి.

నాడు శేషయ్యరుగారి యింటిలోనే భుజించితిని. సాయంకాల మైదు గంటలకు చెట్టియారు గోపాలరావుగారింటికి తోడ్కొనిపోయిరి. పొత్తముల దస్త్రములును మాతోడ వచ్చినవి. అటకు శేషయ్యరు, హనుమంతరావు, శ్రీనివాసయ్యరు మున్నగు ఉపాధ్యాయులును వచ్చిరి.

గోపాలరావు అప్పుడు మిద్దెపై నుండిరి. ఎల్లప్పుడు పుస్తకములతోడనే చుట్టరికము నెరపు ఆ పెద్దలు ఏకాంతముగ నుండి చదువుకొనుచు ఆనందించుచునే యుందురు. వారిని దాయుటకు అందరును జంకుదురు. మేము క్రింది 'హాలు'లో నుంటిమి. అందరును వచ్చిన విషయమును తెలియజేయ పెట్లని యోచించు-చుండగ హనుమంతరావు తెగువ చేసి పైకి పోయి విషయము తెలియజేసి వచ్చిరి.

గోపాలరావుగారి రాకను మే మాశతో ప్రతీక్షించుచుంటిమి. కొంచెము సేపు తరువాత వారు మెల్లగ మెట్లు దిగి వచ్చిరి. పరిశుభ్రమైన ఉడుపులు, ఉదారమగు చూపు, నొసట దిద్దిన తిలకమును వారి గంభీరాకృతికి అంగములుగ నుండినవి. 'మూర్తీభవించిన పరిశుద్ధతయే వారు' అనునట్లుండిన దా దృశ్యము. వారిని చూచిన

వెంటనే అంజలి ఘటించి, చెట్టియారు "నేను మునుపే తమ సన్నిధిని విన్నవించుకొనినట్లు నా స్థానమునకు నిర్దేశించినవారిని పిలుచుకొని వచ్చియున్నాను. ఇచ్చట వారిని పరీక్షించి చూచుకొనవచ్చును" అనిరి. అప్పుడు వారు "మీరు చెప్పుటే చాలు. నేను పరీక్షింపవలసిన యవసరము లేదు. మీ వాక్కే నాకు ప్రమాణము" అనిరి. అప్పుడు నేను పండారసన్నిధివా రిచ్చిన కమ్మ యిచ్చితిని. దానిని వారు చదివి చూచిరి. పిమ్మట శేషయ్యరు ఆంగ్లమున వారితో మాట్లాడ దొడగిరి. మతమువిశి-ష్టతయు, పెద్దగారి గొప్పతనమును, నే నిచ్చట చదివినవాడ ననుటయు, నే నచ్చట పాఠములు చెప్పుచుండుటను, ప్రొద్దుటి సంఘటనల నన్నిటిని వారు విపులముగ వర్ణించి చెప్పిరి. గోపాలరావుగారు న న్నొకసారి ఎగాదిగ చూచిరి.

అప్పుడు శ్రీనివాసయ్యరు నన్ను జూచి "ప్రొద్దున మీరు చెప్పిన పద్యమును ఇచ్చట చెప్పి వినిపింపుడు" అనిరి. నా కది గుర్తు లేకపోవుటచే ఏ యే మాట లం-దుండెనవా యని యాలోచించితిని. అది చెప్పుటకు పావుగంటకు పైన పట్టెను. శ్రీనివాసయ్యరు "ప్రొద్దున అయిదు నిమిషములలో చెప్పివేసితిరే. ఇప్పు డేల తామస మాయెను?" అని యడిగిరి. "నే రొక క్రొత్త పద్యము రచింపు మన్నచో వెంటనే చెప్పివేయుదును. అదే పద్యము చెప్పు మన్నందుననే పదములను జ్ఞప్తికి తెచ్చుకొనుచుంటిని" అని సమాధాన మిచ్చితిని.

"కవిత్వము సరళశైలిలో నున్నది. ఇంగ్లీషులో 'అట్లుండుటయే మే' అనియందురు" అని గోపాలరావు చెప్పిరి. అప్పుడు వేయిమంది కూడి నన్ను కొనియాడినట్లు సంతస మొందితిని.

పిమ్మట చెట్టియారు వెంట కొనివచ్చిన పుస్తకములు చూపి "ఏ పుస్తకమైనను ఎత్తి యిచ్చి వీరిని పరీక్షింపవచ్చును" అనిరి. గోపాలరావు "అవసరము లేదు" అని చెప్పగ, చెట్టియారు మరల నిర్బంధించిరి. అంతట వారు ఒక పుస్తకము తీసికొని తెరచి నా చేతి కిచ్చిరి. అది కంబరామాయణము. అయోధ్యాకాండమున మంథర కుట్ర చేసిన పటలపు ఆరంభముగ నుండినది.

ఆ భాగమును మొదటినుండియు చదివి యర్థము చెప్పితిని. వినిన గోపాలరావు తనివి చెంది చెట్టియారును చూచి "మీరు చెప్పినది సరియే. నే నాక్షేపింప నెడము

లేదు. మీరును, తక్కిన యాచార్యులును ఏకకంఠ్యముగ చెప్పుటకంటెను వేరు సాక్ష్య మేమి కావలెను? తమ 'క్రైంటేబిల్' వీరి కిచ్చివేయుడు. రానున్న సోమవారము మొదలు వీరు కాలేజిలో నుద్యోగము చేయవింతురు" అని పలికిరి. సమక్షమున చెప్పిన ఆ మాటలే నాకు లభించిన ఉత్తరువు. నేను 'దరఖాస్తు' పెట్టుకొనకుండగనే లభించిన యుత్తరు వది. వ్రాయబడని మాటలైన యది పెక్కు వత్సరములు గడచి నను నా చెవులలో నేటికిని ధ్వనించుచునే యున్నది.

# 39. కళాశాల యనుభవములు

గోపాలరావు నా కిచ్చిన యుత్తరువు స్వీకరించిన నేను మిక్కిలి వినయముతో వారిని చూచి "నే నీ పనికి క్రొత్తవాడను. కాలేజివిద్యార్థులకు పాఠములు చెప్పెడు విధానము కొన్నినాళ్లు నాతో నుండి నేర్పవలెనని చెట్టియారు కనుమతి యిప్పింపవలెను" అని యడిగికొంటిని.

చెట్టియారు "వీ రూరక చెప్పుచున్నారు. మతమం దుండి యుద్గ్రంథములు పాఠము చెప్పిన వీరికి ఇచ్చట పాఠములు చెప్పుట లక్ష్యమే కాదు. నాకంటెను పలు విషయములందు వీరు సమర్థులు. ఒక లక్ష పద్యములవరకు చదివియున్నారు" అని చిరునవ్వుతో సెలవిచ్చిరి.

పిమ్మట అందరము ప్రిన్సిపాలుగారియొద్ద సెలవు పుచ్చుకొని వెడలి పోతిమి.

మరునాడు ఆదివారము (15-2-1880) ప్రొద్దుట చెట్టిగారి యింటికి పోయి వారితో మాట్లాడుచుంటిని. నా కుద్యోగ మగుటనుగూర్చిన సంతసమును వారు పలు మారులు తెలియజేయుటతోబాటు, ఆ పనికై పెరవార లెందరో ప్రయత్నించుటయు చెప్పిరి.

"అయ్యగా రున్నపుడే మీ కుద్యోగము కావలెనని నా యభిలాష. దానికి మీరు సమ్మతింపలేదు. అయ్యగారికి మి మ్మెరబాయుటయం దిష్టమే లేదు. అప్పుడు

పోకుండ నుండుటయు ఒక విధముగ మంచిదైనది. ఇప్పుడయ్యగారున్నచో అందరి కంటె నధికముగ సంతోషించి యుందురు. వారు లేకున్నను సన్నిధానముశ్రీవారైనను చూచి తృప్తి నొందున ట్లున్నదికదా యని ఊరడిల్లుచున్నాను. ఈ స్థానము మిక్కిలి విలువ గలది. రాను రాను దీని విలువ పెరుగునే కాని తరుగదు. అయ్యగారియొద్ద చదివి, అయ్యగారి ప్రేమకు పాత్రమయియున్న మీ రెట్టి యాటంకమును లేక యీ స్థానమునకు రాగల్గుటకు వారి హార్దమగు ప్రేమయే కారణమగునని నేను నొక్కి చెప్పగలను" అని చెట్టియారు చెప్పుచుండిరి.

వెంటనే నాలో పిళ్లెగారి తలపు తలయెత్తెను. త్యాగరాజచెట్టియారు చెప్పిన దెల్ల సత్యమే యని నా హృదయము గ్రహించినది. ఔను, పిళ్లెగా రున్నచో వారు పొందెడు హర్షాతిశయమునకు హద్దులు చూడలేము' అని భావించితిని. నా మనోనేత్రముతో మాతృసమానులగు ఆ కవిశ్రేష్ఠుల శాంతభావము తొనకుచుండు ఆ మోము చూచితిని.

చెట్టియారు తొడగుచు చెప్పిన మాటలు ఆ భావనలో మునిగియున్న నన్ను నా చైతన్యమునకు తెచ్చినవి. "లోకము మిక్కిలి చెడ్డది. జాగరూకతతో మెలగి మంచి పేరు సంపాదింపవలెను. మనకు గౌరవము కలుగుట విద్యవలననే. ఆ చదువు విడిచిపుచ్చక పైపై పరిశోధన సలుపుచు అభివృద్ధి చేసికొనవలెను. కాలేజిపిల్లల యొద్ద మనము నడచుకొను రీతి సరియగు తీరున నున్నచో వారి ప్రీతిని పొందవచ్చును. పాఠములు స్పష్టపడునట్లు బోధింపవలెను. అడుగడుగున జరిగిన పాఠములందు ప్రశ్న లడుగవలెను. తక్కిన యాచార్యులయెడకూడ మెలకువతో మెలగవలెను" అని వారు నా కింకను పలు బోధనలు చేసిరి.

పిదప సోమవారమునాడు మంచివేళ కాలేజికి పోవలె నని తలచి, జోస్యుల చూచి విచారింపగ పంౘ్రెండు గంటలకుపైన బాగున్నదని తెలిసెను.

"రేపు పదునొకండునర గంటలకు సిద్ధముగ నున్నచో నేను కాలేజికి పోయి చెప్పి పంపుదును. అప్పుడు రావచ్చును" అని చెప్పి చెట్టియారు నాకు సెల విచ్చి పంపిరి.

నాడు సాయంకాలమున ప్రధానదేవాలయమునకు జని స్వామిదర్శనము చేసికొంటిని.

సోమవారము పగటి భోజనము ముగించుకొని శేషయ్యరింట వేచి యుంటిని. పదునొకండున్నర గంటలకు చెట్టిగారి యాజ్ఞప్రకారము కాలేజినుండి యిరువురు విద్యార్థులు నన్ను పిలువవచ్చిరి. నేను సుబ్రహ్మణ్యదేశికు లిచ్చిన ఉడుపులందలి అంగీ ధరించి, దానిపై దుప్పటమును కప్పుకొని, తలకు సాలువు చుట్టుకొని వెడలితిని. ఆ వేషము నిప్పుడు తలచి చూచినచో నాకే నవ్వు వచ్చును.

కాలేజీవసారాలో పడమటి చివర నున్న నొక కంబమునొద్ద త్యాగరాజ చెట్టియారును, ఆర్. వి. శ్రీనివాసయ్యరును న న్నెదురుచూచి, నిలిచి, స్వాగతము పల్కి పిలుచుకొనిపోయిరి. మంచి వేళ యని నిర్ణీతమైన సమయము తమిళపాఠము లేని కాలము. ఆ యిరువురును ఎఫ్. ఏ. రెండవ తరగతికి నన్ను పిలుచుకొనిపోయిరి. అచ్చట పాఠము జరుపుచుండిన హనుమంతరావువద్ద "వీరు మంచివేళ పాఠ మారంభింపవలసియుండుటచేత మీ గంట వీరి కీయవలెను" అని మునుపే తెలియ జరచి యుండుటచేత మేము తరగతిలో ప్రవేశింపగనే హనుమంతరావు తమ యాసనము వదలి లేచి మాకు స్వాగత మిచ్చిరి.

"ఇటు కూర్చొనుడు" అని హనుమంతరావు అరుగుపై నున్న కుర్చీ నాకు నిర్దేశించి చూపిరి. నాకు అందరియెదుట అచ్చట నుండుటకు సాహస మేర్పడలేదు.

నా భావము నెరిగిన చెట్టియారు "ఇది తిరువావడుదురైమఠము కాదు. ఈ చోట కూర్చొనవలసినది మీ విధి" అని చెప్పగ నేను పోయి కుర్చీపై కూర్చొంటిని. ఎదుట నున్న బెంచీపై హనుమంతరావు, శ్రీనివాసయ్యరు, త్యాగరాజచెట్టియారును, విరామమున్న మరి కొందరుపాధ్యాయులును ఉండిరి. ఆ తరగతిలో విద్యార్థులు డెబ్బదికి పైబడి యుండిరి. తరగతిలోనున్న విద్యార్థులలో పలువురు నాకంటె వయసు ముదిరినవారుగ తోచిరి.

విఘ్నేశ్వరుని, ఇతరదేవతలను మనస్సున ధ్యానించుకొని పాఠము చెప్ప నారంభించితిని. 'నాలడియారు' నందు 'ఇరవచ్చమ్' (ప్రతిగ్రహాఘేతి) అను 'అధికారము'ను మొదటినుండి చెప్పితిని.

మఠమునందు పాఠము చెప్పిన యలవాటువలన నా కిచ్చట చెప్పుటలో భయమో, అలుపో కలుగలేదు. మొదటి పద్యమును శంకరాభరణరాగమున నిదానముగ చదివితిని. పాఠశాలవిద్యార్థులను కొంతవరకు సంగీతముతో వశపరచుకొనవచ్చు నని యనుభవముతో తెలిసికొంటిని.

నేను పాఠము చెప్ప మొదలిడిన పద్య మిట్టి భావము గలది:

‘ఎన్నటికిని ఈ పేదలు మనవలననే వృద్ధికి వచ్చెడివారు. వారివలన తమకో, మనకో ఎట్టి యభ్యుదయమును లేదు’ అని (తమ కలిమిని పెద్దగ తలచి) భ్రాంతచేతస్కులై యున్న మనుజులను వెంబడించి తేటపడ తెలిసినవారెవ్వరేని పోవుదురా?’

అర్థము చెప్పునపుడు, ప్రపంచమున ధనవంతులు మదించి బీదవారిని అవమానించుటయు, ఒక ఉపకారము చేసినచో, దానిని తామే గొప్పగ చెప్పుకొని, ఆ సహాయ మొందినవారిని అల్పులనుగ చెప్పి ‘ఈ యుపకారము వీరియెడ పొందునట్లు మనలను దైవ మేల యుంచెను?’ అని యా పేదలు తమ్ము తామే నిందించుకొనునట్లు చేయుట మున్నగువానిని ప్రతిపాదించి చెప్పితిని. ఏదేని ఒక పద్యము పాఠము చెప్పునపుడు మాటకు మాట అర్థముమాత్రము చెప్పి నిలిపినచో వినువారి మనసు దానియందు లగ్నము కాదు. అందుచే ఉపమానములను లోకానుభూత వృత్తాంతములను ఉదాహరించి చెప్పి విద్యార్థుల మనస్సును పద్యార్థమువైపు లాగవలెను.

ఐదు పద్యము లా గంటలో ముగిసెను. నడుమ, యాచించుటవలన నేర్పడు నికృష్టత్వమును గూర్చి నేను సంవాదరూపముగ పద్యములు చెప్పినపుడు చెట్టియారు ‘కుచేలోపాఖ్యానమునుండి “పండ్లన్నియు బయటపెట్టి’ అను భావముతో నారంభ మగు పద్యము నుదాహరించి, ఆ విషయ మింకను విశదపరచిరి.

గంట కొట్టిన వెంటనే నేను ముందు మరియొక తరగతికి పోయితిని. చెట్టియారు పిల్లవాండ్ర నేకాంతముగ పిలిచి నేను పాఠము చెప్పుటనుగూర్చి వారి అభిప్రాయ మడిగిరి. పిల్లవాండ్రు తమకు మిగుల తృప్తిగ నున్నదని తెలియజేసిరి.

"నేను మిగుల కష్టపడి వీరిని పిలుచుకొని వచ్చియున్నాను. వీరియెడ మర్యాదగ నుండుడు. నాయెడ నుండినటులే వీరియెడను మెలగవలెను" అని చెట్టియారు వారి నుద్దేశించి పలికి, కొందరిని ఫలానా ఫలానావా రని తరువాత నాకు ఎరుక పరచిరి.

తరువాతి గంటలో ఓ. ఏ. మొదటి తరగతికి పాఠము చెప్పబోతిని. చెట్టియారును, మరి కొంద రుపాధ్యాయులును వెంట వచ్చిరి. శేషయ్యరుకోరిక ప్రకారము సంస్కృతపండితులగు 'పెరుగవాయ్ స్వామి రంగాచార్యులు'ను వచ్చిరి. అక్కడ రామాయణమందలి 'అహల్యాపటలము' పాఠము చెప్పదొడగితిని. మొదటి పద్యమును సహానారాగమందు చదివి యర్థము చెప్పుచుంటిని.

నేను పాఠము చెప్పునపుడెల్ల విద్యార్థులు నన్నే చూచి గమనించుచుండిరి. చెట్టియా రన్ననో వారిలో నొక్కొక్కరి ముఖమును చూచుచుండిరి. అందరి మోమునను తృప్తిచిహ్నము లుండుటను వా రరసి తాముకూడ తృప్తులైరి.

ఆ గంట ముగిసినపిదప విశ్రాంతికాలమున ఆహారము పుచ్చుకొని వచ్చితిని. మధ్యాహ్నము మీదట ఎఫ్. ఏ. మొదటి తరగతికి పోతిమి. అచ్చట ఎనుబదికి పైబడి విద్యార్థు లుండిరి. నన్నూల్ అక్షరాధ్యాయము ఆరంభమైనది. మొదటి సూత్రమును నేను చెప్పి "పైని కొన్ని సూత్రములు మీరే చెప్పి ఆ పద్ధతి నాకు నేర్పవలెను" అని చెట్టియారును వేడుకొంటిని. వా రట్లే చెప్పి ప్రశ్నలుకూడ వేసిరి. నాకు పలు విషయములు అప్పుడు తెలిసెను.

పిదప బి. ఏ. రెండవ తరగతికి పోతిమి. ఆ తరగతియం దున్నవారు చెట్టియారువద్ద మూడేండ్లు పాఠము విన్నవారు. ఆ సంవత్సరము పరీక్షకు పోవలసినవారు.

నేను పాఠము చెప్పితిని. గంట కొట్టిరి. వెంటనే మేము కాలేజి వదలి బయలు దేరితిమి.

మొదటి దినమందు ఆనాడే నాకు 'మన పని చక్కగ నెరవేర్పవచ్చును' అను ధైర్యము కలిగెను. విద్యార్థులకును, తక్కిన యాచార్యులకును, అందరికి పైబడి త్యాగరాజచెట్టియారుకును నే నా పదవికి అర్హుడ నను తృప్తి జనించెను.

రెండవ రోజు (17-2-1880) నేను అలవాటుచొప్పున కాలేజికి పోయి పాఠములు జరిపితిని. త్యాగరాజచెట్టియారు నాడు మూడు గంటలకు పైన వచ్చి నేను పాఠము చెప్పుటను గమనించుచుండిరి. మూడు ముప్పావుగంటకుపై శ్రీనివాసయ్యరు చెట్టియారువద్దకు వచ్చి “నేడు నాలుగుగంటలకు జరుప తమిళపాఠము ఏ తరగతికి అని రావుగా రడిగిరి. ఆ తరగతికి వా రొకవేళ రావచ్చును. జాగ్రత్తగ పాఠము చెప్పుమనుడు” అని చెప్పి చనిరి. తరగతి వదలిన వెంటనే చెట్టియారు నా కిది చెప్పుటయే గాక “రావుగారిని చూచి భయపడి యేదైన ప్రలాపము లాడకుడు; జాగ్రత్తగ చెప్పుడు. మే మందరము తృప్తిచెందుట ముఖ్యము కాదు; వారి తృప్తియే ప్రధానము. వారికి మంచి యభిప్రాయము కలిగింపవలెను’’ అని హెచ్చరిక చేసిరి.

బి. ఏ. రెండవ తరగతికి నేను పోయినాను. చెట్టియారును వెంబడి వచ్చిరి. అచ్చట నన్నూల్ పాఠము జరుప మొదలిడితిని. అప్పు డొక సేవకుడు ‘కుర్చీ’ యొకటి కొనివచ్చి నా ప్రక్కన వేసెను. తరువాత నిమిషమే గోపాలరావు వచ్చిరి. వెంటనే లేచి అంజలిబంధ మొనర్చితిని. “మీ రూరక యుండి పాఠము జరిపింపుడు” అని చెప్పి, కుర్చీలో కూర్చొనిరి. నేను సూత్రమునకు వ్యాఖ్యానమును, ఉదాహరణములను చెప్పి ప్రశ్న లడిగితిని. రావుగారు ఒక విద్యార్థియొద్దనుండి నన్నూల్ పుస్తకము తీసికొని చేత నిడుకొని గమనించుచుండిరి.

వా రచ్చట నుండుటచే నాకు కొంచెమేని అధైర్యము కలుగలేదు. ఉత్సాహముతోడ చెప్పుచుంటిని. వారు నన్నూల్ చక్కగ నేర్చినవా రని త్యాగరాజచెట్టియారు నాతో మునుపే చెప్పియుండిరి. అందుచేత నా కింకను ధైర్యమే కలిగెను. నన్నూల్ బాల్యమునుండియే నేను చదివి, పలువిధముల విమర్శ చేసి, చింతనచేసి, చక్కజేసి, జ్ఞప్తియం దుంచుకొనియుండుటచే దానిని పాఠముచెప్పుట నాకు మిక్కిలి యవలీలగ నుండెను. నేను ముందువెనుకల నున్న సంగతులతో పొత్తు కలిపి విషయములు స్పష్టపరచితిని. గ్రంథమంతయు చదివిన రావుగారు అందుండి నాపరిశ్రమ తెలిసి తృప్తి పొంది యుండవచ్చు నను నమ్మికతో నేను పాఠము చెప్పితిని.

తక్కిన సమయములందు మధ్యలో నేదేని చెప్పియు, ప్రశ్న లడుగుచును వచ్చిన చెట్టియారు అప్పు డేమియు పలుకక అన్నిటిని గమనించుచుండిరి. రావుగారి ముఖమున నేర్పడు ఇష్టానిష్టసూచనలచే వారి యభిప్రాయము తెలిసికొనగడగిరి.

కాని గోపాలరావుమోమున క్రొత్త సూచన యేదియు కనిపింపలేదు. ఎప్పుడును ఉన్నట్టి వికాస ముండెను. తమ యిష్టానిష్టముల నెప్పుడప్పుడే బయలుపరచు స్వభావము కలవారు కారు వారు; గంభీరస్వభావులు. వారి యభిప్రాయమును సులభముగ నెల్లరు తెలిసికొన నలవికాదు. చెట్టియా రెట్టి సూచనయు తెలియలేనివారై సంకటపడుచునే యుండిరి.

గంట ఐదు కొట్టెను. గోపాలరావు తమ చేతనున్న పుస్తకమును దానివాడగు విద్యార్థి కిచ్చి లేచిరి. నేనును చెట్టియారును లేచి నిలిచితిమి. గోపాలరావుహృదయమున ఎట్టి భావ ముదయించెనో యని తెలిసికొన నాకును ఉత్కంఠ యధికముగనే యుండెను. దాని నెట్లు తెలిసికొనుట?

ఆ తరగతియందు చదువుకొనుచుండిన 'కృష్ణస్వామి' అను విద్యార్థి తటాలున లేచి రావుగారిని చూచి "ఒక్క విన్నపము. విద్యార్థులమగు మే మెల్లరము 'చెట్టియారు పని వదలి తొలగిపోవుచున్నారే; ఇక నేమి చేయగలము?' అను విచారములో నిన్నటివరకు మునిగియుంటిమి. ఇప్పు డా విచారము తొలగిపోయినది. చెట్టియారు తా మున్న స్థానమునకు తగినవారినే పిలుచుకొని వచ్చి యిచ్చి మా భయమును పోగొట్టిరి." అని చెప్పిరి.

వా రంత ధైర్యముగ మాట్లాడుటనుగూర్చి విస్మయ మొంది వారినే చూచితిని. చెట్టియారుకన్నులును ప్రేమతో వారినే చూచెను. రావుగారో వానిని తిరిగి చూచి మందహాసము చేసి బయలుదేరిరి. మేముకూడ బయలువెడలితిమి.

'రావుగారికి నా పాఠప్రవచనమువిషయమున నెట్టి యభిప్రాయ మేర్పడి యుండనోపునో!' అని కళాశాలోపాధ్యాయుల నందరిని చెట్టియారు ప్రశ్నించిరి. "మంచి యభిప్రాయముగనే యుండవలయును." అని కొందరనిరి. రావుగారితో చాల సన్నిహితపరిచయముగల శేషయ్యరు మున్నగువారు "పిల్లలకు అర్థమగునట్లు చెప్పుచున్నా రనునదే వారి యభిప్రాయ మని తెలియుచున్నది." అని పలికిరి.

చెట్టియారు నన్ను జూచి "రావుగా రిట్లే యప్పుడప్పుడు వచ్చి గమనింపవచ్చును. ఎప్పుడు వచ్చి గమనించినను దానిని నాకు చెప్పవలెను" అనిరి.

ఆ వారమంతయు ఉత్సాహముతోడ నా కర్తవ్యము నెరవేర్చితిని. ప్రతి దినము, ప్రాతస్సాయంకాలములందు దేశికులవారింటికి పోయి వారితో మాట్లాడి వత్తును. ప్రతిదినమును జరిగినదానిని వారికి తెలియజేయుదును.

తిరువాడుదురైనుండి ఒక్కొకరు దినమునకు ఎవ్వరైన వచ్చి నన్ను చూచి సంఘటనలు తెలిసికొని పోవుదురు. కుంభకోణమునుండి ఎవ్వరు పోయినను దేశికులు నన్నుగూర్చి విచారింతురు. కాలేజిలో చదువుకొనుచున్న విద్యార్థుల తండ్రులో, బందుగులో మఠమునకు పోవుదురు. వారు, తమ యింటి పిల్లలు కాలేజిలో చదువుచున్నట్లును, నన్నుగూర్చి తృప్తిగ చెప్పుచున్నట్లును తెలియజేయుదురు. అది విన్న దేశికులు సంతసింతురు. తమిళమున ప్రీతియు, నాయెడ నభిమానమును గల పలువురు కాలేజిలో పాఠము నడచునపుడు వెలుపల నిలిచి, నేను పాఠము చెప్పుట వినుచుండి, నే నీవలకు వచ్చిన వెంటనే తమ తృప్తిని తెలియజేయుదురు. ఇవి యన్నియు కలిసి 'మన మొక క్రొత్త పనిని పైన వేసికొని యున్నామే; ఎట్లు నిర్వహింపగలమో!' అను విచారము నా కించుకంతేని లేకుండునట్లు చేసినవి.

ఈ ఆనందమయజీవితమునుగూర్చి నా తల్లిదండ్రులకు, సుబ్రహ్మణ్య దేశికులకును చెప్పవలె నని నేను తత్తరముతో నుంటిని. ఆ వారమున శుక్రవారము నాడు కాలేజి వదలిన వెంటనే పోయియుండవలెను. ఆ సమయమున పొగబండి లేదు. అందుచే మరునాడు శనివారము పగటిబండిలో ఎయలుదేరి తిరువాడుదురైకు చేరి తిన్నగ నింటికి చనినాను. నా రాక యెల్లరును ఎదురుచూచుచుండిరి. ఇంటివాకిట మా తల్లిగారు ఒక తట్టలో పసుపునీ డుంచుకొని వేచియుండిరి. నన్ను చూచిన వెంటనే హారతి యిచ్చి "లోపలికి రా నాయనా!" అని ప్రేమ మీర బిలిచిరి.

నా తలిదండ్రులు నాపై వేలకొలది ప్రశ్నల వర్షము కురిపించిరి. నేను 'బదులు' చెప్పుచునే స్నానమును, భోజనమును ముగించుకొంటిని. ఉద్యోగమును గురించి వారికి ఒక విధముగ చెప్పి మఠమునకు వేగ వెడలితిని. అప్పుడు మిక్కుటపు ముఖవికాసముతోడ కొందరు మిత్రులతో 'ఒడుక్కము' నందు ఆధీనాధ్యక్షులు కొలువుతీరి యుండిరి. నేను పోయి చూచితిని. ఇరువురకును కలిగిన యానంద మి ట్లుండెను అని చెప్పుట మాటల కసాధ్యము!

"మిమ్ముగురించియే మాట్లాడుకొనుచున్నాము. ఎట్లైన మీరు ఏ యాటంకము లేక ఉద్యోగము సంపాదించెద రనియు, ఉపాధ్యాయులును, పిల్లవాండ్రును మీ పాఠ ప్రవచనవిషయమున సంతోషపడెద రనియు మే మెదురుచూచితిమి. ఆ లాగు ననే విజయము పొంది, మంచిపేరు సంపాదించి వచ్చినందులకు మిక్కిలి సంతసము!" అని నుడివిన వారి పలుకులు నా చెవిలో అమృతధారవలె పడినవి. ఒక వారము దినములుగ వారి మధురవచనములు వినక ఆకలి గొనియున్న నా చెవులు తనివి చెందినవి. పిమ్మట ఒక్కొక్క విషయముగ విచారించుచుండిరి. నేను చెప్ప జెప్ప వారు క్రొత్త సమాచారములు వినువారివలె నానందించిరి.

రెండు దినములు గడచిపోయినదే తెలియలేదు. సోమవారము తెల్లవారగనే మొదటి బండిలో కుంభకోణము పోయి చేరితిని.

సోమవారము పాఠము చెప్పితిని. మంగళవారము ప్రొద్దుటిపూట రెండవగంట ఎఫ్. ఏ. రెండవ తరగతియందు 'నాలడియార్' పాఠము జెప్పదొడగితిని. అప్పుడు కాలేజి చూడవచ్చిన ఒక యుద్యోగస్థులకు అక్కడనున్న తరగతులను చూపించుచు వచ్చిన గోపాలరావు నే నున్న గదిలోనికి వారితోడ వచ్చిరి. వారిని చూచిన వెంటనే లేచిన నన్ను గోపాలరావు చేయి పట్టి యదిమి కూర్చుండబెట్టి రెండు కుర్చీలు తెప్పించి వేయించి ఒకదానిపై వారిని కూర్చుండబెట్టి, మరియొకదానిపై తా మాసీనులైరి. అది చూచినపుడు వారు చాలసేపు ఆ తరగతియం దుండి పాఠము గమనింపవచ్చును అని తోచినది.

నేను పాఠము చెప్పసాగితిని. గోపాలరావు, వారి మిత్రులును గమనించుచుండిరి.

నే నప్పుడు పాఠము చెప్ప దొరకొనిన పద్యము మిక్కిలి రసవంతమైనది. "మనకు శక్తి యున్నప్పుడే ధర్మము చేయవలెను. తరువాత చేసికొనవచ్చు నని తలచి యున్నచో దానికి సమయము రాకయే పోవచ్చును" అను భావము కలది యది. దాని యంతరార్థము స్పష్టపరచుటకుగాను ఒక కథ చెప్పితిని:

"ఒకానొక మనుష్యుడు తన జీవితకాలమున బాగుగ సంపాదించినాడు. తనకు వలసిన వసతు లన్నిటిని సమకూర్చుకొనినాడు. వానికి ధర్మచింతమాత్రము కలుగలేదు.

"వానికి వయస్సు ముదురుచుండెను. వాని కొడుకు లందరు తల యెత్తిరి. ఏదైన లభించిన ధనము క్రమముగ దాచిపెట్టుకొనుటకు ఆ కాలమున తగిన యుపాయములు లేవు. అందుచేత వాడు తనకు దొరికిన విత్తమును ఒక బట్టలో మూటకట్టి ఎచ్చటనైన పూడ్చిపెట్టును. కొన్నాళ్లకు తరువాత ఆ వృద్ధుడు జబ్బుచేసి మరణావస్థ యాసన్న మాయెను. అప్పుడు వానికి మాట్లాడ వీలుకాలేదు. చేరువగ వాని పిల్లలును, చుట్టములును చుట్టుముట్టి యుండిరి. అందరును వాని కడపటి కోర్కెను నెరవేర్పవలె నను తలంపుచేత 'ఏమి కావలెను?' అని యడిగిరి.

"ఆ ముదుసలి యమునితో పోరాడుచున్న ఆ సమయమున వాని మిత్రుడొకడు ఆ వృద్ధుడు ద్రవ్యమును ధర్మమార్గమున వెచ్చింపకుండుటను తెగడి, ధర్మము చేయవలె నని బుద్ధి చెప్పుచుండెను. వాని మాటలవలన ఆ ముదుసలికి ధర్మము చేయవలె నను తలపు తోచెను. తా నెచ్చటనో గోడలో నొక చోట పూడ్చి పెట్టియున్న చిన్న రొక్కపుమూటజ్ఞప్తి వానికి వచ్చెను. దాని నెత్తుకొని తగినట్లుగ ధర్మము చేయవలె నను సంకల్ప ముండియు అట్లు చేయుగల స్థితిలో వా డప్పుడు లేడు. తన యభిప్రాయమును వెలిబుచ్చుటకు వీలుకాని విధముగ వాని నోరు పడిపోయెను. ఆ సమయమున వే రేమి చేయ వీలగును? ఎట్లైన తన భావమును పెరవారికి తెలియజేయవలె నను ఉత్కంఠ వానికి హెచ్చుచునే యుండెను. 'ఇంత పెద్ద ధనపు మూట' అనుదాని నతికష్టముతో తెలియజేయుటకై తన చేతితో గోడను నిర్దేశించి సూచనగ చూపించెను. ఐనను ప్రక్క నున్న వారికి వాని యభిప్రాయము స్పష్టపడలేదు. "అయ్యో! ఏమో అడుగుచున్నాడే! ఈ సమయమున 'ఇది' యడుగుచున్నా డని తెలిసికొన నలవి కాకున్నదే!" అని కొందరు జాలిగొని యేడ్చిరి. అప్పుడు వాని కొడుకు ఒకడు "తెలిసిపోయినది. వీరికి పుల్లవెలగకాయమీద మిక్కిలి మక్కువ. దానినే యడుగుచున్నారు. అయ్యో! ఇప్పు డది దొరకునట్టి కాలము కాదే! అయినను ప్రయత్నింతును" అని వేగముగ పరుగిడెను. వాడు పోయి వచ్చునంతలో ముదుసలికి ప్రాణములు పోయెను.

"కుమారుడు 'అయ్యో! తమకు ప్రియమైన వెలగకాయ కావలె నని సూచనగ చెప్పినారే. నేను తెలిసికొనియు దానిని కొనివచ్చి యిచ్చునట్టి భాగ్యము లేని మహాపాపిష్ఠుడ నైతినే!' అని నెత్తియు, నోరును మొత్తుకొని యేడ్చెను.

"ఆ వృద్ధుడు తలచినదానికి, వాని కుమారుడు చేసినదానికిని సంబంధమే లేదు. వాడు దబ్బును సూచింపగ అది పుల్ల వెలగకాయ యైనది."

ఈ కథను చెప్పి మరల వివరించి చెప్పి. నిలచిన వెంటనే గోపాలరావు 'ఫక్కు' మని నోరు విప్పి నవ్విరి. అంత ఎట్టియలుగ వారు నవ్వుట యెవ్వరును చూడ లేదు. నేను చెప్పిన కథయందలి స్వారస్యమే వారిని నవ్వించె నని తెలిసి తృప్తినొందితిని.

పైన పాఠము చెప్పసాగితిని. "ఇట్లంత్యకాలమున ధర్మము చేయ దలచిన వారి యుద్దేశ మెప్పుడుకూడ నెరవేరుట లేదు. కావున మనము పోయెడు మార్గమున కుపయోగపడు ధర్మము ముందే చేయవలెను. పరదేశయాత్ర చేయబోవు వాడు 'కూటిమూట' కొనిపోవునట్లు ఈ ధర్మపు ముల్లెను మనము పరలోకమునకై సేకరింపవలెను. దానినే ఈ పద్యము చెప్పుచున్నది" అని చెప్పి, మరల ఆ పద్యము చదివితిని.

'లే బ్రాహ్మణునినే, తమ గంతవ్యస్థల మగు జన్మాంతరమునకై వలయు ధర్మ మనెడు ఓగిరపు మూటను సుదృఢముగ భుజస్కంధమున పదిలపరచుకొనని వారై, బద్ధముష్టులై (లుబ్ధులై) తరువాత చూచుకొందము లెమ్ము అని (ఔదాసీన్యముతో) ఉండెడు అవివేకులు చేత మూసెడు పసిడిమూటయు పుల్ల వెలగకాయమే యగును.'

ఆ పద్యమునకు విపులముగ నర్థము చెప్పి పూర్తియైన వెంటనే పై నున్న పద్యము చెప్ప మొదలిడితిని. ఆ తరగతిలో మూడవగంటకైన పాఠము చెప్పెడు ఉపాధ్యాయులు నాడు రాలేదు. అందుచే ఆ గంటయందును అనువర్తించి నేనే తమిళపాఠము చెప్ప నారంభించితిని. రెండు గంటలందును గోపాలరావును, వారి మిత్రులును ఆ తరగతియం దుండి వినిరి.

గంట ముగిసెను. వారు లేచిరి. గోపాలరావు న న్నొకసారి చూచి ఎలనవ్వు విరియించిరి. వారి చూపులో కరుణ తొణికిసలాడెను. చిరునగవున నానందము వెల్లివిరిసెను. నేను సెలవు పుచ్చుకొని విరామకాలపు ఆహారము స్వీకరింప బయలుదేరితిని.

నాడు సాయంకాలము మలవాటు చొప్పున త్యాగరాజచెట్టియారువద్దకు పోయి గోపాలరావు నా తరగతికి వచ్చినదియు, అక్కడ సంభవించినదియు స్పష్టముగ చెప్పితిని.

చెట్టియారు "వారి కెట్టి యభిప్రాయ మేర్పడినదో యని తెలియునా? పై అధికారులకు మిమ్మగూర్చి వ్రాయవలెనే; ఏమి వ్రాసెదరో?" అని యడిగిరి.

"నే నెట్లెరుగుదును?" అని యంటిని.

చెట్టియారుకు నాటి రాత్రి యంతయు నిదుర పట్టలేదు. నన్నుగూర్చి గోపాలరావు పై యధికారులకు వ్రాసి ఆజ్ఞాపత్రము పొందవలెనే అను దిగులుచేత రావుగారి మనస్సులో నేర్పడిన యభిప్రాయమును తెలిసికొనుటకు మిక్కిలి యుత్కంఠితులై యుండిరి. అన్నియు బాగుగనే యుండు నని యెదురుచూచిన నాకు వారి యుత్కంఠ ఆశ్చర్యము కలిగించెను.

మరునాడు కాలేజి తెరచిన వెంటనే చెట్టియారు రచ్చటికి పోయి 'రైటరు'ను చూచి "స్వామినాథయ్యరునుగూర్చి రావుగారి కెట్టి యభిప్రాయము?" అని యడిగిరి.

వారు మంచివార్త వినిరి. "రావుగారు వీరినిగూర్చి 'డైరెక్టరు' గారికి బాగుగ వ్రాసి యున్నారు. ఇదుగో తపాలు పంపనున్నాను" అని రైటరు చెప్పినది విన్న తరువాతనే త్యాగరాజచెట్టియారుకు తెలివి వచ్చెను. వారు రైటరు నంతటితో విడువ లేదు. ఏమి వ్రాసినారో యని పొడిచి పొడిచి యడిగిరి. నేను మఠమున నుండి విద్య కరచి, కడతేరినవాడ ననియు, అచ్చట పలువురకు పాఠములు చెప్పి యభ్యాసము గడించినవాడ ననియు వ్రాసి, "నేనే రెండుసార్లు పాఠము చెప్పుచున్న తరగతికి పోయి గమనించితిని. వారు నేర్పు విధము తృప్తికరముగ నున్నది. కావున ఇంతవరకు త్యాగరాజచెట్టియారు కిచ్చిన ఏబది రూప్యములే వీరికిని ఇచ్చి రెండు సంవత్సరములకు ప్రత్యేకముగ నియమింపవచ్చును" అని సూచించి యున్నట్లు రైటరు చెప్పిరి.

ఇవి యన్నియు విని వచ్చిన చెట్టియారు "దిగులు లేదిపుడు. దైవకృపచే నేను చేసిన ప్రయత్నము ఫలించినది. ఇక మీ పని, మీ విద్యార్థుల పని!" అని నాతోడ సంతోషముగ చెప్పిరి.

"ఇవన్నియు మీ నిరవధికవాత్సల్యముచే కలిగినవే!" అని నా కృతజ్ఞత తెలియజేసికొంటిని.

ఈ ప్రముఖసంఘటనకు పిదప గోపాలరావు నామీద నెక్కుడు కరుణ చూపుచుండిరి. నన్ను చూచినప్పుడెల్ల "క్రమముగ పాఠములు జరుగుచున్నవా? ఎవ్వరేని తప్పు చేసినచో వెంటనే చెప్పుడు. మీ కేది కావలసియున్నను సంకోచపడక చెప్పవచ్చును" అని ప్రేమమీర చెప్పుదురు. తమ రక్షణక్రింద వచ్చిన న న్నంగీకరించినందులకు గుర్తుగ ఆ మాట లుండినవి.

సోమవారమునాడు పండ్రెండు గంటలకు పైన బి. ఏ. రెండవ తరగతికి పాఠము చెప్పుచుంటిని. ఒంటిగంటయైన పిదపగూడ కొంచెమునేపు చెప్పితిని. అప్పుడు తటాలున పిల్ల లందరును లేచి నిలిచిరి. నేను కారణము తెలియక "ఏల నిలుచుకొని యున్నారు?" అని యడుగ, వారు "రావుగారు వచ్చి వసారాయందు మిమ్ము చూచుచు నిలిచియున్నారు" అనిరి. నేను వెంటనే వారియొద్దకు నేగితిని. వారు "రెండు సంవత్సరములకు చెట్టియారు కిచ్చుచుండిన ఏబది రూపాయలు జీతమే యిచ్చుచు తాత్కాలికముగ మిమ్ము నియమించియున్నట్లు డైరెక్టరుదొరవారు ఉత్తరువు పంపియున్నారు" అని పలికిరి. నేను నా సంతోషమును మోమున దోచు చిన్నెలతోడనే తెలియజేసితిని.

ఈ వార్త యెరిగిన యుపాధ్యాయు లందరు నానందించిరి. త్యాగరాజచెట్టియారో, అతివేలమైన యానందమున మున్కలిడిరి. నా మానసికస్థితిని అభివర్ణించుటకు మాటలున్నవా!

# 40. చింతలేని జీవనము

ఆ వారము నేను మిక్కుటపు సంతోషముతోడను. చేతనున్న అరనెల జీతముతోడను తిరువావడుదురై కరిగితిని. "మీరు పొందెడు మొట్టమొదటి జీతమును మీ తల్లిదండ్రులయొద్ద నిచ్చి పుచ్చుకొనుడు" అని చెట్టియారు చెప్పియుండిరి. అట్లే ఆ యిరువదియైదు రూపాయలు మొదట మా యమ్మగారి చేతులలో నుంచితిని. వారు పుచ్చుకొని కన్నుల కద్దుకొనిరి. వే రెవ్వరైన లక్షరూపాయ లిచ్చియున్నను వారి కంత సంతోషము కలిగియుండదు. పిదప మా నాయనగారియొద్దను, సుబ్రహ్మణ్యదేశికులయొద్దను ఇచ్చి పుచ్చుకొంటిని. "పరమశాంభవుల కుమారులగు మీకు ఇంకను అధికవేతనము, ఉన్నతపదవియు లభింపవలెను" అని దేశికులు దీవించిరి.

ఆ వారము నా తల్లిదండ్రులను పిలుచుకొని కుంభకోణము చేరితిని. అచ్చట కొన్ని నెలల కాలమునకు భక్తపురియగ్రహారమునందు ఒక చిన్న యిల్లు మాట్లాడుకొని అందు కాపుర ముంటిమి.

మార్చి నెల చివర కాలేజిపరీక్షలు జరిగినవి. ఆ కాలమున విశ్వవిద్యాలయ పరీక్షలు డిసెంబరు మాసమందే జరుగుచుండెను. మార్చినెల పరీక్షకు త్యాగరాజ చెట్టియారు సహాయముతో ప్రశ్నపత్రము సిద్ధము చేసితిని. పరీక్ష ముగిసిన తరువాత వారియెదుటనే సమాధానపత్రములు దిద్ది 'మార్కు'లను క్రమపరచి వ్రాసి ప్రిన్సిపాలుకు చేర్చితిని.

'వేసవి సెలవు'లు తొడగినవి. ఆ జీతముకూడ పుచ్చుకొని తలిదండ్రులను వెంట నిడుకొని తిరువావడుదురైకు చేరితిని. ఆరోజులలో తిరువావడుదురైలో నాకు సీమంతము జరిగెను. దానికి నా జీతపు పైక ముపయోగపడినది. సుబ్రహ్మణ్యదేశికులు చేసిన సహాయములకు లెక్కయే లేదు.

ఆ కాలమున కాలేజితరగతులకు తమిళపాఠ్యములు నిర్ణయించు విధానము మిక్కిలి వింతయైనది. పేరుమాత్రమే తెలిసిన గ్రంథమునుండి ఏదైన నొక భాగము పఠనీయముగ నిర్ణయింతురు. తాళపత్రగ్రంథములు వెదకి తెచ్చి, ఉన్న

దున్నట్లే యెవ్వరైనను అచ్చొత్తింతురు. దాని నుంచుకొని తెలిసియో, తెలియకయో అన్నియు 'గజిబిజిగ' జేసి తమిళాచార్యులు పాఠము చెప్పుదురు. 'శిలప్పదికారము' ఒక ప్రాత కావ్యమని మాత్రమే ఆ కాలమున తెలిసియుండెను. గ్రంథ మారసి తెలిసికొనుటకంటె గ్రంథప్రాశస్త్యము తెలిసికొనుట సులభము. అట్లగుటచేత దాని ప్రాశస్త్యము తెలిసినవారు అందులోని కొన్ని భాగములను పాఠ్యముగ నిర్ణ-యింప గడగిరి. త్యాగరాజచెట్టియారు కాలేజిలో నున్నపుడు శిలప్పదికారమునందలి "ఇందిరవిళ వూరెడుత్త గాదై" (ఊరివారు ఇంద్రోత్సవము జరిపిన గాథ) పాఠముగ వచ్చినది. ఆ భాగమును చాటాకుల పుస్తకము ముందు పెట్టుకొని వారు చూచిరి. వారి కేమియు నవగతము కాలేదు. పిళ్లెగారియొద్దకు పోయి, యిద్దరు కలిసి చూచిరి. పుస్తకమునందు ఎంతో కాలమునుండి చేరియున్న యపపాఠముల నడుమ సాధు-పాఠము తెలిసికొనుటయే 'బ్రహ్మప్రయత్నముగ' నుండినది. అంతియగాక అత్యంత ప్రాచీనసంప్రదాయము లెల్ల వర్ణించియున్న ఆ గ్రంథమునందున్న విషయము లెల్ల తెలిసికొన సహాయసాధనములు లేవు. అందుచేత ఆ భాగము స్పష్టపడలేదు. చెట్టియారుకు పుస్తకముపై కోపము వచ్చెను. "ఇదేమి పుస్తకము! ఇది యింద్రో-త్సవగాథయా, ఇంద్రోత్సవగాథయా!" అని చెప్పి, "ఈ శనిగ్రహమును నేను పాఠము చెప్పబోవుటలేను. పైగా, నా యారోగ్యము సరిలేదు. నేను ఆరు నెలలు 'లీవు' తీసికొనియెదను" అని విన్నవించుకొనిరి. అట్లే ఆరునెలలు విశ్రాంతి బొంది పిమ్మటనే కాలేజికి వచ్చిరి. ఆ కాలమున చంద్రశేఖరకవిరాజపండితులు ద్రావిడోపా-ధ్యాయులుగ నుండి పాఠములు జరిపిరి; 'నేర్పిరి' అనుటకు వీలుకాదు.

ఇట్లు త్యాగరాజచెట్టియారే కష్టపడినప్పుడు తక్కిన పండితులనుగూర్చి చెప్ప వలసినదే లేదు. ఎప్పుడు పాఠ్యముగ వచ్చినదో వెంటనే పుస్తకముద్రణము వచ్చును. శిలప్పదికారముపూర్వభాగము శ్రీనివాసరాఘవాచార్యులును, చెన్నపట్టణమం దుండిన షోడశావధానము సుబ్బరాయచెట్టియారును ముద్రింపించియుండిరి. మొదటి యావిష్కరణము శ్రీనివాసరాఘవాచార్యులదే. 'పుకార్ కాండము' (పుకార్ = కావిరిప్పూం పట్టణము) మొదటి భాగము మూలముమాత్ర ముండెను. "శేరమాన్ పెరుమాళ్ నాయనార్ రచించిన శిలప్పదికారము" అని వారు ముఖపత్రమున ముద్రింపించి యుండిరి.

నే నుద్యోగము చేపట్టిన మేడు శిలప్పదికారమందు 'కానల్‌వరి' (ఒక ఛందో భేదము) మొదలు నాలుగు గాథలు పాఠమునకు పెట్టిరి. వానిని వేసగి సెలవులు ముగిసిన వెంటనే పాఠము చెప్పవలసియుండెను. "వీరు శిలప్పదికార మెట్లు పాఠము చెప్పుదురో!" అని పలువు రాడుకొనుచున్నట్లు నా చెవిని బడెను. కనుకనే దానిని సాధ్యమగునందాక చదివి తెలిసికొనవలె నని నిశ్చయము చేసికొంటిని. ఉన్న అచ్చు ప్రతి సహాయముతో విషయము తెలిసికొనుట క్లేశముగ నుండెను. ఈ సంగతులను నేను సుబ్రహ్మణ్యదేశికులయొద్ద చెప్పగ వారు "మఠమున తాటాకుప్రతి యున్నది. చిన్నపండారస్వామియొద్ద చదివి తెలిసికొనవచ్చును" అనిరి. పిళ్లెగారికే సందిగ్ధమైన యా గ్రంథమునందు నమశ్శివాయదేశికులు గడిదేరియుండుట న్యాయముకాదు. ఐనను మిక్కిలి జ్ఞానవంతులగు వారితో జేరి పరిశోధన సలిపి, నిర్ధరించి యుంచుకొనుట యందు చాల లాభ మున్నది. అందుచే నేను శిలప్పదికారతాళపత్రగ్రంథము తీసికొని నమశ్శివాయదేశికులయొద్దకు పోయి చదివితిని. ఇద్దరము మిగుల సావధానముగ విమర్శించితిమి. ఒకవిధముగ చదివి పూర్తిచేసితిమి; అర్థనిర్ణయముకూడ చేసికొంటిమి.

ఇట్లు కొన్నాళ్లు జరగినవి. ఇతరగ్రంథములు చదువుట, పాఠములు చెప్పుట —వీనితోడనే తక్కిన దినములు గడచిపోవుచుండెను.

సెలవులు ముగిసిన వెంటనే కుంబకోణమునందే నిరంతరావాసము ఏర్పరచుకొనవలె నని మా నాయనగారు చెప్పిరి. అందుకై అచట నొక యిల్లు చూడ దలచి వారు కుంబకోణమునకు బయలుదేరిరి. బయలుదేరునపుడు మా తల్లిగారు "కావేరికి ప్రక్కగ నున్నచో మంచిది" అనిరి. "కాలేజికికూడ ప్రక్కగ నున్నచో సౌకర్యముగ నుండును" అని నే నంటిని. వారు కుంబకోణమునకు నడచియే పోయిరి. 'రైలు బండి'లో నెక్కు నలవాటు వారికి లేదు.

కుంబకోణమున కొన్ని వీథులు చూచి 'భక్తపురి' యగ్రహారము ప్రవేశించునపుడు "మంగళాంబ యున్నది; భయము లేదు" అని యెవ్వరో ఇరువురు మాట్లాడుకొనుచుండిరి. అది వారి చెవిని బడెను. కుంబకోణము కుంభేశ్వరాలయమున విజయము చేసియున్న 'అంబికానామధేయ' మది. ఆ పలుకులు మంచి 'యుపశ్రుతి'గ తోచగనే వా రా వీథిమధ్యలో తూర్పు శ్రేణిలో ఒక యిల్లు చూచి యేర్పాటు చేసిరి. నెలకు మూడునర రూపాయలు అద్దె మాట్లాడిరి.

సెలవులు ముగిసినవి. మా నాయనగారికి తిరువావడుదుఱ వదలిపెట్ట మనసు రాలేదు. ఐనను ఒక విధముగ సమాధానపెట్టుకొనిరి. ఎల్లరము సుబ్రహ్మణ్యదేశికుల యెడను, తక్కిన మిత్రుల యెడను సెలవు పుచ్చుకొని బయలుదేరి కుంబకోణము వచ్చి క్రొత్త యింటిలో ప్రవేశించితిమి. అంతవరకు తిరువావడుదుఱవాసిగ నున్న నేను నాడు మొదలు కుంబకోణనగరవాసిగ నా జీవితము మొదలుపెట్టితిని.

త్యాగరాజచెట్టియారు ఉద్యోగము వీడి తొలగినను 'పెన్షన్' విషయమున కొన్ని చిక్కు లుండుటచేత వానిని పరిష్కరించుకొనుటకై ఆరు నెలలదనుక వారు కుంబకోణముననే నిలిచి యుండిరి. అటుపై వారు తమ యూరికి పోవ నేర్పాటు చేసికొనిరి. పెక్కేండ్లు కుంబకోణమున నుండి ప్రఖ్యాతిగన్న వారికి నగరమున పలువురు మిత్రు లుండిరి. తమ కాలేజిఉపాధ్యాయులును, ఇతరకళాశాలోపాధ్యాయులును వారి యెడ మిక్కిలి మతింపు గలిగియుండిరి. 'చెట్టియారు కుంబకోణము వీడి బయలువెడల నున్నారు'అను వృత్తాంత మెరిగి యెల్లరు దుఃఖించిరి. వారికి తగు సమ్మానముచేసి పంపవలె ననియు, అభిజ్ఞానముగ మంచి వస్తువుల నీయవలె ననియు తలచిరి. కడపట 'ఏఱుముగ (క్రమవృద్ధిముఖ) రుద్రాక్షకంఠిక' యొక్కటియు, మంచి సాలువు ఒక్కటియు నీయవలె నని యభిమానులు నిర్ణయించిరి. చెట్టియారు బయలుదేరుటకు ముందు రోజు సాయంకాలము గోపాలరావుగారి యాధ్యక్ష్యమున చెట్టిగారికి వీడ్కోలు సమ్మానము జరిగెను. పెక్కురు చెట్టియారుసామర్థ్యములనుగూర్చి యుపన్యసించిరి. నేను వారిపై పది పద్యములు వ్రాసి చదివి వారిని కొనియాడి మాటాడితిని.

అంతయు నెరవేరిన పిదప చెట్టియారు గోపాలరావునుచూచి "రేపటి యుదయమున నే నూరికి పోవుచున్నాను. అనుజ్ఞ యీవలెను. నేను 'సిఫారసు' చేసినవారు తృప్తియగునట్లు నడచుకొనుచున్నారా?" అని ప్రశ్నించిరి.

రావుగారు వెంటనే "తాము చెప్పిన చొప్పున వా రెల్లవిధముల తృప్తికరముగ నడచుకొనుచున్నారు. విద్యార్థులకును వారియెడ కడు తృప్తి యున్నది. ఈ సభయందును వారు తమ దిట్టతనము బట్టబయలు చేసియున్నారే!" అని సంతోషముగ చెప్పిరి. ఈ సంగతి చెట్టియారు అడుగడుగున విచారించి పలు విధముల తెలిసికొన్నను తాము సెలవు పుచ్చుకొనువేళ రావుగారి నోటినుండియే ఒకపరి వినవలె నని తలచియుండిరి. రావుగారి మాటలు వినిన వెంటనే చెట్టియారు విప్పారిన మోముతో నన్ను తిలకించిరి. నేను సిగ్గుచే మొగము వంచుకొంటిని.

వీడ్కోలు జరిగిన మరునాడు చెట్టియారు కుంభకోణము వదలి బయలువెడలి తిరుచ్చినాపల్లికి చెందిన 'తిరువానైక్కా' చేరి యచ్చట వసింపజొచ్చిరి. అచ్చోట చేరిన పిదప కుంభకోణమున నున్న మిత్రులకు లేఖలు వ్రాసిరి. నాకు వ్రాసిన కమ్మలో విరామదినములలో వచ్చి తమతో నుండవలె నని నిర్బంధించుచు వ్రాసిరి. తరువాతకూడ అడుగడుగున జాబులు వ్రాసిరి. నేనును అప్పుడప్పుడు బదులు వ్రాసితిని.

మొదట నేను చెట్టియారుకు వచనముగనే లేఖలు వ్రాసితిని. ఒక ప్రత్యుత్తర మందు వారు "ఇట్లు వ్రాయుచో మీకు పద్యములు వ్రాసెడి యలవాటు నిలిచిపోవును. అయ్యగారు వ్రాసెడు నలవాటుప్రకారమే మొదట ఒక పద్యము వ్రాసి తరువాత వార్తలు తెలియజేయవలె ననునది నా భావము కాదు. మీకు కవితాభ్యాసము విడువక యుండవలె ననుటే నా యాశయము" అని సూచించియుండిరి. తరువాత నేనట్లే పద్యములు వ్రాయుచుంటిని. కొన్ని సమయములందు లేఖ యంతయు పద్య రూపమున వ్రాయుటయు కలదు. వారును తమ లేఖలందు పై భాగమున నన్ను ప్రశంసించుచు పద్యములు వ్రాయుదురు. నా పద్యములను గూడ శ్లాఘింతురు.

నాకు కాలేజిలో పనియైన కొన్ని నెలలకు పిమ్మట భగవదనుగ్రహముచే నా కొక కొమారుడు పుట్టెను. ఈ సంతోషవార్తను తెలియజేయ మా నాయనగారు తిరువావడుదురైకు జనిరి. కలకండ చక్కెరలతో సుబ్రహ్మణ్యదేశికులను చూడవల సినచోట చూచి చెప్పినపుడు వారు పరమానంద మొందిరి. వెంటనే వీసెలకొలది కలకండ తెప్పించి, మఠమున నున్న యెల్లరకు పంచి "మన స్వామినాథయ్యరుకు మగబిడ్డ పుట్టియున్నది." అని తానే చెప్పిచెప్పి సంతోషించిరి. ఉత్తమదానపురము నకు సమీపమున నున్న శ్రేష్ఠమైన శివస్థల మగు 'తిరునల్లూరు'కోవెలలో విచ్చేసి యున్న శ్రీ కల్యాణసుందరేశ్వరులకు మ్రొక్కుకొనిన మ్రొక్కుబళ్లకు ఫలితముగ పుట్టియుండుటచే బిడ్డకు 'కల్యాణసుందరం' అని నామకరణము చేసిరి. మధుర యందలి స్వామివారికిని సొంత నామధేయమగు అది యొకతీరున మా గురువుగారి స్మృతిని కూడ కలిగించినది.

నే నొక బిడ్డకు తండ్రి అను దశ చెందియు కుటుంబరక్షణవిషయమున నేను బిడ్డగనే యుంటిని. నే నున్నాను; నా పని యున్నది; నా పుస్తకము లున్నవి -ఇంతటితో

నేను విలిచితిని. కుటుంబరక్షణముగూర్చిగాని, ఆయవ్యయములగూర్చిగాని, ఇతరవిశే-షములగూర్చిగాని నేను విచారించుటలేదు. వానిని గమనించుకొను 'పూచీ' యంతయు మా నాయనగారే పైన వేసికొనిరి. జీతము వచ్చిన వెంటనే దానిని వారి చేతులలో నిచ్చివేయుదును. ఒక కానీ కావలసియున్నను వారియెడనుండియే తీసికొని వెచ్చింతును. ఇట్టి స్థితిలో ఎంతయో సౌకర్య ముండుట అనుభవమున తెలిసికొంటిని. 'ఉప్పు లేదు, పప్పు లేదు' అను లోటు చెవిని పడకుండుటవంటి మహాసుఖ మింకొకటి లేదు. కుటుంబనిర్వహణవిషయమున అనివార్యమగు ఖర్చు ముందే యోచించి పొదుపుగ నిర్వహించు విధిని మా నాయనగారు తమపై వేసికొనిరి. లేనిచో ఒక రోజులో సగము కాలము అందుకే సరిపోయి యుండును. మా తండ్రి గారు నాకు చిన్ననాటినుండి సహాయము చేయుచున్నను కుటుంబభార మును నా తలపై మోపక నేను నిశ్చింతగ జీవించునట్లు చేసిన యుప కారమును నే నెన్నడును విస్మరింపజాలను. తమిళభాషకును, నాకును ఉన్న అవినాభావసంబంధము పెరిగి వృద్ధి చెందుటకు ఆ యుపకారమే కారణ మైనది.

# 41. ప్రయోజన మేమి ?

కాలేజిపని చూచుకొనుచు, ఇంటికి వచ్చు విద్యార్థులకు తీరిక వేళల పాఠ ములు నేర్పియు ప్రొద్దు పుచ్చుచుంటిని. ఆ సమయమున అరియలూరునుండి 'సేలం రామస్వామి మొదలియా' రనువారు కుంబకోణమునకు 'మునసబుగ' బదిలీ అయి వచ్చి నారు. వారియెడకు నా పూర్వపుణ్యమే నన్ను కొనిపోయి చేర్చినది. వారి స్నేహఫల ముగ జీవితమం దొక క్రొత్త పుంత కానబడెను. తమిళకావ్యవిస్తృతి తెలియనాయెను. అంతాది, కలంబకము, పిళ్లైత్తమిళ్, ఉలా, కోవై, మొదలగు* ప్రబంధములందును, పురాణములందును తమిళపు తియ్యందనము చవిచూచి, యానందించి యంతటితో నిలువక పురాతనమును, మహార్థమును అగు చల్లని ద్రావిడభాషయందు ఇమిడి యుండెడు తీయని ద్రావిడభాషానైసర్గికమాధుర్యమును నేను మాత్ర మనుభవించి యానందించుటయ కాక పెరవారలును అరసి యానందించునట్లు చేయు భాగ్యము నా కబ్బినది.

మొదలియారు సేలమున నొక పెద్ద మిట్టా జమీందారు వంశమునకు చెందిన వారు. బాల్యముననే గొప్ప జ్ఞాన మార్జించినవారు. తమిళమునను, సంగీతమునను, సంస్కృతమునను పరిచయము గలవారు. కుంభకోణమున నుద్యోగము చేయుచున్న ప్పుడు వారి పాండిత్యము కొంతవరకు వెలువడి వెలుగొందుటచే వారిని తగు పెద్ద మనుష్యులు పోయి చూచి మాట్లాడి వత్తురు. కుంభకోణమునకు క్రొత్తగా నుద్యో గస్థులు వచ్చినచో వారియొద్దకు మనుష్యులను పంపి చూచి రమ్మనుటయు, గురు పూజాదివిశేషోత్సవదినములందు మఠమునకు వారిని రావలె నని పిలిపించు టయు తిరువావడుదుఱమఠపు అలవాటు. సేలం రామస్వామి మొదలియారు గారి విద్యావిజ్ఞానములను, పెద్దరికమును వినినట్టి శ్రీ సుబ్రహ్మణ్యదేశికులు వారిని చూచివచ్చుటకై కార్బారి తంబిరానును, వారితో మరికొందరిని పంపిరి. తంబి రాను పరివారములతో జని మొదలియారును చూచి మాట్లాడిరి.

రామస్వామి మొదలియారు తిరువావడుదుఱమఠపు ప్రాచీనప్రతిష్ఠ చక్కగ నెరిగినవారగుట తంబిరానుతో మాట్లాడుచుండినపుడు మఠమునిర్వహణనుగూర్చి మాట్లాడుటతో నిలువక విద్యావిషయములను విచారింపమొదలిడిరి. "మఠమున తమిళ విద్యాభివృద్ధికి ఏమి చేయుచున్నారు? పండితులుగ నెవ్వరెవ్వ రున్నారు? ఎందరు చదువు చున్నారు?" అనునట్టి ప్రశ్నలు వా రడిగిరి. తంబిరాను తగిన సమాధానము లిచ్చు చుండిరి. తమిళభాష, సంస్కృతము, సంగీతము—ఈ మూడిటను పారంగతులైన విద్వాంసులు పదింబదిగ మఠమునకు వచ్చి సమ్మానము లంది పోవుచుందు రనియు, అధీనాధ్యక్షులే మిగుల విద్యాధికు లనియు, వారియెడను, చిన్న పండారస్వామి యొద్దను పలువురు విద్యార్థులు తమిళపాఠము వినుచు వచ్చుచున్నా రనియు తెలియ జేసిరి.

ఈ విధముగ తెలియజేయుచు వచ్చినపుడు, ఆ కాలమున మఠకార్యస్థు లుగ నున్నవారును, తంబిరానుతో వచ్చినవారును అగు శివసుబ్రహ్మణ్యపిళ్లై అనువారు మఠమున చదువుకొనుచుండిన విద్యార్థులలో నొక్కరగు స్వామినాథయ్య రనువారే ఈ యూరి గవర్నమెంటు కాలేజిలో తమిళోపాధ్యాయులుగ నున్నారు" అని చెప్పిరి.

వినిన మొదలియారు "అటులనా? నేను వారిని చూడలేదు" అనిరి.

ఇంకను కొంచెము సేపు మాట్లాడి యుండి తంబిరాను మున్నగువారు సెలవు పుచ్చుకొని చని శ్రీ సుబ్రహ్మణ్యదేశికులకు జరిగినవన్నియు నివేదించిరి. వెంటనే యాధీనాధిపతులు "ఇప్పు డటకు మునసబుగా వచ్చియున్న మొదలియారు తమిళమున మంచి పరిశ్రమ కలవా రని తోచుచున్నది. వారిని మీరు పోయి చూచి రావలెను" అని నాకు చెప్పి పంపిరి.

వారిని చూడవలె నను ఉత్కంఠ మొదట నాకు లేదు. సుబ్రహ్మణ్యదేశికులు చెప్పి పంపినందున నేను పోయి చూచి రావలె నని యొకనాడు బయలుదేరితిని. నాడు గురువారము (21-10-1880). వారున్న యింటికి చేరి వారిని చూచితిని. నేను కాలేజిలో నున్నా ననియు, మఠమున చదివినవాడ ననియు చెప్పితిని. వారు ఎవరో పరాయి వానితోడ పరాఙ్ముఖముగ మాట్లాడునట్లు భాషింపదొడగిరి. నాతోడ మిక్కిలి మక్కువగ ముచ్చటించునట్లు గోచరింపలేదు. 'అధికారధోరణివలన నిట్లున్నారు. తమిళము చదివినవారుగ నున్నచో ఇలాగున మనతో మాట్లాడుదురా?' అని నేను తలప వలసినవాడ నైతిని.

"మీ రెవ్వరియొద్ద పాఠము చదివితిరి?" అని వా రడిగిరి.

"మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్ళైగారియొద్ద పాఠములు వింటిని" అంటిని.

పిళ్ళైగారి పేరు వినిన వెంటనే వారియెడ నేదేని కదలిక కలుగు నని యెదురు చూచితిని. నా యుద్యోగమునుబట్టి నన్ను గౌరవింపకున్నను, పిళ్ళైగారి శిష్యుడ నను సంబంధముతో నైనను నాతోడ మనసిచ్చి మాటాడవచ్చునే, వా రట్లు మాట్లాడ ముందుకు రాలేదు. లెక్కపెట్టినట్లు మాట్లాడిరి.

'పిళ్ళైగారి పేరు విని కదలికమే లేని వీరు తమిళమం దభిమానము కలవారా? అంతయు నబద్ధముగ నుండును' అని నేను తీర్మానము చేసికొంటిని.

వారు ప్రశ్నించుట నిలుపలేదు. "ఏది యేది పాఠము చదివియున్నారు" అను ప్రశ్న దాని వెంటనే వారినుండి వచ్చినది. "దీనికి మనము సమాధానము చెప్పెడు తీరుననే వారు భ్రమసిపోవునట్లు చేయవచ్చును" అను నిశ్చయబుద్ధితోడ నేను చది

విన పుస్తకముల వరుస ఒప్పగింప నారంభించితిని. "కుడంతైయంతాది, మఱైశై యంతాది, పుగలూర్ అంతాది, తిరువరంగత్తంతాది, అళగరంతాది, కంబ రంతాది, ముల్లైయంతాది, మీనాక్షియమ్మై పిళ్లత్తమిళ్, ముత్తుకుమారస్వామి పిళ్లత్తమిళ్, అఖిలాండనాయకి పిళ్లత్తమిళ్, శేక్కిళార్ పిళ్లత్తమిళ్, తిరు క్కోవైయార్, తంజైవాణన్ కోవై ........."అని చెప్పుకొనుచునే పోవుచుంటిని. అంతాదులందు ఇరువది, కలంబకములం దిరువది, కోవై గ్రంథములందు పదునేను, పిళ్లత్తమిళములందు ముప్పది, ఉలాగ్రంథములందు ఇరువది, దూత్య మలు -ఇట్లే ప్రబంధములు వరుసబెట్టి చదివితిని. వారి ముఖమున ఇసుమంతైన ఆశ్చర్యము కనిపింపలేదు.

"ఇవన్నియు చదివి ప్రయోజన మేమి ?" అని తటాలున వారు అడ్డు తగిలి చెప్పిరి. నేను మిగుల వంచితుడనైతిని. "వీ రింగ్లీషు చదివి అందు మోహము కలవారుగ నుండవచ్చును. అందుచేతనే ఇట్లు చెప్పుచున్నారు. అను తలంపు నా కేర్పడినది. అయినను నేను వదలలేదు. పురాణముల వరుస యారంభించితిని.

"తిరువిళైయాడల్ పురాణము, తిరునాగైక్కారోణపురాణము, మాయూరపురా-ణము, స్కందపురాణము, పెరియపురాణము, కుత్రాలపురాణము ..."

వారు మునుపటియట్లే శిలాప్రతిమవలె నుండిరి.

"నైషధము, ప్రభులింగలీల, శివజ్ఞానబోధము, శివజ్ఞానసిద్ధియారు వ్యాఖ్య..." అను గ్రంథముల పేర్లు చెప్పితిని. లక్షణగ్రంథముల నెత్తి చెప్పితిని. అప్పుడుకూడ వారికి తృప్తి కలుగలేదు. 'అరరే! ముఖ్యమైనవానినే మరచిపోతిమే — అది ముందుగనే పేర్కొని యున్నచో వీరిని త్రోవకు దీసికొని వచ్చియుండవచ్చునే! అను దృఢాభిప్రాయముతో "కంబరామాయణము పూర్తిగ రెండు మూడు పర్యాయ ములు చదివి యున్నాను. పిళ్ళైగారియొద్దను కొన్ని కాండలు పాఠము విని యున్నాను" అంటిని.

రామస్వామిమొదలియారు "సరి, అంతియే గదా ?" అని పలికిరి. నాకు మిగుల అతృప్తి యేర్పడినది. కంబరామాయణమునందుకూడనా యంత పెడ-

మొగము ! ఇంత యశ్రద్ధ !—అను తలపే దానికి కారణము. దానిపై చెప్ప నేమున్నది ? ఐనను వారు నన్ను విడచునట్లు లేదు. మెండియు ప్రశ్నింప దొడగిరి.

"ఈ యర్వాచీనగ్రంథముల నెల్ల చదివియుంట సరిమే. ప్రాచీనగ్రంథ ములం దేదైన చదివిన దున్నదా ?"

నాకు వా రేమి తలచి యడిగిరో తెలియలేదు. 'పిళ్లెగారు రచించిన గ్రంథము లనే నేను చదివియున్నా నని వీరు భావించియున్నారేమో ! స్కాందపురాణము' పెరియపురాణము మున్నగున వన్నియు ప్రాత పుస్తకములు కావా ? కంబరామా. యణము ప్రాచీనగ్రంథమే కదా. ప్రాచీనగ్రంథ మని వీరు వే రెద్దాని నుద్దేశించి యడుగుచున్నారు ?' అని యోచింప మొదలిడితిని.

"నేను చెప్పినవానిలో ఎన్నియో ప్రాచీనగ్రంథము లున్నవే ?" అని నే నడగితిని.

"వాని కన్నిటికిని మూల మనదగు గ్రంథములు చదివియున్నారా ?" అని వా రడిగినపుడే, వారియొద్ద నేదో విశేషవిషయ మున్న దను భావము నాకు కలిగెను.

"మీ రే గ్రంథములనుగూర్చి చెప్పుచున్నారో తెలియుట లేదు" అని పలికితిని.

"జీవకచింతామణి చదివి యున్నారా ? మణిమేఖల చదివియున్నారా ? శిల-ప్పదికారము చదివియున్నారా ?"

వారు పేర్కొన్న గ్రంథములు నే చదువలేదు. మా యాచార్యులే చదువ లేదు. పుస్తకమే నేను కన్నులార కాంచనే లేదు. ఐనను 'ఇన్ని పుస్తకములు చదివి యున్నా నని చెప్పగ, దాని నొక విషయముగనే లెక్కింపక, ఏదో రెండు, మూడు గ్రంథములు చదువలే దని ఏదో గొప్పగ చెప్పవచ్చినారే !' అను భావము తోడ నహంభావమును చేరుకొనెను. "పుస్తకము దొరకలేదు. లభించినచో వానిని గూడ చదువగల ధైర్య మున్నది" అని గంభీరముగ నుడివితిని.

సాధారణముగ సంభాషించుచున్న మొదలియారు నన్ను తేరిపార జూచిరి. "నేను పొత్తము నిత్తును. ఇచ్చినచో చదివి పాఠము చెప్పుదురా?" అని యడిగిరి.

"అందు సందేహ మింతయు లేదు. నిశ్చయముగ చెప్పెదను" అని ధైర్యముతోడ బలికితిని. విజ్ఞానఫలమును, శ్రుతోపార్జనఫలమును ఉప యోగించి ఎట్లైనను చదివి తెలిసికొనవచ్చు నను సాహసము నా కేర్పడెను.

"సరి, నేను చింతామణి తీసి యుంచెదను. మీరు చదివి చూడవచ్చును. అడుగడుగున నిట్లే వచ్చుచుండుడు" అని వారు చెప్పిరి. నేను వీడ్కొని వచ్చితిని. చూడబోయినపుడు వా రున్న దశయు, నేను వీడ్కొని వచ్చినపుడు వా రన్న మాట లును తలచి వారు సామాన్యమానవులు కా రనియు, లోతైన ఎరుకయు, ఆలోచనా శక్తియు కలవా రనియు తెలిసికొంటిని.

మరునాటి యాదివారము రామస్వామిమొదలియారువద్దకు అరిగితిని. నాడు వారు మిగుల ప్రేమతో నన్ను చేరదీసిరి. వారిని చూచుటయందుకంటె వారు పేర్కొన్న పుస్తకము చూచుటయందు ఉత్కంఠ యతివేలమై యుండెను. వారు తమయొద్ద నున్న చింతామణికాగితపుప్రతిని నా యొద్ద నిచ్చిరి. "దీనిని చదివి చూడుడు. పిమ్మట పాఠ మారంభింప వచ్చునా?" అనిరి. "అట్లే చేయవచ్చును" అని ఒడబడితిని. పిదప వా రా ప్రతిని, తాము సంపాదించిన చరిత్ర చెప్ప మొద లిడిరి.

"నాకు చింతామణి మున్నగు ప్రాచీనగ్రంథములను చదువవలె నను ఔత్సుక్య మధికమై యుండెను. ఈ దేశమున నేను కలసికొనిన విద్వాంసులలో నొక్కరైనను వానిని చదివినట్లే తెలియలేదు. తాటాకుపుస్తకములును దొరకలేదు. తిరునల్వేలిప్రాంతముల నున్న కవిరాజుల యింటిలో ప్రతులు లభింపవచ్చు నని తలచి 'శ్రీవైకుంఠము'నందు 'మునసబుగా' నుండిన నా మిత్రులు 'ఏ. రామ చంద్రయ్య' రను వారియెడ విషయ మంతయు చెప్పియుంచితిని. వా రెవ్వరెవ్వ రినో విచారించి చూచిరి. ఏమియు లభింపలేదు.

"ఒకసారి శ్రీవైకుంఠమునకు సమీపమున నున్న ఒక యూరిలో ఆనువంశికముగ పండితులై యున్న కవిరాయరుల కుటుంబములో పుట్టినవా రొకరు ఒక 'వ్యాజ్యెము'లో సాక్షిగ వచ్చిరి. వారిని విచారించినపుడు వారు కవిరాయరుల వంశమునకు చెందినవా రనియు, వారి పూర్వపురుషు లెన్నియో గ్రంథములు రచించినా రనియు నా మిత్రునకు తెలియవచ్చెను. విచారణ యంతయు ముగిసిన పిదప మునసబుగారు ఆ సాక్షిని ఏకాంతముగ బిలిచి 'మీ యింట తాళపత్రగ్రంథము లున్నవా?' అని విచారించిరి. వారు 'ఉన్నవి' అని చెప్పగనే చింతామణిప్రతి యున్నచో వెదకి యెత్తి యివ్వవలె నని చెప్పిరి. ఒక యధికారస్థానమున నుండుటచే వారి ప్రయత్నము ఫలించినది. ఆ కవిరాయడు జీవకచింతామణిప్రతిని కొని, తెచ్చి యిచ్చిరి. దానికి ముప్పదియైదు రూపాయ లిచ్చి కొని నాకు పంపిరి. దానినుండి కాగితముపై ప్రతి వ్రాసిన పొత్త మిది.

"ఇంత కష్టపడి దీనిని సంపాదించియు చదువ నలవి కాలేదు; నేను కాలేజిలో చదువునప్పుడు దీని మొదటి భాగమగు 'నామగళ్ ఇలంబగం' (వాగ్దేవీలంబకము) మాత్రము పాఠ్యముగ నుండెను. దాని నొక 'దొర' ముద్రించియుండెను. అందు తమిళముకంటెను ఇంగ్లీషు అధికముగ నుండెను. గ్రంథమంతయు చదివి చూడవలె నను ఆశచే నేను పోయెడి ప్రదేశములందలి విద్వాంసుల నందరిని విచారించిచూచితిని. అందరును అంతాది, పిళ్లైత్తమిళ్, పురాణములు వీనితోడనే నిలిచిరి. కాని పైన పోలేదు. అందుచే నేను మిగుల విసిగి వేసరితిని.

"గ్రంథము మిక్కిలి యుత్తమమైనది. కంబరామాయణమందలి కావ్యపు పోకళ్లకెల్ల నీ కావ్యమే మార్గదర్శకము. దీనిని చదివి యవగాహన చేసికొని పాఠము చెప్పితిరేని మీకు మంచిది, నాకును సంతోషము కలుగును".

మొదలియారు చెప్పినదానిని మిగుల సావధానముగ వినుచుంటిని. తమిళ గ్రంథవ్యాప్తి నంతయు తెలిసికొని తనవారిన పిళ్లైగారుకూడ చింతామణి చదువలే దని తలచినపుడు "మనము ఈ క్రొత్త పొత్తమును చదివి యర్థముచేసికొనుట తేలికగ నుండునా?" అను భయము కొలదిగ కలిగినను తమిళగ్రంథసంప్రదాయమునకు వెలి కానట్టి గ్రంథ మేదైన నేమి? సంస్కృతమా, తెనుగా—క్రొత్తగ నభ్యసించి తెలిసికొనవలె ననుటకు? తమిళగ్రంథము నా జ్ఞానమును గొని విమర్శించి, చదివి

చూచినచో నర్థము కాకపోవునా ? ఎన్నియో గ్రంథములు చదివియుంటి నవి చెప్పియు, 'ప్రయోజన మేమి ?' అను ఒక్క ప్రశ్నతో ఎత్తివేసినట్లు మాట్లాడగలది ఆ పుస్తకములో నేమున్నదో చూచెదనుగాక ! అను ధైర్య మెదుట నిలిచినది.

“పిదప వత్తును. దీనిని చదివి చూచుచునే యుందును” అని యుత్సాహముతో చెప్పి రామస్వామిమొదలియారువద్ద అనుజ్ఞ పొంది బయలుదేరితిని.

వా రిచ్చిన జీవకచింతామణిప్రతిని చదువసాగితిని. అందులో 'నచ్చినార్క్కినియర్' వ్యాఖ్యకూడ నుండెను. అది జీవకునిగూర్చిన కావ్యమని మాత్రము నాకు తెలిసినదే కాని “ఇట్టి కథ యిది చెప్పును; ఇట్టి తీరున ఇది శ్రేష్ఠమైనది” అను సంగతులు నే నెరుగను. తమిళగ్రంథవిస్తృతి నొకవిధముగ నెరిగితి నను నొక భావము అంతకు మునుపు నా కుండినది. నేను చూచిన గ్రంథవిస్తృతికి వెలుపలిదై యున్న చింతామణి నాకు మొట్టమొదటిసారిగ వినయము కరపినది.

పుస్తకము చేతబట్టి కూర్చుంటిని.

'అంతము ఆదియులేని మూడు లోకములకును శ్లాఘ్యుడై ఉత్తమశాశ్వత-కానందమును తానుగనే పొందియుండెడు నెవ్వాని సతత సన్నిహిత సద్గుణ శ్రీనిధి యని పేర్కొందురో, అట్టి దేవాధిదేవుని శ్రీపాదములను చేరుదము గాక !'

ఈ భావము గలది చింతామణిలోని మొదటి పద్యము. అం దున్న పదము లందు అర్థము కానిది ఒక్కటియు లేదు. కాని ఒక గ్రంథమునందు ప్రార్థన పద్యముగ నుంచు దీన నా కొక క్రొత్తదనము తోచెను. నేను చదివిన గ్రంథములలో నున్నట్టి విఘ్నేశ్వరవందనమో, శఠకోపప్రార్థనయో అందు లేదు. జైన సంప్రదాయకావ్యమున ఆ వందనము లుండుట పాడి గాదు. సర్వసాధారణదేవ ప్రార్థనగ అది మొదట నాకు తోచినది. 'మూవా ముదలా ఉలగం' అను సమస్త పదమునకు మాత్రము నా కర్థము తెలియలేదు.

వ్యాఖ్య చదువ జొచ్చితిని. “నచ్చినార్క్కినియర్” మొదట కావ్యలక్షణమును విపులముగ వ్రాసియుండిరి. పిదప పదలక్షణము మొదలైనవి వచ్చును. ఆ కాల-

మున తొల్‌కాప్పియము అక్షరాధికారము ఇళంపూరణము, నచ్చినార్క్కినియము (వ్యాఖ్యానము)లతోడను. పదాధికారము సేనావరయము (వ్యాఖ్య) తోడను ముద్రింపబడియుండినది. వానిని నేను చదివియుండుటవలన చింతామణివ్యాఖ్యానములందున్న పదలక్షణ అక్షరలక్షణవిషయములు నాకు తెలిసినవి. వ్యాఖ్యానమందు "మూవా ముదలా వులగమ్మొరు మూన్టుం" "అనుటకు అంతము ఆదియులేని ముల్లోకములు" అని వ్రాసియుండెను. జగత్తు విలుకడలేనిది అను విషయమే అధికముగ విని యలవాటు పడియున్న నాకు ఈ భావము క్రొత్తగ నుండెను. పైన చదువుకొని పోవు చుంటిని. ఆ ఒక్క ప్రతి మాత్రమే ఆధారముగ కొని చదువుకొనుట కష్టముగ తోచెను.

ఆ వారమందు శనివారమునాడు అలవాటుచొప్పుననే తిరువావడుదురుకు చని. రామస్వామిమొదలియారును సంధించుట మొదలు సంఘటిల్లిన వన్నియు సుబ్రహ్మణ్యదేశికులకు విన్నవించితిని. వినిన దేశికులు మిగుల సంతసించి "తగు జ్ఞానము గల పెద్దవారి పరిచయ మేర్పడుట చాల మంచిది. వారికి జాగ్రత్తగ పాఠము చెప్పవలెను. పిళ్లెగారు వ్రాసిపెట్టిన చింతామణితాళపత్రప్రతి యొక్కటి మఠమున నున్నది." అని చెప్పి ఆ ప్రతి తెప్పించి యిచ్చిరి. "మొదలియారుకు పాఠము చెప్ప వలసి యుండుటచే శనివారము మాత్రమే వచ్చి ఆదివారమునాడు మరలిపోవచ్చును." అని పలికి సెలవిచ్చిరి.

కుంబకోణము వచ్చి పిళ్లెగారి ప్రతిని, మొదలియా రిచ్చిన ప్రతిని పెట్టు కొని చింతామణి చదివితిని. మొదలియారు ప్రతిలో మూలము, దండాన్వయమును ఉండినవి. మొదట కొన్ని పద్యములకు మాత్రమే విశేషవ్యాఖ్య యుండెను. పిళ్లెగారి ప్రతియందో అంతటికిని విశేషవ్యాఖ్య యుండెను. 'విశేషవ్యాఖ్య వదలిపెట్టి విడిగ దండాన్వయముమాత్రము వ్రాసికొనుటలో నేమి లాభము ? రెండును వేర్వేరు వ్యాఖ్యలా ?' అను సందేహము కలిగెను. గమనించి చూడగ రెండును ఒక్కరి వ్యాఖ్యలే యని తెలిసెను. అయినను రెండు విభిన్నరీతుల ప్రతు లుండు టేల ?—అను సందేహము తొలగలేదు.

మరునాడు రామస్వామిమొదలియారువద్దకు జని పాఠము చెప్పదొడగితిని. 'నామగళ్ ఇలంబకం' (వాగ్దేవి లంబకము) 1870 వ సంవత్సరమున బి. ఏ. పరీ

క్షకు పాఠ్యముగ నుండినది. అప్పుడు చదివిన మొదలియారు గారు పాఠము విని నపుడు తెలిసికొనిన విషయములను నడుమ నడుమ చెప్పిరి. నేను పాఠము చెప్పు చుండగ మధ్య 'కట్టియఙ్గారన్' అను పేరు వచ్చెను. నేనది యొకని పేరని తెలిసి కొనలేదు. 'కట్టియక్కారన్' అని చదివితిని. అప్పుడు మొదలియారు 'నామగళ్ ఇలంబగం' కథమాత్రము నాకు తెలియును. 'కట్టియఙ్గారన్' (కాష్ఠాంగారికుడు) అనునదే సరియైన పదము. సత్యంధరుని (చచ్చందన్) మంత్రులలో ఒకని పేరది. వాడే సత్యంధరుని చంపినాడు." అనిరి. పిదప గోవిందన్ (జీవకచింతామణి, 187, వ్యాఖ్య) అని ఒక పేరు వచ్చినది. అది కృష్ణపరమాత్మను బోధించు ననునది తప్ప చింతామణిలో నెవ్వరిని బోధించునో తెలియలేదు. మొదలి యారుకును తెలియలేదు. ఇట్లే కొన్ని విషయములును తెలియకయుండినవి. నాకు తెలియని విషయములను తెలియలేదని చెప్పి తగినవారి నడుగవలెను అని యందును. తెలియనివియు తెలిసినట్లు చెప్పి 'గజిబిజి' చేయక యుండు పెరిగిన మొదలియారు దానిని కొనియాడుదురు. మేము చింతామణి చదువుచు వచ్చినపుడు కొందరు విద్వాంసులుకూడ వచ్చియుండి వినుటయు గలదు. ఇట్లు ఐదు నెలలు గడచినవి.

చింతామణి జైనగ్రంథ మగుటచే తెలియని సంగతులు జైనుల మూలముగ తెలిసికొనవచ్చు నని తలచి, నాయెద ఇంటిలో పాఠము చదువుచుండిన 'రామలింగ పండారం' అనువారిని చూచి "ఈ ప్రాంతములందు జైను లెవ్వరేని యున్నారా ? చదువుకొన్నవా రెవ్వరైన తెలియునా ?" అని యడిగితిని.

వారు "ఇచ్చట రామస్వామి కోవెలకు పడమటి వీథిలో జైనుల యిం డ్లున్నవి. అందరును ధనవంతులే. వారిలో పండితులును గలరు." అని వారు చెప్పినది విన్న ప్పుడు వెంటనే పోయి వారిని చూడవలె నని యాశపడితిని.

మరుసటి దినము నా యభీష్టానుసారము 'రామలింగపండారము' నన్ను తోడ్కొని జైనులు వసించు వీథికి పోయిరి. అచ్చట తమకు తెలిసిన చంద్రనాథచెట్టి యారు అనువారి యింటికి నన్ను పిలుచుకొనిపోయిరి. ఆ యింటివాకిట పిండి ముగ్గులు పెట్టబడి యుండినవి. ద్వారబంధములకు మామిడాకుతోరణములు కట్టి యలంకరించియుండిరి. 'నే డేదో విశేషముగ నుండనోపు.' అని భావించి లోపలి

కేగితిమి. అచ్చట చావడిలో పలువురు కూడియుండిరి. ఆ సమూహమం దున్న ఒక ఘనుని చూపి "వీరే చంద్రనాథచెట్టియారుగారు" అని రామలింగపండారము చెప్పి నాకు. వారికిని పరిచయము చేసిరి.

"అరటిచెట్లు, మామిడాకుతోరణములను కట్టి యలంకారము చేసియున్నారే; ఏదేని విశేషము కలదా?" అని యడిగితిని.

"నేడు చింతామణి సమాప్తి నొందినది. ఆ విశేషము కొండాడుచున్నాము" అని వారు సెలవిచ్చిరి.

నాకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను. "'మనము చింతామణి గురించియే యడుగ వచ్చితిమి. చింతామణి పూర్తియైన దని వీరు చెప్పుచున్నారు. చింతామణి పారాయణ చేయుట వీరి సంప్రదాయమైనట్లు తోచెడిని" అని భావించి, "చింతామణి చదువుచు వచ్చితిరా?" అని యడిగితిని.

"ఔను. నేను శ్రవణము చేయుచునుంటిని. వీరు పాఠము చెప్పుచు నుండిరి" అని చెప్పి ఎదుట నున్న ఒకరిని నిర్దేశించి "తిండీవనము తాలూకాలో నున్న 'వీడూర్' అనునది వీరి గ్రామము. తమిళము, సంస్కృతము, ప్రాకృతములలో నున్న జైనగ్రంథములందును, వ్యాఖ్యానములందును అధికపరిచయము కలవారు. వీరికి సాటియైనవా రెవ్వరును లేరు. వీరి నామధేయము *'అప్పాసామి నయినారు'" అని తెలియజేసిరి. నాకొరకే వా రిచ్చటికి వచ్చియున్నట్లు తోచినది. 'మనము ఏ విషయము తెలిసికొన గోరుచున్నామో ఆ విషయముననే యుత్తీర్ణు లయినవారిని అతర్కితముగ చూచుచున్నాము. అదే విషయమునకు సంబంధించి యుత్సవము కూడ నడచుచున్నది. ఇది దేవుని చర్య!' అని తలచి పొంగిపోయితిని.

"ఎంతకాలముగ వీ రిచ్చట నున్నారు?" అని యడిగితిని.

---

*వీరు కుంభకోణము కాలేజి ప్రిన్సిపాలుగ నుండి పెన్షను పుచ్చుకొనుచున్న శ్రీమాన్ రావు బహదూరు అ. చక్రవర్తి నయినారుగారి తండ్రిగారు.

"ఆరు నెలలుగ ఈ పాఠము జరగుచున్నది."

'ఈ యారు నెలల కాలము మనము వ్యర్థపుచ్చితిమే' అను పశ్చాత్తాపము నాలో కలిగెను. ఆ మహాత్ములు మిగుల వినీతులుగను, నెమ్మదిగ మాటలాడువారు గను ఉండిరి. వారితోడ నేను చింతామణి చదువుచుండుటనుగూర్చి చెప్పితిని. "అందులో 'గోవిందన్' అని వచ్చును. అది యెవ్వరి పేరు?" అని యడిగితిని.

వారు అవలీలగ "విజయకు సహోదరుడు. విజయ సత్యంధరుని భార్య" అనిరి. మరి కొన్ని సందేహములు నడిగితిని. స్పష్టముగ సమాధానములు లభించెను. చింతామణి చదువుటకు తగిన సహాయ మగుపించిన దను నమ్మిక కలిగెను. చంద్రనాథచెట్టియారు కొన్ని విషయములు విశదపరచిరి. కథకూడ విశదీకరించిరి.

నాడు మొదలు చంద్రనాథచెట్టియారు నాకు ఉత్తమమిత్రు లైరి. జైనులు జీవకచింతామణిని శ్రేష్ఠమగు పారాయణగ్రంథముగ భావింతు రనియు, మనవారు రామాయణము మున్నగువానిని పారాయణ చేసి పట్టాభిషేకోత్సవము జరపునట్లు వారును ఆ గ్రంథము సమాప్తమైన వెంటనే ఆ సమాప్తికై యుత్సవము చేయుదు రనియు నాకు తెలియవచ్చెను. సాంప్రదాయికముగ చదివినవారియెడల చింతామణికి ఒక వ్యాఖ్య వారి నోళ్లయందే ఉండుచువచ్చినది. దానిని వారు చెప్పుదురు. మణిప్రవాళశైలిలో (సంస్కృతము ద్రావిడము కలసి మెలసి యుండెడు ఒక భాషాశైలి) మతసంప్రదాయపరిభాషలతో మిక్కిలి కూడి మాడి యుండు నా వ్యాఖ్య-దాని భాగము లప్పుడప్పుడు చంద్రనాథచెట్టియారు చెప్పగ నేను విని యానందించితిని.

జైనమిత్రుల పరిచయమువలన తాటాకుప్రతులు రెండు విధములుగ నుండుటకు కారణ మరసికొంటిని. నచ్చినార్క్కినియరు మొదట చింతామణి కొక వ్యాఖ్య వ్రాసి రట. పిదప దానిని జైనులకు చదివి వినిపించినపుడు సంప్రదాయవిరుద్ధము లగు కొన్ని భాగము లం దున్న వని వారు చెప్పి రట. అందుచే వారు తమ్మొక జైనులుగనే ప్రకటించుకొనుచు 'చిత్రామూర్' అనుచోట నున్న జైనమఠమునకు వచ్చి కొంతకాల ముండి జైనగ్రంథములను, జైనసంప్రదాయములను నేర్చి వెడలిపోయి మరల క్రొత్త వ్యాఖ్యానము వ్రాసి రట. విశేషవ్యాఖ్యానముతో నున్నట్టి ప్రతిలో నున్నది తరువాత వ్రాసిన వ్యాఖ్యాన మని తెలియనాయెను.

రామస్వామిమొదలియారు పాఠము చదువుచుండిరి. అచ్చటచ్చట చింతామణి సారస్యమును, వ్యాఖ్యానస్వారస్యమును తెలిసికొని వారు కొనియాడుదురు. 'గోవిందైయార్ ఇలంబకము' నందలి మొదటి పద్యపు వ్యాఖ్యయందు 'వీరన్‌తాళ్ నిళల్' (వీరుని పాదచ్ఛాయ) అనుటకు 'సమవశరణమ్' అని యర్థము వ్రాయబడి యుండినది. ఆ పదము దేనిని బోధించునో నా కవగతము కాలేదు. అవగతము కానిచో వదలుదునా ? చంద్రనాథచెట్టియారువద్దకు పోయి అడిగితిని. 'సమవశరణ' మనునది పెద్ద జినాలయ మని తెలియవచ్చెను. దానికి ఎన్నో అంగము లున్నవి అని చెప్పి చంద్రనాథచెట్టియారు "మా యింటికెదుట 'గుణపాలచెట్టియా' రనువారి యిల్లున్నది. ఆ యింట సమవశరణముపట మున్నది. అది చూచిన దాని విషయము చక్కగ తెలియును" అని చెప్పిరి.

అట్లే ఆ యింటికి జని గుణపాలచెట్టియారును చూచి మాట్లాడితిని. వారు సమవశరణపు 'పటము' నాకు చూపిరి. అందుండి సమవశరణమునంశములు నాకు స్పష్టముగ తెలియవచ్చినవి. గుణపాలచెట్టియారు జైనసంప్రదాయము తెలిసిన వారు. వారికంటె అధికముగ వారి భార్యకు తెలియును.

నే నా యింటికి పోయిన దినమున 'సమవశరణచిత్రము' చూచుటతోబాటు జైనసమయసంబద్ధములగు కొన్ని విషయములు విచారించితిని. వారు తమకు తెలిసిన వానిని చెప్పి, తక్కిన విషయములను వివరించుటకై తమ భార్యామణిని పిలుచుకొని వచ్చిరి. వారు జైనసమయవిషయములందు గొప్ప నిపుణులగు తరణిచెట్టియారను వారి తోబుట్టువు. వారిమూలమున కొన్ని సంగతు లరసితిని. నే నడుగు ప్రశ్నల నుండి ఆ నారీశిరోరత్నము నేను జైనసమయగ్రంథములందు పరిశ్రమ కలవాడనని తలచి "వీరు భవ్యజీవులవలె నున్నారే ?" అని తమ భర్తగారితోడ ననిరి. పరిపక్వదశ నందిన యాత్మలను 'భవ్యజీవు' లనుట జైనుల యాచారము. నచ్చినార్క్కినియరు జైనుల సమ్మతిని పొంది చింతామణికి వ్యాఖ్య వ్రాసినప్పు డెంత సంతోషము పొందియుందురో అంతటి సంతోషమును నే నప్పుడు పొందితిని. 'చింతామణి పరిశోధనకు నీ వర్హుడవు' అను యోగ్యతాపత్రికను ఆ జైనవిదుషీమణి ప్రసాదించినట్లే నేను భావించితిని.

ఇట్లు జైనుల తోడను, జైనగ్రంథములతోడను ఎడతెగక అలవడుచుండు నప్పుడు చింతామణిగొప్పతనము రోజురోజు గడచుకొలది నాకు చక్కగ గోచరించెను. చెందమిళ కావ్యములకు నెల్ల అదియే ఒరగల్లు అని తెలిసికొంటిని. దాని పోకడలో నున్న గాంభీర్యము, వాక్పటుతావిశిష్టతయు నా మనస్సు నాకర్షించినవి.

నచ్చినార్కినియర్ వ్యాఖ్యవలన క్రొత్త విషయములు నేర్చుకొంటిని. కొన్ని విషయములందుమాత్రము వారితో కొంచెము సంకట మేర్పడినది. పెక్కెడల మార్చి యన్వయించి యర్థము వివరింతురు. ఒకచోట నున్న పద్యమందలి పదములు పది పద్యములకు తరువాత మరియొకచోట నున్నదానితో కలిపివైతురు. అట్టి యెడల వారి వ్యాఖ్యానమునందు కొంచెము విసుగు పుట్టెను. ఒక విషయమునకో, పదప్రయోగమునకో (సంవాదరూపముగ) మరి యొక గ్రంథపు పద్యభాగమును ఉదాహరించి చూపునెడల ఆ గ్రంథపు పేరు చెప్పరు. 'అనినారు పెరవాడును' అని వ్రాసి వదలిపెట్టుదురు. చింతామణిపద్యముగ నున్నచో చంద్రనాథచెట్టియా రున్నారు. వేరొక గ్రంథ మగుచో నేమి చేయుదుము? వారు సంవాదమునకై చూపెడి యుదాహరణములలో నేను చదివిన గ్రంథములందు లేనివి. వా రుదాహరణములు చూపు ఆ గ్రంథసముదాయమే ఒక ప్రత్యేకప్రపంచముగ నుండు నేమో అన్న మతిభ్రమ కూడ నాకు కలిగెను. గ్రంథనామమునైనను ఈ మాటని చెప్పి 'అఘోరింప' కూడదా అని యడుగదగిన క్లేశము కలుగును. అయినను ఆ మహోపకర్తృవిరచితానాభరణవ్యాఖ్యాకౌశలవైశిష్ట్యము నేను మరువలేను. సంగ్రహముగ విషయమును విశదపరచి, ఏది సూక్ష్మాంశమో దానికి కడు రమ్యముగ వివరణ నేయుదురు. వారు వ్రాసెడు పదస్వారస్యములు మిక్కిలి రసవంతములు. వా రెరిగిన గ్రంథముల విస్తృతి ఒక్క పెద్ద సముద్రము అనియే చెప్పవలెను. ఇన్ని వైశిష్ట్యముల నడుమ పైన చెప్పిన రెండు లోట్లును మరిగిపోవును.

రామస్వామి మొదలియారుకు పాఠము చెప్పుటకై యారంభించిన చింతామణి-పఠనోద్యమ రాను రాను నా కానంద మొదవగూర్చు కాలక్షేప మైపోయినది. కాలేజి యందును ఇంటను పాఠము చెప్పెడు సమయము పోగ తక్కిన వేళల చింతామణి చదువుటయందే మునిగి యుంటిని.

చింతామణిపాఠమున 'గాందరువదత్తైయార్ ఇలంబగ' (గాంధర్వదత్తాలంబక) మున వగము జరిగి యుండినది. ఆ సమయమున మొదలియారు తమ పదవికి 'రాజీనామా' ఇచ్చివేసి ఎట్టి కట్టుబాట్లును లేక బ్రదుకవలె ననియు, చెన్నపట్టణమునకు పోయి వకీలుగ నుండవచ్చు ననియు తలచి సకుటుంబముగ బయలుదేరిరి. బయలు దేరు సమయమున మా యింటికి వచ్చిరి. "చింతామణిగొప్పతనమును మీ రిప్పుడు చక్కగ గుర్తించియున్నారు. ఈ యపురూపమైన కావ్యమును చదివెడువారు లేక వ్యర్థము కాకుండునట్లు మీరు కాపాడవలెను. ఇంకను కొన్ని ప్రతులు సంపాదించి మీరే అచ్చొత్తించి ప్రకాశపరచవలయును. దానివంటి మహోపకారము వేరొండు లేదు" అని పలికిరి. నేను "నాకు అలవియగునంతవట్టు ప్రయత్నించి యటులే చేయు దును" అని వాగ్దానము చేసితిని. వారు వీడ్కొని చనిరి.

# 42. 'చింతామణి' పరిశోధన

సేలం రామస్వామి మొదలియారు చెన్నపట్టణమునకు పోయి నాకు జాబులు వ్రాసిరి. జీవకచింతామణిపరిశోధన సాగించుచునే యుండవలె నని ఒక్కొక లేఖ యందును నిర్బంధింతురు. నే నట్లే చదివి పరిశోధించుచుండుటను తెలియజేసితిని. 'బవరు' దొరగారు ముద్రింపించిన చింతామణి 'నామగళ్ ఇలంబగం' అచ్చుప్రతి యొకటి నాకు దొరకెను. త్యాగరాజచెట్టియారుకు నా చింతామణివ్యాసంగమును తెలియజేసినపుడు వారు తమయొద్ద నున్న ప్రతిని పంపిరి.

నేను చింతామణిని సొంతము వేరు వేరు రెండు 'నోటు' పుస్తకములందు వ్రాసి యుంచుకొని పరిశోధించితిని. శ్రీ సుబ్రహ్మణ్య దేశికులు తిరునవ్వేలినుండి కొన్ని తాటాకుప్రతులు తెప్పించి యిచ్చిరి. వాని నన్నిటిని ఉంచుకొని పోల్చి చూచి పాఠభేదములు గుర్తించుకొంటిని. నా యొద్ద నింటిలో పాఠము చదువుకొనువారిని పెట్టుకొని ప్రతులను సరిపోల్చి చూచుకొందును. కాలేజివిద్యార్థులును వచ్చి సహాయ పడుదురు. ఒకే సమయమున నలుగురైదుగురు ఛాత్రులు తల కొక ప్రతి యుంచు కొని పాఠభేదములు చూచునపుడు పని చురుకుగ సాగును. అందు కొంచెమేని

శ్రమమే తోపదు. పగలో, రాత్రియో ఏవేళయైనను విరుతివియక పరిశోధన సలుపు చునే యుంటిని.

పిళ్లెగారు వ్రాసిన గ్రంథములందు అచ్చుపడనివానిని ప్రకటింపవలె నని త్యాగరాజచెట్టిగారి యభిలాష. మొదట శ్రీ కుంబకోణపురాణమును ప్రకటించు టకై కుంబకోణమునందున్న కొందరు ఘనులయెడ చెప్పి యేర్పాటు చేసియుండిరి. వారు తిరువావైక్కా చేరిన పిదప దానినిగూర్చి మాటిమాటికి జ్ఞాపకపరచుచు కమ్మలు వ్రాసిరి. దానికై ఆర్థికసహాయము చేసెద మని మాట యిచ్చినవారిని డాసి నేను పైకము తీసికొని చెట్టియారుకు పంపుచుంటిని. చెట్టియారు చెన్నపట్టణమున ముద్రింప నేర్పాటు చేసిరి. అక్కడనుండి 'ప్రూపు' చెట్టియారుకు వచ్చును. వారు దానిని చూచి వారికి నేత్రపాటవము తగ్గియున్నందున నాకు పంపుదురు. నేను దానిని చూచి దిద్ది చెన్నపట్టణమునకు పంపుదును. పురాణమును అచ్చుకు సిద్ధము చేసిన వాడను నేనే. మూలమునుమాత్రము చక్కజరచి ముద్రింపించుచు వచ్చితిమి. లఘు టిప్పణితో ప్రకటించిననే చదువుకొనువారికి ఉపయోగకరముగ నుండు నను భావము నా కప్పుడు కలుగలేదు.

చింతామణియందును, దాని వ్యాఖ్యయందును మునిగిపోయియున్న నాకు కార్యాంతరములపైకి గమనమే పోలేదు. ఈ గ్రంథమందలి నవ్యరసమును గ్రోలి గ్రోలి యానందపరవశుడ నైతిని. దానిని చదువ జదువ తరువాతికాలపు గ్రంథము లెల్ల ఎంతదనుక ఆ కావ్యమునుండి కావ్యసంప్రదాయము లరసి తమలో నిముడ్చు కొన్నవో యన్నది చక్కగ తెలిసెను. ప్రతివారము తిరువావడుదురకు చనునపుడు చింతామణియందు నే జూచిన తీరు తియ్యములు సుబ్రహ్మణ్యదేశికులయెడ చెప్పు దును. అం దట నట నున్న ఉదాహరణ లెన్నో పలానాగ్రంథములోని వని తెలియ లే దనియు నివేదింతును. వారు "మఠమున నెన్నియో ప్రాతగ్రంథముల ప్రతు లున్నవి. వానిని చూచి ఏదైన నుపయోగపడుచో తీసికొనవచ్చును" అని యనుజ్ఞ యిచ్చిరి. నేను మిక్కిలి కృతజ్ఞతతో అట్లే చేయగలవాడ నని విన్నవించితిని.

1883 వ సంవత్సరారంభమున 'కల్లిడైక్కుఱిచ్చి'యందు చిన్న పండార సన్నిధి స్వామివారగు నమశ్శివాయ దేశికులు 'పరిపూరణము' పొందిరి. అందుచే

మఠమునకు సంబంధించినవా రెల్లరును మిక్కిలి దుఃఖించిరి. తమిళమున గొప్ప పండితులగు వారు తిరువావడుదురైఆధీనాధ్యక్ష్యమునకు సర్వవిధముల అర్హత కలవారు. వైదుష్యపరిపూర్ణులైన సుబ్రహ్మణ్యదేశికులకు తరువాత ఆ స్థానమును వహించి ఆధీనపు యశస్సును నిలబెట్టుదు రని యెల్లరు నమ్మియుండిరి. నిర్వాహణ సామర్థ్యము మిగిలినవారు. కల్లిడైక్కుఱిచ్చియం దుండి గ్రామములను చక్కగ కాపాడుచుండుటతోబాటు పెక్కు క్రొత్త గ్రామములు కూడ విత్త మిచ్చి విలిచిరి. వారివలన మఠమునందు అర్థసంపదయు, విద్యాసమృద్ధియు ఒక్కెడనే పెంపొంది పొలుపారు నని యెల్లరును భావించి యానందించుచుండిరి. మన మొకటి తలపగ దైవము వేరొకటి తలచినది. ఏమి చేయనగును ?

'యాళ్‌ప్పాణము'నకు చేరిన రావుబహదూర్ సి. వై. దామోదరంపిళ్లై ఆకాలమున చెన్నపట్టణమం దుండిరి. 'తొల్‌కాప్పియము' మొదలగు ప్రాచీనగ్రంథములను అచ్చొత్తించు ప్రయత్నమున వారాసక్తులై యుండిరి. 'వీరశోళియ'మును వారు ప్రకటించిరి. పిదప 'ఇఱైయనార్ అగప్పొరుళురై'యు, 'తిరుత్తణిగైపురాణ'మును ప్రకటింపదొడగిరి. తిరువావడుదురైమఠమున ప్రాత తాటాకు ప్రతు లున్న వని తెలిసి వాడు వానిని పంపవలె నని ఆధీనాధ్యక్షులకు విన్నపము చేసికొనిరి. అధ్యక్షుల యాజ్ఞానుసారము ఆ రెండు గ్రంథముల తాటాకుప్రతులను ఆధీనపుస్తకశాలనుండి వెదకి తెచ్చి వారికి పంపితిని. అది పూర్తియైన వెంటనే తిరువావడుదురైకును నాకును ప్రతులు పంపిరి.

దామోదరం పిళ్లై కుంబకోణమునకే వచ్చి వసింపనున్నారని తెలిసి నే నూరట పడితిని. సేలం రామస్వామి మొదలియారు చెప్పినట్లు ప్రాచీనగ్రంథములను పరిశోధించువారును, చదువువారును లేక అర్వాచీనగ్రంథములే చదివెడువారు అధికమైన తమిళదేశమున నాకు సహాయ మొనర్చువా రెవ్వరును లేరు. నేనో ఆ విమర్శనయందు క్రొత్తగ జొచ్చితిని. ఐనను ఎట్లైని విషయమును తెలిసికొనవలెను అను ఉత్కంఠమాత్రము మట్టుమీరి యుండెను. ఇట్టి స్థితిలో ప్రాచీనతమిళపుస్తకములను అచ్చొత్తించుటయం దభినివేశముకలవా రొకరు కుంబకోణమునకు రానున్నా రని తెలిసిన వెంటనే నా కమితానందము కలిగెను.

చింతామణిపరిశోధనతోపాటు శ్రీ కుంభకోణపురాణముద్రణకూడ జరుగుచుండెను. సంస్కృతమూలమును, తమిళపద్యములను పోల్చి చూచినపుడు కొన్ని యెడల దిద్దవలసి యుండెను. పిళ్లెగారి కా విషయము తెలియజేసితిని. వారు, "పిళ్లెగారి పేరునకు లోటు రాకుండునట్లు చేయుట మన కర్తవ్య"మని వ్రాసిరి. అందుచే ఎప్పటెప్పట సరిదిద్దవలెనో అప్పటప్పటనట్లే యొనర్చితిని. ఆ పురాణముద్రణమున వ్రాతప్రతులు దిద్దు విధానము నేను తెలిసికొంటిని. ఐనను ముద్రణ మెట్లున్న అందముగ నుండును అను సంగతి బాగుగ తెలిసికొనలేదు. అచ్చుపడినదే గొప్పమని భావించు కాలమది. స్వభానునామసంవత్సరము ఆనిమాసము (1883 జూన్ నెల) ఆ పురాణముద్రణము సమాప్తి చెందెను.

ఆ పుస్తకము నేను ప్రచురించినవానిలో రెండవ ప్రకాశము. పిళ్లెగారి గ్రంథము ముద్రింపించు పుణ్యము లభించుటనుగూర్చి నాకు కలిగిన తృప్తికి మితియే లేదు. అది మాత్రమే కాదు. నేను జీవకచింతామణిని పరిశోధించి అచ్చొత్తింపవలెనని సంకల్పము చేసికొనియుంటిని. ఆ ప్రకారము చక్కగ నెరవేరవలెనే అను విచారము నా మనస్సులో నుండెను. పిళ్లెగారు సజీవులై యున్నచో వారి జ్ఞానము, ప్రేమయు నాకు సహాయముగ నుండియుండును. వారు లేకుండినను మొదట వారి పుస్తకములను ముద్రించి, తరువాత చింతామణిని ఆరంభించుట మంచి పద్ధతిగ నేను తలచితిని. సందర్భముకూడ నట్లే యమరినది.

నచ్చినార్క్కినియరు ఎచటెచట నుదాహరణములుగ నిచ్చిన పద్యభాగములు ఫలానాగ్రంథములకు చేరిన వని నేను జీవకచింతామణి పరిశోధించుచుండినపుడు తెలిసికొన వీలు కానేలేదు. తొల్కాప్పియసూత్రములనుమాత్రము తెలిసికొంటిని. తిరుక్కోవైయారునుండియు, తిరుక్కుఱళునుండియు కొన్ని పద్యాంశములు వారిచ్చి చూపుదురు. వానినికూడ తెలిసికొంటిని. తక్కిన యుదాహరణము లెవెవి నన్ను కన్నులకు గంతలు కట్టి నడవిలో విడిచిపెట్టినట్లుండెనే కాని ఈ యుదాహరణము ఫలానాగ్రంథమునుండి యున్నది, ఫలానావిషయమునకు సంబంధించినది అను విషయములు తెలియలేదు.

చింతామణివంటివి తమిళనాడులో నలవాటుపడని ఇతరగ్రంథము లేవేవి యున్నవో అను విమర్శపైకి నా మనస్సు పోయెను. రామస్వామి మొదలియారు

చెన్నపట్టణమునకు పోవునపుడు నాయెడ శిలప్పదికారప్రతి యిచ్చిరి. చెన్నపట్టణము నకు చేరిన తరువాత నే నడిగికొనినట్లే 'మణిమేఖల'ప్రతియు పంపిరి.

ప్రాచీనగ్రంథములు సేకరించి చూచెడు విషయముపై నా గమనము పోయి నపుడు తిరువావడుదుఱైగ్రంథాలయము స్మృతికి వచ్చెను. మఠమున ఏమే ప్రాత పుస్తకము లున్నవో యని వెదకి చూడదలచి ఒక శని, ఆదివారముల సెలవు దినము లలో నేను తిరువావడుదుఱైకు పోయి సుబ్రహ్మణ్యదేశికులయెడ నా యాశయము నివేదించితిని. వారు "అన్నిటిని చూచి కావలసినవానిని తీసికొనవచ్చు నని మునుపే నుడివియున్నామే" అనిరి.

నేను అచ్చట నున్న తాటాకుల కట్టలను పొరలించి పొరలించి చూడగడగితిని. తాటాకులన్నియు చాల ప్రాతవి. తాకినచో చేతికే అంటుకొనిపోవునట్టివి. ఒక కట్టలో 'ఏట్టుత్తొగై' అనియు, 'సంఘకాలపు పుస్తకమువలె నున్నది' అనియు వ్రాసి కుమారస్వామితంబిరాను కట్టిపెట్టియుండిరి. దాని నెత్తి చూడగ 'నట్రిణై' మున్నగు సంఘకాలపు పుస్తకముల మూల మని తెలిసెను. 'ఎట్టుత్తొగై' (ఎనిమిది గ్రంథముల సంపుటి) అనునదే 'ఏట్టుత్తొగై' అని మారిన దని యరసితిని. 'నట్రిణై, కుఱున్దొగై, ఐఙ్గుఱునూఱు, పదిట్రుప్పత్తు, పరిపాడల్, కలిత్తొగై, అగనానూఱు, పుఱనానూఱు అను ఎనిమిది గ్రంథముల సంపుటికి 'ఎట్టుత్తొగై' అని పేరు. ఒక ప్రాత పద్యము నుండి ఆ యెనిమిదింటి పేర్లు నాకు తెలిసినవి. అన్నిటి మూలమును చేర్చి వ్రాసిన తాటాకు ప్రతి యొకటి ఆ కట్టలో నగుపించినది. అందు 'కలిత్తొగై' యు, 'పరి పాడలు'ను లేవు.

'ఎట్టుత్తొగై'తోబాటు పిళ్లైగారు సంపాదించియుంచుకొనిన వేరొక తాళపత్ర ప్రతి యొకటి లభించెను. వా రుండగ ఆ గ్రంథము నెప్పుడైనను బయట పెట్టు దుచు. మొదట 'పొరునరాట్రుప్పడై' అని యందులో నుండెను. "ఇది యేమి గ్రంథము?" అని యడిగినప్పుడు "ఇది 'తిరుమురుగాట్రుప్పడై' వంటి ఒక ఆట్రు ప్పడై అని మాత్రమే ఆచార్యులు చెప్పిరి. అంతకుపై ఏమి యేమి యున్న వని చూచునట్టి ప్రయత్నము ఆ కాలమున పుట్టలేదు. ఆ ప్రతియే మఠపుస్తకశాలనుండి లభించినది. 'తిరుమురుగాట్రుప్పడై, పొరునరాట్రుప్పడై, శిఱుబాణాట్రుప్పడై, పెరుంబాణాట్రుప్పడై, ముల్లైప్పాట్టు, మధురైక్కాంజి, నెడునల్వాడై, పట్టినప్పాలై,

మలై పడుకడామ్, కుఱింజిప్పాట్టు' అను పది గ్రంథములు చేర్చిన సంపుటికి 'పత్తుప్పాట్టు' అని పేరు. అర్వాచీనసంఘకాలమునకు చేరిన గ్రంథములలో ఎట్టుత్తొగైయు పత్తుప్పాట్టును ముఖ్యమైనవి. పత్తుప్పాట్టు అను పేరుగాని, అందులో నణగినవి ఈ యీ పాట లనిగాని ఆ కాలమున తెలిసికొన సాధ్యము కాలేదు. అన్నిటిని తీసికొని కుంభకోణమున కరుగుదెంచితిని.

జీవకచింతామణిమాత్రము చదివి పరిశోధించుటవలన దానిని ముద్రింప నలవికా దనియు, తక్కిన ప్రాచీనగ్రంథములనుగూడ చదివి తెలిసికొనిననే చింతామణికి అర్థము వ్యక్తమగు ననియు నే నరసితిని. చింతామణివ్యాఖ్యయందు కనుపించిన యుదాహరణములను వేరుగ వ్రాసి యుంచుకొని త్రిప్పి త్రిప్పి చూచుచుందును. అందుచేత నవి 'మనఃపాఠముగ' నుండినవి. అందులో కొన్ని ఆ వ్రాత తాటాకులలో నగుపించినవి. వానిని కాంచినపుడు దొడ్డ లిబ్బి యబ్బినట్లు నా కానందము కలిగెను. పైపై చదువ దొడగితిని.

చదివినచో తేలికగ నర్థమగు గ్రంథములుగ నవి తోపలేదు. అందులో నున్నది వేరొక ప్రత్యేకభాషవలె నుండెను. అయినను నేను పట్టు విడువలేదు. చదివి చూచితిని. తొల్‌కాప్పియవ్యాఖ్యలందు వచ్చునట్టి పెక్కు పద్యము లందుండినవి. ఈ గ్రంథముల సంకలనమే ఒక ప్రత్యేకప్రపంచము అను భావము నాకు రాను రాను దృఢపడినది.

అగనానూఱు చదివి అందున్న పద్యములకు సంఖ్య పెట్టి, అం దున్న విశేష పదములను, సమస్తపదములను సంగ్రహించి అకారాదిక్రమముగ వ్రాసి యుంచుకొంటిని. నచ్చినార్కినియరు ఎచ్చ టెచ్చట 'ఇతరులు ననినారు' అని వ్రాసి యున్నారో అచ్చట నున్న ఉదాహరణభాగములందలి పదములను, సమాసములను ఆ అకారాద్యనుక్రమణికలో చూతును. ఒకటి రెండు దొరకును. ఆ పద్యము లెత్తి చూతును. చింతామణిలో నచ్చినార్కినియరు వ్రాసియుండు వ్యాఖ్యచే ఆ పద్యము కొంతవరకు అర్థమగును. అందులో మునిగి ఒకపరి, రెండు మార్లు, మూడు సార్లు చదివి చూతును.

సంఘకాలికగ్రంథసవ్యాజగత్తునందలి దృశ్యములు మంచు కప్పిన కొండ వలె నా కన్నులకు గోచరించినవి. మంచుపొర క్రమ్మియుండినను పర్వతపు ఎత్తు లావులు కన్నులకు కాన్పించునట్లు స్పష్టముగ తెలియకున్నను ఆ సంఘకాలికగ్రంథ పద్యములు విషయముల కూర్పుచే భూమికంటె విశాలమైనవిగను, ఆకాశముకంటె ఉన్నతమైనవిగను, సాగరనీరముకంటెను లోతైనవిగను తోచినవి. చింతామణి వ్యాఖ్యయందు 'అగమునందును అన్నారు' అని మునుపటి భాగములో వచ్చెను. అక్కడ నున్న పద్యభాగము అగనానూఱులో నుండెను.

ఇట్లు విమర్శించినప్పుడు అన్నిటిని ఒకవిధముగ తెలిసికొనిన పిమ్మటనే చింతామణిముద్రణ ఆరంభింపవలెనను వాంఛ యుదయించెను. చింతామణి ప్రూఫులు మరల మరల చదివితిని. తక్కిన గ్రంథములను పదేపదే చదివి 'నోట్సు' వ్రాసికొంటిని.

చింతామణి తాళాకు ప్రతులు ఇంకను దొరకునా యని నాకు తెలిసినవారి నెల్లను విచారించుచునే యుంటిని. సందిగ్ధములైన పాఠములు పెక్కు లుండుటచే మంచి పాఠము గల ప్రతి దొరకినచో చూచి లాభము పొందవచ్చు నను భావములో పలువురిని విచారించితిని. పలువురికి లేఖలు వ్రాసితిని. 'తంజావూరు'లో గొప్ప ధనికులగు వృషభదాస మొదలియా రనువారి యింట పలు ప్రాత తాటియాకుపుస్తకము లున్నవని తెలియవచ్చెను. అప్పుడు నా తాళపత్రగ్రంథాన్వేషణయాత్ర ఆరంభించితిని. ఇప్పటికిని విడువలేదు. తంజావూరునకు పోయి నాకు తెలిసిన ఒక పెద్దమనుష్యుని నాతోడ పిలుచుకొనిపోయి మొదలియారుగారి యింటికి నేగితిని. వారు జైనులు. పెక్కు జైనమతగ్రంథములు వారియొద్ద నుండినవి. ఒక చింతామణిప్రతియు నుంచుకొని పూజించుచుండిరి. నేను పోయి యడిగినప్పుడు మొదట అది పూజనుండి యెత్తకూడ దని చెప్పిరి. నేను మిక్కిలి వినయముతో వేడికొంటిని. "జైనులకే యిచ్చుట గాని ఇతరుల కివ్వను. అట్లిచ్చుట మా సంప్రదాయమునకు విరోధము. ఎన్నో రహస్యము లిమిడియున్న చింతామణిని మిక్కిలి సులభముగ మీరు చదివి చూచుట మేలుకాదు. ఆచార్యముఖమున నుపదేశము పొంది విషయములు తెలిసికొనవలెను. అన్యమతస్థు లగు మీకు ఇచ్చుటవలన మాకు పాపము వచ్చును" అనిరి.

వీరికి ఏమేమో సమాధానములు చెప్పి చూచితిని. తమిళలోకమంతయు చదివి యానందించు సంగతులు చింతామణిలో నుండగ ఒక మతమునకే చెందినది, ఇతరుల కంట పడరాదు అని తలచి మూసి దాచిపెట్టుకొను స్వభావము లేదని నేను వగ చెందితిని. "ఇట్లు సంప్రదాయభేదము భావించి దాచిపెట్టుటచే లోకమునకే తెలియని గ్రంథము లెన్ని నశించినవో! తమిళభాషకు గొప్పతనము సంపాదించిన పెద్దలు గ్రంథములు రచించియుండ వానిని మరుగుపరచి ఉంచుకొను, తమకు చెందిన వారికిని చిన్నతనము కలిగించునట్టి స్వభావము కలవారి మనసు మారి బాగుపడు కాలము వచ్చునా అని మొగము వాచియుంటిని.

నాతో వచ్చియుండిన ఒకరు వృషభదాసమొదలియారుతో నేను కుంభకోణము కాలేజీలో నుద్యోగి యనియు తిరువావడుదురై మఠమునకు మిక్కిలి నాప్తుడనియు చెప్పిరి. నా స్థితి తెలిసికొనినమైన మొదలియారు వ్రాతప్రతిని ఇవ్వవచ్చునని చెప్పినవారి యభిప్రాయము. కాని యది విపరీతముగ పరిణమించెను. "అలాగునా? శైవమతమున మెలగువారికి జైనగ్రంథములపై అభిమానము చూపుటయే న్యాయము కాదు. శైవులు జైనులను తుచ్ఛముగ తలంతురు. నేనివ్వనే ఇవ్వను" అని వారు చెప్పినపుడు, ఏమిరా! ఇది విపరీతమైనదే యని నా మిత్రులు తమలో తామే నొచ్చుకొనిరి.

మగుడ వత్తు నని చెప్పివేసి. తంజావూరులో నెవరిని పట్టి ప్రయత్నించినచో మొదలియారుప్రతి పొందవచ్చునా యని విచారించితిని. అప్పటికి "తుక్కారామ్ హోల్కార్" అను ధనవంతులగు మహారాష్ట్రీయు లొకరు నాకు మిత్రులు; వారిని పిలుచుకొనిపోయి మరల వృషభదాసమొదలియారు కడకు వెళ్ళితిని. మంచి కాలము, వారి మనసు మెత్తబడినది. తమయొద్ద నున్న ప్రతి యిచ్చుట కొప్పుకొనిరి. ఇంత కష్టపడి సంపాదించిన ఆ ప్రతి శ్రేష్ఠమైనది కాదు; విశేషవ్యత్యాసము లేనిది.

ఇట్లు పలువిధముల కడగి మొత్తము చింతామణిప్రతులు 28 లభించినవి. వాని నన్నిటిని పెట్టుకొని చూడ నారంభించితిని. మెల్ల మెల్లగ పలువిషయములు తెల్లమాయెను. కాని పాఠభేదసమ్మేళనమునకు గట్టునే తెలియకుండెను. మునుపు పోయినట్లెల్ల వ్రాసిన ఘనులు సృష్టించిన పాఠములో లేక మూలపాఠములో తెలియక చిక్కియుండెను.

ఇది కొమ్ము.. ఇది గుడి అని వేరుపరచి తెలిసికొన వీలు కాదు. వ్యంజనా క్షరములకు పై చుక్కలే లేవు. (పై చుక్క అ|జహితహల్మాత్రమును (క్) తెలుపును. లఘురేఫమునకును ఆకారచిహ్నమునకును భేదమే తెలియదు. అందుచే శరభము శాపముగను, శాపము శరభముగను తోచును. ఒకచోట 'శరడు' అని వచ్చియున్న మాటను 'చాటు' అనియే చాలకాలము తలచియుంటిని. 'తరన్' అనుదానిని 'తాన్' అని చదివితిని. (ఈ తారుమా రంతయు రేఫ- ఆకారచిహ్నములకు భేదము తెలియమిచే నేర్పడినది.) "ఏనుగు నాగమునందు పుట్టుటచేత" అని యొకచోట నుండినది. యోచించి యోచించి చూచితిని. ఏనుగులలో వనచరములు, నదీచరములు, గిరిచరములు అని మూడు విధము లున్న వని వినియుంటిని. నాగ మనగ కొండ యనియు ('నగ ఏవ నాగః' - స్వార్థిక ప్రత్యయముః), గిరిచర మైన ఏనుగును అది బోధించు నని గ్రహింపవచ్చు ననియు తోచినది. ఒక మిత్రులు, జైనసంప్రదాయమున నాగము (సర్పము) కడుపునుండి యేనుగు మొదట పుట్టిన దని యుండవచ్చు నేమో యని ఒక సందేహమును లేవదీసిరి. "అది నాగమునుండి పుట్టినదో లేక నరకమునుండి పుట్టినదో ఏమియు బోధపడ లేదు" అని పలికి నవ్వితిని.

"ఏనుగు నాగమునందుండి పుట్టుటచేత దానికి తలవంచుట స్వభావము" అని నచ్చినార్కినియరు వ్రాయుచున్నారు. గాంధర్వదత్తతోడ పాట పాడి ఓడి పోయినవారిని చూచి-

'గాంధర్వమం దీమెకు నోడితిని. ఏనుగుతో జయింత మన్న అది వీలు కానట్టిద కదా?'

అని యొకడు చెప్పినట్లుగ నుండెడు సందర్భమున 'ఏనుగుతోడ జయించుట యపదు' అను సంగతిని ప్రతిపాదించుటకై నచ్చినార్కినియరు ఆ వాక్యము వ్రాసి యున్నారు. కాగ అచ్చట సంగీతముతో సంబంధించిన విషయ మున్ననే పొందికగ నుండును. వీని నన్నిటిని పరామర్శింపగ ఏనుగు 'నాదము' నందు పుట్టుటచేత (చూ. సామజము) అని యుండవలె నని నిశ్చయించితిని. పలు ప్రతులలో స్పష్టముగ నాగమునందు అనియే యుండెను. ఒక ప్రతియందు మాత్రమే "నాదమునందు"

అను పాఠము కనుపట్టెను. ('క' 'ఠ' లకు గల సామ్యమే ఈ తికమకకు హేతువు.)

ఇట్లే 'కురుది' అనుదానిని 'కుంతి' అని తలచి తారుమారైతిని. ఒకచోట 'లక్ష్మి వసించు వక్షస్థ్సలమువాడు, జలక్రీడలో ప్రాణములు కోల్పోవుచున్న కుక్కకై తా వగచి పంచాక్షరమంత్రము నిచ్చినట్లును' అని యుండినది. ఇది జైనగ్రంథ మాయెనే, పంచాక్షరమంత్ర మిచ్చుట నెట్లు చొచ్చుకొనినది అని సందేహము కలిగెను. మూలమున కుక్కకు అమృతము ఇచ్చినట్లును అని యున్నది. 'అమిర్దు' అనుటకు "పంచాక్షరమగు మంత్రము" అనునది వ్యాఖ్యయై యుండినది. 'మంత్ర మును' అని (మాత్రము) ఉండి యుండవలెను. ప్రతి చూచి వ్రాసిన శైవు లెవ్వరో పంచాక్షర మని చేర్చి వ్రాసినారు అని మొదట భావించితిని. పిదప చదువుకొని వచ్చుచుండగ 'పంచపదామృతము అనినయెడల' (946) అని వచ్చినది. ఇతరస్థలములందలి వ్యాఖ్యవలన 'పంచ నమస్కార మంత్ర' మని తెలిసినది. జైనమిత్రుల విచారించితిని. వారు మిక్కిలి తేలికగ "అర్హులు, సిద్ధులు, ఆచార్యులు, ఉపాధ్యాయులు, సాధువులు అను పంచపరమేష్ఠులకు వందన మాచరించుట కైన ఐదు మంత్రములను 'పంచ నమస్కార' మని చెప్పుట సంప్రదాయము" అని తేటపరచిరి.

ఇట్లు తొట్రిలి తొట్రిలి శ్రమపడుటలో నా కలపు తోపలేదు. పైపైన ఉత్సాహమే కలిగెను. ఏదేని యొక ఉదాహరణమో, ఒక విషయమో, ఒక పాఠమో తెలియక భ్రమని పరితపించి యుండి తరువాత నది తెలిసినచో అంతకు మునుపు పడిన పాట్లన్నియు మరుగున పడిపోవును. ఇంకను పదింతలుగ ఉత్సాహము పుట్టును.

సాధురేఫమునకును శకటరేఫమునకును భేదము తెలియక యడ్డు తగిలి నిలిచిన చో శ్లైన్నో! వ్యాఖ్య యిది, మూల మిది, ఉదాహరణ యిది యను వేరుపాటు అరయలేక సంకటపడిన సందర్భములు చాల. నచ్చినార్కినియరుల అన్వయము నందు వచ్చెడు పద్యాంశముల వెదకి కనుగొన వలనుపడక, దిక్కు తోచకయున్న సమయములు పెక్కు. ఒక తాళపత్రమునకును, వేరొక పత్రమునకును నడుమ నున్న

యుండెను. తంబిరాను, దేశికుల యాజ్ఞమున నన్ను జూచి "తిరువిడైమరుదూరు స్థలమాహాత్మ్యమును తెల్గున చక్కగా తెలిసికొనలేరు. ప్రాత పురాణము లున్నను వానిని చదివి యర్థము చేసికొనగలవారు మిగుల కొలదిమంది మాత్రమే. అందుచే తాము ఆ స్థలమాహాత్మ్యమును సంగ్రహముగ గద్యరూపమున వ్రాసినచో ముద్రింపించి అందరికిని పంచిపెట్టవచ్చును. ముద్రణవ్యయము మున్నగువానిని నేను పైని వేసికొందును" అనిరి. దేశికులును అట్లు చేయుట లెస్స యని సూచించిరి. నేను వ్రాయుట కియ్యకొంటిని.

తిరువిడైమరుదూరునకు 'జ్ఞానక్కూత్తర్' అనువారు రచించిన తమిళపురాణ మొకటియు, 'కొట్టైయూర్ శివక్కొళుందు దేశికులు' రచించిన పురాణ మొక్కటియు నున్నవి. శివక్కొళుందుదేశికులు వ్రాసిన పురాణమును చదివి, అందులోని ప్రధానాంశములు తీసికొని తిరువిడైమరుదూరుస్థలమాహాత్మ్యమును వ్రాసి పూర్తి చేసితిని. దానికి 'శ్రీ మధ్యార్జున మాహాత్మ్యము' అని పేరుపెట్టి, శ్రీమూర్తి, దివ్య స్థలము, తీర్థములు — వీని వైభవములను భక్తుల చరిత్రలను వ్రాసి సుబ్రహ్మణ్య దేశికులకును, సుబ్రహ్మణ్యతంబిరానులకును చదివి వినిపించితిని. పిదప తంబిరానుల యిచ్ఛ చొప్పున తిరువిడైమరుదూరునందలి యుత్సవమూర్తియగు 'పకనాయక స్వామి' విషయమున ఒక ఊయెలపాట, జోలపాటయు వ్రాసి చేర్చితిని.

అంతయు ముగిసిన పిమ్మట తంబిరాను దాని నెప్పుడు ముద్రింప వచ్చునా యని యాలోచించిరి. అంతకు మునుపు కొన్ని గ్రంథములు మద్రాసులో నచ్చొత్తించిన సమాచారము వారికి తెలియును. అందుచేత అప్పటికే పంపి ముద్రింపించి తెప్పించుకొనవచ్చు నని నేను చెప్పినప్పుడు, వారు "పుస్తక మిప్పుడు పూర్తియై యున్నది. వసంతోత్సవము కొలది దినములలో జరుగనున్నది. అంతలో పుస్తక మచ్చయి వచ్చిన మిక్కిలి యుపయోగకరముగ నుండును. తపాలుమూలముగ అచ్చు ప్రూపులు వచ్చుటయు, వానిని దిద్ది పంపించుటయు నన్న మన ముద్దేశించు కొనిన కాలములోపల నెరవేరు నని తోచుటలేదు. మీ కిప్పుడు విరామకాలముగ నున్నచో మీరే శ్రమ యని తలపక చెన్నపట్టణమునకు పోయి, స్వయముగ దగ్గర నుండి పని పూర్తిచేసికొని రావచ్చును. ఖర్చు కొంచె మధికము. కాని కార్యము మిగుల విలువైనది" అనిరి. వారి మాట 'చెరకు తినుటకు 'కూలి యిత్తు' నన్నట్లు

ఉండెను. అంతవరకును చూచి యెరుగని యా మహానగరమునకు బోయి, అట నున్న జ్ఞానాధికులతోడ పరిచయము సంపాదింపవలె నను నభిలాష యుండెను. అంతయె కాక సేలం రామస్వామి మొదలియారును చూచి, కొంతకాలము వారితోబాటు వసించి, చింతామణి చదివి వినిపింపవలె నను నుత్కంఠయు నుండెను. వీనిని నెర వేర్చుకొనుటకై యీ కార్యము నా పాల పడుట నా మంచి యదృష్టమే అని తలచి నేను 'అట్లే పోయి పొత్త మచ్చొత్తించుకొని వత్తు' నని యొప్పుకొంటిని.

మంచి దినమున బయలుదేరి నేను నాయొద్ద చదువుకొనుచుండిన యిరువురి తోడ చెన్నపట్టణమునకు చనినాను. రామస్వామిమొదలియారుగారి బంగళాలో విడిసి తిని. చెన్నపట్టణములో జీవరక్షామృతముద్రణాలయమున నేను కొనిపోయిన గ్రంథమును ముద్రింప నిచ్చి, అది గమనించుకొను డని తోడ వచ్చిన యిరువురికి చెప్పి, హెచ్చు కాలము రామస్వామి మొదలియారుతో నుండుచు కాలము పుచ్చు చుంటిని. జీవకచింతామణికి సంబంధించిన సంగతులు నేను వ్యాఖ్యానించునపుడు వారు విని మిక్కుటముగ తృప్తి నొందుచుండిరి. "ఎట్లైనను సమాప్తి చేసి దానిని ప్రకటింపుడు. ఇటకు వచ్చియుండి ముద్రణాదికృత్యములు నెరవేర్చుకొనవచ్చును. నాచేతనగు సహాయ మంతయు నొనర్తును" అనిరి. "అది యారంభించుటకు మీరే సాయము చేయవలెను" అని నే నంటిని.

చెన్నపట్టణమున నేను రెండు వారములకు పైబడి వసించి యుంటిని. మధ్యా-ర్జునమాహాత్మ్యమును ముద్రింపించుట నొక కారణముగ పెట్టుకొని చెన్నపట్టణము నకు వచ్చినను నా దృష్టిమాత్రము ఆ నగరమును, అచట నున్న విద్యాసంపన్నులను చూచి తెలిసికొనవలె ననునదే. రామస్వామి మొదలియారుగారి మహోపకారముచేత ఆ యుద్దేశ మతిసులభముగా నెరవేరినది.

ఒక్కొక్క దినమునను మొదలియారు అపరాహ్ణవేళల తమ 'కోచి' బండిలో నన్ను వెంట నిడికొని బయలు వెడలుదురు. ప్రెసిడెన్సీ కాలేజి, కాస్మాపాలిటన్ క్లబ్బు మున్నగు చోట్ల కేగి, అచ్చట నుండెడువారును, వచ్చుచుండెడువారును అగు పలువురు ఘనులతో ఒక్కొక్కరితోడను నాకు పరిచయము కలిగింతురు.

చెన్నపట్టణమున చూడదగిన మ్యూజియము, సాగరతీరము, దేవాలయములు, గ్రంథాలయములు, విశ్వవిద్యాలయము మున్నగువానినిగూడ చూచితిని. విద్వాంసు

లను, విజ్ఞానవంతులను చూచి పరిచయము సంపాదించుకొనుట దుర్లభమగు మహా లాభముగ తోచెను. ఉన్నతమగు ఉద్యోగస్థానమును వహించుచున్న పెద్ద లందరును వినయముతోడను, ప్రణయముతోడను వ్యవహరించుట చూచి నేను నివ్వెరపడితిని. కుంబకోణమునందు పదునైదు లేదా ఇరువది రూపాయలు జీతము పుచ్చుకొను గుమాస్తా చేయు అట్టహాసములు, ఆడంబరములు చూచిన నాకు ఆ పెద్దల స్థితి మిక్కుటమగు నబ్బురపాటొదవజేసెను.

ఒక రోజు సుబ్రహ్మణ్యదేశికులయొద్దనుండి నాకొక శ్రీముఖము వచ్చినది. "చెన్నపట్టణమున నాట్టుప్పిళ్లైయార్ కోవెలవీథి మఠమున నున్న విద్వాన్ ఆఱుముగ త్తంబిరానువద్ద ఒక చిన్న తంబిరాను చదువుకొనుచున్నట్లు తెలియుచున్నది. మేము మహామహామునకై కుంబకోణము పోయి యున్నపుడు ఆ చిన్న తంబిరానును కున్నక్కుడి మఠకార్యస్థులు అప్పాపిళ్లెయు, దైవశిఖామణి అయ్యరును పిలుచుకొని వచ్చి చూపిరి. వారి యాకృతిపెంపుసొంపు కన్నుల నరికట్టెను. సంస్కృతమునను, తమిళమునను మే మడిగిన ప్రశ్నలకు వా రిచ్చిన ప్రత్యుత్తరములు తృప్తికరముగ నుండినవి. వారు లభ్యపడినచో ఇచ్చట చిన్నపట్టమునకు ఏర్పరప వచ్చు నని తలచుచున్నాము. వారికి సమ్మత మగుచో, వారిని కలసికొని యిక్కడికి పంపవలెను" అని యందులో వ్రాసియుండిరి.

నేను చెన్నపట్టణమునకు వచ్చినది మొదలు ఆ చిన్న తంబిరాను అడుగడుగున నాయొద్దకు వచ్చి యోగక్షేమములు పరామర్శించి పోవుచుండిరి. ముద్రణాలయమునకు వా రున్నచోటు సమీప మగుటచేత వారు వచ్చి నన్ను చూచుటకు అనుకూలముగ నుండెను. వారియొద్ద సుబ్రహ్మణ్యదేశికుల మనోభావమును తెలియజేసినపుడు వా రానందముతో నంగీకరించిరి. సుబ్రహ్మణ్యదేశికులకు ఈ సమాచారము వ్రాసి తెలియజేసితిని. వారు వెంటనే తంబిరానును తిరువావడుదురకు పంపింపవలె నని వ్రాసిరి. అట్లే నాతో వచ్చియున్నవారిలో నొక్కరిని తోడుచేసి ఆ చిన్నతంబిరానును తిరువావడుదురకు పిలుచుకొని పోవున ట్లేర్పాటు చేసితిని.

మధ్యార్జున మాహాత్మ్యము అచ్చయి ముగిసిన వెంటనే బయలుదేరి తిరువిడైమరుదూరుకు శ్రీకల్యాణోత్సవదినమున పోయి సుబ్రహ్మణ్యదేశికులయెడ పుస్తకము ప్రతుల నప్పనచేసి జరిగిన సంగతులు చెప్పితిని. అన్నియు విని వారు మిక్కిలి తృప్తిపడిరి.

# 44. చింతామణి ప్రచురణా సంఘటనలు

పొరింబొరి విమర్శించుచు వచ్చుటచేత నా తలపంతయు చింతామణిమయ మైపోయినది. అంతలో నా మనసు మునిగిపోయినది. ప్రాతఃకాలము మేల్కాంచిన వెంటనే చింతామణిముఖమునే చూతును. దంతధావనము చేసికొని, అనుష్ఠానము నెరవేర్చుకొని, ఆహారము పుచ్చుకొందునో లేదో చింతామణి పరిశోధింప దొరకొందును. కాలేజికి పోవ కాలము మీరిపోవునే యనికూడ తలపను. కాలేజిలో కొట్టెడు మొదటిగంట నా చెవిలోపడి చింతామణినుండి నా మనస్సును బలాత్కారముగ పట్టి లాగును. చెట్టెడు నాలుగు మెతుకులు తిని బయలుదేరుదును. కొన్నాళ్లు భోజనము చేయకయే పోవుదును. కాలేజిలో పాఠప్రవచనము జరగుచుండునపుడు నడుమ నెన్నియోమారులు చింతామణినిగూర్చి పిల్లవాండ్రకు చెప్పుదును. వారిలో కొందఱిని మా యింటికి పిల్చుకొని పాఠభేదములు శోధింపజేసియు, 'నోట్సు' వ్రాయించియు చింతామణిపరిశోధనకృత్యమునందు వారిని నిమగ్నుల జేయుదును. సాయంకాలము కాలేజినుండి యింటికి వచ్చినవెంటనే చింతామణి చేత బట్టుదును. మా యింటి యరుగుమీద నున్న 'దస్కు'పై ప్రతి నుంచుకొని యెన్నియో రాత్రులు చింతామణిపరిశోధనావిమగ్నమానసుఁడనై యుందును. నాకు చింతామణియు, చింతామణికి నేనును తోడు. ప్రొద్దు పోవుటయే తెలియక విమర్శ సాగిపోవుచుండును.

కళాశాలోపాధ్యాయులలో ఒక్కరు ఒకనాటిరేయి పండ్రెండు గంటలవఱకు ఒక మిత్రునియింట 'పేకాట'యాడి మా వీథిమార్గమున తమ యింటికి జనుచుండిరి. నలుగడల ఇరు లలముకొన్న యారేయి వాకిటి తిన్నెపై కూర్చొనియున్న నన్ను చూచి వెరగుపడి "ఏమి టిది! ఇంకను కూర్చొనియున్నారే? నేను పోవునపుడు నిట్లే యాసీనులై యుంటిరి. ఇప్పుడు నట్లే యున్నారే!" అని యడిగిరి. క్లుప్తముగ వారికి బదులు పలికి నేను వారిని పంపివేసితిని.

ఆ యొంటరిపాటులో తిరుత్తక్కదేవరు (గ్రంథకర్త) నన్నెక్కడికో పిలుచుకొని పోవుదురు. రాజమహాపురపుదృశ్యమును చూపింతురు. సత్యంధరుని యంతఃపురమునకు తోడ్కొని పోవుదురు. కాష్ఠాంగారికుని చర్యల వివరించి చెప్పుదురు.

జీవకుడు మాట లాడును ; క్రీడించును ; వీరచేష్టితము లొనర్చును ; సుఖమయవిలాసములందు తన్మయుడై యుండును. గాంధర్వదత్త కన్నుల యెదుట నిలుచును. గుణమాల సాక్షాత్కరించును.

ఇన్ని దృశ్యముల నడుమ నా యొడలు మాత్రమే రాత్రి యొంటరిగ నుండెనే కాని నా మనసు చింతామణిప్రపంచమున విశాలప్రదేశములను దీర్ఘకాలవ్యాప్తము లగు సంఘటనలను కొలిచి యానందించును. ఎడనెడ పరిశోధనజ్ఞప్తి కలుగు చుండును. చిక్కులును, కలతలును తలయెత్తుచుండును. అప్పట్టున జీవకచింతామణిదృశ్యములు మరుగుపడును. పొత్తమును, అక్కరములును ముందు నిలుచును. పాఠభేదములు వచ్చి పోరాడుచుండును. సంగతిసందర్భములు తెలియని 'యయోమయ' స్థితిలో తికమకపడుచుందును. ఉన్నట్లుండి ఒక వెలుగు వెలుగును ; విషయము తెల్ల మగును. మరల పుస్తకము, అక్షరములు, ఈ లోకమును మరుగుపడును.

ఇది యి ట్లుండగ చెన్నపట్టణమున నున్న సి. వై. దామోదరంపిళ్లె నాకు వ్రాసిన చొప్పున కుంబకోణము చేరి యచట వకీలుగ నుండుచుండిరి. వారు మునుపే యొక పెద్ద యుద్యోగమున నుండి పెన్షను పొందినవారు. వారు మాటి మాటకి మా యింటికి వచ్చి ద్రావిడగ్రంథసంబద్ధసల్లాపములు సలిపి నాకు బాగుగ పరిచితు లైరి. కుంబకోణమునకు సమీపముననే యున్న 'కరుప్పూరు' లో 'బస' యేర్పాటు చేసికొనియుండిరి. వారి యింటికి నేనును పలుమారులు పోయి వచ్చుట యుండెను. తాము పలు తమిళగ్రంథములు ప్రకాశపరప నుద్దేశించి యున్నట్లు తెలియజేయుటతోబాటు, తిరువావడుదుఱకు పోయి శ్రీ సుబ్రహ్మణ్య దేశికులదర్శనము చేసికొన వలె ననియు అభిలషించిరి. ఆ విధముననే నేను వారిని పిలుచుకొనిపోయి దేశికులకు పరిచయపరచితిని. మఠమున పెక్కు తాటాకుప్రతు లుండు ననియు, వానిని తమ ముద్రణమం దుపయోగపరచుకొనవచ్చు ననియు వా రభిప్రాయపడిరి. దేశికులతో వా రొనర్చిన సంభాషణనుండి దేశికులు వారి విద్యావైశద్యమును, పెద్దరికమును తెలిసికొనిరి.

జీవకచింతామణిని త్వరలో ముద్రింపవలె నను న్యాత్రము నాలో పొడమెను. చక్కగ పరిశోధించి దానిని ప్రకటింపవలె నన్న పెక్కేండ్లు పట్టును. కాని

ఒక్కొక్క విషయమును నిస్సందేహముగ తెలిసికొని తృప్తి కలిగినపిమ్మటనే ప్రక టించు టనునది సులభము కాదు. నా మిత్రులలో కొందరు "ఇట్లు పరిశోధన సలుపు చునే యున్నయెడల జీవితకాల మంతయు నిందే కడచిపోవును. మీరు నిదానముగ ప్రకటించులోపల వేరెవ్వరైన ప్రకటించివేయుదురు. ఇంతవరకు తెలిసిన విషయ ములను ఒక విధముగ పరిష్కరించి యేర్పరచుకొని యారంభింపుడు. తరువాతి ప్రకాశమున దిద్దుపాట్లు చేసికొనవచ్చును. ప్రచురణలు రాగరాగ సంగతులు దిద్దుపా టగు చుండును" అని ధైర్యము చెప్పిరి. అందుచేత ప్రకటింపవచ్చు నని నిర్ణ యించుకొంటిని.

'ముద్రింప ద్రవ్యము కావలెనే! దాని కేమి చేయుట?' అని దిగులు పుట్టెను. కొందరు మిత్రులు దాని కొక యుపాయము చెప్పిరి. "తమిళభాషాభి- మానము గల ఘనులయొద్దకు జని, చింతామణి ముద్రింప నున్న సంగతి తెలియ జేసి వారికి వలసిన ప్రతులకై వారియొద్ద చేవ్రాలు తీసికొని, ముందుగనే వారినుండి పైకము పుచ్చుకొని ముద్రణ మారంభింపవచ్చును." అనిరి. అది మంచి యుపాయమే యని తోచెను. అందులకై ఒక ప్రకటన అచ్చొత్తించి మిత్రులకు పంపితిని.

తిరువావడుదుఱకు పోయి పండారస్వామిసన్నిధిని నా యాశయము నెరిగించి నపుడు వారు మహానందముతో మొదటి యొప్పుదల 'సంతకము' తామే చేయునట్లు పలికి, కొన్ని ప్రతులకై చేవ్రా లిడి రొక్క మిచ్చిరి. కుంబకోణమున కొంచె మించుమించుగ డెబ్బదుగురు మిత్రుల సంతకములు సంపాదించితిని. తంజావూరి కిని, తిరుచినాపల్లికిని జని పలువురు మిత్రుల సాయము పొందితిని. తిరుచినాపల్లిలో త్యాగరాజచెట్టియారు సహాయముచే ఇరువది, ఇరువదైదుగురు చేవ్రాళ్లు చేసిరి.

1886 వ సంవత్సరము వేసవి సెలవులలో చెన్నపట్టణమునకు జని చింతామణి ముద్రణ మారంభింపవలె నని నిర్ణయించుకొంటిని. అందుచేత దానికి తగిన చంద నము 'ప్రెస్‌కాపీ' తయారుచేసితిని.

మనసార భగవత్కృప నర్థించి చెన్నపట్టణమునకు బయలుదేరితిని. రామ- స్వామి మొదలియారు అప్పుడు చెన్నపట్టణమున లేకుండుటచేత, వారి బంగళా కరుగక, షోడశావధానము సుబ్బరాయచెట్టిగారి యింటికి పోయి బస చేసితిని. నేను

కొని పోయిన వ్రాతప్రతులను, విమర్శకు వలసిన సాధనములను, ఇతరవస్తువులను అచ్చట నుంచుకొని, పరశువాకమున నున్న ఒక భోజనశాలలో భుజించుచుంటిని. నా పెట్టెలో పూర్ణములు, అపూర్ణములును అగు చింతామణితాటాకుప్రతులు ఇరువదినాలు గుండెను. సుబ్బరాయచెట్టిగా రెంతో కాలమునుండి గ్రంథముద్రణ విషయమున ననుభవము గడించినవా రగుటచేత వారి మూలముగనే ముద్రణాలయము నేర్పరచుకొని ముద్రణకార్యము సాగించుకొనవచ్చు నని యభిప్రాయపడితిని.

నేను చెన్నపట్టణమునకు పోయిన మరునాటి యుదయమున శ్రీవైష్ణవు లొక్కరు సుబ్బరాయచెట్టిగారి యింట నారాక నెదురు చూచుచుండిరి. నన్ను చూచి పరాఙ్ముఖ ముగనే యుండిరి. చెట్టియారును చూచి 'వీ రెవ్వరు?' అని యడిగితిని. "వీరు ఎస్. పి. సి. కె. అచ్చాఫీసులో ఇంగ్లీషువిభాగమున పైవిచారణకర్త. తమిళ మందును మంచి వ్యాసంగము కలవారు. పలు భాషలు వీరికి తెలియును. ముద్రణ విషయము నా మూలాగ్రముగ నన్నిటిని చక్కగ నెరిగినవారు. మిమ్ము చూచుట కయిమే వచ్చియున్నారు" అని పల్కిరి.

నాకు మితిలేని సంతోషము కలిగెను. ముద్రణవిషయమున వారి సహాయము లభించు నను నమ్మికచేత "స్వామీ, మిమ్ము తెలిసికొంటిని; పరమానంద మాయెను. మీ పరిచయము, ఆశీర్వాదము, సహాయమును నాకు కావలయును. ముద్రణకార్యమున నా కధికాభ్యాసము లేదు. అందుచేత వెంట నుండి అన్నియు గమనించుకొనవలయును" అని వేడుకొంటిని. వారి యూరు 'తేరళుందూరు' అనియు, వారిపేరు చక్రవర్తి రాజగోపాలాచార్యు లనియు తెలిసికొంటిని.

"మీరు చింతామణి ప్రతులు తెచ్చియున్నా రని వింటిని. ఆ పుస్తకములను, మిమ్మును చూడవలె ననియే ఇప్పుడు వచ్చినాడను" అని వా రనిరి.

వెంటనే పెట్టె తెరచి ప్రతు లెత్తి చూపితిని. "మీరు మిగుల శ్రమపడి వీనిని సేకరించి పరిశోధించి యున్నా రని తెలియుచున్నది" అని వా రా ప్రతులను చూచి పలికిరి.

"ఈ ప్రతుల నన్నిటిని పెట్టుకొని పోల్చి చూచితిరా? పాఠభేదములను గుర్తించితిరా?" అని వా రడిగిరి.

"అన్నియు ఒకవిధముగ చేసి యున్నాను. కొన్ని ప్రతులు పూర్తిగ పోల్చి చూడబడినవి. కొన్నిటిని సందేహ మున్నచోటులందు మాత్రమే చూచి సవరణలు తెలిసికొంటిని. ఇట్లు చేయుట తప్ప వే రేమి చేయవలెనో తెలియలేదు. ఏదో కష్టించి, పరిశ్రమించి కూర్చుకొని వచ్చి యున్నాను. దానిని మంచి పద్ధతిన అచ్చొత్తించి, అందగింపజేసి యిచ్చుట మీ కర్తవ్యము!" అని వినయముతోడ విన్నవించితిని. పిదప నేమే తీరున ముద్రణ మమర్పవలె నను విషయమునుగూర్చి యాలోచించితిమి.

"పద్యము, దండాన్వయము (Paraphrase),విశేషవ్యాఖ్య అన్నియు నొక్కటిగ నున్నవే, నే నేమి చేయుదును?" అని నే నడిగితిని. అట్లు మూడును కలసి యుండుటచేత స్పష్టముగ వేరుపరచి తెలిసికొనుటయు, తెలియబరచుటయు మిక్కిలి దుస్సాధ మగు పని యని యాకాలమున తలచియుంటిని. అప్పుడు వా రొసగిన ప్రత్యుత్తరము నా కత్యాశ్చర్యము కలిగించెను.

"వాని నతి సులభముగ వేర్వేరుగ పొందుపరచవచ్చును. మూలము పెద్ద అక్షరములందును, వ్యాఖ్యానములను చిన్న అక్షరము లందును ముద్రింపవలెను. దండాన్వయమును, విశేషవ్యాఖ్యానమును వేరు వేరు 'పేరా'లుగ అమర్చినచో అవి భిన్నభిన్నము లని తెలియవచ్చును. తాటాకుప్రతులలో నున్న 'అవకతవకల' నన్నిటిని అచ్చులో మార్చివేయవచ్చును. దానినిగురించి మీ రిసుమంతయేని దిగులుచెందవలదు" అని వారు వచించిరి.

"ఇ ట్లెవ్వ రుపాయ ముపదేశింతురు! ఇదియు భగద్దివ్యకృపాఫలితమే!" అని తలచి నే నమందానంద మొందితిని.

"ఏ ముద్రణాలయమున అచ్చొత్తింపనగును?" అని యాలోచించుచుండగ వారు "చూళై అవధానం పాపయ్యరు వీథిలో 'ద్రావిడరత్నాకర' మను పేరిట ముద్రాక్షరశాల యొక్క టున్నది. దాని 'ఖామందులు' నా మిత్రులు. చాల మంచి వారు. చెట్టియారుకును తెలిసినవారే" అని చెప్పిరి. "మీ రాడునది నాకు శుభశకున ముగ తోచుచున్నది. 'తమిళపు సముద్రము' అను నర్థమిచ్చు 'ద్రావిడరత్నాకర' ముద్రాలయమున చింతామణి యచ్చొత్తించుట యెంతయు లెస్స. చింతామణి సముద్రమందే గదా పుట్టినది. తమిళచింతామణి తమిళసముద్రమునుండి

యావిర్భవించుట యెంతయు బాగు." అని నా యానందమును, ఒప్పుదలను తెలిపి కొంటిని.

సేలము రామస్వామి మొదలియారుగారి యయ్యగారగు గోపాలస్వామి మొదలియారు నేను మొదలియారుబంగళాలో నుండవచ్చు నని చెప్పిరి. అట్లే యటకు జని యొక గదిలో వసించుచుంటిని.

చింతామణి యచ్చు కిచ్చుటకై మంచి రోజు చూచుకొని శుభదినమగు నాడు మధ్యాహ్నముమీద మూడుగంటలకు ముద్రణ కివ్వవలసిన భాగములను చేత నిడుకొని నే నా బంగళానుండి బయలుదేరితిని. గోపాలస్వామి మొదలియారు నన్ను సాగనంపుటకై వెంట వచ్చి వాకిట నిలచియుండిరి. అప్పుడు సన్నని తుంపర చినుకులు పడుచుండెను. చినుకులు పడుచున్న ట్లున్నదే?" అని సుబ్బరాయ చెట్టియారు కొంచెము వెనుకకు తగ్గి నిలిచిరి. నేను "సన్నని తుంపర మంచిదే; దోషము లేదు. బయలుదేరవచ్చును" అని చెప్పితిని. బయలుదేరితిమి.

పోవుచుండగ బంగళావెలుపలివాకిటి(గేటు) నుండి యొక మనుష్యుడు తన చేతిలో వస్త్రసంఛన్నమగు ఒక పెద్ద వెండితట్ట యిడుకొని బంగళా కభిముఖ ముగ వచ్చినాడు. మేము సమీపింపగ నతడు దానిపై నున్న బట్ట తొలగించినాడు. ఆ తట్టలో నారింజ మున్నగు పండ్లుండెను. వానిపై నా దృష్టి ప్రసరించెనో, లేదో మేన పులకలు పొడిచెను. అదే సమయమున వెనుకనుండి మమ్ము గమనించుచుండిన గోపాలస్వామి మొదలియారు "మంచి శకున మైనది; ఉద్దేశించిన కార్యము బాగుగ నెరవేరును. ఫలములు వచ్చినవి. మీ ప్రయత్నము ఫలించును. చింత లేకపోయి రండు" అని పలికి యా మనుజుని జూచి "ఒరే, అందులో రెండు పండ్లు వారి కిమ్ము" అని యుత్తరు విడిరి. చేత ఫలము దొరకినపుడు నన్ను నేనే మరచితిని. 'భగవంతుని దివ్యకృప!' అని తలచుకొనుచు పోతిమి.

ముద్రాక్షరశాలకు పోయి గణపతిపూజ సలిపి, ముద్రాలయాధిపతియొద్ద నేను కొనిపోయియున్న వ్రాతప్రతి యిచ్చితిని. దానిని వారు వెంటనే యచ్చు కూర్చుటకై యిచ్చిరి. 'రాయల్ 8 పుటల సైజులో' అయిదు వందల ప్రతులు ముద్రింపవలెననియు, ఒక 'ఫారము'నకు మూడునర రూప్యములు 'అచ్చుకూలి' యనియు మాట్లాడి యేర్పాటు చేసికొంటిమి.

అచ్చుపని తొడగెను. వలసినంత యలవాటు లేని నాకు సుబ్బరాయచెట్టి-యారును, రాజగోపాలాచార్యులును సహాయము చేయుచుండిరి. గ్రంథనామము, లంబకముపేరు, శీర్షిక, మూలము, వ్యాఖ్య - వీనిని వేర్వేరు అక్షరములందు కూర్చు నట్లు రాజగోపాలాచార్యులుగారు దిట్టము చేసిరి. ప్రథమపద్యవ్యాఖ్యానమున ఉదా-హరణములు మిక్కిలియై యుండెను. వానిని 'ఫుట్ నోట్సు'లో నెట్లు తెలియజేయు టయా యని తోచక తికమక యైతిని. వారు నక్షత్రచిహ్నము మున్నగువానిని క్రమము ననుసరించి వేసి వాని పేర్లు నాకు తెలియజేసిరి. కొన్ని గుర్తులు చాలకుండు టచే క్రొత్తగ పోత పోయింప నేర్పాటు చేసి యుపయోగపరచుకొంటిని.

జీవకచింతామణి యచ్చగుచున్నపుడు నేను చెన్నపట్టణముననున్న విద్వాంసు లను కలసికొని, ఎడనెడ చూచి మాట్లాడి పరిచయము చేసికొనుచుంటిని. పరశువా-కముననున్న అష్టావధానము సభాపతిమొదలియారువద్దకు నొకనాడు పోయితిని. మునుపే చూచియుండి పరిచయముకలవా రగుటచేత తిరువావడుదురమఠము గురించియు, కుంభకోణము కాలేజినిగురించియు వారు విచారించిరి. "జీవకచింతా మణిని సవ్యాఖ్యానముగ ముద్రింప దొరకొని వచ్చియున్నాను" అని నేను చెప్పితిని. అద్ది విని వారు ఆశ్చర్యపడిరి. "ఏమయ్యా, చింతామణి వ్యాఖ్యాన మేమి? మీరు ముద్రించుట యేమి? అది అంత సులభమైన పనియా? మీకు బాల్యము! చింతామణి కావ్యమునకును దాని వ్యాఖ్యకును గల వైశిష్ట్య మేమి? దానిని నెరవేర్చుట మిక్కిలి క్లేశావహముగ నుండునే. ఆ ప్రయత్నము మానుకొనుట చాల మంచిది! లోతు తెలియక అడుగిడరాదు" అని ఖండితముగ చెప్పిరి.

వా రట్లు చెప్పుట విని నే నచ్చెరు వొందితిని.

"నే నేల ప్రచురింపరాదు? ఆ కావ్యమును, వ్యాఖ్యను పలుమారులు చదివి విమర్శించియున్నాను. దానికి కావలసిన సాధనములగు ఇతరగ్రంథములనుగూడ చదివియున్నాను. నెరవేర్పగల నను సాహసము నా కున్నది" అని ధైర్యముగ చెప్పితిని.

కుంభకోణమున జీవకచింతామణిని పరిశోధించుచున్నపుడు ఇ ట్లెవ్వరేని చెప్పియున్నచో నేను కొంచెము జంకియుందును. అష్టావధానం సభాపతిమొదలి-యారుతో సంభాషించిన ఆసమయమున నన్నో నేను చింతామణి యొక్క టే

లక్ష్యముగా నుంటిని. ఎవ్వరు వచ్చి యడ్డుపెట్టినను ఆగనంతటి గుండెదిటవు నా కుండెను.

"నే నారంభించియున్న యీ సత్కార్యము 'చక్కగ నెరవేరుగాక!' అని యాశీర్వదింపక ఇట్లధైర్యము కలిగించుచున్నారే!"

"ఆరంభించిన నేమాయె? ఇంతకు మునుపు ఈ గ్రంథము ముద్రింప పలువు రారంభించి, ఆ యారంభముతోనే ఆగిపోయిరి. నేనును మా గురువులగు కాంచీ-పురము సభాపతి మొదలియారును దీనిని ముద్రింపవలె నని తలచి చదువ నారంభించితిమి. కష్ట మని తోచుటచేత నిలిపివేసితిమి. పెక్కు వత్సరములకు పూర్వము 'డ్రూ' అను నొక 'ఫాదిరీ' గారు * (The Rev. W. H. Drew) చింతామణి ముద్రిం-చుటకై ఒక దిట్ట మేర్పరచుకొని, ఆ పద్ధతిని తెలుపుచు నొక ప్రకటన చేసిరి. వారు దానిని నెరవేర్పలేకపోయిరి. 'పోపు' దొర తరువాత ప్రయత్నించిరి. వారికిని సాధ్యము కాలేదు. 'యాళ్పాణము'నందలి నల్లూరు ఆరుముగనావలరుకుగూడ చింతామణిప్రకటనోద్దేశ ముండెను. 'తిరుచ్చిట్రంబలకోక్కైయారు' మొదటి ముద్రణ మున 'ఇకపై వెలువడు గ్రంథములు' అను ప్రకటనమున చింతామణిపేరు కని-పించుచున్నది. ఏ కారణముననో వారు దానిని ముద్రింప ముందుకు రాలేదు. మీ యాచార్యులగు మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్లెగారును, షోడశావధానం సుబ్బ-రాయచెట్టియారును కలసి చింతామణి ముద్రింపవలె నని యాలోచించిరట. పిదప అది యొక మహాభార మని తలచి మానుకొనిరట. ఇట్లెవ్వరు తాకినను నెరవేరని యీ గ్రంథము మీరు ముద్రింప సాహసించితిరే యని జంకుచున్నాను" అని యా వృద్ధు చెప్పిరి.

వారి మాటలవలన నేను కొంచెమేని యధైర్య మొందలేదు. "మునుపు వారు నెరవేర్పలేరైరి అను కారణమున మనము మనప్రయత్నము వదలుకొనుటయా?

---

* The printing of Chintamani was more than once projected. About 20 years ago, the late Rev. W. H. Drew published a prospectus with a specimen of the work; but his premature death put an end to the great undertaking. —*H. Bower in his Preface to the edition of 'Namagal Ilambakam.'*

వా రెల్లరును ప్రయత్నించి రను వార్తవలన ఆ గ్రంథ మెట్లైనను అచ్చుభూషమున వెలువడవలె నను ఉత్కంఠ వారి కుండిన దని స్పష్టమగుట లేదా? ఆ యభిలాష కొనసాగింప గడగుట తక్కినవారి కర్తవ్యము కదా? నా ప్రయత్నము కుంటువడి నను కొదవ యేమియు లేదు. భగవంతుని దివ్యకృపచేత నిది ఫలించినచో తమిళ భాషాభిమానులకు సంతసము కలుగదా? ఏదో, నా యల్పజ్ఞానమున కందినంతవట్టు పరిశోధించి ముద్రింతును. లోపము లుండుట సహజమే. విద్యావంతులు కాలక్రమ మున వానిని బోకార్చెదరు" అని యుత్సాహముతోడ నొడివితిని.

"నేను చెప్పెడిది చెప్పివేసితిని. తరువాత మీ యిష్టము" అని వారు అతృప్తి తోడనే సంభాషణ ముగించిరి. నే ననుజ్ఞ పొంది మరలితిని.

క్రిస్టియన్ కాలేజితమిళపండితులును, అష్టావధానం సభాపతి మొదలియారు శిష్యులును అగు చిన్నసామిపిళ్లై అనువారియొద్ద చింతామణివ్యాఖ్యానముప్రతి యొక్కటి ఉన్న దనియు, అది యిరువది ప్రతులు చూచి శోధించి వ్రాసిన దనియు, అది చింతామణి నామగళిఇలంబకము ముద్రించిన 'బవరు' దొరగారి దనియు వింటిని. ఆ తమిళపండితులను చూచితిని. వారియొద్ద నున్న చింతామణిప్రతి చూచి యిత్తు నని చెప్పితిని.

వారు లోనికి పోయి ఒక పెద్ద కాగితపు ప్రతిని తీసికొని వచ్చిరి. అది యాకార మున మిగుల పెద్దదిగను, అందముగను ఉండెను. చిన్నసామిపిళ్లై "ఈ ప్రతి బవరుదొరగారు శోధించి వ్రాయించిరి. వారు నాకు పరిచితులు. వారు స్వదేశము పోవునపుడు తమ స్మృతిచిహ్నముగ దీనిని నాయొద్ద నిచ్చి పోయిరి.' అని చెప్పి దానిని నా చేత నుంచిరి. "ఇరువది ప్రతులను చూచి శోధించిన దైనచో ఎంతయో శుద్ధముగ నుండును. మనకు మిగుల నుపకరించును" అను ఉత్కంఠతోడ దానిని పుచ్చుకొని నా నివాసమునకు వచ్చి చేరితిని.

వెంటనే దానిని బహువేగముగ త్రిప్పి త్రిప్పి చూచితిని. అందులో తప్పులే హెచ్చుగ నుండెను. తప్పులు కుప్పలై కనుపించు ప్రతులలో నున్న దోసగు లన్నియు నందు కనుపట్టెను. శుద్ధపాఠములు లేని ప్రతులు వేయి లభించినను శుద్ధప్రతి యొక్కదానికి ఈడు రా వని యెరిగినవాడను నేను. 'తప్పుల తడక' లైన

ప్రతు లెంతెంత హెచ్చుగ లభించునో అంతకంతకు ఉపయోగరహితములైన పాఠ భేదములు పెల్లై తికమక హెచ్చును. లెక్కలేని పాఠభేదములు చూపి 'ఇన్ని ప్రతులు చూచితిమి' అని చాటుకొనవచ్చునే కాని విషయమును తేటతెల్లముగ తెలిసికొనుట మిక్కిలి కష్టము. ఆ కాగితపు ప్రతి నాకు కొంచెమేని యుపయోగ పడలేదు.

ఒక్కొక్క దినమునను ముద్రణాలయమున నుండి అచ్చు కాగితములు దిద్ది యిత్తును. నాకు తోడుగ తీరుబడియున్న వేళల వచ్చి రాజగోపాలాచార్యులును, ఇతరులును వ్రాతప్రతి చదువుట మున్నగు సాయములు చేయుచుందురు. సాయంకాల మైన వెంటనే ముద్రణాలయమునుండి ప్రూఫులు తీసికొని రామస్వామి మొదలియారు బంగళాకు పోవుదును. అచ్చట నాకై యేర్పరుపబడిన గదిలో వలసిన సామానుల నుంచియుంటిని. ప్రక్కనే యున్న వరాండాలో నొక 'బెంచి' యుండును. దానిమీదనే ప్రతిదినము నేను పడుకొందును. ఆ చోటుకు తిన్నగ పైన నొక గాజు దీపము పెట్టబడి యుండును. రాత్రి వేళల ఆ దీపపు వెలుగులో అచ్చుకాగితములు దిద్దుదును. ఏకాంతముగ నుండి వ్రాతప్రతిని, 'గాలీ ప్రూఫు' మున్నగువానిని నేనే పోల్చి చూతును. పిదప నొక తడవ సావధానముగ చదివి చూచి దిద్దుపాట్లు చేయుదును. చూచినంతవరకు చూచి యలపు కలిగినచో నట్లే పండుకొందును, రెండు గంటలకు తటాలున మేలుకొని మరల తెల్లవారునందాక ప్రూఫులు చూచుచుందును.

ఆ యొంటరితనమున నాకు సహాయపడువా రొక్కరైన లేరు. కొలది దూరమున బంగళాకు 'కాపరి'గ నొక్క కుక్క కట్టబడి యుండెను. ఇద్దరు 'ఘూర్ఖా సిపాయీలు' నిదురపోవక కావలి కాచుచుండిరి. వారిచే నా కెట్టి యుపకారము చేయ వీలగును? 'ఈ రాత్రి యిట్లు కూర్చొని వీరు చూచుచునే యున్నారే!' అని వా రాశ్చర్యపడియుండవచ్చును.

ఇ ట్లుండగ గ్రామాంతరమునకు పోయియుండిన సేలం రామస్వామి మొదలియారు మరలి వచ్చిరి. చింతామణియందలి ముద్రితభాగములు చూచి వారు పొందిన యానందాతిశయమునకు ఎల్లలే లేవు. వారు నన్ను తోడ్కొనిపోయి పూండి రంగనాథ మొదలియారు మున్నగు పెద్దలతో నాకు సాంగత్యము కల్పించిరి.

1886 వ సంవత్సరము వేసవి సెలవులు ముగిసినవి. నా మనస్సంతయు చెన్నపట్టణముననే యుంచి పొగబండి యెక్కి కుంబకోణము వచ్చి చేరితిని.

చెన్నపట్టణమునుండి కుంబకోణమునకు వచ్చి చేరిన వెంటనే నా మిత్రు లందరును వచ్చి చింతామణిముద్రణారంభసంజనితసంతోషమునుగూర్చి విచారించిరి. అచ్చయిన కొన్ని ఫారములు వెంట కొనివచ్చి యుంటిని. వానిని చూచిన కాలేజి ఉపాధ్యాయులు చక్కగ నున్నదని చెప్పిరి. అప్పుడు కాలేజికి ప్రిన్సిపాలుగ నుండిన ఫిల్టర్ బెక్ ద్వార మూడుప్రతులు పుచ్చుకొనునట్లు చేవాలు పెట్టిరి. వారికి తమిళము తెలియకున్నను మంచిపనికి ఓపినంత యుపకారము చేయవలె ననునదే వారి యాశయము. నే నచ్చయిన ఫారములు వారికి చూపితిని. ముద్రించు తీరు చక్కగ నున్నదని పలికి "త్వరలో దీనిని పూర్తి చేయుడు" అని యాదరముతోడ వచించిరి.

ఆ వారమునందు శనివారమునాడు తిరువావడుదురకు జని సుబ్రహ్మణ్య దేశికులను జూచితిని. వారి కెంతటి మహానంద ముప్పతిల్లెనో దానికి హద్దులు పెట్టి వర్ణింప తరము కాదు. నేను చేత నిడుకొనిపోయిన ఫారములు తీసికొని త్రిప్పి త్రిప్పి చూచిరి. దాని యమరికవిషయము నేను వివరించి చెప్పితిని. అప్పుడు దగ్గర నున్న కొందరిని చూచి దేశికులు "స్వామినాథయ్యరు మఠమునందే యున్నచో ఇట్టి యుత్కృష్టకార్యములు సాధింప నవకాశ ముండునా? మంచి వస్తువులు తగినచోట నున్ననే చక్కగ రాణించును." అనిరి. నే నడ్డు తగిలి "ఇది మాత్రము తగినచోటు కాదా? పిళ్లెగారును, అంతకు మునుపు శివజ్ఞానమునులు మున్నగువారును ఈ యాధీనమున నుండియేగదా మిక్కుటమైన కీర్తి గడించిరి" అని వినయముతో బలికితిని.

"అది వేరు విషయము. ఈ యాధీనసంబంధము మిమ్ము విడిచిపోలేదే. దానితోబాటు మరియొక యభ్యుదయ మేర్పడినది. ఇప్పుడు చెన్నపట్టణమునకు పోయి, మీ పని చక్కగ చేయ గడగితిరి" అని వా రనిరి.

కుంబకోణమునకు చెన్నపట్టణమునుండి ప్రూఫులు అడుగడుగున వచ్చును. నేను కాలేజి వదలిన వెంటనే యింటిలో కూర్చుని చదివి దిద్దుపాట్లు చేయుదును.

కుంభకోణమునకు మెయిలుబండి అర్ధరాత్రివేళ వచ్చును. అంతలో దిద్ది 'ప్రూఫులు' కట్టకట్టి నేనే రైల్వే స్టేషనుకు పోయి తపాలు పెట్టిలో వేసివత్తును.

కుంభకోణమం దుండియే ముద్రణ సాగించుచున్నను అనుకొనినట్లుగ పని వేగముగ నడచుటలేదు. అడుగడుగున రామస్వామి మొదలియారు జాబు వ్రాయుదురు. "మీ రిచ్చటికే వచ్చియుండి జరిపించుచో కార్యము త్వరితముగ సాగును" అని వా రొకసారి వ్రాసిరి. అందుచేత క్రిస్టుమస్ సెలవులలో మరల చెన్నపట్టణమునకు పోవ నేర్పాటు చేసికొంటిని.

డిసెంబరు మాసాంతమున నేను చెన్నపట్టణమునకు పయనమైతిని.

ఒక నాడు 'ప్రెస్సు'లో ప్రూఫులు దిద్దుచుంటిని. ఎవ్వరును రాకుండుటచేత నేనే ఒంటరిగ నుండి, నోరు విప్పి పైకి చదువుచుంటిని. 'క్రిస్టుమస్' సమయ మగుటచేత చెన్నపట్టణమునకు వెలుపలియూర్లనుండి వేడ్కలు చూచుటకై వచ్చిన జనులు పలువురు గుంపులు గుంపులుగ వీథిలో పోవుచుండిరి. నేను వీథివైపుగ నున్న 'కిటికీ'వద్ద కూర్చొని చదువుచుంటిని. అప్పు డెవ్వరో మెల్లగ గవాక్షము నొద్దకు వచ్చి ఒక యోరగ నిలిచిరి. నేను వారిని గమనింపలేదు. నేను చదువ చదువ వారు నిలచి వినుచుండిరి. వారిని తలయెత్తి చూచితిని. వారి సాధారణమైన యాకారమును బట్టి వా రొక గ్రామవాసి యని తెలిసికొంటిని. క్రిస్టుమస్ వేడుకలు చూడవచ్చిన వారు నే చదివినది వినిరి. ఆ తమిళము వారిని కట్టి లాగినది. అందుచేత నే యటకు వచ్చి నిలిచి గమనించిరి. వారు మాటాడక ఊరక నిలిచియుండుటను చూచి నేను "ఎచ్చటికి వచ్చినారు?" అని యడిగితిని.

"ఏదియో చదువుచున్నారే; వినవచ్చితిని" అని వా రనిరి.

"అక్కడ నేల నిలవబడెదరు? లోపలకు రండు" అని నే నంటిని. వారు వచ్చిరి. "చదువ తెలియునా?" అని నే నడుగ 'చదువుదును" అని వారు బదులు పలికిరి.

వెంటనే నేను వ్రాతప్రతిని వారి యెడ నిచ్చి చదువు డంటిని. ప్రూఫు నేను దిద్దుచు వచ్చితిని. వారు చదువునప్పుడు అందే. మనస్సు లగ్నము జేసి చదివిరి.

గ్రామములందును తమిళము వ్యాప్తి చెందియుండుటను వారి మూలమున తెలిసి సంతస మొందితిని.

ఒకనాటి సాయంకాలము ఆరునర గంటలకు నేను ముద్రాక్షరశాలలో ప్రూఫులు దిద్దుచుండగ ఒక్కరు మిక్కిలి కలగబారిన మొగముతో నాయొద్దకు వచ్చిరి. "ఏమండీ సంగతి విన్నారా ?" అని యడిగిరి. 'ఏమి !' అని నేను తత్తర మున విచారించితిని.

"నిప్పంటుకొనిన దటగదా ?" అని మాత్రము చెప్పి పైన మాటాడక నిలిపిరి. నాగుండె 'గుభిలు' మన్నది. ఎల్లప్పుడును చింతామణినిగూర్చిన విచారముననే మునిగి యున్న నేను "చింతామణియందలి అచ్చయిన ఫారములకే 'అగ్నిప్రమాదము' సంభవించెనా ?" అని భయపడి, "ఎక్కడ ! ఎక్కడ !" అని సంభ్రమముతో విచారించితిని.

"అయ్యో ! 'పార్కు'వేడుకలకై వేసిన పెద్ద కొట్టామునకు అగ్గి తగులు కొనినదట ! పెక్కు ప్రాణుల కపాయము ! అగ్ని నార్పుటకే వీలు కాలేదట. పసి కందులును, స్త్రీలును, కుర్రలును, ముదుసలులును అగ్గిలో తగుల్కొని మాడి మసి బొగ్గయిరి." అని చెప్పి కన్నీరు కార్చిరి. వెంటనే ప్రూఫు లట్లే వదలిపెట్టి వారితో నటకు వెడలి చూచితిని. ఎంత హృదయవిదారకదృశ్యము ! కన్నులతో చూడ శక్యము కాలేదు. ఒడలంతయు కాలియు, ప్రాణములు పోక తల్లడిల్లుచును, చేయి కాలియు, కాలు కాలియు నున్న జనులు పెక్కుర చూచితిని. గ్రామాంతరములనుండి వేలకొలదిగ జనులు వచ్చియుండిరి. వారిలో పలువురు ఈ యాపదలో చిక్కువడి యసువులు కోల్పోయిరి.

ఈ వార్త పత్రికాముఖమున వెలుపలి యూరులం దంతటను వ్యాపింప అచ్చట నచ్చట నున్న వారు 'తమ తమవా రేమయిరో !' అని తల్లడిలి విచారింప మొదలిడిరి. తంతులపై తంతుల నిచ్చిరి. జాబులు కుప్పలు తిప్పలైనవి. ఈ విషయ మెరిగిన నా తల్లిదండ్రులు మిక్కిలి బెంగకొందు రని తలచి మరునటి దినము ప్రొద్దుటనే ఒక కార్డు వ్రాసి మా నాయనగారికి పంపితిని. అందు విశేష మేదియు లేదు."........ ఒట్టిపోయిన ఆవును ఊరికి పంపుట మంచిదే. నేను పార్కువేడ్కలు చూడ పోనే

లేదు. అచ్చుపని గమనించుకొనుచు సౌఖ్యముగ నున్నాను." అని వ్రాసితిని. నా కుశలవార్త తెలియజేయుటే ప్రధానము.

అంతలో ననుగన్నవారు ఎక్కుడగు దుఃఖమున మునిగి ఏమియు తోచక నిశ్చేష్టులై యుండిరి. వారి దుఃఖ మరసిన సాధు శేషయ్యరు వారి నూరడించిరి. కుంబకోణమునకు రాత్రి వచ్చెడు తపాలును తెల్లవారిన పిమ్మటనే కట్ట విప్పి చూచి వేరుపరచి యెనిమిది గంటల వేళకు ఎల్లరకు నిత్తురు. శేషయ్యరు అంతవరకు వేచి యుండలేకపోయిరి. మెయిలు వచ్చిన వెంటనే వారు 'తపాలాఫీసు'కు పోయి పోస్టుమాస్టరుతో "వెంటనే తపాలుకట్టలు విప్పి చూడుడు" అనిరి. వారు అలవాటుకు విరుద్ధముగ చేయరా దని నుడువ శేషయ్యరుకు మిక్కిలి కోపము వచ్చెను. "ఏమి టయ్యా అలవాటు! ఆపత్కాలమందు విధులకు అపవాదములు లేవా? ఎల్లవారును తపా లెప్పుడు వచ్చునా యని దిగులుతో రేయంతయు నిదురపోక వేచి యున్నారు. మీరు 'రూల్సు' చెప్పుచున్నారే రూల్సు! మీ రిప్పుడు ఆ కట్టలు విప్పి యా లేఖలు వారి వారి కిప్పింపనిచో నేను పై యధికారులకు వ్రాయుదును" అని ఖండితముగ పలికిరి. మిక్కిలి పలుకుబడిగల వారు చెప్పగనే పోస్టుమాస్టరు తపాలు కట్టలు విప్పిరి. మా నాయనగారి 'చిరునామా'కు వచ్చిన కార్డు పుచ్చుకొని వెంట నున్న మా యయ్యగారికి చూపిరి. పెరవారు పెక్కురును తమకు వచ్చిన లేఖలు పుచ్చుకొని వెడలిపోయిరి. నా కార్డు చూచిన తరువాతనే మా నాయనగారికి ప్రాణములు వచ్చినవి.

నా జాబుతో ఊరట కలిగియున్నను నన్ను సమక్షముగ చూచిన పదపడియే నా కన్నవారు సంపూర్ణసమాశ్వాసము పొందిరి. "క్షేమముగ వచ్చితివా!" అని యౌత్సుక్యముతో మా తల్లిగారు నా కెదురువచ్చినపుడు వారి కంఠస్వరమును బట్టి వా రెంతగ దిగులుపడి యుండవచ్చునో యని తెలిసికొంటిని. "పుస్తకము పూర్తి యగుటకు ఇంకను కొన్నాళ్లు పట్టున ట్లున్నది" అని మా నాయనగారితో నంటిని. ఎన్నాళ్లయినను కానిమ్ము: బాధ లేదు. నీవు కుశలముగ మరలి వచ్చితివే, అదియే చాలును" అని చెప్పి తమ కున్న బెంగను జాడగ తెలియజేసిరి.

చింతామణిముద్రణమున నా కున్న యాసక్తి రాను రాను ముదురజొచ్చినది. ఎట్లయినను ముద్రణ పూర్తి చేయవలయు నని దిటవు చేసుకొంటిని. దీర్ఘవిరామ

కాలమునందు చెన్నపట్టణమునకు పోవు వలవాటుపడియున్న నేను అది మొదలు ఒక వారము విరామము దొరకినను, అప్పుడా నగరమునకు జని గమనింపవలసిన దానిని గమనించుకొనుచుంటిని.

చింతామణియందు ఆరవదగు 'కేమశరియార్ ఇలంబకము' ('క్షేమసుందరి' లంబకము) వరకు అచ్చయి యుండినది. పైబడి జరగవలసిన భాగములను ఏయే విధముల బాగుపరచవచ్చును- అని ఆలోచించుకొనుచుంటిని. నచ్చినార్కినియరు వ్యాఖ్యయందు వచ్చు ఉదాహరణములకు సంబంధించిన ఆకరములను క్రింద టిప్పణిలో సూచించుచుంటిని. కాని అన్ని యుదాహరణములకును ఆకరము కనిపింప లేదు. ఇంకను ప్రయత్నించి చూచిన చాలవరకు ఆకర(గ్రంథ)ములను కనిపెట్ట వచ్చునను తలపుతో నా యొద్ద నున్న ప్రాత తాటియాకుపుస్తకములను చూడ దొడగితిని.

ఒకనాటి రాత్రి నా యొద్ద నున్నవానిలో ఒక తాటాకుప్రతి యెత్తికొని చదివితిని. తుది మొదళ్ల లేనిదది. 'పొరునరాట్రుప్పడై' అను పేరు మొదటియాకులో నుండెను. పిళ్లెగారి ప్రతియగు దానిని చదువుచుండగ చింతామణివ్యాఖ్యయందు వచ్చి యుండిన యుదాహరణములు కనబడినవి. 'అరరే! దీని నింతవరకు సావధానముగ గమనింప నైతినే' అని చింతించి, పైన చదువ జొచ్చితిని. 'పొరునరాట్రుప్పడై'కి తరువాత 'శిఱు బాణాట్రుప్పడై' ఉండినది. పిమ్మట 'పెరుమ్బాణాట్రుప్పడై'యు, 'ముల్లెప్పాట్టు'ను, 'మధురైక్కాంజి'యు ఉండినవి. సవ్యాఖ్యానముగనున్న ఆ ప్రతి చదువుచు రాగ 'మురుగు పొరునాఱు' అను ప్రత్యేక పద్య మొక్కటి స్మృతికి తగిలెను. అంత వరకు ఆ తాటాకుప్రతి 'పత్తుప్పాట్టు' అని తెలియదు. మెలకువతో గమనింప కుండుటచే వచ్చిన దీ లోటు. అది పత్తుప్పాట్టు అని అప్పుడే తెలిసినది. చదువ చదువ చింతామణివ్యాఖ్యానమునందు వచ్చు పెక్కుదాహరణములు కనిపించినవి. నేను చదువునప్పుడు నా మనసు ఆ పద్యములయర్థముమీదకు పూర్తిగ పోలేదు. చింతామణి వ్యాఖ్యయందు వచ్చెడి యుదాహరణ లన్నియు నా జ్ఞప్తియం దున్నవి. అగుటచే ఎచ్చటనైన ఏ యుదాహరణమైన లభించునా యని వెదకుచు చదివితిని. నా పరిశ్రమ రిత్తపోలేదు. ముద్రణాలయమందు ప్రత్యేకపు గదిలో నుండి ఆ ప్రాత తాటాకుప్రతిని చూడ దొడగినప్పుడు రాత్రి యెనిమిది గంట లుండును. 'పొరున

రాత్రుప్పడై'యు 'శిఱుబాణాత్రుప్పడై'యు, 'ముల్లైప్పాట్టు'ను చూడజూడ నాకొక క్రొత్త యుత్సాహము కలిగెను. కాలము గడచుటయే తెలియలేదు. మధురైక్కాంజి వరకే ఆ ప్రతిలో నుండెను. అది పూర్తిచేసి చూచితిని. వేకువజామున అయిదు గంటలు దాటియుండెను. అటుపిమ్మట కూడ నాకు నిదురపట్టలేదు. అప్పుడు నేను కనిపెట్టిన విషయములు అనుసంధించి యనుసంధించి ఆనందించితిని.

నాడు మొదలు నా యొద్దనుండిన 'ఎట్టుత్తొగై'తాటాకుప్రతుల నన్నిటిని ఒక్కొక్క ఆకుగ, పంక్తి పంక్తిగ, అక్షరమక్షరముగ శోధింప నారంభించితిని. అదియు, నంతము లేని మరి యొక పొత్త మెత్తుకొంటిని. విప్పి చూచితిని. "కొత్తురైక్కూట్రిల" అను భాగము కంటబడెను. వెంటనే యబ్బురపడితిని. ఆ సమస్త పదమునే 'నచ్చినార్కినియరు' చింతామణివ్యాఖ్యయందు ఉదాహరణముగ జూపి యున్నారు. కాని వారు తమ యలవాటు విడువక 'అన్యులును అనిరి' అనియే వ్రాసియుండిరి. ప్రాత గ్రంథ మనియే తెలిసినది గాని ఫలానాగ్రంథ మని స్పష్టపడ లేదు. అందు మూలము, వ్యాఖ్యయు నుండినవి. ఆ పద్యము తుద 95 అను అంకె కనబడెను. నాచేత 'నట్రిణై' మున్నగువాని మూలము మాత్రమే యణగియున్న వ్రాతప్రతి వేరొకటి యుండుటచేత దానిని తీసికొని ఒక్కొక్క గ్రంథమునను 95 సంఖ్య గల పద్యము నెత్తి చూచితిని. అట్లు చూచినప్పుడు నేను చూచిన ఆ తాటాకుపుస్తకము 'పుఱనానూఱు సవ్యాఖ్యానప్రతి'యని తెలియవచ్చెను. కాగ ఆ తాటాకుప్రతినుండి లభించినవాని నన్నిటిని పుఱనానూఱు అను శీర్షిక క్రింద వ్రాసికొంటిని. తక్కిన తాళపత్ర గ్రంథములను గూడ చదివితిని. విడువక 'తిరుక్కోవైయారు'ను 'పదినెణ్‌కీళ్‌క్కణక్కు'ను పూనికతో చదివి ఉదాహరణముల తెలిసికొంటిని. కేమశరియార్ ఇలంబకమునకు పైబడి ముద్రించిన భాగము లందు క్రింది టిప్పణిలో ఆ యుదాహరణములను సూచించితిని. నచ్చినార్కినియరు ఉదాహరణము చూపు ప్రాత గ్రంథభాగములను ఈ యీ గ్రంథములం దున్నయవి అని చూపుటయే గాక, వారు చూపిన భాగమునకు ముందు వెనుకల గల కొన్ని చరణములను చేర్చి ముద్రింపించితిని. గ్రంథనామమును మాత్రమే నిర్దేశించుటకన్న ఇట్లు చూపినచో ఆ యా గ్రంథముల వైశిష్ట్యము, వాని శైలియు చక్కగ తెలియవచ్చు నని నా భావము. కొన్నిచోట్ల పుఱనానూఱు పద్యములను పూర్తిగనే క్రింది టిప్పణిలో నమర్చితిని. చేర్చుటకు వీలుకాని యుదాహరణములను పుస్తకము వెనుక వెనుక చేర్చి అచ్చొత్తింపవచ్చు నను తలపుతో వేరుగ వ్రాసి యుంచుకొంటిని.

సెలవులు ముగిసిన వెంటనే యెన్నఁడును లేని మహోత్సాహముతో కుంభకోణమునకు వచ్చితిని. క్రొత్త విషయములను కనిపెట్టిన సంగతి మిత్రుల కందరికిని చెప్పి నా సంతోషము తెలియజేసికొంటిని.

జీవకచింతామణి అచ్చగుచున్నను వేఱు తాటాకుప్రతులు లభించుచో పోల్చి చూడవలె నను తలంపు నా కుండెను. శ్రీ సుబ్రహ్మణ్యదేశికుల సహాయముచే నాకు దొరకిన ప్రతులలో తిరునల్వేలిప్రాంతపు ప్రతులు నిర్దుష్టములై యుండినవి. వారు తిరునల్వేలిలో యాత్ర చేసినప్పుడు అటనట నున్నట్టి వంశపారంపర్యముగ తమిళవిద్వాంసు లగు పలువురు వారి దర్శనమునకై వచ్చి యుండుట నేను గమనించి యుంటిని. వారి పరిచయముగూడ నాకు కలిగెను. వారియొద్ద నూర్లకొలదిగ తమిళ తాళపత్రగ్రంథము లున్న వనియు. వారు వానిని శ్రద్ధగ కాపాడుకొనుచు వచ్చుచున్నా రనియు నేను వినియుంటిని. ఆ చోట్లకు స్వయముగ నేగి తాటాకు ప్రతుల నెమకినచో జీవకచింతామణిప్రతులు దొరకవచ్చు నను నమ్మిక నా కుండెను. అందుచేతనే ఒక సారి తాళపత్రగ్రంథాన్వేషణయాత్రను మెయికొంటిని.

ఒక శుభదినమున బయలుదేరి తిన్నగ తిరునల్వేలి కరిగితిని. అచ్చట కొందర చూచి. 'తిరుక్కుట్రాలము' నకు పోవు మార్గమున నున్న 'మేలగరము'నకు పోతిని. సుబ్రహ్మణ్యదేశికు లుదయించిన దా యూరే. అచ్చట వారి తమ్ములగు 'త్రికూటరాచప్ప కవిరాయరు' ఉండిరి. వారింటిలో నున్న ప్రాత పుస్తకములు తిరుగవేయఁగ చింతామణిప్రతి యొక్కటయినను దొరకలేదు. అచ్చటినుండి 'తిరుక్కుట్రాలము' నకు జని 'త్రికూటాచలపతి'దర్శనము చేసికొని, 'సెంగోట్టై' చేరితిని. ఆ యూరిలో 'కవిరాజపండారము' అను పండితోత్తముల వంశమువారు వసించుచుండిరి. వారి యింటికి జని, వారితో పరిచయము చేసికొని, ఆ యింట నున్న తాటియాకుపుస్తకముల వెదకి చూచితిని. ఎన్నియో ప్రబంధములును, పురాణములును ఉండినవి. చింతామణియందలి కొన్ని భాగములు మాత్రమే దొరకినవి. పిదప సమీపమున నున్న 'కృష్ణాపురము', 'కడయనల్లూరు' అను గ్రామములకు పోయి అచ్చట నున్న కవిరాయరుల యిండ్లలో తాళపత్రముల వెదకినపుడు అచ్చటకూడ చింతామణిలోని కొన్ని భాగములు మాత్రమే లభించినవి.

అప్పుడు శేట్టూరు సుబ్రహ్మణ్యకవిరాయరు, తిరునెల్వేలి 'కాల్డ్‌వెల్' కాలేజిలో తమిళపండితులగు కుమారస్వామి పిళ్లెగారి చింతామణిప్రతి సంపాదించి యిచ్చిరి. అందు గ్రంథ మంతయు నుండెను.

'శెంగోట్టై' యందు చింతామణికై మునుపే సంతకము చేసిన ఘను లొక్క రుండిరి. నాతోడ వచ్చినవారు 'ఇచ్చెద నన్న పైక మిండు' అని వారి నడుగబోయి నపుడు, వారు "వీరి ముద్రణము నాకు వలదు. వీరు తప్పులతోడనే కద ముద్రించు చున్నారు. నేను వేరొకరు ముద్రించు శుద్ధప్రతినే కొనగలను" అనినా రట. ఈ విష యము నాకు తెలిసినప్పుడు నా ముద్రణకు విరుద్ధముగ దుష్ప్రచారము వ్యాపించి యుండుట తెలిసి దుఃఖించితిని. 'గ్రంథాన్వేషణ చాలును. ఇక త్వరలో పుస్తక ముద్రణ పూర్తి చేయవలెను.' అని తలచి వెంటనే బయలుదేరి కుంబకోణమునకు వచ్చి చేరితిని.

అట్టి భావముచేత అది మొదలు కాలేజిలో రెండు రోజులు చేరికగ విరామము లభించినను చెన్నపట్టణమునకు పోయి చింతామణిముద్రణకార్యమును గమనించు కొని వచ్చునట్టి యలవాటు పెట్టుకొంటిని. అటు పోయియుండునపుడు ఒకమారు అష్టావధానము సభాపతిమొదలియారువద్దకు నేగితిని. చింతామణిముద్రణము మిక్కిలి దుష్కరకార్య మని మునుపే వారు నొక్కి చెప్పియున్నను వారు మిగుల విజ్ఞానవంతు లగుటచే వారిని చూచుటయందు నా కభిలాష యున్నది. పలు గ్రంథము లందు మంచి పరిచయముగలవారు వారు. మిక్కిలి రసవంతముగ మాట్లాడుదురు. నాడు వారితోడ దీర్ఘకాలము సల్లాపము సల్పుచుంటిని. మా సంభాషణ పలువురు పండితులను, పెక్కు గ్రంథములను గూర్చి నడచినది. నే నెడనెడ పలు ప్రాత వద్దె ములను ఉద్ధరించి యుద్ధరించి చెప్పితిని. పిళ్లెగారియొద్ద నేర్చిన ప్రబంధముల నుండియు, పురాణములనుండియు అడ్డమాకలు లేక పెక్కు పద్యములు చెప్పు చుంటిని. తటాలున మొదలియా రేదియో తలచుకొనినవారివలె "అయ్యా, మీరు చింతామణి ముద్రింప యోగ్యత కలవారే!" అని చెప్పిరి. మేము మాట్లాడు చుండిన విషయములకును దానికిని సంబంధమే లేదు. అయినను నాతోడ ముచ్చటించు నప్పుడు మొదలియారు తమిళగ్రంథములందు నా కున్న యభ్యాసమును ప్రత్యేక దృష్టితో గుర్తించిరి కాబోలు ! మునుపు తాము చెప్పిన అభిప్రాయమును మార్చు

కొనవలె నని అప్పుడు వారికి తోచియుండవచ్చును. నాకు మిక్కుటమగు అచ్చెరువును, సంతసమును గలిగినవి. "ఏమి తటాలున ఇప్పు డిట్లు పల్కుతిరే?" అని వారి నడిగితిని.

"మును పొకనాడు చింతామణిప్రచురణ మీరు మానుకొనవలె నని నేను చెప్పియుంటిని కదా? అది యేల చెప్పితిమా యని యిప్పుడు తోచినది. అతివిశాలమైన మీ తమిళజ్ఞానము నిప్పుడే చక్కగ తెలిసికొంటిని." అని చెప్పి పైపై కొనియాడిరి. ఆనాడెల్ల ఆ యానందములో తల మున్కలై యుంటిని. కాని నిలుకడయైన సంతసము నాకు లేకుండునట్లుగ మరొక విషయము నా చెవిని బడెను.

ఒకనాడు నేను పూండి రంగనాథ మొదలియారును చూడబోయి యుంటిని. వారు చింతామణి ఎంతవర కయియున్న దని యలవాటుచొప్పున ప్రేమతో విచారించిరి. నేను వివరముగ జెప్పితిని. పిదప వారు "రామనాథపురము ప్రభువులగు భాస్కరసేతుపతిగారిని నేను కలసికొంటిని. వారు తమిళమున మిక్కిలి యభిమానము గలవారు. మీ చింతామణిప్రచురణనుగూర్చి ప్రస్తావము వచ్చెను. వారు తమకును అది మునుపే తెలియు నని చెప్పిరి. అంతమాత్రమే కాక మిక్కిలి యుద్గ్రంథమగు చింతామణిని ముద్రించు యోగ్యత మీకు లే దని తమ కెవ్వరో చెప్పిరనియు పలికిరి. మంచి పనికి విఘ్నములు కల్పింప నెందరో ఖలులు కాచుకొని యున్నారు" అని కొంచెము మనఃక్లేశముతో జెప్పిరి. అది వినిన వెంటనే నాకు మునుపు కల్గిన యానందము అడపొడ కానరాకపోయెను.

నా మోమువాడ్పు తెలిసిన రంగనాథ మొదలియారు "ఇట్టి వార్తలను మీరు చెవిని వేసికొనరాదు. పూనిన పనిని వెనుకాడక నెరవేర్పవలెను. మీ స్థైర్యము నాకు తెలియనిదా? ధైర్యముగ నుండి పనిని గమనింపుడు. మీ రిచ్చిన ఒప్పుదల చేవ్రాళ్ల పుస్తకమున నా మిత్రులు కొందరు సంతకము చేసియున్నారు" అని నుడివి నాకు మిక్కిలి ప్రోత్సాహ మిచ్చిరి.

చింతామణిప్రచురణకైన అచ్చుకూలి, కాగితమువెల మున్నగువానికి చాలినంత ధనము నాకు లభింపలేదు. పలువురు ముందే రొక్క మిచ్చునట్లు సంతకము చేసియున్నను కొందరే పైకము పంపిరి. ఇట్టి స్థితిలో అచ్చుకూలికి, కాగితమువెలకు

పైకము పంపవలె నని చెన్నపట్టణమునుండి జాబు వచ్చినది. అప్పుడు దాని నెట్లో నేకరించి పంపుటకు మిక్కిలి కష్టపడితిని. నూరు, ఏబదియు పంపుచు వచ్చితిని. చేర్వాళ్లు చేసిన పెద్దలకు జాబు వ్రాసితిని. కొందరు వెనువెంట పైక మంపి సహాయ పడిరి.

# 45. చింతామణి ప్రకాశనము

జీవకచింతామణి మూలము వ్యాఖ్యయు చాలవరకు ముద్రితములైనవి. ఆ రోజులలో అచ్చయిన తమిళగ్రంథములు పెక్కింటియందు మున్నుడి మున్నగునవి కనిపింపలేదు. అవి యున్నచో చదువుకొనువారికి మిక్కిలి యుపయుక్తముగ నుండు నని చక్క నెరిగిన నేను చింతామణికి అంగములుగా వానిని వ్రాసి చేర్చి ముద్రింపవలె నని యెంచితిని. ఏయే విషయము లుపోద్ఘాతములో వ్రాయవలె ననుదాని నాలోచించితిని. గ్రంథమును చదువుటకు మునుపు అందులో నున్న ముఖ్యవిషయములను, గ్రంథవైశిష్ట్యము, వ్యాఖ్యాతత్వము మొదలగు వానిని పఠితలు తెలిసికొనుట మంచిదని నా భావము. మొదట పద్యముల మొదళ్లు వ్రాసి యొక తీరుగ అకారాద్యనుక్రమణిక కూర్చుకొని యుంచుకొంటిని.

గ్రంథము ముద్రించుచు వచ్చుచుండగ అక్కడక్కడ నున్న యుదాహరణలయందు తెలిసినవానికి సంబంధించిన యాకరములను క్రింది టిప్పణిలో తెలియబరచితిని. పిదప తెలిసిన యుదాహరణములను, తెలియనివానిని వేర్వేరుగ కూర్చి వ్రాసి యుంచుకొంటిని. అవి యన్నియు గ్రంథమునకు వెనుక చేర్పవచ్చు నని నిశ్చయించితిని. మున్నుడి తరువాత గ్రంథకర్తృచరిత్ర వ్యాఖ్యాతృచరిత్రలు వ్రాయ సంకల్పించితిని.

జీవకచింతామణి తమిళదేశమున ప్రచారములేని గ్రంథ మగుటచేత అందులోని కథ వచనరూపముగ వ్రాసినయెడల పుస్తకము చదివెడువారికి సహాయకారిగ నుండును. మూడువేలకు పైబడిన పద్యములుగల చింతామణికి వచనము వ్రాయదొడగిన అది త్వరలో ముగియునట్టి పని కాదు. అని తలచి జీవకుని చరిత్ర మాత్రము సంక్షేపముగ వ్రాయవచ్చు నను నిర్ణయమునకు వచ్చి, కథపోకడ తెగి

పోకుండు చందమున, ఒక విధముగ అది వ్రాసి సమాప్తిచేసితిని. దానిని నాకు పరిచితులగు కళాశాలోపాధ్యాయులకును, జైనమిత్రులకును చదివి వినిపించితిని. వారది విని యంగీకరించుటయే కాక కొన్ని సలహాలుకూడ నిచ్చిరి. వానిలో నుచితమైనవానిని గైకొంటిని.

పిదప గ్రంథకర్తయగు 'తిరుత్తక్క దేవరు' చరిత్ర వ్రాయుట కెట్టి యాధారమును దొరకలేదు. జైనులు తమలో 'కర్ణపరంపరగ' నాడుకొనుచుండు వార్తలను వారి ముఖముననే విని, వానిని క్రమపరచి, యొకతీరుగ వ్రాసితిని. నచ్చినార్క్కినియరు చరిత్ర వ్రాయుటకు సహాయముగ వారి వ్యాఖ్యానమును కొనియాడు ప్రశస్తి పద్యములు రెం డుండినవి. వాని నాధారముగ గొని ఆ మహోపకర్తృచరిత్ర వ్రాసితిని. అందులో వారు వ్యాఖ్యానించిన యితరగ్రంథము లివి యివి యని సూచించితిని. పత్తుప్పాట్టుకు వారు వ్యాఖ్య వ్రాసి రని తెలియబరచునపుడు పది కావ్యముల పేర్లును, వానిని రచించినవారి నామధేయములును, అందు కీర్తింపబడినవారి నామములును ఇవి యివి యని కూర్చి వ్రాసితిని. తమిళదేశవాసులకు అది యొక నూతనవృత్తాంతముగ నుండు ననియే నాయాశయము.

పిమ్మట, జీవకచరిత్రమున వచ్చునట్టి వ్యక్తివాచకములను ప్రత్యేకముగ ఎత్తి అకారాదిగ కూర్చి, వానిని వివరించి వ్రాసి 'అభిధానప్రకాశము' అను శీర్షిక క్రింద తెలియజేసితిని.

పీఠిక వ్రాయదొడగి గ్రంథవైభవమును, ఆ గ్రంథమువలన ఈ యీ సంగతులు తెలియవచ్చుచున్నవనియును మొదట వ్రాసితిని.

"చెందమిళభాషలో నుత్కృష్టములై వెలుగొందు కావ్యము లైదింట మొదటిదగు 'జీవకచింతామణి' యను నీ గ్రంథము తిరుత్తక్క దేవరు అను జైనముని రచించినది. ఇది ప్రాచీనకావ్యవ్యాఖ్యలయందును, లక్షణగ్రంథవ్యాఖ్యానములందును వ్యాఖ్యాతలచేత ఉదాహరణముగ గైకొని చూపబడిన ప్రామాణికగ్రంథములం దొక్కటి. తొలి సంఘకాలము మొదలు నడి సంఘకాలము, తుది సంఘకాలము, అను మూడు సంఘకాలములందును విజయముచేసియుండి తమిళపరిశోధన సలిపిన దివ్యజ్ఞానసంపన్ను లనుగ్రహించిన కావ్యములవలె చెందమిళశైలిలో శ్రేష్ఠమైనది. సంస్కృతభాషయందలి రామాయణమునుబోలె సకలవిధము

లగు వర్ణనలను తనలో నిముడ్చుకొని యుండుటచే మహాకావ్య మని వ్యవహరింప బడుటయే గాక, తర్వాతి కాలపు మధుమయకావ్యముల సృష్టించిన మహాకవులు పెక్కురకు ఈ యీ విషయ మీ యీ తీరున నుండవలె నని ఆ రామాయణమువలె మార్గదర్శక మయినదియు నీ కావ్యమే యని చెప్పుదురు."

ఈ విధముగ వ్రాసి పలుమారులు త్రిప్పి త్రిప్పి చదివితిని. మొట్టమొదటి సారిగ ఈ త్రోవలో నడుగిడిన నాకు 'మంచి పేరు సంపాదింపవలె' నను విచార మధికమై యుండెను. దానితోబాటు 'తప్పు లని తోచునట్లుగ వ్రాయరాదు' అను భావము కూడ నుండెను. అందుచేతనే వ్రాసినదానిని చూచి చూచి కొట్టివేసియు, దిద్దియు బాగుపరచుకొంటిని. అలవాటు లేకుండుటచేత ఒక్కొక్క వాక్యము వ్రాసి పూర్తిచేయునప్పుడును భయమును, సందేహమును కలుగుచుండెను. 'వాల్మీకి రామాయణమును దీనితో పోల్చుట సరియా, తప్పా? సంస్కృతవిద్వాంసు లేమైన నన్నచో నేమి చేయుట?' అనియు, తరువాతి కావ్యములకు మార్గదర్శక మని చెప్పుచున్నామే, జైనకావ్యమగు దీని నిట్లు చెప్పుటవలన శైవులకు, వైష్ణవు లకును నాపై కోపము వచ్చునేమో? అనియు కలతబడితిని. మన మనస్సునకు సరి యని తగిలినదానిని వ్రాసివేయుదము. పిదప తప్పని తెలిసినచో మార్చుకొన వచ్చును- అని సాహసించి వ్రాయగడగితిని. గ్రంథమునకు చేరిన సంగతులు వ్రాసి దానిని పరిశోధించి ముద్రించుటకు సంబంధించిన యుదంతములను, నా ప్రేమలో నుత్కృష్టస్థానమున నున్న వేలము రామస్వామి మొదలియారు చింతామణి ప్రచు-రించుటకై నన్ను ప్రోత్సహించుటయు, ప్రతి సంపాదించుటయు, వేరగు ప్రతులు కొన్ని లభించుటయు తెలియజేసితిని.

ఆ ప్రతులు పరిశోధించు వేళల నే పడిన పాట్లు సంగ్రహముగ నందు పొందుపరచితిని.

'అక్షరములు, పదములు పెరిగియు, తరిగియు, రూపరియు, మారియు పలు విధముల వికృతములై యుండి, ఖిలమై యున్న యీ గ్రంథవ్యాఖ్యానపు ప్రాత ప్రతులు పెక్కు పలుమారులు పోల్చి చూచి, ఎడతెరిపిలేక పరిశోధించుచు రాగ పద్యముల శుద్ధస్వరూపమును, వ్యాఖ్యానశుద్ధస్వరూపమును కనిపెట్టుటకును, వ్యాఖ్యానములో విశేషవ్యాఖ్య యిది, దండాన్వయ మిది యని విభజించుటకును,

ఉదాహరణముల తుది మొదళ్లు తెలిసికొనుటకును, దండాన్వయము, మూలముతో సరిపడ పోల్చి చూచుటకును, తప్పును తప్పని నిశ్చయించి పరిహరించుటకును, అర్థ మరసికొనుటకును నై చేసిన ప్రయత్నములు, పడిన పాట్లును పెక్కుభంగులు. అట్లగచాట్లు పడియు కొన్నియెడల నున్న 'సంగీతతమిళము', 'నాటకతమిళము' అ విభాగములును, మరియు కొన్ని భాగములును బాగుగ నవగాహన కాలేదు. సంగీత-నాటక ద్రావిడభాషాగ్రంథము మున్నగునవి ఈ కాలమున లేకుండుటే దానికి కారణము.

తాళపత్రగ్రంథములలో నున్న పాఠభేదములను చూచి చూచి నా మనసు పుండై పోయెను. ఈ విధముగ నున్నచో అర్థము పొసగును అని తోచిన చోట్లగూడ ప్రతిలో నున్నదానినే ముద్రింపజేసితిని. నా భావమునో దిద్దుపాటునో చింతామణి కెక్కింపక మిక్కిలి మెలకువతో గమనించి ముద్రింపించితిని. ముద్రింపజొచ్చిన యా గ్రంథము నా దృష్టిలో నొక దేవతావిగ్రహముగ నుండినది. దాని మాలి-న్యము పోగొట్టి, మెరుగువెట్టి, కవచము తొడిగి దర్శనము చేసికొనవలె ననునదే నా యాశ. 'చేయి వంకరై యున్నది; వేరు విధముగ మార్పవచ్చును. గోరు మాత్రము కొలదిగ దిద్దవచ్చును.' అను భావము నాలో కలుగలేదు. దాని ఒక్కొక్క అణువునను దైవాంశ మున్న దనియే నేను నమ్మితిని. పులుగడిగి మెరుగులు పెట్టుటకును అవయవమునే మార్చుటకును గల భేదము చక్కగ తెలిసికొనియుంటిని. ఈ భావమును, 'పురాతనద్రావిడగ్రంథములును, వ్యాఖ్యానములును ప్రాత రూపు చెడిపోకుండ నుండవలె ననునదే నా ప్రధానోద్దేశ మగుట ప్రతులలో లేనివానిని చేర్చియు, ఉన్నవానిని మార్చియు, తగ్గించియు ఇచ్చ వచ్చిన చొప్పున నిర్భయముగ ముద్రించినవాడను కాను. ఒక విధముగ నర్థము చేసికొని ప్రతులలో నున్న చంద మునవే ముద్రించితిని. స్వతంత్రించి యేమియు చేయలేదు.' అని తెలియజేసి కొంటిని.

ఈ వ్రతమును నాటి నుండి నేటివరకు విడనాడలేదు. పలు శతాబ్దులు తమిళ దేశమున ప్రచారమున నుండి మధ్యకాలమున మరుగుపడిన గ్రంథములందలి విషయ ములను వాస్తవికరూపమున తెలిసికొనవలె నన్న, ఆ గ్రంథరచన సాగిన ఆకాలపు పరిస్థితులును, కావ్యసమయములును బాగుగ తెలిసికొనవలయును. అట్లు పూర్వ-

ముగ తెలిసికొనుట యింతకాలమునకు తరువాత వచ్చిన మనకు సాధ్యము కానిది. కావుననే అర్థము కానట్టివి తరువాతి కాలమున నర్థము కావచ్చు నని ప్రతీక్షించుటయు, వేరుపాటుగ నొక సమయమున తోచినవానిని వేరుపాటే యని వెంటనే సాహసింపక వానికి సమాధాన ముండి యుండవచ్చు నని యెంచి యోపిక పట్టుటయు నా స్వభావ మాయెను. ఇట్టి కాలతామసముచేత నాతోడ నుండువారికి నాయెడ కొంచెము అప్రీతియు కలుగుచుండెను. కాని నేను నా యుద్దేశము విడిచిపెట్టలేదు.

తాటాకుప్రతు లున్న తీరు వ్రాసిన తరువాత నా కార్థికసహాయము చేసిన వారిని గూర్చియు, ముద్రించు కాలమున నాతోడ నుండి పరిశ్రమించినవారిలో ముఖ్యులను గూర్చియు వ్రాసితిని. పిదప, దొరకిన తాళపత్రప్రతుల విషయము వివరించి, వ్రాసి పీఠిక సమాప్తము చేసితిని. అప్పుడే జీవకచింతామణిముద్రణ నెరవేరినట్లు ఊరటయు, ఆనందమును కలిగినవి. అన్నిటిని చేత నిడుకొని చెన్న పట్టణము చేరితిని.

వెనుకటి భాగము లన్నియు పూర్తిచేసి మున్నుడి మున్నగువానిని గూడ అచ్చు కిచ్చి, ఒకమారు ప్రూఫు దిద్ది యిచ్చిన వెంటనే 'ఈశ్వరుని దివ్యకృపచేత కార్యము సుఖముగ నెరవేరినది?' అనెడి యానందము పొంగి పొరలెను. ఒడలిలో బడలిక యప్పుడు కలిగెను. రేయనక పవలనక కష్టపడుచుండిన కాలములం దేర్ప డని బడలిక 'ముగింపు చేసితిమి' అనువరకు పొంచియుండి పైబడినయట్లు నన్నదిమి పట్టుకొన్నది. ముద్రాక్షరశాలలో నొక్కచోట పండుకొని నిదురించితిని. సుఖముగ నిద్రపట్టెను.

నిదురించి కన్నులు తెరచినప్పుడు ముందే వచ్చి వేచియుండిన ఒక్కరు "ఇదుగోనండి, పత్తుప్పాట్టు" అని చెప్పి, ఒక తాటాకుప్రతి నాచేత నిడిరి. ఇచ్చిన వారిని తల యెత్తి చూచితిని. వేలూరిలో నున్న వీరశైవులు 'కుమారస్వామి అయ్య' రనువారే వారు.

వారు పత్తుప్పాట్టుప్రతి యా సమయమున కొనివచ్చి యిచ్చుట నాకు మంచి శకునముగ తోచెను. ద్రావిడభాషాజననియే వీరి ముఖమున పైపై తమిళభాషాసేవ చేయవలె నని యనుశాసించుచున్నది అని భావించితిని. వెంటనే వారు కోరిన తీరున వారిచేత ఏబది రూప్యము లుంచి యిచ్చి పంపివేసితిని.

"తల్లీ, చింతామణిని ఈ పేదమూలమున మగుడ నలంకరించుకొంటివి. తక్కిన యాభరణములుకూడ నా చేతికి తగులునట్లు చేసి వానిని వెలుగొంద జేయు కైంకర్యమునందు నీ దివ్యకృపను నాకు బాసటగ జేసి కాపాడవలెను" అని మనః పూర్వకముగ తమిళమాతను వేడుకొంటిని.

ముద్రించిన చింతామణిప్రతులు ఐదు వందలు. వానిలో నించుమించు నూరు ప్రతులు అచ్చాఫీసువారి యజాగ్రత్తవలన వ్యర్థమైపోయెను.

మరునటి దిన మాదివారము. నాడు బైండరు మచ్చుకై యొక ప్రతి బైండు చేసి యిచ్చెను. దానిని పుచ్చుకొని రామస్వామి మొదలియారువద్దకు చనినాను. వారికి పుస్తకము చూపినప్పుడు వారు పొందిన యానంద మింతటి దని చెప్ప తరము కాదు. "పెద్ద పనిని పైన వేసికొని నెరవేర్చినారు. ఇక శిలప్పదికారము మొదలగువానిని గూడ నిట్లే యచ్చిడి పూర్తిచేయవలెను." అని చెప్పిరి.

"అన్నియు చేయవచ్చును. అన్నిటికిని పైకము కావలసి యున్నదే? దాని కెక్కడికి పోవుదును? నిన్న నేను 'నార్టన్' దొరగారి 'గుమాస్తా' విశ్వనాథశాస్త్రి గారి యొద్ద మూడునూర్ల రూపాయలు ఋణముచేసి చింతామణిప్రతులను ముద్రణా లయమునుండి కొనిరావలసియుండెను." అని పలికితిని.

మొదలియారు మిక్కిలి విచారపడి "చేత్రాలు చేసిన మహాశయు లీయవలసిన రొక్క మడిగినచో నిత్తురు. అది పుచ్చుకొని అప్పు తీర్పవచ్చునే" అనిరి.

"నేను నేటి రాత్రియే బయలుదేరి, రేపటి పగటిపూట కుంబకోణము కాలేజికి పోవలెను. ఈ యవసరమున నే నెవ్వరియొద్దకు జని పైక మడుగుదును?" అని యంటిని.

"అటు లయినచో తక్కిన మిత్రులయెడ నే నడిగి పుచ్చుకొని శాస్త్రిగారి కిత్తును. రంగనాథమొదలియారును మాత్రము మీరే పోయి చూడుడు. వా రివ్వవల సిన ధన మిచ్చెదరు" అనిరి.

"వా రీ పుస్తకము చూచినచో మిగుల సంతోషపడుదురు. నిశ్చయముగ తాము వాగ్దాన మొనర్చిన సహాయము చేయుదురు." అను తలంపుతో రంగనాథ మొదలి

యారుగారి యింటి కరిగితిని. వారు తమ గదిలో నుండిరి. అప్పుడు అపరాహ్ణమున నాలుగు గంట లుండును. నా రాక యెరిగిన మొదలియారు "నే నిప్పుడు పరీక్షలకు సంబంధించిన పనిలో నున్నాను. అవకాశము కొంచెమేని లేదు. చూడలేకపోయి నందుకు చింతిలుచున్నాను. రేపు ప్రొద్దున వచ్చినచో చూచిపోవచ్చును" అని చెప్పి పంపిరి. మిక్కిలి ఆసతో పోయిన నేను అప్రతీక్షితమనఃక్లేశము నొందితిని. 'అదృష్ట దురదృష్టములు రెండును మనుజులకు కలసియే వచ్చుచుండును.' అని తలచి రామస్వామి మొదలియారుకు సంగతి యంతయు తెలియజేసి నాటి రాత్రియే కుంబకోణమునకు బయలుదేరితిని.

ఈ త్రిప్పటలో నా డెల్ల నేను భోజనము చేయలేదు. అయినను నా చేత నున్న బైండయిన చింతామణిప్రతిని పొర్లించి పొర్లించి చూచుకొని యానందించుకొను చుంటిని.

మరునాడు ప్రొద్దున కుంబకోణమునకు వచ్చి దిగితిని. నా మిత్రు లెల్లరను చింతామణి నెరవేరిన సంతోషవృత్తాంతము నడిగిరి. నాకు మరునాడు రంగనాథ మొదలియారుజ్ఞప్తి వచ్చినది. 'మరునాడు మనల రమ్మనిరే! వారిని చూడకయే వచ్చివేసితిమే. ఏ మనుకొందురో?' అని తలచి విషయము స్పష్టపరచుచు వారి కొక లేఖ వ్రాయ దొడగితిని. ఆ కమ్మ పద్యరూపముననే సాగినది.

జాబు వ్రాసిన రెండు దినములకు పిమ్మట నే నెదురుచూచుచుండిన చొప్పు ననే రంగనాథ మొదలియారు నా కొక జాబు వ్రాసిరి. అందు ఏడు పద్యములును ఒక 'సూచన'యు, ఏబది రూప్యములకు ఒక 'చెక్కు'ను ఉండినవి. సూచనలో సేలం రామస్వామి మొదలియారువద్ద ఏబది రూప్యము లిచ్చివేసినట్లును వ్రాసి యుండిరి. వారి పద్యములలో హార్దమగు ప్రేమ నిండి తొణకుచుండెను.

ఒక వారములో చెన్నపట్టణమునుండి బైండరు నూరు ప్రతుల వరకును బైండుచేసి, ఒక పెట్టెలో పెట్టి పంపియుండిరి. అది విప్పి పుస్తకములు వెలికి తీసి, ముగ్గులు తీర్చిన నొక పీటపై నిడి, పూలమాలలతో నలంకరించి, కర్పూరహారతి యిచ్చి, పసుపు నీరు చుట్టిపోసి మా తల్లిగారు నా చేత నెత్తి ఇచ్చి దీవించిరి. మా నాయనగారు కన్నులు చల్లబడ చూచి యానందించిరి.

నాడు వాన బాగుగ కురిసెను. అయినను కుంబకోణమునందు సంతకములు చేసినవారికి పుస్తకము లిచ్చుటకై ఒక బండిలో కొన్ని ప్రతులు పెట్టుకొని మొదట సాధు శేషయ్యరువద్దకు పోయి యిచ్చితిని. వారు పుచ్చుకొని యాశీర్వదించిరి. పిదప తక్కిన మిత్రులను ఒక్క రొక్కరిని చూచి పుస్తకము లిచ్చివేసి పండ్రెండు గంటల కిల్లు చేరితిని.

మరునాడు కొన్ని ప్రతులు తీసికొని తిరువావడుదురకు జని సుబ్రహ్మణ్య దేశికుల కర్పించితిని. వారు పుస్తకములను మిక్కిలి ప్రీతితో గొని ముఖపత్రముం మున్నుడి, గ్రంథకర్తృచరిత్ర మొదలగువానిని, గ్రంథమును, వ్యాఖ్యానమును తిల కించి మోద మందిరి.

ఒకనాడు తిరుచినాపల్లికి పోయి రాత్రి రెండు గంటలకు ఉత్తైయూరు చేరి త్యాగరాజ చెట్టియా రున్న యిల్లు డాసి తలుపుతట్టితిని. నా గొంతు విన్న వెంటనే చెట్టి యారు వేగముగ వచ్చి తలుపు తెరచి "నిన్నే తలచుకొనుచు పండుకొనియున్నాను" అని చెప్పుచు నన్ను కౌగలించుకొనిరి. అలవాటుగ 'మీరు' అని నాతో వ్యవ హరించుచు వచ్చిన వారు అప్పుడు 'నిన్ను' అని చెప్పుటయు, అంత వేగముగ వచ్చి కౌగలించుకొనుటయు వారి వాత్సల్యము దరులు మీరి పొంగి పొరలుచుండుటకు గురుతులుగా నుండెను. సంప్రదాయము, మర్యాద, గౌరవము—ఇవన్నియు ప్రీతియు ప్రీతియు సంధించుచోట మరుగుపడుచుండును.

"సాయంకాలము తిరువావడుదుఱై విద్వాంసులు ఆరుముగస్వామియు, కృష్ణ య్యరును వచ్చిరి. చింతామణిపుస్తకము చూపిరి. కన్నులు కానరాకుండుటచేత చేతిలోనికి తీసికొని చూచితిని; బరువుగ నుండెను. విప్పి, మొదటినుండి చదివించి వింటిని.

"ఎట్టి పని చేసియున్నారు! పీఠిక మున్నగునవి మిక్కిలి యందముగ నమరి యున్నవి. నేను మునుపు 'నామగళ్ ఇలంబగము'తో పోరాడినవాడ నగుట కావ్యము గొప్పతనము నాకు బాగుగ తెలియును. ఇంతటి శక్తి మీ కెక్కడినుండి వచ్చిన దని యబ్బురపడుచునే యున్నాను. అయ్యగా రున్నచో నెంతగ సంతస మొందియుందురో తెలియునా? వారికిని, మిమ్ము పోషించిన తిరువావడుదురమఠమువారికిని, మీకు

కాలేజిలో పని యిప్పించిన నాకును, మీకును మహోన్నతమగు యశస్సు సంపాదించి వేసినారు!"

ఈ విధముగ చెట్టియారు కొండాడుచునే యుండిరి. ఆ రాత్రి యంతయు మహానందముగ సంభాషించుచునే యుంటిమి. ప్రాతఃకాలమున, తిరుచినాపల్లి యందును, దానికి చేరిన ప్రదేశములందును సంతకము చేసిన పెద్దలయెడకు వేగి, చింతామణిప్రతు లప్పగించి రావలె నని బయలుదేరితిని. చెట్టియారు న న్నడ్డుకొని "నేను తగినవారిని పంపి చెందవలసినవారికి చేర్పింతును. మీరు నాతోడనుండి ముచ్చటించుచుండవలయును" అని నుడివి, కొందరిని బిలిచి వారి మూలమున ప్రతులు చెందవలసినవారికి చేరునట్లు చేసిరి.

నేను వారితోడ నుండి ప్రొద్దు పోవుటయే తెలియక మాట్లాడుచునే యుంటిని. చింతామణియందలి యత్యంతరసవత్తరఘట్టములు కొన్ని చదివి వినిపించితిని. కొన్నియెడల వారు మనసు కరగ కన్నీరు కార్చిరి. కొన్ని పదముల స్వరూపము కనుగొన నే ననుభవించిన క్లేశములును, పెద్దకాలమునుండియు సందిగ్ధములై యున్న సంగతులు కొన్ని స్పష్టముగ గోచరించిన వార్తలును విస్తరముగ విన్నవించితిని. వారు విని విని విస్మితు లగుచుండిరి.

చెట్టియారుతోడ మాటలాడుచుండి, నాటి రేయియే బయలుదేరి కుంబకోణము నకు వచ్చి చేరితిని. సేలం రామస్వామి మొదలియారు చెన్నపట్టణమున సంతకము చేసినవారియొద్దనుండి పైకము సేకరించి, తిరువళ్లిక్కేణి విశ్వనాథశాస్త్రిగారియొద్ద నేను పుచ్చుకొనిన ఋణము తీర్చివేసిరి. వారికి పైక మిచ్చిన సమాచారము మొదలియారు నాకు తెలియజేసినపుడు నా తలపై నెత్తబడియున్న పెద్ద బరువు దింపబడినయ ట్లూరట పొందితిని.

పలువురు మిత్రులు ప్రశంసించుచు లేఖలు వ్రాసిరి. అందుచేత ప్రాచీన తమిళగ్రంథములు ముద్రించు ప్రయత్నము పయింబయి చేయుచుండవలె నను సంకల్పము బలపడజొచ్చెను. జీవకచింతామణితో చేర్చి పంచమహాకావ్యము లని వ్యవహరింపబడునవి—శిలప్పదికారము, మణిమేఖల, వళైయాపతి, కుండలకేశి

అనునవి. వీనిలో శిలప్పదికారము, మణిమేఖలై అను నీ రెండు కావ్యముల తాటి యాకుప్రతులు నాయెడ నుండినవి. వళైయాపతి, కుండలకేశి అను రెండును లభింపలేదు. పిళ్లెగా రున్న నాళ్లలో తిరువావడుదుఱ పుస్తకాలయమున వళైయాపతి తాటాకుప్రతి నేను చూచియున్నాను. ఆ రోజులలో అట్టి ప్రాత గ్రంథములయందు నా కాసక్తి కలిగియుండలేదు. అట్లగుటచేత ఆ గ్రంథ మెత్తి చదువుటకో, పాఠము వినుటకో సందర్భమే యేర్పడలేదు. ప్రాత గ్రంథములు పరిశోధింపవలెనను మనో భావము నాయెడ నేర్పడిన తరువాత వెదకి చూడగ ఆ తాటాకుపుస్తకము మఠ పుస్తకశాలలో లభింపలేదు. తమిళదేశమం దంతట గాలించియు పొందలేక పోయి తిని. ఎన్నియో గ్రంథములు నశించిపోయిన వని తెలిసి వానికై వగచుట నా స్వభా వము. 'కన్నులతో గాంచిన తాళపత్రప్రతి చేతి కందకపోయెనే!' అను దుఃఖము నన్ను మిక్కిలి యధికముగ వేచెను.

జీవకచింతామణితో కలిపి లెక్కింపబడు గ్రంథములం దొక్కదానిని పరి శోధింప బూనుకొనుట నా యనంతరకృత్యముగ పైన వేసికొనవలె నని యెంచితిని. వ్యాఖ్యతోడ నుండు గ్రంథమైనచో పరిశోధించు శ్రమ తగ్గు నను భావముతో 'అడి యార్కునల్లార్' వ్యాఖ్యతో నున్న 'శిలప్పదికారము' ముద్రింపవచ్చు నను సంక ల్పము పుట్టెను.

ఆ సమయమున కొందరు మిత్రులును శిలప్పదికారము ముద్రింపవలె నని యడుగడుగున వ్రాయుచుండిరి. అందుచే దానినే ముద్రింప సమకట్టి నేను కొందరి యెడ చెప్పుచుంటిని. అప్పుడు జైనమిత్రులలో కొందరు నన్ను డాసి "ఎంతో కాల ముగ అచ్చుపడని జీవకచింతామణి యచ్చొత్తించి మా కుపకారము చేసితిరి. ఇట్లే చూళా (డా) మణిగూడ ముద్రించి యిచ్చినచో మా చేతనయిన సాయము చేయ గలము." అని పలికిరి. చంద్రనాథచెట్టియారు "జీవకచింతామణివిషయమున మీ రెన్నో పాట్లు పడినారు. జైన సంప్రదాయము లరసికొంటిరి. కావున చింతామణి ప్రకటించుట మిక్కిలి సులభమైన పని" అని వచించిరి. వారు పలుకునది నాకు న్యాయముగనే తోచెను. చూళామణి చదివి చూచిన నేను అదియు చింతామణివలెనే యుత్కృష్ట మని తెలిసికొంటిని. కాన చూళామణిపై కొలదిగ మనసు పోనిచ్చి తిని. నోట్సుకూడ వ్రాసి యుంచుకొంటిని. ఇట్టి దశలో దామోదరంపిళ్లెగారు

చూళామణి ముద్రింపనున్నా రని తెలిసెను. అందుచే ఆ కావ్యము ప్రకటించు ప్రయత్నము మానుకొంటిని. శిలప్పదికారభాగములు నా మనస్సుకు తృప్తి కలిగించు రీతిని ఆ సమయమున నుండకపోవుటచేతను, కొన్ని భాగములకు వ్యాఖ్యానము దొరకకపోవుటచేతను, ఇంకను కొన్ని ప్రతులు వెదకి, సంపాదించి, చేర్చి, పరిశోధింపవలె నను తలంపుచేతను ఆ కావ్యమును వెంటనే ముద్రింపబూనుట మానుకొంటిని.

జీవకచింతామణి ముగిసిన సమయమున తమిళమాతశాసనమువలె నా చేత పత్తుప్పాట్టుప్రతి ప్రాప్త మగుట జ్ఞప్తికి వచ్చెను. సంఘకాలపు గ్రంథమగు దానినే ముద్రింపవలె నని నిర్ధారణ చేసికొంటిని. మా కుటుంబమువారు కొలుచు ఇలువేలుపు అగు 'తిరువేరగప్పెరుమాను'ను ధ్యానించుకొని ప్రత్యేకముగ నున్న 'తిరుమురుగాఱ్ఱుప్పడై' ఎత్తికొని చదువ మొదలిడితిని.

# 46. సుబ్రహ్మణ్యదేశికుల యెడబాటు

పత్తుప్పాట్టు ప్రచురింత మని నిర్ణయించినపుడు నా చేత ఆ గ్రంథపు తాటియాకు ప్రతులు రెండే యుండెను. వానిలో నొక్కటి యసంపూర్ణమైనది. వేలూరు కుమారస్వామి అయ్య రిచ్చిన ప్రతి సంపూర్ణముగ నున్నను తప్పులు కుప్పలై కానిపించెను. నచ్చినార్కినియరు వ్యాఖ్యయు, కొలది కొలది భాగములుగ నమర్చిన మూలమును, ఇతరములును ఒక్కటిగ చేరి కలసియుండినది. వారు చేసెడి యన్వయమువలన పద్యరూప మిట్టిద యని నిర్ణయించుట కష్టముగ నుండెను. ఇంకను కొన్ని ప్రతులు లభ్యమగుచో పోల్చి చూడవచ్చు నని తలచితిని.

ఆ సమయమున త్యాగరాజచెట్టియారు తాము రచించిన 'మరుందువెణ్బామాలై' 'తిరుచ్చిఱ్ఱంబలవెణ్బాఅంతాది', 'తిరువాత్తియూర్‌పాది తిరువారూర్‌పాది అంతాది' అను నీ మూడు ప్రబంధములను పంపి ముద్రింపింపవలె నని వ్రాసిరి. శ్రీ సుబ్రహ్మణ్యదేశికుల కప్పుడు కంటి జబ్బు మిక్కిలియై బాధపడుచుండిరి. చెన్నపట్టణము నుండి 'ప్రాగ్‌మన్' అను ఆంగ్లేయనేత్రచికిత్సకు లొకరు నేత్రములు పరీక్షించిరి.

దేశికుల శరీరమందు బలము తగ్గిపోయిన దని వారు చెప్పుటయే గాక ఆధీనసంబంధమున నేవేని యేర్పాట్లు చేయవలసియున్నచో ముందుగనే చేసి యుంచుకొనుట మంచి దని ప్రధానకార్యనిర్వాహకులగు (కార్పారి) తంబిరానువద్ద ఏకాంతముగ జెప్పిరి. చిన్నపట్టమునకై చెన్నపట్టణమునుండి వచ్చి చదువుకొనుచున్న 'అరుణాచల త్తంబిరాన్' అనువారిని ఎల్లరును 'పట్టపు గుర్ర' యని పిలుచుచుండిరి. వారికి వెంటనే చిన్న పట్టము కట్టిపెట్టవలె నని యెంచి, సుబ్రహ్మణ్యదేశికులు శుభదినము చూచి పత్రికయు వ్రాయించిరి. చెన్నపట్టణమునకు జని ఆ పత్రిక ముద్రించుకొని రావలె నని నా కొన తిచ్చిరి. అప్పుడు 'క్రిస్టుమస్' విరామమై యుండుటచేత అట్లే చేయుదు నని యొప్పుకొంటిని. త్యాగరాజ చెట్టిగారి ప్రబంధము లచ్చొత్తించుటకును, పత్తుప్పాట్టు అచ్చొత్తించు జతనమునకును చెన్నపట్టణప్రయాణ మనుకూలముగి నుండు నని భావించితిని.

మంచివేళ జూచి నన్ను తిరువావడుదుఱనుండి దేశికులు పంపిరి. నాకు మాత్ర మేదో లోలోపల ఒక భయంకరమైన సూచన తోచినది. వారి బలహీనస్థితి చూచి మిగుల వగచితిని. ఒకసారి యనుజ్ఞ వడసి వెడలిన నేను మరలి వచ్చి వారిని చూచి యేగితిని.

చెన్నపట్టణమున రామస్వామి మొదలియారు బంగళాలో బసచేసి త్యాగరాజ చెట్టియారు ప్రబంధములను, తిరువావడుదుఱ చిన్నపట్టపు పత్రికను అచ్చు కిచ్చితిని. పత్తుప్పాట్టు వ్రాతప్రతులను చేత నిడుకొని పోయియుంటిని. మూలము ప్రత్యేకముగ లేని యా ప్రతిని నా మిత్రులు తేరళందూరు రాజగోపాలాచార్యులకు జూపి "ప్రతిలో ప్రత్యేకముగ మూలము లేదు. వ్యాఖ్యానముతో కొలది కొలది భాగములు మాత్రమే యున్నవి. అట్టి భాగములును అన్వయానుసారముగ ముందు వెనుకగ మారి యున్నవి" అని నుడివితిని. వారు "ఆ చిన్న చిన్న భాగములుగ నున్న మూలముల నన్నిటిని ప్రత్యేకముగ వ్రాసి యుంచుకొన్నచో విదప అర్థమును బట్టియు, వేరగు ఆధారములను బట్టియు చక్కబరచుకొనవచ్చునే" అనిరి. వారికి తటాలున స్ఫురించిన ఆ యాలోచన అంతవరకు నాకు తోపలేదు. ముల్లైప్పాట్టు వారిచేత నుంచితిని. వారు కొన్ని భాగములు వ్రాసి చూపిరి. అట్లే చేయుదు నని చెప్పి వారికి నా కృతజ్ఞత తెలియజేసికొంటిని. తరువాతి కాలమున నెంతయో క్లేశావహము

లగు తాళపత్త్రప్రతులతో పోరాడి కష్టపడి మంచి యనుభవము సంపాదించినను. ఆ సమయమున వారు తెలియజెప్పినది నాకు పరమోపకారమై యుండెను.

చిన్నపట్టపు పత్త్రిక అచ్చయిన వెంటనే తపాలులో తిరువావడుదురకు పంపితిని. త్యాగరాజచెట్టిగారి ప్రబంధములు అచ్చయి పూర్తి కాబోవు స్థితిలో నుండినవి.

ఒకనాటి యుదయమున ఎనిమిది గంటలకు రామస్వామి మొదలియారు బంగళాలో నుండి మాట్లాడుచుంటిని. అప్పుడు నా కొక లేఖ వచ్చెను. చూచితిని. కన్నుల కన్నీరు వెల్లువలు గట్ట అట్లే స్తబ్ధుడనై కూలబడితిని. తిరువావడుదురై రాయసం పొన్నుసామి చెట్టియారు "నేడు (7-1-1888) సాయంకాలము నాలుగు గంటలకు మహాసన్నిధానము స్వామివారు 'పరిపూర్ణ' మయిరి. నేడు పండ్రెండు గంటలకు నిర్దిష్టులయినవారికే చిన్నపట్టము అయినది" అని అందులో వ్రాసి యుండిరి.

నా యుల్లములో దుర్భరదుఃఖావేగము కుమిలి కుమిలి పై కెగయుచుండెను. ఈ లోకమందు పిళ్లైగారికి తరువాత 'ఉపఘ్నముగ' ఎవ్వ రుందురా యని బెంగ పడుచుండిన నాకు దృఢమైన పట్టుగొమ్మగ నుపయోగపడి, కల్పవృక్షమువలె వలసిన వన్నియు నొడగూర్చి యాదరించిన మహావదాన్యశేఖరుల యంతిమదశలో వారి దండ నుండి చూడ వీలు కాకుండునట్లు నా పూర్వజన్మకర్మము అడ్డు తగిలినదే యను దుఃఖము తలకొనినది. వెంటనే ఒక కార్డు తీసికొని నాటి రాత్రియే బయలు దేరి రానున్నట్లు వ్రాసితిని. క్రింద 'యాచకులును, సద్ధర్మమును, నేనును ఇక నెట్టి పాట్లు పడుటకో, వీడి వెడలిపోతివే' అను కంబరామాయణచరణము (అరణ్యకాండము, జటాయుదర్శనపటలము 21) వ్రాసి తిరువావడుదురకు పంపితిని.

అప్పుడు నే నీ ప్రపంచమునే మరచితిని. ఆ నిమిషముననే తిరువావడుదురకు పోవలె నను త్వర పుట్టెను.

రామస్వామి మొదలియారు ఈ వార్త తెలిసి మిక్కిలి దుఃఖించిరి. నన్ను ఓదార్చిరి. దేశికుల యుదారగుణము లభివర్ణించి చెప్పిరి. నాకో దుఃఖ మధికి వచ్చుచుండెను. వారియెడ ననుమతి వడసి బయలుదేరుట కైన ప్రయత్నములు చేయ దొడగితిని.

నిలుచుకొనిన చోటనే నిలువబడిపోతిని. కాలు సేతు లాడలేదు. పుస్తకములు తాకుటకు చేతులు కదలలేదు. నా యొడలి రక్తప్రసారమే ఆగిపోయినట్లు తోచెను. నా యొక్కొక్క ప్రయత్నమును కొనియాడి, నాకు కలిగిన గొప్పతనమును కాంచునపుడు తల్లి బిడ్డని పేరుప్రతిష్ఠలు విని యుబ్బిపోవునట్లు, సంతసించి నన్ను కాపాడుచుండిన ఆ మహోదారులను, వారు నాయెడ నొనర్చిన యొక్కొక్క మేలును తలచి తలచి కరగిపోతిని. నా దుఃఖము చల్లార్చుకొనుట కుపాయము లేదు. కొన్ని పద్యము లల్ల దలచితిని. నాలోని దుఃఖమే పద్యరూపముగ వెలువడెను. వారి దివ్యవిగ్రహమును ఇకపై చూడ తరముకాదు గదా యను తలపు కలుగగనే నేను నా యుల్లమున చిత్రించి పదిలపరచుకొనిన వారి రూపు మ్రోల నిలిచినది.

> 'కరుణాపూర్ణ సుబ్రహ్మణ్యగురుమణీ, కరుణాసాగరము జాలువారెడు పరీహామగు నీ కటాక్షవీక్షణమును, తరుణశీతకిరణసన్నిభమగు నీ వదనమండలమును, స్వచ్ఛామృతధారాసదృక్షమై వెలువడెడు శ్రీసూక్తులను, వచ్చెడు వారియెడ హద్దులు లేక దానవీరత చూపెడు నీ హస్తములను నేను చూడ గలుగు టెన్నటికో!'

నేను చెన్నపట్టణమునకు బయలుదేరినపుడు "మంచివేళ పయనముకావలెను" అని వారు చెప్పి పంపినది జ్ఞప్తికి వచ్చినది. మంచి సమయమున బయలువెడలినట్లు మునుపు తలచితిని. కాని ఆసందర్భముననో ఆ వేళ మిగుల చెడ్డ దని తలచునట్లుగ నాయెను.

> 'చిగురువిలుతు నోడించెడు మేటిమగండవగు నో విమలజీవీ, సుబ్రహ్మణ్యదేవా, శుభసమయమున చెన్నపట్టణమునకు బయలువెడలి పొమ్మని పలికి నన్ను తగినసమయమున పంపితివి. ఆవేళ ని న్నెడబాయజేయు చెడువేళ యని తెలియక నిను బాసి, అక్కటా! మహాదుఃఖమున మునిగితిని.'

నా దౌర్భాగ్యమును తలచుకొని నన్ను నేను నిందించుకొంటిని. నాటి రాత్రియే బయలుదేరి వెంటవచ్చిన కొందరితో తిన్నగ తిరువావడుదురకే చేరితిని.

అచ్చట నా ప్రియమైన వస్తువు కాననగునా! దేశికులు నిలుచు చోటు, ఉండు నెడము, పాఠప్రవచనము చేసెడి ప్రదేశము- మున్నగు స్థలములకెల్ల పోయి చూచితిని. అక్కడ వారి రూపు ఉన్నటుల వట్టి భ్రమ కలిగెను. వారిని కానలేక నిశ్చేతనుడ నయితిని.

క్రొత్త అధిపతులు శ్రీ అంబలవాణదేశికులు అను నామధేయముతో పదునేడవ పట్టపు ఆధీనాధ్యక్షులై పరగిరి. వారు నాతోడ కూరిమితో మాట్లాడి నన్ను ఓదార్చిరి. నా దుఃఖము ఓదార్చెడువారి శక్తికి అతీతమై యుండెను. తిరువావడుదురయం దన్నియు నుండినవి. ఒక యధ్యక్షులు గతించిరి. కాని వేరొక యధ్యక్షులు వచ్చినారు. సమాధి జెందిన అధ్యక్షులకు గురుపూజయు, క్రొత్త యధ్యక్షులకు సమ్మానమును జరిగినవి. అప్పు డాయూరు మహోత్సవాలంకరణముతో చెన్నారెను.

అయినను సుబ్రహ్మణ్యదేశికుల గుణముల ననుభవించి, అం దాసక్తులై యున్నవారి యుల్లములందు దుఃఖమే నిండియుండినది. వారు సంప్రదాయమునకై శరీరము మోచికొని యిటకు నటకు బోయి వచ్చుచుండిరి.

ఆచారముప్రకారము సుబ్రహ్మణ్యదేశికుల సమాధికి ఒక్కొక్క దినమునను పూజ నడచుచుండెను. కడపటి దినమున విశేషపూజ జరిగెను. దానికై పెక్కూళ్లనుండి మఠమునకు చెందిన భాగవతులు వచ్చియుండిరి.

గురుపూజ కడపటి దినమున రాత్రి మఠమునం దొక సభ కూడెను. క్రొత్త యధిపతులగు అంబలవాణ దేశికుల మ్రోల పలువురు సుబ్రహ్మణ్యదేశికులు పరిపూర్ణు లగుటకు వగచుచును, క్రొత్త అధ్యక్షులకు మంగళాశంసనము చేయుచును తాము రచించిన పద్యములు చదివి యర్థము చెప్పిరి. నే నప్పు డచ్చట లేను.

ఆధీనశిష్యులగు పళని కుమారతంబిరా నను వారు తాము వ్రాసిన 'విషాద గీతముల'ను చదివిరి. వానిలో నొక పద్యపు భాగమగు 'సుబ్రహ్మణ్య గురుమణి కులమణి తిరువావడుదురయందు బొలుపారెడు నొక మణి చింతామణి ప్రసాదించెడు మణి' అనుదానికి అర్థము చెప్పునపుడు 'చింతామణి' నిచ్చు మణి అను భాగమునకు

"ఈ మఠమునందు తమిళము నేర్చి, ఇప్పుడు కుంభకోణముకాలేజిలో నుండు స్వామినాథయ్యరుకు జీవకచింతామణి ముద్రించుటకై ప్రోత్సాహ మిచ్చి, ప్రతి మున్నగువానిని ప్రసాదించిన మహాసన్నిధానమువారి యరుదగు చర్యలు తలచి యిట్లు చెప్పితిని" అని ఒక కారణము చెప్పిరట. అప్పు డా సభలో నున్నవారిలో నొక్కరు "శైవమఠమగు నిచ్చోట జైనగ్రంథమునకు ప్రాశస్త్య మిచ్చుట పాడి గాదు. స్వామినాథయ్యరు ఈ మఠమున కాప్తు లయియు, ఉమాపతిశివాచార్యులు 'అసత్యములే యల్లి నడిపించిన చింతామణి' అని చెప్పియున్న జైనగ్రంథమును ముద్రించుట యపచారము. దానిని మనము తెగడుటయేగాక, అది వ్యాపింపకుండునట్లు చేయవలెను" అని రట. వారు వేరు గ్రామమునుండి వచ్చి మఠమునందు కొంత కాలము వసించియున్నవారు. నాకును పరిచితులే.

అది విన్న తంబిరానులును, ఇతరులును నిశ్చేష్టు లయిరి. వారియెడ వారికి కోపముగూడ గలిగెను. వెంటనే వారి నెదిరించి తగిన హేతువులు చెప్పి యణచి వేసిరి.

గురుపూజ సమాప్తమాయెను. వెలుపలి యూళ్లనుండి వచ్చినవారు తమ తమ యూళ్లకు నేగిరి. శ్రీ సుబ్రహ్మణ్యదేశికులవారి ప్రణయసంభృతములగు చర్యలను భావించి భావించి ప్రొద్దు పుచ్చుచునుండి నేను పత్తుప్పాట్టుపరిశోధన స్వీకరించితిని.

# 47. తిరునెల్వేలికి పయనము

1888 వ సంవత్సరారంభముననే సుబ్రహ్మణ్యదేశికుల కోల్పోయిన దుఃఖము చల్లారులోపలనే మరి యొక పెద్ద నష్టము వాటిల్లెను. నా శ్రేయస్సునే కోరునట్టి మహోదారులలో శ్రీ సుబ్రహ్మణ్యదేశికులకు తరువాతివారుగ పేర్కొనదగిన శ్రీ త్యాగరాజ చెట్టియారు శివపదము పొందిరి.

చెట్టియారువద్దనుండి నాకు సారెసారెకు కమ్మలు వచ్చుచుండెను. వారికి కంటిచూపు తగ్గినది మొదలు వే రెవ్వరైన వారికై వ్రాయుదురు. ఆ లేఖలనుండి

చెట్టిగారి శరీరము మిక్కిలి బక్కచిక్కిన దని తెలిసెను. అయినను అంత త్వరలో వారి జీవితకాలము ముగియు నని నేను తలంపలేదు.

1888 వ సంవత్సరము జనవరి నెల పందొమ్మిదవ తేది చెట్టియారు సదాశివుని యడుగునీడ చేరి రను వార్త మరునాడే నా కందినది. వారిని పోయి చూడ నైతిమే యను దుఃఖము నా మనసున కలిగెను. పత్తుప్పాట్టు పరిశోధనారంభము ఈ విధముగ నుండుటచేత నా మనసు కొంచె 'మయోమయ' మైనది. దానికి తగినట్లే తాటియాకుప్రతుల పరిస్థితియు నుండెను.

పత్తుప్పాట్టునందు విషయము తెలియకయు, అర్థము కాకయు, నిర్ణయము తెలియకయు బుద్ధి భ్రమసినపుడెల్ల ఆ పని నిలిపివేయుద మని పూనిక సడలుచుండెను. కాని యుత్తరక్షణమందే ఒక అరుదైన విషయము క్రొత్తగా కంటబడినప్పుడు - అట్టి విషయములు కొలదియే యున్నను - వానికై జీవితకాల మంతయు పరిశ్రమింపవచ్చునే అను భావ ముదయించును.

ఇట్టి దశలో అశుద్ధిబహుళము లైనట్టివియు, మూలము లేనట్టివియు అగు ప్రతులనుంచుకొని యాతన పడుటకన్న కొన్ని శుద్ధప్రతులు వెదకి కూర్చి శోధింపవచ్చునను భావముచే ఆ సంవత్సరము మే నెల తిరునెల్వేలికి పయనము కాదలంచితిని.

ఒక్క శుభదినమున బయలుదేరి తిరునెల్వేలికి జేరి, ఈశానమఠమున విడిది యేర్పరచుకొంటిని. అచ్చట నున్న తంబిరాను నా యవసరము లన్నియు గమనించిరి. పిదప కవిరాజ ఈశ్వరమూర్తియెడ కరిగితిని. వారును, వారి యన్నగారును నా రాకకై నిరీక్షించుచుండిరి. వారితో కొలదికాలము మాటాడుచుంటిని. ఇంకను కొందరు పెద్ద మనుష్యులు వెంటనుండిరి. తిరువావడుదురైమఠమునుగూర్చియు, సుబ్రహ్మణ్యదేశికుల గుణగణములను గూర్చియు, పిళ్లైగారి పాండిత్యమును గూర్చియు, తమిళగ్రంథములనుగూర్చియు మా సల్లాపము సాగినది.

ఈ యిరువురు సోదరులును మిక్కిలి సంపన్నులు. వారి కలిమికి వారి గుణముల కలిమి చెలువము చేకూర్చెను. జ్యేష్ఠులగు కవిరాజ నెల్లైయప్ప పిళ్లైగారి యిల్లు దక్షిణపు క్రొత్త వీథిలో నుండెను. ఆ యింటికి ముందువైపునను వెనుక దిక్కునను కాలువ యుండెను. ఎల్లప్పుడు నీరు పారుచునే యుండును. ఇంటికి వెనుక

నొక విశాలమగు తోట, అం దొక విలాసభవనము నుండినవి. వారు ఈవియు, పలుకుబడియు గలవారు. ఎల్లప్రొద్దుల ఎడతెగక వారి దర్శనార్థమై పలువురు ప్రభువులును, విద్వాంసులును వత్తురు. శివభక్తియు, తమిళజ్ఞానమును ఒక్కెడనే పొంది కతో వెలుగొందు ఆ కుటుంబమున కలుములతల్లియుల్లాస మేపారుచుండెను.

మరునాటి యుదయమున ఆ యిరువురు సోదరుల యిండ్ల నున్న తాటాకు ప్రాత్తముల పరికింప దొడగితిని. పడమటివీథి నున్న కవిరాజ ఈశ్వరమూర్తి పిళ్లె యింటిలో పుస్తకముల గది యుండినది. అదియే వారి కులక్రమాగతమగు గృహము. పుస్తకముల గది తెరచి చూపిరి. చూచిన వెంటనే నా యొడలు 'జల్లు' మనెను. 'తమిళసంఘమున మునుపు ఇట్లే తాళపత్రగ్రంథముల పెట్టియుండిరేమో !' అని విస్మయ మొందితిని. తాటాకుపుస్తకములను దొంతరలు దొంతరలుగ చక్కగ తీర్చి యుంచియుండిరి. తాళపత్రములు కట్టిపెట్టిన విధమే పరిష్కృతముగ నుండెను. దుమ్ము లేదు; పురుగులు లేవు; తాటాకులు ఒకదానితో నొకటి సంకీర్ణములై లేవు. 'తమిళదేవతకోవెల' అని చెప్పదగిన ట్లుండె నా ప్రదేశము.

అచ్చట నున్న తాటాకులను శోధించి చూచితిని. పలు విధముల గ్రంథము లుండినవి. ముద్రితపుస్తకములు, తాళపత్రప్రతులు పెక్కుండినవి. అన్నిటిని వెంటనే చూచివేయవలెనను ఆశ మొదట తలయెత్తెను.

పత్తుప్పాట్టుప్రతు లున్నవా యని మొదట గమనించితిని. ఒక ప్రతి దొరకినది. 'పొరునరాట్రుప్పడై' మొదలు నాలుగు గ్రంథములే యుం దుండినవి. అందును మూలము వేరుగ కనిపింపలేదు. 'ఇంతటి విశిష్టతగల యిచ్చోటగూడ పత్తుప్పాట్టు లభింపలేదే ! వే రెచ్చట లభ్యపడగలదు ?' అను బెంగ నన్ను పట్టుకొన్నది.

"ఏమిటి ఆలోచించుచున్నారు ?" అని నెల్లైయప్ప కవిరాజుగారడిగిరి.

"ఏమియు లేదు; సంఘకాలపు మహాకవుల యింటివలె నొప్పారు ఈ చోట ద్రావిడసంపత్సర్వస్వము లభించు నని మొదట తలచితిని. నేను దేని నన్వేషించు చుంటినో యది పూర్ణముగ ప్రాప్తము కాలేదే ? తమిళలోకమున ఈ ద్రమిడాలయము కంటె మిన్నయగు ప్రదేశ మెట నుండగలదు ? ఇచ్చట నగుపడనిది వే రెచ్చోట నగుపించును ? సంఘకాలసుధీమణులు రచియించిన గ్రంథములను తమిళలోక

మిట్లు నిరాదరణ చేసి పోగొట్టుకొనినదే!" అని మిక్కుటముగ వ్యథపడుచు చెప్పితిని.

"ఈ యి ల్లొక్కటే ఇ ట్లున్న దని మీరు తలపరాదు. ఇక్కడ ఇంకను కొన్ని యిండ్లలో పలువిధములగు తాళపత్రగ్రంథము లున్నవి. అక్కడగూడ చూడవచ్చును. శ్రీవైకుంఠము మున్నగు ఊళ్లలో పలువురు కవిరాజుల యిండ్లు ఉన్నవి. వేలకొలదిగ తాటాకు పొత్తములు వారి యిండ్ల చూడనగును. అందువలన తాము కొంచెమేని యధైర్యపడవలదు" అని కవిరాజుగారు వచించిరి. అచ్చోట గుడి కట్టుకొనియున్న ద్రావిడదేవతయే నా కభయ మిచ్చె నని తలచి, వెండియు తాటాకు పుస్తకము లన్వేషింపసాగితిని.

అప్పుడు 'కొంగువేళ్ మాక్కదై' అను పై చీటీ గల ఒక ప్రాత తాటాకు పుస్తకమును చూచితిని. ఆ గ్రంథము 'ఫలానా' అని నా కప్పుడు తెలియదు. అయినను ఆ పేరు 'ఇలక్కణక్కొత్తు' వ్యాఖ్యానమువలన నే దెలిసియుంటిని. ఆ గ్రంథకర్తయగు శ్రీ స్వామినాథదేశికులు, కొందరు మంచి పుస్తకములు చదువక వ్యర్థముగ కాలము పుచ్చెద రని చెప్పెడు నొక చోట 'తిరు' (అను పదము)ను 'కోవై' (అను పదము)తోడను అన్వయింపుడు. జ్ఞానాధిక్యముచేత మాణిక్య వాచకులు శివుడే యన్నది నిశ్చయము. అంతియగాక సుందరచిదంబరేశులు కోరి, వేడి వారి వాక్కులను తమ దివ్యహస్తములతో వ్రాసిరి. ఆ విశిష్టత గమనింపక చింతామణి, శిలప్పదికారము, మణిమేఖల, సంఘపు పాటలు, కొంగువేళ్మాక్కదై మున్నగువానితోడ చేర్చి అవియు నివియు నొక్కటిగ చేయుదురు ... పత్తుప్పాట్టు, ఎట్టుత్తొగై, పదినెణ్కీళ్ కణక్కు, ఇరామన్కదై, నళన్కదై, అరిచ్చందిరన్కదై మున్నగు గ్రంథములనుగూడ ఒక పదార్థముగ తలచి తమ జీవితము వ్యర్థము చేయుదురు" అని వ్రాసియున్నారు. శైవులగు వారు చీదరించుకొని త్రోసివుచ్చు గ్రంథములలో కొంగువేళ్మాక్కదై ఒక్క టని అప్పుడు జ్ఞప్తికి వచ్చెను. 'కొంగువేళ్ అనువారి కథయై యుండు నోపు' అని తలచి ఆ తాళపత్రగ్రంథ మెత్తి యుంచుకొంటిని. 'ఎట్టుత్తొగై' యందు 'కలి' యు, 'పరిపాడలు' ను తప్ప తక్కిన ఆరు గ్రంథములు మాత్రము గల ప్రతి యొక్కటి అక్కడ నుండెను. అదియు వేరగు కొన్ని గ్రంథములును కవిరాజుల యనుమతి పొంది ఎత్తి యుంచు

కొంటిని. ఈ యింట నున్న తాటాకుప్రతులు చూచుటలో రెండు రోజులు గడచి నవి. పిదప ఒక నాటి ప్రొద్దున వారు నన్నును వెంట పిలుచుకొని తమ బంధుగుల యిండ్లయందును, మిత్రుల గృహములందును ఉన్న తాటాకులు చూడవచ్చు నని బయలువెడలిరి.

కొన్ని యెడలకు జని చూచితిని. పలు తాటియాకుప్రతులును అచ్చయిన పుస్తకములును ఉండినవే కాని సంఘకాలపు కావ్య మొక్కటైనను దొరకలేదు. పిదప దక్షిణపు క్రొత్తవీథిలో నుండిన 'కృష్ణవాధ్యార్' అనువారి యింటికి నరిగితిని. అచ్చట తొల్‌కాప్పియవ్యాఖ్య తాళపత్రప్రతి యొక్కటి దానితో 'నాన్గునేరి'యం దుండు నొక్కరికి నాయెడ నున్న 'తగడూర్‌యాత్తిరై' ప్రతి యొక్కటిచ్చి ఈ ప్రతి ఎరవుగ తెచ్చుకొంటిని- అని వ్రాసియుండెను. పుచ్చుకొన్న దెవరినుండియో వ్రాయబడలేదు. తొల్‌కాప్పియవ్యాఖ్యలో 'తగడూర్‌యాత్తిరై' అను పేరు వచ్చును. అగుటచేత అది ప్రాచీనగ్రంథ మని తెలిసికొనియుంటిని. అది నాన్గునేరిలో నున్న దను వార్త చూడ గనే దాని నెట్లులైనను కనుగొనవచ్చు నని తలచి "నాన్గునేరిలో కవిరాజుల యిండ్లున్నవా ?" అని వెంట నున్న మిత్రుల నడిగితిని.

"ఉన్నవి. వైష్ణవులే యధికు లగుట వైష్ణవగ్రంథములు లభించును." అని వారు బదులు చెప్పిరి. "ఈ ప్రతిలో తగడూర్‌యాత్తిరై తాటాకుప్రతి ఆ యూరిలో నున్న ఒక్కరి కిచ్చి యున్నట్లు వ్రాసి యున్నది. అక్కడకు పోయి వెదకి చూచిన లభించునా ?" అని ప్రశ్నించితిని.

"లభింపవచ్చును. కాని నిశ్చయించి చెప్పలేము. ఇట్టి పుస్తకముల నిప్పు డెవ్వరు చదువుదురు ? మీరు వెదకునట్టి పత్తుప్పాట్టుప్రతియే పూర్ణముగ దొరక లేదే ? ఇట్లే ఈ గ్రంథముగూడ దొరకకపోయినను పోవచ్చును. ఈ తొల్ కాప్పియ ప్రతి యిచ్చట నున్నట్లే, దీనికి మార్పిడిగ పంపిన తగడూర్‌యాత్తిరై అచ్చట నుండుట కవకాశ మున్నది."

"దొరికిన మంచిది." అని నే నంటిని. కాని తరువాతికాలమున నాన్గునేరిలో నాలుగుమారులు తాటియాకులు వెదకినప్పుడును తగడూర్‌యాత్తిరై లభింప లేదు.

పెక్కు ప్రాచీనగ్రంథములు ఈ లోకమును విడిచిపుచ్చి యాత్ర చేసినట్లే ఆ అరుదైన గ్రంథముకూడ పోయిన దని తలతును.

పెక్కిండ్ల వెదకియు వచ్చిన పని సమకూడనందున మనసు సడలగ నేను "ఇంకను వెదకదగిన స్థల మున్నదా ?" అని కవిరాజ నెల్లైయప్పపిళ్లై నడిగితిని.

"మీకు కావలసిన తాటాకుప్రతి దొరకలే దను కొదవ తీర్ప శ్రీ నెల్లైయప్ప - స్వామియే దయచూడవలెను. ఏమియు తోపకున్నది. ఇంకను ఒక యి ల్లున్నది. అక్కడకూడ దొరకనిచో ఇక ఈ యూరిలో వే రెచ్చటను లే దనియే నిశ్చయము చేయవచ్చును.

"అది యెవ్వరి యిల్లు ?" అని యాశతో నడిగితిని.

"మా కొలము పెద్దలగు అంబలవాణ కవిరాజుల శిష్యులలో నెల్ల అగ్ర- గణ్యులైన 'తిరుప్పాఱ్కడల్‌నాదన్ కవిరాయర్' అను నొక్కరు ఇచ్చట చాకల పేటలో నుండిరి. వారు గొప్ప పండితులు. వారి యింటిలో పెక్కు తాళపత్ర- గ్రంథము లున్నవి. పోయి చూడవచ్చును. ఇప్పుడు వారి మనుమలు అదే పేరుగలవా రున్నారు" అనిరి.

"ఇప్పుడే బయలుదేరవచ్చునే?" అని నేను త్వరపరచితిని.

"రండు, పోవుదము" అని చెప్పి న న్నా యింటివైపు పిలుచుకొనిపోయిరి. మేము పోయి చేరగనే ఆ యింటిలో నుండిన తిరుప్పాఱ్కడల్‌నాదన్ కవిరాయరు మిక్కిలి మర్యాదతో మ మ్మాదరించిరి. వా రుత్కృష్టగుణశాలు లని తోచెను. కవిరాజ నెల్లైయప్పపిళ్లై మొదట వారిని తద్దయు కొనియాడి నా పరిచయము కలిగించి పత్తుప్పాట్టు మున్నగు సంఘకాలగ్రంథములు వెదకు సంకల్పముతో నేను వచ్చి యుండుట తెలియజేసిరి. వెంటనే వారు "అటులనా? ముందే తెలియకపోయెనే! నిన్ననే ఇచ్చటినుండి సబ్ జడ్జి కనకసభై మొదలియారుగారు తమ మిత్రు లొక్క- రికై ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్‌కీళ్‌కణక్కు - ఈ మూటిని కొని పంపిరి. ఇవి మిక్కిలి శుద్ధప్రతులు. వీరు ముందుగనే వచ్చియుండినచో నిచ్చియుందును"

అని చెప్పిరి. కొన్నినాళ్లకు మునుపు రాకపోతిమే యను దుఃఖ మప్పుడు నాకు కలిగెను. అయినను ఈ మూడును ఉన్న యింట వేరగు సద్గ్రంథము లుండవచ్చు నని యెంచి, ఆయింట నున్న తక్కిన తాళపత్రగ్రంథములు చూడవచ్చునా యని యడిగితిని. అప్పుడు రాత్రి యెనిమిదిగంట లై యుండుటచేత మరునాటి యుదయమున వచ్చి చూడవచ్చు నని తిరుప్పాల్క్కడల్‌నాదన్ కవిరాయరు సెలవిచ్చిరి. అట్లే మరునాడు నెల్లైయప్పకవిరాయరును, నేనును అటకు చనినాము. తిరునెల్వేలి హిందు కాలేజిలో అప్పుడు తమిళోపాధ్యాయులుగ నుండిన అనంతకృష్ణకవిరాయ రనువారు మాతోడ వచ్చిరి. తమ యింటిలో నున్న పుస్తకముల నన్నిటిని మేము చూచుటకై తిరుప్పాల్క్కడల్‌నాదన్ కవిరాయరు తీసియుంచిరి. ఇంచుమించు 500 తాళపత్ర-గ్రంథము లుండవచ్చును. మూడు వంతుల ప్రతులు వారి తాతగారు వ్రాసినవే. వానిని మేము వేరువేరుగ చూడ మొదలిడితిమి. పెద్ద తాళపత్రగ్రంథ మొకటి అనంతకృష్ణకవిరాయరు ఎత్తి చూచిరి. నేను మరొక్క టెత్తుకొంటిని.

ఆ గ్రంథపు శీర్షిక యేమని అనంతకృష్ణకవిరాయరును నే నడిగితిని. అప్పుడు వారు 'తిరుమురుగాట్రుప్పడై' అనిరి. కొంచె మూరట కలిగెను. కొన్ని యాకులు త్రిప్పి చూచి 'పొరునరాట్రుప్పడై' యనిరి. ఇదియే పత్తుప్పాట్టయియుండవచ్చు నని పరమేశ్వరు కృపను తలచి తలచి కరగిపోతిని. నా కన్నుల కేమియు గోచరమగుట లేదు. కవిరాయరునే ఆ యాకులను ఒక్కటొక్కటిగ చూడు డని చెప్పితిని. పత్తు-ప్పాట్టు పూర్ణముగ ఒకదానివెంట నొక్కటిగ వ్యాఖ్యానముతోబాటు వరుసగ నుండెను. మిగుల ప్రాత ప్రతి. నా కెల్లయే లేని యానందమును, మైకమును కలిగెను. అది 150 సంవత్సరములకు పూర్వపు దనియు, మూలముపత్రములు వ్రాసిన కాలము అంతకు 200 ఏండ్లకు మునుపుగ నుండవచ్చు ననియు తెలిసెను. తరువాత నిదానించి తక్కిన తాటాకుప్రతులు పరికించినపుడు చింతామణియు, కొంగువేళ్మాక్కదయు, కొన్ని ప్రబంధములును ఉండినవి. కొంగువేళ్మాక్కదై పై బేర్కొన్న ప్రతిని చూచి వ్రాసినదే. అందు ఆదియు లేదు. అంతమును లేదు. అప్పుడు 12 గంట లాయెను. గ్రంథస్వాములనుండి ఆ ప్రతుల నన్నిటిని పొంది, కృతజ్ఞత చూపి నా బసకు వచ్చి చేరితిని. పత్తుప్పాట్టు పూర్ణముగ నున్న ప్రతి లభించుటవలన నా మనసు మిక్కిలి తృప్తినొందెను. పిదప రెండు దినములు తిరునెల్వేలిలో నుండి కొన్ని యిండ్లు చూచి కుంబకోణమునకు బయలుదేరితిని.

కుంబకోణము వచ్చిన పిదప చాకలపేట ప్రతితో తక్కిన ప్రతులనుగూడ నిడుకొని విమర్శింపగడగితిని. ఆ ప్రతియందుగూడ వ్యాఖ్యయందును కొన్ని భాగములు లుప్తములై యుండెను. తిరునెల్వేలి పోయియున్నపుడు ఆళ్వారుతిరునగరిలో పలువురు పండితుల యిండ్లున్నవని చెప్పిరే; అటకు పోయి చూతము గాక !' అను చాపలము నా కప్పుడు కలిగెను. శ్రావణపూర్ణిమతో చేరి కొన్నాళ్లు కాలేజికి ఆట విడుపై యుండినది. అప్పుడు తిరునెల్వేలి కేగితిని.

ఆళ్వారుతిరునగరికి నరిగితిని. పోవు దారిలో వెళ్లూరులో కొందరు కవి రాజుల యిండ్ల నున్న తాటాకుప్రతులు చూచితిని. పత్తుప్పాట్టు కనిపింపలేదు. ఆళ్వారుతిరునగరిలో నా మిత్రులనుగూడ చూచితిని. వా రందరును ప్రయత్నించి కవిరాజుల యిండ్లలో నున్న తాటియాకుపుస్తకముల నన్నిటిని నేను చూచుటకై తగిన రీతిగ నుంచియుండిరి. మొదట 'లక్ష్మణకవిరాయరు' అనువారి యింటి కరిగితిని. వారు మహావిద్వాంసులగు 'తీరాదవినై తీర్త తిరుమేని కవిరాయరు' అనువారి వంశమునకు చెందినవారు. వారి యింట వేలకొలదిగ తాటాకుప్రతులు ఉండినవి. మూడు దినము లుండి వెదకియు నే నన్వేషించుచుండిన పత్తుప్పాట్టుమాత్రము దొరక లేదు. పిదప నెందరో కవిరాజుల యిండ్ల నన్వేషించితిని. ఏ యింటను అది లభింప లేదు. అందుచే నా మనసు మిగుల అలసి వేసరినది. అప్పుడు లక్ష్మణ కవిరాయరు నా పరిస్థితి చూచి "ఒక సంగతి మరచిపోతిని. ఇచ్చట మా శ్వశురు లున్నారు. మా నవుకరు మా యింట నున్న కొన్ని పుస్తకములు వారియొద్ద నిచ్చినాడు. వారి యొద్ద మీరు వెదకెడి పుస్తక మున్నదేమో యని చూతము" అనిరి. ఎట్లైనను ప్రయత్నించి లభించునట్లు చేయు డని వారిని వేడుకొంటిని.

ఒకనాటి రేయి ఆలయమందు పర్వదిన మగుటచేత నే నున్న వీథిమార్గముగనే స్వామివారును, శఠకోప ఆళ్వారును వేంచేసినారు. అప్పుడు నమ్మాళ్వారుల అలంకారపు సొంపు దర్శించి, నేను వచ్చిన పని నెరవేర్పవలె నని మిక్కిలి వేడుకొంటిని. పిదప నా మిత్రులతో భోజనము చేసిన యింటి తిన్నెపై కూర్చొనియుంటిని. వెన్నెల వెలుగు చక్కగ విరిసియుండెను. అప్పుడు లక్ష్మణకవిరాయరు మిక్కిలి వడిగ నే నున్న చోటికి వచ్చి "ఈ పుస్తకము చూడుడు. ఇది యొక్కతే మామగారియొద్ద నున్నది. చూచి త్రిప్పి పంపెద నని చెప్పి తీసికొని వచ్చియున్నాను." అనుచు నొక్క

తాటాకుల పొత్తమును నాయొద్ద నిచ్చిరి. నా కుండిన యుత్కంఠచేతను, ఆత్రము చేతను వెన్నెలవెలుగుననే అది విప్పి చూపితిని. తటాలున 'ముల్లైప్పాట్టు' అను పేరు నాకంటబడెను. అప్పుడు నాకు కలిగిన యానందము హద్దులుమీరినది. మిక్కుట మగు వేగముతో మొదటినుండి త్రిప్పి త్రిప్పి చూచితిని. తిరుమురుగాఱ్ఱుప్పడై మొదలగు ఏడు గ్రంథములు వరుసగ నుండినవి. ఆళ్వారును వేడుకొనుట రిక్తవో లే దని వెంట నున్నవారితో నంటిని. సంతోషాతిశయముతో నాటి రాత్రి యంతయు నాకు నిదుర పట్టలేదు. మరునాడు ఆ తాళపత్రప్రతియు, ఐంగుఱునూఱు, పదిఱ్ఱు ప్పత్తు, పుఱప్పొరుళ్ వెణ్బామాలై- అనువాని ప్రతులనుగూడ లక్ష్మణ కవిరాయరుల నుండి పొంది మిత్రులయొద్ద సెలవు పుచ్చుకొని తిరునెల్వేలికి వచ్చి, అచ్చట చూడ వలసినవారిని చూచి కుంబకోణము వచ్చి చేరితిని.

# 48. 'పత్తుప్పాట్టు' పరిశోధన

దొరకిన ప్రతుల నన్నిటి నిడుకొని పత్తుప్పాట్టు పరిశోధింప దొడగితిని. కొన్నిటిలో పది గ్రంథములును లేవు. కొన్నిట నడుమ నడుమ కొన్ని భాగములు లేవు. కొన్నిట తప్పులు కొల్లలై యుండెను. ఒక్కదానియందైనను వేరుగ మూలము లేదు. నిర్దుష్టమైన ప్రతి యెచ్చట దొరకునా యను చింతలో మునిగియుంటిని.

ఎప్పటివలె ఒక్కమారు తిరువావడుదురకు పోయియున్నపుడు ఆధీనపు అధ్యక్షు లగు అంబలవాణ దేశికులయొద్ద పత్తుప్పాట్టుకై నేను చేసిన యాత్రలను గురించి విపులముగా చెప్పి "ఇంత ప్రయాసపడియు సంపూర్ణమైన శుద్ధప్రతి లభింపలేదు. ఆధీనమునకు సంబంధించిన ప్రదేశములం దెందైనను దొరకుచో సంపాదించి పంపవల సిన దని కార్యస్థులకు సన్నిధానమువారు ఉత్తరు విడిన ననుకూలముగ నుండును" అని విన్నవించుకొంటిని. నా మనఃఖేద మెరిగిన దేశికులు "కొంచెముకూడ దిగులుపడ వలదు. ఆధీనమునకు చెందిన ప్రదేశములు మెండుగ కలవు. అందరికిని వ్రాయించి యెట్లైనను పత్తుప్పాట్టు ప్రతి తెప్పించి యిత్తుము" అని ధైర్యము పలికిరి.

"దొరకినచో మేలు" అని చెప్పి, అనుజ్ఞ వడసి వెడలిపోతిని.

రెండు వారములకు తరువాత తిరువావడుదుఱమఠమునుండి నా కొక కమ్మ వచ్చినది. "దక్షిణదేశకార్యస్థుల కెల్ల సన్నిధానమునుండి శ్రీముఖములు పోయినవి. అనుకూలవార్త వచ్చును. దిగులుపడవలదు" అని మఠము రాయసం పొన్నుసామి చెట్టియారు అందు వ్రాసియుండిరి. మరుసటివారము ఏమయినదో తెలిసికొనుటకై నేను తిరువావడుదుఱ కరిగితిని. మఠమున ప్రవేశించి 'ఒడుక్కము' వాకిట కాలిడి నపుడే ఆధీనాధ్యక్షులు నా చెవిని బడునట్లుగ "పొన్నుసామిచెట్టియారూ, పత్తుప్పాట్టు కొని వచ్చి అయ్యరుగారియొద్ద నిండు" అని ఉత్తరు విడిరి. ఆ మాట కర్ణరసాయ నమై చెవి సోకగనే నామేనెల్ల పులకలు మొలకలెత్తెను. బహువేగముగ ఆధీనాధ్య క్షుల దగ్గరి కూర్చుంటిని. వెంటనే పొన్నుసామిచెట్టియారు తాళపత్రప్రతి కొని వచ్చి నా చేత నిచ్చిరి. విప్పి చూచితిని. పది గ్రంథములును ఉండినవి. ఆ ప్రతి యందును మూలము వ్యాఖ్యయు కలిసియే యుండెను. పత్తుప్పాట్టు పూర్ణముగ నుండుటవలన నా కెల్లలేని సంతోష మొదవెను. ఒక్కొక్క భాగముగ చూచు కొనుచు వచ్చితిని. ఒక్కొక్క గ్రంథముగ త్రిప్పి చూడవలె నని నా యుల్లము కుతూ-హల పడెను.

"ఈ ప్రతి యెచ్చటినుండి లభించినది?'' అని యాశ్చర్యముతో ఆధీనాధ్య క్షుల నడిగితిని.

"తిరుచ్చెందూరు మఠమున వీరబాహుపిళ్లె యనువారు కార్యస్థులుగ నున్నారు; మిగుల సమర్థులు. వారు సంపాదించి పంపిరి" అని వారు చెప్పిరి. ఆ ప్రతిని పుచ్చు కొని కుంబకోణము వచ్చి నా 'చేతి ప్రతి'తో పోల్చి చూచితిని. పలు దొసగులు తొలగినవి. మూలము లేదే యను లోటు ఒక వైపున నున్నను పది గ్రంథములును ఉన్న శుద్ధప్రతి లభించినదే చాలు అను తృప్తితోడ అటుపై ముద్రణకై ప్రతి సిద్ధము చేయ పూనుకొంటిని.

నడుమ మరి యొక యాటంకము తటస్థించెను. 'కుఱింజిప్పాట్టు'లో ఒక చోట ఒక భాగము జారిపోయి యుండినది. అన్ని ప్రతులందును ఆ లోపమే కను పించెను. ఎన్ని చరణము లచ్చట నుండవలె నన్నది నిర్ణయించుటకు సాధ్యము కాలేదు. విషయసంగతి ననుసరించి చూడగ కొంది భాగముగ నుండవచ్చు ననియే తోచెను. పలు తరగతుల పూవుల పేళ్లు వరుసగ చెప్పునట్టి సందర్భ మది. ముందు

వెనుకల పూవుల పేళ్లు వచ్చియున్నవి. నడుమ కొన్ని విరులపేరులు అమరిన భాగమే కనుపింపలేదు.

ఆరంభమునుండియు సంకటములే అనుభవించిన ఖేదముచే నే నలసిపోయి, ఏమియు తోచక యుంటిని. అప్పుడు, శైవాధీనములందు తిరువావడుదుఱవలె, ప్రాచీనతయు, పేరు ప్రఖ్యాతులును గల ధర్మపురాధీనముస్మృతి వచ్చినది. అంత వరకు ధర్మపురపు మఠమునం దున్న తాళపత్రగ్రంథములు వెదకి చూచు సందర్భమే నాకు కలుగలేదు.

పలువురు విద్వాంసు లుండి పొలుపారిన ఆ యాధీనపు తాటాకుపుస్తకములు పరీక్షించినచో పత్తుప్పాట్టుప్రతి లభించు నను ఆశ నాకు కలిగెను. ఆ మఠాలయము నకు జని అధినాధ్యక్షులైయున్న శ్రీ మాణిక్యవాచకదేశికుల దర్శనము చేసికొని, వారి యనుమతి వడసి అట నున్న తాటాకులను వెదకితిని. నేను వెదకిన వస్తువు దొర కెను. అచ్చట మిక్కిలి ప్రాచీనమగు పత్తుప్పాట్టుకు చెందిన విడియాకులు కొన్ని యగుపించినవి. వాని సహాయమున కుఱింజిప్పాట్టులో కొరవడియున్న భాగము పూర్ణ మాయెను. నాలుగు పూవుల పేళ్లు జారిపోయిన వని తెలియవచ్చెను. లోటు తీర్చు కొనిన సంతోషముతో నేను కృతజ్ఞత తెలుపుకొని ఆ యాకులను తీసికొని కుంభ కోణము వచ్చి చేరితిని.

పత్తుప్పాట్టుమూలము లేని వెలితిమాత్రము తీరకయే యుండెను. చెన్నపట్ట ణమునందలి సర్కారువారి హస్తలిఖితపుస్తకశాలలో నొక పత్తుప్పాట్టుప్రతి యుండినది. దాని ప్రతి వ్రాయించి తెప్పించితిని. అందు రెండు గ్రంథముల మూలమే యుండెను. ఇకమీదట పత్తుప్పాట్టు ప్రతులు కావలె నని విచారపడుటలో ప్రయోజనము లేదు- అను తీర్మానముతో ఆ గ్రంథము నచ్చుకు సిద్ధము చేయ దొరకొంటిని.

ఒక్క తడవ బాగుగ మొత్తము చూచి అచ్చు కివ్వవలసిన ప్రతియు చూచి చక్కచేయబొచ్చితిని. తక్కిన గ్రంథములు ముందుగ ముగించి కడపట తిరుమురు గాట్రుప్పడై చూచుచుంటిని. మూలమును, వ్యాఖ్యానమును ఎట్లు వేరుపరచి వ్రాయ వలెనో యట్లే వ్రాయించితిని. ఒకనాటి యుదయమున తొమ్మిది గంటలకు

తిరుమురుగాట్రుప్పడై పూర్తియాయెను. ఒక విధమైన తృప్తి కలిగెను. అప్పుడు వీథిలో నాగస్వరముశబ్దము వినిపించెను ; గమనించితిని. సుబ్రహ్మణ్యభక్తులగు నాయుడుగారొక్కరు 'కావేరి'లో స్నాన మాచరించి, విబూది యొడలు నిండ నలదుకొని, పాలకావడి యొక్కటి మోచికొనుచు వచ్చిరి. ఒడలినిండ అలుగులు గ్రుచ్చుకొని (భక్తులు మ్రొక్కుబడి ననుసరించి నాలుక మొదలగు చోట్ల సూది మొదలగు వానితో గ్రుచ్చుకొందురు. ఇది యొక సంప్రదాయము.) కుమారస్వామిస్తోత్ర రూపములైన కొన్ని పాటలు పాడుచు నాడుచునే వచ్చిరి. నాగస్వరవిద్వాంసుడు వారి పాటకును, ఆటకును తగినట్లుగ 'సన్నాయి' (నాగస్వరము) వాయించుచుండెను.

తిరుమురుగాట్రుప్పడై వ్రాసి పూర్తి యగుటయు, ఆ సుబ్రహ్మణ్యస్వామి భక్తుడు కావడి యెత్తికొని వాకిట వచ్చి నిలచుటయును సరిగ నుండెను. నానారీతుల నెదురు దెబ్బలు తగిలి గాయపడిన నాకు ఆ దృశ్యము మిక్కిలి యూరట కలిగించెను. "తిరుమురుగాట్రుప్పడై పూర్తి చేసితిమి. జగద్రక్షకుని దివ్యానుగ్రహ మీ పని పూర్తిచేయించు ననుటకు సూచనగా నీ దృశ్యము కాంచుచున్నాము" అని నాలోని యానందావేశము పొంగుచుండ నాతోడ నున్న మిత్రుల జూచి చెప్పితిని.

"మంచి శుభశకునమే" అని వారును ఆమోదించిరి.

# 49. ఖండనాల సుడిగాలి

జీవకచింతామణిగ్రంథము తమిళదేశస్థుల యాదరమునకు పాత్రమాయెను. అందుండి పెక్కు విషయములు తెలిసికొనిన విజ్ఞానవంతులు నన్ను ప్రశంసించుటతో బాటు పత్తుప్పాట్టుముద్రణ కూడ త్వరలో నెరవేర్పవలె నని తెలియజేసిరి. జీవకచింతామణిపీఠికలోను గ్రంథము క్రింది టిప్పణియందును పుఱనానూఱు మున్నగు ప్రాచీనగ్రంథముల పేర్లు చూచిన వారు వాని నన్నిటిని ఒక దాని వెనుక నొకటిగ ముద్రింపవలె నని చెప్పి నా కుత్సాహ మొదవించుచుండిరి.

అట్లభిమానుల యాదర మెటు చూచినను పెరుగుచుండగ, ఒకవైపు అసూయా విష్టులగు కొందరి దుష్కృత్యములు తలసూపినవి. పెరవారిని ఖండించుటయందే యానందము పొందెడు కొందరు జీవకచింతామణిముద్రణనుగూర్చి పలు విధము లగు ఖండనములు చెప్పియు, వ్రాసియు, అచ్చొత్తించియు ప్రకటింప నారంభించిరి. వారు చెప్పిన తప్పులలో నిజమైన తప్పులుకూడ కొన్ని యున్నవి. అయినను వారి దృక్పథము తప్పులు దిద్దవలె నని కాదు ; ఎటులైనను ఖండనములు చేసి నా మతింపు తగ్గింపవలె ననునదే. ఖండనమందలి తీరు, నడకయు వారి మనస్సులోని క్రుళ్లను వెలువడజేసినదే గాని తమిళభాషాభిమానమును ప్రకటింపలేదు.

చింతామణి ప్రకటించిన కాలమందు తమిళదేశమున అట్టి గ్రంథశోధన యెంత నిస్తేజమై యుండె నన్న సంగతి తమిళప్రపంచము బాగుగ నెరుగును. అప్పుడు మిక్కిలి ప్రయాసపడి చేసిన యొక పనియందు పొరపా ట్లుండుట సహజమే. గ్రంథముద్రణవిషయమున రానురాను పాఠములు దిద్దుపాటగుటయు, సత్యమైన యర్థము తెల్లమగుటయు, క్రొత్త క్రొత్త సంగతులు తెలియవచ్చుటయు క్రొత్తవి కావు. ఎత్తుకొనగనే మొదటి ప్రకాశముననే సంపూర్ణముగ శుద్ధమగు ముద్రణను వెలువరచుట యన్నది దుస్సాధమైన పని. నా మొదటి ముద్రణలో దొరలిన పలు నెరసులను తరువాతి కాలమున నేనే మేరివేసి ముద్రించియున్నాను. క్రొత్త క్రొత్త విమర్శలు చేయుచుండునపుడు పొందెడు జ్ఞానముతో, ఎంతో కాలముగ తెలియని, దిద్దుపాటు కాని విషయములు దిద్దుటయు గలదు.

చింతామణిముద్రణమున నా యజ్ఞానముచే కొన్ని దొసగులు పొసగినవి. తిరుత్తక్కదేవరు మధుర కరిగి సంఘవిద్వాంసుల జూచి రని మొదటి ముద్రణలో వ్రాసియుంటిని. అది తప్పని తర్వాత తెలిసినది. జైనసంఘమునకు చెందినవారిని చూచి రను సత్యము తర్వాతి కాలపు పరిశోధనచేత తెలిసికొంటిని. ఇట్లే గ్రంథ నామము, రచయిత పేరు, మున్నగు పెక్కు విషయములందు తప్పైన సమాచార ములు చింతామణి మొదటి ముద్రణలో చూడవచ్చును. వానిని కాలక్రమమున దిద్దు కొంటిని. నే డున్న ఒక పాఠము రేపు దొరకెడు క్రొత్త పాఠమువలన అసంగత మగుటయు సంభవించును. మనుజుడు తన కున్న స్వల్పజ్ఞానముతో విమర్శించి నిశ్చయించుకొన్నదాని నెట్లు పరమసిద్ధాంతముగ చెప్ప వీలగును ?

అసూయాప్రేరితులగువారి కిట్టి విషయము లన్నియు గోచరము కావు. కుంబకోణమున పాఠశాలలో తమిళోపాధ్యాయులుగ నున్న మూవురు చింతామణి ఖండనమం దుత్సాహము పూనియుండిరి. వారు నానుండి యుపకారము లందినవారే. జైనకావ్యమును నే నచ్చొత్తించుట దోష మనియు, శైవమతాధిపతిసహాయము చేయుట త ప్పనియు, చింతామణియందు తప్పులు లెక్కకు మిక్కిలియై యున్న వనియు, అం దున్న దొసగులు కడలి యిసుములకంటెను, ఆకసమునందలి చుక్కలకంటెను అధికసంఖ్యాకము లనియు ఖండించుచు చిన్న కరపత్రికలు ప్రచురించిరి. మొదట ఎరవు తెచ్చికొన్న పేర్లతో ప్రచురించిరి. పిదప తమ పేర్లతోడనే ప్రకటించిరి. కుంబకోణమునందు వీథివీథులందును ఈ ప్రచురణలు పరపిరి. తిరుచినాపల్లి మున్నగు ప్రదేశములకుగూడ పంపి అచ్చటను వ్యాపింపజేసిరి.

ఈ ఖండనపు కల్లోలముల నడుమ నేను పత్తుప్పాట్టుశోధన జరపుచునే యుంటిని. 'కుడందై మిత్రన్' అను నొక పత్రిక కుంబకోణమందు కొన్ని దినములు నడచుచుండెను. అం దొకసారి నన్ను పొగడుచును, తరువాతి సంచికలో నన్ను తెగడుచును వ్యాసములు వచ్చును. నా మిత్రు లిట్టి ఖండనములు చూచి నాయెడ కొంచెమేని యవమతింపు కలిగియున్నట్లు తెలియలేదు.

నేను దేనికిని సమాధాన మివ్వకుండుట చూచి ఖండనకారులకు మరియు నధికకోపమే కలిగెను. 'జీవకచింతామణిముద్రణ దోషప్రకరణము' అను నొక ప్రచురణ వెలువడెను. తప్పులు కానివానినిగూడ అందులో తప్పులని చెప్పియుండిరి. వానికి సమాధానము చెప్పియే తీరవలె నను భావము నాకు పుట్టెను. ఒకనాటి రాత్రి నాల్గవ జామున లేచి సమాధానము వ్రాయుచుంటిని. మనస్సు మిక్కిలి ఖేదపడెను. అప్పుడు బుడుబుడుక్కలవాడు ఒక్కడు వీథిలో "అయ్యా, మీకు క్షేమము కలుగును ; దిగులు పడవలదు." అని తన యలవాటు చొప్పున చెప్పిపోయెను. వా డలవాటుప్రకారము చెప్పినను నా కది విశేషసూచనగ తోచెను. ఒకవిధముగ సమాధానము వ్రాసి ముగించితిని. తెల్లవారెను.

కాలకృత్యములు తీర్చుకొని పిమ్మట నేను వ్రాసిన సమాధానపత్రిక నెత్తుకొని, సాధు శేషయ్యరు వద్ద కేగితిని. ఖండనమునకు నేను వ్రాసిన సమాధానమును వేరొకరు

చూచిననే దాని బాగోగులు తెలియును అను భావముచేతను, నాయెడ మిక్కిలి యభిమానముగల వారు ఏదేని యోచన చెప్పగలవా రను తలపుచేతను వారియెడ కరిగితిని.

నేను వ్రాసి కొనిపోయిన కాగితములు వారి చేతిలో పెట్టి "చింతామణిని గూర్చిన ఖండనము లెచ్చోటను విహారము సలుపుచుండుట మీకు తెలిసిన విషయమే. దూషణలకు (తిట్లకు) సమాధానము చెప్పుట సాధ్యము కాదు. తప్పు లని చెప్పబడినవానికిమాత్రము నాకు తోచినంతలో సమాధానము వ్రాసియున్నాను. తిలకింపవలెను" అంటిని. వారు తీసికొని చూచిరి. నా రేమి చెప్పుదురో యని నేను కుతూహలముతో నెదురుచూచుచు నిలిచియుంటిని.

వారు వెంటనే దాని నట్లే చించివేసి ప్రక్కనున్న పెంటబుట్టలో పడవేసిరి. నా కేమియు తోపలేదు; కలగితిని. వారు నన్ను చూచి మిగుల నయమైన కంఠ స్వరమున చెప్ప నారంభించిరి. "నేను చించివేసినదానినిగూర్చి విచారపడవలదు. మీరు సమాధానము వ్రాయుట యను పనినే పెట్టుకొనరాదు. కొందరు మిమ్ము దూరుచు తిరుగాడుటయు, ఖండనములు ప్రచురించి యుండుటయు మాకు తెలిసినదే. అట్లు చేయువారు ఫలానావా రనిగూడ నేను బాగుగ నెరుగుదును. వారి చర్యలవల్ల నా బోంట్లకుగాని, విద్యార్థులకుగాని, తక్కిన మిత్రులకుగాని మీయెడ మనసులో నన్యథాభావము కలిగినదా? అణువంతైన లే దనుట నిక్కము. అట్లుండ ఈ విషయమునుగూర్చి యోచించి మీరు విచారపడుట అనవసరము. దీనికి మీరు బదులు వ్రాసినచో మీ యెదిరిపేరు ప్రసిద్ధికి వచ్చును. మీ బదులుకు సమాధానము వారు వ్రాయుదురు. మీరు మరల వారి ఖండనమునకు ఖండనము వ్రాయవలసి వచ్చును. ఇట్లే మీకాలమెల్ల వ్యర్థమైపోవును. మంచిపని కెన్నేని విఘ్నములు వచ్చుట లోకధర్మము. విదేశములందును ఇట్టి కొరగాని పనులు జరగుట కలదు. దానిని తగుపెద్దలు సరకుసేయరు. మీ నెమ్మదియగు కాలమును ఇట్టి పనిలో పోగొట్ట వలదు. ఇక నెవ్వరేని దూషించినచో బదులు వ్రాయను అని నాకై శపథము చేయుడు" అని పలికిరి.

మొదట ఖండనమునకు సమాధానము వ్రాయకయే యుండిన నేను, బాగుగ నాలోచించియే దానిని వ్రాసితిని. తీరుమానముతో చేసిన యొక పని వమ్మైపోవుట యున

కొంచెము మనసు ఖేదపడుట సాజమే కదా? కొంచెమైనను యోచింపక చించి పార వేసినారే! అని తలంచితిని.

"ఏ మాలోచించుచున్నారు? మీ రింకను పెక్కు మంచిపనులు చేయవలెను. అందు కీ విషయము లన్నియు నడ్డంకులై నిలుచును. ఈ ఖండనము నేడుండును. రేపు మరుగున పడిపోవును. మి మ్మెదిరించువారు మనసు మార్చుకొని మీయెడ ప్రేమ చూపు కాలమును రావచ్చును. వారు తమ దుశ్చర్యల తలచుకొని తామే పశ్చాత్తాపము పొందినను పొందవచ్చును. కావున ఈ ఖండనసమరమున మీ రడుగిడవలదు. మీరు మీ తమిళభాషాసేవ చేయుచునే యుండుడు. దైవము మిమ్ము కాపాడును" అని వారు మరల నొక్కి చెప్పిరి.

ఆ మాటలు నా కూరట కలిగించినవి. "నే నిక దూషణల లక్ష్యపెట్టను. వానికి సమాధానము వ్రాయ బూనుకొనను." అని నాడు వారియెదుట శపథము చేసితిని. ఇప్పుడు, కడచిన కాలమును, నడచుకాలమును చూచునపుడు 'ఆ మహా ప్రజ్ఞాశాలి యాడిన అమూల్యములగు పలుకు లెంత విలువగలవో తెలిసికొనుచున్నాను. తమిళమాతశ్రీపాదసేవలో నేను చేయు పొరపాట్లు కాలము కడచుకొలది దిద్దుకొనవచ్చును. ఆ సేవపై మతింపు చూపక, అల్పజ్ఞుడనగు నన్నుమాత్ర మగ్గముచేసి విసరు దూషణబాణములను నే నెన్నడును సరకుచేయులేదు. మందమారుతము, శ్రీగంధము పుట్టినచోట పెంపారిన తమిళము లాలిత్య మాధుర్యములు నిండారినది. ఆ చెందమిళదేవతశ్రీకైంకర్యమే జీవితప్రధాన లక్ష్యముగ నిడుకొన్న నా యెడ లోకరీతిగ వచ్చి మోదెడు భయంకరకల్లోలము లెల్ల ఆ దేవతచల్లనిచూపుచేత కొంచెమేని దుఃఖమును కలిగించుటలేదు. వారు ఈ నిందావాక్యములు వ్రాసి వెలువరచి తృప్తి పొందుచున్నారు. వారు తృప్తులై యుండుట జూచి మనముగూడ సంతోషింతము- అని ప్రశాంతి నొందు స్వభావమును నేను పెంపొందించుకొనుచున్నాను. ఆ స్వభావము బాగో, ఓగో తెలియదు; అందుచే నా మన స్సుత్సాహము చెడక పై పై సేవచేయు పూనికి పొందుచున్నది. ఇది చేతికందిన ఫలము. దీనికి మూలకారణము సాధు శేషయ్యరే అని నే నెన్నడును మరవను.

# 50. 'పత్తుప్పాట్టు' ప్రచురణ

పత్తుపాట్టు ముద్రించు సందర్భమున డబ్బు కిబ్బంది యేర్పడిన నేమి చేయుటయా అను నాలోచన నా కేర్పడినది. చింతామణికై చేసినట్లే ఇప్పుడును మిత్రుల యెడ సంతకములు తీసికొందమని తలచి ఒక పత్రిక అచ్చొత్తించి పలువురికి పంపితిని.

పెక్కురు మిత్రులు ఆర్థికసహాయము చేసిరి. రెండువందల రూపాయలు వరకు చేరినవి. అప్పుడు కుంబకోణమున నున్న నొక్క ఘనుడు "కళాశాలపండితులు స్వామినాథయ్యరు పత్తుప్పాట్టు ముద్రింతు నని చెప్పి సంతకములు పుచ్చుకొనుచున్నారు. ఇది ధనార్జనోపాయ మని తోచుచున్నది" అని చెప్పినట్లు నా చెవిని పడెను. అది మొదలు సంతకముల సేకరణ మానుకొంటిని.

1888 వ సంవత్సరము డిసెంబరు నెల 11 వ తేది మంచి దినముగ నుండినది. మా నాయనగారియొద్దను, ఇతరులయెడను అనుజ్ఞ పొంది తిరువావడుదురకు చేరితిని. అచ్చట ఆధీనాధ్యక్షులగు అంబలవాణదేశికులు నా ప్రయత్నము తెలిసి యానందముతో నాకు ప్రోత్సాహము కలిగించు మాటలు పలికి అరువది రూప్యములు రొక్క మిచ్చి చెన్నపట్టణమునకు పంపిరి.

మరుసటి దినము నేనును, కృష్ణయ్యరును చెన్నపట్టణముచేరి సేలం రామస్వామి మొదలియూరు బంగళాలో విడిసితిమి. వా రప్పుడు అలహాబాదుకు పోయి యుండిరి. కొని పోయిన సామాను లన్నియు వారి బంగళాలో పెట్టి నా మిత్రుల జూడబోతిని. తేరళందూరు రాజగోపాలాచార్యులను జూచి నేను వచ్చిన పని చెప్పి, ముద్రణాలయము నేర్పాటు చేయవలసిన దని కోరితిని. వారు చింతామణి ముద్రించిన ద్రావిడరత్నాకరముద్రాక్షరశాలయందే యివ్వవచ్చు ననగనే అచ్చోటనే ముద్రింప నేర్పరచుకొంటిని.

ముద్రణాలయపు అధిపతులు వ్రాతప్రతి చూచి "చింతామణియందుకంటె ఇందు పని యధికముగ నున్నది. ఇందుకు హెచ్చుకూలి యివ్వవలయును" అని యడిగిరి. అలవడినచో టను తలంపుతో నట్లే చేయున ట్లొప్పుకొంటిని.

పత్తుప్పాట్టుమూలప్రతినే చూడనట్టి నేను చెన్నపట్టణమున ఇంక నెందేని విద్వాంసుల యిండ్ల తాటాకులు దొరకునా యని విచారించుచుంటిని. అప్పుడు నా కొక పండితప్రవరుల జ్ఞప్తి వచ్చెను.

పెక్కేండ్లకు మునుపు మైలాపూరులో 'తిరువంజలత్తిన్నముదం పిళ్లె' అను ఒక గొప్ప విద్వాంసు లుండిరి. పిళ్లెగారు బాల్యమున చెన్నపట్టణమునకు పోయియున్నపుడు ఆ పండితులయొద్ద కొన్ని గ్రంథములు పాఠము చదివిరి. వారి యొద్ద పెక్కు తాళపత్రగ్రంథము లుండిన వని మా యాచార్యులు చెప్పియుండిరి.

ఈ సంగతులు నాకు జ్ఞప్తి వచ్చిన వెంటనే 'మైలాపూరులో వారు వసించు చుండిన యి ల్లెచట నున్నది? వారి సంతతివా రెవ్వ రున్నారు?' అని 'వాకబు' చేయ దొడిగితిని. వా రెట నుండిరో తెలిపెడివా రొక్కరును లేకుండిరి. ఆకాలమున మైలాపూరులోని తిరువణ్ణామలై మఠమునందు శరవణస్వామివా రను నొక సన్యాసి యుండిరి. వారు తమిళపండితులు; వైద్యమందు ఎనలేని ప్రావీణ్యము గలవారు. ముదిపాయము వారగు ఆ విద్వాంసుల నడిగినచో నేదేని వివరము తెలియవచ్చు నని కొందరు చెప్పగ ఆ మఠమునకు పోయి ఆ పెద్దల జూచితిని. తిరువంజలత్తిన్నముదం పిళ్లెనుగూర్చి విచారించితిని. మంచికాలము! ఆ విద్వాంసులు తమకు తెలిసినవా రనియు, వారికి సంతానము లే దనియు, వారి తాటాకు పుస్తకము లన్నియు 'మందైవెళి' (మంద వల్లి)లో నున్న అణ్ణాస్వామి ఉపాధ్యాయుల యింటిలో నొకవేళ దొరకవచ్చు ననియు ఆ పెద్దలు చెప్పిరి. మందైవెళికి పోయి అణ్ణాస్వామి ఉపాధ్యాయుల యిల్లు వెదకి కనుగొంటిని. వారు కాలమైపోవుటచేత వారి యల్లుడుగారినే నే చూడ వలనుపడెను. వారి వేళ యరసి తగు మనుష్యులతో పోయి యడిగినప్పుడు తమ యింటిలో నుండు తాటాకుప్రతులన్నియు ముందు పెట్టిరి. వానిలో అసంపూర్ణమగు పత్తుప్పాట్టు వ్యాఖ్యానప్రతి యొక్కటి లభించెను. తిరుమురుగాట్రుప్పడై వ్యాఖ్యానప్రతి

యొక్క టుండెను. వానిని మరి కొన్ని చిన్న గ్రంథములను తీసికొంటిని. పదినెణ్ కీళ్ కణక్కు పూర్ణముగ నున్న శిథిలప్రతి యొకటి లభించెను. అందే 'కైన్నిలై' అను గ్రంథ ముండినది.

తరువాత 'పోస్టలు సూపరింటెండెంటుగ' నుండిన వి. కనకసభైపిళ్లెయొద్ద పత్తుప్పాట్టువ్యాఖ్యానప్రతి యొకటి లభించెను. వీని నన్నిటిని ఉపయోగించు కొంటిని.

పత్తుప్పాట్టు ముద్రింప నారంభించితిని. పని కడు వేగిరముగ జరగుచుండెను.

పూండి రంగనాథమొదలియారువద్దకు తేపతేపకు పోయి మాట్లాడి పరిచయము చేసికొంటిని. ఈసారి వారితోడి పరిచయము మిక్కిలి వృద్ధి పొందెను. వారి యెడకు పోయినచో తమిళపద్యములు చెప్పుటయు, ద్రావిడకవులగూర్చి సంభాషించుటయు నగు నిట్టి పనులతోడనే కాలక్షేప మగును. ప్రొద్దు గడచుటే తెలియక, ఆహారమే మరచి ముచ్చటించుకొనుచునే యుందుము.

ఆ రోజులలో మొదలియారు 'కచ్చికలంబకమ్' అను నొక ప్రబంధము రచించుచుండిరి. అందుచేత 'కలంబక'ముల లక్షణమునుగూర్చి మే మధికముగ మాట్లాడుచుందుము. నేను పిళ్లెగారు వ్రాసిన కలంబకములనుండియు, వారియొద్ద నేర్చిన కలంబకములనుండియు పలు పద్యములు చెప్పుదును. పద్యములో నిదియే సార మని క్షణములో తెలిసికొని సంతోషించు సామర్థ్యము రంగనాథమొదలియారెడ మిక్కిలి యధికముగ నుండెను. వారు 'ఏకసంధాగ్రాహి'. వారు విప్పారిన మోముతో పద్యములు వినుటయు, ఆలకించునపుడు తమ మనస్సంతయు ఆ పద్యభావమునందే లగ్న మొనర్చుటయు, అటనట నయగారము కనుపించుచోటుల ఆనందించుటయు, అట్టి యానందమును స్పష్టముగ తెలియజేయుటయు వారితో అలవడు కాలమును ఆనందమయ మొనర్చినవి. "మీవంటివా రీ యూరిలో నున్నయెడల బాగుగ ప్రొద్దు పోవును" అని వారు సారెసారెకు చెప్పుదురు.

కాలేజికి విరామదివసము లన్నియు గడచిపోయినందున జనవరి నెల నేను కుంబకోణమునకు బయలుదేరవలసినవాడనుగ నుంటిని. అ ట్లగుట ముద్రణశాల యం:దు పని యడ్డులేక సాగుటకై యేర్పాటు చేసి, తిరుమానూరు కృష్ణయ్యరును

చెన్నపట్టణమందే యుంచి నేను కుంబకోణము వచ్చిచేరితిని. రెండు మూడు దినములు ఆటవిడుపు లభించినను చెన్నపట్టణమునకు పోయి యుండి పత్తుప్పాట్టు ముద్రణ గమనించివత్తును.

పూండి రంగనాథమొదలియారు అడుగడుగున నాకు జాబులు వ్రాయు చుండిరి. వచనములుగను, పద్యములుగను లేఖలు వచ్చిపోవుచుండెను. ఒక పర్యాయము వారు నాకు "మీరు చెన్నపట్టణమందలి ప్రెసిడెన్సీ కాలేజికి వచ్చినచో మీ ప్రచురణకార్యములు చక్కగ నడచును. మంచి సౌకర్యములును లభించును. నాకును తృప్తిగ నుండును. మీ సమ్మతి తెలియజేసినచో దానికై వలయు జతనము లొనర్తును." అని వ్రాసియుండిరి. మొదలియారుకు మదరాసులో నున్న పలుకుబడి నేను బాగుగ నెరుగుదును. వారు మనసు పెట్టినచో మిక్కిలి యనాయాసముగ నన్ను ప్రెసిడెన్సీ కాలేజికి మార్చునట్లు చేసివేయగలరు. నాకును చెన్నపట్టణమునకు పోవుటయం దభిలాష యుండెను. నేను పూనుకొనియున్న తమిళ గ్రంథప్రచురణకు చెన్నపట్టణవాస మెంతయో ఉపకారముగ నుండును. కుంబకోణమునందే యుండి చెన్నపట్టణమున ముద్రణము వడిగ నడిపింప వీలుకాలేదు. కాబట్టి 'భగవత్కృప రంగనాథమొదలియారురూపమున ప్రేరేపించుచున్నది.' అనియే మొదట నెంచితిని. తిరువావడుదురైతోడి సంబంధము వీడిపోవునే యను తలపు వచ్చి ఆ భావమును మార్చినది. సుబ్రహ్మణ్యదేశికులు నన్ను కుంబకోణమునకు పంపినపుడు "ఇట్లే పట్టణమునకును పోయి మహాలింగయ్యరు, విశాఖప్పెరుమాళయ్యరును నుండిన చోట నుండి వెలుగొందవలెను." అని కూరిమితో దీవించుట నా మనస్సున నప్పుడు తోచెను. పెద్దవారు ప్రేమ మీర పలికినది ఫలింపవచ్చును. అది ఫలించు కాల మిదిగా నుండవచ్చును' అని తలచితిని.

రంగనాథ మొదలియారు వ్రాసిన లేఖ మా తండ్రిగారికి చదివి వినిపించితిని. వారు "మంచిదే. కాని ఇక్కడ ప్రాప్తమగు కావేరీస్నానమక్కడేదీ? నేను రైలు బండి యెక్కుట లేదే? ఈ వార్ధకమున కావేరీతీరమును వదలిపోవుటకు నా మనస్సొప్పకున్నదే!" అని చెప్పిరి. ఆ మాటలు పలు భంగుల తోచిన నా యాలోచనలను మార్చివేసినవి. నే నొక తీర్మానమునకు వచ్చితిని. "మా యయ్యగారి ముదిమి ప్రాయము నుద్దేశించి ఇచ్చటనే యుండు టావశ్యకమై యున్నది" అని మొదలి-

యారుకు వ్రాసితిని. ఇది 1889 వ సంవత్సరము మార్చి నెల ఆరంభమున జరగి-నది. ఏప్రిల్ నెల విరామములో నేను చెన్నపట్టణమునకు చనినపుడు మా నాయనగారి యభిప్రాయమును మొదలియారుకు వివరించి చెప్పితిని. వా రొప్పుకొనిరి.

పత్తుప్పాట్టుగొప్పతనము నెరిగిన రాజగోపాలాచార్యులు అం దున్న విశేష పదములను, విలక్షణసమాసములను, అకారాదిక్రమముగ జేర్చి ప్రచురింపవలె నని చెప్పి 'అకారాది' (అనుక్రమణిక) సిద్ధముచేయు సాధనమైన పెట్టె యొకటి కొని వచ్చి అకారాద్యనుక్రమణిక సిద్ధపరచు రీతి చూపిరి. మిక్కిలి సులభముగ అకారాద్యనుక్రమణి ముగియుట చూచి ఆ పెట్టెవంటిది రెండు పెట్టెలు చేయించు కొంటిని. అది మొదలు అకారాద్యనుక్రమణిక వ్రాయుటయన్న కొంచెమేని శ్రమలేని కార్యమై పోయెను.

భగవంతుని దివ్యానుగ్రహమున 1889 వ సంవత్సరము జూన్ మాసమున పత్తుప్పాట్టు అచ్చుయి పూర్తి యాయెను. ఆరే నెలలలో ఆ గ్రంథము పూర్తి యగు-టను గూర్చి నాకు కలిగిన తృప్తికి మితియే లేదు.

# 51. శిలప్పదికార విమర్శనము

పత్తుప్పాట్టుప్రచురణయందు ఆరంభమున పీఠికయు, తరువాత గ్రంథము మూలము నచ్చినార్కినియరు వ్యాఖ్యయు, వ్యాఖ్యాప్రశస్తి పద్యములును, విశేషపదవివరణయు, విశిష్టసమస్తపదవివరణయు, తప్పొప్పుల పట్టికయు నుండినవి.

మున్నుడియందు పత్తుప్పాట్టులోని పది గ్రంథముల సాధారణవిశిష్టతయు, ఒక్కొక్క ప్రబంధముచరిత్రయు, తాళపత్రపుస్తకాన్వేషణవివరణయు, ఉప కారము చేసినవారి పేర్లను వ్రాసితిని. పిమ్మట శిలప్పదికారము ప్రకటింపదలచి యుండుటయు తెలియజేసితిని.

ఒకవిధముగ భగవత్కృపచే నెరవేరిన పత్తుప్పాట్టు తమిళదేశస్థుల శ్లాఘకు పాత్ర మయ్యెను. అరుదగు పెక్కు చారిత్రికాంశములును, పురాతనకాలపు తమిళుల నాగరకస్థితియు నందుమూలమున తెలియవచ్చెను. పత్తుప్పాట్టును ఆధారముగ కొని పెక్కు విమర్శలు చేయవచ్చును" అని విజ్ఞులు కొనియాడిరి.

అప్పుడు పూండి రంగనాథమొదలియారు తాము వ్రాసిన కచ్చిక్కలంబక మును అచ్చొత్తించి కొందరు పండితుల మూలమున చెన్నపట్టణము తొండైమండలము తుళువేళాళజాతివారి కళాశాలయందు 'సభారోహము' జరిపించిరి. నేనును వచ్చి కొన్ని పద్యములు ఆ ఆమోదసభలో చదువవలె నని వారు నాకు వ్రాయుట చేత 1889 వ సంవత్సరము అక్టోబరునెల ఒక పర్యాయమును, నవంబరుమాసమున మరియొకసారియు చెన్నపట్టణమునకు పోయి కొన్నాళ్లుండి, ఆ కలంబకమందలి కొన్ని పద్యములకు సభారోహణము కావించి వచ్చితిని. ఆ గ్రంథావిష్కరణోత్సవము నడచిన కాలమున దానిని విన వందలకొలదిగ జనులు కూడిరి. నేను చదివి యున్న ప్రబంధములును, ఇతరగ్రంథములును మిక్కిలి యుపయోగపడినవి. రంగ నాథమొదలియారుతోడి పరిచయము మిగుల దృఢపడుటతోబాటు ద్రావిడభాషాభిమానులు పలువురి పరిచయముకూడ క్రొత్తగ నా కేర్పడినది. రంగనాథమొదలియారుగారి పలుకుబడియు, గ్రంథావిష్కరణోపన్యాసమును కలిసి నాకు పలుతీరుల శ్రేయముల నొడగూర్చినవి.

'కొళంబుత్తురై' (కొలంబోతీర) వాసులు మిత్రులు నగు తి. కుమారస్వామి చెట్టియా రనువారు అడుగడుగున తమ ప్రేమ వ్యక్తము చేయుచు నాకు లేఖలు వ్రాయుచుండిరి. కొళంబుత్తురుకు చెందిన 'ఇలందైనగర' మను చోట ఒక దేవాలయము కట్టించి, అందు 'దండపాణి' స్వామిని (మూలమూర్తి) ప్రతిష్ఠించి, ఉత్సవమూర్తి మొదలగువానిని వా రమర్చిరి. ఆ యిరువురు మూర్తుల విషయమున కొన్ని పద్యములు వ్రాసి యివ్వవలె నని కోరుచు నాకు వ్రాసిరి. వారి యిచ్ఛానుసారముగ దండపాణివిషయమున పది వృత్తములును, ఉత్సవమూర్తియగు శ్రీ ముత్తుకుమారస్వామివిషయమున ఒక లాలిపాటయు, హెచ్చరికయు, ఐదు కీర్తనలును రచించితిని.

మిత్రుల ప్రశంసచే కలిగిన సంతోషమందు శిలప్పదికారపరిశోధన యారంభించుటచేత మనసు త్వరితముగా పరుగులిడినది. కాని తాళపత్రము లా యుత్సాహమున కనువుగ లేవు. మొట్టమొదట నాకు సేలం రామస్వామి మొదలియారు శిలప్పదికారము మూలము, వ్యాఖ్యానమును ఉన్న కాగితపుప్రతి యొక్కటి యిచ్చిరి. దాని పిమ్మట పిళ్లెగారి మూలప్రతి యొక్కటియు, వ్యాఖ్యాన ప్రతి యొక్కటియు లభ్యమైనవి. త్యాగరాజచెట్టిగారి ప్రతి యొక్కటి నాయెడ నున్నది. వీనితోబాటు కొన్ని యితరప్రతులను పెట్టుకొని యుంటిని. ఇన్ని యుండియు నా పరిశోధన కుంటువడుచుండుటకు పెక్కు కారణము లుండెను.

లభించిన యన్ని ప్రతులను శోధించి చూచితిని. అడియార్కునల్లారు వ్యాఖ్య ఒక పెద్ద సముద్రమై యుండెను. నైసర్గికము, సాంగీతికము, నాటకీయము అను ముత్తెరగుల తమిళమున నున్న పలు గ్రంథములను రత్నశాస్త్రము, యోగము మొదలగు కలాలక్షణములను వా రచ్చటచ్చట ఉద్ధరించి చూపుదురు. నచ్చినార్కిని యరులో కనుపడని యొక మంచి గుణము అడియార్కునల్లారులో చూచితిని. ఉదాహరణము లిచ్చు గ్రంథము పేరును, కొన్నియెడ దాని చరిత్రయు వీరు వివరింతురు. జీవకచింతామణివ్యాఖ్యయందును, పత్తుప్పాట్టువ్యాఖ్యయందును "అని పెరవారు ననిరి" అని చూచి, ఆ పెరవా రెవ్వ రని వెదకి వెదకి శోధించి, దొరకినవానిని తెలిసికొనుటకై నేను పడిన ప్రయాస యింతింతని చెప్ప నలవికాదు. ఆ ప్రయాస అడియార్కునల్లారు పెట్టలేదు. ఆ మహోపకారపు విలువ విమర్శకులు బాగుగ నెరుగుదురు.

శిలప్పదికారమున ముప్పది గాథ లున్నవి. అందులో నేడవదగు 'కానల్‌వరి' కిని, ఇరువదియవదగు 'వళక్కురైగాథ' మున్నగు పదునొకండు భాగములకును అడియార్కునల్లారు వ్యాఖ్య దొరకలేదు. శిలప్పదికార మంతటికిని 'విశిష్టపద టిప్పణి' యొక టున్నది. దాని ప్రతి యొక్కటి నా మిత్రులు తేరళుందూరు చక్రవర్తి రాజగోపాలాచార్యులుగా రిచ్చిరి. అది మిక్కిలి శిథిలమై యుండెను. అడియార్కు నల్లారు వ్యాఖ్యకంటెను అది పూర్వపు దని కొన్ని గుర్తులచే తెలియ వచ్చెను. అయినను నాయెడ నున్న ఆ ప్రతిని గొని గ్రంథమునర్థము

తెలిసికొనుట కడు దుష్కరకార్యము. అడియార్క్కునల్లారువ్యాఖ్యయందలి కొన్ని చోట్లు తేటపడుటకు విశిష్టపదటిప్పణియందలి సూచనలు బాగుగ నొదవినవి.

అడియార్క్కునల్లారు తమ వ్యాఖ్యానమం దొక్కచోట 'కానల్‌వరియందు విపులముగ చెప్పుదు' మనియు, కానల్‌వరికి పిమ్మట నొకచోట 'మునుపు 'అణి' యనుదానిలో చెప్పితిమి' అనియు వ్రాసియున్నారు. వానిని చూచినపుడు వారు కానల్‌వరికి వ్యాఖ్య వ్రాసి యున్నా రని నిశ్చితముగ తెలిసెను. ఇతరస్థలముల 'అళర్పడు గాథ' యందు విపులముగ చెప్పెదము. 'కట్టురై గాథ' యందు విస్తరించి చెప్పుదుము' అనియు వ్రాసి యుండుటవలన వెనుకనున్న గాథలకును వ్యాఖ్య వ్రాసి యుండవచ్చు నని తోచెను. కాని మరల తమిళతాళపత్రములు వెదకెడి యాత్ర పూని శిలప్పదికారప్రతులు కనిపెట్టవలయు నని నిశ్చయము చేసికొంటిని.

వ్యాఖ్యయందలి కొరత ఒక వై పుండగ, అందు వచ్చు సంగీతనాటక భాగములు ఈ కాలమున అలవాటులో లేనివై యుండెను. వానిని చక్కబరచుటకు చాలకాలము పట్టు నని జంకితిని. "దేనిని తాకినను శ్రమపై శ్రమగ నున్నదే" అను తలపు కలిగెను.

అంతవరకును వెదకని ప్రదేశములకు పోయి చూడవచ్చు నను భావము కలుగగనే "సేలమునకు చెందిన ప్రదేశముల తమిళగ్రంథములు దొరకవచ్చును. శిలప్పదికారపు టుత్తరభాగమునకు వ్యాఖ్య దొరకలేదు. 'తంజైవాణన్‌కోవై'కి వ్యాఖ్య వ్రాసిన 'చొక్కప్పనావలర్' మున్నగు పండితులు సేలమునం దుండినట్లు వినికిడి. వారి వంశమువా రున్నచో తెలియజేయ వేడుకొందును. అక్కడ వెదకి చూచిన ఏవైనను దొరకవచ్చును. తమ సహాయము కావలెను" అని సేలం రామస్వామి మొదలియారుకు వ్రాసితిని.

వారియొద్దనుండి అనుకూలమగు ప్రత్యుత్తరము వచ్చెను. ఒక నిర్ణీతకాలమున శిలప్పదికారగ్రంథసంబద్ధయాత్ర మొదలిడి సేలమునకు బయలుదేరితిని.

# 52. పలు గ్రామములకు పయనము

నేలమునకు చేరితిని. రామస్వామి మొదలియారుసహాయముచే నా ప్రయత్నము సుకరముగ నెరవేరు నని సంతోషపడితిని. చొక్కప్పనావలరువంశమునకు చెందినవా రెవ్వ రున్నారా యని విచారింపగ ఒక్క రుండుట తెలిసినది. వారి యిల్లు వెదకికొని పోయితిని. నే ననుకొన్నట్లే అచ్చట పెక్కు ప్రాత తాటియాకుప్రతు లుండినవి. కడు సంభ్రమమున వానిని పొర్లించి చూచితిని. చాల భాగమువరకు తాటాకుప్రతులు శిథిలమయియు, ఆకులు తగ్గియు, విరిగియు, ఎడనెడ రూపరియు మిక్కిలి ఖిలములై కనిపించినవి. వానిలో నాకు కావలసిన దేదియు దొరకలేదు. కంబరామాయణము ఏడు కాండలును వేర్వేరుగ నున్న యేడు ప్రతులు దొరకినవి.

నేలమునకు చెందిన శూరమంగళమున 'ఆఱుముగంపిళ్లె' అను సిద్ధవైద్యు లొక్క రుండిరి. వారి యింటిలో లెక్కలేనన్ని తాటాకు పొత్తము లున్న వని విని యటకు పోయి చూచితిని. వారు మిక్కిలి చురుకుగ నుండిరి. మోమున మంచి తెలివి యుండెను. "మీ ప్రాయ మెంత ?" అని నే నడిగితిని. 97 అనిరి. నే నాశ్చర్యమున మునిగితిని. ఎంత హెచ్చుగ అనుకొనినను అరువదేం డ్లుండవచ్చు ననియే మతింపు వేయదగిన ట్లుండినది వారి యాకృతి.

వారు తమ యింట ప్రత్యేకముగ నొక గదిలో తాటాకుపొత్తము లను చక్కగ సవరించి పెట్టియుండిరి. లోన చొరబడినప్పుడు ఐదు నూర్లకు తగ్గని తాటాకుప్రతు లుండవచ్చు నని తెలిసెను. "వీనిలో ప్రాతప్రతు లేవేవి యున్నవి?" అని యడిగితిని.

"అన్నియు ప్రాచీనపుస్తకములే. అగస్త్యులు వ్రాసిన గ్రంథములు మొదలు కొని యన్నియు నున్నవి."

అగస్త్యు లన్నవెంటనే వారు రచించిన 'అగస్త్యము' అను పెద్ద లక్షణగ్రంథమే స్మరణకు వచ్చెను. "ఏదీ, ఆ తాటాకుప్రతి వెలికితీయుడు" అని చెప్పి కూర్చుంటిని.

వా రేదో యొకటి యెత్తి యిచ్చి "మా కుటుంబము తరతరాలుగ ఈ తాటాకు పుస్తకములు కాపాడుచు వచ్చుచున్నది. మిక్కిలి యరుదగు ప్రతు లివి. ఇక్కడ నున్నవానిని మరెక్కడనైనను చూచు టరుదు" అనిరి.

నేను తాళపత్రములు విప్పి చూచితిని. అక్షరములు మిగుల స్పష్టముగ నుండెను. ఆకు పైభాగమున 'అగత్తియర్ పూరణమ్'వంటి దేదో ఒక పే రుండెను లోపలి ఆకులు త్రిప్పి చూచితిని. అది వైద్యగ్రంథ మై యుండెను. అగస్త్యరచిత మని ప్రచారములో నున్న పలు గ్రంథము లుండెను. అన్నియు వైద్యగ్రంథములే. కొన్ని తాటాకుప్రతులు చూచి విసిగితిని.

"లక్ష్య లక్షణ గ్రంథముల ప్రతు లేవియు లేవా?" అని ఆతురముగంపిళ్లె నడిగితిని. వారు లే వని బదులు పలికిరి. నేను మాటాడక వచ్చిన త్రోవనే మరలి పోయితిని.

ఈ ప్రయాణమందు ఏదియు నగుపింపకపోవగనే కుంబకోణము వచ్చి చేరితిని. ఎట్లైనను మంచి శిలప్పదికారప్రతులు దొరకిననేగాని నాకు నిద్దురే రా దని తోచెను. మరల పాండ్యదేశమునకు పోయి తాటాకు ప్రతులు వెదకవలె నని నిర్ణయించుకొంటిని. కాలేజిపనితోబాటు తాళపత్రగ్రంథాన్వేషణమును సాగించుట శ్రమావహముగ నుండెను. తిరునెల్వేలి ప్రాంతములకు పోయినచో కొన్నాళ్లు సావకాశముగ వెదకవలెను. కాలేజిపని దాని కవకాశ మివ్వకుండుటచేత ఒక్కొక్క ప్రదేశముగ వెదకవలె నని తలచి యొకసారి 'కరివలం వంద నల్లూరు'కు బయలుదేరి పోయితిని. సుబ్రహ్మణ్యదేశికు లున్న కాలమున ఆ యూరికి మును పొకసారి పోయి యుంటిని. వరగుణపాండ్యుల తాటియాకుపుస్తకము లన్నియు ఆలయమున నుంచి యున్నట్లు విని యుంటిని. ఆ జ్ఞప్తిచేతనే యా స్థలమునకు రెండవసారి యేగితిని.

తిన్నగ గుడికి చేరి 'పాల్వణ్ణనాథుల' సన్నిధి కరిగితిని. వరగుణపాండ్యులు మిక్కిలి సులభశైలిలో మనసు కరగించు తీరుగ పాడిన పాటలు ద్రావిడాభిమానులకు ఆ స్వామివారి జ్ఞప్తి కలిగించును. సన్నిధిలో నిలిచి "నీ యనుగ్రహమే నాకు తో డని నమ్మి భాషాసేవ చేకొనియున్నాడను. శిలప్పదికారప్రతి దొరకునట్లు చేయవలెను." అని వేడుకొంటిని. పిదప తాటాకుప్రతు లెక్కడ నున్న వని విచా

రింప నారంభించితిని. దేవస్థానధర్మకర్తను వెదకుచు పోవునపుడు వారికి సంబంధించినవారి నొక్కరిని చూచితిని. "వరతుంగ రామ పాండ్యులకు ప్రతి సంవత్సరము ఆలయవ్యయముతో శ్రాద్ధము నడచుచుండునట్లు విని యుంటిని. అది నడచుచున్నదా ?" అని యడిగితిని. నడచుచుండునట్లు వారు చెప్పిరి.

నేను : వరగుణపాండ్యులు కాపాడుచుండిన తాళపత్రగ్రంథము లన్నియు దేవాలయమం దున్న వట గదా ?

వారు : అదంతయు నాకు తెలియదు. ఏదియో గడ్డిగాదమువలె లెక్కల చుట్టలతోబాటు ఎన్నియో ప్రాత తాటాకు లుండినవి.

నేను : ఆలాగుననా ? అవి యెక్కడ నున్నవి ? దయయుంచి అవి యున్న చోటుకు నన్ను పిలుచుకొని పోవుదురా ?

వారు : అంతలో నవసరపడెదరే ? వరగుణపాండ్యులు గతించిన తరువాత వారి యాస్తియంతయు గుడికి చేరిపోయిన దట. వారియొద్ద నుండిన తాటాకుపుస్తకము లన్నియు నప్పుడే కోవెలకు వచ్చిన వట.

నేను : అది తెలియును. ఇప్పు డవి యెక్కడ నున్నవి ?

వారు : పెంటకుప్పలై పడియున్న తాటాకులను నేను చూచి యున్నాను. ఏ కాలపు లెక్కచుట్టలో !

నేను : వేరు తాటియాకులు లేవా ?

వారు : అన్నియు సంకీర్ణములై పడి యుండినవి.

వా రనవసరముగ నాలస్యము చేయుటచేత నాకు కోపము వచ్చెను.

నేను : రండు, పోవుదము.

వారు ; ఏల పిలుచుచున్నారు ? ఆ పెంటపోగు లన్నిటిని ఏమిచేయుటయా యని యోచించిరి; ఆగమశాస్త్రములందు చెప్పియున్న రీతిని చేసివేసిరి.

నా కేమియు నర్థము కాలేదు. "ఏమి చేసివేసిరి!" అని తత్తరపాటుతో నడిగితిని.

ప్రాత తాళపత్రములు ఎక్కడ తోచిన నక్కడ వేయరా దట. వానిని నేతిలో ముంచి హోమము చేయవలయు నట. ఇప్పుట నట్లే చేసిరి.

'హా!' యని యొడలు తెలియక 'గావుకేక' పెట్టితిని.

"గొయ్యి తీసి, యగ్గి రగుల్కొలిపి, నేతిలో ముంచి ఆ ప్రాత తాటాకు లన్నిటిని ఆహుతి చేసివేసిరి" అని వారు వర్ణించి చెప్పిరి. "ఇ ట్లెక్కడనైన ఆగమము చెప్పునా? అట్లే చెప్పియున్నచో ఆ యాగమమునేగదా మొదట ఆహుతి చేయవలెను?" అని పట్టరాని కోపావేశము కలిగెను. ప్రాత కాలమున ప్రాచీనతాళపత్రములు శిథిలావస్థలో నున్నచో క్రొత్త ప్రతి యేర్పరచి, ప్రాతప్రతులు ఆహుతి చేయుట యలవాటు. క్రొత్తప్రతి యున్నందున ప్రాతప్రతి పోవుటలో నష్ట మేమియు నుండదు. తరువాతి కాలపు మేధావులు ప్రతి వ్రాయుట మరచి తాళపత్రగ్రంథములను నిప్పు కెర చేయునట్టి పాపకృత్య మొడిగట్టుకొన్నారు. ఎంతటి యవివేకము! ఇట్టి యవివేకముచేత నెన్ని అపురూపములైన గ్రంథములు ఈ లోకమునుండి మరుగుపడినవో!

వరగుణపాండ్యుల తాళపత్రములు అగ్నిభగవానునకు ఆహారమైన వను వార్త వినినది మొదలు నా హృదయమున ప్రశాంతి లేకపోయెను. 'ఇక ఈ దేశమునకు కనువిప్పు కలుగునా?' అని యేమేమో మనసున నొచ్చుకొంటిని.

నేను రెన్నాళ్లుండి చూడవలె నను నభిలాషతో వచ్చితిని. నాకు ప్రయాస లేకుండునట్లుగ వారు చేసిరి. మరల గుడిలోనికి పోతిని. "ఈ దౌష్ట్య మికపైనైనను జరగకుండునట్లు మీ దివ్యచిత్తము కరగవలెను" అని ఆ జగన్నియంతమ్రోల మొర యిడి వట్టిచేతులతో కుంబకోణము వచ్చి చేరితిని. ఈ రెండు ప్రయాణములను ఎందుకును కొరగానివై ముగిసినవి. "భగవంతుని దయ యేనాడు శిలుప్పది కారపు శుద్ధప్రతి మనకు లభింపజేయునా?" అని తలచుచునే పరిశోధన సాగించుచుంటిని.

1890 వ సంవత్సరము వేసగి సెలవులలో శిలప్పదికారప్రతులను వెదకుటకై దక్షిణపాండ్యదేశము వైపు బయలుదేరితిని. అట నట నున్న శాఖామతముల యధికారులకు నా రాక తెలియజేసి వలసిన సహాయము చేయవలె నని తిరువావడు-దుఱ అంబలవాణదేశికులు ఉత్తరువులు పంపిరి.

మొదట తిరునెల్వేలికి జేరి, అచ్చట మునుపు పరికింపని ప్రదేశములందు తాళపత్రము లన్వేషింప దలచినప్పుడు కవిరాజ ఈశ్వరమూర్తి పిళ్లై మిక్కిలి సహాయకారిగ నుండిరి. మునుపటిసారి వెదకిన చోటులందే మరల వెదకితిని. శాలి-వాటీశ్వర ఓదువార్ ఇంటిలో శిలప్పదికారమూలప్రతి యొక్కటియు, మూలము వ్యాఖ్యయు గల ప్రతి యొక్కటియు దొరకెను. ఆ వ్యాఖ్యానప్రతిలో వ్యాఖ్య అపూర్ణముగనే యుండెను.

శ్రీవైకుంఠమున ఒక కవిరాజుగారి యింటి కేగితిని. అక్కడ ఎనుబది యేండ్ల ప్రాయముగల 'వైగుందనాదర్' కవిరాయరు అనువారు కూర్చొని యుండిరి. వారితో సంభాషించుచుండినప్పుడు పెక్కు ప్రాత తమిళపద్యములు చెప్పిరి. పిదప నేను తాళపత్రములు వెదకవచ్చియుండుట వారియెడ నొడివి వారి యింటిలో నున్న తాటాకుప్రతులు చూడవలె నని వారి నడిగికొంటిని. ఆ వృద్ధులు నవ్వుచునే "ఈ కాలమున తాటాకులు వెదకువారుగూడ నున్నారా? ఇంగ్లీషు వచ్చిన తరువాత తమిళము ను గమనించువా రెవ్వరు? తమిళతాళపత్రపుస్తకముల నెవ్వరు కాపాడుదురు? అన్నియు అచ్చు పుస్తకములై వచ్చివేసినవే?" అనిరి.

"అచ్చు పుస్తకము లెట్లు వచ్చినవి? తాళపత్రములను మీబోటివారు కాపాడియుంచుటచేతనే వానిని చూచి యచ్చొత్తించుచున్నారు. మీ యింటిలో నున్న తాళపత్రములు చూడ ననుమతి యివ్వవలెను." అని యడిగితిని.

"నాయొద్ద ప్రాత తాళపత్రములు పెక్కుండినవి. నా కుమారులు ఇంగ్లీషు చదివి ఉద్యోగములకు పోయిరి. ఇకపై ఈ తాటాకుల నెవ్వరు కాపాడగల రను తలపుతో ఎవ్వ రెవ్వ రేదేది యడిగిరో వారివారికి అది యది యిచ్చివేసితిని.

'మన మప్పుడే రాకపోతిమే!' అని పరితపించితిని. ఆ వృద్ధులు తాము చదువు కొనుటకై యుంచుకొనిన కొన్ని తాటాకుప్రతులు కొనివచ్చి చూపిరి. నాకు కావలసిన దేదియు దొరకలేదు.

'ఆఱుముగ మంగలము' వాసియు 'తూత్తుక్కుడి' కాల్డ్వెల్ కాలేజిలో తమిళ పండితులును అగు కుమారస్వామి పిళ్లై అనువారుంచుకొనియున్న చింతామణి, పత్తుప్పాట్టు అనెడు రెండు గ్రంథముల తాళపత్రప్రతులు నాకు మునుపు లభించినవి. అవి నిర్దుష్టమైన ప్రతులుగ నుండెను. వారి యింటికి పోయి వెదకిన వేరు గ్రంథములు లభింపవచ్చు నను భావముతో ఆఱుముగమంగలమునకు పోయితిని. కుమారస్వామి పిళ్లెగారి అల్లుడుగా రచట నుండిరి. వారు తమ యింటిలోని తాళపత్రప్రతులన్నియు చూపిరి. పలు ప్రాత తాటాకుప్రతు లుండెను. అగనానూఱు, పుఱనానూఱుకు చెందిన అపూర్ణప్రతియొక్కటియు, శిలప్పదికార వ్యాఖ్య, 'తమిళ నావలర్ చరిత్తిరమ్' అను నవి నాకు దొరకెను.

తిరుచ్చెందూరు కరిగి 'శెందిలాండవన్'స్వామిదర్శనము చేసికొని, ఆళ్వారుతిరునగరికి జని, కొన్నియెడల వెదకి మరలి తిరునెల్వేలికి వచ్చితిని. దక్షిణపు క్రొత్తవీథిలో నున్న వకీలు సుబ్బయ్యపిళ్లై అనువారియొద్ద కొన్ని తాళపత్రము లున్న వని విని యట కేగితిని. ఆ యింటికి శ్రీ సుబ్రహ్మణ్యదేశికుల సహోదరులును, నా మిత్రులును అగు త్రికూటరాచప్పకవిరాయరు వచ్చియుండిరి. సుబ్బయ్య పిళ్లెకు వారు బంధువులు. నేను వచ్చిన పని తెలియజేసినపుడు కవి-రాయరుకూడ సుబ్బయ్యపిళ్లెకు నా యుద్దేశమును వివరించి చెప్పిరి.

"మా యింటిలో 'ఊర్కాట్టు వాధ్యార్' పుస్తకములు బండ్ల కొలదిగ నుండినవి. అన్నియు శిథిలములైపోయి, విరిగి యుపయోగపడని వైపోయినవి. ప్రదేశ మాక్రమించుకొని ఎవ్వరికిని ఉపయోగపడకయున్న వానిని ఏమి చేయుట యని యాలోచించితిని. వానిలో నేమి యున్నదని చూచుటకో, నాకు సామర్థ్యము లేదు. అందమైన అచ్చుపుస్తకములు వచ్చియున్న యీ కాలమున యీ పెంటప్రోవుల మోసికొనుచుండుటవలన ఫల మేమి?—అని తలచితిని. ఏటిలో పడవేయవచ్చు ననియు, ఆడినెల పదునెనిమిదవ తేదినాడు తాళపత్రములు తేరువలె కట్టి వదలి పెట్టుట యాచార మనియు కొందరు వృద్ధస్త్రీలు చెప్పిరి. నే నట్లే అన్ని తాటాకులను

ఒక ఆడినెల పదునెన్మిదవ తేదినాడు ఒక కాలువలో వదలిపెట్టితిని" అని చెప్పిరి. వారు దాని నభివర్ణించి చెప్పునపుడు కొంచెమేని విచారపడుచున్నట్లు కనిపింపలేదు. నా మనస్సే ఖేదపడెను. కరివలం వంద నల్లూరులో తాటాకులను అగ్ని కాహుతిచేసిన వార్త విన్నపుడు నా హృదయ మె ట్లుండెనో ఆట్లే యిచ్చటను ఉండెను. తమిళము గొప్పతనము వర్ణించిన కొందరు పెద్దలు అది నిప్పులో బూడిదగాక నిలిచె ననియు, నీటిలో మునుగక తేలిన దనియు శ్లాఘించి యుండిరి. అదే తమిళము నేడు అగ్నిలో దగ్ధ మయియు, నీటిలో మునిగియు అవమానముపాలగుట వారు చూడకయే పోయిరి. చూచి ఏడ్చుటకు మన మున్నాముగదా ?

మీ యింటి తాటాకు పొత్తములన్నియు ప్రవాహమున కొట్టుకొనిపోయిన వని చెప్పుచున్నారే, ఇట్లు పలుకుట పాడియా ?" అని పరితాపము ధ్వనించు కంఠ స్వరముతో నడిగితిని.

అప్పుడు త్రికూటరాచప్పకవిరాయరు "నేను వచ్చియున్న సమయమున కడపటిసారిగా తాటియాకులను కాలువలో వేయుచుండిరి. నే నది చూచితిని. తుట్ట తుద మిగిలియున్న కొన్ని తాటాకుపొత్తములు కొనిపోయిన నొక కుర్రవాని చెంపపై బలముగ నొక దెబ్బకొట్టి యా కట్టను లాగికొని యింటిలో బీరువాపై ఉంచి యున్నాను. దానిని తీసికొని రండు" అని యింటి యజమానిని చూచి పలికిరి.

ఆ కట్ట తీసికొనివచ్చి నా ముందు పడవేసిరి. నాకు ముందుగనే యెలుకలు ఆ తాళపత్రగ్రంథములు పరిశోధించి యుండుటచేత పెక్కు తాళపత్రములు తుత్తు నియలై యుండెను. అవి 'తిరుప్పూవణనాదర్-ఉలా' మున్నగు కొన్ని ప్రబంధముల భాగములై యుండెను. శిలప్పదికారపు ముక్కలుగూడ దొరకెను. వానిని ఏరి తీసి యుంచుకొంటిని. అక్షరములు స్పష్టముగను, తప్పులు లేకయు నుండినవి. వానిని చూడజూడ అగుపింపకపోయిన తాళపత్రముల గొప్పతన మరసి యరసి లోలోన కుందితిని.

తిరునేల్వేలినుండినె త్రికూటరాచప్పకవిరాయరును వెంట నిడుకొని 'అంబా సముద్రము'న కేగితిని. మార్గమధ్యమం దొక యూరిలో ఒక అభిషిక్తుల (శైవుల గురువుల) యింటికి పోయినాము. మమ్ము చాల దవ్వున నుండగనే చూచి వెంటనే

ఆ యింటి యజమాని యగు నభిషిక్తులు లేచి లోపలకు పోయిరి. వారికి దెబ్బది యేం డ్లుండును. వారి కుమారు డొక్కడు మాకు స్వాగతము పల్కెను. పిదప లోపలకు జని యొక పలక కొనివచ్చి యరుగుపై వేసినాడు. మరియొక పలక గోడయొరగ చేరగిలబెట్టెను. ఆ విధముగ ఆసనము లమర్చిన వెంటనే లోపల నుండి పెద్దలు వచ్చిరి. చెవిలో 'అలుకట్టి', 'సుందరవేషము'ను, తలపై బ్రొద్రాక్ష మాలయు, మెడలో రుద్రాక్షకంఠియు నలంకరించుకొని వారు వచ్చి పలకపై అమరి 'రండు' అని మాకు స్వాగతము పలికిరి. ఆ యలంకారములు లేక సాధారణమానవులుగ ఇతరుల కన్నులలో పడరా దని వారి యుద్దేశము కాబోలు: వారు నాతోడ వచ్చిన త్రికూటరాచప్పకవిరాజుగారికి పరిచితులు; వారి సాయము పొందెడువారు.

మేము తిన్నెపై ఆసీనుల మయితిమి. "ఎక్కడికి వచ్చినారు? అడుగడుగున మీబోటి ఘను లిచ్చటికి విజయము చేయుదురు. నే నంతటి మర్యాదకు తగినవాడను కాను. విశేష మేమి?" అని యా పెద్ద లడిగిరి.

"మీయొద్ద తాటాకుప్రతు లున్న వని విని యుంటిని. వానిని చూడవచ్చునని వచ్చితిని" అంటిని.

"అటులనా? మీ కేమి కావలయును?" అని ప్రశ్నించిరి.

నేను "శిలప్పదికారము కావలెను" అంటిని.

"శిలప్పదికారమా, ఉండును" అని యొత్తి యొత్తి మాటాడిరి.

"శిలప్పదికారము కాదు; శిలప్పదికారము" నేను మాటమధ్యన చొరవతో నంటిని.

"శిలప్పదికార మనియే చెప్పవలెను. మీరు కడు బాలురు. మీకు తెలియదు" అని వారు బదులు పలికినపుడు, కవిరాయరు "అది యుండనిండు; పుస్తకము చూపింపచేయవలెను" అనిరి.

"అంత సులభముగా చూప నలవియగునా? ఎప్పుడన్న నప్పుడు తాకవచ్చునా? సరస్వతిపూజయందే అర్చన చేసి, పూజచేసి ఎత్తుకొనవలెను" అని వచించిరి.

వారి మాటలను బట్టి వారియొద్ద సర కేదియు నుండ దనియే నాకు తోచెను. అయినను కవిరాయరు విడువలేదు. ఆ పెద్దలకు సాయ మొనర్చువా రగుటవలన వారి కుమారుని పిలిచి, లోపలికి జని "ఆ పుస్తకము చూపుము" అని యధికార ధోరణిలో నడిగిరి. అతడు తీసి చూపెను. పది, పదునైదు ఆకు లుండినవి. అవి ఆగమపత్రములుగను, అంత్యక్రియలకు సంబంధించిన ఆకులుగను ఉండినవి. మేము మారు మాటాడక సెలవు పుచ్చుకొంటిమి.

'కళక్కాడు'కు చేరితిమి. అచట రెండు శైవమఠము లున్నవి. వానిలో దక్షిణమఠమునకు పోయి చూచితిని. దాని యజమానియగు స్వామినాథదేశికర్ అనువారు విద్యయందును, గుణములందును మిన్నలై యుండిరి. నేను వచ్చిన పని తెలిసికొని వారు వెంటనే తాము తాళపత్రము లుంచియున్న పెద్ద కొయ్యపెట్టెలో నున్న తాటాకుపుస్తకముల నన్నిటిని నిచ్చెన వేసి యెక్కి, యెత్తి పడవేసిరి. రెండు రోజు లుండి యన్నిటిని చూచితిని. పెక్కు ప్రబంధములును, పురాణములును, సంస్కృతగ్రంథములును ఉండినవి. కొన్నిటికి పేరే లేకుండినది. నేను పేరు వ్రాసి పెట్టితిని.

పత్తుప్పాట్టు మూలమంతయు నణగిన ప్రాతప్రతి యచట దొరకెను. ఆనంద సాగరమున మునక లిడితిని. "దీనికై నే నెంత త్రిప్పటలు పడితిని! మును పే దొరకి యున్నచో ఎంత యనుకూలముగ నుండియుండును! రెండవ ముద్రణము నందు దీని నుపయోగించుకొందును" అని చెప్పి, అది పుచ్చుకొంటిని.

పిదప దొరకిన తాళపత్రగ్రంథములు తీసికొని తిరునెల్వేలిమార్గముగా కుంభకోణమునకు వచ్చి చేరితిని.

# 53. తమిళము దేవళము

కుంబకోణమునకు వచ్చిన వెంటనే నాకు దొరకిన శిలప్పదికారప్రతు లన్నిటిని ముందుంచుకొని పరిశోధించితిని. దాని మూలము, అడియార్కు-నల్లారు వ్యాఖ్య, విశిష్టపదటిప్పణి — అను మూటిని ప్రత్యేకప్రత్యేకముగ పూన్కి-తో చదివి చక్క-బరచుకొనుచుంటిని. ఆ మూడిటిలో విశిష్టపదటిప్పణి మిక్క-లి రూపుచెడి యుండుటచేత దానికి రూపిచ్చి చదువుటయన్నది సాధ్యము కాలేదు. అడియార్కు-నల్లారు ఆ టిప్పణిని కొన్నియెడల నుదాహరించుటచేత దానిపై విలువ యేర్పడినదే గాని నాకు దొరకిన ప్రతినిబట్టి కాదు. అయినను ఓరిమితో సావధానముగ చూచి నప్పుడు కొన్నికొన్నియెడల అడియార్కు-నల్లారువ్యాఖ్యలో కనిపింపని కొన్ని యరుదైన విషయము లందుండినవి. వానిని చూచిన పిమ్మట విశిష్టపదటిప్పణిని ఇంకను పూనికతో చదువదొడగితిని.

శిలప్పదికారమున సంగీత-నాటక సంబంధమైన పెక్కు- సంగతులు వచ్చును. వానిని చక్క-జేయ యత్నించినప్పుడు, అడియార్కు-నల్లారు సంవాదరూపమున నిచ్చు పద్యములును, సూత్రములును మిగుల నబ్బురపా టొదవజేసినవి. 'చచ్చ-పుటవెణ్బా', 'తాళ సముద్రము' 'శుద్ధానంద ప్రకాశము' అను గ్రంథములు నాకు దొరకెను. వానినిగూడ విమర్శనదృష్టితో చూచితిని. మహావైద్యనాథయ్యరును, వారి యన్నగారగు వైయై రామస్వామి అయ్యరును సంధించిన కాలములందు శిలప్పదికారమునందును పైన బేర్కొ-నిన మూడు గ్రంథములందును వచ్చు సంగీత విషయములను వారికి వినిపింతును. వారివలన కొన్ని సందియములు తీరినవి. 'తమిళమున ఇన్ని సంగీతశాస్త్రగ్రంథము లున్నవా' యని వా రక్క-జపడిరి. కుంబకోణమందు భరతనాట్యకళాభ్యాసముగల 'నటేశదీక్షితర్' అనువా రొక రుండిరి. అభినయము, హస్తముద్రలు మున్నగువానికి సంబంధించిన సంగతులు కొన్నిటిని వారివలన విని తెలిసికొంటిని. ఆ యూరియందే భరతశాస్త్రపారంగతు-లైన రావుగా రొక్క-రుండిరి. వారినుండి పెక్కు- వృత్తాంతములు తెలిసికొంటిని.

కొందరు నట్టువకాంఢ్రను జూసి వారి మూలమున పలు విషయము లరసితిని. వారు విషయములు వివరించి చెప్పునపుడు "ఈ కళలను, వీని లక్షణములను బోధించు గ్రంథములను తమిళదేశవాసు లాదరించి కాపాడక వదలిపెట్టిరే!" అని వగతును. నే నెంత ప్రయత్నించియు శిలప్పదికారవ్యాఖ్యయందు వచ్చెడు విషయములు ఒక మితిలో తెలిసినవే కాని మొత్తము తేటతెల్లముగ బోధపడలేదు. యోగశాస్త్ర సంబద్ధవిషయములు మొదలగువానిని కుంబకోణము తహసీల్దారుగ నుండిన అయ్యా స్వామి శాస్త్రిగా రనువారినుండి విని తెలిసికొంటిని.

శిలప్పదికారవిమర్శనము జరగుచుండగా 1891వ సంవత్సరము ఏప్రిలు నెల 'పారిసు'నుండి నా కొక లేఖ వచ్చినది. నేను ప్రచురించిన జీవకచింతామణిని చూచి ఆ నగరమున తమిళోపాధ్యాయులుగ నుండిన జూలియన్ వినోన్స్ అను ఫ్రెంచి పండితుడే దానిని వ్రాసియుండెను. చింతామణి ప్రచురణ చూచి మిక్కిలి యానందించినట్లును, శిలప్పదికారము మున్నగు తక్కిన నాలుగు కావ్యములనుగూడ నేను ప్రచురింపవలె ననియు వారు తెలియజేసిరి. ఆ కమ్మనుండి వారి తమిళభాషాభిమానమును, వినయమును గోచరించినవి. "మా అరగొర తమిళము మీ కృపతోడనే చదువుకొనినచో ఒక కాగితము మాకు మరల పంపినచో మిక్కిలి సంతోషముగ నుందుము. స్వామి కృపయంతయు మీమీదను వచ్చుగాక! అని మీ Colleague and Servant (సహకర్మచారియు, సేవకుడును) గా నయి యుందుము" అని యా జాబు ముగించియుంచిరి. వారు సముద్రమున కావలి దేశమున నున్నను 'మనోభావమే స్నేహ మేర్పడు అర్హత కలించును ......' అన్న చొప్పున మా మనోభావముచేతనే మేము మిత్రుల మయితిమి. పారిస్ నగరమున నున్న పుస్తకశాలయందు శిలప్పదికారప్రతి దొరకునేమో యని వారికి లేఖ వ్రాసితిని. వెంటనే వారు బదులు వ్రాసిరి. 1891వ సంవత్సరము మే నెల 7వ తేది వారు వ్రాసిన ఆ జాబులో "Bibliothique Nationale" అను పెద్ద పుస్తకశాలలో ఉన్న ఒక వేయి ద్రావిడలిఖితపుస్తకములు మాకు బాగుగ తెలియును. వానిని List or Catalogue చేయగ అందు శిలప్పదికారము లేదు. ప్రాతపుస్తకము లన్ననో, ఆ శాలలో ఒక మణిమేఖలై వ్రాతప్రతి యున్నది. కాని మేము గతమాసము వ్రాసిన కాగితమున చెప్పిన

విధమున ఆ ప్రతిలో పెక్కు పద్యములును, వచనములును వ్రాయక వదలబడి యున్నవి. ఆ ప్రతియందును వ్యాఖ్య లేక మూలముమాత్రమే యున్నది. అది తాటాకుప్రతి. మా చిన్న పుస్తకశాలలో పెట్టుటకై మేము దానిని కాగితములపై వ్రాసితిమి. అందుచే మీ రది చూడవలయు నన్న ఆ కాగితపు ప్రతి పంపుదుము. మీ రది చూచి, అందు లేని పద్యములను, వచనములను వ్రాసి త్రిప్పి పంపవచ్చును'' అని వ్రాసిరి.

తమిళదేశమున తమ కులధనముగ భావింపదగిన తాళపత్రశ్రీకోశములను నీటికి, నిప్పునకును ఎరచేసి వదలినవానిని చూచి దుఃఖించిన నాకు, పెక్కు వేల మైళ్ల కావల నున్న యొకచోట అరవముతల్లిసొమ్ములు మిక్కిలి శ్రద్ధతో కాపాడబడుచున్న వన్న వార్త పయింబయి నివ్వెరపా టొదవజేయుచున్నది. వేయి తమిళపు తాటాకుపుస్తకములు పారిసునగరమందలి గ్రంథాలయములో నున్న వని తెలిసి 'ఇచ్చట నున్నవారు తాళపత్రముల నన్నిటిని పోగొట్టినను ఆ వేయి పుస్తకములేని రక్షణలో నుండును' అని తలపోసితిని. మణిమేఖలనుగూడ నేను నడుమనడుమ శోధించుచుండుటవలన దాని ప్రతి పారిసులో నున్న దని తెలిసి, ఆ మిత్రులకు కొన్ని భాగములు ప్రతిచేసి పంపు డని వ్రాసితిని. వా రట్లే పంపిరి. అది మిక్కిలి యపశబ్దబహుళమై యున్నందున పైబడి వారిని ప్రయాసపెట్టక మానుకొంటిని.

ఒకమారు కుస్టకుడికిపోయి ఆధీనకర్తలను, అక్కడి చిన్న పట్టమం దున్న నా మిత్రులు ఆఱుముగదేశికులను చూచి మాట్లాడితిని. మఠమున పెద్ద 'గుమాస్తా' గా నున్న అప్పాపిళ్లెను చూచి తమిళతాళపత్రగ్రంథము లుండుచోటు తెలియజేయవలె నని మునుపు వ్రాసియున్న సంగతి జ్ఞాపకపరచితిని. వారు "ఉండుడు" అని చెప్పి లోపలికి పోయి ఒక తాటాకుప్రతి కొనివచ్చి యిచ్చిరి. అది విప్పి చూచితిని. శిలప్పదికారముమూలమును,మణిమేఖల మూలమును అం దుండినవి. శిలప్పదికారమును త్రిప్పి చూచితిని. మూలము పూర్ణముగ నుండెను. ప్రతి మిగుల నిర్దుష్టముగ కనిపించెను.

"ఈ ప్రతి యెచ్చట దొరకినది?" అని యడిగితిని.

"ఇటకు సమీపమున 'ముదలైప్పట్టి' అను ఊరిలో నొక కవిరాయరుల యి ల్లున్నది. అచట నూర్లకొలది తాళపత్రము లున్నవి. అచటనుండి కొని వచ్చితిని" అని వారు చెప్పిరి.

"ముదలైప్పట్టియా! విచిత్రమైన పేరుగ నున్నదే!" అని నేను ప్రశ్నింపగ వారు "ఇప్పుడు ముదలైప్పట్టి యని వ్యవహరించుచున్నారు. 'మిథిలైప్పట్టి' అను పేరే యిట్లు వ్యవహారపు తీరులో మారిపోయినది" అనిరి.

నాకు వెంటనే ఆ యూరికి పోయి చూడవలెనను ఆత్రము పుట్టెను.

"ఇక్కడనుండి ఆ యూ రెంత దవ్వున నున్నది?" అని ప్రశ్నించితిని.

వారు నా భావము గుర్తెరిగి "దాపుననే యున్నది; పోవచ్చును" అనిరి.

నాటి యపరాహ్ణముననే ఆధీనకర్తల యనుజ్ఞ పుచ్చుకొని అప్పావిళ్లైతో మిథిలైప్పట్టికి పోయి ఆ కవిరాయరింటికి చేరితిని. అప్పు డచట నున్న కవిరాయరు పేరు 'అళగియ చిత్రంబల క్కవిరాయ' రని. వారి యింటిలో నున్న తాళపత్రములు చూచితిని. వారి యిల్లు తమిళదేవతయాలయముగ తోచెను. వారు తమ పూర్వపురుషుల మహిమ యభివర్ణించి చెప్పుటతోబాటు వారు రచించిన పెక్కు కవితలు చదివి వినిపించిరి.

ఆ కవిరాయరుల పూర్వపురుషులలో అళగియ చిత్రంబలక్కవిరాయరు అనువారికి మిథిలైప్పట్టిని వేంగళప్పనాయకరు అను జమీందారు దానము చేసిరి. అది మొద లా యూరిలో అళగియ చిత్రంబలక్కవిరాయరు కాపురము చేయుచుండిరి. రామనాథపురము సేతుపతులనుండియు, మరుంగాపురి జమీందారులనుండియు, శివగంగ జమీందారుల నుండియు, పుదుక్కోట్టై అధిపతులనుండియు ఆ వంశమువారు పెక్కు పారితోషికములు పొందిరి.

"మా ముందుతరములవారు ఏనుగులు పారితోషికముగ పొందినవారు. ఇదియే ఏన్గులు కట్టెడు రాతిస్తంభము. వారికి శిబికలో పయనించు మర్యాద యుండినది.

ఇప్పు డా శిబిక ఆ ప్రాచీనకాలమును జ్ఞాపకపరచుచు ఇదుగో, ఉన్నది. చూడుడు" అని కవిరాయరు ఆ రెండిటిని నాకు నిర్దేశించి చూపిరి.

"మా పెద్ద లెన్నియో ప్రబంధములు వ్రాసియున్నారు. ఎన్నో మాన్యముల సమ్మానమందినారు. వా రుపార్జించిన సంపద మే మిప్పు డనుభవించుచున్నాము. కాని వారివలె తమిళజ్ఞానమో, వాగ్మిత్వమో నాకు లేదు. ఇక్కడ పడమటి యింటిలో కుమారస్వామి కవిరాయ రను మాదాయాది యొక్క రున్నారు. వారు బాగుగ చదువుకొన్నవారు" అని చెప్పిరి. వా రట్లు వినయముగ చెప్పుకొన్నను వారికి తమిళముపై నభిమాన ముండెను. కులవిద్య కావున పద్యము లల్లునట్టి యభ్యాసము కొలదిగ నుండెను. ఈ వంశమునకు చెందిన కొందరు పెద్దలకు ఆ యలవాటు బాగుగ నుండెను.

వారి యింటిలో నున్న తాళపత్రము లన్నియు మిగుల శుద్ధముగ నుండెను. ఒక ఆకుపై పుఱనానూఱు వ్యాఖ్య, శిలప్పదికార వ్యాఖ్య అని గురు తుండెను. పుట్టు గ్రుడ్డికి కన్ను లబ్బినట్లు నా కెల్లలేని యానందము కలిగెను. విప్పి చూచితిని. పుఱ నానూఱుమాత్రమే యుండినది. శిలప్పదికారవ్యాఖ్య లేదు. వేరు తాళపత్ర ములతో కలిసియుండునేమో యని వెదకి వెదకి చూచితిని. దొరకనే లేదు. 'నా దౌర్భాగ్యము' అని తలపోసి, నొచ్చుకొంటిని.

నా కా యింటిని వదలి వచ్చుటకు మనసు రాలేదు. అళగియ చిత్రంబలక్కవి రాయరులయొద్ద "ఇంకను ఈ ప్రాంతముల తాటియాకుపుస్తకములు లభించు చో టున్నచో చెప్పవలెను" అంటిని. వారు "ఇచ్చట సమీపమున శెవ్వూరులో మా చుట్ట మొక్క రున్నారు. మా వంశమునుండి ఒక శాఖ యచటికి పోయి యున్నది. అచ్చటను ఇట్టి తాళపత్రములు చూడనగును. మరి యొక శాఖ 'కార్యై చ్చూరాన్ పట్టి'లో నున్నది. ఇప్పుడు మండువేసవి యగుటచేత నటకు పోవుట మీకు కష్టము" అనిరి. లిబ్బి యునికిపట్టు నొక్కరు చెప్పియున్నను నా కంతటి సంతోషము కలిగియుండదు. అంతటి మహానందములో మ్రుంగితిని.

కవిరాయరువద్ద పుఱనానూఱును, మరి కొన్ని గ్రంథములను పొంది శెవ్వూ రికి నేగితిని. అటకు జని నివాస మేర్పరచుకొనినవారిలో ముందటివారు చిత్రంబల

లక్కవిరాయరు. సేతుపతిపై 'తళశింగమాలై' అను ప్రబంధము రచించినవారు వారు. వారి యింటను పలు తాళపత్రము లుండినవి. కాని శిలప్పదికారప్రతి యగు పడలేదు. ఏదో ఒక తాటియాకుపై మూడు సంఘములను గూర్చిన చరిత్ర తెలియ జేయు ఒక పెద్ద ఆశిరియప్పా ఉండినది. దానిని చూచి ప్రతి చేసికొంటిని. మిథిలై ప్పట్టి, శెవ్వూరు అను రెండు స్థలములందును ప్రాప్తమైన తాళపత్రప్రతులతో కుంభ కోణము వచ్చి చేరితిని.

మిథిలైప్పట్టిప్రతి నిడుకొని చూచుటవలన శిలప్పదికారము పెక్కుచోట్ల దిద్దుపాట్లు చెందినది. పెక్కెడల పద్యములకు శీర్షిక లుండెను. ఈ ప్రతిని పరి శోధింపగ పరిశోధింపగ మిథిలైప్పట్టిగొప్పదనము పయింబయి వ్యక్తమాయెను. మణిమేఖలనుగూడ మధ్యమధ్య విమర్శించుచుండుటచేత అందును పెక్కు దిద్దు పాట్లు లభించు నని తెలిసెను. దానిని వెనుక చూచుకొనవచ్చు నని శిలప్పదికారమును శుద్ధముగసిద్ధపరుపదొరకొంటిని. మిథిలైప్పట్టిప్రయాణముసంఘటిల్లకున్నచో కలకబారి యున్న నా యెడదలో ప్రశాంతి యేర్పడియుండదు. ఆ స్మృతిచేతనే మిథిలైప్పట్టిని గూర్చి తరువాతి కాలమున "తమిళదేశమున నెన్నియో పుణ్యక్షేత్రము లున్నవి. శివక్షేత్రములును, విష్ణుక్షేత్రములును, సుబ్రహ్మణ్యక్షేత్రములును పెక్కు లున్నవి. వానివలెనే తమిళదైవము గుడిగట్టుకొనియున్న దివ్యస్థలములలో నొక్కటిగనే మిథిలైప్పట్టిని నేను భావించియున్నాను" అని వ్రాసితిని.

# 54. హృదయాలయ మరుదప్పదేవరు

నాప్రయాణములు,పరిశోధనయు విస్తరింపగ విస్తరింపగ నా తమిళకుటుంబము, తమిళగ్రంథసంపత్తియు అధికమాయెను. వానిని సంరక్షించుటకు చాలిన వసతి యావశ్యకమాయెను. నేనున్న యింటిలో పైపై నేను కొనివచ్చు తాళపత్ర గ్రంథము లుంచుటకును, మిత్రులతో కలసి పరిశోధించుటకును చోటు చాలలేదు. అందుచే 1891 వ సంవత్సరము జూన్ నెల మొదలు మునుపుండిన భక్తిపురి అగ్ర హారమునందే ఉత్తరపు టగ్రభాగమున నున్న నొక మిద్దెయింటిని నెలకు ఆరు

రూపాయల బాడుగకు మాట్లాడి దానిలో వసింప నారంభించితిని. క్రొత్త యింటికి వచ్చిన వెంటనే మంచి తాళపత్రగ్రంథముల నింకను వెదకి సేకరింపవచ్చు ననియు, విద్యార్థులు పలువురికి పాఠములు చెప్పవచ్చు ననియు, పలువురితో కలిసి తమిళ గ్రంథపరిశోధన సాగింపవచ్చు ననియు నా యాలోచనలు విరియజొచ్చినవి.

నా కుమారుని కుపనయనము జరిగినప్పుడు పెక్కురు పెద్దలు పలువిధముల నుపకారము చేసిరి. వారిలో 'ఊత్తుమలై' జమీందారగు 'హృదయాలయ మరుదప్ప దేవరు'ను ఒక్కరు. వారిని చూచి మాట్లాడి అలవడవలె నను కుతూహలము నాకు చాల దినములనుండియు నుండెను. తిరునెల్వేలి ప్రాంతముల ప్రయాణము చేయు చున్నప్పుడెల్ల, అట్లే ఊత్తుమలకు పోయి చూచిరావలె నని తలచియు వీలుకాలేదు. ఊత్తుమలకు పోవుటే ముఖ్యలక్ష్యముగ నుంచుకొని బయలుదేరిననే గాని ఆయుద్దేశము నెరవేర దని తోచినది. అందువలన మిథిలైప్పట్టినుండి వచ్చిన కొన్నాళ్లకు తరువాత ఆయూరుముఖముగా పయనమైతిని.

ఆ సమయమున తాళపత్రములు వెదకని ప్రదేశములకును జని చూచి రావచ్చు నని తలచియే వెడలితిని. కాబట్టి తిన్నగ 'విక్రమసింగపురము'నకు పోయితిని. శివజ్ఞానబోధమునకు ద్రావిడమహాభాష్యము వ్రాసిన తిరువావడుదుఱ శ్రీ శివజ్ఞానమును ఉదయించిన ఆ యూరిలో వారు పుట్టిన యి ల్లున్నది. అచ్చట నా కుపయోగపడు గ్రంథము లేవేని దొరకవచ్చు నని తలచితిని. పోయి చూడగ నేవియు లభింపలేదు.

ఆ యింటిలో నొకరిని కలసికొంటిని. వా రా యూరి పాఠశాలలోని యుపాధ్యాయులు. వారిని 'ఏ యూరు' అని విచారింపగ 'కడైయనల్లూర్' అని చెప్పిరి.

"అటులైనా? సంతోషము. మీ యింటిలో ప్రాతతమిళతాళపత్రగ్రంథము లున్నవా?" అని యడిగితిని.

"మెండుగ నుండినవి. అన్నిటిని ఒక్కరు కొనిపోయిరి." అని వారు చెప్పిరి. "ఎవ్వరు వారు?" అని మిక్కిలి ఆసతో నడిగితిని.

"కుంబకోణము స్వామినాథయ్యరు కొనిపోయిరి."అనినారు వారు. నా కప్పుడు వచ్చిన నవ్వు నాపుకొంటిని.

"వా రేమే గ్రంథము లెత్తుకొనిపోయిరి?"

"ఎన్నో తాళపత్రగ్రంథము లుండినవి. అన్నియు వారు కొంపోయిరి."

వారికి నేను 'ఫలానావాడ'నని తెలియదు. అచ్చట నాతోడ నున్న మిత్రు లేమియు తెలియక మిణకరించిరి. ఈ యపవాద మింకను ఎంత దూరము వ్యాప్తి చెందియున్నదో యని తెలిసికొనుటకయితే నేను పైపై పలు ప్రశ్నలు వేసితిని. వారు తమ యింటిలో అరుదైన పెక్కు తాటాకు పొత్తము లుండిన వనియు, వానిని నేను కొనిపోయినట్లును గట్టిగా నొక్కిచెప్పిరి. నే నులికివచ్చు న వ్వాపుకొనలేక పోతిని. తక్కిన మిత్రులకు సమాచారము స్పష్టపడవలె నని అసలు సంగతి చెప్ప దొడగితిని.

"వీరు నన్ను తెలిసికొనకయే వ్యర్థముగ నా తలపై నపవాదు వేయు చున్నారు. నేను కడైయనల్లూరుకు పోయియుంటిని. వీరి యింట తాళపత్రములు వెదకుటయు సత్యమే. కాని వీరు నుడివినట్లు అచ్చట లెక్కపెట్టలేనన్ని తాటయాకు పుస్తకములు నేను చూడలేదు. ఆ యూరికి పోయిన వెంటనే వీరి యిల్లు ఒక పండి తుని యిల్లని తెలిసి, పోయి విచారించితిని.ఇంటిలోనున్నవారు 'తాటాకులన్నియు అటు కపై నున్నవి' అని చెప్పిరి. పై కెక్కి చూచితిని. రెండు మూడు పెట్టె లుండెను. చాలకాలముగ గమనించువారలు లేకుండ నుండిన వని వానిని చూచిన వెంటనే తెలి సెను. ఒక పెట్టె తెరచి లోపల చేయి పెట్టితిని, ఒక్కటే ఎలుకపెంట! ఎలుకలు తమిళగ్రంథములు తిని జీర్ణమైపోవగ వదలబడి మిగిలినతునకలే ఆపెట్టెలోనుండెను. ఆపెట్టెలో రూపరియున్న ఆకులను, తునకలను ఎత్తి,తట్టిక్రిందపోసి చూడగనప్పుడు అపూర్ణమైన చింతామణిప్రతిమాత్రము దొరకెను. దానిని తీసికొంటిని. ఆ పెట్టెలో నున్న యితరవస్తువులు పెట్టుకొని నే నేమి చేయగలను? వాస్తవ మిదియే."

ఈ విధముగ చెప్పివేసి "మీ రప్పు డక్కడ నుండినారా?" అని యా యుపాధ్యాయుల ప్రశ్నించితిని. వాడి వాలిపోయిన మొగముతో వారు "నేను తెలియక చెప్పివేసితిని. నే నప్పు డక్కడ లేను. సెలవులలో ఊరికి పోయి యున్న ప్పుడు మా యింట నున్నవా రట్లు చెప్పినారు" అనిరి.

"మంచికాలము ! ఈ యపవాదు నా యెదుటనే చెప్పినందున సత్య మందరికిని తెలిసినది. వే రెవ్వరియొద్దనైన చెప్పియున్నచో మీరు చెప్పునదంతయు సత్యమే యని నమ్మియుండుదు. నేను బ్రతికితిని" అంటిని.

పిదప విక్రమసింగపురమునుండి ఒక బండి మాట్లాడుకొని ఊత్రుమలకు పోయితిని.

బండి ఊత్రుమల సమీపించినపుడు ఎదురుగ బాటలో నొక చిన్న పటాలము వచ్చినది. దానిని చూచిన వెంటనే నాతో వచ్చిన యొకరు "అదుగో, జమీందారు వచ్చుచున్నారు." అనిరి. నేను వెంటనే బండి నిలుపు మని చెప్పి క్రిందికి దిగితిని.

నేను దిగిన వెంటనే "మిగుల సంతసము ! మీకు స్వాగత మిచ్చుటకయిమే ఈ మార్గముగ వచ్చుచున్నాను." అని యొక గంభీరధ్వని వినిపించెను. తల యెత్తి చూచితిని. వేట యుడుపులతో ఒక వీరులు నిలువబడియుండిరి. చుట్టును చూచితిని. వారిని పరివేష్టించి ఆయుధపాణులైన వేటకాండ్రు మిక్కిలి విధేయతతో నిలిచిరి. పెక్కు జాగిలములు వెంట వచ్చినవి. "మనకు స్వాగత మిచ్చుటకా యీ మృగయా లంకరణముతో వచ్చియున్నారు? వీరు ప్రాతకాలపు వీరులవలెనే యున్నారు !" అని భావించితిని. నా కన్నులు వారి యాకృతియందే లగ్నములై ఆపాదచూడము చూచినవి. అప్పుడు వారి ప్రాయము ఏబదేడులకు పై నుండును.

"ఇచ్చోట నింత శ్రమపడ నేల? నేను నగరుకే వచ్చి దర్శనము చేసికొని యుందునే?" అని ఎలనగవుతోడ బలికితిని.

"మీరు వచ్చునట్లు వ్రాసినది మొదలు ప్రతిదిన మెదురు తెన్నులు చూచుచునే యున్నాను. తిన్నగ ప్రాసాదమునకు పొండు; కొంచెము ద వ్వేగి వత్తును" అని చెప్పి వారు బయలుదేరిరి.

నేను నగరు చేరితిని. నాకు మిగుల వసతులు గల చోటు హజారము వాకిటి మిద్దెలో నేర్పరచి యుండిరి. పోయిన వెంటనే స్నానమునకు వలసిన యేర్పాట్లు చేయబడినవి. పిదప నల్పాహారముతో 'కాఫీ' యు లభించెను. అన్నిటిని ముగించు

కొని ఎనిమిది గంటలకు ఆస్థానమున కరిగితిని. అచ్చట నున్న జమిందారు నన్ను చూచిన వెంటనే లేచి "కూర్చుండవలెను" అని యుపచారము చేసిరి. ఆ చోట నలుగురు విద్వాంసులు వారితోడ నుండిరి. నే నుపవిష్టుడ నయితిని.

జమీందారు ఆ నలువురు పండితులతో తిరువానైక్కా పురాణము చదువు చుండిరి. నాకు వారు కొన్ని సమయముల కొన్ని తమిళపద్యముల కర్థము తెలియ జేయవలె నని లేఖలు వ్రాసి యుండుట కలదు. ఆ పద్యములు కఠినమైనవిగను, పాఠము విన్నవారికేగాని యితరులకు సులభముగ నవగాహన కానివిగను నుండును. "ఒక జమిందారు ఇట్లు కఠినమైన పద్యములను ఎన్నుకొని సందేహ మడుగు చున్నారే, తక్కిన పద్యము లన్నియు తెలిసినవా ? వానిని చదువుదురా ?" అని చింతింతును. సమక్షమున, జమీందారు విద్వాంసుల మధ్య నుండి తమిళగ్రంథములు చదివి యానందించుట జూచి వారి తమిళభాషాపరిశ్రమపరిమితి నూహించి తెలిసి కొంటిని.

ఒక విద్వాంసులు ఒక పద్యము చదివిరి. వెంటనే మరుదప్పదేవరు "సెల-విండు" అని న న్నుద్దేశించి పలికిరి. నేను క్రమాన్పడితిని. వారి మాటలలో గోచరిం-చిన వినయమే దానికి కారణము.

"నే నేమి గురువునా ? వయసు ముదిరినవాడనా ? 'సెలవిండు' అని నుడివిన మాటలలో వారి పెద్దరికమును, తమిళముపై గల వారి యతివేలమగు నభిమానమును ధ్వనించినవి. ప్రాచీనకాలమున పరాక్రమము, ఔదార్యము, వైదుష్యము కలవారై వెలుగొందిన చిన్న చిన్న రాజు లిట్లే యుండిరి కాబోలు !'' అని నేను తలపోసి, నా యంతరంగమందే వారిని శ్లాఘించితిని. ఆ పద్యమున కర్థము చెప్ప మొదలిడితిని. అట్టి మేటి రసికులును, స్థలమును, కాలమును లభించినపుడు నాకు కలుగు నుత్సాహ మునకు హద్దు లేమున్నవి ? భావము, పదార్థము, విశేషవ్యాఖ్య - అన్నియు జెప్పి, అక్షరలక్షణము మున్నగు పంచలక్షణవివరణములును పొందుపరచి చెప్పితిని. చిత్రప్రతిమవలె నుండి జమీందారు లాలకించిరి. పైన రెండు పద్యములు నడచినవి. గంట పది కొట్టెను. పుస్తకము క్రింద పెట్టి జమీందారు లుత్థితులైరి. "ఇంతవర-కును అనుభవించి యెరుగని మహానందము నే ననుభవించితిని. ప్రొద్దు పోయినది. పోయి భోజనము చేసికొనవలయును" అని యుపచరించిరి.

మధ్యాహ్నము నా కిచ్చిన యమృతప్రాయమైన విందు తమిళముస్మృతితోడనే యారగించి ముద మందితిని. నేను కాంచిన దృశ్యము లెల్ల కన్నులకు విందుగ నుండెను. అచ్చట మెలగిన మనుష్యులును, కార్యనిర్వాహకోద్యోగులును మిక్కిలి క్రమశిక్షణతో నుండిరి. గంటల లెక్కలో పొరపాటు లేక ఒక్కొక్క పనియు జరగుచుండెను. హజారమువాకిట కాలము గుర్తెరుగుటకై 'ఇసుకగడియారము' (వాలుకాఘటీయంత్రము) పెట్టియుండిరి. ప్రదేశము లన్నియు శుభ్రముగ పైనముగ నుండినవి. ఉద్యోగస్థులలో నధికసంఖ్యాకులు తమిళము బాగుగ చదువు కొన్నవారు.

హృదయాలయ మరుదప్పదేవుల కాలక్షేప విధానము అరసి నే నబ్బుర-పడితిని. వేకువజామున నాలుగు గంటలకే వారు మేల్కాంతురు. కాలకృత్యములను తీర్చుకొని, పాలు త్రాగి యారు గంటలకు వెలుపల నడయాడుటకై పరివారములతో బయలుదేరుదురు. ఏనుగుల దండు, అశ్వముల బంతులు, కోడెలు కట్టియుండెడు చోటు మున్నగువాని నన్నిటిని పర్యవేక్షణ చేయుచునే పోవుదురు. ఊరి చుట్టునున్న బాటలలో నొక్కొక్క రోడ్డు మార్గముగ జని వాహ్యాళి సలిపి వత్తురు. ఆ బాట-లన్నియు వారిచే వేయింపబడినవే. ఇరుగడల చెట్లు పెంచి బాటలు శుభ్రముగ నుంచి యుండిరి. తోటలు మంచి తీరుగ పెంపబడుచుండినవి. 'పచారు' చేసి వచ్చి ఎనిమిది మొదలు పది గంటలవరకు తమిళ విద్వాంసులతో తమిళగ్రంథములు చదువు కొందురు. క్రొత్త పొత్తములు చదువుటతోబాటు ప్రాత పుస్తకములుగూడ పలు మారులు చదివి యానందింతురు. వారితోడ నుండిన విద్వాంసులు మంచి విద్వ-త్కుటుంబములకు చెందినవారు, కొన్ని ప్రబంధములు రచించియున్నారు. పెక్కు వత్సరముల కాలముగ వారి యాస్థానపండితులుగనే యుండినవారు. పది గంటలకు కొలువుకూటమునకు పోయి సంస్థానసంబంధులగు పనులు చూచుకొందురు. పిదప స్నానము, అహారము మొదలగునవి ముగించుకొని మగుడ నపరాహ్ణవేళ రెండు గంటలకు తమిళగ్రంథములు చదువ కూర్చుందురు. నాలుగు గంటలవరకు చదివి, ఆరు గంటలవరకు సంస్థానకార్యముల పర్యవేక్షింతురు. ఆరు గంటలకు పైబడి తమ్ము చూడవచ్చినవారికి దర్శన మిత్తురు. తమ ప్రజల లోటుపాట్లు విచారింతురు. వారు దానిని లేఖలో వ్రాసి సమర్పింతురు. వాని నన్నిటిని పిమ్మట చూచి మరునాడు

తమ యభిప్రాయము వెలిబుచ్చుదురు. వెలుపలి యూళ్లనుండి వచ్చినవారికి కొంచెమేని లోటు రాకుండ ఉపచారములు జరుగును.

సాయంకాల మాలయమునకు పోవుదురు. అచ్చట నవనీతకృష్ణస్వామిదేవళమున్నది. హృదయాలయ మరుదప్పదేవుల యేల్బడిలో నిత్యనైమిత్తికములు మిక్కుటమైన వైభవముతో జరగినవి. జమీందారులకు నవనీతకృష్ణుడే కులదైవతము. ఆలయము చిన్నదైనను పెద్ద పెద్ద దేవాలయములలో జరుగునటువంటి వైభవములు నచ్చట చూడనగును. పలు పక్వాన్నములును, లడ్డు, జిలేబి, తేనెతొాలలు మున్నగు భక్ష్యవిశేషములును శ్రీకృష్ణభగవానునకు నివేదన చేయబడును. అన్నియు 'అప్పుడు వెన్న కరగిన యప్పటపు నేతితో' చేయుదురు. ఒక లడ్డు ఒలిచిన కొబ్బరికాయయంత ఉండును. తేనెతొాల పెద్ద గంధపు సానరాయంత ఉండును. ఆ ప్రసాదములను వెలుపలి యూళ్ల నుండి వచ్చిన యతిథులకు పంపించుట జమీందారుల అలవాటు. సాయంకాలము మరుదప్పదేవరు స్వామిదర్శనము చేసికొందురు. అచ్చట కొందరు సంగీతవిద్వాంసులు మధురగీతములు గానము చేయుచునే యుందురు.

ఇంత విలక్షణముగను, చాతుర్యముగను వారు సాగించుచున్న పరిపాలన అన్యప్రదేశముల నే చూడలేదు. జమీను చిన్నదై యున్నను వారు తమ పరిపాలనా దక్షతవలన దానికి గొప్పతనము చేకూర్చిరి. వా రొక పెద్ద దేశమున కధిపతులై యున్నచో నెన్నియో సత్కార్యములు చేసియుందురే - అని యాలోచించి చూతును.

సాయంకాలము నాలుగు గంటలకు జమీందారును చూచితిని. తమిళకావ్యరసానంద మిరువుర మనుభవించితిమి. ప్రాచీనగ్రంథములనుగూర్చియు, అర్వాచీనగ్రంథములనుగూర్చియు నే నుత్సాహముతో మాట్లాడితిని. జమీందారుల నిశితమగు ద్రావిడభాషాజ్ఞానము తెలిసి సంతసించితిని. వా రెవ్వరిపైనను దోషములు చెప్పనే లేదు. నగరులో నున్న తాళపత్రప్రతులు చూచితిని. నా కుపయోగపడున దొక్కటియు లేదు. చిత్రానదీస్నానము, కమ్మని విందు, సౌహార్దపు ఊటయై వెలువడు జమీందారుల సల్లాపము, ద్రావిడకావ్యాస్వాదజనితాహ్లాదమును ఒక్కట గూడి అచ్చట వసించియున్న నా కొన్నినాళ్ల జీవితమును దేవలోకవాసముగ చేసివేసినవి. నేను రాజోపచారములు పొంది సుఖించితిని. రాజోపచార మన్నది ఉపచారపదము కాదు. నిజముగ నది రాజోచితోపచారమే. నేను రాజను కాకుండు టొక్కటే కొదవ.

నా జీవితకాలమంతయు నచ్చటనే యున్నను నాకు విసుగు పుట్టదు, జమీందారును ఉపచారములందు ఏ కొరతయు రానీయరు. కాని అది సాధ్య మగునా? నే నుద్యోగము నిర్వర్తించుచుండుటయే గాక, తమిళపు తాళ పత్రములకై ఊళ్లన్నియు తిరిగి యగచాట్లు పడవలసిన సొంత పని యొక్క టున్నదే!

ఒకనాటి సాయంకాలము సెలవు పుచ్చుకొంటిని. అప్పుడు వారు "ఇచ్చటి నుండి బండియు, వంటవానిని ఏర్పాటు చేసి, పాత్రలు, సామగ్రియు పంపుదును. మీ రెచ్చెచ్చటికి పోవలెనో ఆ చోటుల కెల్ల పోవచ్చును" అనిరి. "నేను పోవు ప్రదేశములం దెల్ల వంటవాని నుంచుకొని విం దారగించుట వీలు కాని పని. దానికి తగిన వసతి యుండదు. పలు తావులందు దొరకినది దొరకిన వేళల తిని తాళపత్ర ములు వెదకుదును. ఉపవాసముగూడ చేయవలసి రావచ్చును. నాకే యిట్లుండ బండి యెద్దు, బండివాడు, వంటవాడు - ఇంతటి పరివార ముంచుకొనినచో నాపని నెర వేరదు. తిరుక్కట్రాలమువరకు పోవుటకై బండి పంపించు నేర్పాటు చేసిన చాలును" అని యడిగికొంటిని. అట్లే యేర్పాటు చేసిరి. మరునటి దినము వేకువజామున బయలుదేరవలెను.

వీడ్కో లందిన తరువాత బసకు వచ్చితిని. నాటి రాత్రి పది గంటలకు అల వాటు చొప్పున నా కొక్కరు బాగుగ ఇరగకాచిన పాలు కొనివచ్చి యిచ్చిరి. 'తేనె పాగు', కుంకుమపూవును చేర్చి చిక్కగ కాచిన యది గ్రోలుచున్నపుడు 'ఇంతటి యుపచారము మన మెక్కడ పొందగలము? ఇంతటి యభిమానముగలవారిని ఎ ట్లెడబాయుట?' అను తలపు తలయెత్తగనే నా కన్నులనుండి పలపల బాష్ప కణములు తొరగినవి.

మరునాడు వేకువన లేచితిని. బండి సిద్ధమైయుండెను. మరల నొకసారి జమీం దారుల జూడవలయు నని తోచెను. పోయి చూచితిని; నన్ను చూచి వారు సంభ్రాం తులై "ఏమి విశేషము? బండి రాలేదా?" అని ప్రశ్నించిరి.

"అన్నియు వచ్చినవి. మీ సన్నిధి బాసిపోవ మనసు రాకున్నది. తమిళ భాషాకైంకర్యము ముందుకు లాగుచున్నది. రాత్రి నేను క్షీర మానుచున్నపుడు

ప్రభువుల పరమప్రీతిని తలపోసి నా మనసు ద్రవీభూత మాయెను. మరల చూచి పోవలయు నను నుత్కంఠతో వచ్చితిని. అనుమతి పుచ్చుకొందును" అని చెప్పి నిలిచితిని.

"నాకును విచారముగనే యున్నది. ఏ సమయమున మీకు తీరుబడియుండునో అప్పు డెల్ల ఇటకు వచ్చియుండి మాకు ద్రావిడభాషామృతము చుబ్బనచూరగా చేయవచ్చును" అని వారు ప్రేమమీర పలికిరి.

వీడ్కొని యెడబాసితిని. నాడు వారిని చూచినదే. పిదప వారిని చూడ వీలు కాకుండ దైవము చేసినది.

నా హృదయము హృదయాలయమరుదప్ప దేవులయందే యుంచి తిరుక్కుట్రా-లము చేరితిని.

తిరుక్కుట్రాలమునకు పోయినపుడు 'మేలగరము' నుండి త్రికూట రాచప్ప కవిరాయరు అచ్చటికి వచ్చియుండిరి. వారిని గాంచిన క్షణమే, ఆ ప్రాంతముల బహుజనపదములకు పోయి తాళపత్రములు వెదకవచ్చు నను నుత్సాహ ముప్పొం-గెను. "నేను ఊట్రుమలకు పోయి వచ్చినాను. కుంబకోణము చేరిన వెనువెంటనే శిలప్పదికారముద్రణ యారంభింపవలెను. అంతకు మునుపు తాళపత్రములు దొరకెడు ప్రదేశములకు మిమ్ము తోడుగ నిడుకొని పోయి చూచిరా తలపుకొని యున్నాను" అని చెప్పితిని.

వారు "అట్లే చేయవచ్చును" అనిరి.

వారితో శొక్కంపట్టి మున్నగు పెక్కు గ్రామములకు పోతిని. అచ్చటచ్చట పలువురు పండితుల యిండ్ల చూచితిని.

'తెన్‌కాశి'కి వచ్చితిని. నైషధాదులు రచించిన అధివీర రామపాండ్యుల గురువులు వసించుచుండిన మఠ మొక్కటి యచ్చట నున్నది. అచ్చటకి పోయి చూచితిని. నాకు కావలసిన దొక్కటైనను దొరకలేదు. ఒక యింటిలో సుబ్బయ్యా పిళ్లై అను నొక ఘనుల సంధించితిని. వారు తమకు కొన్ని ప్రాత పద్యములు వచోవిధేయముగ నున్న వని చెప్పి—

'చెలియా, రివ్వున వ్రాలి గ్రద్ద తన్నుకొనిపోవునపుడు పడగ విప్పగ,
ఒకవైపు చెవి (దారము) తెగిన ఒడిసెలవలె నుండెడు సర్పములు గలట్టి,
ఆపదల కిక్కయగు జెముళ్లయడవి నేగిన వారు నను తలపకుందురచే' ?

అను నర్థముగల పద్యము చెప్పిరి. పద్యమునడకను బట్టి అది సంఘకాలపు పద్యముగా నుండు నని తోచెను.

"దీని నెందుండి తెలిసికొంటిరి ?"

"నాయెడ నున్న తాళపత్రములలో ఇట్టివి పెక్కు పద్యము లుండినవి."

"అటులనా ? ఆ తాటాకులు నేను చూడవచ్చునా ?"

"నా యిల్లు నా స్వాధీనమున లేదు. నా యొద్ద నున్న తాళపత్రగ్రంథములు నా యాస్తితోబాటు పెరవారి చేతులకు పోయినవి."

నేను దేని దేనిని మిక్కిలి యాశతో ప్రతీక్షింతునో అప్పు డది యీడేరక వంచితుడ నగుట నా కలవాటైపోయినది. సుబ్బయ్యాపిళ్లై చెప్పిన పద్యములును, వారు మొదట చెప్పిన సంగతులును "ఇంతవరకు చూడని యొక క్రొంగ్రొత్త పుస్తకము నేడు చూడబోవుచున్నాము" అను నాశ పుట్టించినవి. వారు ఋణబాధచేత అన్నియు పోగొట్టుకొని తలదాచుకొనియుండి రని పిమ్మట తెలిసికొని మిక్కిలి కుందితిని. వారు తమ యాస్తి పోగొట్టుకొని రనుటకై నేను వగవక తమిళసంపద వారి చేయి జారిపోయినదే యనుటకై వందురితిని.

"అట్లైన మీయెడ నిప్పుడు ఒక తాళపత్రప్రతియైనను లేదా ?" అని సన్నని యెలుగున నడిగితిని.

"కొన్ని విడియాకులును, ఒకటి, రెండు పుస్తకములును ఉన్నవి" అనిరి.

వానిని చూపు డని యడుగగ వారు "ఒక యింటి యటుకపైనుంచి యున్నాను. పగటివేళ వచ్చి యెత్తి యిచ్చుటకు వలనుపడదు. రాత్రి కొనివత్తును" అని పలికిరి.

నాటి రాత్రి ఆ విడియాకులు వారినుండి లభించెను. వానిలో ఆరు పద్యము లుండెను. 'శిత్రట్టకము' అను ప్రాత గ్రంథమునకు చెందినదై యుండవచ్చు నని భావించితిని, నేటివరకును ఆ గ్రంథము దొరకలేదు.

విడియాకులు దొరకినను ఒక పెద్ద గ్రంథము దొరకినట్లు నేను సంతోషించి సుబ్బయ్యాపిళ్లైను కొనియాడి వీడ్కొంటిని. తెన్‌కాశినుండి కొన్ని యితరగ్రామ ములకు పోయి చూచియు శిలప్పదికారముముద్రణమునకు పనికివచ్చు తాళ పత్రములు దొరకలేదు. కుంబకోణము వచ్చిచేరితిని.

అడియార్కు నల్లార్ వ్యాఖ్యానమున నున్న లోటు తీర్చుకొనుటకు నే నను భవించిన త్రిప్పటయు, ప్రయాసయు నింతింత కాదు. ఏబదికి పైబడిన యూళ్లకు పయనము చేసితిని. ప్రతీక్షించిన ఫలము చేకూడలేదు. ఇకపై ప్రయాణములు నిలిపి వేసి శిలప్పదికారమును ముద్రించుటకై వలయు ప్రయత్నములు చేయవలె నని నిర్ణ యము చేసికొంటిని.

# 55. శిలప్పదికార ముద్రణము

శిలప్పదికారమందలి పుకార్‌కాండపు మూలముమాత్రము ప్రెసిడెన్సీ కాలేజిలో తమిళపండితులుగ నుండిన శ్రీనివాసరాఘవాచార్యు లనువారు మునుపు ముద్రించియుండిరి. 'శేరమాన్ పెరుమాళ్ నాయనారు' రచించిన 'శిలప్పదికారము' అని వారు ముద్రించిరి. 1880 వ సంవత్సరమున షోడశావధానము సుబ్బరాయచెట్టి యారు ఆ కాండపు మూలమును అడియార్కునల్లార్ వ్యాఖ్యానముతోడ నచ్చిడిరి. రెండు ముద్రణలును ఆకాలమున శిలప్పదికారము పాఠ్యముగ నుండుటచేత ప్రకాశి తము లైనవి. వానిలో నానావిధముల తప్పు లుండినవి. చెట్టియారు "కఠినశైలిలో నున్నవానిని సులభశైలికి మార్చియు, వలసినచోట్ల వివరించియు, సంక్షేపించియు, 'కానల్‌వరి'కి వ్యాఖ్య లేకుండుటచేత వ్యాఖ్య వ్రాసియు, 'అరంగేట్రు'గాథలో హద్దులు మీరి వ్యాపించియున్న సంగీత-నాటక లక్షణములు పలుతావుల వచ్చుటచేత అటనట నున్న వ్యాఖ్య యిచ్చట సంక్షేపించియు" అచ్చొత్తించినట్లు పీఠికలో తెలియ

జేసియున్నారు. అందుచేత అడియార్కునల్లార్ వ్యాఖ్య మొత్తమల్లే ఆ ముద్రణ యందు అమరియుండలే దని తెలియవచ్చెను. వారు మధురైకాండమునుగూడ అచ్చొత్తింప గడగియు నది నెరవేరలేదు.

ఈ రెండు అచ్చుప్రతులవలన నా కెట్టి మేలును కలుగలేదు. నేను వెదకి సేకరించిన వానిలో వ్యాఖ్యానప్రతులు పదునాలుగును, మూలప్రతు లెనిమిదియు నుండినవి. వానిని బాగుగ శోధించి నిర్ణీతమైన పాఠమును 'చేతి ప్రతిలో' పొందు పరచుకొంటిని. పిదప గ్రంథమున కంగములైన భాగములు కూర్చ దొడగితిని. తమిళగ్రంథప్రచురణయందు కాలము గడచుకొలదియు కలిగిన పరిశోధనాభ్యాస మును ప్రాచీనతమిళగ్రంథజ్ఞానమును క్రొత్త క్రొత్త తీరుల తోపజేసినవి. చింతా మణి ప్రచురణకంటెను పత్తుప్పాట్టులో కొన్ని నూతనాంశములు చేర్చితిని. అందున కంటెను శిలప్పదికారమున నింకను కొన్ని క్రొత్త యంశములు విమర్శించువారి కొదవునట్లుగ కూర్పవలె నని తోచినది. వానికి కావలసిన విషయములు శిలప్పదికార మూలముననను, వ్యాఖ్యానమునను కొల్లలై యుండినవి. అడియార్కునల్లార్ వ్యాఖ్య వలన తెలియవచ్చు గ్రంథములనుగూర్చి టిప్పణి తప్పక వ్రాయవలె నను నభి లాష నాలో మిక్కుటమై తలసూపెను. మూలముననను, వ్యాఖ్యయందును తెలియు నట్టి రాజులు మున్నగువారి పేళ్లను వింగడించి, అకారాద్యనుక్రమముగ పొందు పరపవలె ననునట్టిది మరి యొక కోర్కె. ఈ విధముగ విమర్శనసరణులు విస్తృ- తము లగుచునే పోయినవి. వేర్వేరుగ విషయములు సేకరించి తరగతులుగ విభజించి ప్రత్యేకశీర్షిక లిడి యమర్చి అకారాద్యనుక్రమముగ వ్రాయించితిని.

విశిష్టపదముల నన్నిటిని ఒక్కచో జేర్చి అకారాదిగ వ్రాసికొంటిని. అవు దగు విషయముల నన్నిటిని ఒక్కెడ జేర్చి 'విషయ సూచిక' అను పేరు పెట్టి ప్రత్యేక ముగ నొక 'అకారాది' సిద్ధపరచితిని. ఇట్లే గ్రంథమువలనను, వ్యాఖ్యామూలమునను తెలిసిన తేళ్లు, నాళ్లు, ఊళ్లు, కొండలు, ఏళ్లు, కోనేళ్లు, దేవుళ్లు, పండితులు—మున్నగు వాని పేళ్లకు ప్రత్యేకముగ అకారాదియు, అడియార్కునల్లారువ్యాఖ్యలో కనిన గ్రంథముల కకారాదియు, సమాసముల కకారాదియు, అర్థము కాని యుదాహరణ ముల కకారాదియు, అభిధాన ప్రకాశమును వ్రాసి ముగించితిని. శిలప్పదికారకథా సంగ్రహము, ఇళంగోవడిగళ్చరిత్రయు, అడియార్కునల్లారు చరిత్రయు, సంవాద గ్రంథములగూర్చిన టిప్పణులును వ్రాయబడినవి.

అన్నిటిని చక్కబరచుకొని మున్నుడి వ్రాయదొడగితిని. మునుపటి గ్రంథ ప్రచురణలలో గ్రంథ మచ్చగుచుండినప్పుడే మున్నుడి వ్రాసితిని. దీనికి ముందుగనే వ్రాసినచో పిదప కావలసిన వానిని చేర్చుకొనవచ్చు నని తలపోసితిని.

తాటాకుపుస్తకముల పరిస్థితి తెలియజేయవలె నని నా యభిలాష అగుటచే మున్నుడియందు "పై జెప్పిన ప్రాతప్రతులు పెక్కు, ఇకపై దోషజుష్టము లగుటకు అవకాశము లేనంతగ తప్పులతో నిండి, పెక్కేండ్లుగ తమ్ము చదువువారు గాని చదివించెడువారు గాని లే రనియు, గ్రంథములు పైకి లేవదీసి వ్రాసి సేకరించి పెట్టుటే వ్రతముగ పూనియున్న కొందరు పుణ్యశాలులవలననే తాము స్వరూపము గొని యుండుటయు చక్కగ తెలియబరచినవి. ఒక్కదానితో నొకటికి పొందిక లేక అస్తవ్యస్తములై, లుప్తములై, శిథిలములై, అర్థానుగతి లేక పడియున్న ఈ ప్రతులను పరిశోధించిన క్లేశమును తలచినంతనే హృదయము కరగిపోవును" అని వ్రాసితిని.

ఇట్లు శిలప్పదికారము ముద్రించుటకు తగిన స్థితిలో ఆయత్తపరచి పూర్తి చేయు తరుణమున కొలంబో పో. కుమారస్వామి మొదలియారుకు ఆ వృత్తాంతము తెలియజేసితిని. శిలప్పదికారముద్రణవ్యయము తాము పెట్టుకొనునట్లు మునుపు వ్రాసియుండుటయే గాక అడుగడుగున గ్రంథమునుగూర్చి విచారించుచుండిరి. వారు రూ. 300 పంపునట్లు తెలిపిరి. శిలప్పదికారముద్రణ నెరవేర్చుటకు ఆ మొత్తము చాలదు; అయినను పూనుకొంటిని.

1891 వ సంవత్సరము జూన్ నెల వేసవి నెలవులలో చెన్నపట్టణమున కేగి శిలప్పదికారము ముద్రింప మొదలిడితిని. ద్రావిడరత్నాకర ముద్రాక్షరశాలవా రడిగిన 'కూలి' అధిక మని తోచుటచేత 'వెళ్లయ్యనాడారు జూబిలీ' ముద్రణాలయమున ముద్రింప నేర్పరచుకొంటిని.

శిలప్పదికారపు విశేషపదటిప్పణి చెల్లాచెదరై యుండుటచేత దానిని ప్రచురింతమా, వలదా యని యాలోచించుచుంటిని. 'శిలప్పదికారము ముందు నెరవేరినచో పిదప చూచుకొనవచ్చును' అని తలచి ఒక నిర్ణయమునకు రాకయే నిలిపితిని.

చెన్నపట్టణములో నుండిన యా కాలమందు ఆ నగరమందున్న పలువురు విద్వాంసులిండ్లకు పోయి తాళపత్రములు వెదకితిని. శరవణప్పెరుమాళయ్యరుగారి మునిమనుమలగు గురుస్వామి అయ్యరనువారి యింటిలో శిలప్పదికారవిశిష్టపద టిప్పణికి సంబంధించిన పది విడియాకులు దొరకినవి. వానిని పుచ్చుకొని నాయొద్ద నున్న తాటాకులతో పోల్చిచూచి దిద్దుపాట్లు చేసికొంటిని.

విరామదివసములు గడచిపోవుటచేత ముద్రణకార్యము తిరుమానూరు కృష్ణయ్యరు గమనించుకొనునట్లును, ప్రూఫులు నాకు పంపునట్లును ఏర్పాటు చేసికొని కుంబకోణమున కరుగుదెంచితిని.

అలవాటు చొప్పున కాలేజిపనితోబాటు శిలప్పదికారముముద్రణకార్యమును గూడ గమనించుకొనుచుంటిని. ఆ గ్రంథముద్రణమునకై కాగితముధర, అచ్చుకూలి మున్నగువానికి చాలినంత పైకము నాచేత లేదు. పుస్తకమునకు కావలసిన విషయములను తేటతెల్లముగ పొందుపరచు ప్రయత్నమునందుమాత్రమే నా నేర్పు పెరిగినదే కాని గ్రంథప్రచురణకు వలసిన ఆర్థికసౌకర్య మేర్పరచుకొను నేర్పుపై నా మనస్సు హెచ్చుగా పోలేదు. శిలప్పదికారమునందు ఏడు గాథలు ముద్రింపబడినవి. ఇకపై 23 గాథలు పూర్తికావలసి యుండినవి.

నా పరిస్థితిని ద్రావిడభాషాభిమానులకును, మిత్రులకును, ఘనులకును తెలియజేసితిని. ఘనులు పలువురు తగిన సమయమున ఆర్థికసహాయ మొనర్చిరి. అందుచేత పైన ముద్రణ సాగించుటకు వలసిన ధైర్యము నా కేర్పడెను.

శిలప్పదికారముద్రణను త్వరితముగ నెరవేర్చి పిదప ఇతరగ్రంథములను ముద్రింప దొరకొనవలె నని తలచితిని. ఎడనెడ 'పుఱనానూఱు' 'పదిర్రుప్పత్తు' 'మణిమేఖలై' మున్నగు ప్రాచీనగ్రంథముల పరిశోధనయు నడచుచునే యుండెను. ఆ కాలమున నా యనుంగు మిత్రులును, మహోదారులును అగు సేలం రామస్వామి మొదలియారును కోల్పోవు దౌర్భాగ్యము ఈ తమిళదేశమునకు సంభవించినది. 1892 వ సంవత్సరము మార్చి నెల రెండవ తేది వారిహాలోకజీవయాత్ర చాలించిరి. ఆ విషాదవార్త విని నేను మిగుల తల్లడిల్లితిని. వారి పరిచితి నా కేర్పడుటయు, అందుచేత ప్రాత తమిళగ్రంథముల పరిశోధనలో నేను చొచ్చుట సంఘ

టిల్లుటయు భావించి చూచితిని. వారి ప్రేరణయే లేకుండినచో నేను చింతామణి నచ్చొత్తించుట ఎక్కడి మాట? సంఘకాలపు గ్రంథముల గొప్పతనము నారసి యానందించి వెలువరచు ప్రయత్నమునకును, నాకును సంబంధ మేమి?

శిలప్పదికారము, మణిమేఖలై అను రెంటిని పుస్తకరూపమున చూడవలె నని మొదలియా రెంతయు కుతూహలముతో నుండిరి. వా రుండిన కాలమందు ఆ రెంటిని నెరవేర్చు శ్రేయము నాకు దక్కకపోయెను.

శిలప్పదికారముమూలము వ్యాఖ్యానమును సమాప్తి చెందు దశలో నుండెను. మిత్రులు పెక్కురు విశిష్టపదటిప్పణిని ముద్రించి ప్రకటింపవలె నని నొక్కి చెప్పుటచే దానిని సరిపరచి శిలప్పదికారమునకు వెనుక అచ్చొత్తింప నిచ్చితిని.

శిలప్పదికారమునకైన మున్నుడి మొదట వ్రాసితిని. అందు విశిష్టపద టిప్పణినిగూర్చి అధికముగ వ్రాయక ఒక్కెడ క్రింది సూచనలో 'ఈ విశిష్టపదటిప్పణి ప్రత్యేకముగ ముద్రితమై ఈ పుస్తకము తుది భాగమున కూర్చబడియున్నది.' అని మాత్రమే వ్రాసితిని.

విశిష్టపదటిప్పణి యంతయు అచ్చైన తరువాత దానినిగూర్చి తెలియపరప వలసినవానిని ప్రత్యేకముగ వ్రాయవలె నని తోచినది. దానిని వ్రాసినచో శిలప్పది కారగ్రంథము పూర్తి చెందును.

ఇట్టి దశలో ముద్రాక్షరశాల కీయవలసిన పైకము నాయెడ లేకుండుటచేత తిరువళ్లిక్కేణిలో నున్న 'నార్టన్' దొరగారి గుమాస్తాయగు విశ్వనాథశాస్త్రిగారి యొద్దకు జని వలసిన మొత్తమును పుచ్చుకొంటిని.

నాడు శుక్రవారము. శనివారమునాడు శిలప్పదికారముపని పూర్తిచేసి, ఒక పుస్తకము బైండు చేయించి, కన్నులార గాంచి కుంబకోణము పోవలె నను కోర్కె బలీయమై యుండెను. శుక్రవారము సాయంకాలము విశ్వనాథశాస్త్రిగారిని డాసి నప్పుడు వారు నాటి రేయి తమ యింటనే నన్ను భుజింపజేసిరి. రాత్రి యచటనే విశ్రమించితిని.

విశిష్టపదటిప్పణికి పీఠిక వ్రాయదలచి కాగితము, కలమును శాస్త్రిగారి యొడ ఎరవుగ కొని వ్రాయ కూర్చొంటిని. నాకుండిన అలపుచేతను, ఆకొని

యాహారము స్వీకరించుటచేతను తక్షణమే నిదుర న న్నావహించెను. ఏమి చేయుటకును అలవిగాక పవ్వళించితిని. పడుకొనునప్పుడు 'ఇప్పుడును పీఠిక వ్రాయలేదే. రే పెనిమిది గంటలకు ముద్రణశాలయం దిచ్చిననే కద రేపే పుస్తకము పూర్తి చేయించి కన్నులార గాంచవచ్చును' అను విచారముమాత్రమే యుండినది.

'వేకువ జామున మేల్కాని వ్రాయవలయును' అను తీర్మానముతో ఒక మైనపు వత్తియు, అగ్గిపెట్టెయు తీసి యుంచుకొంటిని.

ఆదమరచి నిద్రించితిని. రాత్రి నడుమ మెలకువ వచ్చెను. అపూర్ణమైన శిలప్పదికారపుస్తకము నా మనోనేత్రమున కెదుట నిలచెను. లేచి దీపము వెలిగించి చూడగ రెండు గంటలే అయి యుండెను. అరగొర నిదురలో లేచినందున మగుడ పడుకొనవలయు నను భావమే తల యెత్తి నిలిచినది.

'పడుకొనినచో నాలుగు గంటలకు మేల్కొన వీలగునా? అలపుచేత చాలసేపు నిదురించినచో కార్య మరగొరయై నిలిచిపోవునే' అను నిట్టి పెక్కు భంగుల చింతలు తలయెత్తినవే కాని వ్రాయవలె నను నుత్సాహము కలుగలేదు. లోకమంతయు గుఱ్ఱుపెట్టి నిదురించు నా సందర్భమున దస్సియున్న ఆ దశలో నాకుత్సాహ మేర్పడుటకు అనుకూలమగు వస్తు వేదియులేదు.

కన్నులు తిరిగినవి. ఆవులించితిని. తల యెత్తినపుడు ఎదుటి గోడపై నున్న ఒక పటము నా కన్నుల బడెను. ఫలానావారి పటమని తెలిసికొన వీలుకాలేదు. పటమునందున్నవారు మిక్కుటమగు నుత్సాహమును, అధ్యవసాయమును కలవారనునది ఆకృతియందే తెలియనాయెను. ఆ యాకారము నా యుల్లమున నుత్సాహముదయింప జేసెను. 'వా రెవ్వరో తెలియలేదు. ఎంత చురుకుగ నున్నారు! మనము అలసి సొలసి యున్నామే' అని తలపోసితినో లేదో, వెంటనే కలము చేత బట్టితిని; వ్రాయ దొడగితిని.

విశిష్టపదటిప్పణినిగూర్చి నాస్మృతికి తగిలినవానిని గొని సంగ్రహముగ నొక పీఠిక వ్రాసి ముగించితిని. అట్లు వ్రాసినది మరల చదివి పరిష్కరించి యుంచుకొంటిని. పిదప నాకు నిదుర వచ్చుటకు కత మేమి?

ప్రొద్దున విశ్వనాథశాస్త్రిగారిని ఆ పట మెవ్వరి దని విచారించితిని. వారి ఖామందులగు దొరగారి దని తెలిసికొంటిని. ఆ పటమును చూడగ నాకు కలిగిన యుత్సాహమును, దానివలన ఫలించిన శ్రేయస్సును వారియెడ చెప్పితిని. శనివారము నాడు శిలప్పదికారమున మిగిలి యుండిన భాగము లన్నియు అచ్చైనవి. ఆదివారము నాటి రాత్రి బైండు చేసిన ప్రతి యొకటి పుచ్చుకొని కుంబకోణమునకు బయలు దేరితిని.

శిలప్పదికారపుస్తకములు బైండయి చెన్నపట్టణమునుండి వచ్చిన వెంటనే పంపవలసినవారి కెల్లరికిని పంపితిని. దానిని చూచిన మిత్రులు మిక్కిలి కొనియాడి లేఖలు వ్రాసిరి.

జీవకచింతామణియు, పత్తుప్పాట్టును తమిళదేశమున విహరింప దొడగిన పిదప ప్రాచీనతమిళగ్రంథముల వైశిష్ట్యము తెలిసి యానందించు నలవాటు అర వలయం దేర్పడినది. వాని పిమ్మట శిలప్పదికారము వెలువడగ ప్రాచీనతమిళదేశపు నిసర్గము, తమిళదేశమున నున్న కలావ్యాప్తివిశిష్టతయు నెల్లరకు తెల్ల మాయెను. 'కని యెరుగని వానిని గాంచితిమి' అని కవులును, విమర్శకులను ఆనందసాగర మున నోలలాడిరి.

శిలప్పదికారము మిక్కిలి యరుదగు చారిత్రికాంశములు నిండినది. తమి ళమునాటి యొడయడగు 'శెంగుట్టువన్' ఉత్తరదేశమునకు పోయి, ఔత్తరాహుల నోడించి 'కణ్ణకి' శిలాప్రతిమ కొని తెచ్చిన యుదంతము మిగుల విస్మయము కలి గించినది. అంతియ కాక సంఘకాలము నిర్ణయించుటకు శిలప్పదికారము మిగుల ముఖ్యాధారమై యున్నది. తమిళదేశచరిత్రవిమర్శయందు ప్రవీణులగు పలువురి దృష్టి నా గ్రంథ మాకర్షించినది.

అడియార్కునల్లారువ్యాఖ్యానమువలన తెలిసిన యితర గ్రంథముల పేళ్ల ద్రావిడాభిమానుల జ్ఞానమునకు విందు లైనవి. దానిని ప్రతీక్షించియే వారి వ్యాఖ్య యందు గనిన గ్రంథములనుగూర్చిన టిప్పణి ప్రత్యేకముగ కూర్చి ప్రకటించితిని.

ఆ వ్యాఖ్యానమునుండి నే నెరగిన పెక్కు సంగతులలో ముఖ్యమైనది 'పెరుంగదై' (బృహత్కథ)అను గ్రంథప్రాశస్త్యమే. నేను వెదకి సేకరించిన

గ్రంథములలో కొంగువేళ్మాక్కదై అనున దొక్కటి. అది యెవ్వరో కొంగువేళ్ అను నొక్కరినిగూర్చిన కథగా నుండు ననియే తలచియుంటిని. ముందు వెనుకలు లేని యా తాళపత్రప్రతి నా పెట్టెలో నిద్రపోవుచుండెను.

అడియార్కునల్లారువ్యాఖ్యానము పరిశోధించినపుడు ఒకచోట 'కూత్తియ రిరుక్కైయుం శుట్రియదాక, కాప్పియవాళనై కలందవై శొల్లి' అను చరణములు వా రుద్ధరించి చూపియుండుట గాంచితిని. మధ్యమసంఘకాలపు గ్రంథములు పరిశోధించి రచించిన ఉదయనుని కథలో ఆ చరణము లున్న వనివారు తెలియజేసియుండిరి.

ఒకనాడు నాయొద్ద నున్న కొంగువేళ్మాక్కదై తాళపత్రప్రతిపుటలు త్రిప్పి చూచుచుంటిని. అప్పు డా రెండు చరణములు అందు కనిపించినవి. పూనికతో గమనించితిని. ముందు వెనుకలు చూచితిని. ఉదయను డను పేరు పలుతావుల వచ్చెను. కొంగువేళ్మాక్కదమే ఉదయనకథ యని తెలియవచ్చెను. ఇంకను అడియార్కునల్లార్వ్యాఖ్యనుండి దానికి 'పెరుంగదై', 'కదై' అను పేళ్లను ఉన్న వని తెలిసితిని. అందనుక అ గ్రంథమును గమనింపకయున్న నేను దాని నత్యం-తాసక్తితో చదివి చూడదొడగితిని.

నే వ్రాసిన గ్రంథటిప్పణులలో నా యెడనున్న తాటియాకుప్రతులనుండి తెలిసిన సంగతులను అన్నిటిని బహిరంగపరచితిని. ఉదయనచరిత్రనుగురించి వ్రాయునప్పుడు "ఇప్పుడు దొరకిన వ్రాతప్రతియందు తొలిమలిభాగములు ఖిలములైపోయినందున మొదటి 'ఉంజై' కాండమునందు 32 అవాంతరవిభాగములు కనిపింపలేదు. ఐదవ నరవాణకాండమునకు పైనున్న కాండము లివి యనియు, వాని అవాంతరవిభాగము లిన్ని యనియు తెలియలేదు. ఈ అడియార్కునల్లారు వ్యాఖ్యానపరిశోధనవలననే ఈ గ్రంథము ఈ కాలమున వెలువడిన దని చెప్పవచ్చును" అని సూచించితిని. ఆ గ్రంథముప్రతి నాయెడ నున్న దని యిందుమూలమున ఒక విధముగ సూచింప వలె నన్నదే నా లక్ష్యము. ఇట్లే అగనానూఱు, కుఱుందొగై, పదిట్రుప్పత్తు, పరిపాడల్, పుఱనానూఱు, మణిమేఖలై అను పురాతనగ్రంథముల గూర్చి సూచనలు విపులముగా వ్రాసితిని.

నేను వ్రాసిన యిట్టి సూచనలు తమిళభాషాభిమానుల యుత్కంఠను పెంపొందించినవి. మున్నుడి తుది భాగమున "ఈ శిలప్పదికారమువలెనే నేను

ప్రచురింపదలచిన యొక్కొక్క గ్రంథమును సంకల్పించిన విధమున నెరవేర్చుట కును, ప్రతు లిచ్చుట, ద్రవ్య మిచ్చుట, మున్నగు నుపకారము లొనర్చిన యుదారులు దీర్ఘాయుర్భాగ్యము పొందుటకును తగినట్లుగ పూర్ణానుగ్రహము ప్రసరింపజేయవలె నని సర్వశక్తుడును, పరిపూర్ణుడును, ఆదిదేవుడును అగు ఆ జగన్నాయకుని దివ్య పాదారవిందముల ప్రార్థించుచున్నాను" అని వ్రాసియుంటిని. ఇవన్నియు కలిసి తమిళనాడులో నొక్క సంచలనము కలిగించెను. అటనట నున్నవారు కూడి నన్ను దీవించి పయింబయి గ్రంథములు ముద్రించి ప్రకాశమొనర్పవలె నని తెలియజేసిరి. నా మిత్రులు వేర్వేరుగా లేఖలు వ్రాసి ఈయీ గ్రంథము లారంభింపవలె నని నిర్బం ధించి చెప్పిరి.

శిలప్పదికారము సమాప్తి నొందిన వెంటనే ఇట్లే తక్కిన సొమ్ములకు కూడ మెరుగులుపెట్టి తమిళముతల్లిని కైసేయవలె నను ప్రణయపూర్వకనిదేశము తమిళ దేశమువారినుండి నాకు లభించుటచేత మరల ఏ గ్రంథ మారంభింపనచ్చునా అను విచారములో మునిగియుంటిని.

నవరాత్రియుత్సవమునకై విచ్చేయవలె నని రామనాథపురం శ్రీ భాస్కర సేతుపతినుండి నాకు పిలుపుకమ్మ వచ్చెను. నేను కాలేజిలో పది దినములు సెలవు పుచ్చుకొని బయలుదేరి మధురలో దిగి, ఎద్దుబండిలో రామనాథపురమునకు పోయితిని. త్రోవలో పెక్కు బండ్లు మోయలేనంత సామానులు మోసికొని పోవు చుండెను. భారాధిక్యము చేత పెక్కు ఇరుసులు విరిగినవి. అన్నియు రామనాథ పురాభిముఖముగా పోవుట తెలిసి నవరాత్రిమహోత్సవవైభవమును ఒక విధముగ నూహించుకొంటిని.

ఈ తమిళనాడునుండియు, వెలినాడులనుండియు నూర్లకొలదిగా పండి తులు వచ్చియుండిరి. తమిళదేశపు ఘనులలో నొక్కరును మిగులలే దనియే చెప్పవలెను. ఊరు పట్టనంతటి గుంపు కూడియుండెను. వస్తువుల వెలలు పలు మడుగులు హెచ్చెను.

సేతుపతిరాజుల కులదేవతయగు రాజరాజేశ్వరిఅంబికకు 1008 శంఖ ములు పెట్టి యభిషేకము జరిగినది. పూజాదులు మిగుల విరివిగ జరిగెను. నాగ

స్వర కచ్చేరి, సంగీత కచ్చేరి మొదలగు వానికి లెక్కయే లేదు. సంస్కృత విద్వత్పరిషత్తు, తమిళపండితసభయు నడచెను.

నాకు ప్రత్యేకముగ విడిది ఏర్పాటు చేసియుండిరి. పలువురు బుధవరులు ఒక్కెడనే సంధించు సందర్భము ఆ విధముగ నేర్పడుట మిక్కిలి యరుదు. శిలప్పది కారము సమాప్తి చెందిన దను ప్రమోదమును విద్వాంసులును, మిత్రులును నాకు తెలియజేసి కొనియాడిరి. "మీ రిచ్చియున్నట్టి గ్రంథముల 'జాబితా' చూచినంతనే దిగ్భ్రమ కలుగుచున్నది. దీని తరువాత ఏది యారంభింపబోవుచున్నారు?" అని ప్రశ్నించిరి.

"మణిమేఖల యున్నది; పుఱనానూ ఱున్నది; పదిట్రుప్పత్తు, ఐంగుఱునూఱు, అగనానూఱు,నట్రిణై- ఇవన్నియు నున్నవి. ఇవి ఒక్కటొక్కటిగ వెలువరచవలెను." అని చెప్పితిని. ఫలానాగ్రంథ మారంభింపవలె నన్న నిర్ణయ మప్పుడు నా కేర్పడలేదు.

అక్కడ నున్న పది దినములును ప్రొద్దు గడచుటే తెలియలేదు. సేతుపతి యుపచర్యలును, చతురవచనములును, వారి మహావదాన్యతయు నా కాశ్చర్యము కలిగించినవి. ఆ యుత్సవమునకు రెండు లక్షల రూపాయలకు పైబడి వ్యయ మాయె నని తెలిసెను.

విద్వాంసులు సేతుపతిని పలువిధముల దీవించి పద్యములు చదివిరి. నేనును కొన్ని పద్యములు చెప్పితిని.

నేను సేతుపతిప్రభువులయొద్ద సెలవు పుచ్చుకొనినపుడు వారు నాకు రెండు బహుమూల్యములగు సాలువులు కప్పి "తంజావూరుజిల్లాకు వత్తును. అప్పుడు తీరిబడిగ మీతో మాట్లాడి మీ తమిళభాషాసేవకు వలసిన సహాయము చేయుదును" అని చెప్పిరి. పయనమైనపుడు దానాధికారి నా మార్గవ్యయమునకును, భోజనపు ఖర్చులకును నూరు రూపాయ లిచ్చిరి. నేను కుంబకోణమునకు వచ్చి నా తల్లిదండ్రు లకును, మిత్రులకును సాలువుల చూపితిని. ఎల్లరును సంతోషించిరి. తిరువావడు-

దుఱకు జని అంబలవాణదేశికులకు చూపినప్పుడు "మిక్కిలి ఘనమైన సమ్మానము : మీ యోగ్యత యరసి చేసిన సమ్మాన మిది " అని కొనియాడిరి.

"ఈ యాధీనముసంబంధము లేనిచో నాకేమి విలువ యుండును ?" అని చెప్పి "ఈ రెండిటి ధర యెంత యుండును ?" అని యడిగితిని.

"మూడు వందలకు పైబడి యుండును" అని అంబలవాణదేశికు లనిరి.

"ఈ దుప్పటాలవలన నాకు కలుగు లాభ మేమి ? వీని నిచ్చుటనే ఇచ్చి వేయవలె నని తలచుచున్నాను".

" ఏల అ ట్లనుచున్నారు ? ఒక గొప్ప సంస్థానమున పొందిన మర్యాద భద్రముగ కాపాడుచు నుంచుకొనుడు."

"శిలప్పదికారము ముద్రించుటవలన ఏర్పడిన శ్రమ మున్నది. అది తీర్చుకొను త్రోవ లేకున్నది. ఈ రెండు నుంచుకొని యేమి చేయగలవాడను ? తమిళముతల్లి శ్రీకైంకర్యమువలన కలిగిన గౌరవచిహ్నము లివి. కాబట్టి వీనిని మరల దానికే యుపయోగించుట న్యాయము" అని పలికితిని.

అంబలవాణదేశికులకు నేను వాని నిచ్చివేయుటలో సమ్మతి లేకున్నను, నా సూచన యెరిగి మరమునకే వానిని పుచ్చుకొని వాని మూల్యముగ 300 రూపాయలు నా కిప్పించిరి. నేను ఆ మొత్తమును పుచ్చుకొని శిలప్పదికారముముద్రణమువలన అప్పు డుండిన యప్పుల బాధనుండి విడుదల పొందితిని.

ఋణము తీరిన సంతోషమున తమిళగ్రంథప్రచురణనుగూర్చి యాలోచింపసాగితిని. పలుపొత్తములు నా చేత నున్నను మణిమేఖల, పుఱనానూఱు అధికముగ విమర్శించుచుంటిని. ఆ రెంటియందును పుఱనానూఱుకు సగమునకు పైబడి ప్రాచీనవ్యాఖ్య యుండినది. మణిమేఖలకు వ్యాఖ్య లేదు. అంతియ కాక, అది బౌద్ధమతసంబద్ధమైనది. ఆ మతగ్రంథభావములు నేను పూర్ణముగ తెలిసికొన నలవికాలేదు. అట్టి పరిస్థితిలో పుఱనానూఱే మొదట ముద్రింపవచ్చు నను ముగింపునకు వచ్చితిని.

# 56. 'పుఱనానూఱు'

పుఱనానూఱు ముద్రింప నిర్ణయించిన వెంటనే ముద్రణవిధానమునుగూర్చి యాలోచింపసాగితిని. రానురాను క్రొత్త త్రోవలందును, క్రొత్త విధానములందును విషయములు నేకరించి గ్రంథము ప్రచురింపవలె నను నభిలాష మెం డాయెను. ఆంగ్లము తెలియని నాకు ఆ భాషలో నున్న మేలైన ప్రచురణలు చూచి యానందించుటకును, వానివలె చేసి చూచుటకునుగాని యోగ్యత యేదీ? సంఘకాల గ్రంథము చదువుటకును, చదివిన పిదప పరిశోధన చేయుటకును, అటు పిమ్మట ముద్రించుటకును భగవత్కృపయే నాకు బాసటగా నుండెను. వానియందు పూర్వ పరిచయము లేని నేను ఏ యే తీరుల విమర్శన సలిపినచో మనోజ్ఞముగ నుండునో ఆ యా విధముల ప్రయత్నింప దొడగితిని.

కుంబకోణముకాలేజిలో చరిత్రాధ్యాపకులుగ నుండిన కె. ఆర్. దొరస్వామి అయ్యరనువారు ఒకనాడు తమచేత నాంగ్లపుస్తక మొక్కటి పట్టుకొని యుండిరి.

"ఏమి పుస్తకము?" అని యడిగితిని.

"బైబిల్" అనిరి.

"బైబిల్ చిన్నదిగగద యుండును; ఇది మిక్కిలి పెద్దదిగ నున్నదే?"

"ఇది యొక బైబిలు విశిష్టప్రచురణ. బైబిలులో నున్న విషయములను నేకరించి విషయవిభాగము చేసి, ఒకే విధమగు పదములును, భావములును గల భాగములను అచ్చుటచ్చుట చూపి ముద్రించి యున్నారు. ఒక్కొక్క పుటయందును మధ్యన ప్రత్యేకముగ ఈ 'సమానభాగము' ఉన్నది. దీనిని 'కన్‌కార్డన్స్' (Concordance) అని ఇంగ్లీషులో చెప్పుదురు" అని చెప్పి దానిని విప్పి చూపిరి.

ఆ సమానభాగములందు పలుతీరుల అంకెలు కన్పించెను. ఆ పుస్తకమందు వానినికూర్చినవారి చిత్రపటము, వారికి సహాయపడినవారి పటమును ఉండినవి.

"ఆ సమానభాగములవలన ప్రయోజన మేమి?" అని యడిగితిని.

"బైబిలులో ఒకే సంగతి పెక్కు చోట్ల వచ్చును. ఒకే తీరగు వాక్యములును వచ్చును. వానిని కూర్చుకొని పరిశోధింపగ కొన్ని విషయములందు నిజమైన యర్థము, కొన్ని పదములు శుద్ధస్వరూపమును స్పష్టపడిన వట. బైబిలు కెక్కి యుండిన యపపాఠములు ఈ శోధనవలన దిద్దుపాటు పొందిన వట" అని వారు నాకు విశదపరచిరి.

అప్పుడు నాకు పుఱనానూఱు విమర్శలో క్రొంగ్రొత్త విధాన మొక్కటి స్ఫురించెను. పుఱనానూఱులో నున్న విషయములను,పదములను మొదట అకారాదిగ అమర్చుకొని విమర్శించినచో నిజరూపము నారసికొనుట సులభముగ నుండు నని తెలిసికొంటిని. అట్లే చేసి యుంచుకొంటిని.

ఒక పుస్తకమును నిర్దుష్టముగ ముద్రింపవలయుచో పలు తీరుల సాధనములు మొదట నమర్చుకొనవలెను. తాళపత్రములు దొరకుటమాత్రము చాలదు. తాటాకులలో నున్న దంతయు శుద్ధముగా నుండదు. ఎన్నో నాళ్లుగ తప్పులుగనే యలవడి వచ్చిన పాఠము లందు చూడ నగును. వానిలో 'ఇదియే' సరియైన పాఠమని తెలిసికొనుటకై పడు పాట్లే మిక్కిలి హెచ్చు. గ్రంథములో నున్న విషయములకును, పదములకును అకారాది వ్రాసి యుంచుకొనుట మాత్రము చాలదు. పుఱనానూఱులో పలువురు కవుల రచన లున్నవి. ఆ కవులు రచించిన పద్యము లితర గ్రంథములలోగూడ నున్నవి. ఆ పద్యములను చూచిన ఆ కవివాగ్ధోరణియు, వారికి ప్రియమగు భావములును, నడకయు తెలిసికొనవచ్చును. ఆ విమర్శనుండి కొన్ని దిద్దుపాట్లు లభించును. కావుననే సంఘకాలపు కవుల పేళ్లను వరుసగా వ్రాసికొని, వారు వ్రాసిన పద్యములు ఏయే గ్రంథములం దున్న వని తెలిసికొని, కూర్చుకొని చదివితిని.

సంఘకాలగ్రంథములం దలవాటులో నుండిన సంప్రదాయము తెలిసికొనుటకు వాని నన్నింటిని విమర్శింపవలయును. సంఘగ్రంథము లన్నియు చేరి యొక దేహము వంటివి. ఆ దేహమంతటను వ్యాపించి యొకతీరగు నాడి స్పందించుచుండును. అందుచేత వాని నన్నిటిని క్షుణ్ణముగ నభ్యసించిననే ఆ సంప్రదాయము

స్పష్టముగ తెలియును. దీని నుద్దేశించియే నా యొద్దనున్న యన్ని సంఘగ్రంథము లకును అకారాద్యనుక్రమణిక వ్రాసి యుంచుకొంటిని.

పుఱనానూఱు పరిశోధన చేయుటకు సంఘగ్రంథముల నన్నిటిని శోధించు టవసర మాయెను. అందుచేత నాకు పది రెట్లానంద మేర్పడినను, ప్రయాసయు పది మడుగులు హెచ్చెను. పలువురి సహాయ మపేక్షింపవలయుటయు ననివార్యమై యుండెను.

పుఱనానూఱు పద్యములను, పద్యభాగములను లక్ష్యలక్షణగ్రంథవ్యాఖ్యాత లుదాహరణముగ చూపియున్నారు. ఆ భాగముల నుదాహరించి చూపవలసిన కారణ మును విమర్శించినచో పాఠము దిద్దుపా టగుటతోబాటు పద్యపుఅర్థముగూడ విశద మగును. ప్రయోగములను కూర్చుకొనుటకై అన్ని వ్యాఖ్యానములను పూర్తిగ చదివి పుఱనానూఱులోని భాగ మేదేని వచ్చునా యని చూడవలయును. అచ్చైన పుస్తకము లలో ప్రయోగవిశదీకరణము సాధారణముగ నుండుటలేదు. తాళపత్రగ్రంథములో నన్నచో ఉదాహరణపద్యములు కనిపెట్టుటే కష్టము. గ్రంథములు పాఠము విను వారు తమ యుపాధ్యాయులు చెప్పెడు విషయములను అచ్చటచ్చట తాటాకులలో రెండు పంక్తుల నడుమ వ్రాసియుంచుకొనుట గలదు. తాటాకులలో నున్నవాని నున్నట్లే ప్రతిచేసి దానికై రావలసిన ధనలాభము బొంది జీవనము చేయువారు ఆ గురుతులుగూడ ప్రాత మూలముతోడను, వ్యాఖ్యానముతోడను చేర్చి వ్రాసి వేయుదురు. పరిశోధన సలుపునప్పుడు వానిని వేరుపరచి తెలిసికొనుట కొన్ని సమయములందు మిగులు క్లేశకరముగ నుండును.

వ్యాఖ్యానములు చదువుచు వచ్చునపుడు అటనట నగుపడు నుదాహరణము లందు నాకు తెలిసిన వానికి ఆకరము అచ్చటచ్చటనే గుర్తించి యుంచుట నా యల వాటు. అచ్చైన తొల్‌కాప్పియ వ్యాఖ్యానములందును, తిరుక్కుఱళ్ వ్యాఖ్య యందును, ఇతరవ్యాఖ్యలయందును కనిన యుదాహరణలు పెక్కింటి యునికి పట్లు నా 'చేతిపొత్తము'నందు గుర్తించుకొనియున్నాను. ఆ జతనమున ఆ ప్రచురణ లలో నున్న అపపాఠములు నాకు స్పష్టమైనవి. నా ప్రచురణలయందు అవ్వాని శుద్ధ రూపము లమర్చుకొనుటయే గాని 'ఇది తప్పు' అని నిర్దేశించి చూపునట్టి యలవాటు నేను పెట్టుకొనలేదు.

ఇట్లుదాహరణముల శోధనలో గడచిన కాలము కర మధికము. ప్రయోగములను సేకరించి విభజించుటలో నేర్పడిన ప్రయాస యెంతయో హెచ్చైనను ఒకసారి పడిన శ్రమ పలుగ్రంథముల ముద్రణకు సహాయకారియై యుండెను. ఆ కాలమున నేను చేసియుంచుకొనిన పలువిధముల అకారాదులే నేడును నాకు తరుగని ప్రధాననిధివలె నుపయోగపడుచున్నవి. వానిని చూచునప్పుడు 'అహా! ఎంతో కాలము, ఎందరో మిత్రుల పరిశ్రమయు వీనియందు గోచరించుచున్నవి!' అని తల పోసి యక్కజపడుచుందును. వాని విలువ, గొప్పతనము ముద్రితగ్రంథములు చూచువారు సుంతయేని యెరుగరు. కడు రమణీయమగు నొక సౌధమును జూచి దాని రామణీయకమం దాసక్తులైనవారు ఆ సౌధ మెట్టి 'పునాదుల'పై లేచినదో అను విషయమును గమనింపరు. మిక్కిలి మెలకువతో వేసిన యా పునాదులు భూమిలో మరుగుపడిపోవును.

తొల్కాప్పియము పొరుళధికారవ్యాఖ్యయందు పెక్కు తావులలో పుఱనానూఱు పద్యము లుదాహరణలుగ వచ్చియున్నవి. నాచేత నున్న 'పుఱత్తిరట్టు' నందు పలుపద్యము లుండినవి. వానిని గొని నా యొద్దనున్న పుఱనానూఱు ప్రతులలో దొరకనట్టి పెక్కు అపూర్ణమైన భాగములు పూర్తి చేసికొంటిని.

పుఱనానూఱు 400 పద్యములలో నిమిడినది. నేను పరిశోధించి ముగింప అందు 267 వ, 268 వ పద్యము లెచ్చటను కానరాలేదు. పలు పద్దెములకు మొదళ్లు లేవు. కొన్నిటికి తుది భాగములు లేవు. పెక్కింటిలో నడుమనడుమ కొన్ని భాగములు కనిపింపలేదు.

నా యొద్ద నున్న పుఱనానూఱుప్రతులలో కొన్నిటియందు ప్రాచీనవ్యాఖ్యయొం డుండెను. ఆ వ్యాఖ్యాత ఫలానావా రని తెలియలేదు. ఆ వ్యాఖ్యయు మొదట 260 పద్యములకే యుండెను. 242 వ పద్యమునకు తరువాత నున్న వ్యాఖ్య ఎడనెడ చెదరిపోయి మారి యుండెను. ఆ వ్యాఖ్యాత పదార్థమును కమ్మగ బోధించి వలసిన యెడల వాక్యముల పూర్తిచేసి చూపి వ్యాకరణాదివిశేషములును 'తిణై' (దేశకాలసంబద్ధసంప్రదాయప్రయుక్తమహావిభాగము, 'తుఱై' (తదంతర్భాగములు) అనువానిని, అచ్చటచ్చట నున్న లోకోక్తులను, అలంకారములను, పద లాలిత్యము, అర్థసౌకుమార్యములను స్ఫుటము చేయుదురు. నడుమ నడుమ కొన్ని వాక్య

ములు ఆయా చోట్ల పొందిక లేనివిగ తోచినవి. వారు కొన్నియెడల కొన్ని విషయ ములు ఖండించియున్నారు. అందుచేత పుఱనానూఱుకు ప్రాచీనవ్యాఖ్యాన మొక్క టుండియుండవచ్చు నను నూహ పుట్టెను.

కీర్తించిన వారివియు, కీర్తింపబడినవారివియు నగు పేళ్ల సూచించు వాక్య ములందు చారిత్రికవృత్తాంతము లున్నవి. సంఘకాలచరిత్రపరిశోధనకు అవి మిక్కిలి యుపకరించునట్టివి. వా రిరువురి పేళ్లయందును పలుతీరుల ప్రతిభేదము లుండెను. దానిని ప్రత్యేకముగ సేకరించి యుంచుకొని, ఇతరగ్రంథములందు ఆ పేళ్లు వచ్చిన ప్రదేశముల వెదుకజొచ్చితిని. ఈ చరిత్రపరిశోధన పెద్ద సము ద్రముగ నుండెను. సముద్రమునకైనను ఒకవైపు తీర ముండును; దీనికో, ఏ వైపు నను తీరమే లేదు.

చరిత్రపరిశోధనయందు ఆరితేరినవారి సహాయముతో ఆ విషయములను తెలిసికొనవచ్చు నని తలచి రాజకీయశిలాశాసనపరిశోధకులుగ నుండిన రావుబహ దూర్ వి. వెంకయ్యరుకు కొందరు రాజుల పేళ్లు, కొన్ని యూర్ల పేర్లు మున్నగు వానిని వ్రాసి వానికి సంబంధించిన వృత్తాంతములు తెలియజేయు డని వేడుకొంటిని. 'అదియమాన్', 'కరికాల్ వళవన్' మున్నగువారినిగూర్చియు 'వెణ్ణి' 'మిళలై' మొదలగు గ్రామములనుగూర్చియు వారు కొన్ని సంగతులు వ్రాసి పంపిరి.

తపాలాఫీసు'ఇలాకా' సూపరింటెండెంటుగ నుండిన శ్రీ వి. కనకసభై పిళ్లై అనువారు తమిళగ్రంథములందును, తమిళదేశచరిత్రయందును పరిశ్రమిం చినవారు. తమిళులచరిత్ర వ్రాయవలె నను ఉద్దేశముతో వారు పరిశోధించి పెక్కు సమాచారములు సేకరించుచుండిరి. ఆ పరిశ్రమఫలముగనే వా రాంగ్లమున '1800 సంవత్సరములకు వెనుకటి తమిళులు' అను నొక అరుదగు గ్రంథము వ్రాసి ప్రచురించిరి.

వారు నాకు మిత్రులు. తమ యొద్దనున్న కొన్ని తాళపత్రప్రతు లిచ్చిరి; నా తమిళగ్రంథప్రకాశనమునుగూర్చి అడుగడుగున ప్రస్తావించుచు ప్రోత్స హించువారిలో వారు నొక్కరు.

పుఱనానూఱు 1893 వ సంవత్సరము జనవరి నెల వె. నా. జూబిలీ ముద్రాక్షరశాలయందు అచ్చుకాదొడగెను. అలవాటుచొప్పున నేను రామయ్యంగారి తోటలో విడిసి అచ్చుపని చూచుకొనుచుంటిని.

18 ఫారములు పూర్తియైనవి. కాలేజి తెరచు రోజు సమీపించుటచేత పై ప్రూపులు కుంబకోణమునకు పంపించునట్లు ఏర్పాటు చేసికొని నేను బయలుదేరి నేలమువూర్గముగ కొన్ని యూళ్లను చూచుకొని పోయితిని. పుఱనానూఱులో చెప్పబడిన యూర్లలో కొన్నిటిని చూచి వాని చరిత్ర విచారింపవలె నని నా యభిలాష. 'కరువూరు'కు పోయియున్నపుడు అక్కడ నున్న 'వకీలులలో' కొందరు "మా కక్షిదారులలో కొందరు, 'వళ్లల్' అను బిరుదనామము కలవారై యున్నారు". అను సమాచారమును తెలియజేసిరి. పత్తుప్పాట్టులోనను పుఱనానూఱునందును 'కడై యెళవళ్లల్‌గళ్' అనువారి పేరులును చరిత్రలును చెప్పబడియున్నవి. ఒకవేళ వారి వంశపరంపరకు చెందినవారుగ నుండవచ్చు నని తలచితిని.

పుఱనానూఱుముద్రణ నడచుచున్న కాలమున కాలేజి ప్రిన్సిపాలుగ నున్నవారు 'జె. హెచ్. స్టోన్' అనువారు. వారి కాలమున కాలేజిలో పలు విధముల విశేషములు జరుగును. ఒకసారి కాలేజి విద్యార్థులతో షేక్స్పియర్‌నాటకమగు 'నడివేసవి రేయిటి కల' (Midsummer Night's Dream) అనుదానిని తమిళమున ప్రదర్శింప నేర్పాటు చేసిరి. ఆ నాటకమును కాలేజిఅధ్యాపకులుగ నున్న నారాయణస్వామి అయ్య రనువారు తమిళమునకు పరివర్తనము గావించిరి. వారి యిష్టానుసారముగ దానిని పూర్తిగ చూచి చక్కజేసి యిచ్చుటయే గాక నడుమ నడుమ కొన్ని పాటలు కూడ వ్రాసి చేర్చితిని. ఆ నాటకము శ్లాఘ్యముగ నెరవేరినది. ఆ భాషాంతరీకరణమును పరిశోధించిన కాలమున 'ఆంగ్లమందు షేక్స్పియరు వ్రాసిన నాటకములను ఇంగ్లీషు తెలిసినవారి నొక్కరిని సహాయులనుగ గొని తమిళములోనికి పరివర్తనచేసి ప్రకటింపవచ్చును. కాళిదాస మహాకవి రచిత నాటకములను తమిళమున గద్య పద్య రూపముగ రచించి ప్రచురింపవచ్చును' అను నొక నూత్నభావము నాలో పొడమెను. మఠమున చదువుచున్న కాలమున శాకుంతలశ్లోకములు గొన్నిటికి భాషాంతరీకరణ మొనర్చితిని. 'ప్రాతకాలపు తమిళగ్రంథములు పులు గడిగి ప్రకాశపరచు కైంకర్యమందు గదా నిమగ్నులమై యుంటిమి' అను స్మృతి కలుగుటచే. ఆ పుంతలో పోయిన నా స్వాంతమును మరలించుకొంటిని.

కళాశాలాధ్యాపకులు కొందరు "మీరు క్రొత్తగ గద్యగ్రంథములు వ్రాయుడు. పాఠ్యములుగ పెట్టునట్లు చేయవచ్చును. అందుమూలమున మీకు మంచి ధనాదాయము కలుగును" అని అప్పుడప్పుడు చెప్పుదురు. కొన్ని సమయములందు ఆర్థికసంకటము లందుచుండుటచేత 'వారు చెప్పిన యాలోచనప్రకారమే చేయవచ్చునే' అను చాపలము తలయెత్తినను ప్రాచీనతమిళగ్రంథపరిశోధనయందే ఐక్యమైయున్న నా హృదయమందు ఆ చిన్ని చిన్ని కోర్కె లేవియు నెలవుకొనలేదు.

1893 వ సంవత్సరము సెప్టెంబరు నెల మా నాయనగారికిని, తల్లిగారికిని శరీరమం దస్వస్థత యేర్పడినది. ఇద్దరికిని వ్యాధి తీవ్రముగనే యుండెను. ఇద్దరి దశయు నమ్మిక నిచ్చునదిగ లేదు. మా తల్లిగారు మా నాయనగారికంటె ముందుగ కాలమైపోవచ్చు నని తోచినది. కాని విధి వే రొక విధముగ నుండినది. అక్టోబరు నెల 7 వ తేది డాక్టరు అలవాటుచొప్పున వచ్చి యిరువురిని చూచిరి. "అయ్యగారి స్థితి అపాయకరముగ నున్నది. వారిని పై మిద్దెనుండి క్రిందికి తీసికొనివచ్చుట మంచిది." అని చెప్పగా నట్లే చేసితిమి. అప్పుడును వారికి మంచి స్పృహ యుండినది. పంచాక్షరమంత్ర ధ్యానశ్లోకమును, శ్రీ మీనాక్షీ సుందరేశ్వరస్వామి ధ్యానశ్లోకమును వా రనుసంధించుచునే యుండిరి. నేను దాపుననుండి గమనించుచుంటిని. స్పృహ తప్పిపోవు తరుణమున వారు నన్ను మెల్లగ బిలిచి "శివభక్తితత్పరుడవై యుండుము" అని చెప్పిరి. అటు పిమ్మట మా నాయనగారి మాటలు వినెడి భాగ్యము నాకు లేకపోయినది. వా రొసర్చిన ఆ చరమోపదేశమును నేను మరవలేదు; నా కలవియైనంతవట్టు విడువక పట్టుకొని వచ్చుచున్నాను. పరమశివుని భాగవత గోష్ఠిలో చేరుటకు నాకు నుంతైన యోగ్యత లేదు. మా యయ్యగా రచంచలమైన శివభక్తిగలవారు. శివభక్తియే తమకు జీవనముగ వారు చేసికొనిరి. వారియొద్ద పొందిన కులధన మా శివభక్తి. అందుచే నాకు తెలియకయే అం దొక పాలు నాకు సంక్రమించెను. అయినను నే నెక్కడ? మా నాయనగా రెక్కడ?

వారు వీడి యెడబాసిరి. వారి మరణావస్థ మా యమ్మగారు తెలిసికొనలేదు. రోగమువాత బడి మైకముదశలోనే యుండిరి. మా నాయనగారు కాలధర్మ మొందిరను విషాదవార్త చెవిని పడగనే ఆ మైక మున్నచోటు తెలియక తొలగిపోయెను. తత్క్షణమే లేచి కూర్చొని విలపింపదొడగిరి. నేనును అంతవర కెరుగని తీరున వెత

గూరితిని; ఏడ్చితిని, తాళలేక కేకలు వెట్టితిని. నా మిత్రులు ఓదార్పుమాటలు చెప్పిరి. జాబులు వ్రాసిరి. పలువురు తమ దుఃఖమును చరమపద్యరూపమున తెలియజేసిరి.

మా తండ్రిగారి స్వరూపస్వభావములను భావించి భావించి వగచి వందురి కొన్ని పద్యములు రచించితిని. వారిని తలచునపుడెల్ల మొదట వారి శివభక్తియు, శివపూజయు ఎదుట వచ్చి నిలచినవి. వారి సంగీతకౌశలమును వెన్నంటి స్మృతికి వచ్చినది. నే నభివృద్ధికి రావలె ననుటలో వారి కున్న వ్యగ్రతయు, నా విద్యావ్యాసంగమునుగురించి యూరూర ద్రిమ్మరి అటనట విడిసి నా తమిళవిద్యాభివృద్ధికై వారు చేసిన పెద్ద పెద్ద ప్రయత్నములును భావించి భావించి కరగిపోతిని. ఇట్టి భావపరంపరలో కొన్ని యీ విషాదకవితలయందు అమరినవి. ఆ పద్యములలో కొన్ని యిటు లున్నవి :—

ఒడలు నిండ తిరునీఱు (విబూది) అలదుకొని రుద్రాక్షమాలికలు ధరించి, చేతులార విరు లెత్తుకొని, మనసు కరగగ, కాటుకవంటి ఇంద్రనీలమణిబోలు కంఠముగల మహాదేవుని ప్రత్యహ మర్చించెడు నా తండ్రీ ! తండ్రీ ! నా తండ్రీ ! ఎచట కేగినావు !

నేటివరకును నీవు నాపై దయ చూపకుంటివేని నేను చెందమిళము నేర్చుటెట ? నేర్చి చదువరులు పలువురియెడ దాని ననుభవించుటెట ? మీనాక్షీసుందర విబుధవరులయెడ చదువుటెట ? చదివి చీకు చింతలు లేక అట్టి దశయందే నిలుచుటెట ?

మా నాయనగారికి చేయవలసిన ఔర్ధ్వదైహికక్రియల నన్నిటిని చేసి ముగించితిని. అంతవరకు నా తలపై కెక్కకయున్న కుటుంబభారము నేను మోయవలసిన యావశ్యకత యేర్పడినది. తండ్రిగారు గతించుటవలన గలిగిన దుఃఖము, ఈ క్రొత్త 'బాధ్యత'యు నా భాషాసేవకు కొంత శైథిల్య మాపాదించినవి.

నాయనగారు చనిపోయిన సంగతి తెలిసి విచారము తెలియజేసిన మిత్రులు పలువురు. పూండి రంగనాథమొదలియారు వారిలో నొక్కరు. రెండు నెలలకు తరువాత ఆ మహోదారుల మరణమునుగూర్చి కుందవలసిన దౌర్భాగ్యము నాకు గలిగెను. 10-12-1893 న వారు కాలమైరి. ఆ వార్త విని తమిళదేశవాసులు

ప్రమాన్పడిరి. తమిళకవుల పండితుల డెందములు కళవళపడినవి. పలువిధములగు సంస్థలకు వారు ఆధ్యక్ష్యము వహించి సేవ చేయుచుండిరి. వారి యాదరువు పొంది పెక్కు సత్ప్రయత్నము లేపారుచుండినవి. వారితో సంబంధముగలవా రెల్లరు నెత్తిన పిడుగుపడినవారి వడువున చేష్ట లుడిగిరి. ఆంగ్లమున తద్దయు పెద్ద పాండిత్య మబ్బి తమిళమందును పాండిత్యము గడించుకొనిన భాగ్యశాలులను ఆ కాలమందు చూచు టరుదు.

రంగనాథమొదలియారు నా కొనర్చిన యుపకారములు పెక్కు. కేవలము ధనముచేతనే యెవ్వరును గొప్పతనము పొందలేరు. తగు మనుష్యులతోడి సాంగత్యము పెద్ద పెద్ద పను లెన్నో సాధించుట కానుకూల్య మొడగూర్చును. డబ్బుతో కాని పనిని ఈ పరిచయముతో నెరవేర్చుకొనవచ్చును. రంగనాథమొదలియారు గారి సౌహార్దముచే ఇట్టి ఫలము నాకు దక్కినది. వారి పరిచయము నా కుండుట చేత నేను పలుగురి మతింపునకు పాత్రమైతిని. వారు నాకు పరిచయము కలిగించిన పెద్దలయెడనుండి నేను పలువిధముల శ్రేయము పొందితిని.

రంగనాథమొదలియారు మరణించినపుడు వెంటనే నేను విషాదగీతము లేవియు వ్రాయలేదు. 'నే రచించు కవితలు విని సంతసించువా రున్నారా?' అని తలచి యూరక యుంటిని. మిత్రులు కొందరు నిర్బంధింపగ కొన్ని పద్దెములు చెప్పితిని.

మా నాయనగారిని పోగొట్టుకొన్న దుఃఖము, కుటుంబభారము వహింప వలయునే యను విచారము, రంగనాథమొదలియారు గతించిన చింతయు నొక్కటిగ జేరి నా మనసునిబ్బర మదవద చేసినవి. అందుచే దేహము బలహీనమైనది. పిత్త జ్వరము నన్ను పట్టుకొనినది. కొన్ని వారములు ఆ వ్యాధిచే కటకటబడి తగిన మందులు పుచ్చుకొని ఒక విధముగ ఆరోగ్యము పొందితిని.

1894 వ సంవత్సరము సెప్టెంబరు నెల పుఱనానూఱుముద్రణ పూర్తి యాయెను. నేను ముద్రించిన 'ఎట్టుత్తొగై' (ఎనిమిదిటి సంపుట) గ్రంథములందు ఇదియే మొదటిది. అందుచేత పీఠికలో ఎనిమిది సంపుటములగూర్చియు చరిత్ర వ్రాసితిని. 'అగమ్' (కామము) 'పుఱమ్' (ధర్మార్థములు) అను రెండు తీరుల పదార్థముల స్వరూపము విశదపరచితిని.

పుఱనానూఱువలన తెలియవచ్చిన పలుతీరుల వృత్తాంతములను కూర్చి ఒక 'ఆశిరియర్‌పా'లో సమర్చితిని. వ్యాఖ్యకు సంబంధించిన సంగతులను సంగ్రహముగ తెలియజేసి నాకు దొరకిన తాటాకుల తీరును ఎల్లరు తెలిసికొనుటకై ఈ క్రింది తీరున స్పష్టపరచితిని:

"వ్యాఖ్య లేని మూలములు అక్షరములు పదములును హెచ్చియు తగ్గియు చెడియు మారియు పలువిధముల వేపపడి యుండుటయే గాక, వీనిలో కొన్ని పద్యములకు తరువాత తిణై వ్రాయకయు కొన్నిటి వెనుక తుఱై గురించి వ్రాయుకయు, కొన్నిటికి పిదప రెండును లేకయు, కొన్నిటి తర్వాత కీర్తించినవారి పేరు చెదరిపోయియు, కొన్నిటికి పిమ్మట కీర్తింపబడినవారి పేరు లేకయు, కొన్నిటికి పిదప ఇద్దరి పేర్లను కానరాకయు, కొన్ని పద్యములు రెండుచోట్ల వ్రాయబడి రెండు సంఖ్యలను పొందియు, వేర్వేరు తావుల నుండదగిన రెండు పద్యములు ఒక్కెడనే వ్రాయబడి ఒకే సంఖ్య పొందియు, కొన్ని తొలి భాగము లోపించియు, కొన్ని నడిభాగము లోపించియు, కొన్ని మలిభాగము లోపించియు, కొన్ని మొత్తమే లుప్తమయియు, ఒక పద్యపు చరణములలో ఒక్కటియు పెక్కులును, వేరు పద్యము లందలి చరణములు కలసియు, ఒకే చరణము ఒక పద్యములో కొన్నిచోట్ల వచ్చియు సరియైన యర్థము తెలియలేని తీరున ఇంకను పలువిధముల మార్పు లొందియు నుండినవి ఆ వ్రాతప్రతులు. దీనిని పరిశోధించవచ్చుచుండగ ఈ గ్రంథమునుండి ఇతర గ్రంథముల ప్రాచీనవ్యాఖ్యానములందు ఎడనెడ వ్యాఖ్యాతలచేత పూర్తిగను, కొలదికొలదిగను ఉద్ధరించి చూపబడియున్న ఉదాహరణములు, కొన్నికొన్ని పద్యములందున్న తప్పులను తొలగించి దిద్దుకొని సమీచీనార్థము తెలిసికొనుటకును కొన్ని కొన్ని పద్యములలో లుప్తభాగములను పూరించుకొనుటకును, రూపు చెడి పడియున్న కొన్ని పద్యములను చక్కజేసి నిర్ధరించుకొనుటకును మిక్కిలి సహాయపడునవై యుండినవి.

పుఱనానూఱులో నున్న విషయముల గొని తమిళదేశచరిత్ర తెలిసికొనవచ్చుననియు, పలువిధములగు విమర్శలకు అది ఉపకరించు ననియు తెలిసికొనినప్పుడు ఆ మార్గమున దిగి విమర్శింత మని మొదలిడితిని. 'ఎట్టుత్తొగై' గ్రంథములలో ముద్రింపబడని గ్రంథములును, పెక్కు ఇతరప్రాచీనగ్రంథములును నాయొద్ద నుండినవి. వాని నొక్కటొక్కటిగ వెలువరచు కైంకర్యమును మెయికొనిన నేను

నడుమ వేరొకబాట నడుగిడ గడగలేదు. 'ఆధారగ్రంథముల నొక్కవిధముగ ప్రచు రించినచో విమర్శకులు వానిని పరిశోధించి చారిత్రికాంశములు, తక్కిన సంగతులను ప్రచురింపవచ్చును' అని తలపోసితిని. ఈ భావమును పీఠికలో "ఈ తమిళదేశపు ప్రాచీనచరిత్రల నరసికొనుటయందును, తెలియజేయుటయందుననే హెచ్చు భాగము తమకాలము గడపి పరిశ్రమించుచుండు ఉపకారులగు వివేకవంతులు ఈ గ్రంథము విమర్శింప దొరకొనినచో ఇందుమూలమున పలువురి చరిత్రలు మొద లగునవి తెలిసికొన నలవియగును" అని సూచించితిని.

అట్టి పరిశోధనలు సలిపెడివారికి సాధనములుగ నుపయోగపడు నను భావముచే పుఱనానూఱులో జూచిన దేశములు, తదంతర్భాగములు, ఊళ్లు, కొండలు మున్నగువాని పేళ్లను అకారాదిక్రమముగ కూర్చి యమర్చితిని. కీర్తించినవారి కీర్తింపబడినవారి చరిత్రలను సంక్షేపముగ తెలియజేసి వారి పేళ్లలో కాన్పించు భేద ములను ప్రత్యేకముగ ముద్రించితిని. విషయసూచిక 'తుఱై' ప్రకాశము 'తుఱై' టిప్పణి విశేషపదముల యకారాది, ప్రయోగప్రకాశము అనువానిని ప్రచురణా కంగముగ చేర్చితిని. విశేషపదాకారాదియందు పదము, దాని యర్థము, ప్రయోగ మును అమర్చితిని.

పుస్తకము సమాప్తి చెందగ చూచినపుడు "నేనా ఇంతపని చేసినవాడను!" అని నాకే భ్రమ కలుగున ట్లుండెను. భగవంతుని దివ్యకృపకు మంగళాశాసనము చేసితిని. పుస్తక మమర్చిన తీరు చూచి మిత్రులందరు కొనియాడుచు లేఖలు వ్రాసిరి.

పుఱనానూఱు నెరవేరిన వెంటనే పైబడి విమర్శనకార్యము సాగించుటకు ఇంకను వసతులు గల యి ల్లున్నచో ననుకూలముగ నుండు నని తలచితిని. మా నాయనగారే దేని ఒక యింటిని విలిచికొనవలయు నని ప్రయత్న మొనర్చిరి. వారి కాలమున నది యీడేరలేదు. వలసినంత విత్తము లేకపోవుటయే దానికి కార ణము. ఇంటి సౌకర్య మావశ్యకమై యుండుటచేత ఇకపై తామసము చేయరా దని తలచి చేతనున్న పైకమునకు తోడుగ మరి కొంత యప్పుచేసి రు. 3000 లకు సహాజీ నాయకుని వీథిలో నొక యిల్లు విలిచికొంటిని.

ఆ యిల్లు మూడు కట్లు మిద్దెయు గలది. మా కుటుంబమునకు కరము సౌకర్యముగ నమరియుండెను. కావేరీతీరమందు కాలేజియెదుట నుండుటచే కాలేజిలో మొదటి గంట కొట్టిన పిదపగూడ బయలుదేరి పోయి చేరుట కనువై యుండెను. మంచి రోజు సొంత యింటిలో కాపుర ముండ జొచ్చి, తమిళపరిశోధన సాగింపగడగితిని.

పుఱనానూఱు పొంది లేఖలు వ్రాసినవారిలో పాలవనత్తం జమిందారగు 'పాండిత్తురై దేవరు'ను ఒక్కరు. అందు వారు 'లోకోపకారములగు అరుదైన గ్రంథములు ముద్రింప మెయికొనిన తమ సత్ప్రయత్నమునకు నాచే నయినంత సాయము చేయ నెల్లప్పుడు నుత్కంఠితుడనై యుండుటచే దానికి తగిన తరుణము తెలియజేయవలెనని యడుగుకొను పాండిత్తురై' (14-11-1894) అని తెలియజేసి యుండిరి. ఈ లేఖ చేరిన కొన్ని వారములకు పిదప వారు తిరువావడుదుఱఆధీన కర్తల దర్శనము చేసికొనుటకై తిరువిడైమరుదూరుకు వచ్చిరి. ఆధీనకర్తలగు అంబలవాణదేశికులు వారి రాక నా కెరిగించి నన్ను రమ్మని వ్రాసిరి. అట్లే పోయి పాండిత్తురై గారిని కలసికొని సంభాషించుచుంటిని. వారు పుఱనానూఱుప్రచుర ణను కొనియాడి "ఇకపై ఏ గ్రంథము ముద్రింప బోవుచున్నారు?" అని యడిగిరి.

"పెక్కు గ్రంథము లున్నవి. మణిమేఖల ముద్రింపవచ్చు నని తలచితిని. కాని యింకను అందున్న కొన్ని సంగతులు తెలియరాలేదు. 'పుఱత్తిరట్టు' అను 'తొగై' (సంపుట) గ్రంథ మొక్కటి యున్నది. అందు ఇప్పు డలవాటులో లేని పెక్కు గ్రంథముల పద్యము లున్నవి. పుఱనానూఱు ముద్రించినపుడు ధర్మార్థ విభాగలక్షణములను సుస్పష్టముగ తెలిసికొన దలచితిని. ఆ గ్రంథమందు కనిన 'విభాగము'లకు వివరణము వెదకునప్పుడు 'పుఱప్పొరుళ్‌వెణ్బామాలై' మిక్కిలి యుపయోగపడినది. దానిని చక్కగ విమర్శించితిని. దానికి ప్రాచీనవ్యాఖ్య యొకటి నాయెడ నున్నది. మూలముమాత్రము శరవణప్పెరుమాళ్ అయ్యరుగారు మునుపు ప్రకాశపరచిరి. ఇప్పుడు వ్యాఖ్యతోడ ప్రచురింపవలెనని తలచుచున్నాను" అని నే నంటిని.

వారు రామనాథపురము చేరినవెంటనే నాకు పద్యరూపమగు నొక లేఖయు ఐదువందల రూపాయలకు ఒక చెక్కును 17-12-1894 నాడు పంపిరి. వారు

చేసిన యుపకారమును కొనియాడి యుత్తరము వ్రాసితిని. అంబలవాణదేశికులకు పై సంగతి తెలియజేసితిని. వారు వెనువెంట మున్నూరు రూపాయ లొసగిరి. ఈ యిరువురను ప్రసాదించిన రొక్కమును గొని యింటికై నేను చేసియున్న ఋణము తీర్చుకొంటిని.

పాండిత్తురై దేవరు వ్రాసిన లేఖ పుఱప్పొరుళ్ వెణ్బామాలై ముద్రింప దొడగుటకు ప్రోత్సాహకరముగ నుండినది. ఆ గ్రంథము తర్వాతిదిగ ముద్రింప ఎత్తియుంచుకొంటిని.

పుఱప్పొరుళ్ వెణ్బామాలై అనునది ధర్మార్థ (పురుషార్థ) ముల లక్షణములు చెప్పెడు సూత్రములును, ఆ లక్షణములకు లక్ష్యములైన వెణ్బా పద్యములును కలిగి యున్నది. వెణ్బామాలై అనియు దానికొక పేరున్నది. చేర(కేరళ)కులమందు పుట్టిన 'ఐయనారిదనార్' అనువా రా గ్రంథకర్తలు.

పుఱప్పొరుళ్ వెణ్బామాలై ప్రచురణకు కావలసిన అంశము లన్నియు సిద్ధము చేసికొని చెన్నపట్టణమునకు పోయి దానిని అచ్చు కిచ్చితిని.

# 57. మణిమేఖల

తిరువావడుదుఱ అధీనాధ్యక్షులగు అంబలవాణదేశికులు తమిళవ్యాసంగము మిక్కుటముగ గలవారు. సంస్కృతమున అభిమానము, సంగీతమున పరిచయమును వారియెడ నుండినవి. విద్వాంసులకు సమ్మానము చేయునెడ వారిని 'భోజు' డనియు, 'కర్ణు'డనియు శ్లాఘింతురు. .

అధీనము 'తరపు'న మంచి 'పుస్తకభాండాగారము' ఒక్కటి యేర్పాటు చేయవలె నను నభిలాష వారికి కలిగెను. అచ్చట మునుపే ఒక గ్రంథాలయ మున్నను దాని నింకను విస్తృతము చేసి తమిళము, సంస్కృతము, అంగ్లము అను భాషలలో నున్న పలు విధములగు అచ్చుపుస్తకములను కొని సేకరింపవలెనని తలచిరి. పుస్తకశాలకు తగిన స్థలముగ నొక పెద్ద భవనము కట్టించిరి. ఇప్పుడు 'సరస్వతి మహాలు' అని వాడుకలో నున్న దదియే.

పుస్తకశాలకు వలసిన గ్రంథములు కొనుటకై దేశికులు నన్ను కొందరు కార్యస్థులతోడ చెన్నపట్టణమునకు పంపిరి. మరొక పనికూడ వారు నా కప్పగించిరి. రామనాథపురముప్రభువు భాస్కరసేతుపతి కొన్నిసారులు తిరువావడుదుఱకు రానుండియు, అది యేలకో నిలిచిపోయియుండినది. వారి నొక్కమారైనను మఠము నకు పిలుచుకొని రావలె నను నాస మఠమునకు జెందినవారి కుండెను. నేను పుస్తక ములు విలుచుటకై చెన్నపట్టణమునకు బోవ నుద్దేశించిన సమయమున సేతుపతి చెన్నపట్టణమున నుండిరి. "ఈ సమయమున వారిని చూచి యెట్లైన నిక్కడకు వచ్చునట్లు వేడుకొనవలెను, ఈ భారము మీది" అని అంబలవాణదేశికులు ఆ పని నా కప్పగించిరి.

నేను చెన్నపట్టణమునకు వచ్చి మొదటి పనిగ భాస్కరసేతుపతిప్రభువుల దర్శించితిని. తమిళపుతియ్యము నిండిన వారు మిక్కిలి మక్కువతో మాట్లాడు చుండిరి. నేను వచ్చిన కార్యము నివేదింపగనే వా రొప్పుకొనిరి. వెంటనే యా సంతోషవార్తను అంబలవాణదేశికులకు లేఖమూలమున తెలియజేసితిని. పిదప పుస్తకశాలకు 5000 రూపాయలు విలువగల పొత్తములు విలిచితిని. పలుభాషలం దున్న పుస్తకములు కొంటిని. పొత్తముల నన్నిటిని 'రైల్వేగూడ్సు' మూలముగ తిరువావడుదుఱకు పంపితిని.

అప్పుడు మణిఅయ్యరు హైకోర్టు జడ్జిగ నియమింపబడియుండిరి. నేను చెన్నపట్టణమునకు వచ్చినప్పుడెల్ల వారిని దరిసించి ప్రోత్సాహము కొనివచ్చుట అలవాటు. ఆమారు వారి నభినందించి సంతోషము వెలిబుచ్చుటకై పోతిని. "పుఱనానూఱు మిక్కిలి బాగుగ నున్నది. ఇప్పు డేమి నడచుచున్నది ?" అని వారు నన్ను చూచిన వెంటనే ప్రశ్నించిరి. పుఱనానూఱు ప్రతి పొంది వారు నాకు పైకము పంపియుండిరి..

"జడ్జిఉద్యోగ మయియున్న దను సంతోషవృత్తాంతము వింటిని. ప్రజల యదృష్టమే యిది. ఇంతకు మునుపు తమతో మెలగినట్లు మెలగుటకు మనసు జంకు చున్నది" అంటిని.

"ఏ మట్లనుచున్నారు ? నా కిప్పుడు కొమ్ములు మొలచియున్నవా యేమి ? మీ రెప్పటివలెనే రావచ్చును ; ముచ్చటింపవచ్చును ; భుజింపవచ్చును ; నా వలన

కావలసిన పను లున్న దాపరికము లేక మనసు విప్పి చెప్పవచ్చును" అని వారు చెప్పినపుడు, పరోపకారమే తమ జీవితపరమలక్ష్యముగ భావించియుండు వారి స్వరూప మేనాటి కైనను మార దని యాధ్వనియందే స్పష్టముగ గోచరించెను.

వారియెడ సెలవు పుచ్చుకొని, ఇతరమిత్రుల జూచి మాటలాడి యుండి తిరువావడుదురై వచ్చి చేరితిని. భాస్కరసేతుపతి 1895 వ సంవత్సరము జనవరి నెల 31వ 'తారీఖున' అచ్చటికి వచ్చునట్లు చెప్పియుండిరి. ఆ సమయమున తిరువావడు దురైలో ముఖ్యమగు గురుపూజ నడచు సందర్భమై యుండెను. అంతకు మును పే గ్రంథాలయము తెరచుటకై నిశ్చయించి మంచిరోజు చూడగ జనవరి 30 వ తేది మంచి దినముగ నుండినది. గ్రంథాలయమునకు ఏ పేరు పెట్టవలె నని అంబలవాణ దేశికు లడిగిరి. 'విద్యానిధి' అని పేరు పెట్టవచ్చు నని చెప్పితిని. జనవరి నెల 30 వ తేదినాడు విద్యానిధి తెరవబడెను.

మరుసటి దినము భాస్కరసేతుపతి మఠమునకు వచ్చిరి. వారి కొనర్చిన మర్యాదలు, ఉపచారములు లెక్కింపలేనంత విరివిగ, వైభవోపేతముగ జరిగినవి. 'భాస్కరవిలాసము' అను పేరుతో ఒక పెద్ద కొబ్బరియాకుల పందిరి వేయ బడెను. అది కొబ్బరియాకుల పందిరియైనను మహాప్రాసాదమువలె చక్కగ నలంకరింపబడెను. నేను వెంటనుండి సేతుపతితోడను, ఆధీనాధ్యక్షులతోడను సల్లాపము సేయుచు సంతసించుచుంటిని. సేతుపతిగారు వీడ్కోలంది బయలు దేరిరి.

చెన్నపట్టణమున ముద్రించుచు వచ్చిన పుఱప్పొరుళ్‌వెణ్బామాలై మొత్తము అచ్చయి నెరవేరెను. ఆ గ్రంథముద్రణమున నా కధికమైన ప్రయాస మేమియు కలుగలేదు. కాని, అప్పుడు పరిశోధించుచుండిన మణిమేఖలయే పలుతీరుల చిక్కులు తెచ్చిపెట్టుచుండెను. మొదట ఆ గ్రంథ మే మతమునకు సంబంధించిన దనియే నాకు తెలియలేదు. కుంభకోణము కాలేజిలో ఉపాధ్యాయులై యుండిన మళూరు రంగా చార్యులే అది బౌద్ధసమయమునకు చెందిన దని నాకు తెలియజేసిరి.

అంతవరకు 'ఇట్టి' దని తెలియక అల్లాడుచున్న నాకు అదిమొదలు వేరొక విధమగు భయము కలిగెను. "మనము శైవమతమున విద్య గరచినవారి

మగుటచే శైవసమయగ్రంథములు నేర్చు సందర్భము లభించెను. అటకు వచ్చెడి వైష్ణవవిద్వాంసుల పరిచయము వలన వైష్ణవమతమునుగూర్చియు తెలిసికొన నలవి యాయెను. చింతామణి ముద్రింప ప్రయత్నించు కాలమందు జైనమత సంబద్ధములగు సమాచారములు తెలియక బాధపడితిమి. కాలము కలసి వచ్చినందున జైనమిత్రులు దొరకిరి. క్రొత్తగ ఆ మతమునకు సంబంధించిన సంగతులు తెలిసికొంటిమి. ఇప్పుడు బౌద్ధమతసంబంధియగు పుస్తకము కదా తీసికొంటిమి. ఇది మనకు తెలియని మత మాయెనే! జైనమతమునుగూర్చి తెలిసికొన జైనమిత్రు లుండిరి. బౌద్ధమతమే హిందూదేశమున లేదే? బౌద్ధులను మన మెక్కడ వెదకగలము? బౌద్ధమతమునుగూర్చి మన మెట్లు తెలిసికొనగలము?" అని నా చింతలు సుడులు తిరిగినవి.

అప్పుడు రంగాచార్యులు అభయ మిచ్చిరి. "మీరు భయపడవలదు. బౌద్ధ సమయమునకు చెందిన పుస్తకములు నూర్లకొలదిగ ఇంగ్లీషులో నున్నవి. తెల్లదొరలు విమర్శించి వ్రాసియున్నారు. నేను పెక్కింటిని చదివియున్నాను. చదువనివానిని చదివి చూచి మీకు చెప్పగలను" అనిరి.

నేను వారిని మణిమేఖలపరిశోధనకు పెద్ద తోడుగ పట్టుకొంటిని.

అని మొదలు బౌద్ధమతవిమర్శనయందు జొచ్చితిని. తమిళగ్రంథములలో ఎచ్చటెచ్చట బౌద్ధమతవిషయములు వచ్చునో యని వెదకి కూర్చుకొన నారంభించితిని. 'నీలకేశి' వ్యాఖ్యానమున బౌద్ధమతఖండనము వచ్చు చోటుల బుద్ధుని గూర్చిన చరిత్రలు, బౌద్ధసమయలక్ష్యములును కనిపించినవి. 'బుద్ధమిత్రులు' అను తమిళ విద్వాంసులు రచించిన 'వీరశోళియమ్' అను వ్యాకరణగ్రంథవ్యాఖ్యానమున బుద్ధభగవానునిగూర్చిన పలు పద్యములు ఉదాహరణముగ వచ్చియున్నవి. వానిని గూడ ప్రత్యేకముగ ఎత్తి వ్రాసి చదువదొడగితిని. శివజ్ఞాన సిద్ధియార్ పరపక్షము జ్ఞానప్రకాశుల వ్యాఖ్యలో బౌద్ధమతఖండన మున్నచోట పలు బౌద్ధ మతసంప్రదాయములు వచ్చును. వానినిగూడ గమనించి యుంచుకొంటిని. ఇవిగాక తమిళమున గాని, సంస్కృతమున గాని బౌద్ధమతగ్రంథ మేదియు నాకు దొరకలేదు. పాళీభాషయందే చాలవరకు బౌద్ధమతగ్రంథము లున్న వని రంగాచార్యులు తెలియబరచిరి.

ఆంగ్లమున 'మానియర్ విల్లియమ్స్', 'మాక్స్‌ముల్లర్', 'ఓల్డన్ బర్గ్', 'రిస్‌డేవిస్' మున్నగువారు వ్రాసిన పుస్తకములు రంగాచార్యులుగారు చదివి చూపిరి.

కొన్ని పుస్తకములు పిలిచి తెప్పించి యిచ్చితిని. బుద్ధభగవానుని చరిత్ర వినగ వినగ వారి స్వరూపస్వభావములందు నా చిత్తము పాదుకొనిపోయినది.

వెంట వెంట మణిమేఖలయు చదువుచుంటిని. తెల్లము గాక దిగ్భ్రమ కలిగించిన పలు విషయములు కొంచెము కొంచెము తెలియవచ్చినవి. మధురమై, సులభమైన మాటలలో బౌద్ధమతరహస్యములు అందు కనిపించినవి. వానిని చదివి నే నానందించితిని. రంగాచార్య లాలించి యాలించి యుబ్బిపోయిరి. "ఆహా! ఎంత మనోజ్ఞముగ నున్నది! భాషాంతరీకరణపు మాటలు ఎంత పొందికగ నమరియున్నవి!" అని చెప్పి చెప్పి కొండాడిరి. బుద్ధుని స్తుతించు చోట్లు పలుమారు చదివి వినిపింపు డని చెప్పి విని మోద మందిరి. "ఇంగ్లీషులో నెన్నేని చదివియున్నాను. కాని యింత మధురమైన భాగము లెచ్చటను చూడలేదు" అని నుడివిరి.

బౌద్ధమతస్థులు చెప్పెడు నాలుగు సత్యములగు దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖనివారణము, దుఃఖనివారణమార్గము అను నాలుగింటిని—

> 'పుట్టుకగలారు పొందెడిది ఏపారెడు దుఃఖము, పుట్టుక లేనివారు పొందెడిది అత్యధికనిర్వృతి. అత్యాసక్తిచే వచ్చెడిది మొదటిది. నిస్సంగులు పొందెడిది తరువాతిది— అని తెలియవలెను'.

అని మణిమేఖల సంగ్రహముగ చెప్పును. బుద్ధభగవానుని స్తుతించు భాగములు పెక్కు. దయామూలధర్మములను విడువక చేపట్టి బ్రతుకుచుండిన వారి సామర్థ్యమును చక్కగ బోధించు చరణములు నేను చదువునప్పుడెల్ల నా యొడలు గగుర్పొడుచును.

తనకై బ్రదుకక పరులకే సొంతమైనవాడు, మారవిజేత, చెడు త్రోవలగు (కామ, క్రోధాది) క్రూరశత్రువులను తొలగద్రోచినవాడు, పెరవారికి పున్నె

మేర్పడ గడగెడు పెద్ద. స్వర్గ మాసింపని తొల్లిటివాడు - అను నిట్టి వాక్యములచే (బుద్ధదేవుని) మణిమేఖల గ్రంథకర్తలు ప్రశంసించియున్నారు.

ఎడనెడ ఇతరతమిళగ్రంథములందు చూచిన తమిళపద్యములను సందర్భము వచ్చినపుడు నే నుద్ధరించి చెప్పుదును. బుద్ధభగవానుడు నిర్వాణము చెందిన కాలమున వారిదండ నున్నవారు విలపించునట్లుగ తెలిసికొనదగిన పద్య మొక్కటి వీరశోళియవ్యాఖ్యయం దుదాహరణముగ చూపబడి యుండెను.

'భ్రమలు పోకార్చుకొని మహాభోగ మందిన ఉత్తమతాపసుని చూడనివార మగుటచే మే మేమి చేయగలము? కరుణాభరితములగు శ్రీసూక్తులవలన ధర్మపథము వినలేవార మగుటచే మే మేమి చేయగలము? తత్వ మారసిన విశిష్టతపఃప్రభావులను కాంచనివార మగుటచే మే మేమి చేయగలము?'

అను నర్థముగల ఆ పద్యమును చదివినప్పుడు చదువ తరము గాక నాల్క తడబడెను. రంగాచార్యులును అందు నిండారుచున్న కరుణరసములో తమ్ము తామే మరచి కరగిపోయిరి.

ఇట్లు బుద్ధచరిత్రయందు ఆసక్తుడనై కరగియు, బౌద్ధమతతత్త్వము లారసి యానందించియు పొందిన యుత్సాహములో మణిమేఖల పరిశోధన సాగెను.

మణిమేఖల లంకకు పోయినట్లు ఆ కావ్యము తెలియజేయుచున్నది. లంకలోని కొన్ని ప్రదేశముల పేళ్లు అందు వచ్చును. కొలంబోలో నున్న పొ. కుమారస్వామి మొదలియారుకు ఆ ప్రదేశములు విచారించి తెలియజేయవలె నని వ్రాయుటయే గాక బౌద్ధమతవిషయములను తెలిసికొన సహాయపడువా రెవ్వరేని యున్నచో తెలియ జేయు డని వేడుకొంటిని. అక్కడ నున్న విద్యోదయకళాశాలప్రిన్సిపాలుగను, బౌద్ధమతాచార్యులుగను 'సుమంగళర్' అను బౌద్ధమతానుయాయులగు నొక పెద్ద లున్నారని మొదలియారు తెలియజేసిరి. బౌద్ధమతగ్రంథములనుగూర్చియు, ఆ మతసంప్రదాయములనుగూర్చియు పలు వృత్తాంతములను ఆ పెద్దల నడిగి వ్రాయించి నాకు పంపినారు.

"లంకాద్వీపమందలి 'శమనొళి' యనెడు కొండ"

అను (అర్థముగల) పద్యభాగమున వచ్చు శమనొళి అనునది శమంత మనియు 'ఆడమ్స్ పీక్' అనియు వ్యవహారములో నున్న దని వారివలన తెలిసెను. బుద్ధ భగవానుని పాదప్రతిమలు అక్కడ నున్న వనియు తెలిసికొంటిని.

రంగాచార్యులు ఒకటియునర సంవత్సరములకాలము కుంబకోణమున నుండిరి. నేను విడువక వారియెడకు జని వారు చెప్పెడు బౌద్ధమతవిషయములను గుర్తించు కొనుచుంటిని. అటు పిమ్మట వారిని చెన్నపట్టణమునకు 'బదిలీ' చేసిరి. వారు చెన్న పట్టణమునకు బయలుదేరునపుడు "ఈ పుస్తకమును మీరు త్వరలో ముద్రించి ప్రచురింపుడు; ఇది మాణిక్యమువలె నరుదైనది" అనిరి.

"తాము చెన్నపట్టణమునకు పోవుటచే మణిమేఖలసంబంధము మిమ్ము విడువదు. అక్కడికిని వచ్చి తమకు శ్రమ కలిగించుట నేను విడువబోను" అని నే నంటిని.

"అటులైనచో నేను మిగుల భాగ్యవంతుడనే" అని వారు తమ సంతోషము తెలియబరచుకొనిరి. వారి యుల్లమున మణిమేఖలయందు గాంచిన అరుదగు చరిత్రలును, మధుమయములగు భాగములును స్థిరవాసము కల్పించు కొన్నవి.

పాశ్చాత్యదేశమున నాకు మిత్రులైనవారిలో రెవరెండు 'జి. యు. పోప్' ఒక్కరు. వారు చాలకాలము తమిళనాడులో నున్నవారు. తమిళమున బాలురకు ఉపయోగపడు రీతిని సులభవ్యాకరణ మొక్కటి వ్రాసియున్నారు. 'పోప్పయ్యరు ఇలక్కణము' అనుపేరుతో తమిళదేశమున నది వాడుకలో నున్నది. 'తిరువాచక' మును, 'తిరుక్కుఱళ'ను, 'నాలడియారు'ను ఆంగ్లమునకు భాషాపరివర్తన చేసి వారు ప్రకటించియున్నారు. 'ఆక్స్ఫోర్డ్' యూనివర్సిటీలో ప్రధానద్రావిడాధ్యాపకులుగ వా రుండిరి.

'పుఱనానూఱు' వెలువడిన పిదప అందొక ప్రతి వారికి పంపితిని. కొన్ని నెలల వరకు పోప్‌వద్దనుండి లేఖ రాలేదు. పుస్తకము వారియెడకు పోయి చేరినదో లేదో అను

సందేహముతో నే నుంటిని. మే నెల వారినుండి నా కొక కమ్మ లభించెను. ఆంగ్లమున వ్రాయబడియుండెను.

"ఇండియన్ ఇన్‌స్టిట్యూట్"

26-4-1895.

"..........మీ పుఱనానూఱునుగురించి నేను ముందే వ్రాసియుండవలెను. మీరు శ్లాఘ్యమగు రీతిని ప్రచురించిన జీవకచింతామణి నాయెడ నున్నది. దాని నడుగడుగున నుపయోగించుట కలదు. నా నాలడియారు ప్రచురణలో ఉపోద్ఘాతమున 41 వ పుటలో దానినిగురించి సూచించియుంటిని. తా మింకను ఏదైన ముద్రించు చున్నారా? తాము ముద్రించు గ్రంథములనుగూర్చి 'రాయల్ ఏషియాటిక్ సొసై టీ'కి ఒక వ్యాసము వ్రాసి పంప నుద్దేశించియున్నాను. పుఱనానూఱును ఇంకను తెల్లము చేయ నలవి గాదా? 'నాకు తమిళము తెలియును' అని నే ననుకొనుచున్నను నా కందులో పలు భాగములు విశదము కాలేదు. అందుచే ఇంకను తేటగను, సులభ ముగను ఉండు శైలిలో వ్యాఖ్య వలయును. పండితులు గాని నాబోటివారియెడ దయ జూపుడు.

"చింతామణి చాలవరకు సులభముగనే యున్నది. విశిష్టమును, ఉత్కృష్ట మును అగు తమిళమునకై తొల్‌కాప్పియమునకు విమర్శనపటిమగల ప్రచురణ యొకటి కావలెను......పురాణ కథలు వివరించి మూడు సంఘముల చరిత్రను తగిన యాధారములను గొని వ్రాయవలెను. పుఱనానూఱును ఎట్లు చదివి యుప యోగపరపవచ్చు ననునదైనను తెలియబరచుడు."

వారు మొదటిసారిగ వ్రాసిన యీ జాబు చూచి వారికి తమిళముపై గల యభి మానమును ఒక విధముగ కొలిచి తెలిసికొన వీలయినది. తమిళగ్రంథముల మంచి పద్ధతిలో, మంచి యాకారములో ముద్రింపవలె నను తలపుగల నాకు వారు వ్రాసినవన్నియు మిగుల యుక్తముగ తోచినవి.

పదపటితడప పుఆప్పొరుళ్‌వెణ్బామాలై ప్రతి యొక్కటి వారికి పంపితిని. అది యందిన తోడ్తోడ ఈ క్రింది జాబు వ్రాసి పంపిరి.

"బేలియల్ కాలేజ్
ఆక్స్‌ఫోర్డు: 21-10-1895

"......... తా మంపిన పుఆప్పొరుళ్‌వెణ్బామాలకై కృతజ్ఞత తెలుపుకొను చున్నాను. దాని ప్రతి యొకటి మా తమిళపుస్తకశాలలో నున్నది. దానిని చదివి ముగింప ప్రయత్నించితిని.

"నేనును ఎన్నియో పథకములు వేయుదును. కాని మీరు పిన్నవారు. నేను ముదుసలిని!

"ఒక్క క్షణమైనను జీవింపగల మని నిజముగ (జీవితము క్షణభంగురము కాన) తెలియలేనివారు కోట్లకొలది - కాదు, అంతకును అధికముగనే - కోర్కెలు కొనుచుందురు.

"నేను మిక్కిలి యనారోగ్యముగ నుంటిని; అయినను ఇంకను ఏదైన చేయ వచ్చు నని నమ్మియున్నాను ... ... మీ ప్రచురణ శుద్ధముగను, పూర్ణముగను ఉన్నది. పురాతనతమిళపుస్తకము లన్నియు అధునాతనద్రావిడులకు స్పష్టపడు నట్లు చేయవలెను. దానికి ఉపాయ మాలోచింపుడు ... ... "

ఈ జాబులో తిరుక్కుఱళ్‌పద్యమును తమిళమున వ్రాసియుండిరి. వారి యక్షరములలో వణకును, మాటలలో దేహానారోగ్యము తెలియజేయు సూచనలును ఉండినవి. "ఒక్క క్షణమైనను జీవింపగల మని (నిజముగ) తెలియనివారు" అను అరుదగు ఆ తిరుక్కుఱళ్ పద్యమును వారు వ్రాయుటలో వారి మానసికస్థితి యెటు లుండు నని యాలోచించి చూచితిని. ఎన్నియో పనులు చేయవలె నను ఆశతో పరి శ్రమించుచున్నప్పుడు ఇంతలోనే జీవితము తుద ముట్టుచో నేమి చేయుటయా? — అను భయము వారియెదదలో నుండుటను ఆ కుఱళ్ తెలియజేయుచున్నది. వా రింకను పెక్కు వత్సరములు జీవించియుండవలె నని మంగళాశంసనము చేసితిని.

మంచి కాలము! వారి శరీరాస్వాస్థ్యము తొలగిపోయినది. వార్ధకపు బలహాని యున్నను తమిళాభిమానము వారి దేహమున నొక క్రొత్త మురిప మొదవించి యుండనోపును! 1896 వ సంవత్సరారంభమున వారు క్రమ్మర కమ్మ వ్రాసిరి.

3-1-1896

"నేను దీర్ఘకాలముగ లేఖ వ్రాయక తామసము చేసితిని. మన్నింపవలెను. తమ అద్భుతప్రచురణలైన పుఱనానూఱు, పుఱప్పొరుళ్ వెణ్బామాలై అను రెంటిని సులభముగ తెలిసి యానందించుచున్నాను. ఆ రెండును ఒక్కదాని నొక్కటి చక్కగ విశదపరచుచున్నవి.

"పారి, వాని కూతుండ్రు, కపిలర్, కోప్పెరుంజోళన్, పిశిరాందైయార్, పొత్తియార్ మున్నగువారినిగూర్చి ఒక వ్యాసము వ్రాయుచున్నాను. ఇంకను కర్ణపరంపరాగతవృత్తాంతములు కావలెను. 115 మొదలు 120 వరకును ఉన్న పద్యము లంతరంగము నాకట్టుకొన్నవి ... తమకు నాలడియార్ ప్రతియొక్కటి పంపుట కేర్పాటు చేసితిని. ఆక్స్‌ఫోర్డునుండి వచ్చినదా? ... నూతనసంవత్సరాభినందనలు తెల్పుకొందును".

వారు పంపుట కేర్పాటు చేసిన నాలడియారు నాకు లభించెను. వా రెంతటి యుత్సాహముతోడను, ఔత్సుక్యముతోడను తమిళగ్రంథములు లోతుకు దిగి చదువుదు రనునది యా లేఖనుండి తెలిసికొంటిని. ఏ విషయమైనను తెల్లముగ తెలిసికొనవలెను, తెలిసినదానిని ఇతరులకు తెలియునట్లు వెలువరచవలెను - అను వారి యుద్దేశము నాకు మిక్కిలి సంతోషము కలిగించెను.

పారిస్ నగరమున నున్న జూలియన్ విన్సోన్ అనువారి తమిళాభిమానమును, ఆక్స్‌ఫోర్డులోనున్న పోప్ దొరగారి తమిళాభిమానమును పోల్చి చూచితిని. ఒక్కొక్కటియు ఒక్కొక్క తీరున శ్రేష్ఠమై యుండెను. ఇరువురియెడను పాయని ప్రయత్నమును, మెయికొనిన కార్యమునందు గాఢమైన అభిమానమును ఉండినవి. మనదేశస్థులయెడ ఈ గుణములు లేకపోవుటచేత సోమరితనమున కగ్గమై తమ జీవితకాలమును వ్యర్థముగ పుచ్చుచున్నారే యని తలఁచి వగచితిని.

పోపుదొర పైపై పెక్కు లేఖలు వ్రాసిరి. పుఱనానూఱునుండియు, పుఱప్పొరుళ్ వెణ్బామాలనుండియు అరుదగు పెక్కు పద్యములు తెలిసి యుద్ధరించి

ఆంగ్లమున ననువదించి ప్రచురించిరి. ఒక్కొక్క వత్సరారంభమునను అట్టి యను వాద మొక్కటి శుభాకాంక్షలతో నాకు పంపుచుండిరి.

ఇట్టి నిజమైన సతతోద్యోగుల మైత్రిచే తమిళ సేవలో నా మన మురిది పొందినది. మణిమేఖల పరిశోధన సాగుచునేయుండెను.

మణిమేఖలను త్వరలో అచ్చు కిచ్చుటకై తగిన యేర్పాట్లు చేయుచుంటిని. మిథిలైప్పట్టిలో దొరకిన ప్రతియే నాకు మిక్కిలి సహాయకారిగ నుండెను.

మణిమేఖల మూలముమాత్రము 1891 వ సంవత్సరము 'తిరుమయిలై (మైలాపూరు) విద్వాన్ షణ్ముగం పిళ్లైచే ముద్రింపబడెను. అర్థనిర్ణయము చేసికొనకయే పలుతావుల తాళపత్రములో నున్న పాఠములు వారమర్చియుండిరి. ఆ ప్రతిని గొని గ్రంథపు తాత్పర్యమును చక్కగ తెలిసికొనుట మిక్కిలి ప్రయాసగనే యుండును.

ఆ ప్రచురణ వెలువడి ఏడేండ్లగుటచేత నా పరిశోధన ఫలితముగా పలు తీరుల టిప్పణులతో మణిమేఖల ప్రచురించుటలో తప్పేదియు లేదని భావించితిని. పలువురు మిత్రులు మణిమేఖల కంతటికిని వ్యాఖ్య వ్రాసి ప్రచురింపవలెనని చెప్పిరి. ప్రాచీనతమిళగ్రంథములు తేటతెల్లము చేయవలెనని పోపుదొర వ్రాసిన లేఖలును నాకు ప్రోత్సాహకము లైనవి. ప్రతిపదవివరణము లేకపోయినను (సంగ్రహ) టిప్పణియైనను వ్రాసి పూర్తిచేయవలెనని యెంచి చాలవరకు వ్రాసి నెరవేర్చితిని. (మణిమేఖల) 'శాస్త్రజ్ఞుల సంప్రదాయము తెలియు గాథ' అను భాగములో ఇతరమతసంప్రదాయములు వచ్చును. 'తపస్సంప్రదాయములు పూని ధర్మ మడిగిన గాథ' అను భాగమున బౌద్ధమతస్థులు చెప్పెడు ప్రమాణలక్షణము మున్నగునవి యున్నవి. ఈ రెంటికిని (సంగ్రహ)టిప్పణి వ్రాయుట సులభ మని నాకు తోపలేదు. సంస్కృతతర్కశాస్త్రమునందు పారంగతులై పరగిన కుటిచ్చి మహామహోపాధ్యాయ రంగాచార్యులుగారియెడకు పోయి యడిగితిని. మొదటి దానిలో నున్న సంగతులు స్పష్టపరచిరి. కాని తర్వాతిదానిలో నున్న విషయములు విశదపరచుట వారి కలవికాలేదు. ఇట్టి సంప్రదాయముగల ప్రాతగ్రంథములు ఈ కాలమున నలవాటులో లేవు. ఇది ప్రాచీనతర్కము" అని చెప్పిరి.

తక్కినవాని కన్నిటికిని ఒక తీరుగ సంగ్రహవ్యాఖ్య వ్రాసి ప్రమాణలక్షణము వచ్చు భాగమును పలుమారులు విద్వాంసుల సన్నిధిని పరిశోధించి శక్యమయినంతదనుక శుద్ధపాఠము అని తోచినవానిని తెలిసి వ్రాసికొంటిని. పాఠభేదములను అటనట క్రింది టిప్పణిలో గుర్తించితిని.

అన్నియు సిద్ధమయిన తరువాత మణిమేఖల తీసికొని చెన్నపట్టణమునకు పోయి వె. నా. జూబిలీ ముద్రాక్షరశాలయందు 5-6-1896 నాడు ముద్రింప నిచ్చితిని.

క్రింది టిప్పణిలో నేను వ్రాసిన సంక్షిప్తవ్యాఖ్యతోబాటు పుస్తకము ముద్రణము కాజొచ్చినది. మొదటి ఫారమును జూచి యుత్తరువిచ్చినప్పుడు నాయుల్లమున నున్న ఆనందాతిరేకమును ఆ పరమేశ్వరుడే యెరుగును. 'ఈ గ్రంథము గూడ మనము ప్రచురింపగలమా!' అని యల్లాడుచుండినవాడ నగుటచేత, దాని కొక రూప మేర్పడుట జూచి నా యుల్లము, ఒడలును ఉప్పొంగిపోయినవి.

# 58. నేను పొందిన బిరుదు

మణిమేఖలముద్రణము నడచుచుండగ ఆ గ్రంథమున కంగముగ మణిమేఖలచరిత్రను చేర్పదలచి, అట్లే కథాసంగ్రహము వ్రాసి ముగించితిని. బౌద్ధమత సంబంధులగు వృత్తాంతములు ఈ దేశమున అలవాటులో లేకపోవుటచేత వానిని మణిమేఖలసంగ్రహవ్యాఖ్యలో నచ్చటచ్చట స్పష్టపరచియున్నాను. అయినను అనుస్యూతముగ ఆ మతమునకు సంబంధించిన సంప్రదాయోద్దేశములను ప్రత్యేకముగ వ్రాసి గ్రంథమున కంగముగా చేర్చినచో చదువుకొనువారికి మిక్కిలి యుపయోగకరమై యుండు నని నా యాశయము. మళూరు రంగాచార్యులతో మణిమేఖలను గురించి మాట్లాడి విషయములను తెలిసికొనిన సమయములందెల్ల వారు చెప్పుచుండినవానిని వేరుగ 'గుర్తు' వ్రాసియుంచుకొంటిని. బౌద్ధమతసంబంధముగ ఆంగ్లమం దున్న గ్రంథభాగములు కొన్నిటిని కొందరు మిత్రుల సహాయము గొని తమిళమునకు 'తర్జుమా' చేసియు నుంచుకొంటిని.

బుద్ధుడు, బౌద్ధధర్మము, బౌద్ధసంఘము అను మూటిని బౌద్ధులు మున్మ-ణులు (త్రిశరణములు) అని వ్యవహరించుట యాచారము. నాయొద్ద నున్న 'గురుతు'ల సహాయముతో ఆ మున్మణులగూర్చిన చరిత్రను వ్రాయ దొడగితిని. రంగాచార్యులు కుంభకోణమున నున్న కాలమున నేను వ్రాసినదానిని అప్పుడప్పుడే వారియొద్ద చదివి చూపి దిద్దుకొంటిని. 'బదిలీ'అయి వారు చెన్నపట్టణమునకు చనిన పిదప నేను చెన్నపట్టణమునకు వచ్చినప్పుడెల్ల అంతవరకు వ్రాసినదానిని చదివి వినిపింతును. ఎడనెడ నేను తమిళపద్యములను అమర్చియుంచుటను జూచి వారు మిక్కిలి యానందించి కొనియాడుదురు.

1897 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 'మహామఖము' (పుష్కరము) నడచినది. అప్పుడు కుంభకోణమున చేరిన గుంపు లెక్కలో నిముడదు. తిరువా-వడుదుఱై అధీనకర్తలగు అంబలవాణదేశికులు తమ పరివారముతోడ కుంభకోణము పేటవీథిలో నున్న మఠమున విజయము చేసియుండిరి. పలు ప్రదేశములనుండియు రాజులు, పండితులును వచ్చి చేరిరి.

అప్పుడు ప్రతిదినము అంబలవాణదేశికుల సన్నిధియందు విద్వాంసుల యుపన్యాసములు, సల్లాపములును నడచినవి. ఒకనాడు మిగుల ఉత్తమశ్రేణికి చెందిన పండితులను పూజించి ఉత్తమసంభావన చేయునట్లు ఏర్పాటు చేయబడియుండెను. అంబలవాణదేశికులు ఆరు ఆసనములు వేయించి విఖ్యాతులగు సంస్కృతవిద్వాంసుల నైయిదుగురిని అయిదు ఆసనములపై ఆసీనుల జేసిరి. వా రుపవిష్టులైన పిదప నన్ను జూచి "ఆ యాసనముపై ఆసీనులు కావలెను" అని ఆరవ యాసనమును చూపిరి. నా గుండె 'గుభేలు' మనెను. జీవితకాలమంతయు శాస్త్రాభ్యాసమునందే మునిగిపోయి అక్షరములు లెక్కించి చదివి తాము నేర్చిన విద్యకే ప్రకాశము కలిగించిన ఆ పెద్ద లెక్కడ? నే నెక్కడ? నే నాలోచించుచు నిలిచియుండుట తెలిసిన దేశికులు "ఏమి యోచించుచున్నారు? అట్లే యుండవలయును" అనిరి. "వీరితో సమానుడనై యుండ నాకు యోగ్యత లేదే!" అంటిని. "యోగ్యత యున్న దని యీ లోక మెరుగును. వీరి వంటి సుధీమణులు ఈ దేశమున వెదకిచూచిన ఒకవేళ దొరకినను దొరకవచ్చును. తమవంటివా రొక్కరైన కనిపించు టరుదు" అని కూర్మిపేర్మితో నొక్కి చెప్పి నప్పుడు ఆ మహామేధావుల బంతిలో వినయములో కూరుచుంటిని. జోడు సాలువ

లును, సమ్మానమును పొందితిని. మణిమేఖలయందు నేను పడిన శ్రమయే ఆ పెరిమెకు కారణ మని నేను భావించి భగవంతుని దివ్యానుగ్రహమును కొనియాడితిని.

మణిమేఖలమూలము, విశిష్టపదవ్యాఖ్య మున్నగునవియు 1898 వ సంవత్సరము జూలై నెలలో అచ్చయి నెరవేరినవి. మున్నుడియు, బుద్ధచరిత్రయు, బౌద్ధ ధర్మము, బౌద్ధసంఘము, మణిమేఖలకథాసంగ్రహము అనునవి మొదట చేర్పబడినవి.

పుస్తకములు వెలువడి విహారము చేయునపుడు నేను పొందిన యభినందనలు పెక్కు. 59 తమిళగ్రంథములనుండియు 29 సంస్కృతగ్రంథములనుండియు ఉదాహరణములు నా సంక్షిప్తవ్యాఖ్యలో చూపించియుంటిని. ఇవి మాత్రమేగాక తమిళసంస్కృతగ్రంథముల వ్యాఖ్యాతల మాటలనుండి పలు వృత్తాంతములు అచ్చటచ్చట పొందుపొరచితిని. ఆ గ్రంథములనుగూర్చియు, వ్యాఖ్యాతలనుగురించియు నే నరసికొనిన సంగతు లన్నియు 'విశిష్టపదవ్యాఖ్యలో నడగినవి' అను భాగములో నున్నవి. పుఱత్తిరట్టువలన తెలిసిన కుండలకేశిపద్యములను కొన్నిటిని ఆ గ్రంథమునుగూర్చి చెప్పెడు సందర్భమున చేర్చియుంటిని. ఆ భాగము చూచిన మిత్రులు "ఇంగ్లీషులో 'ఎన్సైక్లోపీడియా' అను నొక విధమగు నిఘంటు వున్నది. దానివలె నున్న దిది. ఈ విధముగ మీ రొక్కొక్క గ్రంథమునకును వ్రాసిన, కడపట నన్నిటిని చేర్చినచో ఒక పుస్తకముగ ముద్రింపవచ్చును" అనిరి. అట్టి యర్థవివరణాత్మకమగు నిఘంటువు (శబ్దార్థసర్వస్వము) తమిళమున కావలె నను నాశ సహజముగనే నా కుండెను. ఆ యభిమానులు చెప్పిన పిదప ఆ యుత్కంఠ పెరిగెను.

మొట్టమొదటిదిగా నేను వ్యాఖ్య వ్రాసిన గ్రంథము మణిమేఖల. నా వ్యాఖ్య సుగమశైలిలో నమరియుండుటనుగూర్చి పలువురు కొనియాడిరి. పలు విషయములు విశదపరచుచున్న దని పలువురు స్తుతించిరి.

ఇవ్విధమున ప్రతిదినము మణిమేఖల యొదవించిన యానందమును తెలియజేయు లేఖలును, వార్తలును నాయెడకు వచ్చుచునేయుండెను. 1899 వ సంవత్సరము మార్చి నెల 7 వ తేది వెలువడిన 'వివేకదివాకరన్' (వివేకదివాకరుడు)

అను పత్రికలో 'ఆనందన్' అను మారుపేరుతో ఒక మిత్రులు 'బౌద్ధసమయ ప్రబంధ ప్రవర్తనాచార్యులు' అను శీర్షిక యిడి ఒక వ్యాసము వ్రాసిరి. శీర్షిక చూచిన వెంటనే 'బౌద్ధసమయాచార్య లొక్కరినిగూర్చినది కాబోలు' అని ఆసతో చదువ దొడగితిని. కాని విషయము న న్నుద్దేశించినదిగనే యుండెను.

"కుంబకోణము కాలేజిలో తమిళపండితులగు ఉత్తమదానపురము స్వామి నాథయ్యరుగారు తమ కాలమంతయు సంఘకాలగ్రంథవిమర్శయందే పుచ్చుచు, అరుదైనవియు, అతిపురాతనములును, బౌద్ధమతప్రధానగ్రంథములును అగు చింతామణి, శిలప్పదికారము, మణిమేఖల మొదలగువానిని ముద్రించి తమిళదేశమం దెల్లెడల వ్యాపింపజేసి వా రుపార్జించిన యశస్సు అన్ని తరగతులవారికిని కొని యాడ తగినదే. అయ్యరుగారు కాలమంతయు బౌద్ధసమయగ్రంథముల వ్రాతప్రతు లను దేశదేశములు, నాడునాడులు, ఊరూరులు, గ్రామగ్రామములు, వీథివీథులు, ఇల్లిల్లుగ పోయి సంపాదించుటయందును, కనిపించిన గ్రంథములను పరిశోధించుట యందును, వానికి విశిష్టపదవ్యాఖ్య వ్రాయుటయందును, అందున్న బౌద్ధసమయా చార్యుల చరిత్రలు తెలిసికొనుటయందును, వారి సంప్రదాయ మరయుటయందును, వారు పూనిన ప్రయత్నము పుచ్చిన కాలము పడిన ప్రయాసయు ఇంతిం తనరానిది. బౌద్ధమతవిమర్శనయందే ఎల్లప్పుడును వారి మనస్సు సంచరించుచుండును. వీరు కూర్చుండునపుడును, నడచునపుడును, సంధ్యావందన మాచరించు వేళయందును, శివపూజ సలుపు సమయములందును, నిద్రించు కాలముననను బౌద్ధమతచింతనమే గాని వేరొండు లేదు. ఇట్లు కాకుండెనేని యిట్టి యరుదగు గ్రంథముల ప్రకాశమొనర్ప వీలుగాదు. ఈ సత్యము వా రచ్చొత్తించిన పుస్తకముల పీఠికలో కాననగును. బుద్ధుడు బ్రాహ్మణసంప్రదాయమునకు విరోధము చేయలే దని పలువురు 'ఐరోపీయుల' అభి ప్రాయములను వివరించి వ్రాసియున్నారు. బుద్ధు డీశ్వరు డున్నా డనిగాని, ఆత్మ లున్న వనిగాని స్పష్టముగ చెప్పకుండుటచేతనే తిరుజ్ఞానసంబంధమూర్తిస్వామిగారు మున్నగువారు ఖండించి చెప్పిరేగాని వేరు కారణము లే దని చూపియున్నారు.

"బౌద్ధగ్రంథము చివరి పుటలో కొన్ని 'తేవారము' లను అచ్చిడిరి. జన్మాంతరోపార్జితపుణ్యవశముననే అయ్యరుగారికి ఈ విమర్శనాపటిమ సిద్ధించి యుండనోపు! ఇ దెట్లు? — ఒడలు విడిచి యొనుప వెడలు కాలమున ఆ ప్రాణి

దేనిని భావించునో అది యదియై పుట్టును’ అనునది సర్వసద్గ్రంథసమ్మత సిద్ధాంతము. ఈ సత్యమును జీవుల నందరిని కాపాడవలె ననెడి ఉద్దేశముతో (భూమిచంద్రరాజు) గోగర్భమున ఉదయించెను అని చెప్పిన మణిమేఖల (అమృత సురభి) ‘పాత్రచరిత్ర చెప్పిన గాథ’ వలనను, 358 వ తిరుక్కుఱళకు పరిమేలళగర్ వ్రాసిన విశేషవ్యాఖ్యవలనను తెలియనగును. బౌద్ధసమయగ్రంథపరిశోధన యొనర్చు వారు వీరికంటె వే రెవ్వరేని నేటి కాలమున అగుపడు టరిది. కావున నానా దేశములం దున్న బౌద్ధమతానుయాయు లందరును వీరియెడ కృతజ్ఞత చూపి తమ మతమున కుచితమయిన యొక గొప్ప బిరుదనామము వీరి కొసగి అభిమానము చూపుదు రని విశ్వసించుచున్నాము. అట్లు చేయరేని వారు కృతఘ్నులే యగుదురు. తమ ప్రయత్నఫలితముగ మరు జన్మమున అయ్యరుగారు బుద్ధగురువులై వెలు గొందినను వెలుగొందవచ్చును. అట్లే బౌద్ధసమయబోధినాథుడు అయ్యరుగారి నను గ్రహింతు రనుట నిక్కువము !”.

నాయెడ నింత గౌరవాదరములు గల యీ మిత్రుల వ్యాసము చూచి నేను నవ్వుకొంటిని. వారి వ్యాజస్తుతి నాకు విచారము కలుగజేయలేదు. చింతామణి మున్నగువానినిగూడ బౌద్ధగ్రంథముల బంతిలో చేర్చునట్టి ఆ ఆనందులకు తమిళ గ్రంథములం దెంతటి యభిమాన మున్నదో వేరుగ నేను చెప్పవలెనా ?

నా మిత్రులు దీనిని జూచి నవ్విరి. ‘బౌద్ధసమయప్రబంధప్రవర్తనా-చార్యులు’ అని అప్రతీక్షితముగ నాకు దక్కిన యీ బిరుదు నేను పెట్టెలో పెట్టి కాపాడుచు వచ్చితిని. వెలువరచు మంచి తరుణ మిప్పుడే ప్రాప్తమాయెను. మునుపే చింతామణి ముద్రించిన కాలమున ఒక నారీశిరోమణి నన్ను ‘భవ్యజీవుడు’ అని ప్రేమతో పిలిచినందున నేను జైనుడను కాలేదు. ఇప్పుడు వీరు సాహసముగ బౌద్ధమతగురు వనుటవలన నేను బౌద్ధుడను కాలేదు.

అటుపైన ‘ఐంగుఱునూఱు’, ‘పదిట్రుప్పత్తు’, ‘అగనానూఱు’, ‘పెరుంగదై’ అనువానిమీదకు నా మనసు పోనిచ్చితిని.

---

# అభిధానసూచి

# శోధని

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|---|---|---|---|
| పాదకీయోత్త | పాదకోత్త | 4 | 22 | శ్రేయసు | శ్రేయము | 251 | 16 |
| నా చరిత | నా చరిత్ర | 10 | 1 | హ్వాయువగు | హ్వాయుడవగు | 256 | 5 |
| ఇటి | ఇట్టి | 34 | 11 | తానే | తామే | 275 | 22 |
| అరంభించి | ఆరంభించి | 37 | 16 | యొడ | యెడ | 281 | 25 |
| ఆర్చా | అర్చా | 38 | 3 | వివేదిం | నివేదిం | 284 | 13 |
| మఘలై | మలై | 40 | 5 | జ్ఞానము | జ్ఞానము | 293 | 15 |
| కున్నమందు కాపురము | కార్కుడిలో.... | 63 | 1 | క్లప్త | క్లుప్త | 304 | 22 |
| | | | | నము | మున | 306 | 24 |
| దువుచు | చదువుచు | 69 | 28 | అ తట్ట | ఆ తట్ట | 309 | 17 |
| రెవ | రెవరు | 79 | 21 | చున్నపుదు | చున్నపుడు | 310 | 10 |
| నా చంత్ర | నా చరిత్ర | 80 | 1 | చక్కక | చక్కగ | 314 | 7 |
| పేలము | వేలము | 101 | 4 | చింతామణి | చూళామణి | 332 | 24 |
| తలుపు | తలపు | 105 | 25 | హమగు | వాహమగు | 336 | 17 |
| అలుపు | అలపు | 106 | 24 | దొడిగి | దొడగి | 355 | 14 |
| బావులల | బావులం | .. | 27 | వంటిది | వంటివి | 358 | 10 |
| తలుపు | తలపు | 107 | 10 | కాని | కాగ | 361 | 11 |
| కర్తృల | కర్తృ | ,, | 13 | శిలుప్పది | శిలప్పది | 365 | 24 |
| ఓ నక్కా... అని...నక్కను సంబో | ఓ నారాయణ పక్షీ ..అని... నారాయణ పక్షిని సంబో... | 138 | 8 | తిరువ్వేలి నుండినె | తిరునెల్వేలి నుండి | 368 | 25 |
| | | | | బెద్రాక్ష | రుద్రాక్ష | 369 | 6 |
| | | | | లక్కవి | క్కవి | 376 | 2 |
| చుండినది | చుండినవి | 150 | 16 | ఆర్వాచీన | అర్వాచీన | 382 | 22 |
| మూపురు | మూవురు | 162 | 22 | క్షణమే | తక్షణమే | 384 | 13 |
| నుపనిష్టు | నుపవిష్టు | 167 | 15 | ప్రశ్నించిరు | ప్రశ్నించిరి. | 395 | 9 |
| కలుత | కలత | 182 | 23 | తీరిబడి | తీరుబడి | .. | 22 |
| తమ్మ్మపై | తమ్మిపై | 185 | 24 | నవిగ | నదిగ | 403 | 10 |
| సంల్పించు | సంకల్పించు | 189 | 19 | అధ్యక్ష్యము | ఆధ్యక్ష్యము | 405 | 3 |
| ఆధీన | ఆధీన | 224 | 2 | అభింనందించి | అభినందించి | 410 | 20 |
| అట్లుగుట | అట్లగుట | 242 | 13 | నముదైన | నమునదైన | 416 | 20 |

సూచన : పంక్తులను లెక్కించునపుడు 'ఫోలియో హెడింగ్' కూడ కలుపుకొనవలెను.